

# మాండలిక వృత్తి పదకోశం

## (కళలు)


సంపాదకులు

డా॥ బూదరాజు రాధాకృష్ణ





పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వ విద్యాలయం

హైదరాబాదు - 500 004

# మాండలిక వృత్తి పదకోశం

## సంపుటం : 15 (కళలు)



సంపాదకులు

**డా॥ బూదరాజు రాధాకృష్ణ**

చిత్రకారులు

**రాంభట్ల కృష్ణమూర్తి**

**సి.హెచ్. సత్యప్రకాశం**





ప్రచురణ

**పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం**

హైదరాబాదు - 500 004

**1997**

**MANDALIKA VRITHI PADAKOSHAM**
Volume 15,
A Dialect Dictionary of Handicrafts
Editor : Dr BUDARAJU RADHAKRISHNA

---



ప్రచురణ సంఖ్య : 194

ప్రథమ ముద్రణ : 1997

ప్రతులు : 1000

వెల : రూ. 110/-

ప్రతులకు :
డైరక్టర్, ప్రచురణల విభాగం
పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం
లలిత కళాక్షేత్రం, పబ్లిక్ గార్డెన్స్, నాంపల్లి,
హైదరాబాదు - 500 004.

ముద్రణ :
చరితా గ్రాఫిక్స్, చిక్కడపల్లి, హైదరాబాద్.

N : 81-86073-30-2

ఆచార్య నాయని కృష్ణకుమారి
ఉపాధ్యక్షులు
పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం

లలిత కళాక్షేత్రం, పబ్లిక్ గార్డెన్స్,
హైదరాబాదు - 500 004

# ముందుమాట

బోధన, పరిశోధన, ప్రచురణలు అనే మూడు విషయాలు లక్ష్యంగా, తెలుగు సాహిత్యం, భాష, చరిత్ర, కళలు, సంస్కృతి వంటి రంగాలలో కృషి సల్పడానికి 1985వ సంవత్సరంలో పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం ఆవిర్భవించింది. పూర్వం ఉన్న ఆంధ్రప్రదేశ్ సాహిత్య, సంగీత, నాటక, నృత్య, లలితకళా అకాడమీలు ఇందులో విలీనం కావడం వలన పైన పేర్కొన్న లక్ష్యాలతో పాటు మరెన్నో బాధ్యతలు దీనికి సంక్రమించాయి. అన్ని విశ్వవిద్యాలయాల వలే కేవలం పఠన పాఠనాలతో సరిపెట్టుకునే అల్ప పరిధి కాదు దీనిది. మన సంస్కృతిని ప్రపంచం నలుమూలలకు వ్యాప్తి చేయడానికి ఉద్దేశింపబడిన "సాంస్కృతిక విశ్వవిద్యాలయ"మిది. ప్రచార సాధనకు పరికరమే ప్రచురణ.

ప్రచురణ కార్యక్రమానికి అనుగుణంగా, ఈ విశ్వవిద్యాలయంలో యిప్పటికెన్నో ప్రముఖ గ్రంథాలను ప్రచురించింది. వ్యాఖ్యా ప్రవంతి శీర్షికను సుప్రసిద్ధ, పండితులచే ప్రాచీన కావ్య ప్రబంధాలకు వ్యాఖ్యానాలు వ్రాయించి ప్రచురించింది. ఇప్పటివరకు ఈ ప్రణాళికలో కుమార సంభవం, కాశీ ఖండం, శివరాత్రి మహాత్మ్యం గ్రంథాలను వ్యాఖ్యా సహితంగా ముద్రించింది.

తెలుగులో పేరు పొందిన ప్రాచీన ఆధునిక గ్రంథాలను ఇంగ్లీషు, హిందీ భాషలలోనికి అనువాదం చేయించి ప్రచురించింది.

తెలుగులో విజ్ఞాన సర్వస్వ సంపుటాలను తయారు చేయించే కార్యక్రమంలో విశ్వసాహితిని "హిస్టరీ అండ్ కల్చర్ ఆఫ్ ది ఆంధ్రాస్' పేరుతో ఆంగ్లంలో ఒక సంపుటాన్ని ప్రచురించింది.

భాషాభివృద్ధి కృషిలో భాగంగా 'తెలుగు భాషా చరిత్ర', 'ద్రావిడ భాషలు' అనే గ్రంథాలను పునర్ముద్రించింది. ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం సాంఘిక సంక్షేమ శాఖవారి సహకారంతో డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ రచనలు - ప్రసంగాలను పది సంపుటాలుగా ప్రచురించింది.

లోగడ ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి చేపట్టిన గ్రంథ ప్రచురణ కార్యక్రమాల్లో భాగమైన మాండలిక వృత్తి పదకోశ నిర్మాణం ఎంతో ప్రత్యేకతను సంతరించుకొంది. అప్పట్లో అకాడమీ ఆధ్వర్యంలో నాలుగు వృత్తి పదకోశాలు ప్రచురితమయ్యాయి. విశ్వవిద్యాలయం వృత్తి పదకోశ పరంపరలో మత్స్య పరిశ్రమ, మేదర పరిశ్రమ, లోహకారవృత్తి, వడ్రంగం కోశాలను ప్రచురించింది. 'కల్లు బెల్లం సారా' అన్న పేరుతో గీతకారుల వృత్తి, 'జంతువులు, పక్షులు వేట' అనే పేరుతో ఆటవికుల వృత్తికి సంబంధించిన పదకోశాలు తయారీలో ఉన్నాయి. త్వరలో ఆ ప్రచురణలు చేతి కందుతాయి.

తెలుగు సీమలో అనేక కళలు విలసిల్లుతున్నాయి. కళలను వృత్తిగా చేసుకుని జీవిస్తున్న వారు చాలాసంది ఉన్నారు. కళలు, కళావస్తువుల తయారీలో సుసంపన్నమైన పదజాలం ఈనాటికీ వాడుకలో ఉంది. కాని ఈ పదాలు చాలావరకు నిఘంటువుల కెక్కలేదు. అమూల్యమైన ఈ పదజాలాన్ని సేకరించి, అర్థ వివరణలతో ఇతర విశేషాలతో, పాఠక లోకానికి అందించే యత్నమే ఈ వృత్తి పదకోశ నిర్మాణానికి ముఖ్య లక్ష్యం. ఈ పదకోశ నిర్మాణ ప్రణాళిక బాధ్యతను వహించి మాండలిక వృత్తి పదకోశ సంపాదక మండలి అధ్యక్షులుగా తమ సేవలను అందిస్తున్న ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తి గారికి మా కృతజ్ఞతలు.

ప్రస్తుత గ్రంథం మాండలిక వృత్తి పదకోశం సంపుటం - 15 (కళలు) కోసం 202 గ్రామాలు పర్యటించి క్షేత్ర పర్యాటకులు విషయ సేకరణ గావించారు. ఆయా పర్యటనల వివరాలు ఇందులో శాస్త్రీయంగా పొందుపరచడం జరిగింది. వ్యవహర్తల పేర్లు, కులం, వయస్సు, ప్రధాన వృత్తి, ఉపవృత్తి, చదువు ఇత్యాది వివరాలు కూడా ఇవ్వడం వల్ల కోశానికి పరిపూర్ణత ఏర్పడింది. ఈ కోశం మూడు భాగాలుగా విభజించబడింది. ఆ భాగాలను నిర్దేశిస్తూ వాటికి సంబంధించిన బొమ్మలు, వాటిని తయారుచేసే పరికరాల చిత్రాలు ఇత్యాది వివరాలు కూడా ఇందులో పొందుపరచబడ్డాయి.

కళలకి సంబంధించిన మాండలిక వృత్తి పదకోశం చక్కగా తయారుచేసిన సంపాదకులు డా॥ బూదరాజు రాధాకృష్ణ గారికి విశ్వ విద్యాలయం ధన్యవాదాలు తెలుపుతున్నది. యథాపూర్వకంగా ఈ ప్రచురణ కూడా పరిశోధాత్మకులైన పాఠకుల ఆదరాభిమానాలు చూరగొంటుందనడంలో సందేహం లేదు.

హైదరాబాదు
తేది 29-7-1997

ఆచార్య నాయని కృష్ణకుమారి

# కృతజ్ఞతలు

అలనాటి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి నిర్ణయం మేరకు మాండలిక వృత్తి పదకోశ పరంపరలో పదిహేనవ సంపుటిగా కళలకు సంబంధించిన ఈ సంపుటాన్ని సిద్ధం చేసే బాధ్యతను నాకు అప్పగించారు. మొదట చేతి పనులకు మాత్రమే పరిమితమైన ఈ సంపుటిలో సంగీతం, చిత్రలేఖనం, నాటకం, శిల్పం వంటి లలిత కళలక్కూడా సంబంధించిన పదజాలాన్ని చేర్చాలని సంకల్పించారు. విషయసేకరణ కార్యక్రమం 3.1.1982 నాడు ఆరంభమై 14.10.1984తో ముగిసింది. దరిమిలా సమాచారాన్ని పట్టికాబద్ధం చేయటం, అవసరమైన బొమ్మలు గీయించటం వంటి పనులు మధ్య మధ్య విరామాలతో 1986 నవంబరు 11వ తేదీ దాకా కొనసాగాయి. ఇంతలో ఈ కార్యక్రమం తెలుగు విశ్వవిద్యాలయానికి దత్తమయింది.

విషయ సేకరణకు పర్యటించినవారు సర్వశ్రీ కె. శ్రీనివాసాచార్యులు, ఎస్.ఎన్.సి. నరసింహాచార్యులు, టి. మురళీకృష్ణ, కుమారి సి. శారదామాయి. కోశ నిర్మాణంలో సర్వశ్రీ ఎస్. జయప్రకాశ్, కె. థామసయ్యలు సాయపడ్డారు. దీర్ఘకాలం ఈ పనిలో తోడ్పడిన సహాయకురాలు కుమారి సి. శారదామాయి. కేంద్రాలను సందర్శించి కావలసిన బొమ్మలు గీసి పెట్టిన చిత్రకారులు సర్వశ్రీ రాంభట్ల కృష్ణమూర్తి, సి.హెచ్. సత్యప్రకాశం గారలు. వీరందరికీ నా కృతజ్ఞతలు.

ఈ కోశంలో మూడు భాగాలున్నాయి : శిల్పం, చిత్రలేఖనం, సంగీతం, నాటకం అనేవాటికి సంబంధించిన పదాలు మొదటి భాగంలో, అల్లికలు, కుట్టుపనులు అనే వాటికి సంబంధించినవి రెండో భాగంలో, అన్ని రకాల బొమ్మలకూ, వస్తువులకూ సంబంధించినవి మూడో భాగంలో ఉన్నాయి. ఏ భాగానికి చెందిన బొమ్మలు ఆ భాగం చివర ఉన్నాయి.

ఇంతకాలం తరవాత ఈ కోశం రాతప్రతిని బయటికి తీసిన ఆచార్య జయధీర్ తిరుమలరావును, ప్రచురణకు అనుమతించిన తెలుగు విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు ఆచార్య నాయని కృష్ణకుమారిగారికి నా కృతజ్ఞతలు. ఈ కోశాన్ని నీటుగా ముద్రించిన చరితా గ్రాఫిక్స్ అధిపతి సుబ్బయ్యగారికీ ఆయన సిబ్బందికీ ధన్యవాదాలు.

హైదరాబాద్ **బూదరాజు రాధాకృష్ణ**
3.5.1997. సంపాదకుడు.

# పర్యటన కేంద్రాలు

| సంఖ్య | ప్రధాన కేంద్రం | జిల్లా |
|---|---|---|
| కో.1 | చిడివూడి | శ్రీకాకుళం |
| కో.2 | అరసవిల్లి | " |
| కో.3 | శ్రీకాకుళం | " |
| కో.4 | బుడితి | విజయనగరం |
| కో.5 | బొబ్బిలి | " |
| కో.6 | గొల్లపల్లి | " |
| కో.7 | విజయనగరం | " |
| కో.8 | లక్కవరపుకోట | విశాఖపట్టణం |
| కో.9 | విశాఖపట్టణం | " |
| కో.10 | పెందుర్తి | " |
| కో.11 | ఎలమంచిలి | " |
| కో.12 | ఏటికొప్పాక | " |
| కో.13 | పిఠాపురం | తూర్పు గోదావరి |
| కో.14 | సామర్లకోట | " |
| కో.15 | మాధవపట్నం | " |
| కో.16 | కాకినాడ | " |
| కో.17 | గాడిలంక | " |
| కో.18 | ధవళేశ్వరం | " |
| కో.19 | రాజమండ్రి | " |
| కో.20 | నరసాపురం | పశ్చిమ గోదావరి |
| కో.21 | సీతారామపురం | " |
| కో.22 | ఏలూరు | " |
| కో.23 | కోడూరుపాడు | " |
| కో.24 | నూజివీడు | కృష్ణ |
| కో.25 | మొగులూరు | " |
| కో.26 | కొండపల్లి | " |
| కో.27 | బందరు | " |
| కో.28 | విజయవాడ | " |

| సంఖ్య | ప్రధాన కేంద్రం | జిల్లా |
|---|---|---|
| కో.29 | గుంటూరు | గుంటూరు |
| కో.30 | కట్టుబడివారిపాలెం | " |
| కో.31 | దుర్గి | " |
| కో.32 | తాళ్ళపాలెం | " |
| కో.33 | తెనాలి | " |
| కో.34 | గిద్దలూరు | ప్రకాశం |
| కో.35 | ఉదయగిరి | నెల్లూరు |
| కో.36 | అయ్యవారిపల్లి | " |
| కో.37 | డి.సి. పల్లి | " |
| కో.38 | పెద్దఖేదుగుపాడు | " |
| కో.39 | నెల్లూరు | " |
| కో.40 | వరిగొండ | " |
| కో.41 | గూడూరు | " |
| కో.42 | నెలబల్లికాలనీ | " |
| | | |
| తె.1 | హైదరాబాద్ | హైదరాబాద్ |
| తె.2 | నార్సింగి | మెదక్ |
| తె.3 | అదిలాబాద్ | అదిలాబాద్ |
| తె.4 | నిర్మల్ | " |
| తె.5 | చెన్నూరు | " |
| తె.6 | రామడుగు | కరీంనగర్ |
| తె.7 | అనుపురం | " |
| తె.8 | కరీంనగర్ | " |
| తె.9 | చెర్యాల | " |
| తె.10 | వరంగల్ | వరంగల్ |
| తె.11 | కంచన్‌పల్లి | " |
| తె.12 | పెంబర్తి | " |
| తె.13 | భువనగిరి | నల్గొండ |
| తె.14 | నల్గొండ | " |
| తె.15 | సూర్యాపేట | " |

| సంఖ్య | ప్రధాన కేంద్రం | జిల్లా |
|---|---|---|
| రా.1 | ఆళ్లగడ్డ | ప్రకాశం/కర్నూలు |
| రా.2 | రాచిన్నయపల్లి | కడప |
| రా.3 | మాధవమల | చిత్తూరు |
| రా.4 | శ్రీకాళహస్తి | ॥ |
| రా.5 | తిరుపతి | ॥ |
| రా.6 | పాపానాయుడుపేట | ॥ |
| రా.7 | మదనపల్లి | ॥ |
| రా.8 | హిందూపూర్ | అనంతపురం |
| రా.9 | పెనుకొండ | ॥ |
| రా.10 | చాకర్లపల్లి | ॥ |
| రా.11 | ధర్మవరం | ॥ |
| రా.12 | నిమ్మలకుంట | ॥ |
| రా.13 | చెన్నే కొత్తపల్లి | ॥ |



| పర్యటన వివరాలు | | | వ్యవహర్త వివరాలు | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| క్రమ సంఖ్య | పర్యటించిన ఊరు | జిల్లా | వ్యవహర్త పేరు | కులం | వయస్సు | ప్రధాన వృత్తి | ఉపవృత్తి | చదువు |
| 1. | విశాఖపట్నం | విశాఖపట్నం | చుంచినాడ ప్రసాదరావు | విశ్వబ్రాహ్మణ | 25 సం॥ | దంతం పని | — | — |
| 2. | " | " | వైజర్పు వీరభద్రరావు | " | 43 సం॥ | " | — | S.S.L.C. |
| 3. | పెందుర్తి | " | కొవ్వాడ బ్రహ్మాజీ | సరాపుల(కంసాలి) | 20 సం॥ | మట్టి, సిమెంటు బొమ్మలు | — | 3వ తరగతి |
| 4. | ఎలమంచిలి | " | దొడ్డిపట్ల వరహాలు | దేవాంగులు | 55 సం॥ | కొయ్యబొమ్మలు | — | 5వ తరగతి |
| 5. | ఏటికొప్పాక | " | జామి సత్యనారాయణ | కంసాలి | 65 సం॥ | లక్క/కొయ్య బొమ్మలు | — | 5వ తరగతి |
| 6. | " | " | విజ్జెం సూర్యనారాయణ | దేవాంగులు | 36 సం॥ | లక్క/కొయ్య బొమ్మలు | — | 5వ తరగతి |
| 7. | లక్కవరపుకోట | " | రామోజి గురుమూర్తి | విశ్వబ్రాహ్మణ | 33 సం॥ | కంచు బొమ్మలు | — | 5వ తరగతి |
| 8. | " | " | మత్తుర్తి అప్పారావు | " | 38 సం॥ | కంచు బొమ్మలు | — | 3వ తరగతి |
| 9. | " | " | రామోజు చిదంబరరావు | " | 43 సం॥ | " | — | 5వ తరగతి |
| 10. | తిరుపతి | చిత్తూరు | శ్రీరామ్మూర్తి | విశ్వబ్రాహ్మణ | 48 సం॥ | రాతిశిల్పం | — | 8వ తరగతి |
| 11. | " | " | శ్రీరాంకాళీ ప్రసాద్ | " | 44 సం॥ | " | ఉపాధ్యాయత్వం | 9వ తరగతి |
| 12. | " | " | చెరువుల రావులు | మాల | 49 సం॥ | సంగీత పరికరాల రిపేర్ | — | — |
| 13. | " | " | ఆనాల ఆనందం | క్రైస్తవ | 59 సం॥ | మేకప్ | — | S.S.L.C. |
| 14. | " | " | గార్లపాటి చెంగల్రాయుడు | హరిజన | 45 సం॥ | తబలా తయారీ | — | — |
| 15. | " | " | కూరేటి హనుమంతరావు | కాపు | 65 సం॥ | మేకప్ | — | 8వ తరగతి |
| 16. | " | " | మైనంపాటి కాళహస్తి వీరయ్య రామమూర్తి | బలిజ | 46 సం॥ | సంగీత పరికరాల రిపేర్ | వైణిక | S.S.L.C. |
| 17. | " | " | వేదవ్యాస ఆనంద భట్టర్ | బ్రాహ్మణ | 26 సం॥ | " | వ్యవసాయం | సాహిత్య శిరోమణి |

| సర్యటన వివరాలు | | | వ్యవహర్త వివరాలు | | | | | |
| --- | --- | --- | --- | --- | --- | --- | --- | --- |
| క్రమ సంఖ్య | పర్యటించిన ఊరు | జిల్లా | వ్యవహర్త పేరు | కులం | వయస్సు | ప్రధాన వృత్తి | ఉపవృత్తి | చదువు |
| 18. | " | చిత్తూరు | గుంటి నాగేశ్వరరావు | నాయుడు | 28 సం॥ | " | — | ఇంటర్ |
| 19. | " | " | జానకీరాం | బ్రాహ్మణ | 49 సం॥ | " | — | — |
| 20. | " | " | పశుపతి | బ్రాహ్మణ | 49 సం॥ | " | — | B.M. |
| 21. | " | " | మైలాపూరు శిల్పి తిరుమలాచారి | విశ్వబ్రాహ్మణ | 53 సం॥ | లోహంబొమ్మలు | — | 8వ తరగతి |
| 22. | మాధవమల | " | వాటంచేడు చిన్నాచారి | ఆచారి | 42 సం॥ | కొయ్యబొమ్మలు | వడ్రంగం | — |
| 23. | పాపానాయుడుపేట | " | కాముల గోవిందాచారి | " | 46 సం॥ | " | — | 4వ తరగతి |
| 24. | తిరుచానూరు | " | కాశీ దొరసామాచారి | " | 48 సం॥ | " | వడ్రంగం | 3వ తరగతి |
| 25. | " | " | సాతంబాకం ఆనందాచారి | " | 36 సం॥ | " | — | 5వ తరగతి |
| 26. | " | " | నవనీత విజయరాఘవన్ | బ్రాహ్మణ | 30 సం॥ | గవ్వబొమ్మలు | పెయింటింగ్ | బి.ఏ. |
| 27. | శ్రీకాళహస్తి | " | కీళ్లపాకం ఆర్ముగమాచారి | విశ్వబ్రాహ్మణ | 35 సం॥ | కొయ్యబొమ్మలు | వడ్రంగం | 5వ తరగతి |
| 28. | " | " | పెద్దపాళ్యం వేలాయుధమాచారి | " | 55 సం॥ | " | — | 5వ తరగతి |
| 29. | " | " | పెద్దపాళ్యం మోహన్ | " | 26 సం॥ | " | — | బి.ఏ. |
| 30. | " | " | పెద్దపాళ్యం చంద్ర | " | 25 సం॥ | కొయ్యశిల్పం | వడ్రంగం | S.S.C. |
| 31. | మదనపల్లి | " | రాజాకమలమ్మ దయానందం(F) | క్రైస్తవ | 50 సం॥ | గుడ్డ బొమ్మలు | — | P.U.C. |
| 32. | పెరుమాళ్లపల్లి | " | ఆటప్పాకం శిల్పిదేశాచ్చారి | విశ్వబ్రాహ్మణ | 46 సం॥ | లోహం బొమ్మలు | — | — |
| 33. | ఏలూరు | ప.గో. | వీరవల్లి తాయారు లక్ష్మీనరసమ్మ | రజక | 30 సం॥ | లేసుల అల్లిక | — | 8వ తరగతి |
| 34. | కోడూరుపాడు | ప.గో. | తాళ్లూరి నారాయణరావు | సాతాదిశ్రీవైష్ణవ | 30 సం॥ | చేతికర్రల తయారీ | — | 6వ తరగతి |
| 35. | " | " | తాళ్లూరి రామమోహనరావు | " | 29 సం॥ | " | — | 6వ తరగతి |
| 36. | కొండపల్లి | కృష్ణా | ధరణికోట దుర్గాప్రసాద్‌రావు | ఆర్య క్షత్రియ(ముచ్చి) | 60 సం॥ | బొమ్మలు | — | 8వ తరగతి |
| 37. | " | " | ఉదయగిరి సూర్యప్రకాశరావు | (నకాష్) " | 23 సం॥ | " | — | — |
| 38. | " | " | కామరుషి సత్యనారాయణ | " | 35 సం॥ | " | — | — |
| 39. | " | " | చందూరి వీరబ్రహ్మాచారి | విశ్వబ్రాహ్మణ | 38 సం॥ | " | — | 5వ తరగతి |
| 40. | బందరు (వలందపాలెం) | " | మొవ్వ సుబ్రహ్మణ్యం | కుమ్మరి | 62 సం॥ | కాగితం గుజ్జు, మట్టి బొమ్మలు | — | 4వ తరగతి |

| పర్యటన వివరాలు | | | వ్యవహర్త వివరాలు | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| క్రమ సంఖ్య | పర్యటించిన ఊరు | జిల్లా | వ్యవహర్త పేరు | కులం | వయస్సు | ప్రధాన వృత్తి | ఉపవృత్తి | చదువు |
| 41. | బందరు (చిలకలపూడి) | ॥ | చలమలసెట్టి కోటేశ్వరరావు | కాపు | 38 సం॥ | వెండి ఆభరణాల తయారీ | — | S.S.L.C. |
| 42. | ॥ బందరు | ॥ | సి.హెచ్. రామక్రిష్ణారావు | ॥ | 35 సం॥ | ॥ | — | Inter |
| 43. | రాజమండ్రి | తూ.గో. | ఏకేవి వెంకటేశ్వరరావు | ముచ్చి | 45 సం॥ | చిత్రకళ | — | 8వ తరగతి |
| 44. | ॥ | ॥ | నామేపల్లి సూర్యనారాయణ | ॥ | 52 సం॥ | ॥ | — | 7వ తరగతి |
| 45. | ॥ | ॥ | మాదేటి రాజాజీ | జంగం | 45 సం॥ | ॥ | — | S.S.C. |
| 46. | ॥ | ॥ | పిల్లేడ నరసింహాచార్యులు | విశ్వకర్మ | 55 సం॥ | శిల్పం | — | 8వ తరగతి |
| 47. | ధవళేశ్వరం | ॥ | పెదపాటి బాలసుబ్రహ్మణ్యం | విశ్వబ్రాహ్మణ | 28 సం॥ | ॥ | — | 7వ తరగతి |
| 48. | కాకినాడ | ॥ | యలమర్తి రామ్మోహనరావు | వైశ్య | 69 సం॥ | కొయ్యబొమ్మలు | — | S.S.L.C. |
| 49. | సామర్లకోట | ॥ | లంక సత్తెమ్మ | మాల | 40 సం॥ | వట్టివేరు చాపల అల్లకం | వ్యవసాయం | 4వ తరగతి |
| 50. | గాడిలంక | ॥ | పెద్దిరెడ్డి మురహరిరావు | కాపు/తెలగ | 55 సం॥ | మట్టి, కాగితం, గుజ్జు స్టఫ్డ్ బొమ్మలు | వ్యవసాయం | 5వ తరగతి |
| 51. | ॥ | ॥ | కొమ్మిరెడ్డి సూర్యనారాయణ | కాపు | 50 సం॥ | ॥ | — | — |
| 52. | మాధవపట్నం | ॥ | తోట తిరుపతిరావు | ఆర్యబొందిలి | 55 సం॥ | తోలుబొమ్మలు | — | 2వ తరగతి |
| 53. | ॥ | ॥ | తోట రామ్మూర్తి | ॥ | 45 సం॥ | ॥ | — | 8వ తరగతి |
| 54. | పిఠాపురం | ॥ | గుమ్మర్తి మాధవరావు | చెట్టి బల్జీలు | 43 సం॥ | సంగీత పరికరాలు | — | 6వ తరగతి |
| 55. | ॥ | ॥ | గుత్తుర్తి వెంకటరమణ | ॥ | 45 సం॥ | ॥ | — | 8వ తరగతి |
| 56. | ॥ | ॥ | నంవిగ్రామం వీరన్న | ఆర్య క్షత్రియ | 50 సం॥ | వీరభద్రుని సామాన్ల తయారీ | — | 8వ తరగతి |
| 57. | నూజివీడు | కృష్ణా | ఎడవల్లి వెంకటస్వామి | కాపు | 57 సం॥ | సంగీత పరికరాలు | — | 4వ తరగతి |
| 58. | ॥ | ॥ | ఎడవల్లి దుర్గాప్రసాద్ | కాపు | 27 సం॥ | ॥ | — | 10వ తరగతి |
| 59. | చిడిపూడి | శ్రీకాకుళం | కింతాడ మల్లేశ్వరరావు | విశ్వబ్రాహ్మణ | 45 సం॥ | శిల్పం | — | 5వ తరగతి |
| 60. | ॥ | ॥ | చల్లపల్లి జగన్నాధం | ॥ | 40 సం॥ | బంగారం పని | కొయ్యబొమ్మలు | 6వ తరగతి |

| ...రాలు | | | వ్యవహర్త వివరాలు | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| క్రమ సంఖ్య | పర్యటించిన ఊరు | జిల్లా | వ్యవహర్త పేరు | కులం | వయస్సు | ప్రధాన వృత్తి | ఉపవృత్తి | చదువు |
| 61. | అరసవిల్లి | " | ఇప్పిలిజోగి సన్యాసిరావు | బ్రాహ్మణ | 36 సం॥ | చిత్రలేఖనం | అర్చకత్వం | S.S.C. |
| 62. | బుడితి | " | అద్దాల వెంకటరావు | విశ్వబ్రాహ్మణ | 42 సం॥ | లోహం పని | — | 3వ తరగతి |
| 63. | శ్రీకాకుళం | " | పుల్లేటికుర్తి వీరభద్రరావు | " | 73 సం॥ | శిల్పి | — | B.A., B.Ed. |
| 64. | " | " | వంగా చిట్టెమ్మ | శ్రీశయన | 50 సం॥ | చిత్రలేఖనం | — | బి.ఏ. |
| 65. | గొల్లపల్లి | విజయనగరం | సర్వశిద్ధి లక్ష్మణస్వామి | విశ్వబ్రాహ్మణ | 77సం॥ | వీణతయారీ | — | — |
| 66. | బొబ్బిలి | " | సర్వశిద్ధి స్వామి | " | 60సం॥ | తోలుతయారీ | — | — |
| 67. | విజయనగరం | " | నిమ్మల వీరభద్రుడు | జంగం | 62సం॥ | చర్మకారీ | హార్మోనియం చేయడం | 3వ తరగతి |
| 68. | " | " | కొట్టియాడ అప్పలసత్యం | విశ్వబ్రాహ్మణ | 35సం॥ | తోలు పరికరాల తయారీ | — | 5వ తరగతి |
| 69. | " | " | సలిపాక సూర్యనారాయణ | " | 39సం॥ | " | — | 3వ తరగతి |
| 70. | " | " | నిమ్మల సోమలింగం | " | 53సం॥ | మృదంగం కొయ్య తయారీ | భామాకలాపం | — |
| 71. | " | " | నిమ్మల రాజలింగం | " | 25సం॥ | తోలు పరికరాల తయారీ | — | — |
| 72. | " | " | ద్వారం దుర్గా ప్రసాద్‌రావు | తెలగ | 40సం॥ | సంగీతం | — | Dip. Music |
| 73. | " | " | కదంబ ఆదినారాయణ | విశ్వబ్రాహ్మణ | 30సం॥ | వడ్రంగం | — | 2వ తరగతి |
| 74. | " | " | లంక సన్యాసిరావు | తెలగ | 22సం॥ | నాగస్వరం | — | — |
| 75. | " | " | గొంది సత్య శ్రీనివాసులు | విశ్వబ్రాహ్మణ | 42సం॥ | వీణ తయారీ | — | వీణాశాస్త్రం |
| 76. | " | " | ఉలిపి శివలింగం | " | 35సం॥ | హార్మోనియం చేయడం | హరికథ | 5వ తరగతి |
| 77. | " | " | కొట్యాడ పండుబాబు | " | 60సం॥ | తోలుతయారీ | — | — |
| 78. | " | " | పోతుల పైడితల్లి | " | 42సం॥ | " | — | — |
| 79. | " | " | చిట్టూరి సీతాలక్ష్మి | బ్రాహ్మణ | 20సం॥ | నాట్యం | నాటకం | 10వ తరగతి |
| 80. | " | " | కడవంటి సత్యనారాయణ | తెలుకలి | 39సం॥ | Teacher | Dramatist | S.S.L .C. |
| 81. | " | " | సుదర్శనం క్రిష్ణజియ్యర్ | బ్రాహ్మణ | 25సం॥ | మేకప్ | — | 8వ తరగతి |
| 82. | " | " | శఠగోపం నరసింహమూర్తి | " | 60సం॥ | కిరీటం మోల్డింగ్ | — | — |
| 83. | " | " | ఘంటసాల వరప్రసాదురావు | వైశ్య | 39సం॥ | మేకప్ | — | 8వ తరగతి |

| పర్యటన వివరాలు | | | వ్యవహర్త వివరాలు | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| క్రమ సంఖ్య | పర్యటించిన ఊరు | జిల్లా | వ్యవహర్త పేరు | కులం | వయస్సు | ప్రధాన వృత్తి | ఉపవృత్తి | చదువు |
| 84. | గొల్లపల్లి | విజయనగరం | సర్వశిద్ధి వీరన్న | విశ్వబ్రాహ్మణ | 72సం॥ | వీణ తయారీ | — | ప్రాథమిక విద్య |
| 85. | ॥ | ॥ | సర్వశిద్ధి సూర్యనారాయణ | ॥ | 60సం॥ | ॥ | — | — |
| 86. | ॥ | ॥ | సర్వశిద్ధి చంద్రశేఖరం | ॥ | 26సం॥ | ॥ | — | మెట్రిక్ |
| 87. | ॥ | ॥ | సర్వశిద్ధి గంగాధరాచారి | ॥ | 19సం॥ | ॥ | — | 9వ తరగతి |
| 88. | ॥ | ॥ | సర్వశిద్ధి వీరన్న లక్ష్మణస్వామి | ॥ | 20సం॥ | ॥ | — | ఇంటర్ (1) |
| 89. | చిన్నయపల్లె | కడప | రేకన్‌దార్ సుబ్బారావు | బొందిలి | 60సం॥ | తోలుబొమ్మలాట | వ్యవసాయం | — |
| 90. | ॥ | ॥ | కాళే వెంకట్రాయుడు | ॥ | 25సం॥ | ॥ | — | — |
| 91. | ॥ | ॥ | రేకన్‌దార్ రాజాంబ | ॥ | 50సం॥ | ॥ | — | — |
| 92. | చిన్నూరు | చిన్నూరు | అనికేపల్లి రామూర్తి (పెద్ద) | వడ్ల | 58సం॥ | వడ్రంగం | చేతికర్రల తయారీ | 1వ తరగతి |
| 93. | ॥ | ॥ | అనికేపల్లి రామూర్తి | ॥ | 52సం॥ | ॥ | ॥ | — |
| 94. | నిర్మల్ | నిర్మల్ | దన్నూరి చిన్నపోచెట్టి | నకాష్ | 40సం॥ | బొమ్మలతయారీ | — | 5వ తరగతి |
| 95. | ॥ | ॥ | బ్రహ్మరౌతు భాస్కరవర్మ | ॥ | 26సం॥ | ॥ | — | బి.కాం. |
| 96. | ॥ | ॥ | గాజిర్ల లక్ష్మీనర్సయ్య | ॥ | 40సం॥ | ॥ | — | 5వ తరగతి |
| 97. | ॥ | ॥ | ముదల్కర్ పోతన్నభావసర్ | రంగ్రేజీ | 45సం॥ | రంగ్రేజీ | — | 5వ తరగతి |
| 98. | ॥ | ॥ | రాచర్ల లింబయ్య | నకాష్ | 60సం॥ | బొమ్మలతయారీ | — | 5వ తరగతి |
| 99. | ఆదిలాబాద్ | ఆదిలాబాద్ | కోటమల్లయ్య | పద్మశాలి | 31సం॥ | సంగీతపరికరాల రిపేరు | — | 8వ తరగతి |
| 100. | భువనగిరి | భువనగిరి | నామోజు రమణాచారి | వడ్ల | 35సం॥ | కర్ర నగిషీ | — | 10వ తరగతి |
| 101. | ॥ | ॥ | నామోజు నరసింహాచారి | ॥ | 30సం॥ | ॥ | — | 10వ తరగతి |
| 102. | ॥ | ॥ | నామోజు వెంకట సత్యాచారి | ॥ | 70సం॥ | ॥ | — | 6వ తరగతి |
| 103. | చేర్యాల | చేర్యాల | దనాలకోట చంద్రయ్య | నకాష్ | 40సం॥ | పటాలపని, రంపం పొట్టు పని | — | 4వ తరగతి |
| 104. | పెంబర్తి | జనగాం | ఐలా దక్షిణామూర్తి | కంచరి | 52సం॥ | లోహంబొమ్మలు | — | 5వ తరగతి |
| 105. | ॥ | ॥ | ఐలా సోమబ్రహ్మాచారి | ॥ | 22సం॥ | ॥ | — | 7వ తరగతి |

| పర్యటన వివరాలు | | | వ్యవహర్త వివరాలు | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| క్రమ సంఖ్య | పర్యటించిన ఊరు | జిల్లా | వ్యవహర్త పేరు | కులం | వయస్సు | ప్రధాన వృత్తి | ఉపవృత్తి | చదువు |
| 106. | పెంబర్తి | జనగాం | ఐలా చంద్రశేఖరయ్య | కంచరి | 60సం॥ | లోహం బొమ్మలు | - | 4వతరగతి |
| 107. | ॥ | ॥ | ఐలా అనంతాచారి | ॥ | 26సం॥ | ॥ | - | 10వతరగతి |
| 108. | చెన్నేకొత్తపల్లి | అనంతపురం | కంసల శేషాచార్యులు | కంసాలి | 46సం॥ | టీచరు | చిత్రలేఖనం | 8వతరగతి |
| 109. | పెనుకొండ | ॥ | పెనుకొండ రామకృష్ణ | నాయుడు | 41సం॥ | ॥ | సిమెంటు బొమ్మలు పెయింటింగ్ | బి.ఏ. |
| 110. | చాకర్లపల్లి | ॥ | బి.చెన్నరాయప్ప | వాల్మీకి | 43సం॥ | తోలుబొమ్మలాట | - | 5వతరగతి |
| 111. | నిమ్మలకుంట | ॥ | ధళవాయి చలపతిరావు | ఆర్యమరాఠీ | 40సం॥ | ॥ | - | 6వతరగతి |
| 112. | ధర్మవరం | ॥ | చాగల్లు శేషప్ప | కంసాలి | 72సం॥ | - | కంసాలిపని | 10వతరగతి |
| 113. | బొబ్బిలి | విజయనగరం | అలజంగి బ్రహ్మం | విశ్వబ్రహ్మణ | 55సం॥ | సంగీతపరికరాలు | - | - |
| 114. | ॥ | ॥ | అలజంగి సీతారామస్వామి | ॥ | 40 | ॥ | - | - |
| 115. | మోగులూరు | గుంటూరు | దాలినేని సాంబశివరావు | కమ్మ | 34 | ఆర్టటీచర్ | - | పి.యు.సి |
| 116. | హైదరాబాద్ | హైదరాబాద్ | భయాంక | నాయకర్ | 25 | కొమ్ముబొమ్మల తయారీ | - | - |
| 117. | ॥ | ॥ | బి.రాములు | నకాష్ | 54 | బొమ్మలు(నిర్మల్) | - | 4వతరగతి |
| 118. | ॥ | ॥ | అబ్దుల్ లతీఫ్ | ముస్లిం | 53 | వడ్రంగం | - | - |
| 119 | ॥ | ॥ | ఏశాల లక్ష్మయ్య | సాలె | 65 | ॥ | - | 4వతరగతి |
| 120. | ॥ | ॥ | పోశెట్టి | క్షత్రియ | 55 | ॥ | - | 2వతరగతి |
| 121. | ॥ | ॥ | నార్లకంటి మల్లేష్ | కుర్మగొల్ల | 30 | డ్యూకోపెయింటింగ్ | - | 7 ॥ |
| 122. | ॥ | ॥ | కన్నయ్యరాం కరుప్పయ్యాచారి | విశ్వబ్రాహ్మణ | 65 | శిల్పం | వ్యవసాయం | - |
| 123. | ॥ | ॥ | జి.వై. రాజవర్మ | నకాష్ | 38 | చిత్రలేఖనం | - | డిప్లొమా |
| 124. | ॥ | ॥ | పెండెం లక్ష్మీనారాయణ | పద్మశాలి | 45 | గాజులపని | - | - |
| 125. | ॥ | ॥ | నందికంటి కృష్ణ | మేదర | 23 | లోహంవస్తువులు | - | - |
| 126. | ॥ | ॥ | శ్రీరామోజు హరిరాజం | విశ్వబ్రాహ్మణ | 51 | ॥ | - | 5వ ॥ |
| 127. | ॥ | ॥ | శ్రీరామోజు సుదర్శనాచారి | విశ్వబ్రాహ్మణ | 40 | ॥ | - | 9వ ॥ |

| పర్యటన వివరాలు | | | వ్యవహర్త వివరాలు | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| క్రమ సంఖ్య | పర్యటించిన ఊరు | జిల్లా | వ్యవహర్త పేరు | కులం | వయస్సు | ప్రధాన వృత్తి | ఉపవృత్తి | చదువు |
| 128. | హైదరాబాద్ | హైదరాబాద్ | యామల లక్ష్మీప్రసన్నం | నాయుడు | 39 | లక్కవస్తువులు | - | 10వ " |
| 129. | " | " | అజ్జరపు సత్యనారాయణమూర్తి | బ్రాహ్మణులు | 35 | బుర్రకథ, డ్రామా | - | బి.ఏ. |
| 130. | " | " | మడిపడగ బలరామాచారి | విశ్వబ్రాహ్మణ | 57 | చిత్రలేఖనం | - | 10వ తరగతి |
| 131. | " | " | పేరి సుబ్బారావు | బ్రాహ్మణ | 52 | " | - | 10వ " |
| 132. | " | " | సానికె బాలప్ప | కురుమ | 38 | వొగ్గుకథకుడు | - | - |
| 133. | " | " | అయిలా నరసింహాచారి | కంచరి | 40 | లోహంబొమ్మలు | - | - |
| 134. | " | " | బ్రహ్మరౌతు వెంకన్న | నకాష్ | 44 | చిత్రలేఖనం | - | 5 " |
| 135. | " | " | కైసర్‌జాన్ బేగం | ముస్లిం | 40 | నిర్మల్‌కర్ర బొమ్మలు | - | 7 " |
| 136. | " | " | సయ్యద్ ఉస్మాన్‌గుచ ఉస్మాన్ | " | 36 | చిత్రలేఖనం | - | 5 " |
| 137. | " | " | దిలీకర్ గజానంద | మరాఠీ | 26 | లోహంబొమ్మలు | - | 10 " |
| 138. | " | " | దుర్గ | లంబాడీ | 25 | అల్లిక | - | - |
| 139. | " | " | వి.రామకిషన్‌రావు | మరాఠి | - | హార్మోనియం | - | - |
| 140. | " | " | పెదపాటి నాగేశ్వరరావు | విశ్వబ్రాహ్మణ | 41 | శిల్పం | - | ఎం.ఏ. |
| 141. | హిందూపూర్ | అనంతపురం | కోలార్ భాస్కరశంకరనారాయణ | బ్రాహ్మణ | 29 | " | - | బి.కాం. |
| 142. | " | " | ఎం. ఖాద్రెప్ప | ఈడిగ | 65 | సంగీతం | - | 5 " |
| 143. | " | " | కొరమ యల్. తిప్పయ్య | ఎరుకల | 64 | మేకప్ | - | 5 " |
| 144. | గూడూరు | నెల్లూరు | గోదావరి ఆదినారాయణ | బలిజ | 45 | పెయింటింగ్ | - | 9 " |
| 145. | " | " | పెద్దపాళ్ళెం శంకరాచారి | విశ్వబ్రాహ్మణ | 28 | కొయ్యబొమ్మలు | - | 8 " |
| 146. | డి.సి.పల్లి | " | ఇంటి కుమార రాజారావు | ఆర్యకాపు | 62 | తోలుబొమ్మలు | - | 9 " |
| 147. | ఉదయగిరి | " | పఠాన్ మత్తేఖాన్ | ముస్లిం | 45 | కొయ్యబొమ్మలు | - | 5 " |
| 148. | " | " | మహమ్మద్ పాషా | " | 35 | కొయ్యపని | - | 3 " |
| 149. | " | " | షేక్ జానీ బాషా | " | 25 | ఉడెన్‌కట్లర్ | - | ఇంటర్ |
| 150. | నెల్లూరు | " | కాళహస్తి రవికుమార్ | ఆర్యక్షత్రియ | 25 | శిల్పం, కొయ్యవాహనాలు | - | 8వ " |

| పర్యటన వివరాలు | | | వ్యవహర్త వివరాలు | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| క్రమ సంఖ్య | పర్యటించిన ఊరు | జిల్లా | వ్యవహర్త పేరు | కులం | వయస్సు | ప్రధాన వృత్తి | ఉపవృత్తి | చదువు |
| 151. | నెల్లూరు | నెల్లూరు | నందిగం కృష్ణయ్య | ఆర్య క్షత్రియ | 30 | హార్మోనియం | - | 4వ తరగతి |
| 152. | పెద్దపడుగుపాడు | " | ఉదయపూర్ వెంకటశాంతిశర్మాజీ | బ్రాహ్మణ | 49 | శిల్పం | - | యస్.యస్.ఎల్.సి. |
| 153. | వరిగొండ | " | నల్లగొండ పద్మావతి | ఆర్యక్షత్రియ | 42 | రంపంపొట్టు బొమ్మలు | - | 1వ తరగతి |
| 154. | " | " | దామ సత్యనారాయణమ్మ | " | 25 | " | - | 7 " |
| 155. | తాళ్లపాలెం | గుంటూరు | తీండ్ర కోటయ్య | హరిజనుడు | 63 | కొమ్ము, కొబ్బరికాయ బొమ్మలు | - | 5 " |
| 156. | గుంటూరు | " | గుల్లపల్లి ఆదిశేషయ్య | బ్రాహ్మలు | 66 | డ్రామాడ్రెస్సుల తయారీ | - | 8 " |
| 157. | తెనాలి | " | తుపాకుల వెంకటేశ్వర్లు | కృష్ణబలిజ | 45 | లోహపుపని | - | 8 " |
| 158. | " | " | కోనూరి వెంకటకోటయ్య | విశ్వబ్రాహ్మలు | 29 | మెటల్‌వర్క్ | - | 3 " |
| 159. | " | " | అక్కల మంగయ్య | పద్మశాలి | 45 | రాతి, పంచలోహ విగ్రహాలు | వెండిపని | యస్.యస్.ఎల్.సి. |
| 160. | " | " | అక్కల రామకృష్ణారావు | " | 35 | " | - | యస్.యస్.ఎల్.సి. |
| 161. | " | " | అక్కల శ్రీరాములు | " | 18 | " | - | 10వ తరగతి |
| 162. | సీతారామపురం | ప.గోదావరి | కత్తుల చంద్రావతి | తెలగ | 40 | లేసులఅల్లిక | - | - |
| 163. | " | " | పులపర్తి శేషారత్నం | కాపు | 60 | " | - | - |
| 164. | నర్సాపురం | " | పితాని అనసూయ | సెట్టిబల్జీలు | 35 | " | - | 5 " |
| 165. | " | " | కంకిపాటి హేమలత | క్రిస్టియన్స్ | 45 | " | - | 9 " |
| 166. | " | " | కూనవరపు సుజాత | " | 30 | " | - | బి.ఏ. |
| 167. | " | " | నవబత్తుల కనకదుర్గ | కాపులు | 22 | " | - | - |
| 168. | " | " | కొల్లాటి రామలక్ష్మి | " | 32 | " | - | 8వ తరగతి |
| 169. | " | " | పురుషోత్తమ్మ | రజక | 52 | " | - | - |
| 170. | " | " | కొప్పాడి ఇందిరమ్మ | కాపులు | 48 | " | - | - |
| 171. | " | " | ఎ. సత్యవతి | గౌడలు | 50 | " | - | - |

| పర్యటన వివరాలు | | | వ్యవహర్త వివరాలు | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| క్రమ సంఖ్య | పర్యటించిన ఊరు | జిల్లా | వ్యవహర్త పేరు | కులం | వయస్సు | ప్రధాన వృత్తి | ఉపవృత్తి | చదువు |
| 172. | నర్సాపురం | నర్సాపురం | చంద్రవంక సుభద్రమ్మ | కాపులు | 40 | " | - | 3వ తరగతి |
| 173. | అనుపురం | కరీంనగర్ | దనాలకోట నారాయణ | సోమక్షత్రియ | 55 | నకాషీపని | - | 5 " |
| 174. | నార్సింగి | మెదక్ | పుట్ట పాండరి | పద్మశాలి | 20 | బొమ్మలు వేయడం | - | 5 " |
| 175. | " | " | తంబళ్ళ వెంకయ్య | తంబళ్ళు | 50 | సంగీతపరికరాలతయారీ | - | 3 " |
| 176. | రామడుగు | కరీంనగర్ | వడ్లూరి హరయ్య | విశ్వకర్మ | 40 | శిల్పం | - | - |
| 177. | " | " | వడ్లూరి వెంకటేశ్వర్లు | " | 35 | " | - | 7 " |
| 178. | " | " | వడ్లూరి వెంకటరమణయ్య | " | 72 | " | - | - |
| 179. | " | " | వడ్లూరి కిష్టయ్య | " | 76 | " | - | - |
| 180. | కరీంనగర్ | " | శ్రీనాంపెల్లి ఆంజనేయులు | అవుసలి | 30 | తీగపని | - | 8 " |
| 181. | " | " | బెజ్జంగి రాజమణి | " | 48 | " | - | 5 " |
| 182. | " | " | కాట్నిపల్లి సుదర్శనం | కంసాలి | 45 | " | - | 4 " |
| 183. | " | " | కట్టా ప్రవీణ్‌కుమార్ | " | 25 | ఫిలిగ్రీ | - | 10 " |
| 184. | " | " | శ్రీరామోజు రమణాచారి | " | 25 | " | - | 5 " |
| 185. | రంగశాయిపేట | వరంగల్ | శ్రీరుద్రోజు నరసింహాచారి | కంచరి | 21 | ఇత్తడిపని | - | ఇంటర్ |
| 186. | " | " | బెజ్జంగి వీరనారాయణాచార్యులు | " | 35 | " | - | 9వ తరగతి |
| 187. | ఆళ్ళగడ్డ | కర్నూలు | శ్రీదురుగడ్డ బాలవీరాచారి | విశ్వబ్రాహ్మణ | 56 | శిల్పం | - | 5 " |
| 188. | అయ్యవారిపల్లి | నెల్లూరు | శ్రీకురిచేటి రామాచారి | కంసాల | 40 | సన్నాయితయారీ | - | 5 " |
| 189. | నెలబల్లికాలనీ | " | శ్రీమహమ్మద్ జమాల్‌సాహెబ్ | దూదేకుల | 56 | తాటాకుల నగిషీ | - | 5 " |
| 190. | గిద్దలూరు | ప్రకాశం | శ్రీపఠాన్ మదార్‌వల్లి | ముస్లిం | 25 | వడ్రంగి | - | ఇంటర్ |
| 191. | నెలబల్లికాలనీ | నెల్లూరు | శ్రీసయ్యద్ మహమ్మద్ ఫకీర్ | సాహెబ్ | 25 | తాటాకుబుట్టలపని | - | 3వ తరగతి |
| 192. | నల్లగొండ | నల్లగొండ | యస్.వి. కరుణారెడ్డి | క్రిష్టియన్స్ | 42 | అద్దాలు, పూసలు | - | మెట్రిక్యులేషన్ |
| 193. | సూర్యాపేట | " | నాగార్జున కోటయ్య | విశ్వబ్రాహ్మలు | 75 | బంగారం, వెండినగీషీలపని | - | 5వ తరగతి |
| 194. | కట్టుబడివారిపాలెం | గుంటూరు | రేక్‌నార్ సుబ్బారావు | బొందిలీలు | 50 | తోలుబొమ్మలతయారీ | - | 4 " |

| పర్యటన వివరాలు | | | వ్యవహర్త వివరాలు | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| క్రమ సంఖ్య | పర్యటించిన ఊరు | జిల్లా | వ్యవహర్త పేరు | కులం | వయస్సు | ప్రధాన వృత్తి | ఉపవృత్తి | చదువు |
| 195. | కట్టుబడివారిపాలెం | గుంటూరు | వనపర్తి బాలాజి | బొందిలీలు | 38 | తోలుబొమ్మల తయారీ | - | 5వ తరగతి |
| 196. | కంచనపల్లి | వరంగల్ | కొండబత్తిని కుమారస్వామి | పద్మశాలి | 27 | టేపిస్ట్రీ | - | 10 " |
| 197. | దుర్గి | గుంటూరు | ధారం ఈశ్వరభీష్మాచార్యులు | విశ్వబ్రాహ్మలు | 43 | శిల్పం | - | " |
| 198 | " | " | యర్రోజు వీరనరసింహాచార్యులు | " | 28 | " | - | 8 " |
| | | | దార్ల వెంకటేశ్వర్లు | " | 24 | " | - | 6 " |
| 199. | విజయవాడ | కృష్ణా | బండారి వీరన్న | శాలీలు | 36 | ప్లాస్టర్ఆఫ్‌ప్యారిస్ బొమ్మలు | - | మెట్రిక్ |
| 200. | " | " | మైలాపూరు వెంకటజగన్నాధాచార్యులు | విశ్వబ్రాహ్మలు | 34 | శిల్పం, లోహం | - | - |
| 201. | " | " | నాగిడి సూర్యనారాయణ | చెట్టిబలిజ | 45 | సంగీత వాద్యాల తయారీ | - | - |
| 202. | " | " | నూకాడ లక్ష్మణరావు | అగ్నికులక్షత్రియ | 64 | సంగీతపరికరాల తయారీ | - | 9వ తరగతి |

# అ

**అకార సాధన** : రాగాలాపన. సంగీతం నేర్చేటప్పుడు రాగప్రస్తారం కోసం 'అ' కార ధ్వనిని సాగదీయడం. (తె.1)

**అక్రమాకారం** : రాతి బొమ్మలు చెక్కడంలో సరిగా రాని రూపం. (రా.8)

**అక్షంతలు (బ)** : ఒగ్గు కథ చేప్పేముందు గంగతెప్ప కట్టుకొన్న మల్లికార్జున స్వామి విగ్రహాలు వేసినపుడు పటం మీద శుభసూచనగా వేసే పసుపు కలిపిన బియ్యం గింజలు. (తె.1)

**అక్షరం (చెక్కు)** : పర్యా. లెటర్. రాతి పలకల మీద సేనంతో సుత్తితో లిపిని చెక్కు. (కో.3)

**అఖండ సాధకం** : రాగాలాపన ఎక్కువ కాలం చేయడం (ముఖ్యంగా నాగస్వరం)లో నేర్పు. (రా.5)

**అగవ** : రూ. అగావు. పర్యా యధ్యమ పరిధి, వ్యాసం, చుట్టుకొలత. (కో.4)

**అగావు** : చూ. అగవ. వీణ కుండ చుట్టుకొలత తీసుకోవటానికి ఉపకరించే పరికరం. (డయామీటర్). (కో.6)

**అగ్గి** : పర్యా. ఇంగులం. నిప్పు. (కో.7; తె.5; రా.5)

**అగ్గిదబ్బవాన** : రంగులు అద్దేపని (రంగ్రేజ్ పని)లో వాడే ఒక రకం అచ్చు (=వాన). (తె.4)

**అగ్గిపుల్ల** : నిప్పుపుల్ల. (రా.13)

**అగ్నిపాత్ర** : నాట్యం చేస్తున్న నటరాజు విగ్రహం చేతిలో ఉన్న పాత్ర. (కో.31)

**అగ్నిహోత్రుడు** : రాతి గట్టిదనం పరీక్ష చేసేటప్పుడు రాతి మీద దెబ్బవేయగానే రేగే నిప్పురవ్వ. (తె.6)

**అంకం** : పర్యా. మొదటి తెర. నాటకంలో ఒక భాగం. రంగ స్థలంలో ముందుండే తెర/పరదా. (తె.2; రా.13)

**అంగభంగిమ** : విగ్రహం అవయవాలను చెక్కిన తీరు. (రా.8)

**అంగుళం** : రూ. అంగళం. పర్యా. ఇరచి, 'దేవాంగుళం'. అడుగులో 12వ వంతు. (కో.7,16,39)

**అంగాంగాలు** : (బ) రాతి విగ్రహం భాగాలు, వాటి విభాగాలు. (కో.3)

**అజవాయ** : వీణలో ఏడవమెట్టు అమర్చిన చోటు. (కో.7)

**అంచవా (పెట్టు)** : గుర్తుపెట్టు, విభజించు. (కో.7)

**అంచిపెట్టు** : గట్టిగా అదిమిపెట్టు, అణచి ఉంచు (రా.5)

**అంచుధోతి** : అంచు ఉన్న ధోవతి (తె.1)

**అఠాణ** : ఒక రాగం. (కో.7)

**అడ్డబొట్టు** : పర్యా. విభూతి రేఖలు. రాతిపనిలో శివలింగానికి పెట్టే బొట్టు. (తె.6)

**అడ్డమీటు** : వీణ వాయించేటప్పుడు - చూపుడు వేలితో మీటినప్పుడు ఏర్పడే స్వరాన్ని నడిమి వేలుతో తాకి ధ్వనిని అడ్డగించి, అలా మందగించిన నాదం తిరిగి వెంటనే పలికే విధంగా నడిమి వేలుతో మీటటం. (కో.7)

**అడ్డిగ** : రాతి విగ్రహానికి మెడలో వేసే ఒక ఆభరణం. (రా.5)

**అడుగు** : (1) కింది భాగం. (2) 12 అంగుళాలు. (కో.2,3,5,7,9,37,42; తె.1; రా.6)

**అడుగు చేరు** : కిందికి చేరు. (కో.7)

**అడుగుబద్ద** : పర్యా. రూళ్లబద్ద. స్కేలు. (కో.7,16; రా.4)

**అడ్డు** : అడ్డం. (కో. 6,33)

**అంటించు** : 1. అతికించు. (కో.19,34; తె.7,8,12,15; రా.5,6) 2. వెలిగించు (రా.10)

**అంటుపెట్టు** : అతుకుపెట్టు, అతికించు. (తె.3,4,7)

**అండర్ కోట్** : చిత్రలేఖనంలో బొమ్మలు చిత్రించడానికి ముందు హార్డ్‌బోర్డ్ లేక ప్లైవుడ్ (canvas) మీద వేసే రంగు. (కో.2)

**అతుకు** : పర్యా. కరిపించు. అంటించు. (కో.4,13; తె.8; రా.5,8)

**అద్దకం పని :** బట్టమీద రంగుల డిజైన్లను అద్దేపని. (తె.4,11)

**అద్దం :** (1) మేకప్‌లో కనుబొమలు దిద్దడానికి వాడే కాటుక చేసేప్పుడు ఆముదం దీపం పొగపట్టడానికి వాడే గాజు పలక. (కో.7)

(2) చిత్రలేఖనంలో కాగితం మీద బొమ్మవేసి మెరుగు రావడానికి గవ్వతో రుద్దేటప్పుడు కాగితం అడుగున పెట్టే గాజు. (కో.19)

(3) చిత్రలేఖనంలో బొమ్మలు వేయడానికి వాడే గాజుపలక. (రా.11)

**అద్దం చట్టా :** పర్యా. మిర్రర్ ఫ్రేమ్. గాజుతో చేసిన ఫోటో చట్రం. (తె. 13)

**అదుము :** పర్యా. అద్దు, నొక్కు, ప్రెస్‌చేయు. వీణమీటు. (కో.7)

**అడ్డెక(లు) :** మేకప్ చేసేటప్పుడు పౌరాణిక వేషం వేసే వాళ్లకు మెడలో వేసే పూసల హారం. (రా.8)

**అధమ దశ తాళం :** ఇంద్రుడు, అగ్ని మొదలైన శిలావిగ్రహాలు చేసేటప్పుడు వాడే శిల్ప శాస్త్రానికి సంబంధించిన కొలత. ఇందులో 116 భాగాలుంటాయి. (రా.5)

**అధమం :** రాతిపనిలో విగ్రహానికి ముఖమంతా విస్తరించిన కిరీటం. కిరీటాలలోని మూడు రకాలలో అధమం అనేది ఒకటి. (కో.7)

**అన్నపుపరి :** మృదంగం కరిణ తయారీలో చిలిమిరాళ్ల పొడి కలపడానికి అనువుగా అన్నంతో మెత్తగ చేసిన జిగురు. (కో.37; రా.10)

**బేధి :** ఒక రకం మూలిక. రాతిపనిలో విగ్రహం నల్లగ రావడానికి కరక్కాయతో కలిపి ఉడికించి పూసే మూలిక. విగ్రహానికి జీవరేఖలు దిద్దడానికి ముందు ఈ ఉడికించివ మిశ్రమం పూసి ఆరనిస్తారు. (కో.19)

**అన్నం :** మృదంగం కరిణపిండి తయారీలో చిటిమ రాళ్ల పొడిలో కలిపే అన్నం జిగురు. (కో.5,7; తె.1,2; రా.5)

**అనాచ్ఛాదితం :** కంజీరా, వంటి వాద్యాలలో ఒకవైపు ఖాళీగా ఉండే భాగం. (కో.7)

**అనాహతం :** వీణలో పందొమ్మిదవ మెట్టు అమర్చిన చోటు. (కో.7)

**అనుకరించు :** సంగీత కచేరీలో గాయకుడు పాడినట్లే పక్క వాయిద్యాలు వాయించడం. (కో.7)

**అనుపల్లవి :** చరణం. (రా.2)

**అనుమందరం :** రూపా. అనుమంద్రం. వీణకు ఉండే శ్రుతి తీగపేరు. ఈ శ్రుతి తీగలు దండికి పైగా బిగించి ఉంటాయి. (రా.5)

**అంతరాళం :** గుడిలో విగ్రహం ఉండే చోటు. (తె.6)

**అందం :** చూడటానికి బాగా కనబడేది. కంటికి నదరుగా ఉండేది. (కో.3)

**అందె :** (1) ఒగ్గు కథ చెప్పేటప్పుడు కాలికి కట్టుకొనే గజ్జ. (తె.1)

(2) బుర్ర కథలో కథ చెప్పేవారు కుడిచేతితో పట్టుకొని వాయించే మువ్వ. (తె.1) చూ. చిత్రం 14.

(3) రాతి విగ్రహానికి కాళ్లకు చెక్కే మువ్వ.

**అపరస్థలాలు :** మట్టితో కిరీటం చేసేటప్పుడు కిరీటానికి అక్కడక్కడ ఉండే ఎత్తు పల్లాలు. (కో.7)

**అప్పగించు :** పర్యా. ఇచ్చేయు. రాతి విగ్రహం చెక్కిన తరువాత టెంకాయ కొట్టి పూజ చేసి చేయించిన వాళ్లకు విగ్రహం ఇవ్వడం. (తె.6)

**అప్రూవు :** మొట్టమొదట వైట్‌క్లేతో కావలసిన మోడల్ బొమ్మ చేసి తరువాత బాగా వచ్చిందనుకుంటే అసలు బొమ్మ చెయ్యటం. (కో.38)

**అబద్దపు మీటు :** వీణతో సంగీత రచన వాయిస్తున్నపుడు సాహిత్యాక్షరం లేనిచోట వేసే మీటు. (కో. 7)

**అభ్రకం :** మేకప్ చేసేటప్పుడు వేషధారి ముఖం మెరవటానికి పూసే పూత. (కో.29; రా.8)

**అభయహస్తం :** రాతి పనిలో విగ్రహం కుడి చేయి పైకి పెట్టి దీవిస్తున్నట్లు చెక్కడం. (కో.19,31)

**అమృతశిల :** పర్యా. తెల్లరాయి. రాతిపనిలో శిల్పానికి వాడే తెల్లరాయి. దీన్ని పరీక్ష చేసేటప్పుడు రాయిపెట్టి గీస్తే దీని మీద గీతరాదు. (తె.6; రా.1)

**అంబరు :** పర్యా. ఐబ్రో, కనుబొమ, కన్నుబ్బు. <ఆం. eye brow. (కో.7)

**అంబరు పెన్సిలు :** eye brow pencil. కనుబొమలను దిద్దే పెన్సిలు. (కో.7)

**అంబాదేవి :** కాళికాదేవి. రంగ్రేజ్ పనిలో అద్దకంలో వేసే బొమ్మ. (తె.4)

**అంబులపొది :** బాణాలు పెట్టుకోవడానికి ఉపకరించే బోలుగా ఉన్న ఒక రకం పరికరం. యుద్ధ సమయాల్లోను వేటకెళ్లే ముందు దీన్ని కట్టుకుంటారు. (రా.8)

**అయిబ్రోకు :** మేకప్‌లో కనుబొమలకు దిద్దే నల్లరంగు. (రా.5)

**అరదళం :** పూర్వం మేకప్‌లో బుగ్గలకు పూసుకునే పసుపురంగు. (కో.29)

**అరపాశం :** రూపా. అర పాశం. రాతి పనిలో విగ్రహాన్ని మొదట రాయి మీద చెక్కడానికి వాడే పనిముట్టు. (రా.5)

**అరించిబ్రష్ :** అద్దకం పనిలో పరదాలపై వాడే ఒక రకం కుంచె. (తె.2)

**అరుగు :** బ్రష్ కొద్దికాలం వాడిన తరువాత మొద్దుగ అవడం. (కో.41)

**అర్ధచంద్రాకార ఉలి :** పర్యా. రౌండు ఉలి. వీణ తయారీలో వీణకుండ భాగాన్ని చేయడానికి వాడే ఒక రకం ఉలి. (రా.5)

**అర్ధచంద్రాకారం :** (1) లోహం పనిలో విగ్రహాల కనుబొమలు చెక్కే ఆకారం. (తె.12)

(2) వీణ కుంచెపై ఉన్న బ్రిడ్జి ఆకారం. (కో.7; రా.5)

**అర్ధభాగం :** ఛాత్ వరకు చేయబడిన సిమెంటు బొమ్మలు. (bust size). (కో.3)

**అర్దులం :** రూపా. ఆర్దలం, ఆర్దలం. పర్యా. పేవడా, పసుపు, తేవుడి. బొమ్మలకి పూర్వం పసుపు రంగుకి బదులుగ వాడేది. (కో.12; తె.4,9)

**అలెగ్జాండరు టోపి :** నాటకాలలో అలెగ్జాండర్ వేషధారి పెట్టుకునే టోపి. (కో.7)

**అల్లిక :** తబలాకు మూతల చివర అంచులకు వారుతో నేసిన అల్లిక (తె.3)

**అల్లు :** చిత్రలేఖనంలో బోర్డర్లకి బొమ్మల ఆభరణాలకు వేసేది. తగరం, సరబ్బి కలిపి దంచి దీన్ని చేస్తారు (తె.1)

**అల్జేరి :** పటిక. రంగ్రేజ్ పనిలో జాతిమా రంగు దీనితో చేస్తారు. (తె.4)

**అవనద్ధ కుతపం :** చర్మ సంబంధమైన సంగీత వాద్యాల సమ్మేళనం. మృదంగం, కంజీర, డోలకు మొదలైనవి. (కో.7)

**అవయవం :** శరీర భాగంలో అవయవాలను చెక్కడం. (కో.1,31,33,39)

**అవరోహణ :** శ్రుతి తగ్గటం/తగ్గింపు. (కో.7)

**అవిసెనూనె :** రూపా. అవుసె నూనె, అవిశనూనె. పర్యా. లిన్సెడ్ ఆయిల్. అవిశ గింజల నుండి తీసిన నూనె. దీనికి వైట్ జింక్ కలిపి చిత్రం వేసే ముందు గోడకు పూస్తారు. (తె.1,4; రా.11)

**అవుట్‌లయిను :** (అవుట్ లయిను కొట్టు) చిత్రలేఖనంలో వేయబోయే బొమ్మని ముందు పెన్సిలుతో లైట్‌గా వేయడం. (రా.11)

**అంశం :** అంశమంటే ముఖం. ప్రతి శిల్పంలోనూ పాదం నుండి కేశం వరకు 65 అంశాలుంటాయి. (కో.19)

**అష్టతాళం :** రాతిపనిలో విగ్రహాలను నిర్మించడానికి వాడే

ప్రమాణం. పంచతాళం, సప్తతాళం, అష్టతాళం - ఈ విధంగా శిల్పశాస్త్ర ప్రకారం షోడశ (16) తాళాలున్నాయి. ఒక్కొక్క మూర్తికి ఒక్కొక్క ప్రమాణం. (తాళం=ముఖం) (కో.19; తె.6; రా.1)

**అష్టఫలీ :** రంగ్రేజ్ పనిలో వాడే ఒక రకం అచ్చు. (తె.4)

**అష్టశిల(లు) :** రాతిపనిలో విగ్రహాలకు వాడే ఎనిమిది రకాల శిలలు. 1. కృష్ణశిల (నల్లరాయి) 2. తెల్లరాయి 3. ఎర్రశిల 4. రక్తశిల 5.శ్వేత శిల 6. పాలశిల 7. పచ్చశిల 8. స్ఫటిక శిల. (కో.19)

**అసిటోను :** మేకప్‌లో గడ్డాలకు, మీసాలకు పూసిన జిగురు కడగడానికి వాడే ఒక రకం ద్రవం. దీనిని ఒక పళ్లెంలో పోసిన తర్వాత కొద్దిగా దూది తీసుకుని మీసం వెనుక పూసి తర్వాత ఒక బట్టతో నెమ్మదిగా తుడిచేయాలి. (రా.5)

**అస్త్రం :** మృదంగం తయారీలో వేసే చర్మం లోపలి పొరభాగం. (కో.7)

**అస్త్రం ముక్క :** చర్మం లోపలి పొరభాగం ముక్క (కో.5,7)

**అస్థిపంజరం :** సిమెంటు బొమ్మలు చేసేప్పుడు మొదట ఇనప ఊచలతో చేసిన మనిషి ఆకారం. (కో.3)

## ఆ

**ఆకారం :** పర్యా. రూపం. నమూనా. (కో.1,6,8,13,16,27, 31,32,33,41; తె.1,7,14; రా.4,8,11)

**ఆకు :** 1. ముఖవీణ పలకడానికి పెట్టే ఒక ఆకు. తాటాకు గాని, నాగ సర్పాకు గని పెడతారు.

2. నాగస్వరం పలకడానికి పెట్టే పీక. దీన్ని రెల్లుతో చేస్తారు. (కో.7)

3. తబలా మూతలో ఉండే మేక చర్మం భాగం. (తె.2)

4. వీణ చేసేటప్పుడు కుండకు చివర వేసే లతల డిజైన్. (కో.6)

**ఆకుపచ్చ ఆకారం :** నాటకాల్లో ఆంజనేయుని రూపం. (కో.7)

**ఆకుపచ్చ మట్టి :** పూర్వం చిత్రలేఖనంలో బొమ్మలకి వేసే రంగు. ఈ మట్టి లేపాక్షిలో దొరుకుతుంది. చిన్న చిన్న రాళ్లలా ఉన్న దీన్ని మెత్తగా పొడిచేసి మైదాపిండి ఉడికించిగాని, కట్టె వజ్రాన్ని ఉడకపెట్టి గాని, లేక ఏదైనా జిగురుతో గాని కలిపి రంగుగా వాడేవారు. (రా.11)

**ఆకుపచ్చ లక్క :** వీణ అందంగా కనబడడానికి కుండకి చుట్టూ ఒక డిజైన్ చెక్కి ఆ గాడిలో పోయడానికి వాడే లక్క. (కో.6)

**ఆకురాయి :** పర్యా. కురువిందంరాయి, పాలిష్ స్టోన్, సానరాయి, సానరౌతు. రాతి బొమ్మల్ని సాపు చేయడానికి వాడే పనిముట్టు. (కో.1,4,7.8,10,12,27; తె.1,2,3,4,5,6,7,8,9,12,13; రా.4,8)

**ఆకృతి :** రూపం. (కో.33)

**ఆక్సైడ్ జింక్ :** మేకప్‌లో ముఖానికి పూసుకునేది. (రా.13)

**ఆగమశాస్త్రం :** శిల్పాలకి సంబంధించిన శాస్త్రం. చెక్కిన శిల్పాలని పద్ధతి ప్రకారం ప్రతిష్ఠ చేయడాన్ని తెలిపే శాస్త్రం. (కో.19)

**ఆగర్ర :** డోలకు చేసేటప్పుడు కొయ్యకి చిల్లులు పెట్టడానికి వాడే ఒక పనిముట్టు. చూ.చిత్రం.37. (కో.13)

**ఆచారం :** సంప్రదాయం. (కో.19; రా.4)

**ఆట :** తోలుబొమ్మలాట, నాటకం. (కో.37; తె.7)

**ఆడవేషం :** నాటకంలోని స్త్రీ పాత్ర. (కో.29)

**ఆడేసం :** ఆడవేషం. వొగ్గు కథలో (కథకుని) వేషం. (తె.1)

**ఆది :** కొలత. (కో.7)

**ఆదితాళం :** మృదంగం మీద వాయించేది. (రా.2)

**ఆదిపురాణం :** మాలవారిలో మన్నెపోళ్లు, గుర్రపోళ్లు చెప్పే కథ. సృష్టి పుట్టుక గురించి చెప్పే పురాణం. (తె.9)

**ఆది ప్రకారం** : చేయవలసిన కొలత ప్రకారం. (ఆది=కొలత) (కో.39)

**ఆధారం** : సపోర్టు. సిమెంటు పనిలో విగ్రహం చేయి చాస్తున్నట్లు ఉంటే లోపల చేయి కొలత ప్రకారం ఇనప ఊస పెట్టడం. (తె.6; రా.5)

**ఆనంద** : ముదురు నీలం (నేవిబ్లూ = navy blue) (రా.13)

**ఆనపకాయ** : పర్యా. ఆనప తుంబ, సొరకాయ. వీణని కాలు మీద పెట్టుకోడానికి వీలుగా దండికి కింద అమర్చిన సొరకాయ. చూ. చిత్రం.? (కో.13)

**ఆనపచెట్టు** : సొరకాయ పాదు. (కో.6)

**ఆనపతుంబ** : వీణకి 'మేరువ' దగ్గర అమర్చిన సొరకాయ. చూ. ఆనపకాయ. చూ. చిత్రం. ? (కో.6)

**ఆపెలు** : రాతిపనిలో శిలను తొలచడానికి ఉపయోగించే పనిముట్టు. (రా.1)

**ఆఫ్‌క్రౌన్** : నాటకంలో పెట్టుకొనే కిరీటం. ఇది తలకి ముందు మాత్రమే ఉంటుంది. (కో.7)

**ఆమడ** : నాలుగు కోసులు. అమృత శిలను రెండామడల దూరం వెళ్లి తెస్తారు. (తె.6; రా.2)

**ఆమీన** : ఆ తరువాత. (కో.5)

**ఆముదం** : రూపా. అయిదం. పూర్వం తోలుబొమ్మలాట ప్రదర్శనకి వాడే దీపంలో పోసే నూనె. (రా.2,10); ఢోల్కి దూంపుడికి వేసే రంగన్ చేయడానికి గుగ్గిలం మట్టితో కలిపే నూనె. (తె.3); కాటుక చేయడానికి వెలిగించే దీపంలో పోసే చమురు. (కో.29)

**ఆముదం పలుకులు** : తంబడి డోలుకు పెట్టడానికి మైదాలో కలిపేది. (తె.2)

**ఆయిల్ పెయింటింగ్** : చిత్రలేఖనంలో తైలవర్ణంతో వేసిన బొమ్మ. (కో.2,16; తె.1,15; రా.5,11)

**ఆయుధం** : యుద్ధంలో చేతిలో ఉండే సాధనం. (కో.29)

**ఆరతి** : హారతి. (తె.1)

**ఆరనిచ్చు** : వేడిగా ఉన్నదాన్ని చల్లారబెట్టు. మేకప్‌లో విగ్గుని నీటిలో ఉడికించి ఆరబెట్టు. (కో.29)

**ఆర్గన్** : హార్మోనియంలో లావు శ్రుతి చేయడానికి ఉపయోగించేది. (రా.10)

**ఆరంజ్** : నారింజపండు రంగు. (రా.13)

**ఆరు** : 1. సంఖ్య. 2. ఎండు. పర్యా. ఇగురు. (కో.7,19; రా.5,13)

**ఆరోహం** : శ్రుతి పెరగటం/పెంపు. (కో.7)

**ఆర్ట్** : కళ. శిల్పం చెక్కడం, నగిషీ చెక్కడం. (తె.10)

**ఆర్టిస్టు** : పర్యా. చిత్రకారుడు. బొమ్మలు వేసేవాడు. (కో.7,9)

**ఆర్చు** : ఆరబెట్టు. (రా.5)

**ఆర్మోనియం** : పర్యా. శ్రుతిపెట్టె. రూపా. హార్మోనియం. సంగీత వాయిద్యం. (కో.7)

**ఆల్కహాల్** : మత్తు పానీయం. (కో.33)

**ఆవుతోలు** : నగారా తయారీలో వాడే చర్మం. (తె.2)

**ఆవుదూడ చర్మం** : మృదంగం 'కుడిముఖం'లో ఉపయోగించే తోలు. (రా.5)

## ఇ

**ఇగురు** : ఆరు, ఎండిపోవు. చూ. ఆరు. (కో.1,2)

**ఇంకు** : సిరా; ఆరటం. (కో.19; రా.2,13)

**ఇంగ్లీకం** : రూపా. ఇంగిలీకం. పర్యా. ఎరుపు, ఎర్రరంగు, సింగ్ రూఫ్, మణిశిల. (తె.2,4,9)

**ఇంగ్లీషు ఆర్ట్** : చిత్ర లేఖనంలో బొమ్మకి వెలుతురు, నీడ ఉండేట్లు చెయ్యడం (light & shades). చిత్రలేఖనంలో ఇదొక పద్ధతి. (కో.3)

**ఇంగ్లీషు డ్రామా** : ఆంగ్ల నాటకం. (కో. 7)

**ఇంచి** : (<Eng. inch) అంగుళం. (కో.1,3,39; తె.4,7,12, రా. 5)

**ఇంచిబ్రష్** : అంగుళం కుంచె. (తె.2)

**ఇంటి కర్ర** : తొరపణాన్ని తిప్పడానికి ఉపయోగించే కట్టె. చూ.చిత్రం.? (కో.6,9)

**ఇండియన్** : భారతదేశానికి సంబంధించిన. (రా.13)

**ఇండియన్ ఆర్ట్** : భారతదేశానికి సంబంధించిన కళ. (కో.7)

**ఇండియన్ ఇంక్** : చిత్రలేఖనంలో ఉపయోగించే నల్ల సిరా. (కో.19)

**ఇండియన్ హాండ్‌మేడ్ డ్రాయింగు పేపర్** : చిత్రలేఖనంలో బొమ్మలు వేయడానికి వాడే కాగితం. (కో.2)

**ఇండ్లు(బ)** : వీణదండిపై ఉండేమెట్లు, కంచు లేదా ఉక్కుతో ప్రత్యేకంగా తయారుచేసిన 24 కడ్డీలను మెట్లుగా ఏర్పడేటట్లు వరుసగా వీణదండిపైమైనంతో బిగిస్తారు. (కో.7)

**ఇత్తడి కడియం** : వీణ తయారీలో కుండమీద తీగలు అమర్చడానికి 7కన్నాలు కలిగిన ఇత్తడితో చేసిన ఒక భాగం. చూ.చిత్రం.1-8. (కో.6)

**ఇత్తడి కప్పు** : వీణలో సొరకాయ బుర్రమీద పూవు ఆకారంలో ఉన్న కప్పు. చూ.చిత్రం.? (రా.5)

**ఇత్తడి తాళాలు** : కంజీరలో ఉండే బిళ్ళలు. చూ.చిత్రం.9.2 (కో.3,7; తె.1,3; రా.8)

**ఇత్తడి పీట** : పర్యా. తాళంపీట. వీణలో కుండ పైభాగం మీద ఉంటే ఇత్తడి భాగం. ఇది రెండు భాగాలు. వీటిని పైపీట, పక్క పీట అంటారు. లగానికి బిగించిన తీగలు ఈ పక్కపీట గాని పైపీట మీదగాని వస్తాయి. (కో.39)

**ఇత్తడి బేసు** : వీణని కింద పెట్టటానికి వీలుగా ఇత్తడితో చేసిన ఒక భాగం. చూ.చిత్రం-1.19. (కో.6)

**ఇత్తడి వైరు** : హార్మోనియం రీడ్‌లపైన ఉండే తీగ. (కో.39)

**ఇనప ఊస** : డోలకు శ్రుతి సవరించడానికి వాడే రింగులను చేయడానికి ఉపయోగించే ఇనప తీగ. (కో.13)

**ఇనప కడెం** : రూ. ఇనప కడియం. తంబడి డోలుకు ఒకవైపున బిగించే ఇనప కడియం. చూ.చిత్రం-7.3. (తె.2)

ఢోల్కీ పుడి చుట్టు ఉండే ఇనప కడియం. (తె.3)

**ఇనపకత్తెర** : ఇనప కట్టర్. లోహపు వస్తువుల్ని కత్తిరించే సాధనం. (తె.3)

**ఇనపకుంచె** : కోసుగా, రంపం పళ్ల ఆకారంలో, ఇనుముతో చేసిన ఒకరకం కడ్డీ. దీనితో వీణకు సన్నని బెజ్జాలు వేస్తారు. (కో.24)

**ఇనపకుండ** : డగ్గ కుండ. చూ.చిత్రం.? (తె.2)

బ్యాండ్‌లో ఉండే ఇనప భాగం. (తె.2)

**ఇనపగరిటె** : విగ్రహలను నీటిలో ఉదికించేటప్పుడు కలపటానికి వాడే సాధనం. (కో.29)

**ఇనపగొట్టం** : కుంచెలు చేసేప్పుడు చివరగా వెంట్రుకలు పెట్టడానికి వాడే చాకు (చిన్న కత్తి)ను పట్టుకొనే భాగం. (తె.3)

**ఇనపముక్క** : సంగీత పరికరాలు చేయడానికి ఉపయోగించే పెద్దఆరె, జాతులులలో ఒక భాగం. చూ.చిత్రం-33.37; 39.3. (కో.5,7)

**ఇనుపమేకు** : పర్యా. మొల, మేకు. తబలా తయారీలో మూతకి వాడే తోలుని ముందు చెట్టు నీడలో సాగదీసేప్పుడు తోలు అంచుల్ని నేలకు బిగించి ఉంచడానికి వాడే ఒక రకం మేకు. (కో.7)

**ఇనపసుత్తె** : సంగీత పరికరాలు చేయడానికి ఉపయోగించే కట్లసుత్తెలో ఒక భాగం. చూ.చిత్రం.-61.2. (కో.16,29)

**ఇనపస్ప్రింగు** : వంచడానికి అనువుగా ఉన్న ఇనప తీగ. (కో.13)

**ఇనుపపొడి** : మృదంగం కరిణ తయారీలో దీనిని ఉపయోగిస్తారు. మృదంగం కుడి ముఖం 3 రకాల పొరలతో ఉంటుంది. మధ్య భాగంలో ఒక నల్లటి మందు స్థిరంగా, గట్టిగా అంటించి ఉంటుంది. ఈ

మందు తయారీలో ఉడికించిన అన్నంలో సన్నని ఇనుపపొడి కలుపుతారు. (రా.5)

**ఇనపరేకు** : రంపం చేయడానికి వాడేది. (కో.12,29)

**ఇనుపవైరు** : ఇనప తీగ. (కో.39)

**ఇందు (ట)** : శుభ్రం చేయడం. మేకప్‌లో మీసాలు తయారు చేయడానికి గొర్రె వెంట్రుకలు తెచ్చి శుభ్రం చేయడం. (రా.8)

**ఇరవైసూత్రాలకథ** : ఒగ్గు కథకులు చెప్పే ఒక కథ. (తె.1)

**ఇరికించు** : డోలక్ చేసేప్పుడు ఎలత బద్దను పూడిలో దోపడం. (తె.2)

**ఇల్లునింపుకొనటం** : కురుమ కులం వాళ్లు పాడుకొంటూ పోతే ఊళ్ళో ఆ కులం వాళ్లు గురువులొస్తున్నారని ఎదురుపోయి 'ఆహ్వానించడం'. (తె.1)

**ఇసుక దిమ్మె** : ఇసుకతో కట్టిన అరుగు. (కో.33)

## ఈ

**ఈక** : పక్షులకి తోకచివర ఉండేది. బుర్రకథ చెప్పేవాళ్లు తలపాగాలో పెట్టుకొంటారు. (తె.1)

**ఈజల్** : రూపా. ఈజిల్. చిత్రలేఖనంలో బొమ్మలు వేసేప్పుడు ఉపయోగించే స్టాండు. (కో.2,3)

**ఈజీ** : సులభం (< easy). (కో.3)

**ఈటె** : నాటకంలో రాజభటుల చేతుల్లో ఉంచే బల్లెం. (కో.29)

**ఈడిగ** : ఒక కులం. ఈ కులం వాళ్లు కల్లు తీస్తారు. (రా.8)

**ఈన** : పర్యా. పరులు, బీట, బీడ. పగిలిపోవడం. (రా.4) రూపా. ఈనె. సన్నని పుల్ల. (కో.5,7,26)

**ఈరిగ రంపం** : ఒక రకం రంపం. చూ.చిత్రం-59. (కో.5)

## ఉ

**ఉక్కు (తీగ)** : (1) వీణమెట్లు చేయడానికి, శ్రుతితీగలుగా వీణకు అమర్చడానికి, మోగించడానికి కూడ దీనిని ఉపయోగిస్తారు. (కో.6,7)

(2) ఫిడేలుకు శ్రుతి చేయడానికి ఉపయోగపడే తీగ. (రా.5)

(3) ఈ లోహంతో ఆకురాయి కూడా చేస్తారు. (రా.5)

**ఉగాది** : తెలుగు సంవత్సరం మొదటి రోజు. విశ్వకర్మ కులస్థుల పండగ. (తె.1,4)

**ఉడత తోక** : ఉడత తోక చివరి భాగం. చిత్రలేఖనంలో సిల్కుబట్ట పైన రంగులు వేసే కుంచెకు చివర ఉన్న 'కుచ్చు' చేయడానికి వాడేది. (తె.1,4)

**ఉడతెంటిక(లు)** : ఉడుత వెంట్రుకలు, చూ. ఉడత తోక. (తె.9; రా.9,11)

**ఉడుకులాము** : మేకప్‌లో ఉపయోగించే రంగులు చేయడానికి గ్లిజరిన్, క్రీము, రోజానీళ్లలో కలిపే ఒకద్రవం. (Eau de Cologne). (కో.7)

**ఉడుత** : ఒక జంతువు పేరు. దీని తోక వెంట్రుకలతో కుంచెలు చేస్తారు. (కో.26; రా.13)

**ఉడుతతోక జుట్టు** : చూ. ఉడుత తోక. (తె.1)

**ఉడుము చర్మం** : దీనితో కంజీరమూతలు చేస్తారు. (కో.7)

**ఉడెన్ టూల్స్** : క్లే (clay). బొమ్మలు చేసేప్పుడు చిన్నచిన్న భాగాలు మలచడానికి వాడే కొయ్య పరికరాలు. చందనం కర్రలతో గాని రోజువుడ్‌తో గాని వీటిని చేస్తారు. (కో.38)

**ఉండ** : డమరులో ఒక భాగం. చూ.చిత్రం-10.4. మృదంగం కరిణెకు పూయడానికి వాడే కరిణె పిండి ముద్ద. (కో.7)

మేకప్‌లో పొడవు జుట్టు కావాలంటే దాన్ని చేయడానికి తీసుకొన్న నారకట్ట. (కో.7)

**ఉపకరణం** : పర్యా. పనిముట్టు, పరికరం,కదురు. సిమెంటు బొమ్మల తయారీలోనూ, రాతి పనిలోనూ వాడే పరికరం. (రా.8)

**ఉంబం :** నాటకంలో ఉపయోగించే తెరలు చేసేటప్పుడు గుడ్డమీద బొమ్మలు వేయడానికి వాడే ఒకరకం కుంచె. ఈతగుత్తిని నానబెట్టి చివర కుంచెగా చేస్తారు. (రా.13)

**ఉత్తమప్రమాణం :** రాతిపనిలో గణపతి విగ్రహం చెక్కడానికి తీసుకొనే కొలత. దీనినే పంచతాళం అంటారు. ఈ విగ్రహం 65 అంశాలు కలిగి ఉంటుంది. (రా.5)

**ఉత్తమదశతాళం :** రాతి పనిలో బ్రహ్మ, విష్ణు, మహేశ్వర, బుద్ధ మొదలైన విగ్రహాలు చేసేప్పుడు వాడే ప్రమాణం. ఈ విగ్రహ ప్రమాణం 124 భాగాలు కలిగి ఉంటుంది. (రా.5)

**ఉత్తము :** రాతి పనిలో విగ్రహాలకి చేసే కిరీటం. (కో.31)

**ఉత్తరీయం :** పర్యా. కండువా. పంచకట్టుకున్నప్పుడు భుజం మీద వేసుకునే బట్ట, పైపంచ. (కో.39; తె.6)

**ఉత్సవిగ్రహం :** ఉత్సవ విగ్రహం. ఉత్సవాలలో ఊరేగింపులకు వాడే విగ్రహం. (కో.19,33)

**ఉదరబంధం :** రాతి పనిలో విగ్రహానికి పొట్ట దగ్గర చెక్కే ఆభరణం. (కో.31; రా.5)

**ఉద్భవించు :** వీణ మీటినప్పుడు ధ్వని పుట్టు. వీణ తీగమీటటాన్ని బట్టి వెలువడే నాదం. (కో.28).

**ఉదాసీనత :** నాటకంలో వేషధారి కనబర్చే నిర్లిప్తత. (కో.29)

**ఉరువు :** రూపా. ఊరువు, ఊరు. ఒక భాగం ప్రదేశం (రాతిపనిలో). (తె.4,6)

**ఉల్టా :** రంగ్రేజ్ పనిలో కాగితం మీద డిజైన్ చెక్కి దాన్ని చెక్క మీద తల కిందులుగా అతికించిన భాగం. (తె.4)

**ఉలి :** (పర్యా. చిన్నక్షాణం) శిల్పం చెక్కడానికి వాడే పని ముట్టు. (చూ.చిత్రం.39) (కో.7,11,13,16,25,28,30, 31,32,33,35; తె.1,4,6,13; రా.1,3,4,5,8)

**ఉలికొత్తు :** రాతి పనిలో విగ్రహాన్ని చెక్కడానికి వాడే పని ముట్టు. దీనితో రాతిని చెక్కలుగా చేసి సాఫీ చేస్తారు. (రా.5)

**ఉలిపిరి కాగితం :** రూపా. ఉల్లిపొర కాగితం. పర్యా. ట్రేసింగ్ పేపర్, బట్టర్ పేపర్. చిత్రలేఖనంలో బొమ్మలు ట్రేస్ తీయడానికి వాడే కాగితం. (కో.7,19)

## ఊ

**ఊగు :** సిమెంట్ బొమ్మల తయారీలో మొదట ఇనప ఊసలతో చేసిన బొమ్మలోని ఊసకదులు. (రా.13).

**ఊడదీయు (/గొట్టు) :** విడదీయు. (కో.5,7)

**ఊడిపోవు :** విడిపోవు. (కో.1; రా.13)

**ఊదారంగు :** పర్యా. నేరేడుపండు రంగు. బచ్చలి పండు రంగు. (కో.7,30)

**ఊదు :** నోటితో గాలిని వదలు. (కో.3,29; తె.8; రా.11)

**ఊదు రంధ్రం :** ఫ్లూటు వాయించేప్పుడు నోటితో గాలిపోసే చిల్లు. చూ.చిత్రం-19.2. (కో.7)

**ఊరు :** రూపా. ఊరువు. శిల్పంలో తొడభాగం పేరు. (రా.8)

**ఊరుదామం :** రాతిపనిలో విగ్రహం కటి స్థానంలో చెక్కే ఆభరణం. (కో.31)

**ఊరేగింపు :** పర్యా. మెరవణి. పండగల్లో దేవుని విగ్రహాలను వేడుకతో ఊర్లో తిప్పడం. (కో.19)

**ఊలుగుచ్చులు :** సంగీత వాయిద్యమైన మురళితో వేలాడుతుండే కుచ్చులు. చూ.చిత్రం-19.4. (రా.5)

**ఊసివచ్చు :** రూపా. ఊసొచ్చు. ఊడివచ్చు. (తె.2,8)

**ఊహా చిత్రం :** చిత్రలేఖనంలో ఊహించివేసిన చిత్రం. (రా.13)

## ఎ

**ఎకస్ట్రా :** రూపా. ఎగస్ట్రా. పర్యా. కచ్చు. మృదంగం చేసేప్పుడు మూతకి వాడే తోలును కొలత ప్రకారం కోయగా మిగిలిన ముక్క. (రద్దు). కావలసిన దాని కంటే ఎక్కువగా ఉండేది. (కో.7,రా.5)

**ఎక్కించు :** (1) మృదంగం, తబలా, నౌబత్ మొదలైన

వాయిద్యాలు చేసేప్పుడు మూతల దగ్గర ఉండే చిల్లుల్లోకి వారు దోపు. (తె.2)
(2) తోటల్లో, ఇండ్లల్లో లతలని అందంగా మలచు. (రా.13)

**ఎగవది** : మృదంగం మూతలోని పొరలలో పైనుండే తోలు. (కో.7)

**ఎగిసి కర్ర** : ఎగిసి చెట్టు కర్ర. డోలకు తయారీలో ఈ కర్రను ఉపయోగిస్తారు. (కో.13)

**ఎంగిలి** : నాటకంలో పాత్రకు నోట్లోంచి రక్తం రావాలంటే స్పాంజీలో ఎర్ర రంగుపోసి నోట్లో పెట్టుకుంటే ఊరే నీరు. (కో.7)

**ఎడ** : సన్నాయి బొక్కలు పెట్టడానికి వాడే పనిముట్టు. (కో.36)

**ఎడంకన్ను** : డోలకు ఎడమ వైపున ఉండే మూత. (కో.5)

**ఎడమతొరుపు** : మృదంగం ఎడమవైపున ఉండేమూత. దీనిని మేక చర్మంతో చేస్తారు. (కో.7)

**ఎడందిమ్మె** : మృదంగం తబలా కుండలు చేయడానికి వాడే అడ్డలో ఎడమవైపున ఉన్న కొయ్య. (కో.7)

**ఎడమముఖం** : పర్యా. ఎడమ తొరుపు. మృదంగం ఎడమ వైపున ఉండే మూత. (కో.5)

**ఎడంమూత** : పర్యా. ఎడం కన్ను. డోలకు ఎడమ వైపున ఉండే మూత. (కో.5)

**ఎడ్జస్టర్** : ఫిడేలు తీగలు బిగించడానికి చివర ఉన్న బిరడా. ఇవి మొత్తం నాలుగుంటాయి. (కో.7)

**ఎడ్వర్టైజ్‌మెంట్** : ప్రకటన. చిత్రలేఖనంలో కమర్షియల్ ఆర్ట్ వేసే చిత్రకారులు ప్రకటన బోర్డులను(sign boards) వేస్తారు. (కో.9)

**ఎడ్జెస్ట్‌మెంట్ స్క్రూ** : హార్మణి తయారీలో క్లెంపును కావలసిన కొలతలకి సరిచేయడానికి వాడే సాధనం. (కో.39)

**ఎంటిక** : పర్యా. వెంట్రుక. మేకతోలులో ఉన్న వెంట్రుక. తబలా తయారీలో మొదట మేకతోలుకి సున్నం పెడితే ఊడిపోయే వెంట్రుక. (తె.2)

**ఎండగట్టు** : పర్యా. ఎండబెట్టు, ఆరబెట్టు. తబలా తయారీలో మొదట తోలుని శుభ్రం చేసి ఆరబెట్టు. (కో.13; తె.3)

**ఎండినతోలు** : బాగా ఆరిన తోలు. డోలకును ఈ రకం తోలుతో చేస్తారు. (కో.5)

**ఎండుపిన్ను** : ఫిడేలు పైభాగంలో ఉండే తంతులు తరలించడానికి ఉపయోగపడే సాధనం. (రా.5)

**ఎత్తుపల్లాలు** : పర్యా. ఎత్తులు వంపులు. పోతపోసిన విగ్రహాలు ఎత్తుపల్లాలుగా ఉండడం. (కో.5)

**ఎదురు బద్ద** : పర్యా. వెదురు బద్ద. డోలకు తయారీలో డోలకు మూతకు పెట్టే గుండ్రని వెదురుపుల్ల. (తె.2)

**ఎద్దుచరమం** : ఎద్దుచర్మం. మృదంగం మూతల తయారీలో ఉపయోగించే తోలు. (కో.7)

**ఎద్దుతోలు ఎంటిక(లు)** : (బ). ఎద్దుతోక చివరనున్న వెంట్రుకలు. బ్రష్/కుంచెలు దీనితో చేస్తారు. (తె.2)

**ఎద్దుతోకచివళ్ళు** : ఎద్దుతోక చివరనున్న వెంట్రుకలు. ఈ వెంట్రుకల్ని ఒకపుల్లకి దారంవేసి కుచ్చుగా కట్టి బ్రష్/కుంచెలు చేస్తారు. (కో.13)

**ఎనామిల్ పెయింట్** : రూపా. ఎనామలు పెయింట్. పౌరాణిక నాటకంలో గద తయారీలో వాడే రంగు. (కో.29)

**ఎనిమిది** : ఫ్లూటులో ఉండే వేలి రంధ్రాల సంఖ్య. (కో.7)

**ఎనిమిద్దినాలకత** : ఒగ్గు కథలు చెప్పేవారు 'బీరప్ప పండుగ' సందర్భంలో చెప్పే బీరప్ప కథ. ఈ ఉత్సవం ఎనిమిది రోజులు జరుగుతుంది. ఈ ఎనిమిది రోజులూ బీరప్ప కథ చెబుతారు. దీన్నే 'ఎనిమిద్దినాల కథ' అంటారు. (తె.11)

**ఎనుమువారు** : మృదంగం, డోలకు మూతలకి వాడే ఎద్దుతోలు. ఈ తోలుని సన్నగా కత్తిరించి మృదంగం బిగిస్తారు. (రా.5)

**ఎనుబోతువార :** పర్యా. వాడి, వారు, తోలువైరు. మృదంగం బిగించడానికి వాడే ఎద్దు తోలు. (రా.10)

**ఎమ్ను :** వెన్నుపూస. మృదంగం, డోలకు తయారీలో మూతలకు వేసే తోలు ఎండబెట్టి కోసిన మధ్యభాగం. (కో.5,7)

**ఎన్.పి.లేకర్‌స్ప్రే :** చిత్రలేఖనంలో సిల్కుబట్టల మీద బొమ్మలకి రంగులు పూసి తడి తగిలితే రంగులు పోకుండా ఉండటానికి స్ప్రే చేసే ఒక యంత్రం. (తె.1)

**ఎఫ్.యస్.జోల్స్ :** ఫిడేలు బ్రిడ్జికి ఇరువైపులా ⌴⌐ ఆకారంలో ఉన్న భాగాలు. చూ.చిత్రం-3.7. (రా.5)

**ఎఫెక్ట్ :** 1. చిత్రలేఖనంలో బొమ్మ అనుకొన్న విధంగా రావడం. (కో.1)

2. మేకప్‌లో ఆంజనేయుని పాత్ర మూతికి డిప్పలు సరిగ్గా పెట్టడం. (కో.7)

**ఎబొని :** రూపా. ఎబాని. ఫిడేలు బిరడాలు చేయడానికి వాడే సాధనం. (రా.5)

**ఎబోనిట్ దళసరి ముక్క :** వీణ మీద డిజైన్ వేయడానికి వాడే దళసరి కాగితం ముక్క. (కో.13)

**ఎంపిక :** రాతిపనిలో శిల్పానికి పనికొచ్చే రాయిని ఎన్నిక చేయడం. (రా.8)

**ఎరుకల వాంచారి కథ :** ఒగ్గు కథకులు చెప్పే ఒక కథ. (తె.1)

**ఎర్రమట్టి ఇటుక :** కరక్కాయ సిరా తయారీలో 'పొయ్యి' నిర్మించడానికి వాడే ఇటుక. (కో.28)

**ఎర్ర రంగు :** ఎరుపు రంగు. చూ. ఇంగ్లీకం. (కో.7; తె.2; రా.5,8)

**ఎర్రరాయి :** పర్యా. ఎర్రశిల. రాతి విగ్రహాల తయారీలో ఈ శిలను ఉపయోగిస్తారు. (కో.19; తె.6)

**ఎర్రలక్క :** వీణ డిజైన్లకు పూయడానికి వాడే లక్క. (కో.6)

**ఎరుపు :** పర్యా. సింగ్‌రూప్, ఇంగ్లీకం, రెడ్. ఎర్ర రంగు. రస కర్పూరం, అర్ధలం, రెండూ కలిపితే ఎరుపు వస్తుంది. పూర్వం లక్కలో కలపడానికి దీన్ని వాడేవారు. (కో.7,12,16; తె.4,9)

**ఎలకలపడు :** రాతిపనిలో శిల్పం చెక్కేప్పుడు రాయిని వెల్లకిల పెట్టు. (తె.6)

**ఎలతబద్ద :** వెదురు బద్ద, ఎదురు బద్ద. డోలకు తయారీలో డోలకు మూతకు పెట్టే గుండ్రని వెదురు పుల్ల. (తె.2,7)

**ఎలాస్టిక్ ముక్క :** నాటకంలో పెట్టుకునే విగ్గు జారిపోకుండా తలని గట్టిగా పట్టుకొని ఉండేందుకు పెట్టిన సాగే రబ్బరు ముక్క. (కో.7)

**ఎలుపు(చేయు) :** రూపా. ఎలుము, వెడల్పు, వెడల్పుచేయు. (తె.2,6,8)

**ఎలుబూడిద :** పర్యా. కచ్చిక. పిడకలు కాల్చిన తరువాత మిగిలిన తెల్లబూడిద. కాగితం గుజ్జు, మట్టి, సుద్ద బొమ్మల తయారీలో దీనిని ఉపయోగిస్తారు. తోలుకి వెంట్రుకలు పోవడానికి ముందు దీన్ని పూసి రంపితో తీసేస్తారు. (కో.13,17)

**ఎల్లకం :** రూపా. అల్లిక. తబలా, డోలకు తయారీలో వారుని అల్లడం. (రా.5)

**ఎల్లమ్మ కథ :** ఒక వొగ్గు కథ. (తె.1)

**ఎల్లుకుని :** డోలకు నారుని అల్లుకోవడం. (రా.5)

**ఎల్లో :** పసుపు రంగు. (కో.3; రా.7)

**ఎల్లోఓచర్ :** (yellow ochre). ఎల్లో. (రా.9)

## ఏ

**ఏక్‌పౌనుసుత్తి :** పర్యా. ఒక పౌను సుత్తి. రాతిపనిలో ఉపయోగించే సుత్తి. (తె.6)

**ఏకవర్ణం :** రాతిపనిలో వాడే శిల అంతా ఒకే రంగులో ఉండటం. (తె.6)

**ఏగి :** పర్యా. జిట్టేగి, (తబల) రోస్‌వుడ్. డోలక్, తబలా చేయడానికి వాడే ఏగి చెట్టు కొయ్య. (తె.2)

**ఏటకోయు :** వొగ్గు కథ చెప్పేవారు సంక్రాంతి పండగప్పుడు దేవునికి గొర్రెను బలిచ్చు. (తె.1)

**ఏటకసరు :** సరుగులో ఒక భాగం. బలిమాంస సంబంధమైనది. (తె.1)

**ఏడుమల్లెపూలకత :** ఒక వొగ్గు కథ. (తె.1)

**ఏనుగు :** దంతాలు గల జంతువు. ఈ దంతంతో ఫ్లూటు చేస్తారు. (రా.5)

**ఏమాటోండ్లు :** కథలు చెప్పి అడుక్కునే ఒకతెగ గొల్లవారు. (తె.9)

**ఏపకొమ్మ :** 1) వేపచెట్టు కొమ్మ. ఎల్లమ్మ, పాశమ్మ కథలు చెప్పేటప్పుడు వొగ్గుకథకులు ధరించే వేపమండ.
2) సరుగు మిశ్రమంలో ఒక భాగం. (తె.1)

**ఏరక :** పర్యా. ఏరు.
(1) తెల్లరంగు తయారీకి వాగుకు పోయి గవ్వలని (నత్తగుల్లలు) ఏరుకు రావడం. (తె.4)
2) మృదంగం కరిణ తయారీకి 'చిటిమరాళ్ళు' ఏరుకు రావడం. (రా.10)

**ఏరులాకు :** (Air lock). హార్మణీలో గాలిని అదుపు చేసే భాగం. (కో.7)

**ఏపంకట్టు :** వేషం వేయడం. చెప్పే వొగ్గు కథని బట్టి వేషం వేసుకొను. (తె.1)

## ఐ

**ఐదుగురు :** ఒగ్గు కథ చెప్పేవారి సంఖ్య. ముందువరుసలో నిల్చున్న ఇద్దరిలో ఒకరు కథ చెబుతుంటే మరొకరు సుతి (రాగం)అందిస్తారు.వెనుక వరుసలో కూర్చున్న ముగ్గురిలో ఒకరు తాళం, ఒకరు డక్కి, ఒకరు డోలు వాయిస్తారు. చూ.చిత్రం-25. (తె.1)

**ఐదుమల్లెపూల కథ :** ఒక వొగ్గు కథ. (తె.1)

**ఐబ్రో :** (eye brow). పర్యా. అంబరు. కనుబొమ్మ, కన్నుబ్బు. (కో.7)

**ఐరన్ టూల్స్ :** సిమెంటు బొమ్మల తయారీలో వాడే ఇనుప పరికరాలు. (కో.38)

**ఐవరిబ్లాక్ :** (Ivory block). చిత్రలేఖనంలో బొమ్మలకి వేసే లేత నలుపురంగు. (రా.9)

## ఒ

**ఒకపాన్‌సుత్తి :** పర్యా. ఏక్‌పాను సుత్తి. వీణ తయారీలో వాడే కంపాసు చివర్లు సూదిగా రావడానికి ఉపయోగించే సుత్తి. (కో.6)

**ఒకటోనంబరు :** రాతి పనిలో విగ్రహం పూర్తిగా చెక్కిన తరువాత నునుపు రావడానికి వాడే ఆకురాయి నెంబరు. (రా.5)

**ఒగ్గు :** సంగీత వాద్యాలలో ఒక ఘన వాద్యం. చూ.చిత్రం.20 (కో.6)

**ఒగ్గేయు :** వీణ తయారీలో కుండపై పీటను ఉంచు. (కో.6)

**ఒంకపుల్ల :** డోలకు తయారులో చర్మాన్ని వెదురు బద్దకి దూర్చడానికి వాడే పుల్ల. (కో.5)

**ఒట్టికట్టె :** మృదంగం నేర్చేటప్పుడు జతులను వల్లించి సాధకం చేయడానికి కట్టెతో చేసిన మృదంగం ఆకారం. (కో.5)

**ఒడాపు :** రాతిపనిలో శిల్పం తయారీకి వాడే ఇనుప పరికరం. (రా.8)

**ఒడ్డు :** హార్మణీ పై భాగం. (కో.7)

**ఒడ్డుపొడవు :** రాతి పనిలో మొదట రాయికి చూసే వెడల్పు పొడుగు. (కో.7)

**ఒత్తి :** మృదంగం బిగించడానికి వాడే వారును రంపితో కోయడం. (కో.7)

**ఒత్తిడి :** చిత్రలేఖనంలో కాగితాన్ని ముందు నీటితో తడపి

బోర్డుకి అంటించి మడతలు రాకుండ పైన ఒక గుడ్డవేసి పెట్టే బరువు. (కో.19)

ఫిడేలు తీగలను గట్టిగా నొక్కి వాయించడం. (రా.5)

**ఒత్తిరెప్ప** : తబలాకి వాడే తోలు ముక్క. (కో.7)

**ఒత్తు** : నాగస్వరానికి పక్కన శ్రుతి కోసం వాయించే సాధనం. (కో.7; రా.5)

నూనె దీపంలో కాంతి నివ్వడానికి వెలిగించేది. (రా.5)

**ఒప్పచెప్పు** : రాతిపనిలో శిల్పం చేసి చేయించుకున్నవారికి ఇచ్చేయడం. (కో.19)

**ఒంపుఉలి** : రూపా. వంపులి. మృదంగం తయారీలోవాడే పనిముట్టు. చూ.చిత్రం-43. (కో.7)

**ఒంపుకొను** : మేకప్‌లో వాడే రంగులు పాత్రలో పోసుకోవడం. (కో.5)

**ఒరిజన** : వీణ తయారీలో ముందు కొయ్యపై గుర్తుగ పెన్సిల్‌తో గీయడం. (కో.6)

**ఒరిజనల్** : చిత్రలేఖనంలో వేసిన (కొన్ని) బొమ్మలకు అసలు రూపం (మాతృక). (తె.1)

**ఒరిజనల్‌కలర్** : బొమ్మలకు వేసే సహజమైన రంగు. (తె.4; రా.4)

**ఒరియంబొట్టు** : నాటకాలలో ఒక రకం వేషానికి పెట్టుకునే బొట్టు. చూ.చిత్రం-27.5. (కో.7)

**ఒరుగుకొను** : పర్యా. ఒరిజన. వీణ తయారీలో ముందు కొయ్యపై గుర్తుగ పెన్సిల్‌తో గీయు. (కో.7)

**ఒలుపు** : మృదంగం కరిణ పిండి తయారీలో సిట్రమరాయి పొడి నీటిలో వేసి, పొడి అడుగుకు చేరిన తరువాత పైనీరు ఒంపేయడం. (కో.7)

**ఒళంబి** : రాతిపనిలో వాడే మూల మట్టం. (తె.6)

**ఓంకారపుఅల** : హార్మణిలో వాయించే ఓంకారనాదపు తరంగం. (కో.28)

**ఓణి** : స్త్రీలు వేసుకొనే పమిట. (తె.1)

**ఓపను** : (Open). (కో.7)

**ఓరియంటియల్ ఆర్ట్** : బెంగాల్, ఒరిస్సా, ఉత్తరప్రదేశ్‌లకు సంబంధించిన చిత్రకళ. (కో.3)

**ఓల్సు** : (holes). రంధ్రాలు. (రా.5)

**ఓం శబ్దం** : రాతి పనిలో శిలని పరీక్షించేటప్పుడు సుత్తితో రాయిని కొట్టినపుడు వచ్చే శబ్దం. (రా.5)

## ఔ

**ఔట్‌లైను** : చిత్రలేఖనంలో బొమ్మ వేసే ముందు తేలికగా గీసేగీతలు. (తె.1)

**ఔషధ ప్రక్రియ** : రాతి పనిలో విగ్రహం పూర్తయిన తరువాత కస్తూరి, గోరోచన, సుర్మ, పెట్లుప్పు మొదలైన వాటితో చేసిన తైలం విగ్రహానికి పూయడం. (రా.5)

## క

**కక్కెర** : రూపా. కక్కర. మృదంగం, తబల కింది భాగంలో వేసే తాత్కాలిక మూత. తాళ్లు బిగించడానికి ముందు వేసే చర్మం మూత. (కో.7)

**కక్కెర ముద్దు** : పర్యా. కక్కెర. మృదంగం, తబల కింది భాగంలో వేసే తాత్కాలిక మూత. (కో.4)

**కంకణం** : చేతులకి తగిలించుకునే ఆభరణం. నాటకాలలో కొన్ని పాత్రలకు మగవారు చేతికి తొడుగుకొనే ఆభరణం. సిమెంటు బొమ్మల తయారీలో ముంజేతి భాగాన్ని సిమెంటుతో చెక్కుతారు. (కో.29,31,33)

**కచ్చారాయి** : పర్యా. కరిణ రాయి. మృదంగం కరిణ చేసేటప్పుడు మూతమీద కరిణ పిండి వేసి తోమడానికి ఉపయోగించే కరిణె రాయి. (కో.7)

**కచ్చుచేయు** : రాతి పనిలో విగ్రహాలకు సన్నపని చేయడం. ఇది దొడ్డపనిలో అయిన చెనకం పని (ఆభరణాలు) చేయడానికి ముందు చేసే పని. (తె.6)

**కచ్చుమొుల** : రాతి పనిలో సన్నపని చేయడానికి వాడే చిన్న గుట్టల మొల. (తె.12)

**కచేరి** : రూపా. కచ్చేరి. సంగీత కార్యక్రమం. (కో.24; రా.5)

కచేరి తంబుర : కచేరీలలో మాత్రమే ఉపయోగించే తంబురా. (కో.24)

కంచి : తమిళనాడులో ఒక పట్టణం. తిరుపతిలో రాతి పని చేసేవారు నల్లరాయి (కృష్ణశిల) తెచ్చే చోటు. (రా.5)

కంచుబిళ్ళ : వీణకు కుండపై భాగంలో తీగలను ఎత్తి పెట్టే లోహపు ముక్క. (కో.5)

కంచుమొల : సంగీతపరికరాల తయారీలో వాడే కంచు సుత్తి అడుగు భాగం. చూ.చిత్రం-60.3. (తె.10,12)

కంచుసుత్తి : సంగీతపరికరాల తయారీలో వాడే పనిముట్టు చూ.చిత్రం-60. (తె.10,12)

కంజర : రూపా. కంజీర, కంజీరి. ఒక సంగీత వాయిద్యం. చూ.చిత్రం-9. (కో.3,7; తె 1,3; రా.8)

కట్‌చేయు : పర్యా. కత్తిరించు. కోయు. (కో.7,31,34,41; తె.1,3,4,12,13; రా.4,5,7,8,13)

కట్‌థబ్‌బోల్ : తబలా. (తె.3)

కటార్ల మహంకాళి : బీరప్ప పండుగ నాడు ఒగ్గులు వేసే వేషం. (తె.1)

కట్టింగ్‌ప్లేర్ : రూపా. కట్టింగ్ ప్లేయర్. హార్మణీ తయారీలో అవసరంలేని మేకులు పైకి లాగడానికి వాడే పనిముట్టు (కో.28)

మృదంగం తయారీలో వారు బిగించేటప్పుడు లాగడానికి వాడే సాధనం. (రా.5)

కట్ : పర్యా. కత్తిరించు, కట్‌చేయు. (కో.7,31,34,41; తె.1,3,4,12,13; రా.4,5,7,8,13)

కటివలయం : పర్యా. కటి సూత్రం. రాతి పనిలో విగ్రహానికి కటిస్థానంలో చెక్కే ఆభరణం. (కో.31)

కటిహస్తం : శిలావిగ్రహం తయారీలో తొడమీద పెట్టినట్లున్న చేయి. (కో.19)

కట్టు : చిత్రలేఖనంలో వాడే బ్రష్షుల తయారీలో ముందు మేక లేదా ఉడత వెంట్రుకల్ని దారంతో కుచ్చుగ కట్టు. (రా.9)

మేకప్‌లో మీసాల తయారీలో ముందు వెంట్రుకల్ని చేత్తో నలిపి మధ్యన దారంతో కట్టు. (కో.7)

కట్టె : పర్యా. కొయ్య. చెక్క. కర్ర. (తె.1,2,3,5,8,9; రా.5,8)

కట్రు : తబలా తయారీలో వైర్లు కోయడానికి వాడే పనిముట్టు. (కో.7)

కట్లసుత్తె : సంగీత పరికరాల తయారీలో ఉపయోగించే పనిముట్టు. చూ.చిత్రం-61. (కో.7)

కడపరాయి : రాతిపనిలో వాడే ఒక రకం శిల. కడపలో లభిస్తుంది కాబట్టి కడపరాయి అంటారు. (కో.3)

కడవ : పర్యా. కుండ, కుండలి, బుంగ. వీణలో కుండ ఆకారంలో గుండ్రంగ ఉండే భాగం. (కో.13)

కడియం : పర్యా. ముద్ది. వీణ కుండపై తీగలు అమర్చడానికి పెట్టిన లోహపు వలయం. చూ.చిత్రం-1.8. (కో.6)

చర్మవాద్యాల తయారీలో మూతలకి చుట్టూవున్న తొడుగు. చూ.చిత్రం-5-4; 6-4; 7-3; 8-4; 10-2; 11-1. (కో.7)

రాతిపనిలో విగ్రహాల కాళ్లకు చెక్కే ఆభరణం. (తె.6)

చేతులకు తొడుక్కునే ఒక ఆభరణం. (రా.2,8)

కడుగు : పర్యా. క్లీన్. మేకప్‌కు ముందు ముఖాన్ని నీటితో కడుక్కొను. (రా.8)

చిత్రలేఖనంలో బొమ్మ వేసే కాగితాన్ని నీటిలో కడుగు. (కో.2)

చిత్రలేఖనంలో ఆయిల్ కలర్ వేసింతరువాత బ్రష్‌కున్న రంగు వదలడానికి కిరసనాయిలుతో శుభ్రం చేయు. (కో.2)

కడుపు : పర్యా. పొట్ట. వీణ మధ్య భాగం. (కో.6)

మేకచర్మం కోయడంలో మొదలు పెట్టిన చోటు. (కో.7)

కడ్డీ : వీణ తయారీలో కరిగించిన లక్క వీణకు చెక్కిన డిజైన్‌లో సరిగ్గా పడడానికి వాడే ఇనుప ఊచ. (కో.6)

వీణకు మెట్లు చేయడానికి వాడే లోహపు కడ్డీ. (కో.7)

**కణవాదం** : తంబురా శ్రుతి ఆగకుండా రావడం. ఊలుముక్క బాగా మెలిపెట్టి నాలుగు తీగల కింద పెడితే ఏ అడ్డంకి లేకుండా శ్రుతి రావడమే కణవాదం. దీనినే తంబురా శ్రుతికి జీవం పెట్టడమంటారు. (కో.13)

**కంటిదృష్టి**: కనుచూపు. ప్రకృతిలోని నీడలనూ, దృశ్యాలనూ మనసులో పెట్టుకొని చిత్రలేఖనంలో రూపుదిద్దాలి. (కో.2)

**కంటిరెప్ప** : పర్యా. పురిమి. మేకప్‌లో నలుపు రంగు దిద్దే కంటి రెప్ప. (రా.13)

**కంటిసోగ** : పర్యా. సోగపురిమ. మేకప్‌లో నలుపు రంగు దిద్దే కంటిపురిమి. (రా.13)

**కంట్రోలు** : ఫిడేలు వాయించేటప్పుడు యస్వోల్స్ శబ్దం సమానంగా చేయడం. (కో.7)

**కంఠం** : వీణలో దండి చివరి భాగం. (కో.7)

నాగస్వరంతో పీకలు కట్టివున్న భాగం. (కో.7)

**కంఠమాల** : పర్యా. కంఠాభరణం, మెడగుండులు, కంఠ సూత్రం, గొలుసు, నక్లీసు. బుర్రకథ చెప్పేవారు మెడలో వేసుకొనే హారం. (తె.1)

రాతిపనిలో విగ్రహానికి మెడలో చెక్కిన ఆభరణం. (కో.31)

**కంఠసూత్రం** : పర్యా. కంఠమాల. రాతిపనిలో విగ్రహానికి మెడలో చెక్కిన ఆభరణం. (రా.8)

**కంఠాభరణం** : నాటకంలో కొన్ని పాత్రలకు మెడకు వేసే ఆభరణం. చూ. కంఠమాల. (రా.29)

**కండవా** : రూపా. కండువా, పర్యా, ఉత్తరీయం, పైపంచ. పంచకట్టు కున్నప్పుడు బుజంపై వేసుకొనే బట్ట. (కో.27)

**కండి** : ముఖవీణ ఊదడానికి ఉపయోగించే భాగం. ముందు భాగం కలపటానికి రాతితో చేసినకట్టు. (రా.10)

**కండించు** : డోలకు తయారీలో కర్రను డొల్లకొట్టి పేడు తీయు. (కో.5,7)

**కండ్లు** : మృదంగం తయారీలో వారు బిగించడానికి మూతల దగ్గర చేసిన రంధ్రాలు. (తె.2; రా.5)

**కత్తిరించు** : పర్యా. కట్‌చేయు. కత్తెరతో కోయు. (కో. 6,7, 16,28,30; తె.2,3,8,10,12,13,14; రా.2,5,11)

**కత్తిరిమీటు** : చూపుడు, నడిమివేళ్లతో వీణను వడిగా మీటడం. (కో.7)

**కత్రియహస్తం** : రాతిపనిలో శిలావిగ్రహానికి, రెండుమూడు వేళ్లు పైకిపెట్టి ఒకటి, నాలుగు, అయిదు వేళ్లు కిందకు మడిచిపెట్టి. చెక్కిన కుడిచేయి. (కో.19)

**కథలపటాలు** : అడుక్కునే వారు చెప్పే కథలకు సంబంధించిన పటాలు. (తె.9)

**కదిలిపోవు** : సిమెంట్ బొమ్మల తయారీలో పెట్టిన ఇనుప ఊసలు మోల్డింగులో ఊగిపోవు. (రా.13)

**కనకతార** : ఒకవొగ్గు కత. (తె.1)

**కనకాంబరం** : ఒక రకం పువ్వు. (రా.13)

**కనబడు** : చిత్రలేఖనంలో బొమ్మ బాగా కనబడడం.(రా.9)

**కనీకనిపించని** : చిత్రలేఖనంలో మొదట వేయదలచుకొన్న చిత్రాన్ని లైట్‌గా గీయడం. (రా.9)

**కనుబొమ** : కంటి పురిమ. అంబరు. (రా.5)

**కనుబొమలపైన చుక్కల తీర్పు** : నాటకాలలో ఒకరకమైన వేషానికి చేసే మేకప్‌లో భాగం. చూ.చిత్రం-27.8. (కో.4)

**కనుసు** : జింక ఆకారాన్ని పోలిన ఒక జంతువు. కణుజు. వీణ తయారీలో తాళం తీగల పిరికీలు ఈ జంతువు కొమ్ముతో చేస్తారు. (కో.13)

**కన్ను** : పర్యా. తొల్లు. రూపా. కన్నె. తబలాకు, డోలకుకు ఉండే మూతి. (కో.5,7)

ఉలి తయారీలోను, రాతిపనిలోను వాడేసుత్తి అడుగు భాగం. (తె.12; రా.5)

తబలాకు మూత చివర వాడిని (వారు) గజరాకు బిగించే రంధ్రం. (తె.3)

**కన్నుబ్బులు(బ)** : పర్యా. అంబరు. రాతిపనిలో విగ్రహానికి చెక్కే కనుబొమ్మలు. (రా.8)

**కనెక్షన్** : నాటకంలో స్టేజికి కింది భాగంలో ఎరుపులైటు పెడితే సరిగ్గా అదే భాగంలో పైనకూడ ఎరుపు లైటు పెట్టడం. (రా.13)

**కన్నె** : రూపా. కన్ను. తబలా, డోలకు మూతకి చుట్టు ఉండే చిల్లు. (కో.4)

**కందిబేడలు(బ)** : మృదంగం కరిణ పిండి తయారీలో చిటమ రాళ్లపొడిలో కలపడానికి వాడే కందిపప్పు బద్దలు. (రా.10)

**కందెవ** : పూర్వం మేకప్‌లో కనుబొమలకు వాడే నలుపురంగు. బండి ఇరుసుకు ఆముదం పూస్తే తిరగ్గా తిరగ్గా ఆముదం నల్లబడుతుంది. దీన్నే కందెన అంటారు. నలుపురంగుకు దీన్నివాడుతారు. (కో.29)

**కప్ప** : రాతిపనిలో విగ్రహాలకు శిలని పరీక్షించేటప్పుడు శిల మధ్యలో నీటితో బాటు బయటికి వచ్చే ఒక చిన్న జంతువు. (తె.6)

**కపాలహస్తం** : రాతిపనిలో విగ్రహానికి రెండు చేతులూ పైకిపెట్టినట్లు చెక్కడం. (కో.19)

**కప్పు** : పర్యా. మూత. పైభాగం. (కో.4,5,7,9,12; తె.1,12)

**కబంధం** : రాతిపనిలో ఏకతాళంలో చెక్కేది. (రా.5)

**కమర్షియల్ ఆర్ట్** : చిత్రలేఖనంలో పేర్లు, లేబిల్స్, డిజైన్స్ వేయడం. (కో.19)

**కమాన్** : రూపా. కమాను. పర్యా. బో, బౌ, విల్లు. ఫిడేలు వాయించడానికి విల్లు ఆకారంలో ఉన్న ఒక సాధనం. చూ.చిత్రం-3.8. (కో.7; రా.8)

**కమానీలు** : హార్మణీ పైభాగంలో ఉండే ఇనుప ఊచలు. (తె.3)

**కమీజు** : నాటకంలో రాజు వేషానికి పంచె మీద వేసే గుడ్డ. (కో.7)

**కంపాసు** : రూపా. కుంపాస. పర్యా. వృత్తలేఖిని. చిత్రలేఖనంలోను రాతి పనిలోను గుండ్రంగా గీయడానికి వాడే సాధనం. చూ.చిత్రం-32. (కో.13,19; తె.1; రా.8)

**కంప్లీటు**: పూర్తిగా. (Complete). (కో.3,7)

**కంపోజ్** : చిత్రలేఖనంలో కమర్షియల్ ఆర్ట్‌కు రాయటానికిచ్చిన అచ్చు కాగితం. (కో.19)

**కంబాక్సు** : డోలకు తయారీలో మూతకు చర్మం అంటి పెట్టి ఉండటానికి వాడే సాధనం. (రా.5)

**కరక్కాయ**: విగ్గుల తయారీలో జుట్టును నీటిలో నాన బెట్టేటప్పుడు నీటిలో వేసే ఒక రకం కాయ. (కో.7) రాతి పనిలో విగ్రహం నల్లగా కనబడటానికి కరక్కాయ, నల్లకాసు పూస్తారు. (కో.19,28) మృదంగం కరిణ తయారీలో వాడే ఒక రకం కాయ. (కో.31)

**కరక్కాయ పిరా** : కరక్కాయతోతయారైన నల్లరంగు ద్రవం. (కో.28)

**కరెక్టు** : రూపా. కరక్టు. కరెకుటు. Correct. సరిగ్గా. (కో.7; రా.5)

**కరగవేయు** : వీణ తయారీలో దండి పై భాగంలో అమర్చే మైనం చేసుకునేటప్పుడు తేనెమైనం, మసిగూడ, మంచి గుగ్గిలం, మెత్తగానూరి - ఈ మూడు మైనంలో కలిపి వేడి చేయు. (కో.6)

**కరచు** : కరిపించు. అంటుకోవడం, అతికించడం (కో.6, 32,42; రా.8,13)

**కరండ మకుటం**: రాతి పనిలో స్త్రీ విగ్రహానికి చెక్కే కిరీటం. (కో.3; రా.5)

**కరాజు కాగితం** : రూపా. కరాజు కాయితం; పర్యా. ఉప్పు కాయితం. సంగీత పరికరాల తయారీలో కొయ్యను నునుపు చెయ్యడానికి వాడే గరుకు కాగితం. (కో.5,7)

**కరిణ** : రూపా. కరిణి, కరణి, కరిణె, కర్ని. పర్యా. శాయి. ఘన వాయిద్యాలకు రెప్పపై ఉంటే నల్లటి భాగం. చూ.చిత్రం-5-3; 6-3; 8-3. (కో.5,7,37; రా.5,10)

**కరిణ పిండి** : పర్యా. శాయిపౌడర్, (తబల) శోరు. మృదంగం కుడి భాగాన ఉన్న కరిణకి పూయడానికి వాడే పిండి. (కో.5,7; రా.5)

**కరిణ రాయి** : కచ్చారాయి. మృదంగం కరిణమీద కరిణపిండి వేసి పైన రుద్దడానికి వాడే రాయి. (కో,7; రా.5)

**కరుణ** : నాటకంలో పాత్ర శోకనమయంలో కనబర్చే నటన. (రా.13)

**కర్ణాటక సంగీతం** : కర్ణాట దేశానికి సంబంధించిన సంగీతం. (కొ.39)

**కర్ణాటక మృదంగం** : మృదంగాలలో ఇదొక రకం. దీనికి చాట్ కింద 16 ఎలత బద్దలు (పుల్లల్ని) వేస్తారు. బోనంపుడికి గొడ్డుపోతు వారు వేస్తారు. ఈ పుల్లలు వేయడంతో ధ్వని మ్యావ్, మ్యావ్ అని వస్తుంది. (తె.2)

**కర్ని** : పర్యా. శాయి; చూ. కరిణ. (తి.2,3)

**కర్ని ఏసేరాయి** : పర్యా. గోట. కరిణరాయి. (త.2)

**కర్పూరతైలం** : రాతిపనితో శిల్పానికి పూసే ఒక రకంతైలం. (రా.1)

**కర్రముక్క** : మృదంగం తయారీలో మూతకి చుట్టు వారుకింద బిగించడానికి పెట్టే కొయ్యముక్క. (రా.5)

**కలం** : పర్యా. కుంచె, బ్రష్, బులుసు, పెన్ను, పేనా. చిత్రలేఖనంలో రంగులు వేయడానికి ఉపయోగించే కుంచె. (కో.40; తె.4,9; రా.13)

**కలర్(ఏయు)** : పర్యా. వర్ణం, వన్నె, రంగుధాతువు. రంగువేయు. (కో. 7,19; తె.1,4,5,7,9,11,12; రా.13)

**కలర్‌డిష్** : మేకప్‌లో రంగులు కలుపుకొనే పాత్ర. (రా.5)

**కలర్ మిక్సింగ్‌ప్లేట్** : చిత్రలేఖనంలో రంగులు కలిపే గుంటల ప్లేటు. (కో.25)

**కలర్‌స్కీము** : చిత్రలేఖనంలో ఇచ్చిన నమూనాలో ఉండే రంగుల కలయిక. (కో.19)

**కలశం** : మేకప్‌లో కృష్ణుడి పాత్రకు పెట్టే కిరీటానికి పైమన్న భాగం. (రా.8)

**కలిసిపోవడం** : తబలాకుపూసే స్పిరిట్ చేసేటప్పుడు స్పిరిట్‌లో లక్క వేస్తే కరిగిపోవడం. (తె.3)

**కలుపు** : చూ. కలదొక్కు. రెండు మూడు పదార్థాలను ఒకటిగ చేయడం. (కో.6,9,41,42; తె.12; రా.9)

**కల్యాణం బొట్టు** : మేకప్‌లో పెట్టే బొట్టు. చూ. చిత్రం-27.3. (కో.7)

**కళ్ళు(బ)** : తబలా, మృదంగం, డోలకు తయారీలో మూతలకి చివర. వారు బిగించడానికి చేసే చిల్లులు. (కో.5,7; రా.5)

**కవ** : పర్యా. శ్రుతి. మృదంగం ధ్వని సమంగా ఉండడం. (కో.7)

**కవచం** : సిమెంటు బొమ్మల తయారీలో బొమ్మలకి చెక్కే భుజకీరీటం. (కో. 28)

**కవరు (చేయు)** : (Cover). పౌరాణిక నాటకాల్లో పురుష పాత్రలు వెనుక పొడవుగ కట్టుకొనే బట్ట భుజాల నుంచి పాదాలవరకు కప్పి ఉండడం. (కో.7)

**కవాలీ** : ముస్లిం సాంప్రదాయక సంగీత రూపం. (తె.3)

**కవురు** : రాతిపనిలో విగ్రహం కిరీటానికి పైనుండే భాగం. (కో.31)

**కస్తూరి** : మేకప్‌లో బొట్టుకి వాడే సువాసన ద్రవ్యం. (రా.5) రాతి పనిలో విగ్రహం పూర్తయిన తరువాత పూసే తైలంలో కస్తూరి కలుపుతారు. (రా.8)

**కాగితం** : పర్యా. పేపరు. రూపా. కాయితం. (కో.7; తె,11; రా.8)

**కాటిక** : రూపా. కాటుక. కళ్ళకు పెట్టుకొనే నల్లగా మున్న మైనం. (కో.7,28; రా.5,8)

**కాటు(కొట్టు)** : పర్యా. గాటు, గుర్తు, మార్కు. సిమెంటు బొమ్మల పనిలో గుర్తుకి పెట్టుకునే గీత. (తె.10,12; రా.3,5)

**కాన్వాస్ బట్ట** : చిత్రాలు వేయడానికి ఉపయోగించే బట్ట. చూ.చిత్రం-29.2. (కో.3)

**కాపు** : అగ్గిసెగ. డప్పుకి తోలు వదులైతే బిగించడానికి వేడి చేయడం. (తె.2)

**కామరాతి** : వొగ్గు కథకులు చెప్పే బీరప్ప కథలో బీరప్ప భార్య. (తె.1)

**కామెడీ వేషం** : నాటకంలో హాస్యనటుడు వేసే వేషం. (కో.7)

**కాయ** : నాగస్వరంలో ఉబ్బెత్తుగా వృత్తాకారంలో నున్నభాగం. చూ.చిత్రం-18.3. (కో.4,5)

**కాయితం** : రూపా. కాయిదం, కాగితం, పేపరు. గరుకు కాగితం. (కో.29; తె.4,6,12; రా.4,7)

**కాయిల విగ్గు**: నాటకంలో రాజు పాత్రకు తల భాగంలో పెట్టే జుట్టు. (కో.7)

**కార్క్** : ఫ్లూట్ వాయించేటప్పుడు ఊదిన గాలి బయటకు రాకుండా చివర అడ్డుగా పెట్టేమూత. (కో.39)

**కార్డ్ బోర్డ్** : చిత్రలేఖనంలో వాడే దళసరి కాగితం. (కో.19) హార్మణీ తయారీలో గాలి తిత్తికి వాడే దళసరి కాగితం. (కో.39; రా.8)

**కార్బన్ పేపర్** : చిత్రలేఖనంలో బొమ్మల్ని అలాగే నకలు (ట్రేస్) తీయడానికి వాడే కాగితం. (కో.3)

**కారు** : సిమెంటు బొమ్మల తయారీలో బొమ్మ పొట్లి పోయినట్లవడం. (కో.38)

**కారెక్టర్** : నాటకంలో పాత్ర. (రా.5)

**కార్లెట్** : చిత్రలేఖనంలో వాడే కాషాయరంగు. (కో.3)

**కార్మైన్** : (Carmine). చిత్రలేఖనంలో టమాటో పండు రంగును పోలిన రంగు. (రా.9)

**కాలం** : పర్యా. లయ. (కో.7)

**కాలవ** : రూపా. కాలువ. వీణ దండికి పొడవునా గుంటగా ఉన్న భాగం. (రా.5)

**కాలినఇటిక** : సిమెంటు బొమ్మల తయారీలో ఇనప కడ్డీకి సిమెంటును అద్ది అంటించే ముక్క. (రా.13)

**కాలిన ముఖం** : ముఖం కాలినట్లు నాటకాల్లో ముఖానికి వేసే మేకప్. (కో.7)

**కాలుపౌండ్** : 1/4 పౌను సుత్తి. వీణ తయారీలో చిన్న చిన్న పనులకు దీన్ని ఉపయోగిస్తారు. (రా. 5)

**కాళ్ళకడెం** : పర్యా. కాళ్లవంకె. రాతిపనిలో విగ్రహం కాలికి చెక్కే ఆభరణం. (తె.6)

**కాళ్ళగజ్జె** : వొగ్గు కథ చెప్పేటప్పుడు శివం ఊగేటప్పటి వేషంలో కాళ్ళకు కట్టుకునే గజ్జె. (తె.1)
తోలుబొమ్మలాడించేటప్పుడు కాళ్ళకు కట్టుకునే గజ్జె. (రా.5)

**కావల్సిన మందం** : రాతి పనిలో శిల్పం కావల్సిన పరిమితిలో లావు చేయడం. (కో.33)

**కావి(రాయి)** : పర్యా. మణిశిలరాయి. ఎర్రగ ఉండే ఒక రాయి. రాతిపనిలో మొదట రాతి మీద బొమ్మ గీయడానికి వాడే ఎర్రరాయి. (కో.19)
గోడకు జేగురు రంగు వేయడానికి ఉపయోగించే రాయి. (కో.29)

**కాశపుల్ల** : మేకప్‌లో ముఖానికి నక్షత్రం, చంద్రుడు మొదలైన గుర్తులు వేయడానికి వాడే పుల్ల. (రా.13)

**కాశీకొబ్బరికాయ** : నాటకంలో కబీరు పాత్రధారి పట్టుకొనే చిప్ప. (కో.29)

**కాశీబోసి** : చీర కట్టులో ఒక రకం. (కో.29)

**కాశ్యప శిల్పం** : శిల్పశాస్త్రం. (కో.31)

**కాషాయరంగు** : పర్యా. గంగచందూరం. మేకప్‌లో వాడే రంగు. (కో.29)

**కాస్ట్లీ** : ఖరీదైన (costly). (కో.19,42; తె.3)

**కాస్త** : కొంచెం. (రా.13)

**కాస్ట్యూం** : మేకప్ దుస్తు. (కో.7)

**కింద** : అడుగు భాగం. శిల్పంలో కింది భాగం. (రా.5)

**కిందబల్ల** : ఫిడేలు ఆడుగు భాగం. (రా.5)

**కిందికితీను** తబలా గట్టాలను కిందికి కొట్టు. (తె.3)

**కిపాస్** : ఒక సంగీత పరికరం. దీన్ని టెంకాయతో చేస్తారు. చేత్తో పట్టుకొని ఊపితే చప్పుడు వస్తుంది. (రా.8)

**కిరసనాయిలు** : దీపాల్ని వెలిగించడానికి వాడే నూనె. (కో.19,27; రా.10)

చిత్రలేఖనంలో రంగులు వేసిన తరువాత కుంచెల్ని కడగడానికి వాడే చమురు. (కో.2)

**కిరీటధారణ** : నాటకంలో రాజు పాత్రధారి కిరీటం పెట్టుకోవడం. (కో.7)

**కిరీటం** : నాటకంలో రాజు వేషధారి తలపై పెట్టుకొనే ఆభరణ విశేషం. (కో.7,20,23,36,29,31; తె,6,12; రా,2,58)

**కిరీటమకుటం** : పర్యా. మకుట కిరీటం. రాతిపనిలో విష్ణు విగ్రహానికి చెక్కే కిరీటం. (కో.31)

**కిస్తీ** : హార్మనీలో ఒక భాగం. (తె.3)

**కీతబద్ద** : పర్యా. కీతపుల్ల, స్క్రేపర్. సిమెంటు బొమ్మల తయారీలో తుదిమెరుగులు దిద్దడానికి, కళ్లు, చెవులు మొదలైన చిన్నచిన్న భాగాలు చెక్కడానికి వాడే పనిముట్టు. (కో.1,3)

**కీర్తిముకుడిబుర్ర** : పర్యా. వీణబుర్ర. వీణ దండికున్న వంపు. (కో.13)

**కుంకుమ** : ముఖానికి బొట్టుగాపెట్టుకొనే రంగు పొడి. (తె.1)

**కుంకుమపూజ** : రాతిపని చేసేవారు ఉగాది రోజున పని చేయకుండా చేసిన విగ్రహాలకి స్నానం, అనుష్ఠానం చేసి, గాయత్రిపూజ చేసిన తరువాత చేసే కుంకుమతో చేసేపూజ. ఇది వారికి ముఖ్యమైన పండగ. (రా.5)

**కుచ్చు** : కుంచెకి చివరగ ఉండె గుబురుభాగం. (కో.19; రా.11)

**కుచ్చు** : (క్రి) పర్యా. గుచ్చు. చిత్రలేఖనంలో కాగితాన్ని బోర్డుకి సూదితో గుచ్చు. (తె.8)

**కుంచె** : చిత్రలేఖనంలో రంగులు వేయడానికి వాడే సాధనం. పుల్లలాగ ఉండే దీని చివర వెంట్రుకల కుచ్చు ఉంటుంది. చూ.కలం. చూ.చిత్రం-30. (రా.11,13; తె.1,9,11; కో.19,31,32,37)

**కుటుంబనియంత్రణ** : వొగ్గు కథకులు చెప్పే ఒక కథ.(తె.1)

**కుట్టు(కొను)** : ముడివిగ్గు తయారీలో విగ్గుకి ముడిని కుట్టడం. (కో.7)

మృదంగం తయారీలో మూతకి కడియం కుట్టడం. (కో.7)

**కుట్టుకుంట** : రూపా. కుట్టుకంట. మృదంగం, తబల మూతలకి కడియాలు కుట్టడానికి వాడే పనిముట్టు. చూ.చిత్రం.38. (కో.7)

**కుడతలు** : మృదంగం కరిణ చేసేటప్పుడు కరిణలో వచ్చే ముడతలు. (కో.7)

**కుడి** : తబలా, మృదంగం వాయిద్యాలలో కుడివైపున్న భాగం. (కో.7,37; రా.10)

**కుడికమ్ము** : డోలకు కుడిమూత. (కో.5)

**కుడిదిమ్మ** : తబలా తయారీలో వాడే తరిణ దొడ్డికి కుడి వైపున్న చెక్క. (కో.7)

**కుడిపాదం** : ఫిడేలు బ్రిడ్జిపై ఉండే భాగం. (రా.5)

**కుడిమూత** : పర్యా. కుడిముఖం. మృదంగం, డోలకులకు కుడివైపున్న భాగం. (కో.5,7)

**కుడిముఖం** : పర్యా. కుడిమూత. మృదంగం, డోలకులకు కుడివైపున్న భాగం. (రా.5)

**కుండ** : పర్యా. కడవ. తబలలోని కొయ్య భాగం. డగ్గలోని లోహభాగం. చూ.చిత్రం.1-13; తంబుర ఎడమ

వైపు గుండ్రంగా ఉన్న భాగం. చూ.చిత్రం-2.1; 23.1. (కో.6,13,24,37; తె.2,3; రా.5,13)

**కుండనలికం** : వీణతయారీలో కుండ కింద దండిని కలిపే చోటు. (కో.6)

**కుండమసరిచేయు** : తబలా తయారీలో కుండను చేయు. (తె.3)

**కుండలం** : నాటకాల్లో చెవులకి పెట్టుకొనే ఆభరణం. (కో.7,27,33; తె.6)

**కుండలి** : ధ్వని అధికంగా రావడానికి వీణలో పెట్టెలాగ ఉండే భాగం. దక్షిణదేశంలో తయారయ్యే వీణలో ఈ భాగం ఉంటుంది. చూ.కడవ. (కో.7)

**కుదర** : మాదిగ డప్పు (నగారా) తయారీలో చెక్కతో చేయబడిన చట్రం. (రా.10)

**కుంతలం** : రాతి పనిలో విగ్రహానికి చెక్కే వెంట్రుకలు. (రా.5)

**కుంది** : వీణకుండకు ఎదురుగా, ఎడమ కాలి మీద పెట్టుకోవడానికి వీలుగా అమర్చిన సొరకాయ పై భాగం కుంది. చూ.చిత్రం-1.2. (కో.24)

**కుందు ఉలి** : సంగీత పరికరాల తయారీలో వాడే పనిముట్టు చూ.చిత్రం-49. (కో.24)

**కుప్పిలి** : కుంచెకు చివర వెంట్రుకలు మార్చడానికి ఉపయోగించే గొట్టం. (తె.1)

**కుంపాస** : రూపా. కంపాస్. వీణ తయారీలో ముందు గీతలు గీసుకోవడానికి వాడే సాధనం. (కో.6)

**కురప** : పొట్టిగ ఉండటం. (కో.7,28)

**కురుంతసాన** : రాతి పనిలో విగ్రహానికి పెట్టే ఒకరకమైన సాన. (తె.6)

**కురుమ** : పర్యా. కావూసు. ఒక కులం. ఈ కులం వాళ్ళు వొగ్గు కథలు చెబుతారు. (తె.7)

**కురుమ దేవుని కథ**: గొల్లలు అడుక్కునేటప్పుడు చెప్పే కథ. (తె.7)

**కురుమోళ్ళు** : కురుమ కులం వాళ్ళు. చూ.కురుమ. (తె.1)

**కురువిందం** : రాతి పనిలో విగ్రహం సాపుగా రావడానికి వాడే రాయి. చూ.ఆకురాయి. (కో.19,28; రా.1)

**కురుసబొమ్మ** : రాతి పనిలో చేసే చిన్న విగ్రహం. (తె.6)

**కులదైవం** : రాతిపనిలో చెక్కిన ఒక కులానికి సంబంధించిన (దేవుడు) దైవ విగ్రహం. (కో.19)

**కూటుమీటు** : రంజనానికై వీణమీది నాలుగు తంతుల్ని చూపుడు, నడిమి, ఉంగరం వేళ్లతో ఒకేసారి మీటడం. (కో.7)

**కూనేపులి వాండ్లు** : పద్మశాలి వారిలో అడుక్కొని తింటూ వీరు మార్కండేయ పురాణం కథ చెబుతారు. (తె.9)

**కూపాస్** : చిత్ర లేఖనంలో ఇంకుతో వృత్తాలు గీయడానికి వాడే పనిముట్టు. (కో.19)

**కూర్చు** : డోలకు తయారీలో మూతను బిగించేటప్పుడు తాడుకు అరంగుళం ఇనుప రింగులు దోపు. (కో.5)

**కూర్చోపెట్టు** : రాతి పనిలో విగ్రహాన్ని సింహాసనంలో కూర్చోబెట్టు/నిలుపు. (తె.6)

**కూసం** : రాతి పనిలో పానవట్టంలో బిగించే శివలింగం అడుగు భాగం. (తె.6)

**కృష్ణశిల** : పర్యా. నల్లరాయి. రాతి పనిలో విగ్రహానికి వాడే నలుపురాయి. (రా.1)

**కెమేరా** : బొమ్మలను తీసే యంత్రం. (కో.12)

**కేదార** : యజ్ఞస్తంభానికి ఉపయోగించే కర్ర. (కో.7)

**కేన్వాస్** : చిత్ర లేఖనంలో ఆయిల్ పేయింటింగ్ చేయడానికి తీసుకొనే 'కార్డ్‌బోర్డ్'. (కో.2)

**కేమిల్ ఆయిల్ కలర్సు** : 'కేమిల్' అనే కంపెనీ తయారు చేసే తైలవర్ణాలు. (కో.2)

**కేయూరం** : రాతి పనిలో విగ్రహానికి చెక్కే దండ. (కో.31)

**కేల్‌కో** : హార్మణి తయారీలో వాడే గుడ్డ. (కో.39)

**కేశబంధం** : రాతి పనిలో బ్రహ్మ విగ్రహానికి చెక్కే కిరీటం. (కో.31)

**కేశం** : పర్యా. కుంతలం. (కో.19)

**కేశాంతరం** : శిలావిగ్రహం తలభాగం. (తె.6)

**కొక్కుచర్మం** : పందికొక్కు తోలు. చిత్రలేఖనంలో బొమ్మలు వేయడానికి వాడుతారు. దీని చర్మం మీద కూడా బొమ్మలు గీస్తారు. (రా.11)

**కొంకి** : రూపా. కొంకె, కొక్కి. తబల, డోలకు వారు వదులుగా ఉంటే బిగించడానికి వాడే పనిముట్టు. (రా.5)

**కొంగఈక** : ఒక పక్షి ఈక. మేకప్‌లో కిరీటానికి పెట్టే తురాయికి వాడే తెల్లటి ఈక. (కో.7,29)

**కొంగమూతి పట్కారు** : హార్మణి తయారీలో చెక్కమీద గుండ్రంగా గీయడానికి వాడే సాధనం. (కో.28)

**కొట్టం** : పర్యా. పర్ణశాల. నాటకంలో కనబర్చే పర్ణశాల. (రా.13)

**కొట్టు**: గీతలు గీయు, చెక్కు, గరుకు కాయితంతో నైసు చేయు, మట్టిని దంచు, నీరు చల్లు. (కో.3,4,5,6, 7,19,31,34,37,42; రా.3)

**కొట్టుకొచ్చు కొమ** : రాతి పని చేసే వారు రాళ్ళను కొట్టుకొని తెచ్చుకోవడం. (తె.6)

**కొడుపు** : మాదిగ డప్పు (నగారా) వాయించడానికి ఉపయోగించే లావుపుల్ల. (రా.10)

**కొప్పు** : రాతి పనిలో శివ విగ్రహానికి చెక్కే జుట్టుముడి. (తె.6)

**కొబ్బరి చిప్ప** : బరిణె ఆకారంలో ఉన్న ఎండిన కొబ్బరి టెంక. దీంట్లో రంగులు కలుపుతారు. కరిణపిండి చేయడానికి దీన్ని ఉపయోగిస్తారు. (కో.7; తె.4)

**కొబ్బరి నూనె** : పర్యా. టెంకాయ నూనె. కొబ్బరికాయ నుంచి తీసిననూనె. కాటుక తయారీలో దీనిని వాడుతారు. (కో.7; రా.5,8)

**కొబ్బరిపీచు** : కొబ్బరికాయనార. రాతిపనిలో విగ్రహం శుభ్రం చేయడానికి దీనిని వాడుతారు. (కో.19,18,35; రా.1)

**కొమ్ముకుచ్చు** : రాతిపనిలో నంది విగ్రహం కొమ్ముకి వేసే కుచ్చు. (తె.6)

**కొయ్య** : సంగీత పరికరాలు తయారుచేసే పనిముట్టు పెద్దకరవాయిలో ఒక భాగం. చూ.చిత్రం-66.1. (కో.31)

**కొయ్యకామ** : కంచు సుత్తి, కట్ల సుత్తెలలో చేతితో పట్టుకొన వీలుగా ఉండే భాగం. చూ.చిత్రం-60.1;61.1. (తె.10,12)

**కొయ్య చట్రం** : కంజీరలో ఇత్తడి తాళాలు బిగించి ఉన్న భాగం. చూ.చిత్రం-9.1. (కో.3,7; తె.1,3; రా.8)

**కొయ్యపిడి** : వీణ తయారీలో చిల్లులు వేయటానికి వాడే చరమాను పట్టుకొనే ఒక రకం పిడి. (రా.5)

**కొయ్య బిళ్ళ** : సంగీత పరికరమైన వీణలో శ్రుతిపూసల కిందుగా ఉన్న భాగం. చూ.చిత్రం-1.10. (కో.6,7, 13,24 ; రా.8)

**కొయ్యసుత్తి** : చెక్కతో చేసిన సుత్తి. చూ.చిత్రం-60-2. (కో.33)

**కొరడా** : వొగ్గు కథ చెప్పేవారు వేషం వేసుకొన్నప్పుడు చేతిలో పట్టుకొనే ఈరగోల. (తె.1)

**కొరడు** : పర్యా. సారకొరడు. రాతిపనిలో వాడే ఉలి తయారీలో కాల్చిన ఇనుప ఊసను పట్టుకునే పనిముట్టు. (రా.5)

**కొల(తీయు/పెట్టు)** : మృదంగం తయారీలో కొలత తీయు. (కో.7)

**కొలిపి** : రూపా. కొప్పెలి. కుంచెలో ఒక భాగం. చూ.చిత్రం-30.2. (రా.13)

**కొలుచు** : రాతిపనిలో శిల కొలతలు చూచు. (తె.6)

**కొవ్వు** : ఒక రకం మైనం. వీణ తయారీలో వీణ మెట్లు అతకడానికి వాడే మైనం. (తె.12; రా.5)

**కొస** : పర్యా. తల. చివరి భాగం. (కో.7; తె.6; రా.3,5)

**కొసకారు** : మృదంగం తయారీలో వారు బిగించడానికి వాడే

పనిముట్టు. చూ. కట్టింగ్ ప్లేర్. (కో.7)

**కోటింగ్ బ్రష్** : బొమ్మలకు రంగులు వేయడానికి వాడే కుంచె. (కో.27)

**కోటు** : నాటకంలో కొన్ని పాత్రలకు వేసే పొడుగు చేతుల చొక్కా. (కో.7,29)

**కోబాల్ట్ బ్లూ** : పర్యా. వస్సానంద. చిత్రలేఖనంలో వాడే లేత నీలి రంగు. (కో.3; రా.9)

**కోమ** : హార్మోణియంలో ఒక భాగం. (తె.3)

**కోరు** : పర్యా. తొలుచు, దొలుచు, లోడు. వీణ తయారీలో కుండని కాళీగ (గుల్లగ) చేయడం. (రా.5)

**కోల్డుక్రీం** : మేకప్‌లో రంగుల తయారీలోకి వాడే మైనం. (కో.7)

**క్యావ్‌వాస్ బట్ట** : చిత్రలేఖనంలో బొమ్మలు వేయడానికి వాడే బట్ట. (తె.1)

**క్రాప్** : నగారాకు వారు వంకరగా బిగించడం. (తె.2)

**క్లారివెట్** : సన్నాయిని పోలిన సంగీత వాయిద్యం. (కో.3)

**క్లిప్పు** : మేకప్ చేసేటప్పుడు వెంట్రుకలు ముఖం మీద పడకుండ జుట్టుకి తగిలించే పిన్ను. (రా.5)

**క్రీపేరు** : (Creep hair). రూపా. క్రీప్హైర్. నాటకంలో గడ్డం, మీసం, విగ్గుల తయారీకి వాడే వెంట్రుకలు. (కో.7; రా.5,8)

**క్రీము** : మేకప్‌లో రంగుల తయారీలో వాడే మీగడ లాంటి పదార్థం.. (కో.7)

**క్షీణచంద్రుడు** : (అమావాస్య రావటంతో) వీణలు తయారు చెయ్యని కాలం. (రా.5)

## ఖ

**ఖంజర్** : ఒక రకం సంగీత వాయిద్యం. (తె.2)

**ఖడక్(చేయు)** : బిగువు చేయు. (తె.2,3,7,9)

**ఖడ్గం** : ఒగ్గు కథ చెప్పేవారు గంగపీట కోసేటప్పుడు చదివే దండకం. (తె.1)

**ఖల్‌కష్** : సంగీత పరికరం. (తె.3)

**ఖతం** : రాతిపనిలో విగ్రహం పని పూర్తవడం. (తె.6)

**ఖాదీబట్ట** : ఖద్దరు బట్ట. చిత్రలేఖనంలో బొమ్మలు వేయడానికి వాడే బట్ట. (కో.29, తె.2)

## గ

**గంగ** : ఒగ్గు కథ చెప్పేవారు కథ ప్రారంభంలో ప్రార్థనచేసే ఒక దేవత. (తె.1)

రాతిపనిలో శివుని విగ్రహం చెక్కేటప్పుడు శివుని తలమీద చెక్కే భాగం. (తె.6)

**గంగసింధూరం** : రూపా. గంగ చందూరం. పర్యా. కాషాయ రంగు. మేకప్‌లో ఆంజనేయస్వామి వేషధారికి పూసే రంగు. (కో.29)

**గంగ జాతర** : గ్రామాల్లో జరిగే ఒక జాతర. (రా.27)

**గంగతెప్ప** : ఒగ్గు కథ చెప్పేవారు మల్లన్న పండగ రోజున సొప్పబెండ్లు కట్టుకొని దేవుని తీసుకొని నదిదగ్గరికి వెళ్లి తెప్పమీద జ్యోతి వెలిగిస్తారు. (తె.1)

**గచ్చకాయ** : ఒక చెట్టుకాయ. మృదంగానికి కరిణి పిండిరాసి పైన గచ్చకాయతో తోముతారు. (కో.4)

**గజర** : తబలా మూత చివర ఉండే అల్లిక. (తె.2,3)

**గజం** : పొడవును సూచించే కొలత. మూడు అడుగులు.(కో.4; తె.6,13; రా.10)

**గజ్జె** : పర్యా. మువ్వ. హరి కథ, బుర్ర కథ చెప్పేవారు కాళ్లకు కట్టుకునే మువ్వ. దీన్ని కంచుతో చేస్తారు. (కో. 3,7,15,37; తె.1,8,16; రా.2,10)

**గజ్జెల్లాగు** : ఒగ్గుకథలో సివం ఊగేప్పుడు వేసుకునే గజ్జెలున్న నిక్కరు. (తె.1)

**గంజి** : అన్నంవార్చగా వచ్చిన నీరు. చిత్రలేఖనంలో గుడ్డ కాగితంలాగ దళసరిగా ఉండటానికి బట్టను గంజిలో

ముంచి ఆరవేస్తారు. పిదప ఈ గుడ్డమీద బొమ్మ చిత్రిస్తారు. (తె.9)

**గట్ట(ఎక్కించు)** : దిమ్మె, చిట్టె, దిమ్మ. ఏక్వాడ్ (మరాఠీ భజన వాయిద్యం) శ్రుతి అమర్చుకోవడానికి వాదిలో పెట్టె కొయ్యముక్క. కొయ్యముక్కలు పెట్టడం. (తె.33)

**గట్టం కొట్టు** : డోలకు శ్రుతి చేయడానికి సుత్తితో గట్టని కొట్టు. (రా.5)

**గట్టి** : తబలపూడిలో ఒక భాగం. చూ.చిత్రం-6.6. (తె.3)

**గట్టితార్** : తబల అడుగు చుట్టలో ఉండే గట్టి తీగ. (తె.3)

**గడిచీర** : మేకప్‌లో స్త్రీ పాత్రకు కట్టే గళ్లగళ్ల చీర. (కో.29)

**గడ్డంమీద పచ్చబొట్టు** : నాటకాలలో పెట్టే ఒక రకం బొట్టు. చూ.చిత్రం-27.7. (కో.29)

**గడ్డిరంగు** : చిత్రలేఖనంలో పసుపు నీలి రంగులు కలిపితే వచ్చేరంగు. (కో.29)

**గడ్డుఉలి** : సంగీత పరికరాల తయారీలో వాడే పనిముట్టు. చూ.చిత్రం-48. (కో.5)

**గణపతి పూజ** : రాతిపనిలో శిల్పం చెక్కడానికి ముందు చేసే విఘ్నేశ్వరుని పూజ. (రా.5)

**గణపు** : రూపా. గెణిపు. నాగస్వరానికి వాడే కర్రకి ఉండే కణుపు. (కో.6)

**గంట** : పర్యా. కుంది. వీణకుండకు ఎదురుగా ఎడమకాలి మీద పెట్టుకోడానికి వీలుగా అమర్చిన సొరకాయ. దీనిపై భాగం గంట లేదా కుండి. చూ.చిత్రం-1-2. (కో.4)

నాగస్వరంలో పీక కిందుగా ఉండే భాగం. చూ.చిత్రం-18.2; రాతిపనిలో నంది విగ్రహం మెడ కింద చెక్కిన మువ్వ. (తె.6)

**గంటమార్కు** : చిత్రలేఖనంలో రంగులు తయారుచేసే ఒక కంపెనీ పేరు. (కో.3)

**గంటశబ్దం** : రాతిపనిలో శిలని పరిశీలించేటప్పుడు వచ్చే శబ్దం. ఈ గంట శబ్దంగాని, 'ఓం' శబ్దంగాని వచ్చిన శిల విగ్రహానికి పనికి వస్తుంది. (కో.19)

**గద** : నాటకంలో పౌరాణిక పాత్రలు యుద్ధ సమయంలో చేతిలో పట్టుకొనే ఒకరకం ఆయుధం. (కో.7,29; రా.8)

**గదకట్టు కర్ర** : గదని పట్టుకొనే పిడి భాగం. (కో.29)

**గద్దరంగు** : చిత్రలేఖనంలో నలుపు, ఎరుపు, పసుపు, పచ్చ, మెరూన్ రంగుల కలయికతో తయారయ్యే రంగు. (తె.1)

**గద్దె** : తబలా కుండ అడుగు భాగం. (తె.27)

**గంధం** : పర్యా. చందనం. మేకప్‌లో రాజు మొదలైన పాత్రలకి పెట్టే బొట్టు. (రా.5)

**గనిరాయి** : తబల, మృదంగం, కరిణ పిండి తయారీలో వాడే ఒకరాయి. (కో.7)

**గన్** : రూపా. గన్ను. రాతిపనిలో శిలను పగల గొట్టడానికి, ఉలి తయారీలో ఇనుప కంబీని ముక్కలు చేయడానికి వాడే పనిముట్టు. (రా.5)

**గం** : పర్యా. జిగురు, గోందు, బంక. (కో.7,34 ; తె.13; రా.5)

**గమకం** : వీణను లాగి వాయించడం. (రా.5)

**గమ్మున** : త్వరగా. (కో.15)

**గాయత్రిపూజ** : రాతిపనిలో శిల్పం చెక్కడం ప్రారంభించే టప్పుడు చేసే పూజ. (తె.6)

**గర్భగుడి** : పర్యా. గర్భగృహం. దేవాలయంలో మూల విగ్రహాన్ని ఉంచే ప్రదేశం. (కో.33; తె.6,12; రా.1)

**గర్భపచ్చి** : పర్యా. గర్భనెంబు. వీణ తయారీలో వాడే దుంగ లోపలి భాగంలో ఉండే తడి. (కో.13)

**గరుకుకాయితం** : పర్యా. మెరుక్కాయితం, ఉప్పుకాయితం, సాండ్ పేపర్, సైన్ కాయితం. (కో.9,16,27)

**గలీజు** : మేకప్‌లో వాడే అభ్రకం పొడిచేసి నీటిలో వేసి కడిగినప్పుడు వచ్చే దుమ్ము. చూ.దుమ్ము. (రా.8)

**గలుగాకు** : సన్నాయి పీకల తయారీకి వాడే ఒక ఆకు. (కో.36)

**గళం** : రాతి పనిలో విగ్రహం కంఠభాగం. (రా.5)

**గవ్వలదరిశన** : వొగ్గు కథ చేప్పేవారు దేవునిపెయి మీదకు తెప్పించినప్పటి వేషంలో మెడలో వేసుకొనే ఒక రకం దండ. (తె.1)

**గవ్వసంచి** : గవ్వలతో చేసిన సంచి. చూ.చిత్రం-20. (రా.3)

**గాజుప్పు** : జింకతోలుని శుభ్రం చేయడానికి వాడే పదార్థం. (రా.11)

**గాజురాళ్ళు** : నాటకాల్లో వేసే కోటుకి పెట్టిన చమ్కీరాళ్లు. (కో.29)

**గాజురూపం** : చిత్రలేఖనంలో గుండ్రంగా గీయడం. (తె.1)

**గాడి** : హార్మోనియంలో ఒక భాగం. చూ.చిత్రం-4.5. (కో.6)

**గాడికల** : వీణతయారీలో వాడే కొలిమిలో భాగం. (కో.6)

**గాండిపహస్తం** : రాతిపనిలో విగ్రహానికి కేశాలతో సమానంగా చేతులు పెట్టినట్లు చెక్కడం. (క్షేత్ర సమాప్రోక్తం) (కో.19)

**గాత్రం** : నోటితో పాడడం. (కో. 39)

**గాంధీ టోపి** : మేకప్‌లో పెట్టే ఖద్దరు టోపీ. (కో.29)

**గాయకుడు** : గాత్రంతో పాడే వాడు. (కో.7)

**గాయత్రి** : రూపా. గావిత్రి. శిలా విగ్రహాలకి చెక్కే జంధ్యం. (కో.19; రా.2)

**గాలరీ** : నాటకంలో వేసే స్టేజికి పైభాగంలో తెల్లగుడ్డ కట్టిన భాగం. (రా.13)

**గాలి(తగలడం)** : హార్మోణియంలో తిత్తిని నొక్కినపుడు వచ్చిన గాలి. (కో.39)

**గాలితిత్తి** : పర్యా. బెల్లూస్, ఫ్యాను. హార్మోణియంలో శబ్దం రావడానికి గాలినిచ్చే తిత్తి. చూ.చిత్రం-4.3. (కో.7,39; రా.8)

**గాలిపోత** : నాగస్వరం నోటిలో పెట్టుకొని ఊదడం. (కో.7)

**గాలిబుడగ** : చిత్రలేఖనంలో కాగితాన్ని నీటితో తడిపినప్పుడు వచ్చే బుడగ. (కో.19)

**గాలిబెజ్జాలు** : హార్మోణియంలో గాలి పోవటానికి ఉన్న బెజ్జాలు. చూ.చిత్రం-4.10. (కో.7)

**గాలివాయిద్యం** : గాలిపోత వల్ల పలికే వాయిద్యం. నాగస్వరం, సన్నాయి మొదలైనవి. (కో.7; రా.5)

**గాలిస్టాక్** : హార్మోణియంలో గాలిని నిలవ ఉంచడం. (కో.28)

**గింజ** : మృదంగం కరిణిని రుద్దడానికి వాడే గచ్చకాయ. (కో.37)

**గిన్నె** : సన్నాయి, శ్రుతి వాయిద్యాల చివరగ ఉన్న గుండ్రటి భాగం. చూ.చిత్రం-17.2; 16.5. (కో.36)

**గిరజాలు** : మేకప్‌లో వేసుకొనే విగ్గుకి వెనకాల జుట్టు రింగులు రింగులు చుట్టి ఉండటం. (కో.29; రా.5)

**గిరాకి** : అమ్మకం ఎక్కువగా ఉండడం. (కో.13,14; తె.1)

**గిరి** : రాతిపనివారు శిలను తెచ్చుకొనే కొండప్రాంతం. (కో.19)

**గిరిజనబొట్టు** : నాటకాలలో పెట్టే ఒక రకం బొట్టు. చూ.చిత్రం-27.6. (కో.14)

**గిరిమీదగిరి** : రక్త శిల దొరికే ప్రదేశం. (కో.19)

**గీకు** : మేకప్‌లో ముఖానికి పూసిన రంగును గోకు. (రా.5)

**గీతం** : పాట. (తె.1)

**గీతలు** : వీణ, తంబురలలో ఉండే గీరలు. చూ.చిత్రం-1.14; 2.7. (కో.5)

**గీయు** : చిత్రలేఖనంలో బొమ్మల్ని వేయు. (కో.6,19,41)

**గుంగురు** : శిలా నందిమెడలోని పెద్దగజ్జె. మెడమువ్వ. (తె.6)

**గుంచి** : వొగ్గుకథలో వాడే ఒక పరికరం. చూ.చిత్రం-15. (తె.1)

**గుచ్చు** : చిత్రలేఖనంలో కాగితాన్ని బోర్డుకి సూదితో తగిలించు. (కో.19; రా.10)

**గుజారణ(అయిపోవు)** : రాతిపనిలో చెక్కనం పని పూర్తికావడం. (తె.6)

**గుజ్జు** : రూపా. గుజురు. వీణ తయారీలో వాడే సొరకాయ లోపల ఉండే మెత్తటి పదార్థం. (రా.5)

**గుంజు(కొట్టు)** : తబలా తయారీలో వాడే తోలుని సాగదీయు. (తె.3)

**గుటుక** : కంజీర తయారీలో చింతగింజల గుజ్జును ఉడక బెట్టడానికి వాడే చిన్నకుండ. (కో.7)

**గుడ్డ** : పర్యా. బట్ట, వస్త్రం. చూ. క్లాతు. (కో.3,4,6,7,41; తె,3,9)

**గుడ్డముక్క** : రాతిపనిలో విగ్రహానికి కరక్కాయ ? గా పూయడానికి వాడేబట్ట. (కో.28)

**గుడ్డసావ** : మెటల్ బఫ్ చేసేసాన. వీణతయారీలో వీణకుండే సొరకాయ పైభాగం - గంటకు మెరుగు పెట్టే సాధనం. (కో.13)

**గుడ్లుగుడ్లు** : మేకప్‌లో వాడే కాటుక తయారీలో దీపంపొగని అద్దంమీదకు పట్టే పద్ధతి. (కో.7)

**గుండు** : రాతిపనిలో చెక్కడానికి ముందు గుండ్రంగా ఉన్న రాయి. (తె.6; రా.5)

**గుండు ఆకురాయి** : రాతిపనిలో విగ్రహం గుండ్రని భాగాలు నునుపు చేయడానికి వాడే రౌండు ఆకురాయి. చూ.చిత్రం-53. (తె.6)

**గుండుదాగలి** : సంగీత వాయిద్యాల తయారీలో గుండ్రంగా చేసిన ఎదురు బద్ద. (కో.5)

**గుండుపూజ** : రాతిపనిలో విగ్రహం కిరీటానికి చెక్కే గుండుసున్నా డిజైన్. (తె.6)

**గుంత** : పర్యా. గుంట. రాతిపనిలో కళ్లు మొదలైనవి చేసేటప్పుడు చెక్కిన గుంట. (కో.31)

**గువ్వగచ్చు** : ముసాంబరం, అవిశనూనె, గుగ్గిలం మూటినీ ఉడికించగా తయారైన పదార్థం. దీనిని చిత్రలేఖనంలో బంగారు రంగుకి వాడుతారు. (తె.1)

**గుబురు** : మేకప్‌లో కిరీటానికి దట్టంగా కట్టిన ఈకలు. (రా.8)

**గుమ్మటేకు** : పర్యా. గుమ్మడి కర్ర. సంగీత పరికరాలకి వాడే కొయ్య. (కో.7,16; తె.3)

**గుమ్మడిమీసం** : మేకప్‌లో పుట్టే ఒక రకం మీసం. చూ.చిత్రం-26.7. (కో.7)

**గుంపెన** : తబలా కుండకు వాడే కొయ్య. (తె.2)

**గుర్రం** : పర్యా. బ్రిడ్జి. ఫిడేలుకి ఉండే బ్రిడ్జి. చూ.చిత్రం-3.4. (రా.5)

**గుర్రపుజూలు** : చిత్రలేఖనంలో కుంచెల తయారీకి వాడే గుర్రపు వెంట్రుకలు. (కో.17)

**గుర్రపువెంట్రుక** : ఫిడేలు కమాను చేయడానికి వాడే గుర్రపు వెంట్రుక. (కో.19)

**గురిగింజ** : పర్యా. గురివింద గింజ. మృదంగం కరిణ తయారీలో చిటిమిరాళ్ల పొడికి ఈ గింజలు రుబ్బి రెంటినీ మిశ్రమం చేస్తారు. (రా.10)

**గురుకులం** : పూర్వం విద్య నేర్పే స్థలం. (రా.8)

**గురువు** : కురుమ కులంవారికి ఒగ్గు కథకులు గురువులు. (తె.1)

**గుర్తు** : చిత్రలేఖనంలో ముందు ఆనవాలు గీసుకోవడం. (కో.6; తె.2; రా.5,13)

**గుల్ల** : పర్యా. డొల్ల. మృదంగం, డోలకు తయారీలో మొదట చేసుకొనే కొయ్య చట్రం. (కో.5,7)

**గుల్లకొట్టు** : వీణతయారీలో కుండలోపల డొల్ల చేయు. (కో.13)

**గుల్లబలం** : మృదంగం చట్రం గట్టిగా ఉండడం. (కో.7)

**గుల్లముక్క** : మృదంగం చట్రం. (కో.7)

**గులాబి** : పర్యా. రోజా, చిలక గులాబి. ఒక రంగు. (కో.26,32; తె.1,4)

**గువ్వ :** పర్యా. కచ్చి. పూర్వం తెల్లరంగు తయారీకి వాడే నత్తగుల్ల. (తె.1,4)

**గువ్వలపొడి :** నత్తగుల్లల పొడి. (తె.4)

**గెణిపు :** రూపా. గణుపు, కణుపు. ఫ్లూటు తయారీలో వాడే వెదురు గడకు అక్కడక్కడ ఉన్న ముడులు. (కో.39)

**గేదె చరమం :** మృదంగం, డోలకు మూతల తయారీకి వాడే గేదె తోలు. ఈ తోలుతో అడ్డవారు కూడా చేస్తారు. (కో.12)

**గేరుమీసం :** మేకప్‌లో రాజుకు పెట్టే మీసం. (రా.5)

**గొంగడి :** గొర్రెబొచ్చుతో నేసిన వస్త్రం. వొగ్గు కథ చెప్పేవారు గొంగడిలో బియ్యం, కొబ్బరికాయ, పువ్వులు, జోతులు వేసి అందులో శూలంపెడ్తారు. దీన్నే సివసానం అంటారు. (తె.1)

**గొంగళిపీచు :** మేకప్‌లో మీసాలకి వాడే చిరిగిన గొంగళి భాగం. (రా.5)

**గొట్టం :** సన్నాయి, శ్రుతి మొదలైన వాయిద్యాల్లో సన్నగా పొడవుగా ఉన్న బోలు భాగం. (కో.36)

**గొడ్డు చర్మం :** మృదంగం వారు తయారీకి వాడే గేదె తోలు. (తె.2)

**గొర్రెబొచ్చు :** పర్యా. గొర్రె వెంట్రుకలు. మేకప్‌లో మీసాలు, గడ్డాలు తయారీకి వాడే గొర్రె వెంట్రుకలు. (కో.7)

**గొర్రెనరం :** ఫిడేలు తయారీలో తంతులకు వాడే గొర్రె నరం. (కో.5)

**గొల :** ? మృదంగం. (కో.7)

**గొల్లేసం :** వొగ్గు కథ చెప్పేవారు వేసే గొల్లవేషం. (తె.1)

**గోట :** పర్యా. నున్నటి రాయి, రాయి. తబలా తయారీలో శాయిపెట్టే నున్నటి రాయి. (తె.2,3)

**గోటు :** ఒక సంగీత వాయిద్యం. (కో.7)

**గోటుమీటు :** వీణమీద విడివిడిగా పడే మీటు. (కో.7)

**గోటువాయిద్యం :** ఒక సంగీత వాయిద్యం. చూ. గోటు. (రా.5)

**గోడ :** ఇటుకలతో ఎత్తుగా కట్టిన భాగం. డ్రామా పరదాల తయారీలో బట్టను గోడకు బిగువుగ సీలల్తో కొడతారు. (తె.2). వీణ దండికి ఉండే పక్క అంచు. (రా.5) చిత్రలేఖనంలో బొమ్మలు వేయడానికి అనువుగా ఉన్న గోడ. (రా.11)

**గోడబాజు :** మృదంగం కన్నుల దగ్గరి భాగం. (కో.7)

**గోందు :** జిగురు. (తె.1,2,9)

**గోధుమరంగు :** (brown colour) బెల్లం రంగు. బొమ్మలకు వేసే రంగు. (కో.25,30)

**గోరుఉలి :** రూపా. గోరులి. పర్యా. చిన్న ఉలి. సన్నాయి కొయ్యని తరిమెనపట్టడానికి వాడే పనిముట్టు. (కో.36) తబల, మృదంగం, డోలకు, వీణ తయారీలో కుండను డొల్లగ చేయడానికి వాడే పనిముట్టు. చూ.చిత్రం-47;50. (కో.5,7,24,28)

**గోరుమోటాఉలి :** వీణ తయారీలో కుండను డొల్లగ చేయడానికి వాడే పరికరం. (కో.6)

**గోర్టుపైపు :** ఒక రకం (వాయులీనం). సంగీత వాయిద్యం. (కో.7)

**గోరోచన :** రాతిపనిలో శిల్పంపైన పూసే తైలమిశ్రమం. ఇది పూయడం వలన ఆకారం బాగా నదరుగ కనబడుతుంది. (రా.8)

**గోల్డ్‌కలర్ :** పర్యా. బంగారం రంగు, మాంబళం. బొమ్మలకు వేసే బంగారు రంగు. (కో.34,41; తె.1)

**గోల్‌ఆకురాయి :** తబలా, డోలక్, ఏక్వాడ్ మొదలైన సంగీత వాయిద్యాల తయారీలో గుండ్రని భాగాలను సాపు చేయడానికి వాడే పనిముట్టు. (తె.3)

**గోళీచేయు :** వీణ తయారీలో కొయ్యను కోసేటప్పుడు దిమ్మను పక్కకు తిప్పు. (కో.6)

గౌను : బుర్రకథ చెప్పేవారు మోకాళ్ల దిగే వరకు వేసుకొనే వస్త్రం. (తె.1)

గ్రాఫ్ (పేపరు) : బొమ్మలు గీయడానికి వాడే కాగితం. (తె.4,11)

గ్రాఫైట్ : చిత్రలేఖనంలో వాడే పొడిగా ఉండే తెలుపురంగు. (కో.3)

గ్రాస్పింగ్ పవర్ : చిత్రలేఖనంలో వాడే సిల్కుగుడ్డకు గల రంగుపీల్చుకొనే ఆకర్షణ శక్తి. (తె.1)

గ్రీజు : మేకప్‌లో ముఖానికి పూసుకునే ఒకరకం క్రీము. (రా.5,11; కో.3,7)

గ్రీన్‌పెయింట్ : చిత్రలేఖనంలో వేసే పచ్చరంగు. (కమర్షియల్ ఆర్ట్‌లో (house decoration) గదికి ఈ పెయింట్‌ని ప్లాస్టర్ ఆఫ్ పారిస్‌తో కలిపి వేస్తారు.) (కో.3)

గ్రేకలర్ : మేకప్‌లో ముసలిపాత్ర వేషధారుల మీసాలకు పూసే రంగు. (కో.7)

గ్రేవర్ : రాతిపనిలో శిల్పం కళ్లు, ముక్కు, చెవులు మొదలైనవి చెక్కడానికి వాడే పరికరం. (కో.3)

గ్రేవిగ్గు : మేకప్‌లో ముసలి వేషానికి తలకు పెట్టే కృత్రిమ వెంట్రుకలు. (కో.7)

గ్రైండింగ్‌స్టోన్ : రాతిపనిలో శిల్పం నునుపు చేయడానికి వాడే సాధనం. (రా.8)

గ్రౌండ్‌ప్రిపేర్ : చిత్రలేఖనంలో బొమ్మ వేయడానికి వాడే బట్టను సరిగ తయారు చేసుకోవడం. పోర్ట్రైట్ పెయింటింగ్ పద్ధతిలో తెల్లబట్టని స్ట్రెక్చర్ ఫ్రేంకి బిగించి బట్ట బాగా తెల్లగ బిరుసుగా రావడానికి ప్లేవైట్ పౌడర్, లిన్సీడ్ ఆయిల్ కలిపి మరిగించిన మిశ్రమాన్ని కొద్దిగ వేడిగా ఉన్నపుడు బ్రష్‌తో బట్టకు పూసి ఎండబెట్టాలి. దీనినే గ్రౌండ్‌ప్రిపేర్ అంటారు. (కో.3)

గ్లిజరిన్ : మేకప్‌లో రంగుల్లో కలపడానికి వాడే ద్రవం. (కో.7)

గ్లూ : పర్యా. జిగురు. పాలిష్‌లో లక్క, రూమమస్తకి వేస్తే కరగగా వచ్చినదే జిగురు. హార్మోణియం తయారీలో మెట్లపై సెలవైట్ ఈ జిగురుతోనే అంటిస్తారు. (రా.8)

## ఘ

ఘంట(వాదం) : రాతిపనిలో శిలను పరీక్ష చేసేటప్పుడు పురుష శిలయందు వచ్చే శబ్దం. (రా.8)

ఘవాదులు : పర్యా. శివసత్తులు. సివం ఊగేవాళ్లు. (తె.1)

## చ

చక్కీలు : కంజీరాలో ధ్వని రావడానికి పెట్టిన భాగాలు. (కో.7)

చక్రపిడి : వీణ తయారీలో చిల్లులు వేయడానికి వాడే చరమంలో ఉండే ఒక భాగం. (రా.5)

చక్రం : వీణ తయారీలో కొలిమిలో గాలిరావడానికి తిప్పే ఆకారం. (కో.6)

చడావు : పర్యా. పాదరక్షలు. నాటకంలో చెప్పులుగా వాడేది. (కో.7)

చతురస్రం : పర్యా. చతురం. రాతిపనిలో శిల్పానికి చెక్కే డిజైన్. (తె.6)

చదరం : వీణకు బ్రిడ్జిపైన అతికించిన కంచు ముక్క. (కో.7). తబలా తయారీలో వాడే నలుపలకల తోలుముక్క. చూ. చతురస్రం. (రా.5)

చదరంబ్రష్ : చిత్రలేఖనంలో రంగులు వేయడానికి వాడే చదరంగా ఉన్న కుంచె. (రా.11)

చదుము : ఫిడేలు కుండే చెక్క నునుపు దనం. (కో.7)

చదుము చేయు : హార్మోణియం తయారీలో చెక్కను నునుపు చేయు. (కో.39)

చప్పవీర : పర్యా. సన్నవీర. రాతిపనిలో శిల్పానికి చెక్కే యజ్ఞోపవీతం. (రా.8)

**చందవ కుంకుమ** : నాటకాలలో పెట్టే ఒక రకం బొట్టు. చూ.చిత్రం-27.16. (కో.7)

**చందనం** : పర్యా. గంధం. కొయ్యశిల్పాలకి, సంగీత పరికరాలకి వాడే కొయ్య. (కో.7,37,38; రా.4,5). మేకప్‌లో బొట్టుగా వాడే గంధం. (కో.7)

**చందూరం** : బొమ్మలకి వేసే సింధూరం రంగు. (తె.1; రా.5)

**చంద్రవంకబొట్టు** : మేకప్‌లో కొందరికి పెట్టే బొట్టు. (కో.7)

**చంద్రస్** : స్పిరిట్ పాలిష్‌లో ఉపయోగించే ఒక పదార్థం. (తె.3)

**చప్పకొయ్య** : తబల, మృదంగాల చట్రం తయారీకి వాడే అద్దకు మూరల్లో బింకానికి పెట్టే కర్రముక్క. (కో.7)

**చమత్కృతి** : బుర్రకథలో చెప్పే హాస్యం పుట్టించే మాటలు. (తె.1)

**చమరీమృగం** : రూపా. చమ్రీమృగం. మేకప్‌లో విగ్గుల తయారీకి ఈ జంతువు వెంట్రుకలు ఉపయోగిస్తారు. (కో.7)

**చమికీగుండ** : మేకప్‌లో ముఖానికి మెరుపుకోసం పూసే చమికీ పొడి. (కో.3)

**చమ్కీకోటు** : మేకప్‌లో రాజుపాత్రలకి వేసే కోటు. మెరుపు కోసం చమికీ బిళ్లలతో చేస్తారు. (కో.7)

**చమ్కీగుడ్డ** : చమ్కీబిళ్లలు కుట్టిన గుడ్డ. పౌరాణిక నాటకాల్లో పాత్రధారులు వెనుకభాగాన కట్టుకొనే వస్త్రం. (కో.7)

**చర్మపుతాడు** : మృదంగం బిగించడానికి వాడే వారు. (రా.5)

**చర్మశుద్ధి** : సంగీత వాయిద్యాల తయారీలో తోలుని శుభ్రం చేయడం. (తె.2)

**చర్మసాధని** : ఒక లయ వాయిద్యం. (కో.7)

**చర్తీదరువు** : వొగ్గుకథ చెప్పేటపుడు కోపభావ ప్రకటనలో వాయించే దరువు. (తె.1)

**చర్తీచిందు** : వొగ్గు కథ చెప్పేవారు చర్తీదరువు వాయించే టప్పుడు వేసే చిందు. (తె.1)

**చల్లారు** : వేడిగ ఉన్నది చల్లగ కావడం. (కో.1,6; రా.11)

**చాక్‌పొడి** : పర్యా. చాక్‌పౌడరు, సుద్దపొడి, సీమసున్నం పొడి. చిత్రలేఖనంలో కార్డుబోర్డు మీద గుర్తు గీసుకోవడానికి వాడే తెల్లటి సుద్దముక్క. (తె.1)

**చాట్** : తబలామూతలోని బర్రె చర్మం భాగం. (తె.2,3)

**చాట** : ముత్తరాసి కులంవాళ్లు అడుక్కునేటప్పుడు బొమ్మల్ని పెట్టుకునేందుకు వెదురుతో అల్లిన ఒక రకం తట్ట. (తె.7)

**చాటింపు** : కావలి సిద్దులు కథ చెప్పేముందు కథ చెప్పబోతున్నట్లు ఊర్లోవారందరికి తెలియజెప్పడం. (తె.7)

**చావం** : రూపా. శానాం, శానం, సేర్నం, సేనం, చీర్నం. రాతిపనిలో శిల్పం తుదిమెరుగులు దిద్దడానికి వాడే పనిముట్టు. (రా.1)

**చాపు** : మృదంగం కుడిమూతలోని పైపొర. (రా.5)

**చాబీలు** : హార్మోణియం మెట్లపై నుండే సన్నని తీగలు. (తె.3)

**చార్‌పౌన్‌సుత్తి** : శిల్పం, సిమెంటు పనిలో వాడే నాలుగు పౌనుల బరువు గల సుత్తి. (తె.6)

**చాళుక్య** : రాతి విగ్రహాల తయారీలో ఒక రకం శిల్పం. (రా.8)

**చిటికలు** : పర్యా. చిరతలు. నారదుని చేతిలో ఉండే ఒక సంగీత పరికరం. (రా.8)

**చిటికి** : మాదిగడప్పు వాయించడానికి వాడే పుల్లల్లో సన్నపుల్ల. (రా.10)

**చిటికెనవేలు** : వీణవాయించేటప్పుడు తాళం తీగలను మీటే చేతిచివర నున్న చిన్నవేలు. (రా.5)

**చిటిమరాళ్ళు :** మృదంగం కరిణ తయారీకి వాడే ఒక రకం రాళ్ళు. (రా.10)

**చిట్టె :** పర్యా. గట్ట. మృదంగం వారు బిగించడానికి వాడే కొయ్యముక్క. (తె.2)
దూగోడాలో భాగం. (తె.13)
డోల్‌కి శ్రుతి కోసం పెట్టే చిన్న కట్టెముక్క. (తె.3)

**చిట్టెముపొడి :** మృదంగం కరిణ తయారీకి వాడే పొడి. (కో.37)

**చిత్రకళ :** బొమ్మలు గీయడం. చిత్రలేఖనం. (రా.11)

**చిత్రకారుడు :** పర్యా. ఆర్టిస్టు. బొమ్మలు వేసేవాడు. (కో.2; తె.9)

**చిత్రం :** బొమ్మ. (కో.19)

**చిత్రలేఖవకాగితం :** (drawing paper). బొమ్మలు వేయడానికి కుపయోగించే కాగితం. (కో.19)

**చిత్రలేఖవం :** బొమ్మలు గీయడం. చూ.చిత్రం-29. (కో.3)

**చిత్రవీణ :** పర్యా. చిత్ర. వీణలో ఒక రకం. దీని కుండ లోపలి భాగంలో రెండు పలకలు అమర్చి ఉంటాయి. దీనికి 24 మెట్లు ఉంటాయి. (కో.13,28)

**చిత్రించు :** బొమ్మలు వేయు. (రా.9)

**చివమాదిగోళ్ళు :** పాండవు లోల్లు. కథలు చెప్పే భిక్షకులు. (తె.7)

**చిన్న ఆరె :** సంగీత పరికరాల తయారీలో వాడే పనిముట్టు. చూ.చిత్రం-34. (కో.7)

**చిన్నతాపీ :** బొమ్మల తయారీలో ముక్కు, చెవులు, కళ్ళు మొదలైనవి చెక్కడానికి వాడే పనిముట్టు. (కో.27)

**చిన్నతాళం :** వొగ్గు చెప్పేటప్పుడు చేతుల్తో వాయించే వాయిద్యం. చూ.చిత్రం-13. (తె.1)

**చిన్నదబ్బసీర్నం :** పర్యా. చిన్న శేనం. రాతిపనిలో శిల్పం సాపు చేయడానికి వాడే పనిముట్టు. (తె.6)

**చిన్నసామసుత్తి :** రాతిపనిలో వాడే చిన్న రకం సుత్తి. (రా.5)

**చిన్నమేకు :** పర్యా. పూచిక మేకు. చిత్రలేఖనంలో డిజైన్ వేసిన గుడ్డకు కిందపైన కట్టే రోల్సుని కొట్టడానికి వాడే చీల. (తె.1)

**చిన్నశావం :** రూపా. చిన్న శేనం. పర్యా. చిన్న దబ్బ సీర్నం. రాతిపనిలో విగ్రహాన్ని సున్నితంగా చెక్కడానికి వాడే పనిముట్టు. (తె.6; కో.28)

**చిన్నపలగ :** పర్యా. సన్నఉలి. రాతి విగ్రహాల తయారీలో చిన్న చిన్న ఉరువులు చెక్కడానికి వాడే పనిముట్టు. (తె.6)

**చిన్నసుత్తె :** శిల్పం తయారీలో తేలికపనులు చేసేటప్పుడు వాడే బరువు తక్కువగ ఉన్న సుత్తి. (కో.7; తె.1,6,15; రా.5)

**చిన్నశ్రుతిహార్మోణియం :** పర్యా. శ్రుతిపెట్టె. తక్కువ ధ్వని గల హార్మోణియం. కర్ణాటక సంగీతంలో గాత్రానికి, ఇతర సంగీత కచేరీలకు వాడే హార్మోణియం. (కో.5,7)

**చింతాకుమొన :** చివర సన్నగ ఉన్న ఉలి. రాతిపనిలో శిల్పం సున్నితభాగాలు చెక్కడానికి వాడే చిన్నఉలి. (రా.5)

**చిన్నాల్ :** వీణకు వేసే లేత నేరేడు పండు రంగు. (కో.7)

**చిప్‌డీలు :** కంజీరాలోని ఇత్తడి బిళ్లలు. (తె.3)

**చిలకరంగు :** నీలం రంగు. రాతిపనిలో విగ్రహం చెక్కడానికి ముందు విగ్రహం ఆకారం శిలమీద వేయడానికి వాడే రంగు. (రా.1)

**చిల్‌రెస్టు :** (Chin rest ?). సంగీత వాయిద్యమైన వయొలిన్‌లో ఒక భాగం చూ.చిత్రం-3.6. (కో.7)

**చీర :** స్త్రీలు కట్టుకొనే వస్త్రం. (కో.29)

**చీర్నం :** పర్యా. శీనం. తబలా తయారీలో వారు బిగించే టప్పుడు వాడే పనిముట్టు. చూ. గోరుగల్. (రా.5)

**చీలమండపాదం :** పర్యా. పాదసర. రాతి విగ్రహాల తయారీలో పాదానికి పై భాగం. (తె.6)

**చుక్క :** మేకప్‌లో ముఖం అందంగా కనబడడానికి చంద్రుడు, నక్షత్రం ఆకారంలో పెట్టే బొట్టు. (రా.8)

చిత్రలేఖనంలో పెట్టుకొనే గుర్తు. (తె.1; రా.9)

రాతిపనిలో శిలపై బొమ్మ చెక్కేటప్పుడు వేసిన గుర్తు. (తె.2)

**చుక్కపుల్ల :** పర్యా. సూపుమొల, సుక్కమొల. మేకప్‌లో ముఖానికి చంద్రుడు, నక్షత్రం మొదలైన చుక్కలు వేయడానికి వాడేపుల్ల. (రా.8)

**చుట్ట :** తబలా అడుగు భాగం. (తె.3)

**చుట్టకుదురు :** ముడివిగ్గు చేసేటప్పుడు వెంట్రుకల్ని చుట్టడానికి వాడే పరికరం. (కో.7)

**చుట్టు :** మృదంగం మూతకి వారు చుట్టు. (కో.7)

వీణకు ప్లాస్టిక్ షీటు చుట్టే అంచుభాగం. (కో.6)

సిమెంటు బొమ్మల తయారీలో ఇనుప ఊసకి తీగని చుట్టు. (కో.3)

**చుట్టుకొలత :** విగ్గు తయారీలో తలకి చుట్టూ చూసే కొలత. (కో.7)

**చుట్టుములిక :** చిత్రలేఖనంలో కార్డ్‌బోర్డుకి కాగితం అంటుకొని ఉండటానికి వాడే ఒక రకం పిన్ను. (కో.27)

**చుబుకాంతం :** రాతిపనిలో చెక్కే శిల్పం ముఖంలో గడ్డం చివరి భాగం. (రా.5)

**చూపుడువేలు :** మేకప్‌లో ముఖానికి పూసే గ్రీజు తీయడానికి వాడే వేలు. (కో.7)

**చెక్కతోమెట్లు :** హార్మోణియంలో కావలసిన శబ్దం తరంగాలుగా రావడానికి చెక్కతో తయారుచేసిన భాగాలు. ఇవి హార్మోనియం పైఫ్రేము భాగంలో అమర్చి ఉంటాయి. (కో.28)

**చెక్కవం :** పర్యా. శెకనం, చెకనం. లోహం రేకు మీద శిల్పాన్ని చెక్కడం. (తె.6,12)

**చెక్కపీడి :** కుంచెను పట్టుకునేటందుకు చెక్కతో చేసిన కుంచె వెనుక భాగం. చూ.చిత్రం-30.1; (కో.23; రా.13)

'పెద్ద ఆరె'లో ఒక భాగం; చూ.చిత్రం-33.1. (కో.27)

**చెక్కఫ్రేం :** చెక్కతో చేసిన చట్రం. (రా.13)

**చెక్కు :** పర్యా. తరిణపట్టు, తిరుగుడు పట్టు. రాతిపనిలో డిజైనులు చెక్కడం. (కో.1,3,6,19,23,31,37,41; తె.49; రా.1,4,10)

**చెడ్డీ :** పర్యా. లాగు. మేకప్‌లో ఆంజనేయ పాత్రధారికి వేసే లాగు. (కో.7)

**చెండు :** గుడ్డలో చుట్టిన దూదిమూట. దీంతో హార్మోణియం కు పాలిష్ చేస్తారు. (కో.39)

**చెస్నీ :** 'గజరల' రంధ్రాలు చేయడానికి వాడే సాధనం. (తె.3)

**చెమ్కీపని :** మేకప్‌లో వాడే బట్టలకు చెమ్కీ బిళ్లలు కుట్టడం. (కో.29)

**చెంపకోర :** పర్యా. తమ్మె. మేకప్‌లో చెవుల దగ్గర చెంపకు పెట్టే జుట్టు. (రా.8)

**చెమ్మ :** వీణకు వాడే కొయ్య తడిగా ఉండడం. (రా.5)

**చెవులు :** తబలా, డోలకు మూతలకు కరిణ చేసేటప్పుడు వచ్చే దుమ్ము. (రా.5)

**చెస్ట్ :** పర్యా. ఛాతీ, రొమ్ము. రాతిపనిలో విగ్రహానికి చెక్కే గుండె భాగం. (రా.8)

**చెస్ట్‌కోటు :** మేకప్‌లో చొక్కామీద రాజు పాత్రధారికి తొడిగే అంగరఖా. (కో.7)

**చేతిపెట్టె :** కచేరీలలో శ్రుతికోసం వాయించే చిన్న హార్మోణియం. (రా.8)

**చేతిరింగు :** మేకప్‌లో ముంజేతికి వేసుకొనే కడియం. (రా.8)

**చేయు :** పనిచేయు. (కో.31,34,41; రా.1)

**చేవ :** వీణ తయారీకి వాడే కొయ్య బాగా ముదిరి ఉండడం. (రా.5)

**చైత్రశుద్ధపంచమి :** బ్రహ్మంగారి కథ చెప్పే రోజు. (తె.6)

**చైనీస్‌చార్కోల్ :** చిత్రలేఖనంలో బొమ్మ గీయడానికి వాడే ఒక రకం రంగు పెన్సిలు. పోర్ట్రైట్ పెయింటింగ్‌కి ముందు బ్రౌన్‌పేపరుమీద ఈ చార్కోల్‌తో స్కెచ్ వేస్తారు. (కో.3)

## ఛ

**ఛక్‌చక్‌మను :** రాతిపనిలో శిలని పరీక్ష చేసేటప్పుడు వచ్చే నిప్పు. (తె.6)

**ఛత్రికారం :** రాతి శిల్పం తయారీలో శివలింగంపై భాగం. (కో.31)

**ఛే యించ్ డై మీటర్ :** భజనల్లో వాడే ఒక రకం తబలా మూతికొలత. ఆరంగుళాల వ్యాసార్థం. (తె.3)

## జ

**జగ్గు :** బుడబుక్కల వాళ్లు, వొగ్గువాళ్లు వాడే ఒక రకం సంగీత వాయిద్యం. దీనిని మధ్యలో పెట్టుకొని ఊపితే బుడబుడ శబ్దం వస్తుంది. చూ.చిత్రం-10. (తె.1,2)

**జంగం :** ఒక కులం. (కో.19; తె.1)

**జంగులు :** వొగ్గు కథ చెప్పేటప్పుడు పక్కవారు వేళ్లకు తగిలించుకొని చప్పుడు చేసే ఒక రకం వాయిద్యం. (తె.1)

**జంఘం :** పర్యా. జంటు, మోకాలు. రాతిపనిలో చెక్కే శిల్పం పాదం పై భాగం. (కో.19)

**జంజవారం :** పర్యా. యజ్ఞోపవీతం. జందెం. (రా.8)

**జటామకుటం :** రాతిపనిలో శివునికి చెక్కే కిరీటం. (కో.31)

**జటామండలం :** రాతిపనిలో భైరవునికి చెక్కే కిరీటం. (కో.31)

**జడ :** విగ్గుల తయారీలో అల్లిన జుట్టు. (కో.7)

**జంటవాగులు :** రాతిపనిలో రెండు పాములను కలిపి చెక్కడం. (కో.33)

**జంటు :** చూ. జంఘం. రాతిపనిలో శిల్పానికి చెక్కే మోకాలు మడత భాగం. (రా.8)

**జత (చేయు) :** నాగస్వరం కంఠానికి పైభాగంలో రెల్లుతో చేసిన పీకను కలపడం. (కో.7)

**జతులు :** సంగీతంలో స్వరాలు. (రా.5)

**జంత్రం :** చిత్రలేఖనంలో బొమ్మల్ని కర్రలకి పెట్టేటప్పుడు కర్రని గుండ్రంగా చేయడానికి వాడే సాధనం. (తె.1)

**జపాన్‌సైను :** జపాన్‌లో తయారైన ఒక రకం బట్ట. (కో.29)

**జమాయించు :** కుంచె తయారీలో చివరన పెట్టే వెంట్రుకల్ని దగ్గరికి చేర్చడం. (తె.4)

**జరుగు :** చిత్రలేఖనంలో ఆయిల్ పెయింట్ సమానంగా అంటడం. (కో.2)

**జలతరంగిణి :** ఒక రకం సంగీత వాయిద్యం. పింగాణి కప్పుల్ని నీటితో నింపి ఒక గట్టి పుల్లతో వాయించడం. (కో.7)

**జలతారుపని :** మేకప్‌లో బట్టలకు జలతారు కుట్టడం. (కో.29)

**జల్లి :** సిమెంటు బొమ్మల తయారీలో వాడే 'వైట్‌క్లే' దంచి జల్లెడ పట్టడం. (కో.38)

**జల్లుగ :** మేకప్‌లో ముఖానికి అభ్రకం పూయడానికి వాడే చిల్లులు చిల్లులుగా ఉండే బట్ట. (రా.8)

**జవ్వరంపం :** సంగీత పరికరాల తయారీలో వాడే రంపం. చూ.చిత్రం-58. (కో.5,7)

**జాగా :** రాతిపనిలో శిల్పానికి ఖాళీ ఉండే ప్రదేశం. (తె.6)

**జాజిచెక్క :** హార్మోనియం తయారీకి వాడే కొయ్య (కో.39; రా.8)

**జాజిరంగు :** రూపా. జాజు రంగు; పర్యా. ఎర్ర మట్టి రంగు చిత్రలేఖనంలో వాడే ఎర్ర రంగు. (తె.1)

**జాజు :** రాతిపనిలో రాతిమీద గీతలు గీసే రాయి. (తె.6

**జాజుగీత :** రాతిపనిలో రాయిమీద గీసే గీత. (తె.6)

**జాతి** : శిల్పంలో రకం. (రా.8)

**జాతి ఉలి** : సంగీత పరికరాల తయారీలో వాడే ఒక రకం పనిముట్టు. మృదంగం, డోలకు తయారీలో కర్రను సాపుచేసే సాధనం. చూ.చిత్రం-39. (కో.7)

**జాన** : చేతి ప్రమాణం. (కో.5,7; తె.12)

**జానపదం** : బుర్రకథకులు చెప్పే జనపదానికి సంబంధించిన కథ. (తె.1)

**జాను** : రాతిపనిలో శిల్పానికి చెక్కే తొడ మొదలు భాగం. (కో.19; రా.8)

**జాంబవంతుని కథ** : మాదిగవారిలో డక్కలోళ్లు చెప్పే కథ. (తె.9)

**జాలరీ** : కంజరాలో చుట్టూ ధ్వని రావడానికి పెట్టిన రేకులు. చూ.చిత్రం-23.5. (రా.8)

**జాలార్లు** : రాతిపనిలో శిల్పానికి భుజం మీద చెక్కే ఆభరణాలు. (తె.6)

**జాలీమా** : ముస్లింలు నమాజు సమయంలో పరచుకొనే గుడ్డ. (తె.4)

**జాలీమారంగు** : ముస్లింలు నమాజు సమయంలో పరచుకొనే గుడ్డ రంగు. (తె.4)

**జిక్లాంపు** : వయొలిన్ తయారీలో కొయ్యను కదలకుండా గట్టిగా పట్టుకొని ఉంచడానికి వాడే సాధనం. (రా.5)

**జిగి** : పర్యా. తడలు, మెరుపు. చిత్రలేఖనంలో వాడే తెలుపు రంగుకి కోడిగుడ్డు లోని పచ్చసొన (yolk) కలిపితే వచ్చే మెరుపు. (కో.19)

**జిగురు** : పర్యా. గోందు. వస్తువుల్ని అతికించడానికి వాడే బంక. చూ. కట్టెవజ్రం. (కో.17,19,41; తె.1,4; రా.8,11,13)

**జింక్‌పౌడర్** : చిత్రలేఖనంలో బొమ్మకి వాటర్ కలర్స్ వేసే ముందు దానికి పూసే ఒక రకం పొడి. దీనికి వాసన ఉండదు. (రా.11)

**జింక్‌వైట్** : చిత్రలేఖనంలో బొమ్మకి ఆయిల్ కలర్స్ వేసేముందు బొమ్మకి పూసే ఒక రకం పేస్ట్. దీనికి వాసన ఉంటుంది. (రా.11)

**జింకచర్మం** : చిత్రలేఖనంలో బొమ్మలు వేయడానికి వాడే తోలు. (రా.11)

**జింకుఆక్సైడ్** : మేకప్‌లో ఉపయోగించే పౌడరు. (కో.7)

**జిట్టరేగు** : సంగీత పరికరాల తయారీలో వాడే ఒక రకం కొయ్య. (తె.3)

**జిడ్డు** : మేకప్‌లో ముఖం బంకగ ఉండడం. (కో.7)

**జివురుట** : చిత్రలేఖనంలో రంగులు వేసే కుంచెల తయారీలో ఈతపుల్లని నైసుగ చేయడం. (రా.11)

**జివ్వరేఖలు (బ)** : రూపా. జీవరేఖలు. రాతిపనిలో శిల్పానికి చెక్కే కళ్లు, చెవులు, ముక్కు మొదలైనవి. (రా.5)

**జీరాడు** : మేకప్‌లో వేషధారికి కట్టిన వస్త్రం నేలకు రాసుకొంటూ ఉండటం. (కో.29)

**జీవరేఖ** : రాతిపనిలో శిల్పానికి జీవరేఖలు చెక్కే సాధనం. (రా.1)

**జీవంపెట్టు** : తంబురాకి శ్రుతి పెట్టడం. (కో.13)

**జీవాలి** : తంబురా బ్రిడ్జిమీద తీగకు తీగకు మధ్య ఉండే సిల్కు లేదా ఉన్ని దారాలు. (రా.5)

**జుట్టు** : పర్యా. బొచ్చు. తలకు ఉండే వెంట్రుకలు. (తె.1; రా.5)

**జులువ తాలం** : వాగ్గ కథలో కోపం ఉన్నప్పుడు, రాజులు అడవులు, కొండలు, గుర్రాలు దాటి పోతున్నపుడు వాయించే వాద్యపద్ధతి. (తె.1)

**జూల్‌లేసు** : అందం కోసం వీణకు జూలుమాదిరిగ కట్టిన లేసు దారాలు. (కో.24)

**జేగురు** : చిత్రలేఖనంలో, మేకప్‌లో వాడే ఎరుపు రంగు. (కో.19,29)

**జేబురుమాల** : బుర్రకథలో ప్రధాన కథకుడు వేలికి

కట్టుకునే చేతిగుడ్డ. (కో.20,22)

**జొనుపుబడు** : నాగస్వరానికి చివర రీడును దూర్చటం. (రా.5)

**జోతులు** : రూపా. జ్యోతులు. సివసానంలో పిండిలో నూనె వేసి పెట్టే దీపాలు. (తె.1)

**జ్ఞానహస్తం** : రాతిపనిలో శిల్పానికి బొటనవేలును చూపుడు వేలును కలిపి పట్టుకొని మిగిలిన మూడు వేళ్లను నిలబెట్టినట్లు చెక్కిన కుడిచేయి. (కో.19)

## ట

**టంగ్** : హార్మోణీ రీడ్‌లో ఒక భాగం. (కో.39)

**టర్న్‌స్క్రూ** : తబలా తయారీలో వాడే పనిముట్టు. (కో.7)

**టర్బన్** : పర్యా. టోపీ. మేకప్‌లో అలగ్జాండర్ తలపాగా. (కో.7)

**టర్పెంటయిల్** : పర్యా. టర్పెంట్ ఆయిల్. తైలవర్ణ చిత్రలేఖనంలో ముదురు రంగు కావాలంటే కలిపే ఒక రకం నూనె. (కో.1)

**టప్సర్‌సిల్క్** : ఒక రకం సిల్కు. చిత్రలేఖనంలో ఈ రకం సిల్కును వాడతారు. (తె.1)

**టాంక్** : చూ. చట్రం. హార్మోణీలో గాలి నిలవ ఉండే భాగం. (కో.28)

**టానింగ్** : తబలాపనిలో చర్మాన్ని శుద్ధి చేయడం. (తె.2)

**టాపు** : పర్యా. కుండమూత. వీణకుండే పై భాగం. చూ. చిత్రం-1.11. (కో.13,24)

**టింకటరు** : వీణ తయారీలో ఉప్పు కాయితం కత్తిరించటానికి, రేకులు కత్తిరించడానికి వాడే పనిముట్టు. (రా.5)

**టిష్యూపేపర్** : మేకప్‌లో ముఖం కాలినట్లుగా చూపడానికి వాడే కాగితం. (కో.1)

**టీస్క్వేర్** : చిత్రలేఖనంలో గీతలు గీయడానికి వాడే సాధనం. (కో.19)

**టూత్‌బ్రష్** : మేకప్‌లో జుట్టునెరిసినట్టు కనబడటానికి లైటు జింకు పౌడరు రాయడానికి వాడే బ్రష్. (కో.1)

**టెంట్** : వొగ్గు కథ చెప్పేటప్పుడు స్టేజ్‌పైన వేసే గుడ్డ. (తె.1)

**టెంప్రో** : చిత్రలేఖనంలో తెలుపురంగును మిగిలిన ఏ రంగులోనైనా కలిపితే ఏర్పడేది. (కో.19)

**టెయిలుపీసు** : ఫిడేలు తీగలు తగిలించడానికి పై భాగంలో ఉన్నది. చూ.చిత్రం-3.5. (కో.5)

**టేకు** : హార్మోణియం తయారీకి వాడే కొయ్య. (కో.7,19,24,28,29,34,36,41)

**టేడరుసైలు** : సంగీత పరికరాల తయారీలో వాడే పనిముట్టు. చూ.చిత్రం-52. (తె.1,3,4,13; రా.4,6,8)

**టైట్** : చిత్రలేఖనంలో గుడ్డపై బొమ్మ వేసేటప్పుడు గుడ్డని బిగుతుగా కట్టడం. (కో.3)

తబలా తయారీలో తోలును శుభ్రం చేసేటప్పుడు తోలుని బిగుతుగా పెట్టడం. (తె.3)

డోలకు వారును బిగుతు చేయడం. (రా.5)

**టోపీ** : పర్యా. టర్బన్. తలపై పెట్టుకొనే టర్బన్. (కో.7)

**ట్రిపుల్ హార్మోణియం** : మూడు రీడ్స్‌గల హార్మోణియం. (కో.39)

**ట్యూనింగ్** : హార్మణీ సరిగా పలకడం. (కో.39)

**ట్రేస్** : చిత్రలేఖనంలో బొమ్మ అడుగున కాగితం పెట్టి, పైన పెన్సిలుతో దిద్ది అదే బొమ్మను అడుగు కాగితం మీద పడేటట్లు చేయడం. (కో.19)

**ట్రేస్‌పేపర్** : పర్యా. ఉలిపిరి కాగితం. పల్చని పారదర్శకమైన కాగితం. (కో.19)

**ట్రైకలర్** : నీలము, పసుపు, ఎరుపు - ఈ మూడు రంగులని కలిపి పిలిచే పేరు. (కో.2)

## డ

**డక్కలివారు** : మాలవారిలో కథలు చెప్పి అడుక్కునేవారు. (తె.9)

ఫలో వాడే ఒక సంగీత పరికరం.
11. (తె.1,2)

ిగ్గు. తబలాకు ఎడమ పక్కన వాయించే
త పరికరం. (తె.2,3)

వాయిద్యం. (తె.27)

ుం : రెండు రీడ్స్‌గల హార్మోణియం.

ıble lead)-డబల్ హార్మోణియం. దీనికి
ూగాని మెట్లు ఉంటాయి. (కో.7)

ా. డమరం, ఢమరుకం. రాతిపనిలో
టరాజుకి చెక్కే చేతిలోని వాయిద్యం.
6; రా.5)

్రమ్స్. సంగీత వాయిద్యం. (తె.2)

వడ్డాణం. మేకప్‌లో వేసుకొనే ఒడ్డాణం.
ర పెట్టుకొనే ఒక ఆభరణం. (రా.8)

ుదురు రంగు. (కో.3,7)

ుదురుచాయ. (తె.1)

ులో, చిత్రలేఖనంలోను చేసే నగిషీ.
,13,16,19-21,25,29,31,33,41,42;
-14; రా.2,3,4,7,8)

చెక్కే నగిషీ పని. (కో.6)

త్రలేఖనంలో బొమ్మను వేయడానికి వాడే
.1)

హార్మోణీ తయారీలో కావల్సిన విధంగా
ేసే రంపం. (కో.28)

ుయిద్యం. దీనికి తోలు మీద వారుపెట్టరు.
ూసి ఒక చేత్తో కొడితే చప్పుడొస్తుంది.
ున చిట్టెలు కడతారు. (కో.28)

ఖనంలో కొలతలు చూచుకోవడానికి వాడే
(కో.19)

వీణ తయారీలో షేపు తీయడానికి పనికొచ్చే సాధనం. (కో.5)

**డిష్** : చిత్రలేఖనంలో రంగులు కలుపుకొనే పాత్ర. (కో.19)

**డీప్ కోటింగ్** : చిత్రలేఖనంలో రంగు దళసరిగ వేయడం. (కో.2)

**డెకరేషన్** : అలంకరణ. (తె.1; రా.4)

**డైమీటర్** : తబలా మూత వ్యాసార్థం. (తె.2)

**డొలుపు** : డబల్ డోలక్ తయారీలో కొయ్య లోపలి భాగం చెక్కడం. (కో.5,7)

**డొల్ల** : సంగీత పరికరాలైన వీణ, మృదంగం,డోలకు, తబల - వీటి తయారీలో లోపల గుల్లగ చేయడం. (కో.5,7,25,28; తె.13)

**డోరియా** : వీణ తయారీలో కుండకు చుట్టు గీసిన గీతలు. (కో.6,13)

**డోలక్** : సంగీత వాయిద్యం. (కో.3,5,7,13; తె.2; రా.5)

**డోలహస్తం** : రాతిపనిలో నటరాజ విగ్రహం చెక్కేటప్పుడు దించినట్లు చెక్కిన చెయి. (.31)

**డోలు** : సంగీత వాయిద్యం. ఒగ్గు కథలో వాడతారు. చూ.చిత్రం-7. (కో.7; తె.1,9)

**డోలుదెబ్బ** : ఒగ్గుకథలో డోలుని వాయించడం. (తె.1)

**డోలుసిర్ర** : పర్యా. సిర్ర. డోలుని వాయించే కర్ర. (తె.1)

**డ్రామా** : నాటకం. (కో.7; తె.2,12)

**డ్రామ డ్రెస్‌లు** : నాటకాలకు కావాల్సిన వస్త్ర సామగ్రి. (కో.29)

**డ్రామాపరదా** : నాటకాల్లో దృశ్యాల కోసం వాడే పరదాలు. (తె.2)

**డ్రామావాళ్ళు** : నాటకాలు వేసేవాళ్లు. (తె.2)

## త

**తగడ** : డోలకు కరిణ గీకడానికి వాడే రేకు పరికరం. (రా.5)

**తగిన** : రాతిపనిలో శిల్పానికి 'సరయిన' శిల. (రా.5)

**తగ్గుపంచమం** : వీణను వాయించడానికి ఉండే నాలుగు తంతుల్లో ఒకదాని పేరు. 28 వ నెంబరు డిక్కుతంతి. (రా.5)

**తగ్గుశ్రుతి** : మృదంగంలో ఒక రకం. (రా.5)

**తంజావూరు మేళం** : పర్యా. పెరియ మేళం. నాగస్వరం, ఒత్తు, తవిలు, తాలం కలిపి వాయించడం. (రా.5)

**తట్టు** : రాతిపనిలో నంది విగ్రహం మీద చెక్కే బట్ట. దీనిమీదనే నాగబంధం, గజ్జల పేర్లు చెక్కుతారు. (తె.6)

మృదంగం, డోలకు మొదలగు వాటిని చేత్తో వాయించడం. (కో.7)

**తడమీటు** : వీణమీద త్రిశజతిలో మూడవ అక్షరాన్ని నడిమివేలితో మీటడం. (కో.7)

**తడుపు** : రూపా. తడవు; పర్యా. తడిచేయు. చిత్రలేఖనంలో కాగితాన్ని నీటితో తడపడం. (కో.19; రా.9)

మోల్డింగ్ చేసేటప్పుడు మట్టి ఎండిపోకుండ కాగితాన్ని తడిపి అంటించడం. (కో.7)

**తంటపం** : మృదంగం తాలూకు రెప్పలు తీయడానికి వాడే సాధనం. (కో.7)

**తవాయింపు** : పర్యా. టైట్. తబలా మూతికి వాడే మేక తోలుని శుభ్రం చేసేటప్పుడు చర్మాని బిగుతు చేయడం. (తె.2)

**తంతి** : పర్యా. తీగ,తివ్వ, వైరు. వీణ, ఫిడేలు - వీటిని వాయించడానికి ఉండే తీగ. (కో.7; రా.5)

**తంత్రీవాయిద్యం** : పర్యా. తంత్రసాధని, తంత్రుల కదలికచే ధ్వనివచ్చే సంగీత పరికరం. వీణ, ఫిడేలు మొదలైనవి. (కో.7; రా.5)

**తప్పడ** : చిత్రలేఖనంలో వాడే కొన్ని బ్రష్‌ల చివరి భాగం వెడల్పుగ ఉండడం. ముఖ్యంగా ఆయిల్ కలర్స్ బ్రష్ పొడవుగా ఉండి చివర (flat) తప్పడగ ఉంటుంది. (కో.2;రా.9)

**తప్పేల** : చిత్రలేఖనంలో ఒక మనిషి చేతిలో మధ్యాహ్నం అన్నం తీసుకు వెళ్లే పాత్ర. (కో.2)

**తబలా** : రూ. తబ్లా. ఒక రకం సంగీత వాయిద్యం. చూ.చిత్రం-5. (కో.7; తె.2,3; రా.5)

**తబలాకమ్మ** : తబలామూత. (కో.7)

**తబలాకుడి** : తబలాసెట్‌లో కుడిచేత్తో వాయించే తబలా. (రా.8)

**తబలాకుండ** : తబలాలోని కొయ్య భాగం. (తె.2,3)

**తబలాజోడి** : తబల, డగ్గ - ఈరెంటినీ కలిపి పిలిచే పేరు. (తె.3)

**తబలాదిమ్మ** : తబలాకుండ. తబలాలోని కొయ్య భాగం. (కో.7; రా.5)

**తబలాపూడి** : తబలామూత. తబలా మీది చర్మం భాగం. నిజామాబాద్ ప్రాంతంలో దీనిని అధికంగా వాడతారు. చూ.చిత్రం-6. (తె.3)

**తబలాసెట్** : పర్యా. తబలాజోడి. తబల, డగ్గ. (తె.2)

**తమాల్‌పీసు** : వయోలిన్ తీగలు ఎత్తిపెట్టి ఉంచే భాగం. (కో.7)

**తమిళ వామం** : మేకప్‌లో పెట్టే ఒక రకం బొట్టుపేరు. చూ.చిత్రం-27.4.

**తంబట్టం** : చర్మ సంబంధమైన సంగీత వాయిద్యం. (కో.7)

**తంబడిడోలు** : తంబడి కులస్థులు వాడే ఒక రకం డోలు. పెళ్లి సమయాల్లో దీన్ని మెడలో వేసుకొని వాయిస్తారు. (కో.7)

**తంబుర** : ఒక తంత్రీ వాయిద్యం. నాటకాలలో నారదుడు, బుర్రకథలో ప్రధాన కథకుడు వాయించే వాయిద్యం. దీనికి కుండ, టాపు, దండి, బిరడా, లగం, పీట ఉంటాయి. నాలుగు బిరడాలకు నాలుగు తీగ లుంటాయి. నాలుగు తీగలను ముందు లగానికి

బిగించి, తర్వాత పీట నుండి తీసి నాలుగు బిరడాలకు బిగిస్తారు. దీనికి మెట్లుండవు. చూ.చిత్రం-2. (కో.7)

**తంబూరదండి :** తంబూరలో పొడవుగా ఉండే భాగం. చూ.చిత్రం-2.8. (రా.5)

**తరిణదొడ్డి :** పర్యా. దొడ్డి. మృదంగం, తబల మొదలైన సంగీత పరికరాల చట్రాలను చేయడానికి వాడే పరికరం. (కో.5,6,7)

**తరిగోరులి :** సంగీత పరికరాలను తయారు చెయ్యటంలో ఉపయోగించే పనిముట్టు. చూ.చిత్రం-40. (కో.7)

**తరీక :** రకం. (తె.6)

**తరుగుపరు :** రాతిపనిలో శిల్పానికి వాడే రాతిమీద ఎర్రగ ఉండే భాగం. (తె.6)

**తల :** వీణ కుండ భాగం. (కో.6)

రాతిపనిలో శిల్పం చెక్కడానికి వాడే శానంలో పైభాగం (కా.5)

ఫిడేలు వాయించడానికి వాడే కమాను (చి)జావరి భాగం. (రా.5)

**తలకాయ :** వీణ కొస భాగం. చూ.చిత్రం-1-3. (కో.28)

**తలకుచ్చు :** పర్యా. కొమ్ముకుచ్చు. నంది విగ్రహం మీద కొమ్ముకు చెక్కే కుచ్చు. (తె.6)

**తలపాగా :** బుర్రకత చెప్పేవారు, వొగ్గు కథ చెప్పేవారు తలకు కట్టుకొనే గుడ్డ. (తె.1)

**తలబరువు :** సిమెంటు బొమ్మల తయారీలో బొమ్మకుండే పై బరువు. (రా.13)

**తలమితి :** రాతిపనిలో శిల్ప పై భాగం (తల). (కో.19)

**తలవెంట్రుకలు :** తలమీద జుట్టు. (కో.29)

**తలుపు :** వీణలో తలకాయ పై వైపున ఉన్న భాగం. చూ.చిత్రం-1.12. (కో.28)

**తల్లిరాణి :** ఒక వొగ్గుకథ. (తె.1)

**తాటాకు :** తాటి చెట్టు ఆకు. ముఖవీణ పలకడానికి పీకగా వాడతారు. (రా.10); మేకప్‌లో వాడే కాటుక తయారీలో మసిపొడిని గీకడానికి వాడతారు. (కో.7)

**తాటి మండల చివర :** తాటిచెట్టు ఆకుల కాడ చివరి భాగం. మేకప్‌లో కుంచెల తయారీలో దీనిని వాడతారు. (కో.29)

**తాడు :** మృదంగం, డోలకు, తబల మొదలైన వాటిని బిగించడానికివాడే వారు. (కో.5,7; తె.2,3)

కంజీరా తయారీలో తోలును బిగించడానికి వాడే దారం. (కో.8)

**తాపీ :** రూపా. తాపె. సిమెంటు పనిలో బొమ్మలకు లప్పం పూయడానికి వాడే పరికరం. (కో.3;తె.4,6; రా.13)

**తారస్థాయి :** బుర్ర కథలో వాయించే తంబురాకు ఉండే తీగలలో ఒక తీగపేరు. (తె.1)

**తారాబలం :** రాతిపనిలో శిల్పం చెక్కడానికి మొదలు పెట్టేటప్పుడు ముందు చూసే ముహూర్తం. (తె.6)

**తాసులు తరుగులు :** రాతిపనిలో శిల్పనికి వాడే రాయిలో లోపాలు. (తె.6)

**తాళం :** రూపా. తాలం. వొగ్గు కథలో వాడే ఒక సంగీత పరికరం. (తె.1)

రాతి విగ్రహాల తయారీలో కొలతల ప్రమాణం. (కో.3,7,9,37; తె.1,6,9; రా.5,10)

**తాళంగలపిడి కీలు :** వీణలో ఒక భాగం. చూ.చిత్రం-1.5. (కో.7)

**తాళం తంతులు :** పర్యా. తాళం తీగలు, తాళం తివ్వలు. వీణకు దండి పక్క నుండే తీగలు. (కో.7,13; రా.5)

**తాళం తివ్వలు :** పర్యా. తాళం తంతులు, తాళం తీగలు. వీణకు దండి పక్క నుండే తీగలు. (కో.28)

**తాళావాదం :** రాతిపనిలో స్త్రీ విగ్రహానికి వాడే శిలను పరీక్ష చేసేటప్పుడు వచ్చే ధ్వని. (తాళానాదంతు స్త్రీలింగం) (రా.8)

**తాళంపీట :** పర్యా. ఇత్తడి పీట. వీణటాపుమీద తీగలపీట

పక్కనుండే భాగం. (కో.13)

**తాళప్రమాణం :** పర్యా. శిల్పప్రమాణం, రాతిపనిలో శిల్పం చెక్కడానికి వాడే ముఖప్రమాణం. (కో.19,తె.6)

**తాళవాద్యం :** లయ వాయిద్యం. మృదంగం మొదలైన వాయిద్యాలు. (కో.7)

**తిత్తి :** హార్మోణియంలో గాలి రావడానికి తోలుతో చేసిన పంకా. (రా.8,10)

**తిన్నగ :** పర్యా. చక్కగ. మృదంగం తయారీలో మేకతోలును వెన్నుపూస నుంచి పైకి నేరుగ కోయడం. (కో.7)

**తిమిరి :** నాగస్వరం ధ్వని చక్కగ రావడానికి పీకల్ని సరిచేయడానికి వాడే చిన్న దంతం సూది. (కో.7)

**తింపు :** రూపా. తిప్పు, తిరుగు. రాతిపనిలో శిలను చెక్కేటప్పుడు వెనక వైపుకి బోర్లించడం. (కో.31) మేకప్‌లో మీసాన్ని తిప్పడం. (కో.7)

**తిరగేయు :** వీణ తయారీలో కొయ్య దిమ్మని వెనక వైపుకి తిప్పడం. (కో.6)

**తిరువణ్ణామలై :** రాతిపనిలో వాడే తెల్లరాయి దొరికే చోటు. తమిళనాడు రాష్ట్రంలో ఒక చిన్న పట్టణం. (రా.5)

**తివ్వ :** పర్యా. తంతి. వీణకుండే తీగ. (కో.6) లోహంపనిలో మట్టి మూసకి చుట్టడానికి వాడే లోహపు తీగ. (కో.8)

**తీగచెమ్కి :** మేకప్‌లో వాడే బట్టల కుండే ఒక రకం చెమ్కి. (కో.29)

**తీగపీట :** చూ.తాళం పీట. (కో.13)

**తీగలు :** తంబుర పైభాగాన ఉండే తీవలు. చూ.చిత్రం-2.5. (కో.6)

**తీన్‌పౌన్‌సుత్తి :** రాతిపనిలో వాడే మూడు పౌనుల సుత్తి. (తె.6)

**తీయు :** మృదంగం తయారీలో తోలుని శుభ్రం చేసేటప్పుడు తోలుకి దెబ్బ తగలకుండ దానికున్న మాంసం తొలగించడం. (కో.7)

**తీరు :** రూపా. తీర్పు. రాతిపనిలో ఆకారాన్ని మలచడం. (కో.31)

**తుడుచు :** వీణకు పాలిష్ వేయడానికి ముందు మైనంపూసి బట్టతో రుద్దు. (కో.6)

**తుడుపుబద్ద :** తబలా కరిణను తుడవడానికి వాడే సాధనం. (కో.7)

**తుమ్మబంక :** తుమ్మ జిగురు. నాటకాల్లో వాడే తెరల తయారీలో, వాటికి వేసే రంగుల్లో కలిపే జిగురు. రంగులు వెలిసిపోకుండ ఎక్కువ కాలం ఉండటానికి ఇలా జిగురు కలుపుతారు. (కో.29)

**తుంబ :** వీణలో అనపకాయ భాగం. (కో.6)

**తుర్ర :** పర్యా. తురాయి. మేకప్‌లో కిరీటాల్లో పెట్టే నెమలిపించం. (కో.7; తె.11; రా.8)

**తూణీరం :** పౌరాణిక నాటకాల్లో వాడే అంబులపొది. (రా.8)

**తెగ్గొట్టు :** పర్యా. తెంపు. వీణ తయారీలో వీణకు చుట్టూ పెట్టే ప్లాస్టిక్ షీటుని కత్తిరించు. (కో.6)

**తెంపులి :** సన్నాయి తయారీలో కొయ్యని తరిమెల పట్టడానికి వాడే సాధనం. చూ.చిత్రం-46. (కో.36)

**తెరిపి :** మృదంగం తయారీలో చట్రానికి రెండు వైపులా కాళీగా ఉండటం. (రా.5)

**తెర్లు :** రాతిపనిలో శిల్పం చెక్కడం ప్రారంభిస్తే ఆపని వ్యర్థమైపోదు. పని మొదలుపెట్టగానే అది మంచి రాయి అయినది కానిది తెలుస్తుంది. పనికిరానిదైతే వెంటనే తీసివేస్తారు కాబట్టి వ్యర్థం కాదు. (తె.6)

**తెల్ల :** తెలుపు రంగు. (కో.19; తె.7,9; రా.8)

**తెల్లపిండి :** పర్యా. వరిపిండి. పటం వేయడానికి హొగ్గుకథలో వాడే పదార్థం. (తె.1)

**తెల్లపొడరు :** మేకప్‌లో వాడే తెలుపు రంగుపొడి. (రా.5)

**తెల్లమట్టు :** హార్మోణీకి పై భాగంలో ఉండే తెల్లరంగు

మెట్టు. (కో.7)

**తెల్లరాయి :** పర్యా. అమృత శిల. రాతిపనిలో శిల్పానికి వాడే తెల్లరంగు రాయి. (కో.19; రా.5)

**తెల్లవారు :** తబలాకు వాడే వారు. (తె.2)

**తెల్లవారు(ఝాము) :** పర్యా. తెల్లందాక. బుర్రకథ నేర్చుకునే వారు విధిగా సాధన చేయవలసిన సమయం. (తె.1)

వొగ్గు కథని రాత్రి నుండి ఉదయం వరకు చెప్పడం. (తె.1)

**తెల్లవిగ్గు :** మేకప్‌లో ముసలిపాత్రకి పెట్టే విగ్గు. (కో.7)

**తేనెరంగు :** చిత్రలేఖనంలో వాడే తేనె వంటి రంగు. (కో.3)

**తేమ :** సిమెంటు బొమ్మలకుండే తడి. (రా.13)

**తేలిక(పని) :** చిత్రలేఖనంలో బొమ్మని ట్రేసు తీసేటప్పుడు పైపైనే దిద్దడం. (కో.19)

**తేల్చు :** సిమెంటు బొమ్మల తయారీలో ఆకారాన్ని తీర్చడం. (కో.3)

**తైలం :** రాతిపనిలో విగ్రహానికి పూయడానికి వాడే నూనె. కస్తూరి, గోరోచన, సుర్మ, పెట్లప్పు మొ॥ వానితో దీన్ని చేస్తారు. (రా.8)

**తైలవర్ణం :** చిత్రలేఖనంలో వాడే ఆయిల్ కలర్. (కో.2)

**తొక్కుడుహార్మణి :** పర్యా. లెగ్ ఆర్మన్. హార్మోణియంలో పెద్దరకం. అడుగున కాళ్లతో తొక్కుతూ రెండు చేతులతో వాయిస్తారు. నాటకాల్లో దీన్ని వాడతారు. (రా.8)

**తొగర(రంగు) :** రంగ్రేజ్ పనిలో వాడే రంగు. (తె.4)

**తొడి :** పెద్ద ఆరె, జాతులిలో భాగం. చూ.చిత్రం-33.2; 39.2. (రా.5)

**తొడిమి :** సిమెంటు పనిలో ఉండే తాపీకి వాడే కట్టు. (కో.3)

**తొమ్మిది :** డోలు, జగ్గు - వీటిలో ఉన్న తొలుల (రంధ్రాల) సంఖ్య. (కో.1)

**తొమ్మిదికండ్లు :** ఢోల్కీపుడి మీద ఉండే తొమ్మిది రంధ్రాలు. (తె.3)

**తొరపు :** డోలక్ తయారీలో చర్మాన్ని వెదురు బద్దకు దూర్చడం. (కో.7)

**తొరపణం :** వీణ తయారీలో కొయ్యకు చిల్లులు వేయడానికి వాడే పనిముట్టు. (కో.6)

**తొలి :** రూపా. తొల్లు. పర్యా. కన్నెలు, కండ్లు. డోలు, తబలాకు గజర అల్లడానికి చర్మానికి చేసిన రంధ్రాలు. (తె.2,21)

**తొలిచే ఉలి :** పర్యా. గోరు ఉలి, పాలపు ఉలి. వీణ తయారీలో క్రొయ్యదిమ్మ లోపల గుల్లగ చెక్కేందుకు వాడే పరికరం. (కో.13)

**తొలియు :** రూపా. తొలుచు. రాతిపనిలో వాడే శిలని కొలత ప్రకారం పగల గొట్టడానికి రాతికి వేసే ఒక అంగుళం లోతు చిల్లు. (రా.1)

మృదంగం, వీణ తయారీలో కొయ్య లోపలి భాగం గుల్లగ చేయడం. (కో.24,28; రా.5)

**తొవ్వ(యిడుసు) :** (దారి వదులు). వొగ్గు కథకులు చెప్పే బీరప్ప కథలో బీరప్పదేవుడు పెళ్లికోసం వేరే రాజ్యం పోతే గంగ అడ్డువస్తుంది. అప్పుడు బీరప్ప తన రక్తం అయిదు దోసిళ్లు తీసి గంగలో పోస్తే గంగమెచ్చి దారి విడుస్తుంది. (తె.1)

**తోక :** ఫిడేలులో ఒక భాగం. (రా.5)

**తోడుమీటు :** చూపుడు, నడిమి వేళ్లను మార్చి మార్చి వీణను మీటడం. (కో.7)

**తోలు :** కంజీర, జగ్గు, డక్కీలలో భాగం. చూ.చిత్రం-9.3; 10.1;11.4. (కో.7)

**తోలుముక్క :** పర్యా. తోలుబిళ్ల. డప్పు, జగ్గు, వీటి తయారీలో మూతలకి వాడే చర్మం ముక్క. (కో.7; తె.2; రా.5)

**త్రికరణశుద్ధి :** రాతిపనిలో శిల్పాన్ని దీక్షతో ఆచారంతో చెక్కడం. (కో.19)

**త్రిపుటగుడి :** దేవాలయంలో ఒక భాగం. (తె.6)

**త్రిశ్రజాతి :** వీణ మీద వాయించే ఒక తాళం. (కో.7)

# థ

**థిక్ :** చిత్రలేఖనంలో రంగు ముదురుగ వేయడం. (<ఆం; thick). (కో.2)

**థిక్‌వైట్ క్లాత్ :** చిత్రలేఖనంలో బొమ్మలు వేయడానికి వాడే దళసరి తెల్లగుడ్డ. (కో.3)

# ద

**దంచు :** చిత్రలేఖనంలో గుడ్డపై బొమ్మలకి రంగులు పూసే కుంచెల తయారీలో ఈతపుల్ల చివర మెత్తగా చేయడం. (రా.13)

మేకప్‌లో ముఖానికి పూయడానికి అభ్రకాన్ని మెత్తగా చేయడం. (రా.8)

తబలా కరిణ పిండి తయారీలో మెట్లింగు రాయిని రోకలితో కొట్టి మెత్తగా చేయడం. (కో.7)

**దండ :** శిలా విగ్రహంలో మోచేతికి భుజానికి ఉండే మధ్య భాగం. (తె.6)

**దండకం :** పర్యా. ఖడ్గం? వొగ్గు కథ చెప్పేవారు మల్లన్న పండుగ రోజున గంగ తెప్ప కట్టుకొని నదికి పోయి గంగలో పెట్టకోసి గంగని గురించి చేసే ప్రార్థన. (తె.1)

**దండపట్టి :** పర్యా. నాగబంధం. రాతి పనిలో శిల్పాలకు, మేకప్‌లో పాత్రల దండలకు పెట్టే ఆభరణాలు. (కో.29; తె.6)

**దండం (పెట్టు) :** పర్యా. దండి. రెండు చేతులు జోడించి చేసే వందనం. (తె.1)

వీణకి వేళ్ళు ఆనుకొనేందుకు ఉండే చదునైన పొడుగాటి బల్ల. (కో.28)

**దండెంకడీలు :** పర్యా. బోలుగడెం. వొగ్గు కథ చెపేవారు ఎడంచేయి భుజానికి తగిలించే కడెం. (తె.1)

**దండి (కట్టు) :** వీణ కుండకు సింహతలాటానికి మధ్యగల పొడవైన చెక్క కింది భాగం. చూ.చిత్రం-1.7. తంబూరాలో పొడవైన కొయ్య భాగం. చూ.చిత్రం-2-8; 23-2; 2-4. (కో.6,13,24; రా.5)

**దంతం :** ఏనుగు కోర ; ఏనుగు శరీరంలోని ప్రతి ఎముకను దంతంగానే భావిస్తారు. ప్లగ్గులు తయారీకి వాడతారు. (రా.5); వీణ తయారీలో కుండ మీద డిజైనుకు వాడతారు. (కో.28); చిత్ర లేఖనంలో వాడే బౌపెన్ ముందు భాగం చేయడానికి వాడతారు. (కో.19); చూ.చిత్రం-31.1. నాగస్వరం పీక బెజ్జాలను సరిచేసు కొనేటందుకు పుల్ల రూపంలో వాడతారు. (కో.7)

**దంతంబ్రిడ్జి :** వీణకు మెట్లుపెట్టే దండి. (రా.5)

**దంతంబొత్తాలు :** వీణ తీగల్ని బిగించటానికి ఉండే బిరడాలు. (రా.5)

**దమ్ము :** మృదంగం తయారీలో మృదంగానికి మూతని తాళ్ళతో నిలబెట్టడం. (కో.7)

**దబ్బకుంచె :** (Flat brush). చిత్రలేఖనంలో వాడే ఒక రకం కుంచె. దీని చివర తప్పడగ ఉంటుంది. (రా.9)

**దబ్బనం :** పర్యా. పెద్దసూది, గోరుగల్. నాటకంల్లో వాడే గదని చేసేటప్పుడు ముందు మట్టితో ఆకారం చేసి పైన గుడ్డలని కాగితాన్ని మైదాపిండిలో ముంచి అతికిస్తారు. ఎండిన తరువాత మధ్యకు కోసి లోపల మట్టిని తీసేసి రెంటిని కలిపి ట్వయినుదారంతో కుట్టడానికి వాడే పరికరం. (కో.7). తబలా తయారీలో చట్రం మీద డిజైనులు గీయడానికి వాడే సాధనం. (తె.2)

**దబ్బసీర్న :** పర్యా. దొడ్డ సీర్న, పెద్ద దబ్బసీర్న. రాతి పనిలో శిల్పానికి సాపు పని చేసేటప్పుడు వాడే పనిముట్టు. (తె.6)

**దమరు :** సంగీత వాయిద్యం. చూ.చిత్రం-10. (కో.8)

**దరువు :** వొగ్గుకథలో మధ్య మధ్య వేసే తాళం. ఉదా:

రామోయి రామ రామ....... (తె.1)

**దళసరి** : రూపా. దళసరం. పర్యా. మందం. మొద్దు.

1) మృదంగం చట్రం మందం. (కో.7)

2) నాటకంలో వాడే గద తయారీలో దానికి కావల్సిన మందం. (కో.7)

3) కుంపాస తయారీలో వాడే ఇనుప ఊస మందం. (కో.6)

4) తబలా తూముకి ఉండే మందం. (కో.7)

5) డోలకు తయారీలో డోలకు చట్రం మందం. (కో.5)

6) వయొలిన్ పై కర్ర ముప్పావు ఇంచి మందం.(కో.7)

7) డోలకుకు వారు బిగించడానికి వాడే రింగుల తయారీలో ఇనుప ఊస మందంగ ఉండటం. (కో.13)

**దళాలు** : రాతి పనిలో శివలింగం పీఠానికి వేసే రేఖల మాదిరి డిజైన్. (కో.31)

**దశతాళం** : రాతిపనిలో బ్రహ్మ, విష్ణు, మహేశ్వర విగ్రహాలని నిర్మించడానికి తీసుకునే కొలత. (కో.19; రా.1)

**దాపు** : చిత్ర లేఖనంలో బొమ్మలు వేయడానికి వాడే ఫ్రేం బిగించడానికి వాడే సాధనం. (కో.3)

**దామర (పద్మం)** : రాతి పనిలో విగ్రహానికి చెక్కే అడుగు భాగం. (తె.6)

వీణ తయారీలో మెట్టు బిగించడానికి వాడే తేనె మైనంలో గట్టిదనం కోసం కలిపే ఒక మిశ్రమం. (కో.24)

**దారం దూర్చి చేతిపని చేయు** : మేకప్‌లో దుస్తులకు పూవు ఎత్తుగ రావడానికి దారాన్ని బట్టలోనికి పోనిచ్చి బట్టపైన డిజైన్లు వేయడం. (కో.29)

**దారాలు కట్టి మెలేయు** : మేకప్‌లో విగ్గుల జుట్టు రింగులుగ రావడానికి జుట్టుకి దారాలు కట్టి గుండ్రంగ తిప్పడం. (కో.29)

**దారుబాడిత** : మృదంగం తయారీలో వాడే ఉక్కుబాడిత. (కో.7)

**దాసరోళ్ళు** : దాసరి కులానికి చెందినవారు. వీళ్ళు నాటకాలు వేస్తారు. (తె.2)

**దిక్సూచి** : దిక్కును సూచించే పరికరం. (అయస్కాంతం). సిమెంటు బొమ్మల తయారీలో 'లెవల్' చూసుకొనేటందుకు ఉపయోగపడే సాధనం. (తె.6)

**దిగవది** : మృదంగం తయారీలో మూతకి వేసే చర్మంలో లోపలిభాగం. (కో.7)

**దిగిపుడుశు** : ప్రవేశించడం. (ఎక్కడో ఒక బొమ్మచూసి నేను ఈ 'మాడర్న్ ఆర్ట్' బొమ్మలు చేయాలని ఇందులో 'దిగిపుడిశిన'). (రా.4)

**దిగిపోవు** : బిగుతు తగ్గడం. డప్పులో చర్మం వదులు కావడం. (తె.2)

**దించు** : (1) రాతిపనిలో ముందు శిలమీద బొమ్మవేసి మిగిలిన రాయిని దాని మందంలో సగం వరకు తీసివేయు. (కో.31)

(2) డోలకు తయారీలో మూతచిల్లులకి వారుని దూర్చు. (రా.5)

(3) డోలకు తయారీలో చర్మాన్ని చెట్టునీడలో సాగదీసి చుట్టూరా కొయ్యమేకులు కొట్టు. (కో.5)

(4) మృదంగం తయారీలో మూతకి ముద్ది(కడియం) పెట్టు. (కో.7)

**దిద్దు(పడు)** : రాతిపనిలో శిల్పాల తయారీకి వాడే శిలకి రంధ్రాలు పడటం. (తె.6)

**దిద్దు(కొను)** : (1) మేకప్‌లో కను బొమలు దిద్దడం. (కో.7)

(2) చిత్రలేఖనంలో ఒక కాగితం మీద బొమ్మవేసి దాని వెనక భాగంలో మసిపూసి పిదప డ్రాయింగ్ పేపర్ మీద పెట్టి పెన్సిలుతో-దిద్దటం. (కో.19)

**దిమ్మ(కత్తిరించు)** : (1)డోలకు, మృదంగం తయారీలో కొయ్యని తరిమెణ పట్టడానికి వాడే అడ్డకొయ్యలో ఉండే చెక్క దుంగ. (కో.5,7)

(2) వీణ తయారీలో వాడే కొయ్యదుంగ. (కో.6)

(3) రాతిపనిలో విగ్రహం చెక్కడానికి వాడే శిల. (కో.31)

**దిమ్మిదరువు :** డోలుమీద వాయించే ఒక పద్ధతి. దబదబ వాయించడం. వొగ్గు కథలో ఈ దరువును వాయిస్తారు. (తె.1)

**దిమ్మె :** పర్యా. గట్టం. తబలా శ్రుతి కోసంపెట్టిన గుండ్రటి కొయ్యముక్క. (రా.5)

**దిష్టి(తగులు, ఆమ) :** 1. చూపాను, చూడగలగడం. (తె.6)

2. దిష్టితగలడం. (రా.4)

**దిష్టిచుక్క :** చిత్రలేఖనంలో స్త్రీ చిత్రాలకు అందం కోసం ముఖంలో పెట్టే చుక్క. (beauty spot) (కో.3)

**దుడ్డెలతోలు :** లేగదూడల చర్మం. నౌబత్‌లకి దీనిని వాడతారు. (తె.2)

**దుర్యోధనపరం :** నాటకాల మేకప్‌లో పెట్టే ఒకరకం బొట్టు. చూ.చిత్రం-27.14. (కో.8)

**దుస్తులు :** నాటకంలో వేసుకొనే బట్టలు. (కో.29; రా.13)

**దూడతోలు :** మృదంగం మూతకి వాడే చర్మం. (రా.5)

**దూడబిళ్ళ :** తబలా మూతకి వేసే చర్మం బిళ్ల. తబలా మూతకి మూడు చర్మాలను ఒకదానిపై ఒకటి వేస్తారు. ఆమూడింటిలో కిందుగా వేసేది దూడబిళ్ల. (రా.5)

**దూది :** పర్యా. పత్తి. (1) మేకప్‌లో ఆంజనేయుని మూతి చేయడానికి వాడే పత్తి. (కో.7)

(2) మేకప్‌లో మీసాన్ని శుభ్రం చేయడానికి ఆసిటోన్‌లో ముంచి తుడిచే పత్తి. (రా.5)

**దూదిపెట్టు :** తబలాకు స్పిరిట్ పాలిష్ వేసేటప్పుడు గుడ్డలో దూదిని పెట్టి ముల్లె చేస్తారు. (తె.3)

**దూదియాకట్టె :** పర్యా. రంగూన్ కట్టె. హార్మోణియం తయారీలో వాడే కొయ్య. (తె.3)

**దూంపుడి :** డోల్కికి ఒక వైపు ఉండే మూత. (తె.3)

**దూర్చు :** తబలా తయారీలో మూతల కండ్లలో వారును చేర్చు. (రా.5)

**దృక్సూత్రం :** రాతిపనిలో శిల్పానికి లలాటం కింద నుండి కనురెప్ప కింద భాగం వరకున్న జాగా. (రా.5)

**దెబ్బ :** (1) డోలకి వాడే తోలు శుభ్రం చేసేప్పుడు చర్మంపై గీతలు పడకుండ వేసేదెబ్బ. (కో.5)

(2) రాతిపనిలో ఉలితో కొట్టడం. (తె.6)

**దెబ్బతీయు :** గజరమీద సుత్తితో కొట్టడం. (తె.6)

**దెబ్బేయు :** గజరమీద సుత్తితో కొట్టడం. (తె.3)

**దేవదారికఱ్ఱ :** హార్మోణియం తయారీకి వాడే కొయ్య. (కో.28)

**దేవదారు(కొయ్య) :** హార్మోణియం తయారీకి వాడే కఱ్ఱ. (కో.7)

**దేవాంగుళం :** పర్యా. ఇంచీ, అంగుళం. రాతిపనిలో శిల్పం చెక్కడానికి వాడే ప్రమాణం. (రా.5)

**దేవాలయం (కట్టు) :** గుడిని కట్టడం. (తె.6)

**దైవ సాంప్రదాయకం :** దైవానికి సంబంధించిన ఆచారం. (కో.19)

**దొంక :** డోలకు తయారీలో వాడే సుత్తికి ఉండే చిల్లు. (రా.5)

**దొడ్డమీటు :** వీణతంత్రులను నాదం గంభీరంగా వచ్చేటట్లు గట్టిగా మీటడం. (కో.7)

**దొడ్డపీర్నం :** పర్యా. దబ్బసీర్నం. రాతిపనిలో వాడే లావుశానాం. (తె.6)

**దొడ్డాకురాయి :** సంగీత పరికరాల తయారీలో కొయ్యను నునుపు చేయడానికి వాడే పనిముట్టు. (తె.1,22)

**దొడ్డు :** (1) పరదాలపై అద్దకంపనిలో బట్టమీద గీసే గీతలు లావుగ ఉండటం. (తె.2)

(2) తంబడి డోలు తయారీలో ఒక పక్కన పెట్టే ఇనుప కడెంకు బట్టచుట్టి లావుగ చేయటం. (తె.2)

**దొడ్డుపని :** పర్యా. బజాడపని, రఫ్‌పని, కచ్చు. రాతిపనిలో

లావు మొలల తోటి రఫ్‌గ ఆకారం తీయటం. (తె.6)

**దొమ్మరాట** : పర్యా. తోలుబొమ్మలాట, బొమ్మలాట, దొమ్మలాట. తోలుబొమ్మలతో నాటకాలు, కథలు చెప్పడం. చరమనాటకం. (రా.2)

**దోయించిబ్రష్** : పరదాలపై అద్దకం పనిలో వాడే రెండు అంగుళాల కుంచె. (తె.2)

**దోని** : వీణ కుండ నుండి తలవరకు గల మధ్యభాగం. దీనికి మెట్లు అమర్చుతారు. (కో.6)

**దోపొన్ సుత్తె** : రాతిపనిలో వాడే రెండు పొనుల సుత్తి. (తె.6)

**దోషం** : రాతిపనిలో శిల్పానికి వాడే శిలలో ఉండే లోపం. (తె.6)

## ధ

**ధనస్సు** : నాటకంలో వాడే విల్లు. (రా.8)

**ధనువోడుబొమ్మ** : పర్యా. దబ్బబొమ్మ. ఏకపటం బొమ్మ. (రా.12)

**ధాతువు** : చిత్రలేఖనంలో వేసే రంగు. (కో.19)

**ధూళి** : రాతిపనిలో శిల్పం చెక్కేప్పుడు వచ్చే రాతిపొడి. (కో.19; రా.1)

**ధోతి** : పర్యా. పంచె, మకుటం. వొగ్గు కథ చెప్పేవారు కట్టుకొనే పంచె. (తె.1)

**ధ్వని** : వేణువు ఊదితే వచ్చే శబ్దం. (కో.7)

**ధ్వనిదోషం** : నాదం సరిగా ఉండకపోవటం. (రా.5)

**ధ్వని రంధ్రం** : వీణ కుండపైన ఉండే రంధ్రం. (రా.5)

**ధ్వనిలో మార్పు** : వీణ వాయించేటప్పుడు మీటే తీగను బట్టి, తాకేమెట్టుని బట్టి వచ్చే శబ్దంలో మార్పు. (రా.5)

**ధ్వనిస్తంభం** : పర్యా. సౌండు పోస్టు. ఫిడేలుకు ఉండే సౌండు పోస్టు. (కో.8,23)

**ధ్యానశ్లోకం** : రాతిపనిలో శిల్పం ఏవిధంగ ఉండాలో చెప్పే శ్లోకం. (రా.8)

## న

**నకలు** : (1) కథలు చెప్పే బిచ్చగాడు చిత్రకారుడికి కథ చెప్పినపుడు అతను గీసుకొనే అవుట్‌లైన్ డ్రాయింగ్. (తె.9)

(2) అద్దకం పనిలో పరదాలపై ముందుగ వేసుకొనే చిత్తుప్రతి. (తె.2)

(3) నగిషీ పనిలో సైను బట్ట మీద స్కెచ్ దించడం. (తె.7)

**నక్ష (గీయు)** : అద్దకం పనిలో పరదా మీద చింత బొగ్గుతో వేసే బొమ్మ స్కెచ్. (తె.2)

**నకాషి** : పర్యా. ఆర్యక్షత్రియ, సోమక్షత్రియ. నిర్మల్‌లో కళాకారుల కులం పేరు. (తె.4,9)

**నక్కాసి** : సోమక్షత్రియుల ఉపకులం. (తె.1)

**నక్కిబిళ్ల** : నాటకంలో దుస్తుల తయారీలో డిజైను వర్కు చేసేటప్పుడు వాడే రేకుముక్క. (రా.13)

**నక్కీ** : పర్యా. తొడుగు, వీణ మీటడానికి చేతివేళ్లకు పెట్టుకొనే తొడుగు. (కో.13)

**నక్కు** : ఫిడేలు కుండే నట్టు. (కో.7)

**నగారా** : పర్యా. తప్పెట. ఒక సంగీత వాయిద్యం. (కో.7; తె.2). తోలు బొమ్మలాటలో వాడే మాదిగ డప్పు. (రా.10)

**నగిషి పోగర** : వీణ తయారీలో డిజైను వేయడానికి వాడే సాధనం. (కో.6)

**నట్** : రూపా. నట్టు. రేజ్ గాడిలో ఒక భాగం. (కో.7; రా.5; తె.8)

**నటరాజు** : రాతిపనిలోనూ, కొయ్యపనిలోనూ చెక్కే నాట్యం చేసే శివ విగ్రహం. (కో.19,31; రా.8)

**నటరాజుపళ్ళమొన** : రాతిపనిలో విగ్రహం చెక్కడానికి వాడే పనిముట్టు. (రా.5)

**నడినెత్తి** : పర్యా. శిఖామణి. రాతిపనిలో శిల్పం పైభాగం. (రా.5)

**నడిపిపలగ** : రాతిపనిలో చిన్న వురువులు (సున్నిత భాగాలు) చెక్కడానికి వాడే పరికరం. (తె.6)

**నడుంబెల్టు** : నాటకంలో నడుముకి తగిలించుకొనే పటకా. (రా.13)

**నఫేరా(ఊదు)** : వొగ్గు కథకి జనాన్ని పిలవడానికి ఉపయోగించే సంగీత పరికరం. (తె.1)

**నపుంసక** : రాతిపనిలో చెక్కే బొమ్మలు (స్త్రీ, పురుషులు రెండూ కానివి.) (కో.20)

**నపుంసకమూర్తి** : స్త్రీపురుష లక్షణాలు స్పష్టంగా తెలియని బొమ్మ. (రా.1,8)

**నమూనా** : పర్యా. నక్ష, డిజైన్, మోడల్, పాంచ్. ఆకారం. (కో.4,27,35; తె.1,4,5,7,8,9,12,13,26)

**నయం** : రాతిపనిలో శిల్పానికి, కొయ్యపనిలో వస్తువులకి తుదిమెరుగు పెట్టడం. (కో.35; రా.1)

**నరకు** : సిమెంటు బొమ్మల తయారీలో వాడే ఇనప ఊసని కోయటం. (రా.5)

కొయ్యపనిలో చెక్కని కోయటం. (రా.13)

**నరం** : వారు, చర్మం తాడు. ఫిడేలు బటను బిగించడానికి వాడే చర్మం తాడు. (రా.5)

**నలగగొట్టు** : రూపా. నలగ్గొట్టు. సిమెంటు బొమ్మల తయారీలో వాడే కుంచెని చేసేటప్పుడు మొగలి ఉండని చివర మెత్తగ చేయడం. (రా.13)

**నలైఎనిమిదికళ్ళు** : మృదంగం తయారీలో మూతకి వారుని బిగించడానికి పెట్టిన రంధ్రాలు. (కో.7)

**నల్ల** : నలుపు రంగు. (కో.7; తె.4,5; రా.8)

**నల్లకాసుపొడి** : నల్లరంగు పొడి. సిమెంటు బొమ్మలకి పూసే కరక్కాయ సిరాలో కలిపే పొడి. (కో.28)

**నల్లటికరిణె** : డోలకు ఎడమవైపు మూతకి ఉండే నలుపు భాగం. (కో.5)

**నల్లటిమందు** : మృదంగం కుడిముఖం మధ్యలో ఉన్న భాగం. మృదంగం కుడిముఖం మూడు పొరలతో చేయబడి ఉంటుంది. పైదానికి ఆవుదూడ చర్మము, లోపలిదానికి మేక చర్మము ఉంటే, మధ్యలో ఈ నల్లటి మందు స్థిరంగా అంటించి ఉంటుంది. (రా.5)

**నల్లమెట్టు** : హార్మణీలో పైభాగాన ఉండే నల్లరంగు మెట్టు. (రా.5)

**నల్లరాయి** : పర్యా. కృష్ణశిల. రాతిపనిలో విగ్రహాల తయారీలో వాడే నల్లరంగు శిల. (కో.19,33; తె.6)

**నలుచదరం** : పర్యా. నలుపలకలు. (1) తోలుబొమ్మల తయారీలో తోలును శుభ్రం చేసి ఎండిన తర్వాత నాలుగు పక్కల సమానంగా ఉండేటట్లు కోసిన భాగం. (కో.37)

(2) మృదంగం తయారీలో మూతకి వాడే చతురస్రాకారపు కోత. (కో.7)

**నలుపు పాలిష్** : రాతిపనిలో శిల్పం చెక్కిన తరువాత శిల్పానికి పూసే నల్లరంగు పాలిష్. (కో.33)

**నవతాళం** : విష్ణు, రామలక్ష్మణుల వంటి పూర్ణ విగ్రహాలు శిలపై చెక్కడానికి వాడే ప్రమాణం. (కో.19; తె.6; రా.1)

**నవనాటి సిద్దులు** : గౌండ్లవారు చెప్పే ఎల్లమ్మ కథలో ఉండే తొమ్మిది మంది సిద్దులు - 'పరుశురాముడు, చంద్రమ్మ, ఎల్లమ్మ, ఈరగౌడు, కోటేశుడు, సిటికెల నాధుడు, వీళ్లమేనమామలు ముగ్గురు'. (తె.7)

**నాగపాశం** : వీణ తయారీలో కుండకు బిగించిన భాగం, దీనికి ఏడు లంగర్లు తగిలిస్తారు. ఈ ఏడు లంగర్లకి ఏడు తంతులు కట్టి బిరడాలకు తగిలించి శ్రుతి చేస్తారు. (రా.5)

**నాగబందు** : గొంగడికి మీదకట్టే పట్టి. వొగ్గుకథలో శివం ఊగేటప్పుడు నడుముకు కట్టుకొనే పట్టి. (తె.1)

**నాగబంధం గవ్వలదరిశన :** ఒక వాద్యం. చూ.చిత్రం-22. (తె.7)

**నాగబంధం :** (1) రాతిపనిలో నంది విగ్రహం మీద చెక్కిన ముడివేసిన పాములు. (తె.6)

(2) దండకు ఉండే ఆభరణాలు. (తె.6)

(3) ఒక రకం ముడి. చూ.చిత్రం-21. (తె.7)

**నాగభూషణం :** రాతిపనిలో చెక్కే శివుని మెడలోని పాము. (తె.6)

**నాగస్వరం :** పర్యా. సన్నాయి, నాయనం. ఒక సంగీత వాయిద్యం. చూ.చిత్రం-8. (కో.7; రా.5)

**నాగస్వరమేళం :** శుభకార్యాలలో పెట్టించే మేళం. (రా.5)

**నాచురల్‌హేరు :** విగ్గుల తయారీలో వాడే సహజమైన వెంట్రుకలు. (కో.7)

**నాటకాలోళ్ళు :** నాటకాలు వేసే వాళ్లు. (తె.3)

**నాటు :** సన్నాయి తయారీలో చిల్లులు పెట్టడానికి వాడే పనిముట్టు. (కో.36)

**నాటుకోడిగుడ్డు :** మామూలు కోడిగుడ్డు. దీనిమీద బొమ్మలు వేస్తారు. (కో.25)

**నాటులి :** సంగీత పరికరాల తయారీలో వాడే పనిముట్టు. చూ.చిత్రం-45. (కో.36)

**నాదం :** రాతిపనిలో అమృత శిలని పరీక్ష చేసేటప్పుడు వచ్చే శబ్దం. (తె.6)

తంబురా, వీణ వాయించేటప్పుడు వచ్చే ధ్వని. (కో.7,13,28)

**నాన (వేయు, బెట్టు) :** పర్యా. నీటితో తడుపు. పదునుబెట్టు.

(1) తబల, మృదంగాలకు వాడే తోలును శుభ్రం చేసేటప్పుడు ముందు నీటిలో నానబెట్టడం. (కో.5,7,13; రా.5)

(2) చిత్రలేఖనంలో బొమ్మల ఆభరణాలకు వేయడానికి వాడే తగరం. సరబ్బి కలిపి నీటిలో నానబెట్టడం. (తె.1)

(3) రాతిపనిలో కొలతలకి వాడే నూలుని జాజునీళ్లలో నానపెట్టడం. (తె.6)

(4) తబలాకు పూసే స్పిరిట్ పాలిష్ తయారీలో లక్క, చంద్రన్‌ను స్పిరిట్‌లో కొంతకాలం ఉంచడం. (తె.5)

**నానుక (తీయు) :** పర్యా. నాను. మృదంగం తయారీలో మూతలకి వాడే చర్మాన్ని నీటిలో నానబెట్టి తీయడు. (కో.7)

**నాబ్ :** హార్మోణియంలో గాలి సరిచేసే భాగం. చూ.చిత్రం-4-8. (కో.39)

**నాభి :** బొడ్డు. రాతిపనిలో విగ్రహాని కుండే బొడ్డు భాగం. (తె.6)

**నాబుసులు :** చూ. నాబ్. (కో.7)

**నామం :** మేకప్‌లో పెట్టె ఒక రకంబొట్టు. చూ.చిత్రం-27.9; 27-15. (కో.28)

**నామపుబొట్టు :** రూపా. నామంబొట్టు. మేకప్‌లో పెట్టేబొట్టు. చూ.చిత్రం.27.9. (కో.7)

**నాయనం :** నాగస్వరం. (తమిళం) (రా.5)

**నార :** మేకప్‌లో విగ్గుల తయారీలోకి వాడే నూలు. దీన్ని చెట్టునుండి తీస్తారు. (కో.7)

**నాలుక :** నాగస్వరం వాయించడానికి ఉండే పీక. (కో.7)

**నాలుగోనంబరు :** మేకప్‌లో పెదవులకి రంగు వేయడానికి వాడే బ్రష్. (రా.5)

**నాసిక్ :** తబలా కుండలు తయారయ్యే ప్రదేశం. ఇది మహారాష్ట్రలో ఉంది. (తె.3)

**నిక్కల్‌డిక్కీ :** స్టీలు కంజీర. (తె.2)

**నిబ్ :** చిత్రలేఖనంలో వాడే కలానికి చివరన ఉండే పాళీ. (కో.19)

**నింపు :** మేకప్‌లో వాడే దుస్తుల తయారీలో డిజైన్లకి ఖాళీస్థలంలో రంగు పుర్నితో పూర్తిచేయడం. (రా.13)

**నింపుదవం :** మేకప్‌లో మణికట్టు దగ్గర అందంకోసం కట్టే డిజైన్ ముక్కలు. (కో.7)

**నింబు :** చిత్రలేఖనంలో వాడే లేతపసుపు పచ్చరంగు. (రా.13)

**నిర్మాణంచేయు :** హార్మణీ తయారు చేయడం. (కో.39)

**నిలబెట్టు :** సిమెంటు బొమ్మల తయారీలో పీఠంలో ఇనుప కడ్డీని ఉంచడం. (రా.13)

**నిలవ :** ఎక్కువ కాలం ఉంచడం. రంగులు మాసిపోకుండటం. (కో.12,41)

**నిలువు :** పర్యా. పొడవు. డోలక్ తయారీలో నిలువుగ వేసిన 16 కండ్లు. (రా.5)

**నిషాని :** డ్రామా పరదాల తయారీలో గీసే రేఖాచిత్రం. (తె.2)

**నీటిబొట్టు :** నీటి చుక్క. తబలా శాయి (కరిణ) మీద నీటి చుక్కపడితే పాడైపోయి సౌండు పోతుంది. (తె.3)

**నీటిరంగు :** పర్యా. వాటర్ కలర్. చిత్రలేఖనంలో బొమ్మలకి వేసే వాటర్ కలర్. (రా.13)

**నీడ :** ఎండ తగలని చోటు. (1) మృదంగం తయారీలో వాడే తోలుని నీడలో సాగదీయాలి. ఎండలో అయితే ఉడికి పోతుంది. (కో.7)

(2) వీణ (కుండ) తయారీలో వాడే పనస దుంగని ఒక సంవత్సరం నీడలో ఆరబెడతారు. (కో.13)

**నీమాలు :** కళ్లు. మేకప్‌లో కళ్లకు దిద్దిన నల్లరంగు. (కో.28)

**నీరు :** తబలా కరిణ తయారీలో సిత్రమ రాయిపొడి అన్నం కలిపి నూరేటప్పుడు పోసే ద్రవం. (కో.7)

**మన్నటిరాయి :** రూపా. నున్నరాయి, నునుపురాయి. పర్యా. గోటు. తబలా కరిణ చేసేటప్పుడు కరిణి పిండి వేసి నునుపుగ రుద్దడానికి వాడే రాయి. (కో.7; తె.3)

**మనుపు :** రూపా. నున్న. పర్యా. సాపు, ఫైల్, రుద్దు, సవరు. రాతిపనిలో శిల్పానికి వచ్చిన నున్నదనం. (కో.31)

**మరగ :** రూపా. నురుగు. మేకప్‌లో వాడే రంగు తయారీలో జింకుఆక్సైడు, లిక్విడ్ పౌడర్, గ్లిజరిన్, వాజలైను, క్రేటు, ఉడుకులాము,రోజనీళ్లు కలిపి ఉడికిస్తే పైన వచ్చే తెల్లటి బుడగలు. ఈ నురగ ఎండబెత్తే పౌడరు అవుతుంది. (కో.7)

**మువ్వులనూనె :** పర్యా. మంచినూనె. రాతిపనిలో శిల్పం పూర్తయిన తరువాత విగ్రహానికి పూసే నూనె. (కో.28; తె.6)

**నూకుట :** హార్మోణియం తయారీలో కొయ్యను తోపడాతో చెక్కడం. (రా.8)

**నూనె :** పర్యా. చమురు. (1) రంగ్రేజీ పనిలో కాగితం మీద నక్ష గీసుకొని దానిమీద పూసే చమురు. (తె.4)

(2) వొగ్గుకథలో జ్యోతిలో పోసే చమురు. (తె.1)

**నూనెజిడ్డు :** నూనెమరక. మృదంగం కరిణకి పిండివేసి తోమేటప్పుడు చేతులు కాని. నూనెమరక గాని తగల కూడదు. (కో.7)

**నూనెభరిణ :** నూనె పోసుకొనే చిన్నడబ్బా. వీణ వాయించే టప్పుడు వేళ్లు కొట్టుకు పోకుండ వేళ్ళకు రాసు కొనేందుకు నూనె ఉంచుకొనే చిన్న గిన్నె. (కో.24)

**నూరు :** (1) కరిణ పిండి తయారు చేసేటప్పుడు మెట్లింగు రాయిని మెత్తగ చేయడం. (కో.5,7)

(2) పూర్వం తెల్లరంగు తయారీలో నత్త గుల్లల్ని రాయిమీద మెత్తగ రాయడం. (తె.4)

**నూరుకొను :** సానబెట్టు. (తె.6,13; రా.4)

**నూలుతాడు :** డోలక్ తయారీలో మూత గట్టిగ బిగించడారికి వాడే నూలుదారం. (తె.2,3; కో.13)

**నెక్ :** వయొలిన్‌లో సన్నగ కాడవంటి భాగం. (రా.5)

**నెక్కల్ డక్కి :** స్టీలు కంజీర. (తె.2)

**నెంబరు :** బ్రష్ రకాన్ని తెలిపే సంఖ్య. (రా.9)

**నెమలిపింఛం :** నెమలి ఈక. మేకప్‌లో కృష్ణపాత్రకి తలపై

పెట్టే నెమలి ఈక. (కో.7,26)

**నెమలిబద్ద** : తబల తయారీలో కరిణ తుడవటానికి వాడే తుడుపుబద్ద. (కో.7)

**నెమలివీణ** : పర్యా. మయూరసింహ వీణ. వీణచివరి భాగం నెమలి తల ఆకారంలో ఉండే అది నెమలి వీణ. (కో.24)

**నెమలిఈక** : పర్యా. నెమలి పింఛం. మేకప్‌లో కృష్ణ పాత్రకి తలపైన పెట్టే నెమలి పింఛం. (కో.34; రా.8)

**నెహురుసెట్టు** : రూపా. నెహ్రూషర్టు. బొగ్గుకథ చేప్పేవారు వేషం వేసుకోకుండ కథ చెప్పేటప్పుడు వేసుకొనే ఒక రకం చొక్కా. (తె.1)

**నేతగుడ్డ** : పటం కావాల్సిన బిచ్చగాండ్లు చిత్రకారుడి వద్దకు వచ్చి కథచెప్పే దాన్నిబట్టి చిత్రకారుడు బొమ్మ వేయడానికి వాడేబట్ట. (తె.9)

**నైతరం** : పర్యా. స్మూత్. రాతిపనిలో విగ్రహాన్ని నున్నగ చేయడం. (కో.31)

**నైలాన్‌తాడు** : డోల్కి(పుడి)ని బిగించడానికి వారుబదులు వాడేదారం. (తె.2)

**నైలాను హేరు** : ఫిడేలును వాయించడానికి వాడే కమానుకి గుర్రపు వెంట్రుకల బదులు వాడే నైలానుతో చేసిన సన్నని దారం. (రా.5)

**నైస్(చేయు)** : సిమెంటు బొమ్మల తయారీలో బొమ్మని నునుపుగ చేయడం. (కో.3)

**నోసుప్లేరు** : వీణ తంతుల్ని కత్తిరించడానికి వాడే పనిముట్టు. (రా.5)

**నౌబత్** : రూపా. నోబోత్. ఒక సంగీత వాయిద్యం. దీనికి గజర ఉండదు. వార్లు క్రాస్‌గ ఉంటాయి. (తె.2)

## ప

**పక్కచెక్కలు** : పర్యా. పక్క రిబ్బులు. ఫిడేలుకి పక్క నుండే చెక్కలు. చూ.చిత్రం-1.16. (రా.5)

**పక్కపంచమం** : వీణ తాళం తంతులలో ఒకటి. దీనిని 34వ నెంబరు ఉక్కుతో చేస్తారు. (రా.5)

**పక్కపారణి** : వీణ తాళం తంతులలో ఒకటి. దీనిని 32వ నెంబరు ఉక్కుతో చేస్తారు. (రా.5)

**పక్కపీట** : వీణ కుండ మీద తీగలను ఎత్తి ఉంచడానికి పెట్టే చిన్న కొయ్యముక్క. (రా.5)

**పక్కవేలు** : మధ్యవేలు. మేకప్ చేసేటప్పుడు ముఖానికి ముందు గ్రీజుపూసేటప్పుడు. గ్రీజును తీయడానికి వాడే చూపుడు వేలి పక్కనుండే వేలు. (తె.3)

**పక్వాద్** : మరాఠీ భజనల్లో వాడే సంగీత వాయిద్యం. (తె.3)

**పక్షమి** : వీణలో శ్రుతి తీగ. (కో.13)

**పక్షియాక** : మేకప్‌లో కిరీటానికి పెట్టే తురాయి చేయడానికి వాడే పక్షిఈక. (రా.8)

**పగలకొట్టు** : రూపా. పగలగొట్టు, పగిల కొట్టు. రాతిపనిలో శిలని బద్దలు కొట్టడం. (తె.6; రా.5)

**పగులగొట్టినముక్క** : రాతిపనిలో శిలను పగులగొట్టగా వచ్చిన ముక్క. (కో.33)

**పగులు** : డోలక్, మృదంగం తయారీలో వాడే కొయ్యకి ఉండే బీట. (కో.7,13)

**పంకయిజాం** : రంగ్రేజీ పనిలో వాడే అచ్చు నమూనా. (తె.4)

**పచ్చ** : ఆకు పచ్చ రంగు (తె.4; రా.2)

**పచ్చకర్పూరం** : మేకప్‌లో వాడే కాటుక తయారీలో ఉపయోగించే సుగంధ ద్రవ్యం. (కో.7)

**పచ్చరాయి** : రాతి పనిలో వాడే పచ్చ శిల. ఇది తమిళనాడు లోని 'దేవిదికాపురం'లో దొరుకుతుంది. (రా.5)

**పచ్చశిల** : చూ. పచ్చరాయి. (కో.19)

**పచ్చసొన** : (Yolk). కోడిగుడ్డులో ఉండే భాగం. దీన్ని చిత్రలేఖనంలో వాడే తెలుపు రంగులో కలిపితే మంచి జిగి వస్తుంది. (కో.19)

**పచ్చి ఊడ** : పచ్చి మొగలి ఊడ. దీన్ని చివర చితగ గొట్టి

కుచ్చుగా చేస్తారు. సిమెంటు బొమ్మల తయారీలో దీన్ని ఉపయోగిస్తారు. (రా.13)

**పంచపాల** : రంగ్రేజి పనిలో వాడే అచ్చు నమూనా. (తె.4)

**పంచతాళం** : రాతి పనిలో విగ్రహం చెక్కడానికి వాడే కొలత. (కో.19; రా.1)

**పంచమ శ్రుతి** : ఫిడేలు శ్రుతి చేయటంలో ఒక రకం. రెండవ రకం మధ్యమశ్రుతి. (రా.5)

**పంచమి** : పర్యా. పంచమం. వీణలో శ్రుతి తీగ. (కో.13)

**పంచరంగులు** : "నలుపు, తెలుపు, ఎరుపు, పసుపు, నీలం, ఆకుపచ్చ" - ఇవి ఆరైనా పంచ రంగులనే అంటారు. (కో.38)

**పంచి** : 1. నాటకంలో కొన్ని పాత్రలు కట్టుకునే వస్త్రం. (కో.7)

2. పురుషులు కట్టుకునే వస్త్రం. చూ.దోతి. (కో.27,29)

**పంచెకట్టు** : పంచెని కట్టడం. (కో.7; తె.12)

**పటం (వేయు/ఏయు)** : 1. బొమ్మలతో కూడిన చార్టు. (తె.7)

2. వొగ్గుకథ చెప్పేవారు మల్లన్న-బీరప్ప పండుగ రోజున గంగ దగ్గర వేసే ముగ్గు. (తె.1)

3. బొమ్మను వేయటం. (తె.9)

**పటం చట్టాలు** : ఫోటో ఫ్రేములు. (తె.13)

**పటాల పని** : జానపద కథా చిత్రాలను వేయడం. (తె.9)

**పట్టించు (కొను)** : 1. కొయ్య బొమ్మలకి వేసే నలుపు రంగు తయారీలో పెంకుకు కట్టెల పొగ పట్టించటం. (తె.1)

2. మేకప్ చేసేటప్పుడు రంగు చేతులకి పట్టించటం. (రా.13)

**పట్టివేయలేక** : తంబూర తయారీలో ప్రత్యేకంగా (సంపెంగ, పనస)నే గాక వేరే కర్రలను వాడినా ధ్వనిలో వచ్చే మార్పును గుర్తించ లేక పోవటం. (కో.13)

**పట్టు (కొను)** : 1.రాతి పనిలో వాడే ఉలి తయారీలో ఉలిని పట్టుకొనేందుకు ఉపయోగించే పట్టుకారు ఊస చివరి భాగం. (రా.5)

2. బుర్రకథ నేర్పేటప్పుడు ముందు నేర్పే శ్రుతి ఆలాపన (శ్రుతి నట్టు). (తె.1)

3. వీణ తయారీలో వేరువేరుగా ఉండే వీణ కుండని, దండిని దంతం ముక్కతో కలిపి పట్టుకోవటం. (రా.5)

**పట్టుతాడు** : చిత్రలేఖనంలో వాడే కుంచె తయారీలో కుంచెకు చివర జుట్టు కట్టడానికి ఉపయోగించే తాడు. (తె.1)

**పండ్లు** : రాతి పనిలో చిన్న చిన్న రాళ్ళను కోయడానికి వాడే రంపం చివర ఉండే రేకులు. (కో.31)

**పదకొండుపొరలు** : నాటకంలో వాడే వస్తువులు మోల్డింగ్ చేసేటప్పుడు దళసరిగా ఉండటం కోసం అంటించే గుడ్డ పొరల సంఖ్య. (కో.7)

**పదహస్తం** : రాతి పనిలో శిల్పానికి చెక్కే ఒక రకం హస్తం. (రా.5)

**పదహారుకళ్ళతాడు** : మృదంగం తయారీలో మృదంగం బిగించటానికి వాడే పెనవేసిన తాడు. (కో.7)

**పదును** : 1. డోలకు తయారీలో చర్మాన్ని కోయటానికి వాడే చాకులో వాడిగా ఉండే భాగం. (కో.5)

2. రాతి పనిలో వాడే సేనం చివర వాడిగా ఉండే భాగం. (కో.28)

**పద్మపీఠం** : రాతి పనిలో శివలింగానికి అడుగు భాగం. (కో.31)

**పద్మం** : రాతి పనిలో చెక్కే వెంకటేశ్వర విగ్రహం కింది భాగం. (తె.6)

**పనస కర్ర** : 1. రాతి పనిలో చెక్కే చతురస్రం డిజైను. (తె.6)

2. రాతి పనిలో విగ్రహానికి చెక్కే కిరీటంలో భాగం (కో.31)

3. సంగీత పరికరాల తయారీకి వాడే పనస చెట్టు

కొయ్య. (కో. 5,7,13,24,37)

**పనస కొట్టు** : రాతి పనిలో పనస డిజైన్ వచ్చేట్టు చెక్కడం. (తె.6)

**పని తనం** : పని చెయ్యటంలో నేర్పరి తనం. (కో.13,29; తె.8)

**పనిముట్టు** : రాతిపనిలో వాడే పరికరం. (కో.8,31,41; తె.6,8; రా.1,5,8,)

**పనిశురుచేయు** : రాతి పనిలో శిల్పం చెక్కుడు ప్రారంభించు. (తె.6).

**పన్ను** : ఉలికి ఉండే ఇనుప కట్టు. (కో.39)

**పన్నెండు రంధ్రాలు** : నాగస్వరానికి ఉండే రంధ్రాల సంఖ్య. (కో.7)

**పంది ఎంటిక** : పరదాలపై అద్దకం పనిలో వాడే కుంచెల తయారీకి వాడే వెంట్రుకలు. (తె.2)

**పందిరి** : 1. నాటకం వేసేప్పుడు స్టేజికి ముందు ప్రేక్షకులు కూర్చోటానికి వేసే మంచె. (కో.7)

2. బిచ్చగాండ్లు పదిమందితో కలిసి గూడెంలో కతను చెప్పేప్పుడు వేసే మంచె. (తె.9)

**పప్పు** : (Puff).మేకప్ వేయటానికి ఉపయోగించే గుడ్డకుంచె. (రా.5)

**పంపకం** : రాతి పనిలో విగ్రహం చెక్కేప్పుడు వాడే కొలతల ప్రమాణం. (తె.6)

**పరదా (గీయు)** : పటాలు గీసేప్పుడు రాజ భవనం పటంలో తెరల భాగం. (తె.9)

**పరహస్తాలు** : రాతిపనిలో శిల్పాలకి మామూలుగా రెండు చేతులుగాక ఎక్కువగా పెట్టటం. (కో.31)

**పరిచారిక(లు)** : రాజగృహాలలో పరిచర్యలు చేసే దాసీ జనం (నాటకాలలో). (కో.29)

**పరిమాణం** : కొలత, బరువు. (రా.9)

**పరీక్ష** : రూపా. పరిచ్చ. రాతిపనిలో విగ్రహానికి వాడే శిలని పరీక్షించటం. (తె.6; రా.8)

**పర్షియన్‌బ్లూ** : (Persian blue). ముదురు నీలం రంగు. (రా.9)

**పర్పుల్‌రంగు** : తెలుపు, ఎరుపు రంగులు కలిపితే వచ్చే రంగు. (తె.1)

**పలక** : పర్యా. బద్ద, దంతం పని.

1. రాతిపనిలో శిల్పాన్ని సాపుచేయడానికి వాడే ముక్కునాగురాయికి బద్దగ ఉండే భాగం. (తె.6)

2. వీణ బ్రిడ్జి మీద ఉండే ఇత్తడి లేదా కంచుతో చేసిన పలక. (రా.5)

3. ఫిడేలు అడుగున, పైన ఉండే చెక్క. (రా.5)

**పలమనద్రెస్సింగు** : రాతి పనిలో విగ్రహాన్ని పలమనతో చెక్కడం. (రా.5)

**పలుకుబడి** : హార్మోణియాన్ని టేకు, జాజికాయ చెక్కలతో చేస్తే వచ్చే మంచి ధ్వని. (రా.8)

**పలుచన** : 1. మృదంగం తయారీలో లోపలి పొర చివర్లో మందు పల్చగ పూయటం. (రా.5)

2. మృదంగం తయారీలో వాడే చర్మంలో వారు కొస పల్చగా ఉండటం. (కో.7)

**పల్లం** : తబలా తయారీలో వాడే చర్మం మందం. (తె.15)

**పల్లిమూవె** : రాతి పనిలో విగ్రహానికి పూసే వేరుశనగ నూనె. (తె.6)

**పల్లు ఎవ్వకుండు** : సంగీత పరికరాల తయారీలో వాడే రంపానికి పళ్ళు వెనక్కి వంగి ఉండు. (తె.3)

**పల్లుచీర్లం** : రాతి పనిలో శిల్పం చెక్కటానికి వాడే పరికరం. (రా.8)

**పల్లుమామ** : రాతి పనిలో శిల్పం చెక్కటానికి వాడే పరికరం. (రా.8)

**పల్లువరుస** : కొయ్యపనిలో సింహ ద్వారాలకి చెక్కే డిజైన్. (రా.4)

**పళ్ళమొన** : రాతి పనిలో శిల్పం సావు చేయటానికి వాడే పరికరం. (కో.19)

**పళ్ళు** : డోలకు తయారీలో వాడే చర్మాన్ని శుభ్రం చేసేప్పుడు చర్మానికి దెబ్బతగులకుండా మాంసాన్ని తీయటానికి చాకు కుండే నొక్కులు. (కో.5)

**పసుపు** : చిత్రలేఖనంలో వేసే పసుపురంగు. (కో.19; తె.1,9; రా.13)

**పసుపు మట్టి** : పసుపురంగులో ఉండే మట్టి. పూర్వం దీన్తో పసుపురంగు చేసేవారు. (రా.11)

**పసుప్పొట్టు** : ఎల్లమ్మ, పోశమ్మ కథలు చెప్పేప్పుడు వొగ్గ కథకులు వేషధారణకు ఉపయోగించే పదార్థం. (తె.1)

**పసివి కుండ** : పర్యా. శిఖరం. గుడిపై ఉండే శిఖరం. (కో.18)

**పాకేజి బోర్డు** : హార్మణికి ఉండే చెక్కల తయారీలో వాడే అట్ట. (కో.7)

**పాచిక(లు)** : నాటకాలలో జూదం ఆడటానికి వాడే పావు(లు). (రా.8)

**పాటకమలం** : తబలా, మృదంగం, తబలపూడి, డోలకు మూలలలో ఉండే భాగం. చూ.చిత్రం-5.2; 6.2; 7.2; (కో.5,7)

**పట్కారు** : నాటకాల మేకప్‌లో పెట్టే ఒక రకం బొట్టు. చూ.చిత్రం-27.17. (కో.17)

**పాడింగు** : (Padding). ఒత్తు. (కో.7)

**పాడు** : కంజీర మోగడం, శబ్దం రావడం. (కో.7)

**పాడైపోవుడు** : తబలా శాయి లేచి పోవడం. (తె.3)

**పాండవు లోళ్ళు** : చినమాదిగోళ్ళు, కథలు చెప్పే భిక్షుకులు. (తె.7)

**పాత దరువు**: ఈ కాలం సినిమా దరువులు కాకుండా పూర్వం వాడే సాదా, భక్తి దరువులు. (తె.1)

**పాతిక అంగుళం** : మృదంగం తయారీలో మూతకి వాడే తోలు కోసే వెడల్పు. (కో.7)

**పాతక స్వరం** : వేణువులో శుద్ధ రిషభం మొ॥ అర్ధ స్వరాలను రంధ్రాలను తెరవడంతో వాయించటం. (రా.5)

**పాత్ర** : 1. నాటకంలో ఒక పాత్ర (వేషం). (కో.37)

2. చిత్రలేఖనంలో బట్టమీద బొమ్మలు వేసేప్పుడు బట్టకు పూసే సర్వీసుని ఉడికించటానికి వాడే గిన్నె. (కో.3)

**పాత్రధారి** : నాటకంలో పాత్రను ధరించే వాడు (నటుడు). (కో.7,29)

**పాదం** : 1. రాతి పనిలో చెక్కేశిల్పానికి ఉండే కాలు చివరి భాగం. (కో.19)

2. ఫిడేలు బ్రిడ్జి భాగం. (రా.5)

**పాద రక్షలు** : చెప్పులు. చూ. చడావు. (కో.7)

**పాదసర** : రూపా. పాదసరం. రాతి పనిలో విగ్రహానికి పాదం దగ్గర చెక్కే ఆభరణం. (కో.31; రా.8)

**పాదాంగుళీయం** : కాలి వేళ్ళకు ఉండే ఆభరణం. (కో.37)

**పాదుకం** : విగ్రహాన్ని సింహాసనంలో ప్రతిష్ఠించడం కోసం విగ్రహం అడుగున కొంత విడిచిపెట్టిన భాగం. (తె.6)

**పాన్‌కేక్** : పెనం. (రా.5)

**పాపిడి బిందె** : పాపిడి బొట్టు. మేకప్‌లో స్త్రీలు తలపై పెట్టుకునే ఆభరణం. (రా.8)

**పాముకోళ్ళు** : నాటకంలో మునులు, బాహ్మణ పాత్రధారులు ధరించే పాదరక్షలు (చెక్కలు). (కో.7)

**పాము బొట్టు** : నాటకం మేకప్‌లో పెట్టే బొట్టు. (కో.7)

**పాముల వాళ్ళు** : రూపా. పాములోళ్ళు. జగ్గు వాద్యాన్ని వాయించే వాళ్లు. (తె.2)

**పాయింటు బ్రష్** : చిత్రలేఖనంలో చుక్కలు వేయటానికి వాడేకుంచె. (రా.9)

**పారదర్శకత్వం** : వస్తువులోంచి బయటకి కనబడటం. (చిత్రలేఖనంలో నీటి రంగులు వాడేప్పుడు ప్రతి

రంగులోను తెలుపు రంగు కలిపితే (Tempura) అంటారు. ఇలా కలిపిన రంగుల్లో పారదర్శకత్వం కనబడదు). (కో.28)

**పారం :** మేకప్‌లో ముఖానికి రంగులు సరిగా వేయడం. (కో.7)

**పారు :** మేకప్‌లో వాడే కాటుక తయారీలో అద్దం మీద ఆముదం దీపం పొగని పట్టడం. (కో.7)

**పార్క్ డెకరేషన్ :** తోటల అలంకరణ. పార్క్‌లో అక్కడక్కడ అందానికి శిల్పాలని పెట్టడం. (కో.38)

**పార్శ్వం :** దేవాలయ నిర్మాణంలో భాగం. (తె.6)

**పాలపు ఆకురాయి :** పర్యా. సాపు ఆకురాయి. వీణ తయారీలో సాపు రావటానికి వాడే పరికరం. (కో.24)

**పాలపు ఉలి :** వీణ తయారీలో కుండ ఆకారం రావటానికి వాడే పరికరం. (కో.28)

**పాలశిల :** రాతి పనిలో శిల్పానికి వాడే రాతిలో ఒక రకం. (కో.19)

**పాలిష్ (కొట్టు) :** రాతి పనిలో, సంగీత పరికరాల తయారీలో మెరుగు (పెట్టడం). (కో.4,6,8,23,24,34,41; తె.1,3,7,9,12; రా.3,4,5,8)

**పాలిష్ స్టోన్ :** చూ. ఆకురాయి. శిల్పం సమం చేయడానికి వాడే రాయి. (రా.11)

**పాళీకలం :** చిత్రలేఖనంలో అక్షరాలు రాయడానికి, బొమ్మలు వేయటానికి వాడే కలం. (కో.19)

**పావురాయి ఈక :** చిత్రలేఖనంలో వాడే కుంచె చివర ఉండే పక్షి ఈక. (తె.1)

**పిక్కగజ్జెలు :** వొగ్గుకథలో సివం ఊగేప్పుడు వేషంలో భాగంగా వాడే మువ్వలు. (తె.1)

**పిక్స్ :** మేకప్‌లో ముఖానికి పూసే గ్రీజు తడిసినా, గోకినా పోకుండా ఉండటానికి రోజు సెంటు పౌడరు పూస్తే సరిగ్గా అతుక్క పోవడం. (రా.5)

**పిక్చర్స్ :** చిత్రలేఖనంలో వేసే బొమ్మలు. (కో.19)

**పింగాణి పాత్ర :** చిత్రలేఖనంలో రంగులు కలుపుకునేందుకు పింగాణితో చేసిన పాత్ర. (కో.2)

**పింగరు బోర్డు :** ఫిడేలుకు నెక్‌పైన ఉండే అట్ట చెక్క. (రా.5)

**పింజర్ :** మీసాల్ని మెలేయడానికి వాడే పరికరం. చూ. చిత్రం-27.22. (కో.7)

**పిడక :** చూ. కారు. లోహం పనిలో విగ్రహాన్ని కాల్చటానికి వాడే చిట్టెం కట్టిన పిడక. (కో.8; తె.12; రా.5)

**పిడి :** వీణ చేతి కర్రకు, జాతులికి ఉండే పొట్టికామ. చూ.చిత్రం-1.4; 39.1. (కో.7)

**పిడీలు :** ఫిడేల్. సంగీత పరికరం (వయోలిన్). (కో.8,23)

**పిండిజోతి :** మల్లన్న పండుగ రోజున వొగ్గు కథ చెప్పే వారు సొప్ప బెండ్లు కట్టి వెలిగించేది. (తె.2,3)

**పినిషింగ్ :** (Finishing). సిమెంటు బొమ్మల తయారీలో బొమ్మలకి దిద్దే తుది మెరుగు. (రా.5)

**పిన్ను :** పర్యా, మేకు, ములిక. గుండుసూది. చిత్రలేఖనంలో బోర్డుకి కాగితాన్ని పెట్టడానికి వాడేది. (రా.11)

**పియానో :** సంగీత వాద్యం. (కో.7)

**పిరికీ :** పర్యా. మెరుపు మెట్లు, పెగ్గు, బిరడా, బిరికీ. వీణ దండికి పక్కన ఉండే ముక్క. (కో.13)

**పిలక విగ్గు :** మేకప్‌లో పెట్టే ఒక రకం విగ్గు. (కో.7)

**పిలేర్ :** (Player). పట్కారు. (తె.2)

**పిల్లనగ్రోవి :** సంగీత వాయిద్యం. ఫ్లూటు. (కో.7,27)

**పీక :** శ్రుతి, సన్నాయి, నాగస్వరాలలో ఉండే ఊదే భాగం. చూ.చిత్రం-16.1; 16.2; 17.3; 17.5; 18.1; (కో.7, 7,36; రా.5)

**పీకు :** మృదంగం తయారీలో వాడే చర్మానికి బోర్డును తీసేయు. (రా.5)

**పీట :** పర్యా. తీగల పీట. తంబూరా కుండ మీద టాపుకి

(మూతకి) మధ్యలో తీగలు బిగించడానికి అమర్చే పలక. (కో.13,24)

వీణ, తంబురలలో భాగం. చూ.చిత్రం-1.15;2.3. (కో.8)

**పీఠం** : 1. సిమెంటు పనిలో బొమ్మకు అడుగు భాగం. (రా.13)

2. రాతి పనిలో శిల్పానికి అడుగు భాగం. (కో.6,33; రా.8)

**పీలిక** : వీణ అందంగా కనబడటానికి చుట్టూ అంటించే ప్లాస్టిక్ ముక్క. (కో.6)

**పీల్చు** : చిత్రలేఖనంలో వాడే కాగితం సరయినది కాకపోతే రంగు పక్కలకు కూడా కారు. (రా.9)

**పుక్కెం** : పుణ్యం. (పుక్కేనికే వచ్చు.) ఉచితం. రాతిపనిలో వాడే రాయి ఊరికే దొరకటం. (తె.6)

**పుచ్చిపోవు** : వీణ తయారీలో వాడే కొయ్య తడిగా ఉండి పాడైపోవు. (రా.5)

**పుచ్చుశిల** : రాతిపనిలో నపుంసక మూర్తులు(విగ్రహాలు) చెక్కటానికి వాడే శిల. (కో.19)

**పుటాన** : రంగ్రేజీపనిలో వాడే అచ్చు నమూనా. (తె.4)

**పుటాంతం** : రాతిపనిలో విగ్రహానికి ఉండే ముక్కు చివరి భాగం. (రా.5)

**పుట్టురాయి** : రూపా. పుట్రాయి. ప్రకృతి సిద్ధంగా దొరికిన ఏవిధమైన మెరిగింపులు చేయనిరాయి. (తె.6)

**పుణ్యాహవాచనం** : రాతిపనిలో శిల్పం పూర్తయిన తరువాత కర్తకు ఇచ్చేప్పుడు చేసే పూజ. (కో.19)

**పురిపెట్టు** : మేకప్‌లో వాడే మీసాలతయారీలో గొర్రె వెంట్రుకలు తడిపి పేను. (రా.8)

**పురుషగాత్రం** : మగగొంతు. (కో.7)

**పురుషమూర్తి** : రాతిపనిలో శిలపై చెక్కే బొమ్మ. (రా.8)

**పురుషశిల** : రాతిపనిలో పురుషమూర్తులు చేయడానికి వాడే శిల. (కో.19; రా.8)

**పుర్ని** : మేకప్‌లో దస్తులకి కుట్టడానికి వాడేది. (రా.13)

**పుల్ల** : 1. మేకప్‌లో తురాయి చేసేప్పుడు ఈకల్ని కట్టడానికి వాడేది. (రా.8)

2. డప్పును వాయించటానికి వాడేది. (తె.2)

3. రాతిపనిలో శిల్పం చెక్కే ముందు రాయికింద బొమ్మ ఆకారం వేయటానికి వాడేది. (కో.28)

**పువ్వు** : పర్యా. పుష్పం, పూవు. మేకప్‌లో ముఖానికి పౌడరు అద్దకోవటానికి గుడ్డతో చేసిన సాధనం. (రా.8)

**పూజచేయు** : 1. వొగ్గుకథవారు దేవున్ని పూజించటం.(తె.1)

2. రాతిపనివారు పని ప్రారంభించేప్పుడు పూజ చేయడం. (తె.6)

**పూజ** : నాటకాలలో పెట్టే ఒకరకం బొట్టు. చూ.చిత్రం-27.18. (కో.28)

**పూజార్హత** : రాతిపనిలో నపుంసక శిలపై చెక్కిన విగ్రహానికి పూజార్హత ఉండదు. (రా.8)

**పూజాంశం** : రాతిపనిలో చేసిన శివలింగంలో భాగం. (కో.37)

**పూతపొడి** : రాతివిగ్రహానికి తొడుగులు తొడిగేప్పుడు అతకడానికి మేకులు కొట్ట కనబడకుండా పైన పూసే తగరం పొడి. (కో.33)

**పూర్తిబొమ్మ** : చిత్రలేఖనంలో కార్డుబోర్డు మీద బొమ్మ వేసేప్పుడు కాగితం మీద వేసిన బొమ్మను బోర్డుమీద ట్రేసుతీయడానికి సుద్దపొడి ముల్లెతో రాస్తే బోర్డుమీద పడే మొత్తం బొమ్మ. (తె.1)

**పూర్వదిశ** : తూర్పు దిక్కు. దేవాలయం ఊర్లో ఉండవలసిన దిక్కు. (తె.6)

**పూలకుండీ** : పర్యా. పూలతొట్టి. పూలమొక్కలు పెట్టుకునే కుండీ. (తె.12; రా.13)

**పూలు** : 1. వొగ్గుకథ చెప్పేప్పుడు స్టేజికి పై భాగంలో కట్టేవి.

(తె.1) చూ.పువ్వు.

2. వీణ తయారీలో వీణకు చెక్కే డిజైన్ (కో.6)

**పూస** : 1. బుర్రకథ చెప్పేవారు మెడలో వేసుకునే హారం తయారీకి వాడే వస్తువు. (తె.1)

2. వీణ తయారీలో బ్రిడ్జికి తీగలు కట్టినచోట ఒక పూసగుచ్చి ఉంటుంది. ఇది శ్రుతి హెచ్చు తగ్గులు సరిచెయ్యడానికి ఉపయోగపడుతుంది. (రా.5)

**పెగ్గు** : పర్యా. బిరడా. ఫిడేలుకు ఉండే బిరడా. చూ.పిరికి. (రా.5)

**పెంకు** : వీణ తయారీలో వాడే అనపకాయను కోసి ఎండ బెడితే తయారయిన గట్టి రూపం. (కో.6)

**పెచ్చు** : 1. రాతిపనిలో శిలమీద శిల్పం చెక్కేప్పుడు వచ్చే రాతి ముక్క. (కో.28; తె.6)

2. సిమెంటు బొమ్మల తయారీలో బొమ్మకు అంటించే సిమెంటు ముక్క. (రా.13)

**పెట్టి**: వీణ తీగలు అమర్చే భాగం. చూ.చిత్రం-1.12. (కో.8)

**పెట్టు** : రాతిపనిలో వాడే రాయిని బద్దలు కొట్టడానికి వత్తికి నిప్పుపెట్టడం. (రా.5)

**పెట్లుప్పు** : రాతిపనిలో శిల్పంపైన పూయడానికి వాడేది. శిల్పం పూర్తిగ తయారైన తర్వాత మూర్తి బాగా నదరుగా కనబడటానికి పూసే తైలంలో గోరోచన, సుర్కీ, కస్తూరితో పాటు ఈపెట్లుప్పు కూడా కలుపుతారు. (రా.8)

**పెంటింగు** : రూపా. పెయింటింగ్. రంగులు వేయటం. (తె.6)

**పెదవులరంగు** : పర్యా. లిప్‌స్టిక్. మేకప్‌లో పెదవులకు పూసేరంగు. (రా.13)

**పెద్దఆరె** : సంగీత పరికరాలు తయారు చెయ్యటానికి ఉపయోగించే పనిముట్టు. చూ.చిత్రం-33. (కో.28)

**పెద్దగోరు ఉలి** : మృదంగం తయారీలో మృదంగం చట్రం డొలపడానికి వాడే పరికరం. (కో.7)

**పెద్దతాలం** : వొగ్గుకథకు జనాన్ని పిలవడానికి వాడే సంగీత పరికరం. చూ.చిత్రం.20. (తె.1)

**పెద్దదబ్బ సీర్నం** : పర్యా. సేనం. రాతిపనిలో శిల్పానికి పెచ్చులు లేపడానికి వాడేది. చూ.దబ్బసీర్నం. (తె.6)

**పెద్దదేవత** : వొగ్గుకథ చేప్పేప్పుడు మొదట పూజించే గంగదేవత (కురుమోళ్ళకు గంగ పెద్ద దేవత). (తె.1)

**పెద్దపండగ** : ఉగాది. రాతిపనివారు ఈరోజు స్నానం. అనుస్నానం చేసి గాయత్రి పూజచేసి విగ్రహాలన్నిటికి కుంకుమ పూజ చేస్తారు. (తె.6)

**పెద్దపళ్ళమున** : రాతిపనిలో శిల్పం చెక్కడానికి వాడే పరికరం. (రా.5)

**పెద్దబంతి** : వీణ కుండ ఉండే ఆకారం. కుండ భాగం. (కో.7)

**పెద్దమ్మలోల్లు** : కథలు చెప్పే భిక్షుకకులం. (తె.7)

**పెద్దరంపం** : వీణకుండ తయారీలో దుంగ కోయడానికి వాడతారు. చూ.చిత్రం-57. (కో.28)

**పెద్దవులి** : రాతిపనిలో ఉపయోగించే పనిముట్టు. (రా.5)

**పెద్దసలగ** : రాతిపనిలో పెద్ద ఉరువులు చెక్కడానికి వాడే సాధనం. చూ.పెద్దవులి. (తె.6)

**పెద్దసీనం** : రూపా. పెద్దసీర్నం, పెద్దశీర్ణం. చూ.పెద్దవులి. రాతిపనిలో బలువు కొట్టడానికి వాడే పరికరం. (తె.6)

**పెద్దసుత్తె** : రాతిపనిలో, లోహం పనిలో వాడే పనిముట్టు. చూ.చిత్రం-62. (తె.1,6)

**పెద్దిరాజుకథ** : ఒక వొగ్గుకథ. (తె.1)

**పెన్సిలు** : రూపా. పెడిసలు, పెన్సిల్. చిత్రలేఖనంలో బొమ్మలు వేయడానికి, కొయ్యపనిలో రాతిపనిలో గుర్తులు పెట్టుకోవటానికి, రాయడానికి పనికొచ్చే సాధనం. (కో.6,7,16,19,31,34,41; తె.6,9,10, 12,13; రా.4,5,6,7,11)

**పెన్సిల్‌బ్రష్** : పరదాలపై అద్దకం పనిలో వాడే సన్నకుంచె. (తె.2)

**పెన్సిలుముక్క** : రూ. పెన్సిలుములుకు. చిత్రలేఖనంలో బొమ్మలు వేయడానికి వాడే సాధనం. (కో.19)

**పెయి** : శరీరం. (తె.1)

**పెయింటింగ్** : 1) చిత్రలేఖనంలో బొమ్మలకు రంగులు వేయడం (కో.41; తె.1; రా.5,7,9)

2) మేకప్‌లో ముఖానికి రంగు పూయడం. (కో.7)

**పెయిమీదకి నింపుకొను** : వొగ్గుకథలో సివం ఊగటం. (తె.1)

**పెరియ మేళం** : పర్యా. తంజావూరు మేళం. నాగస్వరం, బత్తు, తవిలు, తాళం కలిపి వాయించటం. చూ. తంజావూరు మేలం. (రా.5)

**పెర్రోసిమెంట్** : సిమెంట్ బొమ్మల తయారీలో వాడే ఒక రకం సిమెంటు. (కో.38)

**పెలట్** : పర్యా. ప్యాలట్. చిత్రలేఖనంలో రంగులు కలుపుకునే పాత్ర. (కో.3)

**పేడు** : 1. మృదంగం, తబల, డోలకు తయారీలో కొయ్య చెక్కేప్పుడు వచ్చే చెక్కముక్క. (కో.5,7,7; తె.13; రా.5)

2. వీణ తయారీలో వీణకు కుండపైన చుట్టూ అంటించే ప్లాస్టిక్ ముక్క. (కో.6)

**పేవా** : చిత్రలేఖనంలో బొమ్మలు వేయడానికి వాడేది. చూ.పెన్ను, కలం. (రా.9)

**పేపరు** : చిత్రలేఖనంలో బొమ్మలు వేయడానికి వాడే కాగితం. చూ.కాగితం. (కో.19,34,41,; తె.1; రా.13)

**పేపర్‌వైట్** : చిత్రలేఖనంలో సూర్యోదయం చిత్రం వేసేప్పుడు కొద్దివెలుగును చూపడానికి రంగు వేయకుండా కాగితాన్ని అట్లాగే తెలుపుగా ఉంచటం. (రా.9)

రాతిపనిలో చేసే వస్తువు. కాగితాలు ఎగరకుండా బరువుకి పెట్టేది. (కో.31)

**పేవడ** : రూపా. పేవడి, పేవ్డా, పేవుడి. పసుపు పచ్చరంగు. (తె.1,2,4,7)

**పేష్టు** : పర్యా. ముద్ద. నాటకంలో వస్తువుల్ని (గద, కిరీటం మొ॥) చేసేప్పుడు అతికించటానికి వాడే ద్రవ్యం. (కో.7)

**పైకర్ర** : ఫిడేలుకి సన్నంగా ఉండే భాగం. (కో.7) పర్యా. పై కొయ్య. (రా.5)

**పైజామా** : బుర్రకథ చెప్పేవారు ధరించే పొడవులాగు. (తె.1)

**పైను** : (Pine wood) వయొలిన్ తయారీకి వాడే కర్ర. (రా.5)

**పైపీఠం** : పర్యా. ఫిడేలు ఎద, పైకొయ్య. ఫిడేలుకి పైన ఉండే భాగం. (రా.5)

**పైపెంకు** : కోడిగుడ్డు పైన ఉండే గట్టి భాగం. దీని మీద బొమ్మలు చెక్కుతారు. (కో.26)

**పైరాగం** : కోలు బొమ్మలాటలో ఆడవారు తీసే రాగం. (కో.37)

**పైముక్క** : డోలకు మూతకి పైన ఉండే భాగం. (కో.5)

**పైమూత** : మృదంగం మూతకి పైన ఉండే తోలు. (కో.7)

**పొక్క** : రంధ్రం. సంగీత పరికరాల తయారీలో చేసే చిల్లు. (తె.2,4,8)

**పొట్టిదిమ్మ** : వీణ తయారీలో వాడే చిన్న దూగోడ. (కో.6)

**పొడవునామం** : మేకప్‌లో కొన్ని పాత్రలకి పెట్టేబొట్టు. (కో.7)

**పొడి** : కరిణ పిండి తయారీలో చేసే మెట్లింగు రాయి పొడి. (కో.5,7)

**పొడుగు** : రూపా. పొడవు. (కో.2,6,7,28,41; తె.4,6,8,12)

**పొడుగుదిమ్మ** : వీణ తయారీలో వాడే పొడుగాటి దూగోడ. (కో.6)

**పొయ్యి** : తబలా తయారీలో వాడే కొలిమి. (కో.7; తె12)

**పొర** : 1. తబలా, మృదంగం మూతలకి ఉండే చర్మం పొర. (తె.23; రా.5)

2. నాటకంలో వాడే కిరీటం, గద మొదలయినవి

మోల్డింగ్ చేసేప్పుడు కాగితం అంటించే పొర. (కో.7)

3. రాతిపనిలో వాడే రాయిలో ఉండే పొర. (తె.6)

**పోకరంగు :** పర్యా. సుపారీ రంగు. రంగ్రేజీ పనిలో వాడే రంగు. (తె.4)

**పోంచి :** పర్యా. ముంజేయి కడెం. ఒగ్గుకథ చెప్పేవారు కుడిచేతికి ధరించే ముంజేతి కడెం. (తె.1)

**పోట్రేట్‌పెయింట్ :** చిత్రలేఖనంలో ఒక రకం. (కో.3)

**పోరగాడు :** రాతిపనిలో చేసే బాలుని బొమ్మ. (తె.6)

**పోశమ్మకథ :** ఒక ఒగ్గుకథ. (తె.1)

**పోస్టర్‌కలర్ :** 1. రూపా. పోస్టల్ కలర్. చిత్రలేఖనంలో బొమ్మలకు వేసే ఒక రకం రంగు. (కో.19,25)

**పౌడరు :** చిత్రలేఖనంలో వాడే రంగులు పూర్వం సొంతగా చేసేప్పుడు ముందు మట్టిని పొడిగ చేయటం. (రా.11)

2. మేకప్‌లో ముఖానికి పూసేది. (కో.7; రా.5)

3. కరిణి పిండి తయారీలో గనిరాయిని పొడిగ చేయటం. చూ. పొడి, చూర్ణం. (కో.7; తె.3)

**పౌడర్‌కలర్స్ :** చిత్రలేఖనంలో బొమ్మలకు వేసే పొడిరంగులు. (తె.9; రా.11)

**పౌండు :** పౌను. వీణ తయారీలో వాడే సుత్తి బరువు. (రా.5)

**పౌనుసుత్తి :** రాతిపనిలో శిల్పం చెక్కటానికి వాడేది. (రా.8)

**పౌర్ణమి :** పున్నమి. ఈ రోజు తరువాత వీణను తయారు చేయరు. క్షీణ చంద్రుడు కాబట్టి మంచిది కాదు. (రా.5)

**ప్రక్కతంత్రులు :** వీణకుండే తాళం తీగ. (రా.5)

**ప్రక్కతివ్వ :** చూ. ప్రక్కతంత్రులు. (కో.6)

**ప్రక్కమీటు :** వీణకుండే తాళం తంత్రులను చిటికెన వేలితో కింద నుండి మీదకు కొట్టినట్టుగ మీటడం. (కో.7)

**ప్రకృతి చిత్రణ :** చిత్రలేఖనంలో ప్రకృతిని చూసివేసే బొమ్మ. (రా.9)

**ప్రతిధ్వని :** విపంచి వీణవాయించేప్పుడు ధ్వనికి మారుగా మరల పలికే ధ్వని. (కో.28)

**ప్రతిష్ఠ :** దేవాలయంలో విగ్రహాన్ని స్థాపించటం. (కో.19)

**ప్రభ :** 1. రాతిపనిలో శిల్పానికి చెక్కే కిరీటంలో భాగం. (కో.31)

2. దేవాలయంలో ఉపయోగించే పెద్ద దీపం. (తె.12)

**ప్రభర :** కంసాలి కులంలో ఒక శాఖ. (కో.36)

**ప్రభావళి :** రాతిపనిలో చెక్కే శిల్పం వెనక భాగం (Back ground). చూ. అగ్నిపాడ. (రా.8)

**ప్రమాణం :** 1. రాతిపనిలో శిల్పం తయారీకి వాడే కొలత. (కో.19)

2. డోలకు, మృదంగం, తబలకు సరిచూసే శ్రుతి (కో.7; రా.5,5)

**ప్రమాణసుత్తి :** మృదంగం శ్రుతి చేయడానికి వాడే సుత్తి. (రా.5)

**ప్రాణవట్టం :** చూ. పానవట్టం. రాతిపనిలో చేసే లింగం అడుగు భాగం. (తె.6)

**ప్రారంభం :** పర్యా. శురు. చూ. తొలుత.

1. బుర్రకథ మొదలు పెట్టడం. (తె.1)

2. వీణను చేయడం మొదలు పెట్టడం. (కో.6)

**ప్రారంభోత్సవం :** ఒక పనిని మొదలు పెట్టే సమయంలో చేసే పండుగ (ఈ సమయంలో ప్రారంభం చేసిన వారిపేరును రాతిపనివారు రాయిమీద చెక్కుతారు). (కో.3)

**ప్రాక్టీసు :** అలవాటు చెయ్యటం (చిత్రలేఖనం). (కో.3)

**ప్లాటు ఆకురాయి :** పర్యా. తమ్మ ఆకురాయి. వీణ తయారీలో దండి సాపుచేయడానికి వాడేది. (కో.6)

**ప్యాలట్ :** (pallet). చిత్రలేఖనంలో రంగులు కలుపుకోడానికి వాడేది. చూ. పెలట్. (రా.9)

**ప్లాట్‌బ్రష్ :** (flat brash). మేకప్‌లో కనుబొమ్మలు దిద్దటానికి

వాడే కుంచె. (కో.7)

**ప్లాస్టిక్ :** చిత్రలేఖనంలో రంగులు కలుపుకునేందుకు ఉపయోగించే పేలట్ తయారీకి వాడే పదార్థం. (కో.3; రా.13)

**ప్లాస్టిక్ పూస :** మేకప్‌లో వాడే లోలకుల, దండల తయారీలో వాడేది. (రా.8)

**ప్లాస్టిక్‌పిడి :** బొపెన్ పట్టుకోడానికి వాడే భాగం. చూ.చిత్రం-31.1. (కో.7)

**ప్లాస్టిక్ పీటు :** వీణ తయారీలో వీణకుండకు అందానికి అతికించేది. (కో.6,6,6)

**ఫ్రూట్‌సాలిడు :** నాటకంలో నోట్లోంచి నెత్తురు రావాలం ే మైదాపిండి ఉడికించి దాంట్లో రంగు కోసం కలి ే. (కో.7)

**ఫ్రెంచ్‌పాలిష్ :** హార్మోణియంకు వేసే పాలిష్. (కో.39)

**ఫ్రెప్పు :** మేకప్‌లో మీసాలు పెట్టేప్పుడు ముందు పెదిమలకు గం రాసి పైన మీసాలు పెట్టి ఒత్తడం. (కో.77)

**ఫ్రెప్‌మేటర్ :** ముద్రించిన విషయం. (చిత్రలేఖనంలో అచ్చువేసిన విషయాల్ని కూడా వ్రాస్తారు). (కో.19)

**ప్లెయిన్ :** రంగ్రేజీ పనిలో అంచులు అద్దడానికి వాడే సాదాబట్ట. (తె.4)

**ఫ్రేము :** పర్యా. హాక్సాబ్లేడు. వీణతయారీలో కొయ్యను కోయడానికి వాడే హాక్సాబ్లేడు ఉండే చట్రం. (రా.5)

**ప్లేక్‌వైట్‌పౌడరు :** చిత్రలేఖనంలో గుడ్డమీద బొమ్మలు వేసేప్పుడు గుడ్డకు పూసే సర్ఫేసు. (కో.2,3)

**ప్లైఉడ్:** చిత్రలేఖనంలో ఆయిల్‌పెయింట్ వేయడానికి వాడే కర్ర. (కో.2)

# ఫ

**ఫరక్ :** తేడా. (తె.2)

**ఫాన్‌కేకులు :** మేకప్‌కి ఉపయోగించే ఒక రకం కేకులు.(కో.7)

**ఫిగర్:** సిమెంటుబొమ్మ, కొయ్యబొమ్మ, కాగితం గుజ్జుబొమ్మ ఆకారం. (కో.3,38,41)

**ఫింగర్ బోర్డు :** వీణకు, ఫిడేలుకు పైభాగంలో ఉండే అట్ట. చూ.చిత్రం-3.3. (కో.7; రా.5)

**ఫిడేలు :** వయోలిన్. సంగీత వాయిద్యం. చూ.చిత్రం-3. (కో.3; రా.8)

**ఫిడేలుఎద :** చూ.పై పీఠం. (రా.5)

**ఫిడేలువీపు :** పర్యా. అడుగు పీఠం. ఫిడేలు అడుగు భాగం. (రా.5)

**ఫినిష్ :** ముగించటం. పూర్తి చేయటం (చిత్రలేఖనం). (కో.3)

**ఫినిషింగ్ :** శిల్పాలు, సంగీత పరికరాలు మొదలయినవి చేసేప్పుడు వాటికి దిద్దే తుదిమెరుగు. (కో.1,7,24,31; తె.1,9,12; రా.5)

**ఫుల్(సైజు) :** వీణలో రకం. (రా.5)

**ఫెలికాలు :** శిల్పం పగిలితే అతికించటానికి, వీణకుండకు ప్లాస్టిక్ షీటు అతికించటానికి వాడే పదార్థం. (కో.6,31,34)

**ఫేస్‌పౌడర్ :** మేకప్‌లో ముఖానికి పూసుకునే పొడి. (రా.8)

**ఫైనల్ టచెస్ :** రాతిపనిలో శిల్పానికి చేసేతుది మెరుగు. (కో.31)

**ఫైనెస్ట్ సూది :** లెదర్ మౌంటు మీద చిత్రం దింపటానికి చిత్రం మీదట్రేసింగ్ పేపరు పెట్టి పైన గుచ్చటానికి వాడే సూది. (తె.1)

**ఫోల్డింగుతంబురా :** మడవటానికి వీలుండే తంబుర. (కో.31)

**ఫ్యాను :** హార్మోణియంలో ఉండే గాలిపంకా. చూ. గాలితిత్తి. (కో.31)

**ఫ్రిమేల్ :** హార్మోణియంలో బాగా సన్నని శ్రుతి చేయడానికి ఉపయోగించే సాధనం. (రా.10)

**ప్రైమరీకలర్స్** : చిత్రలేఖనంలో వాడే ముఖ్యమైన రంగులు. (కో.2)

**ప్రైమరీసర్ఫేస్** : పర్యా. సర్ఫేసు. చిత్రలేఖనంలో బొమ్మలకి ఆయిల్‌పెయింటు వేయడానికి ముందు పూసే ద్రవ్యం. (కో.2)

**ప్రైమెర్** : సిమెంటు బొమ్మలకి రంగు వేసే ముందు పూసే ద్రవ్యం. (రా.13)

**ఫ్రేం(విడదీయు)** : 1. చిత్రలేఖనంలో వేసిన బొమ్మను గోడకు తగిలించడానికి చేసే చట్రం. (తె.1)

2. శ్రుతి పెట్టెకి పైభాగంలో ఉండే చట్రం. (తె.3)

**ఫ్లూటు** : సంగీత వాయిద్యం. (కో.3,7)

## బ

**బగరవాకసూజ** : తబలా తయారీలో వాదిలు ఎక్కించేందుకు వాడే పరికరం. (తె.3)

**బంకమట్టి** : డోలక్‌కి కరిణ తయారీలో ఆముదం, గుగ్గిలంతో కలిపే మన్ను. (తె.3)

**బంగారంపీరు** : నాటకంలో వాడే ఆభరణాలు రాగితో చేయించి పైన బంగారం పూత పూయించడానికి వాడే ద్రవం. (కో.29)

**బంగారంరంగు** : చూ. గోల్డ్‌కలర్. (కాయితం) పూర్వం నాటకంలో వాడే కంకణాలు భుజకీర్తులు మొ॥నవి. కాగితంతో చేసి పైన అతికించడానికి వాడే కాగితం. (కో.29)

**బజాడపని** : (చేయు) రాతిపనిలో శిల్పం చెక్కేందుకు చేసే రఫ్‌వర్కు. చూ.కచ్చు. (తె.6)

**బటన్** : ఫిడేలుకుండే నరంగాని, తంతిగాని బిగించడానికి ఉపయోగించే వస్తువు. (కో.7; రా.5)

**...ర్‌పేపర్** : చిత్రలేఖనంలో ట్రేసు తీయటానికి వాడేది. చూ. ఉలిపొరకాగితం. (కో.19)

**బట్ట (కొట్టు)** : బ్యాండ్ వాయించడానికి వాడే కట్టెల చివర ఉబ్బు రావడానికి బట్టచుట్టి దానిమీద కుట్టిన తోలు. (తె.2)

**బటువు** : గట్టి. వీణ, వయొలిన్ తయారీలో కొయ్యగట్టిగ ఉండటం. (రా.5)

**బండ** : సిమెంటు పనిలో బ్రష్ చేసేప్పుడు మొగలి రేకుని చివర కుచ్చుగ చేయడానికి బండమీద పెట్టి బండతో నజ్జునజ్జుగ చేస్తారు. (రా.13)

**బండారుపంచి** : వాగ్గుకథలో సివం ఊగేప్పటి వేషం. ఈ పంచిలో వసువు, నిమ్మ కాయలుంటాయి. చూ.చిత్రం-20. (తె.1)

**బండికంపాస్** : వీణ తయారీలో కుండ ఒకేమందంలో వచ్చేటట్లు చేయడానికి వాడే పరికరం. (కో.6)

**బత్త** : హార్మోణియంలో సుతిపెట్టె. (తె.3)

**బదరీవిత్తనం** : రేగుపండు గింజ. (కో.7). ఫ్లూటుకు చేసే చిల్లులు రేగి గింజంత ప్రమాణంలో చేస్తారు.

**బదాట్కులు** : రంగ్రేజీ పనిలో వాడే అచ్చుపేరు. (తె.4)

**బద్ద(పెట్టు)** : 1. దీన్ని వెదురు కర్రతో ఒక చిన్నముక్కగా తయారుచేస్తారు. దీనిమీద కైవారం ఉంచి కొలత తీస్తారు. (కో.7)

2. చరఖా చక్రంలో ఉండేది. చూ.పలక. (తె.4)

**బఫ్‌విగ్గు** : నాటకంలో క్రూరత్వం ఉన్న వేషాల తలకి పెట్టేది. (కో.7)

**బయలు** : నాగస్వరం. (రా.5)

**బరంట్‌సైనా** : (Burnt sienna). చిత్రలేఖనంలో వాడే ముక్కుపొడిరంగు. (రా.9)

**బరి** : నాగస్వరంలో వాడే పీకలకి బెజ్జాలు సరిచేయడానికి 2 లేదా 3 దంతం సూదులుంటాయి. కొంచెంపెద్దదిగా ఉండేసూది బరి. (కో.7)

**బరిణ** : మేకప్‌లో వాడే కాటుక పెట్టే పాత్ర. (కో.7)

**బరువు :** 1. ఫిడేలు వాయించే కమాను తయారీకి వాడే పనసకొయ్య బరువుగా ఉండటం. (రా.5)

2. చిత్రలేఖనంలో కాగితం మీద బొమ్మ వేసేప్పుడు బరువు పెట్టడం. (కో.19)

**బర్రెచర్మం :** 1. తబల పూడిలోని మొదటి పొర. చాట్ (తె.3,7)

2. పక్వాడ్ వాడికి ఉపయోగించే చర్మం. (తె.3)

3. గజర అల్లే చర్మాలలో ఒకటి. మేక చర్మంతో కలిపి అల్లుతారు. (తె.3)

**బలపం రాయి :** రాతిపనిలో వాడే శిల. (తె.6)

**బల్ల :** 1. వీణ కుండ మీదిమూత. (కో.28)

2. వీణ కుండే ఫింగర్ బోర్డు. (కో.7; రా.5)

3. ఫిడేలుకి పైభాగం. (రా.5)

**బలిగంప :** వొగ్గుకథలో పరుగు కలిపేగంప. (తె.1)

**బలిపీఠం :** ఆలయాలలో ధ్వజస్తంభం దగ్గర అమర్చే పీట. (కో.33)

**బప్రవాగడం :** డోలకు కరిణ తయారీలో గనిరాయిని పొడిచేసి గుడ్డలో ఏసి వడగట్టడం. (రా.5)

**బహురూపులవారు :** డక్కి వాయించేవారు. (తె.2)

**బాక్స్ :** హార్మోనియం లోపల ఉండే పెట్టె. (తె.3)

**బాక్సెప్ :** చిత్రలేఖనంలో కమర్షియల్ ఆర్ట్‌లో చేసే సబ్బుపెట్టె. (కో.19)

**బాడిస :** సంగీత పరికరాల తయారీలో వాడే పనిముట్టు. చూ.చిత్రం-56. (కో.5,6,7,12,10,28,13,23,33, 39,36; తె.1,3,4,5,9,13; రా.3,4,6,13)

**బాడీ :** హార్మోణియం చెక్కపెట్టె. (కో.39)

**బాడీబందరు :** మేకప్‌లో భుజానికి కట్టే ఆభరణం. (రా.8)

**బాణం :** మేకప్‌లో పెట్టే ఒక రకం బొట్టు. చూ.చిత్రం-27.11. (కో.7)

**బాణీ :** బుర్రకథలో పాట పాడే తీరు. (తె.1)

**బాయిలర్ లెన్సిడ్ ఆయిల్ :** చిత్రలేఖనంలో (ఆయిల్ పెయింటింగ్) వేసే రంగులలో కలవడానికి వాడే ఒకరకం నూనె. (తె.1)

**బాల్సులు :** ఇనుప గుండులు. వీటిని 'మరాకోస్'లో (ప్లూటు) శబ్దం రావటానికి వేస్తారు. (రా.8)

**బావుదారి :** పర్యా. బావుదారు. చూ. బాడిశ. (కో.13,26; తె.9)

**బాస్‌బారు :** రూపా. బేస్‌బారు. ఫిడేలుకు ఎడమవైపు బల్లలోపలి భాగంలో అంటించి ఉండే కర్రముక్క. (కో.7; రా.5)

**బాహుమూలం :** రాతిపనిలో శిల్పానికి చేతులకి చెక్కే ఆభరణం. (కో.31)

**బాహువలయం :** రాతిపనిలో శిల్పానికి చేతులకి చెక్కే కడియం. (కో.31)

**బిగింపు :** 1. వీణ తయారీలో మైనంతో మెట్లు బిగించటం. (కో.7)

2. మృదంగం, డోలకు తయారీలో మూతలకి చర్మం బిగించటం. (కో.5,5)

3. వీణ కుండకు నాగపాశం బిగించి ఉండటం. (రా.5)

**బిగిరౌతు :** రాతిపనిలో శిల్పానికి వాడే గట్టిరాయి. (తె.6)

**బిగుసుకొను :** సిమెంటు బొమ్మల తయారీలో బొమ్మ ఆరడం. (రా.13)

**బింకం :** మృదంగం తయారీలో వాడే తరిణ దొడ్డిలో పెట్టే చప్ప కొయ్యలు గట్టిగ ఉండటం. (కో.7)

**బిచ్చగాండ్లు :** చూ. అడుక్కునేవాడు. కథను చెప్పి అడుక్కునేవారు. (తె.2,7,9)

**బిచ్చం(అడుక్కొను) :** ముష్టివాళ్ళకు వేసేది. జానపద కథకుల వృత్తి. (తె.9)

**బియ్యం :** సివసానంలో వేసే గింజలు. (తె.1)

బిరడా : పర్యా. బిరికీ. చూ.పెగ్గు. వీణ, తంబుర, ఫిడేలులకు తీగలు బిగించడానికి వాడే మూత. చూ.చిత్రం-3.2. (కో.6,27,24; రా.5,8)

బిరడాపెట్టె : వయొలిన్‌కి బిరడాలకి బిగించే చోటు. (రా.5)

బిరికీ : పర్యా. మేరువ. చూ. బిరడా, వీణ, పెగ్గు. తంబురలో ఒక భాగం. చూ.చిత్రం-1.4; 2.6. (కో.13)

బిరుసు : మేకప్‌లో వాడే విగ్గుల తయారీలో వాడే చమ్రీ మృగం వెంట్రుకలు మొద్దుగ ఉండటం. (కో.7)

బిళ్ళ : 1. డోలకు మూతకి ఉండే చర్మం ముక్క. (రా.5)

2. బుర్రకథ చెప్పేవారి తలపాగాకి ఈకలు తగిలించడానికి ఉండే తురాయి భాగం. (తె.1)

బిళ్ళకత్తి : మృదంగం తయారీలో తోలు శుభ్రం చేయడానికి వాడేకత్తి. (రా.5)

బిళ్ళగోచి : మేకప్‌లో కట్టే పంచకట్టులో ఒకరకం. (కో.29)

బీడ : పర్యా. పగులు. వీణ తయారీలో వాడే కొయ్య పచ్చిగ ఉంటే కొంతకాలానికి ఆ కొయ్యకి వచ్చే బీట. (రా.5)

బీరప్పకత : 1. గొల్లల్లో అడుక్కునే వారు చెప్పే ఒక కథ (తె.7)

2. ఒక ఒగ్గుకథ (తె.1)

బీరప్ప పండుగ : చైత్రమాసంలో వచ్చే పండగ (వొగ్గు కథ వారికి). (తె.1)

బుక్కారు : రూపా. బుగ్గకారు. పర్యా. పెద్దపట్కారు, బుగ్గ పట్కారు. తబల తయారీలో మేకులు తీయటానికి వాడే సాధనం. (కో.7)

బుట్ట కిరీటం : మేకప్‌లో కృష్ణుడి పాత్రకి పెట్టే కిరీటం. (కో.7)

బుడబుక్కలవారు : జగ్గు వాయిద్యాన్ని ఉపయోగించేవారు. (తె.2)

బుడుపు : ప్లూటు తయారీలో వాడే కర్ర కుండే కణుపు. (కో.7)

బున్నత్ : తబలా తయారీలో మూతకి అల్లే గజల్‌లో వాడే రంగుతోలు లేదా రెగ్జిన్. (తె.2)

బుర్ర : చూ. కీర్తి ముగుడి బుర్ర.

1. మృదంగం తయారీలో వాడే దారు బాడిల్ లోని భాగం. (కో.7)

2. వీణ తయారీలో చేసే కుండ. (కో.6,7,13)

బుర్రకథ : పూర్వపు యక్షగానాలకి నేటి రూపం. చూ.చిత్రం-24. (తె.1,2)

బుర్రకథ తంబుర : బుర్రకథలో మాత్రమే వాడే తంబుర. చూ.చిత్రం-23. (కో.13)

బురుషు : రూపా. బులుసు. కొయ్య బొమ్మలకి రంగులు వేయడానికి, ఫిలిగ్రీ పనిలో వస్తువుల్ని తోమడానికి వాడే బ్రష్ (కుంచె). చూ.చిత్రం-30. (తె.4,7,8,)

బులుసుల గొట్టం : చూ. కలాల గొట్టం. కుంచెలు పెట్టుకునే పెట్టె. (తె.9)

బూడిద : తబలాకు బోనం తయారీలో దీన్ని (బూడిదని) అన్నాన్ని కలుపుతారు. (తె.2,3)

బెజ్జం : చిల్లు. చూ.చిత్రం-4.9. (కో.5,6,7,9,11,30,31,33; రా.5,6)

బెత్తెడు : కంజీర ఎత్తు (నాలుగు వేళ్ళ వెడల్పు). (కో.7)

బెరుసు ఎంటిక : పరదాలపై అద్దకం పనిలో వాడే కుంచె తయారీలో వాడే ఎద్దు తోక, పంది తోక బిరుసు వెంట్రుక(లు). (తె.2)

బెల్ ఊస : హార్మోనియంలో భాగం. చూ.చిత్రం-4.3. (కో.3,9)

బెల్లంరంగు : చూ. గోధుమ రంగు. చిత్రలేఖనంలో వాడే గోధుమ (Brown) రంగు. (తె.1)

బెల్టు : నాటకంలో నడుముకి పెట్టుకునే పటకా. (రా.8)

బెలూన్ రబ్బరు : నాటకంలో కాలిన ముఖానికి మేకప్ చేసేప్పుడు వాడే వస్తువు. (కో.7)

**బేస్ :** 1. హార్మోనియంలో వాడే రీడ్ చట్రం. (కో.39)

2. చిత్రలేఖనంలో బొమ్మ గీయడానికి ఆధారంగా తీసుకునే నమూనా. (తె.1)

**బేస్ కలరు :** 1. మేకప్‌లో మగవాడి కళ్లు పెద్దవిగా కనబడటానికి వాడే రంగు. (కో.7)

2. చిత్ర లేఖనంలో బొమ్మలకి వేసే రంగు. (తె.1)

**బేస్‌బర్మా :** చూ. పిడిసాని. హార్మోనియం తయారీలో చెక్కకు చిల్లు వేయడానికి వాడే పరికరం. (కో.39)

**బేసుబారు :** వయొలిన్‌కు లోపల అతికి ఉండే భాగం. (రా.5)

**బైటి బత్త :** హార్మోనియంలో భాగం. (తె.3)

**బైండింగ్ :** హార్మోనియంలో గాలి బయటకు పోకుండా ఉండటానికి మేక చర్మంతో అడ్డుగా అమర్చటం. (కో.29)

**బైండింగ్‌వైరు :** సిమెంటు బొమ్మల తయారీలో తడిగా ఉన్న సిమెంటు అతకడానికి ఇనప కడ్డీ నిలబెట్టి కడ్డీకి దగ్గరగా ఈ తీగ చుట్టి సిమెంటు వేస్తారు. (రా.13)

**బైరూపులవాళ్ళు :** బహురూపులవాళ్ళు - నాటకాలు ఆడతారు. (తె.2)

**బొక్క :** 1) రాతి పనిలో వాడే రాయిని పగల గొట్టడానికి చేసిన చిల్లు. (రా.5)

2. సన్నాయి తయారీలో చేసే చిల్లు. (కో.36)

**బొచ్చె :** నాటకంలో కబీరు పాత్రకి వాడే కాశీ కొబ్బరి కాయ చిప్ప. (కో.29)

**బొట్లు :** మేకప్‌లో ముఖానికి పెట్టే చుక్కలు. (రా.5)

**బొడ్డుగంట :** వొగ్గుకథ చెప్పేవారి వేషంలో వాడే వస్తువు. (తె.1)

**బొత్త :** రాతిపనిలో విగ్రహానికి ఉండే "పొట్ట". (తె.1)

**బొత్తుకట్టు:** రాతి పనిలో విఘ్నేశ్వరుడి విగ్రహానికి పొట్టకు కట్టే అలంకార యుక్తమైన కట్టు. (తె.6)

**బొడ్డాకురాయి :** రాతి పనిలో విగ్రహం బొడ్డు భాగంలో వాడే ఆకురాయి. (తె.6)

**బొద్దు :** 1. రాతి పనిలో చేసే డిజైను. (తె.6,8,12; రా.4)

2. వీణకుండకు చేసే డిజైను. చూ.చిత్రం-1.15. (కో.6)

3. చూ. ఉబ్బు. జగ్గులో ఒక భాగం. చూ.చిత్రం-10.2.

**బొమ్మ :** పటం. చూ.చిత్రం-29.3. (కో.12,16,19,30; తె.1,4,7,9,12,13,15; రా.4,11)

**బొమ్మళ్ళతిప్పు :** కంజీరా తయారీలో చర్మం ఉండే వైపును పైకి చుట్టటం. (కో.7)

**బో :** (Bow). చూ.కమాను. ఫిడేలు వాయించడానికి వాడే కమ్మి. (కో.3; రా.5)

**బోంగోస్ :** సంగీత వాయిద్యం. (తె.2)

**బోడిగుండు :** మేకప్‌లో పెట్టే విగ్గు. (కో.7)

**బోనం (వేయు) :** పక్వాద్ చర్మం మీద వేసే పదార్థం (జొన్నగట్ట పిండి + బూడిద). (తె.3)

**బోనం పుడి :** మృదంగంలో బోనం ఉన్న భాగం. (తె.2)

**బ్లోయరు :** శిల్పం, సిమెంటు బొమ్మల తయారీలో పనిముట్లు బాగు చేసుకొందుకు వాడే చేతి స్టౌ/కొలిమి. (కో.3; రా.1)

**బోర్డ్ :** చిత్రలేఖనంలో పేర్లు రాసిన చెక్క. (కో.19)

**బోర్డరు :** చూ. గొడు, అంచు. ఫిడేలుకు చుట్టూ ఉండే అంచు. (కో.7)

**బోర్డు :** 1. హార్మోనియం తయారీలో వాడే రీడ్లున్న అట్ట. (కో.7; తె.3)

2. చిత్రలేఖనంలో చర్మం మీద బొమ్మ వేసేప్పుడు చర్మాన్ని పెట్టడానికి వాడే అట్ట. (రా.11)

**బోర్లపడు :** రాతిపనిలో విగ్రహం చెక్కేప్పుడు శిల వెనకవైపుకు పడటం. (తె.6)

**బోలు :** 1. మేకప్‌లో మీసాన్ని తిప్పటానికి వాడే పించర్‌లోని

కాడలాంటి భాగం. (కో.7)

2. ఫ్లూటు తయారీకి వాడే కర్రలోపల డొల్లగ ఉండటం. చూ.చిత్రం-19.1. (రా.5)

**బోలుగడెం** : వొగ్గుకథ చేప్పేవారు కుడిచేతికి పెట్టుకునే దండకడెం (తె.1)

**బౌటు** : వయోలిన్ తయారీలో వయొలిన్‌కి రెండు మూలల మధ్య ఉండేస్థలం. (రా.5)

**బౌపెన్** : చిత్రలేఖనంలో గీతలు కొట్టడానికి వాడే కలం. చూ.చిత్రం-31. (కో.19)

**బ్యాక్‌గ్రౌండ్** : చిత్రలేఖనంలో బొమ్మలకు వెనక ఉండే దృశ్యం. (కో.25)

**బ్యాండ్** : ఒక సంగీత పరికరం. (కో.26; తె.2)

**బ్యాండ్‌కట్టె** : బ్యాండును వాయించటానికి వాడే పుల్ల. (తె.2)

**బ్యాండోళ్ళు** : బ్యాండును వాయించే వాళ్ళు. (తె.2)

**బ్రష్** : రంగులు, పాలిష్ వేయటానికి వాడే కుంచె. (కో.12,17,25,28,41; తె.1,2,9; రా.3,5,11) చూ.చిత్రం-30.

**బ్రహ్మతాళం** : సంగీత వాయిద్యం. (కో.7)

**బ్రిడ్జ్** : 1. ఫిడేలు తీగలను వత్తిపట్టి ఉంచే భాగం. చూ.చిత్రం-3.4. (కో.3)

2. చూ. గుర్రం. వీణ కుండ మీద తీగెలను ఎత్తిపెట్టి ఉంచటానికి వాడే కట్టు. (కో.7; రా.5)

**బ్రౌన్** : (Brown). చూ. గోధుమ రంగు. మేకప్‌లోను, చిత్రలేఖనంలోను వాడే గోధుమ రంగు. (రా.5,13)

**బ్రౌన్‌పేపరు** : చిత్రలేఖనంలో బొమ్మలు వేయడానికి వాడే కాగితం. (కో.3)

**బ్రౌనురంగు** : చూ. బ్రౌను. (కో.7)

**బ్లాక్** : నలుపు. చిత్రలేఖనంలో వాడే నలుపురంగు. (కో.3)

**బ్లాక్ పౌడరు** : మేకప్‌లో కాటుకకు వాడే పొడి. (కో.7)

**బ్లాక్‌ఉడ్** : వీణ తయారీకి వాడే కర్ర. (కో.34; రా.5)

**బ్లాక్‌లేకింగ్** : చిత్రలేఖనంలో నమూనా బొమ్మ. (కో.19)

**బ్లాకుబోర్డరు** : వయొలిన్ తయారీలో చుట్టూ అంచుకి నలుపు రంగు వేయడం. (కో.7)

**బ్లీచింగ్ పౌడరు** : వీణదండి మీద మెట్లు అమర్చటానికి పోసే మైనంలో గట్టిదనం కోసం కలిపే పొడి. (కో.24)

**బ్లోల్యాంపు** : లోహం పనిలో బొమ్మభాగాలని అతకడానికి వాడే యంత్రం. (కో.33)

## భ

**భజన(పార్టీ)** : పర్యా. భజనమండలి. భజనలో పాల్గొనేవారు. (తె.3)

**భజన వాడకం** : తబలాను భజనల్లో మాత్రమే వాడటం. (తె.3)

**భద్రపీఠం** : చూ. గద్దె. రాతిపనిలో చేసే శిల్పం అడుగు భాగం. (రా.8)

**భస్మాస్త్రం** : రాతిపనిలో శిల్పానికి రెండుచేతులు సమానంగా పెట్టినట్లుగ చెక్కడం. (కో.19)

**భాగోతం** : జానపద కథారూపం (భాగవతం). (తె.3,7)

**భారతి(యిచ్చు)** : వొగ్గుకథలో జగ్గుతో ధ్వని చేస్తూ 'అంబా భారతి' దరువుతో పాడడం. (తె.1)

**భావసార క్షత్రియులు** : ఒక జాతివారు (ముచ్చీలు). (కో.19)

**భిన్నం** : రాతిపనిలో చేసిన శిల్పం పగిలి పోవటం. (తె.6)

**భీకరం** : భయంకరం. (రా.10)

**భుజకంకణం** : పర్యా. భుజకీర్తి. మేకప్‌లో భుజానికి వేసుకునే కంకణం. (రా.8)

**భేరి** : సంగీత వాయిద్యం. (కో.7)

## మ

**మకరకుండలం** : రాతిపనిలో చెక్కే శిల్పానికి చెవులకుండే

ఆభరణ విశేషం. (కో.31)

**మకరతోరణం** : శిల్పం వెనక, పక్కన, పైన, చుట్టూ ఉండే మొసలి రూపంగల తోరణం. (కో.18,28,33; తె.12; రా.1)

**మకరిలతలు** : రాతిపనిలో శిల్పానికి చెక్కే ఒక విధమైన డిజైను. (కో.31)

**మకుటకిరీటం** : చూ.కిరీట మకుటం. రాతిపనిలో శిల్పానికి చెక్కే కిరీటం. (రా.5)

**మకుటం** : చూ.ధోతి. రాతిపనిలో శిల్పానికి చెక్కే పంచె. (రా.8)

**మగాసిల్క్** : చిత్రలేఖనంలో వాడే ఒకరకమైన సిల్కుబట్ట. (తె.1)

**మగుడి** : పాముల వాడి నాగస్వరం. (కో.7)

**మంగళ వాయిద్యం** : నాగస్వరం (శుభం జరిగేప్పుడు వాయించుతారు కాబట్టి ఆపేరు). (రా.5)

**మంగళ హారతి** : హరికథ, బుర్రకథ మొదలగు వాని ముగింపు పాట (గీతం). (కో.37; తె.1; రా.10)

**మచ్చ** : మేకప్‌లో కాలినట్లు పెట్టే గుర్తు. (కో.7)

**మచ్చ గిచ్చలు** : రాతిపనిలో శిల్పానికి వాడే శిలలో మచ్చలు మొదలైన లోపాలు. (తె.6)

**మజ్జన** : మధ్యన. (కో.7)

**మజంతా** : చిత్రలేఖనంలో వాడే లేతవైలెట్ రంగు. (రా.13)

**మంచిగడియ** : రాతిపనిలో విగ్రహం చెక్కడం మొదలు బెట్టటానికి చూసే మంచి సమయం (ముహూర్తం). (తె.6)

**మంచి గుగ్గిలం** : వీణ తయారీలో దండెకు అంటించే మైనంలో కలపడానికి వాడే ద్రవ్యం. (కో.6)

**మంచి మానె** : నువ్వులనూనె. రాతి పనిలో విగ్రహాలకు మెరుపు, రంగుకోసం దీన్ని రాస్తారు. (తె.6)

**మంచుపొగ** : చిత్రలేఖనంలో చిత్రించే మంచుపొర. (కో.2)

**మట్టం** : రాతిపనిలో శిల్పానికి చెక్కే కిరీటంలో భాగం. (కో.31)

**మట్టి** : 1.బుర్రకథలో వాడే ఢక్కి తయారికి వాడే మన్ను. (తె.1)

2. పూర్వం తబలా తయారీకి వాడే మన్ను. (కో.7)

3. నాటకంలో వాడే గద, కిరీటం మొదలయినవి చేయటానికి వాడే మన్ను. (కో.7)

**మట్టిగిన్నె** : చిత్రలేఖనంలో రంగులు కలుపుకోవటానికి వాడే మట్టితో చేసిన గిన్నె. (రా.9)

**మట్టిచిప్ప** : పరదాలపై అద్దకం పనిలో రంగులు కలుపుకొందుకు వాడే గిన్నె. (తె.2)

**మడక** : పర్యా. హలం. నాగలి (నాటకంలో బలరాముడి పాత్ర ఆయుధం). (రా.1)

**మడత** : హార్మోణియంలో అడుగు చెక్కలు పెట్టిన ఏర్పాటు. (కో.7)

**మడేలయ్య పురాణం** : చాకలి వారిలో పటం వారు, గంజికుంటోండ్లు, ఏమాటి వాండ్లు చెప్పే పురాణం. (తె.9)

**మణికట్టు** : వీణ వాయించేటప్పుడు కుండ ఎడంవైపు పైభాగంలో - అంటే 24వ మెట్టుకు పీటకు మధ్య - ఆనించే కుడిచేయి భాగం. (కో.7)

**మణిపురం** : వీణకు నాల్గవ మెట్టు అమర్చిన చోటు. (కో.7)

**మణిశిల** : చూ.ఇంగ్లీకం. ఎరుపు రంగు వచ్చేరాయి. మేకప్ రంగుల్లో వాడుతారు. (కో.29)

**మంటల డిజైన్** : నాటకాలలో వాడే తెరమీద మంటల మాదిరి బొమ్మలు గీయడం. (కో.29)

**మండపం** : దేవాలయంలో ఒక భాగం. (తె.6)

**ముత్యంముక్క** : తంబుర కుండకి బయట బిగించే పూస. (కో.13)

**మద్దిలి** : రూ. మద్దెల. పర్యా. మృదంగం. సంగీత వాయిద్యం. (కో.7)

**మసాల** : 1. పర్యా. మైదం. గషి (నూనె డబ్బాకు అడుగుభాగాన పేరేది) + ఆముదం పలుకులు. ఢోల్కికి దూంపుడి వైపున వేస్తారు. (తె.22)

2. ఢోల్కి దూంపుడికి లోపలివైపు పూసే వంగన్. (తె.3)

**మసి.** : పర్యా. మసిపొడి, మసికుండ.

1. వీణ తయారీలో దండెపైన పూసే తేనె మైనం గట్టిగ ఉండటానికి కలిపే ద్రవ్యం. (కో.24)

2. చిత్రలేఖనంలో ట్రేసు తియ్యటానికి ఉపయోగించే పదార్థం. (కో.19)

**మసిగుండ**: చూ. మసి. (కో.6)

**మహోదరి** : ఒక వొగ్గుకథ. (తె.1)

**మహాభారతం** : ముతరాసి కులంలో కాకి పడిగెల వారు ఈ కథ చెపుతూ అడుక్కొంటారు. (తె.9)

**మాక్స్‌ఫాక్టరీ** : (Max Factory) మేకప్‌లో వాడే రంగులు తయారుచేసే కంపెని. (కో.7; రా.5)

**మాంగనీసుపొడి**: మృదంగం కరిణపిండి తయారీలో వాడే పొడి. (రా.5)

**మాచింగు**: (Matching); రంగుల పొంతన (మేకప్). (కో.7)

**మాటాఉలి** : మృదంగం, తబలా తయారీలో చట్రం డొలపడానికి వాడే ఉలి. (కో.5,7)

**మాడులు**: కట్టెలమ్మే చోటు. (కో.36)

**మాద్దు**: వీణకుండ డిజైన్‌లో రంగులను నింపు. (కో.6)

**మాత్ర** : తబలా, మృదంగం కరిణ చేసేప్పుడు కరిణ పిండిని చిన్న ఉండగా చేస్తారు. ఆ ఉండని మాత్ర అంటారు. (కో.5)

**మాదిగడప్పు** : నగారా. తోలు బొమ్మలాటలో వాడ్తారు. (రా.10)

**మాదిగోల్ల తప్పెట**: చూ. మాదిగ డప్పు. (రా.13)

**మాంబళం** : చూ. గోల్డ్ కలర్. చిత్రలేఖనంలో వాడే బంగారపు వన్నె కలిసిన పసుపు రంగు. (రా.13)

**మార్కండేయ పురాణం**: పద్మశాలి కులంలో కూనెపులి వాండ్లు చెప్పే పురాణం. (తె.9)

**మార్కు**: (Mark). మేకప్ చేసేప్పుడు ముఖానికి పెట్టే గుర్తు. (కో.7)

**మార్బుల్ పలక** : తెల్లగ ఉండే రాయి. దీని మీద పేర్లు చెక్కుతారు (పాలరాయి). (కో.13)

**మాల్** : సరుకు (రాతి శిల్పాలు). (తె.6)

**మాలసిందోళ్ళు** : నాటకాలు వేసే కులం వాళ్ళు. (తె.2)

**మిక్స్** : చిత్రలేఖనంలోను, మేకప్‌లోను రంగులు కలుపుకోవటం. (కో.3,7; రా.5)

**మిఠాయి రంగు** : వీణకు వేసే ముదురు పసుపు రంగు. (కో.28)

**మిడిల్ క్రోం** : చూ. అద్దిలం. చిత్రలేఖనంలో వాడే పసుపు రంగు. (కో.13)

**మిడిల్‌షేడ్** : చిత్రలేఖనంలో రంగుల భేదాలను తెలిపేరంగులలో మధ్యరకంగా ముదురూ లేతా కాకుండా వేసే రంగు. (తె.1)

**మిరాజ్ తంబుర** : తంబురలో ఒక రకం. (రా.8)

**మిషన్‌టేపు** : హార్మోణియం తయారిలో కొలతలు చూడటానికి వాడే దర్జీ దగ్గరుండే టేపు. (కో.28)

**మీటు** : పర్యా. వీణ మాటు(లు).

1. వీణను వాయించు. (కో.7,13; రా.5)

2. మృదంగం కుడి మూతకి ఉండే మూడు పొరల్లో రెండవ పొర. (రా.5)

**మీడియం** : మేకప్‌లో వాడే మీసం రకం. (కో.7)

**మీటు తంత్రులు** : వీణను వాయించటానికి దండి మీద ఉండే తీగలు. (కో.7)

**మీసం** : మేకప్‌లో పై పెదవికి పెట్టే వెంట్రుకలు. (రా.8)

**ముక్క** : 1. సిమెంటు బొమ్మల తయారీలో బొమ్మకు అంటించే చిన్న చిన్న కాలిన ఇటిక భాగం. (రా.13)

2. తబల తయారీలో (కంజీర తయారులోను) వాడే చర్మాన్ని కోసిన భాగం. (కో.6,7)

3. వీణ తయారీలో వాడే కొయ్యని కోయించే భాగం. చూ.తునక. (కో.6)

**ముక్కర** : మేకప్‌లో స్త్రీలు ముక్కుకు పెట్టుకునే ఆభరణం. (కో.7)

**ముక్కు పట్టినట్లు వచ్చు** : తబలాకు శాయి లేచిపోతే ధ్వని వచ్చే తీరు. (కో.5)

**ముక్కోణపు ఆకురాయి** : రూపా. ముక్కోణం ఆకురాయి, ముక్కోనం ఆకురాయి, ముక్కోనాకురాయి. రాతి పనిలో శిల్పం సాపు చేయడానికి వాడేది. చూ.చిత్రం-54. (తె.6)

**ముఖగబళికలు** : ముఖకళవళికలు (నాట్యం). (కో.3)

**ముఖభావం** : పర్యా. ముఖరసం. రాతిపనిలో చెక్కే శిల్పం ముఖం భావ ప్రకటన. (రా.5)

**ముఖం** : రాతి పనిలో చేసే విగ్రహంలో భాగం. (తె.6)

**ముఖరసం** : రాతి పనిలో చెక్కే శిల్పం ముఖభావం. హావభావ ప్రకటనలో చూపించే రసం. చూ. ముఖభావం. (రా.8)

**ముఖవీణ** : సన్నాయి మాదిరిగా ఉండే సంగీత వాయిద్యం. తోలు బొమ్మలాటలో వాడతారు. (రా.10)

**ముఖ్యతంతులు** : వీణను వాయించడానికి ఉపయోగించే తీగలు. (రా.5)

**ముగ్గు** : రంగ్రేజి పనిలో వాడే అచ్చు నమూనా పేరు. (తె.4)

**ముచ్చబంగారం** : నాటకంలో వాడే గద, ధనుస్సు, తూణీరం మొదలయిన వస్తువుల తయారీలో పైన అంటించే ఒక రకమైన మెరిసే కాగితం. (రా.8)

**ముచ్చి** : ఒకజాతి; ఒక కులం వారు. బొమ్మలు వేస్తారు. (కో.19,26)

**ముచ్చిన గుంట** : తలవెనక భాగం. (కో.7)

**ముంచు** : 1. రంగ్రేజి పనిలో బట్టమీద అద్దేప్పుడు బ్లాక్‌ని రంగులో దించు. (కో.27)

2. చిత్రలేఖనంలో బట్ట మీద బొమ్మలు వేసేప్పుడు కలాన్ని సిరాలో ఉంచు. (రా.13)

**ముంజేతి కంకణం** : పర్యా. ముంజేతి పట్టీ. నాటకంలో చేతులకి వేసుకునే కడియం. (రా.8)

**ముంజేయి** : తంబూర వాయించేప్పుడు తంబూరాకుండే గుంట భాగంలో పెట్టుకునే చేతి భాగం. (కో.13)

**ముంజేయి కడెం** : చూ.పొంచి. వొగ్గుకథ చెప్పేవారు వేషం లేకుండా చెప్పేప్పుడు ఎడం చేయి ముంజేతికి వేసుకునే నగ. (తె.1)

**ముటీ** : చూ. పిడి. వీణ తయారీలో కొయ్యని కోయడానికి వాడే రంపం పిడి. (కో.6)

**ముట్టించు** : వొగ్గుకథలో జ్యోతిని వెలిగించు. (తె.1)

**ముడత** : చిత్రలేఖనంలో కాగితాన్ని తడపకుండ నీటి రంగులు వేసే కాగితానికి వచ్చే వంపు. (కో.19)

**ముడి** : 1. మేకప్‌లో కోయవేషానికి తల వెనకాల రిబ్బను పెట్టి కట్టడం. (కో.7)

2. వీణ తయారీలో తీగల్ని అన్నిటిని ఒక చోట కట్టిన కట్టు. (కో.7)

**ముడికొట్టు** : రాతి పనిలో రాయిలోని ఎచ్చు తగ్గులు నరికి సాపు చేయు. (కో.33)

**ముడిపదార్థం** : డోలకు తయారీలో వాడే కొయ్యమొద్దు. (కో.13)

**ముడివిగ్గు** : నాటకంలో ఋషులు ధరించే విగ్గు. (కో.7)

**ముడిసరుకు** : రాతిపనిలో శిల్పం తయారీకి వాడే శిల. (తె.6)

**ముత్యం ముక్క** : తంబూరలో భాగం. చూ.చిత్రం-2.2. (కో.5)

**ముదరాబు** : వీణ వాయించేప్పుడు వేళ్ళకు పెట్టుకునే తీగవల. (రా.5)

**ముదురు** : చిత్రలేఖనంలో పర్వతాలు మొ॥వి దగ్గర దగ్గరగా కనబడటానికి వాడే రంగు. (కో.2; తె.1)

**ముదురు నైతరం** : రాతి పనిలో శిల్పాన్ని నునుపు చేయడం. (కో.31)

**ముద్ద** : 1. సిమెంటు బొమ్మల తయారీలో సిమెంటు, ఇసుక, నీరు, కలిపిన పదార్థం. (కో.3)

2. డోలకు మూతకి వేసే కరిణ పిండి. (కో.5,5)

3. చూ.పేస్టు. మృదంగానికి వాడే కరిణ పిండి తయారీలో నూరే సిత్రేకురాయిపొడి. (కో.7)

**ముద్దపొడి** : కరిణ పిండి తయారీలో సిత్రమరాయి పొడిని నీటిలో వేస్తే అడుగున చేరే పొడి. (కో.7)

**ముద్ది(కుట్టు, దించు)** : మృదంగం, తబల మూతకి కడియం కుట్టు. (కో.7)

**ముని చేతులు** : ముంజేతులు (మేకప్‌లో చేతులకు భుజం మీద నుంచి "ముని చేతుల" వరకు మంచి ఖరీదైన దుస్తులు వాడతారు. (కో.7)

**మునం** : వొగ్గు కథ చెప్పటం ప్రారంభించటం. (తె.1)

**ముందు ముద్ది** : తబలా, మృదంగాలకు మూతలకి ముందుగా అల్లే కడియం. (కో.7)

**ముప్పావు ఇంచీ** : వయోలిన్ తయారీలో వాడే పై కర్ర ఉండవలసిన మందం. (కో.7)

**మురళి** : పర్యా. వేణువాద్యం, ఫ్లూటు.

1. సంగీత వాయిద్యం. చూ.చిత్రం-19 (8.4). (కో.19)

2. నాగస్వరంలో భాగం. చూ.చిత్రం-18.4. (కో.7)

**మురళీ హస్తం** : రాతి పనిలో చెక్కే శిల్పానికి రెండు సమానంగా ఉన్న చేతులు. (కో.19)

**ములిక** : చూ.పిన్ను. మేకు. చిత్రలేఖనంలో కాగితాన్ని బోర్డుకి కొట్టడానికి వాడే మేకు. (రా.13)

**ముల్లు** : రాతిపనిలో శిలని చెక్కడానికి వాడే శానం. (రా.33)

**ముల్లె** : 1. తబల కుండకి స్పిరిట్‌పాలిష్ చేసేప్పుడు వాడే గుడ్డతో కట్టిన దూదిమూట. (తె.3)

2. చిత్రలేఖనంలో ట్రేసు తీయడానికి వాడే సుద్దపొడి మూట. (తె.1)

**ముళ్ళఆకురాయి** : 1. రాతిపనిలో శిలలపై బొమ్మను చెక్కిన తరువాత నైసు చేయడానికి వాడేది. (కో.31)

2. వీణ తయారీలో వీణను నైసుచేయడానికి వాడేది. చూ.చిత్రం-55. (కో.13)

**ముళ్ళు** : వీణ తయారీలో చిల్లులు పొడవడానికి బరమాకు పిడికింద ఉండే నొక్కులు. (రా.5)

**మువ్వలగుత్తి** : కంజీరాకు చుట్టూరా ఉండే చిల్లుల్లో ఉండే గజ్జలు. (కో.7)

**ముసలిమీసం** : మేకప్‌లో పెట్టే మీసాలలో ముసలి వేషానికి పెట్టే మీసం. చూ.చిత్రం-26.3. (కో.5)

**ముసాంబరం** : చిత్రలేఖనంలో బంగారం రంగు రావటానికి అవిశనూనె గుగ్గిలంలో కలుపుతారు. దీన్ని ముసాంబరం అంటారు. (తె.1)

**ముహూర్తం** : పర్యా. లగ్నం.

1. రాతిపనిలో శిల్పం చెక్కటానికి చూసే మంచి సమయం. (తె.6)

2. నాటకాల్లో వాడే శక్తి, హనుమంతుడు బొమ్మల మోల్డింగ్ చేసేటప్పుడు చూసే మంచివేళ. (కో.7)

**మూగగా** : పర్యా. రఫ్‌గా. రాతిపనిలో శిల్పాన్ని ముందు ఆకారం మాత్రం చెక్కడం. (కో.28)

**మూగలు** : వొగ్గుకథ చెప్పేవారు వేషం వేసుకునేప్పుడు ధరించే పిక్కగజ్జెల మీది మువ్వలు. (తె.1)

**మూటకట్టు** : సిమెంటు బొమ్మలకు గ్రాఫైటు పొడరు అద్దేప్పుడు పొడరుని గుడ్డలో కట్టు. (కో.3)

**మూడు పువ్వులు నాలుగుముక్కోణాలు** : మేకప్‌లో వేసే వేషంలో భాగం. చూ.చిత్రం-27.20. (కో.5,23)

**మూత** : 1. మృదంగం, తబల, ఢోలకు వాయిద్యాలకు ప్రక్కన ఉండే చర్మం కప్పు. (కో.7,9,27; తె.2; రా.5)

2. తోలు బొమ్మలకు వాడే నలుపురంగు తయారీలో పొగని పట్టడానికి వాడే చిప్ప. (కో.37)

**మూతకుట్ట(డం)** : తబలా మూతకు చర్మాన్ని కుట్టడం. (తె.2)

**మూతపలక** : వీణ కుండ మీది మూత. (కో.28)

**మూతపొదగ(టం)** : డోలకుకి చర్మం మూత బిగించటం. (కో.13)

**మూతాడు** : మూతితాడు. రాతి పనిలో చెక్కే నంది విగ్రహం మూతికి ఉండే తాడు. (తె.6)

**మూతి** : డోలకు కుండే పక్కరెప్ప. (రా.5)

**మూరెడు** : రాతి పనిలో కొలత పరిమాణం. (తె.6)

**మూర్తి** : రాతి పనిలోను, లోహం పనిలోను చేసే విగ్రహం ఆకారం (పురుషమూర్తి, స్త్రీ మూర్తి; నపుంసక మూర్తి). (కో.8,19; రా.1,8)

**మూర్తిగర్భం** : రాతి పనిలో శిల్పం పూర్తయిన తర్వాత తైలం పూస్తే బాగా కనబడే విగ్రహం ఆకారం. (రా.8)

**మూల** : 1. ఫిడేలుకు రెండు వైపుల ఉండే గుంట భాగం. (రా.5)

2. దరియా పెట్టెలో మోల్డ్ చేసేప్పుడు పై పుచ్చె కదలకుండా ఉండటానికి పెట్టే ముందు గుంటలు చేసి బోర్లించే భాగం. (తె.12)

3. చిత్రలేఖనంలో బొమ్మలేయడానికి వాడే కాగితం నాలుగు చివరల భాగం. (కో.19)

**మూలమట్టం** : రాతి పనిలో శిలపై రంగుతో విగ్రహం చేసేప్పుడు కొలతలకు వాడే పరికరం. (రా.1)

**మూలాధారం** : వీణతయారీలో తీగలని ముడి వేసేచోటు. (కో.7)

**మూయు** : నాగస్వరానికి ఉండే 12 రంధ్రాలలో 5 రంధ్రాలను మైనంతో పూడ్చు. (కో.7)

**మృదంగం** : చూ. మద్దిలి. ఒక సంగీత పరికరం. చూ. చిత్రం-8. (కో.7,15,37; తె.2; రా,2,5,8)

**మృదంగం కన్ను** : మృదంగానికి ఉండే మూత. (కో.7)

**మృదువు** : చిత్రలేఖనంలో రంగులు వేయడానికి వాడే కుంచెల చివరి వెంట్రుకల మెత్తదనం. (రా.9)

**మెంచు** : పరదాలపై అద్దకం పనిలో వైట్ జింక్‌కి బదులుగ వాడే ద్రవ్యం. (తె.2)

**మెటల్ స్క్రూ** : హార్మోనియంలో నాబ్ బిగించడానికి వాడే మర. (కో.39)

**మెట్లింగురాయి** : కరిణి పిండి తయారికి వాడే రాయి. (కో.5,7)

**మెట్టు** : 1. వీణ దండిపైన ఉండే భాగం. చూ.చిత్రం-1.17. (కో.7,13; రా.5)

2. హార్మోణియంలో ఒక భాగం. చూ.చిత్రం-4.4. (కో.23)

**మెట్టె** : చూ.గొట్టం. సన్నాయికి మొదట్లో ఉండే భాగం. (కో.36)

**మెట్లపైన సపోర్టు బద్ద** : హార్మోణియంలో భాగం. చూ. చిత్రం-4.1. (కో.23)

**మెడ** : 1. వయోలిన్‌లో ఒక భాగం. (రా.5)

2. వీణలో కుండ భాగానికి ఎదురు చివరి భాగం. (రా.5)

**మెడ గుండు** : చూ.కంఠమాల. మేకప్‌లో మెడలో వేసే దండ. (రా.8)

**మెడముప్వ** : రాతి పనిలో నంది మెడకు కట్టే గజ్జె (గుంగురు). (తె.6)

**మెడియ** : రాతి పనిలో చెక్కే విగ్రహం కంఠభాగం. (తె.6)

**మెత్తన** : 1.మృదంగం తయారీలో వాడే చర్మాన్ని నీటిలో నాన బెడితే మృదువుగా అవడం. (కో.7)

2. కరిణ పిండి తయారీలో నూరిన మెట్లింగు రాయి మెత్తదనం. (కో.5)

3. తబలా తయారీలో వాడే చర్మం మంచిదయితే మృదువుగా ఉండటం. (తె.3)

4. రాతిపనిలో బొమ్మల తయారీకి వాడే శిల మెత్తగ ఉండటం. (కో.31)

**మెయిమ** : వీణకుండే ఏడుబిరడాలలో ముఖ్యమైన నాలుగు బిరడాలు. (రా.5)

**మెరవణి** : చూ.ఊరేగింపు. చిత్రలేఖనంలో వాడే ముదురు ఎరుపురంగు. (రా.13)

**మెరుగు (చేయు)** : రాతి పనిలో బొమ్మలకు మెరుగు పెట్టు. (కో.31)

**మెరుగు కాగితం** : పర్యా. మెరుపు. రాతి పనిలో శిల్పానికి, వీణ తయారీలో వీణను నునుపు చేయడానికి వాడేది. (కో.24,27,31)

**మెరుగులు దిద్దు** : రాతి పనిలో విగ్రహాన్ని అందంగ తీర్చిదిద్దు. (కో.31)

**మెరూన్** : ఇటుక పొడి రంగు. (కో.16; తె.1)

**మేకచర్మం** : రూపా. మేక చరమం. పర్యా. మేకతోలు. మృదంగం, ఢిక్కి, డోలకు, కంజీర. తబల డోల్కి, తంబడి, డోలు మొదలైన వాటి మూతలకు వాడే తోలు. (కో.5,7,13,30,37; తె.1,2,3; రా.2,10)

**మేక తోక** : రంపం పొట్టు బొమ్మల తయారీలో వాడే కుంచెలు చేయడానికి దీని వెంట్రుకలు వాడతారు. (తె.9)

**మేకప్** : నాటకం వేసేప్పుడు వేసుకునే వేషం. (కో.7; రా.5)

**మేకప్ ఆర్టిస్టు** : నాటకం వేసే వారికి వేషం వేసేవాడు. (కో.7)

**మేక వెంట్రుకలు** : చిత్రలేఖనంలో రంగులు వేయటానికి వాడే కుంచెలకి చివర వుండేవి. (కో.19; తె.1,4; రా.9)

**మేకు** : 1. వీణకుండపై దోనె అమర్చటానికి. (కో.6)

2. కంజీరాలో చక్కీలు అమర్చటానికి. (కో.7)

3. మృదంగం తయారీలో మూతకి జామాను చేసేప్పుడు కళ్ళు కొట్టడానికి ఉపయోగించే శావం తయారీకి వాడే మొల. (కో.7)

**మేఢ్యం** : మేఢ్రం. విగ్రహంలో ఒక భాగం. నాభికి మోకాళ్లకి మధ్యభాగం. (తె.6)

**మేఢ్రం** : విగ్రహంలో కటి భాగం. (తె.6)

**మేఢ్రాంతం** : రాతి పనిలో చెక్కే శిల్పానికి లింగాంతం వరకు. (రా.5)

**మేరువ** : వీణలో గండికి చివరి భాగం. (కో.6)

**మేరువు మెట్లు** : వీణదండికి పక్క తీగలు ఆనటానికి వేసే మెట్లు. (కో.28)

**మేల్** : హార్మోణియంలో మధ్యమ శ్రుతి చేయడానికి వాడే భాగం. (రా.10)

**మేళం** : వీణకుండే 24 మెట్లను 'మేళం' అంటారు. (కో.24)

**మేసి** : శ్రుతి పెట్టెలో వాడే గొర్రె చర్మం. (తె.3)

**మైద చిక్కి** : మైదాను ఉడకబెట్టి చేసే జిగురు (తబల కరిణి తయారీకి వాడేది). (తె.3)

**మైదా** : 1. నాటకంలో గద మొదలయిన వస్తువులు తయారీలో అంటించడానికి వాడే ద్రవ్యం. (కో.7)

2. పూర్వం చిత్ర లేఖనంలో రంగులు సొంతంగా చేసేప్పుడు రంగుమట్టిని మెత్తగ చేసి అందులో కలవటానికి వాడే ద్రవ్యం. (రా.11)

**మైనం** : 1. పర్యా. తేనె మైనం. వీణ దండికి పైన మెట్లు అమర్చటానికి పూసే ద్రవ్యం. (కో.6,7; రా.5,)

2. నాగస్వరం చిల్లులు పూడ్చడానికి వాడే కొవ్వు. (కో.7)

**మైనం మెట్లు** : వీణ తయారీలో దండికి అమర్చే కంచుమెట్ల మధ్య ఉండే మెట్లు. (కో.24)

**మైల** : చూ. తుక్కు. వీణ తయారీలో కరిణను ఉప్పు

కాగితంలో కొడితే వచ్చే మురికి. (రా.5)

**మైలుతిత్తి :** నాటకంలో వాడే కిరీటం, గద మొదలయిన వాటి తయారీలో అంటించటానికి వాడే మైదాలో ఎలుకలు కొట్టకుండా కలిపే మందు. (కో.7)

**మైసూర్‌వీణ :** మైసూర్‌లో తయారు చేసే వీణ. బ్లాక్ ఉడ్ తోనే తయారు చేస్తారు. (రా.5)

**మొక్కు:** రాతి పనిలో విగ్రహం చెక్కినవారు విగ్రహాన్ని గుళ్ళో ప్రతిష్ఠించిన తరువాత వారు కూడా నమస్కరించటం. (తె.6)

**మొగలి ఊడ :** సిమెంటు బొమ్మల తయారీలో బొమ్మని నైస్ చేయడానికి వాడే కుంచె తయారీకి వాడే వస్తువు. (రా.13)

**మొట్టమొదటి తెర :** నాటకంలో స్టేజీకి ముందరుండే తెర. (రా.13)

**మొండెం:** సిమెంటు బొమ్మల తయారీలోను, పత్తి బట్ట బొమ్మల తయారీలోను బొమ్మ మెడ కింద నుండి కాళ్ళ వరకున్న భాగం. (రా.7,13)

**మొత్త :** వీణ తయారీలో కుండకు కడియం అమర్చే భాగం. (కో.6)

**మొదటి కోత :** వీణ తయారీలో కొయ్యని ముందు కోసే కోత. (కో.6)

**మొద్దుకలం :** చూ. దొడ్డ బులుసు. రంపం పొట్టు బొమ్మలకు రంగులు వేయటానికి వాడే పెద్ద కుంచె. (రా.7)

**మొనఉలి :** సంగీత పరికరాల తయారీలో వాడే పనిముట్టు చూ.చిత్రం-42. (కో.23)

**మొల :** 1. రాతి పనిలో శిల్పం చెక్కటానికి వాడే సుత్తి. (తె.6)

2. తబలా తయారీలో చర్మాన్ని ఎండబెట్టడానికి భూమికి దిగకొడటానికి వాడే మేకు. (తె.3)

3. డక్కి తయారీలో మూతకి చర్మాన్ని పెట్టి చుట్టూ కొట్టే మేకు. (తె.2)

**మొలకట్టు :** రాతి పనిలో విగ్రహాలకు మొల ప్రాంతంలో చెక్కే శిల్పం. (తె.6,12)

**మోకాలు :** చూ.జంఘం. విగ్రహంలో ఒక భాగం (కాలిమడత భాగం). (తె.6)

**మోటా ఉలి:** వీణ తయారీలో వాడే ఉలి. చూ.చిత్రం-41. (కో.6)

**మోటుదించు:** రాతి పనిలో శిల్పానికి వాడే శిలని ముందు సరిచేయు. (కో.33)

**మోరరాయి :** (అగేట్ స్టోన్). చిత్ర లేఖనంలో బొమ్మకి ఆభరణాలకు రాసిన తగరం మీద మెరుపు రావటానికి రుద్దేది. (తె.1)

**మోర్సింగు:** సంగీత వాయిద్యం. (కో.7)

**మౌంట్:** 1. చిత్రలేఖనంలో హార్డ్‌బోర్డు మీద బొమ్మలు వేసేప్పుడు చుట్టూరా ఉండే తెల్లని భాగం. (కో.3)

2. చిత్ర లేఖనంలో డ్రాయింగ్ పేపరు అంటించే అట్ట గాని చెక్క గాని. (కో.25)

**మౌత్ బ్రష్ :** మేకప్‌లో గ్రీన్ పెయింటుకు ముందు పూసే పౌడరును తీయటానికి వాడే కుంచె. (కో.7)

**మ్యాచింగ్ కలర్ :** చిత్రలేఖనంలో వేసే రంగుల కలయిక. వేసిన రంగుకు దగ్గరగా ఉన్న రంగే ద్వార బంధాలకు, కిటికీలకు వేయడం. (కో.3)

**మ్యూజికల్ డ్రమ్స్ :** సంగీత వాయిద్యాలు. (తె.2)

# య

**యజ్ఞశాల :** పర్యా. యాగశాల. దేవాలయంలో ఒక భాగం. (తె.6)

**యజ్ఞోపవీతం :** చూ. జంజనారం. రాతి పనిలో విగ్రహాలకు చెక్కే జంధ్యం. (కో31)

**యాజులయను :** (Vasuline) మేకప్‌లో మొఖానికి పూసుకునే రంగులో కలిపే ద్రవ్యం. (రా.5)

**యాండార్మోనియం :** (Hard Harmonium). చూ.

చిన్నశ్రుతి హార్మోనియం. ఒక చేత్తో గాలి పోస్తూ మరొక చేత్తో వాయించే హార్మణి. (కో 7)

**యాత్ర** : వీణకు చివర భాగం (తలాట భాగం) (రా 5)

**యాన్** : మేకప్‌లో వాడే విగ్గుల తయారీకి టిబెట్‌లో ఉండే యాన్ అనే రకం గేదె జుట్టు వాడతారు. (కో.29)

**యాళైవొక్కకతు** : వొగ్గుకథ చెప్పేవారికి వచ్చే కథలు (తె 1)

**యాళి** : చూ.యాత్ర. వీణ, బుర్రకథ తంబురలలో భాగం. చూ.చిత్రం-1.1, 23.4 (కో 7)

**యుండీకఱ్ర** : (Rose wood) వీణ తయారీకి వాడేది (కో.6)

**యెంత్రం** : మంత్ర యుక్తమైన తాంత్రిక రేఖా పటం (తె.6)

**యేపుకొయ్య** : సన్నాయి తయారీకి వాడే కొయ్య. (కో.36)

**యేరు** : ఫిడేలుకు చివర వంపుగ ఉండే భాగం. (రా.5)

**యేయు** : రాతిపనిలో శిలమీద గీతలు గీయు. (రా.5)

**యోగకరణాలు** : శిల్పం (తె.6)

**యోని** : రాతిపనిలో చెక్కే విగ్రహంలో భాగం. (రా 5)

## ర

**రక్తచందనం** : ఫ్లూటు తయారీకి ఉపయోగించే కొయ్య. (రా.8)

**రక్తం** : రాతిపనిలో శిల్పాలు చెక్కడానికి వాడే పీఠాలలో భేదం. (తె.6)

వొగ్గుకథ వారు చేసే పరుగులో భాగం (తె 1)

**రక్తశిల** : రాతిపనిలో శిల్పానికి వాడే రాయి (కో 29)

**రంగం** : నాటకం వేయడానికి సిద్ధం చేసే మంచె. (Stage) (కో.29)

**రంగరాజు** : రంగ్రేజీ పని వాడు. (తె.4)

**రంగు** : వర్ణం, కలర్. పర్యా రంగుపొడి. (కో.1,2,3,4,7, తె.2,3,4,9, రా 2,4,8)

**రంగు కాయిదం** : హార్మోనియం తయారీలో తొలుత చేసే తిత్తికి పైన అంటించడానికి వాడే కాగితం (తె 3)

**రంగునీళ్ళు** : నాటకంలో వాడే తెరలకు వేసే తుమ్మబిగురు కలిపిన రంగునీళ్ళు. (కో.29)

**రంగుపారం** : మేకప్‌లో పెదవులకి రంగు వేయడం (Colour Formation) (కో 7)

**రంగుపుర్ని** : మేకప్‌వాడే దుస్తులు కుట్టేప్పుడు పైన డిజైను వర్కు చేసేప్పుడు ఉపయోగించే దారం (రా 13)

**రంగుపూసుకునేఆట** : వీధి నాటకం. (రా 2)

**రంగుపొడి** : మేకప్‌లో వాడే రంగుపొడరు చూ రంగు(కలరు) (కో 26,29,42)

**రంగూన్ టేకు** : హార్మోనియం తయారీకి వాడేది (కో 7)

**రంగ్రేజీపని** : బట్టల మీద రంగులు అద్దేపని (తె 4)

**రజను** : గడ్డానికి మేకప్ చేసేప్పుడు అంటించే చిన్న వెంట్రుకలు (కో 7)

**రడీమేడ్** : తయారు చేసి సిద్ధంగా నున్న చిత్రాలు. (రా 11)

**రత్నపట్టి** : రాతిపనిలో శిల్పానికి శిరస్సు మీదచెక్కే ఆభరణం. (రా.8)

**రదం** : సైను బట్ట మీద వేసే పటంలో దృశ్యం (తె 7)

**రద్దీ చర్మం** : తబలా తయారీలో వచ్చే పనికి రాని చర్మం. దీనిని తబల కింద పెట్టే చుట్టకి చుడతానికి వాడతారు. (తె 3)

**రద్దు** : 1 మృదంగం తయారీలో మూతకి చర్మం లోపల పెట్టే గతుకు చర్మం ముక్క (కో 7)

2. మేకప్‌లో వాడే విగ్గుల తయారీలో పనికి రాకుండ పోయేజుట్టు. (కో.23)

**రంధ్రపాధవి** : సంగీత వాయిద్యం (కో 7)

**రప్ప** : పర్యా రెప్ప. తబలా మూతకి ఉండే చర్మభాగం. (కో.7)

**రఫ్ :** రాతిపనిలో శిలపై విగ్రహం చెక్కే ముందు రాయిని బొమ్మ నమూనాలో మలచటం చూ మూగగా (రా 5, కో 37)

**రఫ్ ఆకురాయి** తబల, డోలకు తయారీలో వాడేది (తె 3)

**రఫ్ఉలి** రాతిపనిలో రఫ్‌గ విగ్రహం చెక్కటానికి వాడేది (రా 5)

**రఫ్ కాగితం** చిత్రలేఖనంలో వాడే చిత్తుకాగితం (కో 19)

**రఫ్ డిజైన్ :** చిత్రలేఖనంలో వేసే చిత్తు బొమ్మ (కో 19)

**రఫ్‌వర్క్ .** రాతిపనిలో శిల్పం చెక్కటానికి ముందు రాయిమీద చిత్తుగ బొమ్మ ఆకారం చేయటం (కో 31)

**రఫ్‌షేప్ .** చూ రఫ్ వర్క్, దిండు (తె 4,6, రా 4)

**రబ్బరుట్యూబు** సిమెంటు బొమ్మల తయారీలో బొమ్మ నునుపు రావటానికి పైన తోమటానికి వాడే గొట్టం (కో 27)

**రబ్బరుబ్లాడరు** నాటకంలో కత్తితో పొడిచినప్పుడు రక్తం రావటానికి చొక్కాలోపలి భాగంలో రంగు నీళ్ళు పోసిపెట్టే సంచి (కో 7)

**రంపపుదొడ్డె** తబలా తయారీలో కొయ్యను కోయటానికి వాడే రేకు (కో 7)

**రంపం .** రాతిపనిలో శిలను కోయటానికి వాడే సాధనం (కో 1,6,7,9,10,12,13,16,23,28,28,31,41, తె 1,2,3,4,7, రా 4,5,6,8) చూ. ఆరా

**రంపి ·** కంజీరా, మృదంగం, తబల మొదలైన వాటి తయారీలో వాడే చర్మాన్ని కోయటానికి ఉపయోగించే సాధనం పర్యా రంపి. చూ ఆరె చూ చిత్రం-35,36 (కో 5,7,13, రా 10)

**రవ .** మృదంగానికి వాడే కరిణ పిండి/పొడి (రా 5)

**రవుండు(ముక్క) .** రాతిపనిలో శివలింగం చేసేప్పుడు ముందు గుండ్రంగ చేసిన రాతిముక్క (కో 31)

**రవుండు డిజైను** చిత్రలేఖనంలో వేసే డిజైను (కో.3)

**రవుండు డిష్** చిత్రలేఖనంలో రంగులు కలుపుకోవటానికి వాడే పళ్లెం (కో 19)

**రవుండ్ బ్రష్** చిత్రలేఖనంలో వాడే చివర గుండ్రంగ ఉండే కుంచె (రా 10)

**రాగం(తీయు) .** వొగ్గుకధలోను, బుర్రకధలోను పద్యాలు పాడేప్పుడు తీసే ఆలాపన (తె 1, రా 2)

**రాగాలాపన .** నాగస్వరం మీద రాగాన్ని ఆలపించటం (రా.5)

**రాగి .** తబల, డగ్గ మొదలైన వాటి చట్రం తయారీకి వాడే లోహం (కో 7,8,29,31,33, తె 1,3,8,12, రా 5,11)

**రాగితంతి :** నాటకంలో వాడే దుస్తులకు డిజైన్లు కుట్టడానికి ఉపయోగించే పుర్ని తయారీకి వాడే తీగ. (రా.13)

**రాగిరేకు :** నాటకంలో వాడే సామాను తయారీకి వాడే రేకు (కో 29)

**రాజభవనం** పటాలు వేయటంలో ఒక దృశ్యం (తె 7,9)

**రాజరంపాల :** ఒక ఒగ్గుకధ (తె 1)

**రాజలాంఛనం ·** రాజువేషం చిహ్నం (కో 7)

**రాజులెక్క** రాజులాగా (వొగ్గుకధలో, రాజులెక్క కూర్చొని). (తె 1)

**రాతిపలక .** మృదంగం కరిణపిండి తయారీలో పిండిని నూరటానికి వాడే బల్ల (కో.5)

**రాతివిగ్రహం ·** రాతితో తయారైన బొమ్మ (కో 33)

**రాపకం** రాతిపనిలో విగ్రహాన్ని ఆకురాయితో రాయడం (తె 4,12)

**రాపడం .** వీణ తయారీలో కుండపై భాగం నునుపు చేయడం (కో 13)

రాపి . రూపా రాపే తబలా తయారీలో చర్మాన్ని కోయడానికి వాడే పరికరం (చూ రంపి) చూ ఆరె చూ చిత్రం-36 (తె 2,3)

**రాపిడి :** వయొలిన్ తీగలను కమానుతో వాయించడం (కో 7, రా.5)

**రాము** 1 చిత్రలేఖనంలో వాడే నీలం రంగు (రా.13)

2 చూ.కలుపు చిత్రలేఖనంలో గుడ్డపై బొమ్మ వేసేప్పుడు వాడే కలర్స్ పొడిలో కట్టె వస్త్రం ఉడికించి బాగా రుద్దు (రా 13).

**రామోయి రామ రామ :** వొగ్గుకతలో వాడే దరువు. (తె 1)

**రాయి :** ఢోలకు, మృదంగాల మూతకి కరిణపిండి వేసి రుద్దటానికి వాడే వస్తువు (కో 5, రా 5)

**రాయిగొడ్డ :** కరిణ పిండి తయారీలో పిండిని నూరటానికి వాడే ముక్క (కో 7)

**రాయు :** వీణ తయారీలో ప్లాస్టిక్‌డిజైను అంటించేముందు ఆకురాయితో తోము. (కో 6)

**రావణతిలకం :** మేకప్‌లో పెట్టే ఒక రకం బొట్టు. చూ చిత్రం-27.12, 27 13. (కో 7)

**రావుట :** వచ్చుట, రావటం (రాతిపనిలో; రూపమును తీసుకరావుట). పర్యా. వచ్చు (కో.19)

**రాసీవా :** చిత్రలేఖనంలో వాడే పసుపురంగు (కో 3)

**రాసుడు :** రాతిపనిలో విగ్రహాన్ని ఆకురాయితో రాయడం. (తె.6)

**రాళ్ళ అడ్డిగ :** నాటకంలో మెడలో వేసుకునే గొలుసు. (రా.8)

**రాళ్ళహారం :** మేకప్‌లో మెడలో వేసుకునే గొలుసు. (రా 8)

**రింగు :** 1.తబల తయారీలో చర్మాన్ని సాగదీయటానికి వాడే చుట్ట. (తె 2,3)

2 డోలకు తయారీలో వాడే ఇనుముతో చేసిన గుండ్రని రింగు. చూ.చిత్రం-7 6 (కో.13)

3. మేకప్‌లో వాడే విగ్గు తయారీలో జుట్టుని ఉంగరం మాదిరి చేయటం. (కో.7)

4. హార్మోణియంలో భాగం. చూ.చిత్రం-4.6 (కో.7)

5 వీణలోని గుండ్రటి భాగం. (కో 6)

**రిపేరు :** సంగీత పరికరాలు పాడైపోతే బాగు చేయించటం (కో 20; తె 3,7)

**రిబ్బను** మేకప్‌లో జుట్టు ముఖంమీద పడకుండ కట్టడానికి వాడే పేలిక (కో 7)

**రిబ్బు :** వయొలిన్ రెండు పక్కలా చెవుల మాదిరిగా ఉండే భాగం (కో 7; రా 5)

**రివిట్ :** వీణ తయారీలో వాడే కుంపాస కుండే నట్టు (కో 6)

**రిహార్సలు :** నాటకం ప్రదర్శించే ముందు ప్రాక్టీసు కోసం నటులు మాత్రమే వేసుకునే ప్రదర్శన (కో 7)

**రీడ్ ·** పర్యా. పీడు. చూ పీక.

1 హార్మోణియం తయారీలో ధ్వని రావటానికి వాడే పీక. చూ.చిత్రం-4.7. (కో 7,39, తె 3, రా 8)

2 నాగస్వరంలో ధ్వని రావటానికి ఉపయోగించే పీక. (రా.5)

**రీడ్ బోర్డు ·** హార్మోణియంలో ధ్వని రావటానికి ఉపయోగించే పలక (తె.3, రా.10)

**రీపరు :** మృదంగం చట్రం తయారీలో వాడే తరిణ దొడ్డిలో పైభాగంలో ఉండే బద్ద. (కో 7)

**రుద్రవీణ :** వీణ తయారీలో చేసే 26 మెట్లుగల వీణ (కో 13)

**రుద్రహస్తం :** రాతిపనిలో శిల్పం కుడిచేయి వదులుగా చాచినట్టు చెక్కటం (కో 19)

**రుద్రాక్షలోలకులు :** నాటకంలో నారదుని పాత్ర చెవికి తగిలించే నగ (రా 8)

**రుద్దు :** 1. స్పిరిట్ పాలిష్‌ను తబలకుండ మీద ముల్లెతో రాయు (తె 3)

2 రాతిపనిలో శిల్పాన్ని నునుపు చేయటానికి గరుకు పేపరులో ఆకురాయితో తోము. (కో 1,15,16, 27,31,41; రా.3,5)

**రుమాలు :** తలపాగ- వొగ్గుకథ వారు తలకు చుట్టుకునే గుడ్డ. (తె.1)

ఆకుకూ మధ్య కొంచెం వదులుగా ఉండటం. (తె 2)

2. మృదంగానికి వారు వదులుగా ఉండటం (కో 23)

**లెగ్ ఆర్మోనియం** : చూ తొక్కుడు హార్మోణి నాటకాలలో వాడే తొక్కుడు హార్మోణి. (కో.7,39)

**లెటర్స్** : చూ అక్షరం చిత్రలేఖనంలో రాసే అక్షరాలు (కో.19)

**లెడ్జి** : తంబుర తయారీలో దండి, కుండ కలపటానికి వాడే దంతం ముక్క (రా 5)

**లెదర్** : హార్మోణి తయారీలో గాలి తిత్తికి వాడే చర్మం. (కో 39, రా.8)

**లెదర్‌మౌంట్** : చిత్రలేఖనంలో తోలుమీద బొమ్మ వేసేప్పుడు దాని మీద పెట్టే నమూనా (తె.1)

**లెన్సీడ్** : చిత్రలేఖనంలో వేసే రంగులకు వాడే నూనెలలో ఒక రకం (తె 1)

**లెమన్** : మేకప్‌లో వాడే పసుపు రంగు (రా.8)

**లెవల్** : 1 సిమెంటు పనిలో హెచ్చుతగ్గులు సరిచేయుడానికి వాడే పరికరం (తె 6)

2 రాతిపనిలో రాయిని ముందు సమానంగా చేయడం (కో.31, రా 5)

3 మృదంగం, తబల తయారీలో చట్రం దళసరి సమానంగా చేయడం (కో 7, తె.1, రా 5)

**లేక్‌కలర్** : మేకప్‌లో వాడే ఒక రకం రంగు (రా 8)

**లేడీవిగ్గు** : నాటకంలో మగవారు ఆడవేషం వేసేప్పుడు వాడేది. (కో 7)

**లేత** : తాటాకు పనిలో వాడే తాటాకు ముదరకుండా ఉండటం (కో.42)

**లేబిల్స్** : చిత్రలేఖనంలో వేసే సబ్బు మొ॥ వానికి పైన పేరుతో ఉండే కాగితం (కవరు). (కో.19)

**లైట్** : 1. నాటకంలో వెలుగు కోసం వాడే దీపం. (రా 13)

2. చిత్రలేఖనంలో బొమ్మలకి రంగులు light (తేలిక)గా వేయటం. (తె 1)

**లైట్‌అండ్‌షేడ్స్** · చిత్రలేఖనంలో బొమ్మలకు వేసే కాంతి నీడలు. (కో 2)

**లైట్‌కోట్ ఇచ్చు** : చిత్రలేఖనంలో బొమ్మలకి రంగులు తేలికగ వేయు (కో.3)

**లైట్‌కోటింగు** . చూ లైట్‌కోట్ ఇచ్చు (కో 2)

**లైట్ వెలుతురు** . చిత్రలేఖనంలో సూర్యోదయం చిత్రం వేసేప్పుడు కొద్దిగ వెలుతురు వచ్చినట్లు వేయడం (కో 3)

**లైట్‌షేడ్** : చిత్రలేఖనంలో రంగుల భేదాలను తెలిపేటప్పుడు లేతగా వేసే రంగులు (తె 1)

**లైనింగ్ (బట్ట)** : 1 వయొలిన్ తయారీలో పై చెక్కకి, కింది చెక్కకి చుట్టూ బటువు కోసం ఒక అంగుళం వదలిన భాగం (రా 5)

2 మేకప్‌లో కన్నులకి, పెదవులకి వేసే రంగు గీతలు ఆంజనేయుడి పాత్రకి మేకప్ చేసేప్పుడు మూతికి రంగులో ముంచిన దూదిని అంటించి కనపడకుండా ఉండటానికి చుట్టూ గీసే గీత (కో 7)

**లోడు** : చూ. కోరు వీణ తయారీలో కుండ చేసేప్పుడు కొయ్యని డొలవటం (రా 5,5,5)

**లోతు** . రాతిపనిలో విగ్రహాలకి గుంతగ చేయడం (కో 7, తె.5,12,13; రా 1)

**లోపలిపొర** మృదంగం తయారీలో మూతకి లోపల ఉండే మేక చర్మం. (రా 5)

**లోమీటు** . వీణని చూపుడు వేలుతో మీద నుండి కిందికి మీటడం (కో.7)

**లోరప్పు** : రూపా. లోరెప్ప

తబల, మృదంగం మూతలకి లోపల వైపు ఉండే చర్మం (కో 5,7)

**లోలకు** : మేకప్‌లో చెవికి పెట్టే ఆభరణం. (రా 8)

**లోవైపు** . లోపలివైపు వయొలిన్‌కు బాస్‌బారు (Bass bar)

**రోస్‌టెంట్ పౌడరు** : చూ. రోజుటింటు పౌడరు. (రా.5)

**రౌండ్** : 1. కొయ్య పనిలో వాడే రౌండు సీర్ణం గుండ్రంగ ఉండటం. (రా.4)

2. మేకప్‌లో మీసాన్ని తిప్పటానికి వాడే ఫించర్‌కి ఒక చివర గుండ్రంగా ఉండటం. (కో.7)

3. రాతిపనిలో కైవారం కొలత చూడడం. (తె.6)

4. పర్యా. రౌను. తబలా తయారీలో చర్మాన్ని గుండ్రంగా కోయడం. (కో.5)

**రౌండ్ ఆకురాయి** : రాతిపనిలో గుండ్రని భాగాల్లో వాడే ఆకురాయి. (తె.6)

**రౌండ్‌ఫైల్**: వీణ తయారీలో చిల్లులు పెద్దవిగా చేయటా కి వాడే సాధనం. (రా.5)

**రౌండు ఉలి** : వీణ తయారీలో చేసే కుండను తోడడానికి వాడే ఉలి. (రా.5)

**రౌండు బొట్టు** : మేకప్‌లో పెట్టే ఒక రకం బొట్టు. చూ.చిత్రం-27.2. (కో.7)

**రౌండు మీసం**: మేకప్‌లో పెట్టే మీసాలలో రకం. చూ.చిత్రం-26.1; 26.2. (కో.7)

**రౌండెడ్**: మేకప్‌లో మీసాలు తిప్పటానికి వాడే ఫించరు కాడ గుండ్రంగా ఉండడం. (కో.7)

**రౌతు** : తబలాకు కరిణ పిండి తయారీలో, రాతిపనిలో శిల్పం చెక్కటానికి వాడే రాయి. (తె.2,6)

**రౌద్రం** : నాటకంలో పాత్రలు కనబర్చే నటన. (కోపం, వీరం). (రా.13)

**రౌను** : 1. కంజీరా తయారీలో మూత చేయడానికి కోసిన గుండ్రటి చర్మం. (కో.7)

2. తబలా తయారీలో మూతకి చర్మాన్ని గుండ్రంగా కోయడం. (కో.7)

3. డోలకు తయారీలో వెదురు బద్దని గుండ్రంగా కోయడం. చూ. రౌండు. (రా.5)

**రౌను రాయి** : మృదంగం తయారీలో ముద్ది దించటానికి వాడే రాయి. (కో.7)

## ల

**లక్క** : 1. వీణ తయారీలో చుట్టూరా చెక్కే డిజైన్ గాడిలో పోయటానికి వాడే ద్రవ్యం. (కో.6)

2. హార్మోణియం తయారీలో హార్మోణియంకు పూసే పాలిష్‌కు జిగురు కోసం కలిపే ద్రవ్యం. (తె.3; రా.8)

3. రాతిపనిలో విగ్రహానికి పూయటానికి వాడే ద్రవ్యం. (కో.28; రా.1)

**లగం** : పర్యా. కమలం.

వీణ, తంబుర తయారీలో కుండకు ఎడమవైపున తీగలు బిగించటానికి అమర్చే భాగం. చూ.చిత్రం-1.15; 2.3. (కో.13,24)

**లంగరు** : వీణ తయారీలో కుండకు అమర్చే నాగపాశంలో భాగం. (రా.5)

**లంబహస్తం** : రాతిపనిలో శిల్పానికి చేతులు కిందకు ఉంచినట్లు చెక్కడం. (కో.19)

**లయ** : చూ. కాలం. (కో.7; రా.5)

**లయవాద్యం** : కాలాన్ని చూపేదానికి వాడే వాద్యం. (మృదంగం, డోలు, తబలా). (కో.7,23)

**లావుతంతి** : వయొలిన్‌కు ఉండే తీగ. (రా.5)

**లిక్విడుపౌడరు** : మేకప్‌లో వాడే రంగు తయారీలో ఉపయోగించే ద్రవ్యం. (కో.7)

**లింగంకాయ** : వొగ్గు కథ చెప్పేవారు వేషంలో మెడలో వేసుకునే నగ. (తె.1)

**లిన్సీడ్‌ఆయిల్**: చూ.అవిశనూనె. చిత్రలేఖనంలో రంగులు బాగా జారటానికి అందులో కలిపే ద్రవం. (కో.2)

**లిప్త** : క్షణకాలం. (కో.7)

**లూజ్** : 1. తబలా మూతకి ఉండే మొదటి పొర చాటాకు

ఆకుకూ మధ్య కొంచెం వదులుగా ఉండటం (తె.2)

2 మృదంగానికి వారు వదులుగా ఉండటం (కో.23)

**లెగ్ ఆర్మోనియం** · చూ. తొక్కుడు హార్మోణి నాటకాలలో వాడే తొక్కుడు హార్మోణి (కో 7,39)

**లెటర్స్** : చూ. అక్షరం చిత్రలేఖనంలో రాసే అక్షరాలు (కో 19)

**లెడ్జి** : తంబుర తయారీలో దండి, కుండ కలపటానికి వాడే దంతం ముక్క. (రా.5)

**లెదర్** : హార్మోణి తయారీలో గాలి తిత్తికి వాడే చర్మం (కో 39, రా 8)

**లెదర్‌మౌంట్** · చిత్రలేఖనంలో తోలుమీద బొమ్మ వేసేప్పుడు దాని మీద పెట్టే నమూనా. (తె 1)

**లెప్సిడ్** : చిత్రలేఖనంలో వేసే రంగులకు వాడే నూనెలలో ఒక రకం (తె 1)

**లెమన్** : మేకప్‌లో వాడే పసుపు రంగు (రా 8)

**లెవల్** : 1 సిమెంటు పనిలో హెచ్చుతగ్గులు సరిచేయుడానికి వాడే పరికరం (తె 6)

2 రాతిపనిలో రాయిని ముందు సమానంగా చేయడం (కో.31, రా 5)

3 మృదంగం, తబల తయారీలో చట్రం దళసరి సమానంగా చేయడం (కో.7, తె 1, రా 5)

**లేక్‌కలర్** · మేకప్‌లో వాడే ఒక రకం రంగు. (రా 8)

**లేడీవిగ్గు** : నాటకంలో మగవారు ఆడవేషం వేసేప్పుడు వాడేది (కో.7)

**లేత** : తాటాకు పనిలో వాడే తాటాకు ముదరకుండా ఉండటం (కో 42)

**లేబిల్స్** : చిత్రలేఖనంలో వేసే సబ్బు మొ॥ వానికి పైన పేరుతో ఉండే కాగితం (కవరు). (కో.19)

**లైట్** : 1 నాటకంలో వెలుగు కోసం వాడే దీపం. (రా.13)

2 చిత్రలేఖనంలో బొమ్మలకి రంగులు light (తేలిక)గా వేయటం. (తె 1)

**లైట్‌అండ్‌షేడ్స్** : చిత్రలేఖనంలో బొమ్మలకు వేసే కాంతి నీడలు (కో 2)

**లైట్‌కోట్ ఇచ్చు** : చిత్రలేఖనంలో బొమ్మలకి రంగులు తేలికగ వేయు (కో 3)

**లైట్‌కోటింగు** . చూ. లైట్‌కోట్ ఇచ్చు (కో.2)

**లైట్ వెలుతురు** : చిత్రలేఖనంలో సూర్యోదయం చిత్రం వేసేప్పుడు కొద్దిగ వెలుతురు వచ్చినట్లు వేయడం (కో 3)

**లైట్‌షేడ్** : చిత్రలేఖనంలో రంగుల భేదాలను తెలిపేటప్పుడు లేతగా వేసే రంగులు (తె 1)

**లైనింగ్ (బట్ట)** : 1 వయొలిన్ తయారీలో పై చెక్కకి, కింది చెక్కకి చుట్టూ బటువు కోసం ఒక అంగుళం వదలిన భాగం (రా 5)

2 మేకప్‌లో కన్నులకి, పెదవులకి వేసే రంగు గీతలు ఆంజనేయుడి పాత్రకి మేకప్ చేసేప్పుడు మూతికి రంగులో ముంచిన దూదిని అంటించి కనపడకుండా ఉండటానికి చుట్టూ గీసే గీత (కో 7)

**లోడు** : చూ కోరు వీణ తయారీలో కుండ చేసేప్పుడు కొయ్యని డొలవటం (రా 5,5,5)

**లోతు** : రాతిపనిలో విగ్రహాలకి గుంతగ చేయడం (కో.7, తె.5,12,13, రా 1)

**లోపలిపొర** మృదంగం తయారీలో మూతకి లోపల ఉండే మేక చర్మం (రా 5)

**లోమీటు** . వీణని చూపుడు వేలుతో మీద నుండి కిందికి మీటడం. (కో 7)

**లోరప్ప** . రూపా లోరెప్ప

తబల, మృదంగం మూతలకి లోపల వైపు ఉండే చర్మం (కో 5,7)

**లోలకు** · మేకప్‌లో చెవికి పెట్టే ఆభరణం (రా 8)

**లోనైపు** · లోపలివైపు వయొలిన్‌కు బాస్‌బారు (Bass bar)

పై బల్లకు ఎడం వైపు లోపలి పక్క అంటించి ఉండే భాగం (రా.5)

**లోహపుగది** : నాగస్వరానికి పై చివర్లో ఉండేది ఇందులో రీడు అమరుస్తారు (రా 5)

**లోహపుగంటాకారం** : నాగస్వరానికి చివర మూతి ఉండే ఆకారం (కో 7)

**లోహపు తొడుగు** . బొపెన్‌లో భాగం చూ.చిత్రం-31.2 (కో 23)

**లోహపుపీట** . వీణకు కుండమీద ఉండే బ్రిడ్జి (కో 7)

**లోహసాధని** : ఒక లయ వాయిద్యం (జలతరంగిణి, మోర్సింగ్) (కో 7)

**లోహం** · తబల కుండ తయ్యారీకి వాడే పదార్థం. (తె 1,12)

## వ

**వక్త్రరంధ్రం** ఫ్లూటుని వాయించేప్పుడు గాలిపోయటానికి ఉండే చిల్లు (కో 7)

**వక్షం** : రాతిపనిలో చెక్కే విగ్రహంలో గుండె భాగం (తె 6)

**వంకముగ్గ** రాతిపనిలో విగ్రహానికి చెక్కే ఒక డిజైను (కో 31)

**వంకర** . రాతిపనిలో వాడే శిల సమంగా ఉండకపోవటం (కో 28)

**వంకరపేర్నం** : రాతిపనిలో వాడే చివర వంగిన సీర్నం వంపు సీర్నం. (తె 6)

**వంకాయరంగు** పర్ప్యా వంకాయ వర్ణం బొమ్మలకు వేసే వైలెట్ రంగు. (కో 17,27, తె 1)

**వంగన్** · డోల్కీవాయిద్యంలో దూంపుడికి లోపల్నుంచి దీన్ని వేస్తారు ఆముదం + గుగ్గిలం + మట్టి మిశ్రమం (తె 3)

**వచనం** వొగ్గు కథలోను, బుర్ర కథలోను చెప్పే గద్య భాగం (తె.1)

**వజ్రకాయం** . మేకప్‌లో రంగుల తయారీకి వాడే ద్రవ్యం (రా.5)

**వజ్రపుసరి** · మృదంగం కరిణ చేయటానికి వాడే వస్తువు (రా.10)

**వజ్రం** డోలక్, మృదంగం మూతలకి కరిణ వేయటానికి ముందు పూసే ద్రవ్యం (రా 5)

**వంచు** : సిమెంటు బొమ్మల తయారీలో ఇనుప ఊచని కావలసిన విధంగా వంగజేయటం (కో 3, రా.13)

**వట్టిగచ్చు** · చిత్రలేఖనంలో టేకు చెక్కమీద బొమ్మ వేసేప్పుడు దానికి వేసే రంగులలో బంగారం రంగు మీద మెరుపు రావటానికి పూసే గుగ్గిలం, మంచినూనె ఉడికించి చేసిన మిశ్రమం (తె 6)

**వట్రపుముక్క** : వీణ తీగలు బిగించటానికి, మీటటానికి, కావలసిన సామగ్రి పెట్టుకోటానికి, సింహతలాటానికి పైన రెండు పెట్టెల మాదిరి అమరుస్తారు వీటిని వట్రపు ముక్కలు అంటారు చూ చిత్రం-1 6 (కో.24,28)

**వడి** . వీణని మీటే వేగం (కో 7)

**వడ్డలి** సన్నాయి తయారీలో చిల్లులు చేయడానికి వాడే సాధనం చూ చిత్రం-44 (కో 36)

**వత్తి** మృదంగం తయారీలో చర్మాన్ని కోసి లెవెలింగు చూడటం రంపితో చర్మాన్ని వత్తటం (కోయటం) (కో.7)

**వనాంతరం** · పరదాలపై అద్దకం పనిలోను, కొయ్యమీద బొమ్మలు వేసేప్పుడు వేసే అడవి దృశ్యం (తె 2,7)

**వన్నె** చిత్రలేఖనంలో కొన్ని రంగులు కలిపితే వచ్చే చాయ చూ కలరు (తె 1)

**వంత** . రూపా వంతు భాగం (చూ పాలు). (కో 5,7, తె.6)

**వంతదారులు** బుర్రకథలో ప్రధాన కథకుడికి రెండు వైపుల ఉండేవారు (తె 1)

**వంపు** 1 మేకప్‌లో వాడే విగ్గుల తయారీలో జుట్టుని

కావలసిన విధంగా మలచటం. (కో 7)

2 వయొలిన్‌కి బిరడాపెట్టి వంకరగ ఉంచటం (రా 5)

**వంపుఉలి** తబలా, డోలకు తయారీలో కుండను డొలపడానికి వాడేది చూ చిత్రం-43. (కో 5,7)

**వంపుసీర్నం** · ఒక రకమైన సలగ దీనికొన వంపుగ ఉంటుంది వంకర సీర్నం శిల్పంలో వంకరలున్న చోట దీన్ని వాడతారు (తె 6)

**వయలిన్** సంగీత వాయిద్యం చూ చిత్రం-3 (కో 7)

**వరకత్తి** · నాటకంలో వాడే ఒరతో కూడుకొన్న కత్తి (రా 8)

**వరజా** మృదంగం, తబలా మూతలకి కరిణ కొలతని బట్టి చర్మం మీద కైవారంతో గీసిన గీత (కో 7)

**వరదాహస్తం** రాతిపనిలో కొన్ని శిల్పాలకి చేయి చెక్కే విధం (ఎడమ చేయి కిందకు చూపించటం) (రా 3)

**వరప** · మేకప్‌లో వాడే విగ్గుల తయారీలో జుట్టుని కట్టిన తీరు (కో 7)

**వర్ణచిత్రం** చిత్రలేఖనంలో వేసే రంగుల పటం (కో 2)

**వర్ణం :** రంగు చూ కలరు (కో 19, తె 1)

**వలం :** లావు (కో 6)

**వలరచ్చమల్లన్న కత** · ఒక ఒగ్గు కధ పేరు (తె 1)

**వలాటు** . రూపా వల్లెవాటు

రాతపనిలో శిల్పానికి చేతికింద నుంచి ఉత్తరీయం భుజానికి వచ్చినట్టు చెక్కడం (తె 6)

**వస్పానంద** చిత్రలేఖనంలో వాడే లేత నీలం రంగు చూ కోబాల్ట్ బ్లూ. (రా 13)

**వాక్స్ కలర్సు** పర్యా క్రేయాన్ చిత్రలేఖనంలో వాడే మైనపు రంగులు (కో.25)

**వాజ్‌లైను** . మేకప్‌లో ముఖానికి రంగు వేసేప్పుడు రంగులో కలిపే ద్రవ్యం (కో 7, రా.13)

**వాటర్‌ప్రూఫ్** . చిత్రలేఖనంలో బొమ్మలని నీటి నుంచి పాడవకుండా కాపాడటానికి వేసే N C లేకర్ స్ప్రే (తె 1)

**వాటర్ పెయింట్స్** వాటర్ కలర్స్‌తో వేసిన చిత్రాలు (రా.11)

**వాడు** . నాటకంలో హార్మోణి, తబలా, క్లారనెట్, వయొలిన్ ఉపయోగించు (రా 13)

**వాదకుడు** · (వయొలిన్) వాయించేవాడు (కో 7)

**వాది** · పక్వాద, తబల, మృదంగం కుండలకి కట్టే చర్మపు తాడు పర్యా వారు, సల్లు చూ ఎనుబోతునార (తె 2,3,33)

**వాన** . రంగ్రేజీ పనిలో వాడే అచ్చు (తె 4)

**వాయిద్యం** · సంగీత పరికరం (కో 37, రా 5,8)

**వాయించు** · సంగీత పరికరాలని ఉపయోగించు (మోగించటం) (కో 36, తె 1,2, రా 10)

**వాయించే తంతి** . వీణ దండెకి పై భాగంలో ఉండే తీగ (రా 5)

**వాయించే రంధ్రాలు** నాగస్వరాన్ని వాయించటానికి ఉండే ఏడు రంధ్రాలు (రా 5)

**వారు :** తబల, మృదంగం, డోలకు మొదలైన వాటిని బిగించటానికి మూతలకి అల్లే చర్మపుతాడు చూ (వాది) ఎనుబోతునార చూ చిత్రం-5 5,6 5,7 4, 8.5,10 3,11 3 (కో 7, తె 3, రా 5)

**వాషర్** . 1 వీణ తయారీలో వాడే కుంపాసలో భాగం (కో 6)

2 హార్మణీకి ఉండే స్క్రూ (కో 7)

**వాసన** ఆయిల్ పెయింట్స్ వేసే జింకుతో వచ్చే పరిమళం (సువాసన) (రా 11)

**వాస్తు పూజ** · రాతిపనిలో విగ్రహం పూర్తయిన తర్వాత కర్తకు ఇచ్చేప్పుడు శిల్పులు విగ్రహానికి చేసే గణపతి పూజ (కో 19)

**విగ్రహం** · రాతితో చేసే బొమ్మ (కో 19)

**విగ్గు** · నాటకంలో తలకి పెట్టుకునే కృత్రిమమైన జుట్టు (కో.7,29, రా 8)

**విడిమీటు** : వీణ మీది తంత్రులను రంజనానికై విడిగా మీటడం (కో 7)

**విత్తనాలు** : వీణ మేరువుకి దగ్గర అమర్చే ఆనపకాయలో ఉండేవి. వీటిని ఎండపెట్టి తీసేస్తారు (కో 6)

**వినుట** : రాతిపనిలో రాయిని చెక్కేప్పుడు అనుకున్న విధంగా రాయి తెగడం. (కో.31)

**విన్సర్ అండ్ న్యూటన్** : రంగులు తయారు చేసే కంపెనీల పేర్లు. (కో 2)

**విపంచి వీణ** : వీణలో ఒక రకం దీనికి 13 తీగలకు 13 స్వరాలుంటాయి. (కో 28)

**విప్పు** : 1. తబలా మూతకుండే వార్లు ఊడదీయు (కో 7)
2 తబలా మూత తయారీలో కడియం కొసల మధ్య లోపెట్టి ముచ్చికుట్టి జాయింట్ చేసి ఎండిన తర్వాత ఊడదీయు (కో 7)

**విభాగిని** : సిమెంటు బొమ్మల తయారీలో కొలతలు చూసుకోడానికి వాడే పరికరం (కో 3)

**విభూతి పండు** . పర్యా విభూది నాటకాలలో బొట్టు పెట్టడానికి వాడేది (కో 29)

**విభూతి రేఖలు** · చూ అడ్డబొట్టు శిల్పంలో శివలింగానికి ఉండే బొట్టు (కో 31)

**విరగ్గొట్టు** · రాతిపనిలో వాడే ఉలి తయారీలో ఊసని తెగ్గొట్టు (రా 5)

**విరిడైన్ గ్రీన్** : (Viridian green) చూ ఆకుపచ్చ చిత్రలేఖనంలో వాడే ఆకుపచ్చ రంగు (రా 9)

**విల్లంబులు** . నాటకాలలో వాడే ధనుస్సు బాణం. (కో 29)

**విల్లు** . చూ. కమాను. ఫిడేలు వాయించటానికి వాడేది. (కో 7; రా.5)

**విశ్వకర్మ ఆవాహన** రాతిపనిలో విగ్రహం పూర్తయిన తరువాత శిల్పకర్తకు చేసే పూజ (కో 19)

**విశ్వకర్మకులస్థులు** : రాతిపని చేసేవారు (కంసాలివారు). (తె.6)

**విశుద్ధ** · వీణకు పన్నెండో మెట్టు అమర్చిన చోటు (కో 7)

**విష్ణుసంప్రదాయం** : వైష్ణవ ఆచారానికి సంబంధించిన విగ్రహాలు చెక్కే తీరు (కో 19)

**వీణ** సంగీత వాయిద్యం. చూ చిత్రం-1 (కో 6,7,13,24, రా.5,8)

**వీణదిమ్మ** : వీణ తయారీకి వాడే కొయ్య. (కో 6)

**వీణబుర్ర** : పర్యా వీణ కుండ వీణ తల భాగం చూ కీర్తిముకుడి బుర్ర. (కో 28)

**వీణమీటులు** : చూ మీటు వీణను వాయించే పద్ధతులు (కో 7)

**వీణరౌను** : వీణకుండ గుండ్రంగా ఉండే భాగం (కో 6)

**వీణాహస్తం** రాతిపనిలో ఉదరం మధ్యకు చేయిపెట్టినట్లు చెక్కటం (రా 5)

**వీధినాటకం** . వీధుల్లో వేసే నాటకం (తె 12, రా.2,10)

**వీరఘంటామణి** : రాతిపనిలో శిల్పానికి చెక్కే ఆభరణాలు. (కో 37)

**వీరహస్తం** · రాతిపనిలో శిల్పానికి కుడి చెయ్యి వెనక్కి ఎడమ చెయ్యి ముందుకి ఉంచినట్లు చెక్కడం (కో 19)

**వుడ్** · మేకప్‌లో రాజుపాత్రకి రాజలాంఛనాలతో చమ్కీ గుడ్డవేసి అలంకరించటం (కో 7)

**వృత్తలేఖిని** : కైవారం రాతిపనిలో వాడేది చూ కంపాస్ (కో 3, తె 6)

**వెచ్చ(పెట్టు)** · తబలాకు వాడే కరిణపిండి తయారీలో సిత్రిమ రాయి పొడిని వేడిచేయటం చూ నిప్పు, శగ (కో.5,7)

**వెడల్పు** . 1 వీణ తయారీకి కోసే మొద్దు వెలుపు (కో.6)

2. మృదంగానికి కోసే వారు వెలుపు (కో 7)

**వెడల్పు నైతరం** రాతిపనిలో శిల్పం చెక్కడానికి వాడే సాధనం (కో 31)

**వెంట్రుక.** 1 వయొలిన్ కమాను (bow) తయారీలో వాడే గుర్రపు తోక వెంట్రుక (కో.23)

2 కుంచె చివరన ఉండే వెంట్రుక చూ.చిత్రం-30.3 (రా 8)

**వెండి తంతి** వయొలిన్‌కి ఉండే తీగ (రా 5)

**వెదురు** 1 ఫ్లూటు తయారీకి వాడే కర్ర (కో 7, రా 5)

2 డోలకు రింగుల తయారీకి వాడే కర్ర (కో 13)

**వెదురు.కర్ర** ఉత్తర భారతదేశంలో వాడే వీణ తయారీలో ఉపయోగించే కర్ర (కో 7)

**వెదురు గుజ్జు** వీణ తయారీలో కుండమీద టాపు బిగించటానికి వాడే ద్రవ్యం (కో 24)

**వెదురుగొట్టం** చూ వెదురు (1) (కో 39)

**వెదురుపుల్ల** వీణ తయారీలో కుండకు చుట్టూ ప్లాస్టిక్ షీటు అతికించటానికి మేకులుగ చేయటానికి వాడేది. (కో 6)

**వెదురుబద్ద** డోలకు మూతకు చుట్టూరా గుండ్రంగా ఉండే "గుండె" తయారీకి వాడేది (కో 5)

**వెనుకవైపు** చిత్రలేఖనంలో ట్రేసు తీయడానికి వాడే కాగితం వెనుక భాగం. (కో.19)

**వెర్మిలిన్** (vermillion) చిత్రలేఖనంలో వాడే ఎరుపు రంగును పోలి ఉండే రంగు సూర్యోదయానికి వేసే రంగు (రా 9)

**వెల** రాతిపనిలో వాడే శిలఖరీదు (రా 1)

**వెలిమీటు** వీణని కింది నుంచి మీదకు మీటడం (కో 7)

**వెల్వెట్** పర్యా ముఖమల్, దంతం పని ఒక రకం బట్ట పౌరాణిక నాటకాలలో దుస్తుల తయారీకి వాడేది (రా 13)

**వేడి** · రాతిపనిలో శిలను పగులకొట్టడానికి పెట్టే మంట (రా 5)

**వేడిముక్క** : మృదంగం, తబల తయారీలో చర్మం మధ్య భాగం నుండి కొలత ప్రకారం కోస్తే దానిలోపలి భాగానికి పేరు వేడి ముక్క (కో 5,7)

**వేణువాద్యం.** ఫ్లూటు చూ మురళి (కో 7)

**వేప** : తబలా కుండ తయారీకి వాడే కొయ్య (కో 7,26, తె 1,3; రా 5,6)

**వేయు.** 1 నాటకంలో అంకానికి, అంకానికి మధ్య తెరను దించు (రా 13)

2. రాతిపనిలో ముందు విగ్రహం కొలత ప్రకారం శిలని దిమ్మగా చేయు (కో 31)

**వేరుకర్ర** ఇతరమైన కొయ్య తంబురా తయారీకి సంపెంగ, పనసకర్రలే కాక ఇతరకర్రని వాడకూడదు (కో 13)

**వేరువ.** వయొలిన్‌కు ఫింగరు బోర్డు దిగువ భాగంలో ఉండే భాగం (కో 7)

**వేలాడదీయు** 1 తబలా తయారీలో వార్లను తెల్లగ చేయడానికి రింగును వేలాడదీయటం (తె 2)

2 తబలా తయారీలో వాడే చర్మం తడిపి ఎత్తు కొయ్యమీద ఆరేయటం (కో 7)

**వేలి రంధ్రాలు** ఫ్లూటుని వాయించడానికి చేసే రంధ్రాలు (కో.7)

**వేలు** 1 రాతిపనిలో **చేసే** సుబ్రహ్మణ్యస్వామి విగ్రహాని చేతిలో చేసే ఆయుధం పేరు (రా.5)

2. బుర్ర కథలో ప్రధాన కథకుడు జేబు రుమాలున కట్టుకునే భాగం (తె 1)

3. తబలాకు శాయిమీద చక్రాలు గీయటానికి వాడే చేతి భాగం (తె 3)

**వేళావిశేషం.** నాటకంలో వాడే శక్తి బొమ్మల తయారీకి పెట్టే ముహూర్తం (కో 7)

**వేళ్ళు** · వాగ్గు కథ చెప్పేవారు జంగులు తగిలించుకునే

భాగం. (తె.1)

**వేష్ట్ :** నాటకంలో వాడే గద మొదలైనవి చేసేప్పుడు పైన అంటించే 'పనికిరాని' బట్టముక్కలు (కో 7)

**వైజయంత్రి** రాతిపనిలో శిల్పానికి చెక్కే ఉత్తరీయం (కో 8)

**వైట్** · చిత్రలేఖనంలో ఉపయోగించే తెలుపు రంగు. (కో.3,7, తె 2,4,9, రా 7)

**వైట్క్లే** సిమెంటు పనిలో మోడల్ ఫిగర్ చేయడానికి వాడే తెల్లబంక మన్ను (కో 38)

**వైట్జింక్ :** 1 పరదాలపై అద్దకం పనిలో బట్టమీద పూసే ద్రవ్యం. (తె 2)

2 చిత్రలేఖనంలో గోడమీద బొమ్మవేసేప్పుడు అవిశనూనెలో కలిపి గోడకు పూసే ద్రవ్యం. (రా 11)

3 మేకప్లో జుట్టు నెరిసినట్టు కనబడటానికి వాడే ద్రవ్యం (కో 7)

**వైటుసెడారం** (white cedar) వయొలిన్ తయారీకి వాడే కొయ్య (రా 5)

**వైటుసిమెంట్ .** సిమెంటు బొమ్మల తయారీలో వాడే ఒక రకం సిమెంటు (కో 3,8)

**వైర్(తీయు) :** 1 సిమెంటు బొమ్మల తయారీలో బొమ్మకు ముందు ఇనుపతీగ చుట్టు (రా 13)

2 తబలాను బిగించటానికి వాడే తీగ. (కో 7)

**వైలట్ రంగు** వీణకు పూసే వంకాయ రంగు (కో 24)

**వైస్** · వీణ తయారీలో చిన్న వస్తువులు చేసేప్పుడు కదలకుండా బిగించటానికి వాడే యంత్రం (రా 5)

**వొగ్గుకథ .** ఒక జానపద నృత్యకథ చూ చిత్రం-25 (తె 1)

**వొగ్గులు** · వొగ్గుకథ చెప్పేవారు (తె 1)

**వొగ్గోళ్ళు :** చూ. వొగ్గులు (తె 2)

**వోవర్సైజు :** (oversize) మించిన ప్రమాణం. (రా 5)

**వ్యంగ్యం :** బుర్రకథలో వంతదారులలో ఒకడు, రెండవవాడు చెప్పిన దానికి తీసే వ్యతిరేకార్థం, విపరీతార్థం (తె 1)

**వ్యాళయజ్ఞోపవీతం** రాతిపనిలో చెక్కే వినాయకుడి విగ్రహానికి చెక్కే జందెం (రా 3)

**వ్యాళలతలు** రాతిపనిలో చెక్కే ఒక విధమైన డిజైన్ (కో 31)

**వ్యాసం .** (diameter) కొలత (కో 5,6,7)

## శ

**శక్తి (బొమ్మ):** నాటకంలో ఉపయోగించటానికి చేసే బొమ్మ (కో 7)

**శక్తిసంప్రదాయం** రాతిపనిలో చేసే శక్తికి సంబంధించిన విగ్రహాలు (పార్వతి, కనకదుర్గ) (కో 19)

**శంకుస్థాపన** · భవనాలు, కర్మాగారాలు మొదలైనవి కట్టేప్పుడు పెద్దలచే స్థాపింప చేసే శిల (రాతిపనివారు ఈ శిలపై పేర్లు చెక్కుతారు) (కో 3)

**శంఖంవీణ** రూపా శంఖు వీణ వీణ చివర భాగం శంఖం మాదిరి తయారు చేసిన వీణ (కో 13,24,28)

**శంఖుముడి** శంఖు వీణ కుండ ఉండే ఆకారం చూ చిత్రం-1 18 (కో.13)

**శరీర ప్రాధాన్యత .** చాళుక్య శైలిలో చేసే శిల్పంలో ఎక్కువగా శరీర అవయవాలకు ప్రాధాన్యం ఇస్తారు (రా 8)

**శల్మా** · నాటకంలో దుస్తుల తయారీలో డిజైన్లకి ఉపయోగించే సాధనం (రా 13)

**శాటిన్** నాటకంలో రాజుల పంచెల తయారీకి వాడే గుడ్డ (కో 29)

**శాణం :** రూపా శాణం

1 శిల్పం చెక్కేప్పుడు పెచ్చులు తీయడానికి వాడే సాధనం (రా 5,8)

2 తబల, మృదంగం తయారీలో వాడే సాధనం (కో 7)

**శాయి** చూ కరిణ తబల, మృదంగం, డోల్కి మూతలలో ఒక దానికి వేసే కరిణి (తె 2,3)

**శాయిపుడి** . మృదంగంలో శాయి ఉన్న భాగం (తె 2)

**శాయిపౌడర్** చూ కరిణ పిండి శాయిని తయారు చెయ్యటంలో ఉపయోగించే నల్లటిపొడి ఇది గుజరాత్‌లో తయారవుతుంది - కర్నెపొడి (తె 3)

**శారదకాల్లు** · బుర్రకథలు చెప్పే కులవృత్తి కల్గినవారు కొందరు నాటకాలు కూడా ఆడతారు (తె 1,2)

**శిల** పర్యా రౌతు, రాయి

రాతిపనిలో విగ్రహాల తయారీకి వాడే ద్రవ్యం (కో 31, తె 6, రా 1)

**శిల్ప ప్రమాణం** రాతిపనిలో ఒక విగ్రహం చెక్కేప్పుడు ఆ విగ్రహానికి ఉండే కొలతలు చూ తాళ ప్రమాణం (రా 1)

**శిల్పం** రాతిపనిలో చేసే విగ్రహం (తె 6, రా 4)

**శిలాఫలకం** రాతిపలక (తె 6)

**శిలామర్దన** రాతిపనిలో విగ్రహం చెక్కిన తరువాత నల్లగ కనపడటానికి కరక్కాయ, అన్నభేది రాయటాన్ని శిలామర్దనం అంటారు (కో 19)

**శిలాసంక్రమణం** · శిల్పానికి సంబంధించిన శాస్త్రం (కో.19)

**శిల్పి(చేయు)** : రూపా శిలిపి పర్యా శిల్పిదనం

తోలు బొమ్మల తయారీలో చర్మం మీద బొమ్మని చెక్కటం (కో 7, రా 2)

**శిల్పిదనం** : చూ శిల్పి (రా 2)

**శివలింగం** . రాతిపనిలో చేసే విగ్రహం. (కో 19)

**శివపత్తులు** : వొగ్గు కథ చెప్పే వాళ్ళు శివుని గురించి చెప్పేప్పుడు 'సిగం వూగేవారు' చూ ఘనాదులు (తె 1)

**శివసంప్రదాయం** · రాతిపనిలో తెల్లరాయి (శ్వేతశిల) మీద శివసంప్రదాయానికి సంబంధించిన బొమ్మలు మాత్రమే చెక్కుతారు (కో 19)

**శివుడిబొట్టు** మేకప్‌లో వాడే అడ్డబొట్టు (కో.7)

**శిఖమణి** రాతిపనిలో చెక్కే విగ్రహానికుండే కిరీటం పై భాగం (రా 8)

**శుకలతలు** . రాతిపనిలో చెక్కే డిజైను (కో 31)

**శుద్ధరిషభం** · సంగీతంలో ఒక అర్ధస్వరం (రా 5)

**శుద్ధి(చేయు)** · రాతిపనిలో విగ్రహం చెక్కేప్పుడు వచ్చే ధూళిని కొబ్బరి పీచుతో బాగు చేయడం (కో 19)

**శురు(చేయు)** . రాతిపనిలో విగ్రహం చెక్కటాన్ని ప్రారంభించటం (తె 6)

**శూలం** రాతిపనిలో శివుని విగ్రహం చెక్కేప్పుడు చేసే శివుని ఆయుధం (తె 6)

**శెల్లా** మేకప్‌లో ఉపయోగించే ఉత్తరీయం (రా 8)

**శేనం** పర్యా శీర్ణం

రాతి శిల్పంలో పెచ్చులేపడానికి ఉపయోగించే పరికరం (తె 6)

**శైలి** · 1 రాతిపనిలో శిల్పం చెక్కే పద్ధతి (చాళుక్య శైలి, ద్రావిడ శైలి) (రా 8)

2 చిత్రలేఖనంలో బొమ్మలు బాగా వేయడం (కో 19)

**శౌరిజుట్టు** నాటకంలో రాజుపాత్రకి పెట్టే విగ్గు తయారికి వాడే యాన్ అనే బర్రె బొచ్చు (కో 29)

**శ్రావణమాసం** . రాతివిగ్రహాలకి వెండి తొడుగు చేసే వారికి పని ఎక్కువగా ఉండే సమయం (కో 33)

**శ్లాటింగ్ డిష్** . చిత్రలేఖనంలో రంగులు కలుపుకునే పాత్ర (కో 19)

**శ్రీకంఠాలు** : విగ్గుల తయారీకి వాడే జుట్టు (రా 8)

**శ్రీకేతనం** · స్త్రీ పాత్రలు ధరించే కిరీటం (రా.8)

**శ్రీచందనం** : నాగస్వరం తయారీకి వాడే కర్ర (కో 7)

**శ్రుతి :** సంగీత వాయిద్యం చూ కవ చూ చిత్రం 16. (కో 7, తె 2, రా 5)

**శ్రుతిగొట్టం :** శ్రుతిలో పొడగుగానున్న గొట్టపు భాగం చూ.చిత్రం-16 4 (కో 7)

**శ్రుతితీగ :** వీణకి దండిమీద బిగించే తీగలు (కో 13)

**శ్రుతిపూవలు** వీణలో భాగం. చూ.చిత్రం-1 9 (కో 13)

**శ్రుతిపెట్టె :** హార్మోణియంలో పెట్టెలా ఉన్న భాగం చూ చిత్రం-4.2 (కో 13)

**శ్రుతిబిరడాలు :** బుర్రకథ తంబురలో భాగం చూ చిత్రం-23 3. (కో 13)

**శ్రుతివాద్యం** · కేవలం శ్రుతికొరకు మాత్రమే ఉపయోగించేది (ఉదా తంబూర, హార్మోణి) (కో 7)

**శ్రుతిసవరించు :** వీణ తీగల శ్రుతిని సరిచేయు (కో.13)

## ష

**షాపు :** 1 దుకాణం (రా 4)

2. షార్పు తబలా కొయ్యను చెక్కడానికి వాడే జాతి ఉలి వాడిగా ఉండటం చూ నునుపు (కో 5,7)

**షీటు :** చిత్రలేఖనంలో బొమ్మ వేయటానికి వాడే బట్ట, లేక కాగితం (కో 25)

**షేడ్ :** 1. చిత్రలేఖనంలో బొమ్మలకి అక్కడక్కడ వేసే నీడ. (కో 3, తె 1, రా 13)

2 మేకప్‌లో ముఖానికి అక్కడక్కడ వేసే నీడ (కో 7)

**షేప్ :** ఆకారం. (కో 1,7,13,16,26,32,41, తె 1,4,9,12; రా 5)

**షైన్‌పేపరు :** సిమెంటు బొమ్మల తయారీలో పాలిష్ చేయటానికి వాడే కాగితం. (కో 33)

**షో :** అలంకరణ, తబలా శాయిమీద ధ్వని కోసం అలంకరణ కోసం చక్రాలు వేయటం (తె 3)

**షోడశ తాళాలు :** రాతిపనిలో శిల్పం చెక్కటానికి వాడే ప్రమాణ తాళం (ముఖం) (కో 19)

## స

**సంకరాత్రి (నెలవెట్టు) :** సంక్రాంతి దాటి నెల రోజులు కావటం మల్లన్న పండుగ రోజు. (తె 1)

**సంగీతపరులు :** సంగీతం వచ్చిన వారు (తె 3)

**సంగీత రచన :** సంగీతం వాయించటం (వీణ) (కో 7)

**సంగీతవాద్యం** . సంగీతాన్ని శాస్త్రయుక్తంగా ప్రదర్శించటానికి ఉపయోగపడే వాద్యం (కో 7)

**సంఘట్టన వాద్యం** చేతులతో తట్టేదాని వల్ల శబ్దం పుట్టే వాద్యం (ఉదా మృదంగం, డోలు) (కో 7)

**సచ్చేకం ఆకురాయి** రాతిపనిలో వాడే నాలుగు మూలల ఆకురాయి (తె 6)

**సంచి** తబలా తయారీకి వాడే మేక చర్మం కోయటానికి ముందు ఉండే ఆకారం (కో 7)

**సత్రేకం :** పర్యా సౌకం రాతిపనిలో చెక్కే డిజైన్ (తె 6)

**సందు** సిమెంటు బొమ్మల తయారీలో బొమ్మకు చేసే చిల్లు (రంధ్రం) (రా 13)

**సన్‌మైకు** · (sun mica) హార్మోణియంలో భాగం పక్క భాగం (కో 7)

**సన్న (ంతిప్పు)** రూపా సన్నం పరదాలపై అద్దకం పనిలో గీసే సన్నగీత (తె 2)

**సన్న ఆకురాయి** . సంగీత పరికరాల తయారీలో నునుపు చేయడానికి వాడేది (కో 34, తె 1,2,3)

**సన్నఉలి :** రాతిపనిలో శిల్పాలు చెక్కేప్పుడు వాడే సన్న, శీర్ణం (కో 26,34, రా 5)

**సన్న చాణం :** రాతిపనిలో శిల్పం ఆఖరున సమం చేయడానికి వాడే సేనం. (రా 1)

**సన్నజాగా** . రాతిపనిలో విగ్రహానికి సన్న శీర్ణంతో చెక్కే

సూక్ష్మ ప్రదేశం. (తె.6)

**సన్ననరంతంతి :** వయొలిన్‌కు వాడే సన్నటి తీగ. (రా.5)

**సన్నసల్లమొన :** రాతిపనిలో శిల్పం చెక్కటానికి వాడే సాధనం. (రా.5)

**సన్నబ్రష్ :** పర్యా. సన్న బులుసు (బ్రష్ బులుసు).

1. చిత్రలేఖనంలో రంగు సన్నగా వేయాల్సిన చోట వాడే కుంచె. (కో.26; తె.9)

2. మేకప్‌లో వాడే కుంచె. (కో.7; రా.5)

**సన్నమీటు :** నాదం సూక్ష్మంగా ఉండే విధంగా వీణ మీటడం. (కో.7)

**సన్నరాపకం :** రాతిపనిలో విగ్రహాన్ని సానరాయితో రాయడం. (తె.6)

**సన్నవీరం :** రాతిపనిలో విగ్రహానికి కిరీటం కుడి పక్క ఉండే జందెం. చూ. చన్నవీర. (రా.5)

**సన్నసీనం :** రాతి మీద బొమ్మలు చెక్కటానికి వాడే సేనం. (కో.31,34)

**సన్నసీర్నం :** రాతిపనిలో విగ్రహాలను సన్నని భాగాల్లో చెక్కటానికి వాడే సాధనం. (తె.6; రా.3,4,5)

**సన్నాయి :** చూ. నాగస్వరం. ఒక సంగీత వాయిద్యం. చూ.చిత్రం-17. (కో.36,39)

**సన్నాయి గొట్టం :** సన్నాయిలో ఉండే గొట్టపు భాగం. చూ. చిత్రం-17.1. (కో.36,39)

**సపోర్టు :** రాతిపనిలో విగ్రహం చేయి చాస్తున్నట్లు చెక్కేప్పుడు పెట్టే ఆధారం. (తె.6)

**సప్తతంత్రులు :** వీణకుండే ఏడు తీగలు. (కో.7)

**సప్తతాళం :** విగ్రహం చెక్కేప్పుడు రాతిపనిలో వాడే ప్రమాణం. (కో.19; తె.6)

**సప్తస్వరాలు :** సంగీతంలో స, రి, గ, మ, ప, ద, ని అనే ఏడు ధ్వనులు. (కో.39)

**సప్పుడు (చేయు) :** 1. వొగ్గు కథలో నగారా, డోలు, పెద్ద తాళంతో ధ్వని చేయడం. (తె.1)

2. తబల వాయించేప్పుడు వచ్చే ధ్వని. (తె.1)

**సఫేదా :** మేకప్‌లో వాడే బోరిక్ పొడరు (తెలుపురంగు). (రా.8)

**సమతల ఉలి :** 1. వీణ తయారీలో హెచ్చుతగ్గులు సరిచేయడానికి వాడే ఉలి. (రా.5)

**సమపాళ్ళు :** చిత్రలేఖనంలో బొమ్మలకు బంగారం వర్ణం రావటానికి రంగు తయారీలో ముసాంబరం, అవిసెనూనె, గుగ్గిలం సమాన పరిమాణంలో కలపటం. (తె.1)

**సమర(పెట్టు) :** రాతిపనిలో విగ్రహం పూర్తయిన తర్వాత నూనె రాయటం. (తె.6)

**సమానం :** పర్యా. తంటసం.

మృదంగం తాలూకు రెప్పలు తీయటానికి వాడే సాధనం. (కో.7)

**సమ్మేళనం :** 1. చిత్రలేఖనంలో రంగుల కలయిక. (రా.9)

2. వివిధ సంగీత వాద్యాల కూడిక. చూ. కలుపు. (కో.7)

**సంప్రదాయం :** చిత్రలేఖనంలో ఒక ప్రదేశం తాలూకు బొమ్మలు చిత్రించేప్పుడు గుర్తుంచుకోవాల్సిన ఆ ప్రదేశపు ఆచారం, పద్ధతి. (కో.2)

**సంపెగ కర్ర :** తంబుర తయారీకి వాడే కొయ్య. (కో.13)

**సరచ్చి :** చిత్రలేఖనంలో బొమ్మకు ఆభరణాలు తీర్చటానికి ఉపయోగించే మిశ్రమంలో కలిపే పొడి. (తె.1)

**సరత్సు :** 1. పరదాలపై అద్దకం పనిలో వాడే రంగులో కలిపే జిగురు. (తె.2)

2. డక్కీ తయారీలో కుండకు తోలుని అతికించటానికి వాడే జిగురు. (తె.7,13)

**సరం :** వీణ తయారీలో వాడే పనిముట్లు చేసుకొనేందుకు దుకాణం ముందు భాగంలో మట్టితో చేసిన గూడు. (కో.6)

**పరం రంధ్రం** : సరంలోంచి గాలిరావటానికి ఉండే చిల్లు (కో.6)

**పరస్వతిముడి** : డోలులో ఒక భాగం. చూ చిత్రం-7 5 (కో.13)

**పరస్వతివీణ** : వీణ చివరి భాగం సరస్వతీ దేవి మాదిరిగా చేస్తే ఆ వీణని సరస్వతీ వీణ అంటారు దీని 25 లేక 26 మెట్లు ఉంటాయి. (కో.13,24)

**సర్పకుండలం** : రాతిపనిలో విగ్రహం చెవులకు చెక్కే ఆభరణ విశేషం. (కో.31)

**సర్పముఖం** : వీణలో భాగమైన 'యాళి' పాముముఖంలా ఉండటం. (కో 7)

**పరిచేయు** . పర్యా. సవరించు. వీణకు శ్రుతిని సరిపెట్టు (కో.6)

**పరిపెట్టు** : సిమెంటు పనిలో బొమ్మలకు అవయవాలు సరిగా చేయు. (కో 3)

**పరుగు** : వేపకొమ్మలు, ఏటకసరు, రక్తం, అన్నం, కల్లు అన్నీ కలిపిన మిశ్రమం. బీరప్ప పండుగ రోజు గొర్లమంద మీద దీన్ని చల్లుతారు. (తె.1)

**పరుగోలు కమ్మెలు** : చూ. సరిగోల, మైనం కర్ర (కో.39)

**పరుపు** : కుంపాస తయారీలో చివరలను సూదిగ కొట్టడం (కో 6)

**పర్కెలు** : వీణ తయారీలో కుండ చేయటానికి కుంపాసతో 8 అం॥ వృత్తం గీయటం (కో.6)

**పరేష్‌గమ్** : చిత్రలేఖనంలో సిల్కు బట్టమీద బొమ్మకి రంగులు వేసేప్పుడు రంగులు పోకుండా చిత్రం రబ్బరువలె మెత్తగ ఉండటానికి ఆ రంగులో కలిపే ద్రవ్యం (గమ్‌రెజిన్స్). (తె 8)

**పర్పిసు** : 1. మృదంగం కరిణ ప్రాంతంలో పూసే జిగురు. (కో.7)

2. చిత్రలేఖనంలో గుడ్డపై పూయడానికి వాడే జిగురు. (కో.3)

**పలకముక్క** . డోలకు తయారీలో వాడే మేక చర్మాన్ని ఎన్ను నుండి మూడు జానలు కోయగా మిగిలిన చర్మానికి ఈ పేరు (కో 5)

**పలగ** : రాతిపనిలో శిల్పానికి కండ్లు, ఆభరణాలు చెక్కటానికి వాడే సన్నసీర్నం. (తె.6)

**పలగలు పట్టు** . రాతిపనిలో సలగలని ఉపయోగించు. (తె 6)

**పలాక** . రాతిపనిలో శిల్పానికి ఆభరణాలు చెక్కటానికి వాడే పరికరం. (కో 31)

**పలిలేదు** : హార్మోణియం అలంకరణకుగాను అమర్చే ద్రవ్యం. హారతి కర్పూరంతో తయారు చేస్తారు. (కో 28)

**పలీసు** మేకప్‌లో వాడే చౌకరకం పౌడరు (రా.5)

**పహజం** : వీణ తయారీలో వాడే కొయ్య ఏ రంగులో ఉన్నదో వీణ అదే రంగులో ఉండటం (కో 24)

**సాగగొట్టు** : వీణ తయారీలో మెట్లకు వాడే కంచు ముక్కల్ని వెడల్పు చేయు (కో 13; తె.12)

**సాదాకంట** : రూపా సాదా కంటాని

మృదంగం, తబల తయారీలో మూతలకి కళ్ళు చేయటానికి వాడే సాధనం చూ చిత్రం-37 (కో 7)

**సాదాకేతనం** : నాటకంలో వాడే ఒక రకం కిరీటం దీనికి వెనుక భాగం ఉండదు (రా 8)

**సాదాచిందు** వొగ్గు కథలో ఎక్కువగా వాడే చిందు (తె 1)

**సాదాదరువు** : వొగ్గుకథలో ఎక్కువగా వాడే దరువు (తె.1)

**సాదాపుడి** మృదంగంలో శాయిలేని భాగం బోనంపూడి. (తె 2)

**సాది** చెమ్కీలో ఒక రకం.

నాటకాలలో దుస్తుల తయారీకి వాడే చెమ్కీ (కో 29)

**సాధకం** : మృదంగం వాయించటం నేర్చుకోవటం. (రా.5)

**సాధన** బుర్రకథలో గాత్రాన్ని నేర్చుకోవటం (తె 1)

**సాధారణసీను** నాటకంలో ఉండే మామూలు దృశ్యం (రా 13)

**సానబెట్టు** రూపా సానపట్టు
రాతిపనిలో వాడే పనిముట్లకు పదును పెట్టటం (కో 3,11,28,33)

**సావరాయి** 1 చూ సానముక్క (తె 8)
2 రాతిపనిలో శిల్పం మెరుగు (నునుపు) రావటానికి వాడే రాయి చూ ఆకురాయి (కో 33, తె 6, రా 5)

**సాప** · వాగ్గకథ చెప్పేప్పుడు వేసే స్టేజికి కింది భాగంలో వేసే చాప (తె 1)

**సాపు** · (చేయు) సంగీత పరికరాలను నునుపుగా లేదా శుభ్రంగా ఉండటం (కో 1,5,6,7,9,16,21,24,26, 27,28,33,37; తె 1,3,4,5,6,11,12,13, రా 5)

**సాపుఆకురాయి** పర్యా బొద్దాకురాయి చూ పాలపు ఆకురాయి వీణ తయారీలోను, రాతి పనిలోను నునుపు చేయడానికి వాడే ఆకురాయి (కో 13, తె 6)

**సాపుకరిణె రాయి** మృదంగం మీద వేసే కరిణ శ్రుతి రావటానికి తోమటానికి వాడే రాయి (కో 7)

**సాపువీణ** వీణ కుండకి డోరియాలు (డిజైన్లు) లేని వీణ (కో 13)

**సాఫ్ఉడ్** · చిత్రలేఖనంలో రేకుమీద చిత్రాలు వేసేప్పుడు దీని మీద పెట్టి వేస్తారు (రా 11)

**సాఫ్ట్‌స్టోన్** శిల్పాలు చెక్కటానికి వాడే మెత్తని శిల (కో 31)

**సామాను** చిత్రలేఖనంలో ఉపయోగించే పరికరాలు (తె 8, రా 9)

**సారణి అనుసారణి** వీణకు బ్రిడ్జి మీద ఉండే తీగలలో రెండింటి పేర్లు (31 నెం॥ ఉక్కుతీగ) (రా 5)

**సారలు** వీణ తయారీకి వాడే ముదురు పనసకొయ్యకు ఉండే గీతలు (రా 5)

**సాలుమీద దరువు** డోలు వాయించే నమూనా (తె 1)

**సికమూర్** ఫిడేలు అడుగు బల్ల, మెడ, పక్కలు, బ్రిడ్జి చేయటానికి వాడే కొయ్య (రా 5)

**సిక్లాంపు** వయొలిన్ తయారీలో భాగాల్ని అతికించేప్పుడు బిగించటానికి వాడే సాధనం (రా 5)

**సిగం (ఊగు)** వాగ్గ కథ చెప్పేవారు దేవుడు వంటి మీదకు వచ్చినప్పుడు ఊగటం (తె 1)

**సింగ్‌రూప్** · పరదాలపై అద్దకం పనిలో వాడే ఎరుపు రంగు చూ ఇంగ్లీకం (తె 1,2,4,7)

**సింగిల్ రీడ్ హార్మోణియం** . ఒకటే పలుకు సెట్టు గల హార్మోణియం (కో 39)

**సింగిలు లీడు** (single lead) 37 మెట్లు కలిగి సంగీతానికి వాడే హార్మోణియం, చేతుల్తో వాయించేది (కో 7)

**సిత్రమరాయి** కరిణ పిండి తయారికి వాడే రాయి (కో 7; రా 5)

**సిద్ధించు(ట)** . రాతిపనిలో విగ్రహం చెక్కేప్పుడు మూర్తి ఆకారం సరిగ తీసుకరావడం (కో 19)

**సినిమదరువు** వాగ్గకథలో వాయించే సినిమా దరువు (తె 1)

**సిమెంట్** బొమ్మల తయారీకి వాడే ద్రవ్యం (కో 3, రా 13)

**సిమెంట్ ప్రైమర్** సిమెంటు బొమ్మ ఫినిషింగ్ చేసేప్పుడు పైన పూయటానికి వాడే తొలిపూత (కో 38)

**సిమెంటు శిఖరం** దేవాలయం మీద సిమెంటుతో చేసే శిఖరం (తె 6)

**సింపతెటిక్ (స్ప్రింగు)** గోటువాద్యం వాయించటానికి పనికి వచ్చే తీగ చుట్ట (రా 5)

**సిర్ర** . డోలును వాయించే కర్ర. (తె 1)

**సిరిశైలమల్లికార్జునుడు** వాగ్గ కథ పూర్తయిన తర్వాత

ఆఖరుకు హారతిచ్చే దైవం (తె 1)

**సిల్ల** . మృదంగం శ్రుతి చేయడానికి ఉపయోగించే పుల్ల (రా 10)

**సిల్వర్** : మేకప్‌లో వాడే చుక్కపుల్లలు తయారీకి వాడే ద్రవ్యం (రా 8)

**సిల్వర్‌కలర్** సిమెంటు బొమ్మలకు పైన పూసే తెలుపు రంగు (కో 38)

**సిల్వర్ ఓకు** : (silver oak) వయొలిన్ తయారీకి వాడే కొయ్య (రా.5)

**సిలివలైడు** పర్యా. సెలనైట్ హార్మోణియం తయారీలో వాడే వస్తువు (కో.39)

**సిల్కుజుబ్బా** · నాటకంలో వాడే సిల్కు గుడ్డ పొడుగు చేతులు ఉండి జాకెట్టు మాదిరిగా ఉంటుంది (రా 8)

**సివసానం** వొగ్గు కథవారు గొంగడిలో బియ్యం, కొబ్బరికాయ, పువ్వులు, జోతులు వేసి అందులో సూలం పెడ్తారు దీన్నే సివసానం అంటారు. (కో 31)

**సింహకుండలం** రాతిపనిలో శిల్పానికి చెవులకు చెక్కే ఆభరణ విశేషం (కో 31)

**సింహతలాటం** : 1 సింహం తల మాదిరిగా చెక్కిన వీణ చివరి భాగం చూ చిత్రం-11 (కో 24)

2. రాతిపనిలో మొలకట్టుకు చెక్కే సింహం మూతి శిల్పం (తె 6)

3 మేకప్‌లో వాడే ఆభరణ విశేషం (కో 29)

**సింహముఖం** రాతిపనిలో చెక్కే శిల్పంలో మూర్తి పాదానికి ఉండే ఆభరణం (కో 31 )

**సింహాసనం** 1. నాటకంలో కూర్చునేందుకు ఉపయోగించే పీఠం (రా 13)

2 రాతిపనిలో విగ్రహం నిలబెట్టడానికి వాడే భాగం గద్దె (తె 6)

**సీకు** · రాతిపనిలో పెద్ద పెద్ద వృత్తాలు గీయటానికి కైవారానికి అమర్చే సువ్వ (తె 6)

**సీజన్ ఉడ్** · హార్మోణియం తయారీకి వాడే కొయ్య ఎండకు పగలని, వానకు ఉబ్బని కొయ్య. (కో 39)

**సీతాఫలంకర్ర** : చిత్రలేఖనంలో బొమ్మ వేసిన కాగితాన్ని గోడకు తగిలించుకొనేందుకు కాగితం పైన, కింది భాగాల్లో కుట్టే కర్ర (తె 1)

**సీన్** : చిత్రలేఖనం వేసే ఒక దృశ్యం (కో 2)

**సీర్నం** · డోలకు తయారీలో, రాతి బొమ్మల తయారీలో వాడే పరికరం (తె 6, రా 2,5)

**సుజని** · చిత్రలేఖనంలో కాగితం మీద సూదితో బొక్కలు (చుక్కలు) వేయటం (తె 1)

**సుట్టలు** . నాటకంలో పెట్టే ఒక రకం బొట్టు చూ చిత్రం-27 21 (కో 23)

**సుతి చేసుకొను** . తబలాను కావలసిన (శబ్దం) ధ్వని వచ్చేట్టు చేయు (తె 3)

**సుతిపెట్టు** ఒక సంగీత పరికరం (సూర్‌పేటి, చేలిబత్తి) (తె 3)

**సుత్తి** . రాతిపనిలో వాడే పరికరం (కో 1,3,4,6,7,8,23, 25,29,31,33,37, తె 1,3,6,8,10,12, రా 3,5,6,8,13)

**సుద్ద** : చిత్రలేఖనంలో పూర్వం తెలుపు రంగుకు వాడే సున్నం (రా 11)

**సుర్మ** రాతిపనిలో శిల్పం పైన పూసే ద్రవ్యం (రా 8)

**సుళ్ళున్నకర్ర** . సుడులున్న కర్రమొద్దు (వీణ తయారీకి పనికిరాదు) (కో 13)

**సువ్వ** తబలా తయారీలో చర్మాన్ని కుట్టడానికి వాడే పరికరం (తె 2)

**సుల్తానుమీసం** నాటకాలలో సుల్తాను వేషానికి పెట్టే మీసం చూ చిత్రం-26 4, 26 5 (కో 15)

**సూక్ష్మం (భాగం)** . రాతిపనిలో విగ్రహానికి చేసే చిన్న చిన్న భాగం (రా 8)

**సూజ** : తబలాకు గజర కుట్టడానికి ఉపయోగించే దబ్బనం లాటి పరికరం (తె 3)

**సూది** 1 మృదంగం తయారీలో కడియం ముద్ది కుట్టు కుట్టేప్పుడు చర్మం చివర పదునుగా చేయటం (కో 7)

2 చూ గోరుగల్ వీణ తయారీలో వాడే కుంపాస తయారీలో ఊస చివరని సన్నగ చేయటం (కో 5)

**సూదుపుల్ల** · తబలా తయారీలో కన్నం చేయడానికి వాడే పరికరం (కో 7)

**సూదిమూతికారు** . తబలా తయారీలో వార్లు విప్పటానికి వస్తువులు గట్టిగ పట్టుకోడానికి పనికొచ్చే సాధనం (కో 7)

**సూదిమొన** . రాతిపనిలో వాడే జీవరేఖ చివర ఉండే భాగం (రా 1)

**సూర్‌పేటీ** సుతిపెట్టె (తె 3)

**సూర్యపుటం** : రాతి విగ్రహాలకు పూసే కస్తూరిని శుభ్రం చేయటం (రా 8)

**సూర్యనామం** మేకప్‌లో పెట్టే ఒక రకం బొట్టు చూ చిత్రం-27 10 (కో 23)

**సూలం** వొగ్గుకథ వారు సివసానంలో వాడే ఆయుధం (తె.1)

**సృతి** పర్యా స్థాయి

1. బుర్రకథ నేర్పేముందు స-ప-స అనే మూడు వర్ణాల్ని సరిగా పాడటం నేర్పటాన్ని సృతి అంటారు (తె 1)

2 శ్రుతి (కో 7, రా 5)

**సృతిపెట్టె** : హార్మోణియంలో ఒక రకం కేవలం సృతికి మాత్రమే ఉపయోగపడేది (చూ చిన్న సృతి హార్మోణియం) చూ ఆర్మోనియం. (రా 8)

**సెక్కు** రాతిపనిలోను, లోహం పనిలోను విగ్రహాలని చేయు (కో 8, రా.5)

**సెక్యూర్ ఆయిల్‌స్కేలుగ్** చిత్రలేఖనంలో ఆయిల్ పెయింటు వేయటానికి ఉపయోగించే కాగితం. (కో 2)

**సెట్** హార్మోణియంలో ఉపయోగించే రీడ్ భాగం (రా 8)

**సెట్టిమీసం** · మేకప్‌లో సెట్టిపాత్రకు పెట్టే మీసం చూ చిత్రం-26 6 (కో.7)

**సెట్టివేషం** మేకప్‌లో చేసే ఒక రకం వేషధారణ (కో 7)

**సెంటర్(ముక్క)** · 1 మేకప్‌లో వాడే మీసాల తయారీలో గొర్రె వెంట్రుకల్ని దారంతో మధ్య భాగంలో కట్టడం (రా 8)

2 మృదంగం మూతలకి వాడే చర్మాలలో మధ్య చర్మం (కో 5,7)

**సెంట్రల్** · మేకప్‌లో మధ్యదశ (కో 7)

**సెఫియా** . చిత్రలేఖనంలో వాడే పసుపురంగు (కో 3)

**సెలలైట్** · హార్మోణియం తయారీలో మెట్లపై అతికించటానికి వాడే ద్రవ్యం చూ. సిలవలైదు (రా 8)

**సెల్యులాయిడ్ షీటు** · వీణ అలంకరణ కోసం బిళ్ళల తయారీకి వాడే అట్ట (కో.24)

**సెల్యూడురేకు** హార్మోణియంకు మెట్లపైన ఉండేది (కో 7)

**సెల్యూషన్** మేకప్‌లో మీసాలు, గడ్డాలు అతికించటానికి వాడే జిగురు (రా 8)

**సేనం** · రాతిపనిలో విగ్రహం చెక్కటానికి వాడే పరికరం చూ చానం (కో 1,31)

**సేపు** (shape) వీణ తయారీలో కొయ్యకిచ్చిన వీణ ఆకారం (కో 6)

**సేలం** : రాతిపనిలో వాడే శిలలు దొరికే ప్రాంతం (రా 5)

**సేం** . (same) అదే (తె 2)

**సైకిల్‌టైర్** దీన్లో ఉండే సిన్న తీగను తబలా చుట్టలో

వాడ్తారు (తె 3)

**సైజు** · పరిమాణం. (కో 2,5,7,16,21,24,26,28,31,41, తె.2,12, రా 1,3,4,5,8,11)

**సైడ్ :** వొగ్గు కథ చెప్పేవాడికి పక్కనుండే వాడు (తె 1)

**సైన్** చిత్రలేఖనంలో బొమ్మలు వేయటానికి, నాటకంలో దుస్తులు కుట్టడానికి వాడే ఒక రకం బట్ట (కో 29, రా 13)

**సైన్‌కాయితం .** హార్మోణియం తయారీలో మెరుగు పెట్టడానికి వాడే కాగితం (కో 28)

**సైన్‌చర్మం** · హార్మోణియంలోని గాలితిత్తి చేయటానికి ఉపయోగించే చర్మం (రా 10)

**సైన్‌పేపరు** · రాతిపనిలో నునుపు చేయడానికి వాడే గయుకు కాగితం. (కో 31,35)

**సైనింగ్ .** డోలకు తయారీలో చట్రానికి చేసే మెరుగు (కో 8; రా 5,6)

**సైనుబట్ట .** పరదాలపై అద్దకం పనిలో వాడే బట్ట (తె.2)

**సొనాయిగొట్టం** సన్నాయి గొట్టం (కో 36)

**సొప్పబెండ్లు** వొగ్గుకథవారు మల్లన్న పండుగనాడు గంగ తెప్ప కట్టడానికి వాడే కర్రలు (తె 1)

**సొరకాయ** చూ ఆనపకాయ వీణకు ఒక వైపు పెట్టటానికి వాడేది. వీణ వాయించేప్పుడు ఎడమ కాలిమీద పెట్టుకొనేందుకు వీలుగా అమర్చుతారు (కో 24; రా.5)

**సొరకాయబుర్ర.** చూ సొరకాయ డొల్ల (కో 7, రా 5)

**సోడించు** పర్యా గాలించు డోలకుకు కరిణపొడి తయారీలో సిత్రిమరాయి పొడిని వడగట్టు (రా 5)

**సోపు .** సబ్బు మేకప్ చేసుకునే ముందు ముఖం కడుక్కోటానికి వాడే ద్రవ్యం (కో 7, రా 5)

**సౌండ్‌బోర్డు** · హార్మోణియంలో శబ్దం రావటానికి అమర్చే అట్ట (కో 28)

**సౌండ్** వయొలిన్, తబలా వాయించేప్పుడు వచ్చే ధ్వని (కో 7, తె.3, రా 5)

**సౌండ్‌అడ్జస్టర్సు :** వయొలిన్ శ్రుతి సమం చేయడానికి ఉండే భాగాలు (రా 5)

**సౌండ్‌పోస్టు :** వయొలిన్‌కు ఉండే ధ్వని స్తంభం చూ చిత్రం-39 (కో 7, రా.5)

**స్కెచ్ .** చిత్రలేఖనంలో ముందు బొమ్మ ఆకారాలు తేలికగా వేయటం (కో.2,25,41, రా 5,13)

**స్క్రాలు .** వయొలిన్‌కు బిరడాపై పెట్టే కుండీ వంపు (రా 5)

**స్క్రాల్‌పేంటింగ్ :** ఒక కథకు సంబంధించిన పటాలు వేయటం (తె 9)

**స్క్రీన్‌పేపర్ .** చిత్రలేఖనంలో వాడే డిజైన్లు ముద్రించిన కాగితం (కో 19)

**స్క్రూ .** 1. చిత్రలేఖనంలో బొపెన్ బిగించటానికి, వదులు చేయడానికి పనికి వచ్చే సాధనం (కో 19)

2 వయొలిన్ వాయించటానికి వాడే "బౌ"కి వెంట్రుకలు బిగించటానికి వాడే సాధనం (రా 5)

3 వీణకు సొరకాయ బిగించటానికి వాడే సాధనం. (కో 6, రా 5)

**స్క్రోలు** వయొలిన్‌లో భాగం చూ చిత్రం-31 (రా.13)

**స్టీలు కంజీర :** ఇనుములో చేసిన కంజీర. (తె 3,2)

**స్టీలు తీగలు** · వీణకుండే 7తీగలలో 5 తీగలు (కో 6)

**స్టీలురేకు చిప్‌డీలు .** స్టీలు రేకుతో చేసిన కంజీర చిప్‌డీలు (తె.3)

**స్టెన్సిల్‌రీవరు** హార్మోణియంలో ఉండే ఇత్తడి రింగు (కో 7)

**స్ట్రెక్చర్‌ఫ్రేం** · చిత్రలేఖనంలో బొమ్మలు వేసేప్పుడు కాగితం గాని, బట్టగాని అమర్చటానికి వాడే చట్రం (కో 3)

**స్టేజి .** బుర్రకథ, వొగ్గుకథ చెప్పటానికి నాటకాలు వేయడానికి వేసే రంగ స్థలం (కో 3,7,37, తె 1, రా 10)

**స్టేపులు** . హార్మోణియం తయారీలో వాడే సాధనం. (కో 39)

**స్టోరీ పెయింటింగ్** : కధ చిత్రించటం (తె 9)

**స్తంభం** : 1 వీణ తయారీలో వాడే కొలిమిలో భాగం (కో 7)

2. నాటకంలో వాడే తెరలలో ఉండే దీపస్తంభం. (కో 7)

**స్తాంబాళం** రాతిపనిలో విగ్రహం అడుగు భాగం. (తె.6)

**స్త్రీ** . రాతిపనిలో చేసే స్త్రీ విగ్రహం (రా 8)

**స్త్రీగాత్రం** ఆడవారు పాడే కచేరి (కో 7)

**స్త్రీలింగ** రాతిపనిలో చేసే స్త్రీ సంబంధమైన శిల్పం (రా 9)

**స్థాయి** శ్రుతి (కో 7, తె.1, రా 5,8)

**స్నానం అనుష్ఠానం** రాతిపనిలో విగ్రహం చెక్కటం ప్రారంభించేప్పుడు చేసే ప్రక్రియ (తె 6)

**స్పాంజి** మేకప్‌లో ముఖం తుడవడానికి వాడే ద్రవ్యం (కో 7, రా 5,13)

**స్పిరిట్** · 1 తబల, వీణలకు పూసే పాలిష్ (కో 24, తె 3,13, రా 5)

2 మేకప్‌లో మీసాలు అతికించటానికి వాడే ద్రవం. (కో 24, తె 13)

**స్పిరిట్‌పాలిష్** తబలా కుండకు పూసే పాలిష్. స్పిరిట్ + లక్క + చంద్రస్ = స్పిరిట్ పాలిష్. (తె.3)

**స్పిరిటుదీపం** · వీణ తయారీలో వాడే జెలాటిన్ (జిగురు) వజ్రం మొ॥నవి కరిగించటానికి వాడే దీపం (రా 5)

**స్పీడ్‌బాల్‌నిబ్** చిత్రలేఖనంలో అక్షరాలు రాయటానికి ఉపయోగించే సాధనం (కో.19)

**స్ప్రింగ్** . హార్మోణియం తయారీలో వాడే తీగచుట్ట. చూ చిత్రం-4 11 (రా.8)

**స్ఫటికశిల** · రాతిపనిలో శిల్పం తయారీకి వాడే రాయి (కో 19)

**స్ఫుటం** · చిత్రలేఖనంలో బొమ్మలని స్పష్టంగా వేయడం (కో 19)

**స్మూత్** : రాతి విగ్రహాన్ని నునుపు చేయడం (కో 34,37, తె 13)

**స్లైడ్‌మిషన్** : నాటకంలో పేర్లు వేయడానికి వాడే యంత్రం (రా.13)

**స్వరదం** శ్రుతులు తెలుసుకునేదానికి ఉపయోగించే సాధనం (కో 7)

**స్వరం** . సంగీతంలో సరిగమపదని అనే అక్షరాలు (కో 7,37, తె 1,3)

**స్వర రంధ్రాలు** సన్నాయి, శ్రుతి, మురళిలో ఉండే రంధ్రాలు చూ చిత్రం-16 3, 17 4, 19 3 (కో 7)

**స్వరస్థానం** సంగీతంలో స, రి, గ, మ, ప, ద, ని, అనే అక్షరాల స్థానం (తె 1, రా.5)

**స్వరహీనం** రాతిపనిలో నపుంసక శిలను పరీక్ష చేసేప్పుడు శబ్దం ఏమీరాకపోవటం (రా 8)

**స్వాదిస్థానం** : వీణకి ఉపేట ఉన్న స్థలం (కో 7)

**స్వారంగదరకత** . ఒక వొగ్గు కధ (తె 1)

**స్వేత శిల** రాతిపనిలో శిల్పానికి వాడే రాయి (కో 19)

## హ

**హత్తి** రంగ్రేజీ పనిలో వాడే అచ్చు నమూనా పేరు (ఏనుగు). (తె 4)

**హత్తుకొను** · చిత్రలేఖనంలో ట్రేస్ తీసేప్పుడు కాగితం మీద బొమ్మ అంటుకొను (కో 19)

**హద్దు** : ఆలాపన పరిమితి (నాగస్వరం) (రా 3)

**హంప కాగితం** · గరుకు కాగితం చూ అంగు కాగితం (కో 3)

**హస్తం** సిమెంటు బొమ్మలకు చేసే చేయి (కో 19)

**హోగ్‌బ్రష్** చిత్రలేఖనంలో తైలవర్ణ చిత్రాలు వేయడానికి వాడే కుంచె (తె 1)

**హోరతి కర్పూరం .** హార్మోణియం తయారీలో మెట్లపైన అందంగ ఉండటానికి వాడే తెల్లని సుద్దలాటి పదార్థం (సలివేడు) (హోరతి కర్పూరంతో తయారైనది) (కో.28)

**హోరం ·** మేకప్‌లో మెడలో వేసే ఆభరణం (కో 29)

**హోర్ట్‌బోర్డు ·** చిత్రలేఖనంలో బొమ్మలు వేయడానికి వాడే అట్ట (కో.2, తె.11)

**హోర్మోణియం ·** రూపా. హార్మోనియం, హార్మోని, హార్మని, హార్మొని. సంగీత వాయిద్యం. (కో 3,7,15,37 తె.3,9, రా.2,8)

**హోర్మోనిసుతి** హార్మోనియం శ్రుతి (తె.3)

**హోర్నాబ్లేడుప్రేము :** వీణ తయారీలో కొయ్యను కోయడానికి వాడే రంపం చట్రం. (రా.5)

**హీరాకస్ :** రంగ్రేజీ పనిలో వాడే జాలీమా రంగు తయారీకి వాడే ద్రవ్యం. (తె 4)

**హృదయం** 1 రాతి పనిలో చెక్కే శిల్పంలో భాగం (రా 3)
2 (శిలా) హృదయం = శిల్పశాస్త్రం (రా.8)

**హెచ్చుశ్రుతి .** స్త్రీ గాత్రాలకు మృదంగం వాయించేప్పుడు చేసే శ్రుతి (కో 7)

**హెచ్చుసారణి :** వీణ కుండే తాళం తంతులలో ఒకదాని పేరు (36 నెం. ఉక్కు తీగ) (కో.23)

**హెరాల్‌డెట్ :** రాతిశిల్పం పగిలితే అతికించటానికి వాడే ద్రవ్యం. (కో 31)

**హేండిల్ :** చిత్రలేఖనంలో వాడే కుంచెని పట్టుకునేందుకు వాడే పిడి. (కో 19)

**హైలెట్ :** మేకప్‌లో కాలిన ముఖంలా వేషం వేసేప్పుడు అంబరు డార్కు అప్లై చేసి చుట్టూ పెన్సిల్‌తో, చర్మంతో కల్సినట్టు ఉండటానికి గీసే కాగితం. (కో 7)

**హోమశిల :** శిల్పశైలిలో ఒక రకం (రా.8)

**హౌస్‌డెకరేషన్ :** (చిత్రలేఖనంలో వేసిన బొమ్మలతో) ఇంటిని అలంకరించటం (కో 3,38)

## 1, వీణ



12 తలుపు (పెట్టె)
17 మెట్లు
11 టాపు
15 పీట/బొద్దు, లగం
16 పక్కచెక్కలు
9 శృతి పూసలు
8 ఇత్తడి కడియం
13 కుండ
14 గీతలు
10 కొయ్యబిళ్ళ
19 ఇత్తడిబేసు
7 దండి
5 తాళంగల పిడికీలు
4 పిడి/బిరికి
2 గంట/ కుండి
3 తలకాయ
1 సింహతలాటం/ యాళి
6 వత్రువ ముక్క


12 తలుపు (పెట్టె)
6 వట్రువ ముక్క
11 టాపు
7 దండి
1 సింహతలాటం/యాళి
13 కుండ
14 గీతలు
5 తాళంగల పిడికీలు
2 గంట/కుంది
3 తలకాయ
18 శంఖుముడి (లోపల భాగంలో ఉంటుంది
9 శృతి పూసలు
15 పీట/బొద్దు, లగం
8 ఇత్తడి కడియం
4 పిడి/ బిరికి
16 పక్కచెక్కలు
10 కొయ్యబిళ్ళ
19 ఇత్తడిబేసు

## 2. తంబుర



## 3. వయొలిన్/ఫిడేలు



6 చిల్‌రెస్టు
4 బ్రిడ్జి
5 టేల్‌పీస్
9 సౌండ్ పోస్టు
3 ఫింగరు బోర్డు
1 స్క్రోలు
2 బిరడా
7 ఎఫ్ హోలు
8 కమాను
4 బ్రిడ్జి
5 టేల్‌పీస్
2 బిరడా
3 ఫింగరు బోర్డు
6 చిల్‌రెస్టు
7 ఎఫ్ హోలు

# 4. హార్మోనియం (సుషిర వాద్యం)









## 5. తబల







5. తబల

6. తబలపూడి






## 8. మద్దెల / మృదంగం








## 9. కంజీర






## 10. జగ్గు / ఢమరు / ఒగ్గు



11. డక్కి




12. పెద్ద తాళం



13. చిన్నతాళం



14. అందె



15. గుంచి



## 16. శ్రుతి




## 17. సన్నాయి




## 18. నాగస్వరం




## 19. మురళి



20. బండారు సంచి
(వొగ్గు కథ చెప్పేటప్పుడు వాడేది)



21. నాగబంధం



22. నాగబంధం గవ్వల దరిశన



23. బుర్రకథ తంబుర



## 24. బుర్రకథ



## 25. వొగ్గు కథ



## 26. నాటకాలలో వేషాల (పాత్రల)ను బట్టి మీసాలు




## 27. నాటకాలలో వేషాల (పాత్రల)ను బట్టి నామాలు, బొట్లు




1 దోసగింజ బొట్టు 2 రౌండ్ బొట్టు 3 కళ్యాణం బొట్టు 4 తమిళ బొట్టు 5 ఒరియం బొట్టు 6 గిరిజన బొట్టు 7 గడ్డం మీద పచ్చబొట్టు 8 కనుబొమలపైన చుక్కల తీర్పు 9 నామం 10 సూర్యనామం 11 బాణం 12 రావణ తిలకం 13 రావణ తిలకం, మరో రకం 14 దుర్యోధన సరం/తిలకం 15 నామం 16 చందన కుంకుమ 17 పాట్కారు 18 పూజలు 19 దోసగింజలు 20 మూడు పూవులు, నాలుగు ముక్కోణాలు 21 సుట్టలు 22 పింజర్

## 29. చిత్రలేఖనం




## 30. కుంచెలు / బురుసు / బ్రష్

శిల్పం, చిత్రలేఖనం, సంగీతం, నాటకం - (ఉపయోగించే వస్తువుల తయారీకి) వాడే పరికరాల పేర్లు



## 31. బౌ (bow) పెన్




## 32. కంపాస్ (లు)



33. పెద్ద ఆరె

34. చిన్న ఆరె






35. రంపి

36. మృదంగం తయారీలో తోలు కోసే రంపి





37. సాదా కాంటా



38. కుట్టు కాంటా



39. జాతులి




40. తరిగోరులి



41. మోట ఉలి



42. మొన ఉలి



43. వంపులి



44. వడ్డులి



45. నాటులి



46. తెంపులి



47. గోరులి



48. గడ్డులి



49. కుందు ఉలి



50. మరో రకం గోరులి



51. బద్ద ఆకురాయి



52. టేడరు పైలు



53. గుండు ఆకురాయి



54. ముక్కోణం ఆకురాయి



55. ముళ్ల ఆకురాయి



56. బాడిస



57. పెద్ద రంపం



58. జవ్వ రంపం



59. ఈరిగ రంపం



60. కంచు సుత్తి




61. కట్ల సుత్తె



62. పెద్ద సుత్తె



63. మెట్న సుత్తె



64. మేకు సుత్తె



65. మొలసుత్తె



66. పెద్ద కరవాయి




67. గుండు దాగలి



68. రెండు దాగలి



## అ

**అచ్చాకు** : ఆకురూపంలో ముద్దగా అల్లిన అల్లిక (కో 20)

**అచ్చాకుల పూవుమట్టు** · డిజైనుకు అడుగున ఆకురూపంలో ముద్దగా అల్లిన భాగం చూ చిత్రం. 4-3 (కో 20)

**అంచు** : పర్యా గోటు, చిలుకు, బోర్డరు అల్లిక చివరి భాగం, కొన, కొస, డిజైన్ చుట్టూ ఉండే అల్లిక చూ చిత్రం 4 1 (కో 3,6,19,22,27,28; తె 1,2,4,6, 10,12)

**అంచుకట్టు** . పర్యా సిట్ లేసు డిజైను చివరి అల్లిక, అంచు అల్లిక (కో 22)

**అడ్డుకట్టు** · వట్టివేళ్లచాప అంచులకు గుడ్డ కుట్టడానికి వీలుగా అల్లిక సమయంలో మగ్గానికి మధ్యలో గడలు కట్టడం (కో.14)

**అతుకు** . పర్యా కరిపించు లేసు అల్లికలో రకరకాల డిజైన్లను అల్లికతో కలుపు (కో 20)

**అద్దం** : పర్యా అర్సీకట్టా చేసంచుల తయారీలో, బంజారా అల్లికలో అలంకారం కోసం డిజైనులో కుట్టే గాజుపలక (తె.14)

**అనాస డిజైన్** · లేసు అల్లికలో అనాసపూవు ఆకారంలో అల్లిన అల్లిక. (కో.22)

**అనాసపూవు మట్టు** · డిజైనుకు మధ్యలో అనాసపూవు ఆకారంలో అల్లిన మట్టు (కో.20)

**అబ్లాంగ్‌సెట్టు** (<oblong) డైనింగ్‌టేబిలు మీద రకరకాల పాత్రల కింద పెట్టడానికి అల్లిన విడివిడి అల్లిక ముక్కల సెట్టు/గుంపు అల్లిన డిజైన్లు దీర్ఘవృత్తాకారంలో ఉంటాయి (కో.20)

**అంబలి** · వాలాంగిపనిలో దారాన్ని సాపుచేయటానికి పూసే ఉడికించిన పిండి. (తె.11)

**అరలు** . తమలపాకుల సంచిలో సున్నం, వక్క మొదలైనవి పెట్టుకోవడానికి వేరువేరుగా ఉన్న చిన్న సంచులు చూ చిత్రం-19 5 (తె 14)

**అల్లిక దారం** . లేసులు అల్లటానికి వాడే ప్రత్యేకమైన దారం. చూ చిత్రం-1 6 (కో 22)

**అల్లికసూది** : లేసుల అల్లికలో వాడే ప్రత్యేకమైన సూది ఒక చివర వంపు, రెండో చివర జీలుగ బెండుపిడి ఉంటాయి సూది మధ్య భాగం బద్దలాగా ఉంటుంది. చూ చిత్రం-2 (కో 22)

**అల్లు** . దారాలతో అల్లికలు చేయడం (కో.7,14,22,35,42; తె 2,11, రా 5)

## ఆ

**ఆకులపూవు** : మొదట గొలుసులాగా, తరవాత ఆ గొలుసులనే గుండ్రంగా తిప్పి, సన్నని అల్లిక అల్లి, ఆ మీద రింగులుగా అల్లితే ఆకురూపం వస్తుంది. అలాంటి ఆకులతో కూడిన పువ్వు అల్లిక చూ.చిత్రం-18.3 (కో 20)

**ఆకులు తేల్చు** : సూది మీదుగా దారం నడిపి ఆకులు అల్లు. ఈ పద్ధతిలో సూది కిందుగా దారం తీయరు. (కో 20)

**ఆర్సీకట్టా** : చూ అద్దం చేసంచుల తయారీలో, బంజారా అల్లికలో అలంకారం కోసం డిజైనులో కుట్టే గాజు పలక (తె 1)

**ఆర్సీతుండ్రీ** బట్టలకు అద్దాలు అతికి కుట్టడం ఇది బంజారాల్లో మామూలు (తె 1)

**ఆవిరి దుబ్బు వేరు** . ఎండిన చెరువుల నుంచి తవ్వి తీసే వట్టివేరు దీనికే అగురు (గడ్డి), ఔరు, ఉశీరం, లామజ్జకం, విడవలి' అనే పేర్లున్నాయి. దీని వేళ్లు సువాసనగలవి ఏటి చాళ్లలో పెరుగుతుంది. (Cuss-cuss or khus-khus grass, Andropogon muricatus, Watts ) (కో.14)

**ఆసు** · వాలాంగిపనిలో నూలు సరిచేయడానికి వాడే కొయ్యపనిముట్టు. (తె 11)

## ఇ

**ఇవపమూది** . లేసుల అల్లికకు వాడే సూది. చూ.చిత్రం-12.2 (కో 20)

## ఈ

**ఈదు** : పర్యా. ఈన తాటాకు మొ.వాటి మధ్యలో ఉండే సన్నటి కాడ. (కో.42)

**ఈన** : (ఉ.ఈనె). చూ. ఈదు తాటాకు మొ.వాటి మధ్యలో ఉండే సన్నటి కాడ (కో 5,7,26)

**ఈనుల వరుస** . పర్యా కొబ్బరీను డిజైను లేసు అల్లికలో కొబ్బరి ఈనెల మాదిరి అల్లకం. చూ చిత్రం-18.4 (కో.20)

## ఉ, ఊ

**ఉగ్రీటోపి** · లంబాడీలు చెవులకు పెట్టుకునే నగ. (తె 1)

**ఉట్టిసూది** · లేసు పనిలో వాడే దారంలేని సూది (కో.22)

**ఉత్తరాల పంచి** . గోగునారతో ఉత్తరాలు పెట్టుకోవటానికి అల్లిన అరలపంచి చూ.చిత్రం-21 (తె 14)

**ఊడిలి** : వాలాంగి పనిలో నూలు సైజు చేయడానికి వాడే పగ్గం మాదిరి సాధనం (తె 11)

## ఎ

**ఎక్రో** : లేసు అల్లికలో వాడే ఖద్దరు రంగు దారం. (కో.21)

**ఎదురుబొంగు** : ఉ. వెదురు వట్టివేరు చాపల అల్లకంలో ఉపయోగించే వెదురుగడ. నేలలో పాతిన గింజలకు ఈ బొంగు అడ్డంగా కట్టి, రెండు అంగుళాల కోటి చొప్పున దీనికి గాటుపెట్టి, ఈ గాట్లలో బంగాళా పెంకులు గట్టిన తాళ్లువేసి అల్లిక మొదలు పెడతారు. (కో 14)

**ఎదుర్రావాకు డిజైన్** : లేసుల అల్లికలో ఒకరకం డిజైన్. (కో 22)

**ఎదురు మగ్గం కర్ర** · ఉ వెదురు-వట్టివేరు చాపల అల్లికలో వాడే కర్ర రెండు అంగుళాల కోటి చొప్పున ఈ కర్రకు గాట్లుపెట్టి ఈ గాట్లలో బంగాళా పెంకులు గట్టిన తాళ్లు వేసి అల్లిక మొదలు పెడతారు. (కో.14)

**ఎంబ్రాయిడరి** : (<Embroidery) రంగు దారాలతో చేసే కుట్టు పని (కో 29, తె.1)

**ఎల్లోరా డిజైన్** · వాలాంగి పనిలో ఒక రకం డిజైను. మగ్గానికి కట్టిన నూలుపైన ఈ డిజైన్ వేస్తారు. (తె.11)

## ఏ

**ఏటవాలు** . (లేసుల) అల్లికలో కొంచెం వంపు వచ్చేట్లు అల్లడం (కో.20)

## ఒ

**ఒడ్ల మిల్లు** · లేసుల అల్లికలో ఒక రకం సన్నని డిజైను. చూ చిత్రం-16 4. (కో 20)

**ఒప్పు** లేసు అల్లిక సరిగాలేనపుడు కొనేవారు తీసుకోడానికి ఇష్టపడు కూలిఇచ్చి అల్లించేవాళ్లు కూడ అల్లిక సరిగలేవుడు మళ్లీ అల్లిక సరిచేస్తేనే తీసుకొను. (కో 21)

**ఒవెల్** (< oval) పర్యా కోడిగుడ్డు ఆకారం. లేసుల తయారీలో కోడిగుడ్డు ఆకారాన్ని పోలిన అల్లిక. (కో.20)

## క

**కచ్చు(పెట్టు)** : వట్టివేరు తడికలో పెట్టే బద్దకీ బద్దకీ మధ్య ఉండే దూరం (కో 14)

**కంచనపల్లి డిజైన్** : వాలాంగి పనిలో ఇదొక రకం డిజైను. మగ్గానికి నూలు చుట్టిన తరువాత నూలుమీద ఈ డిజైను వేస్తారు. (తె.11)

**కటి(కా)కాళం** · బంజారీ అల్లికలలో వాడే నలుపు రంగు దారం (తె 1)

**కట్టు(కుట్టు)** · లేసుల అల్లికలో స్తంభాల డిజైన్ వేసేటప్పుడు మొదట స్తంభం డిజైన్ అల్లి దాని చుట్టూ అల్లిన అల్లిక. (కో.21)

**కండెం డిజైను** · తాటాకు పనిలో ఏటవాలుగా అల్లే ఒక రకం డిజైన్. (కో 42)

**కండెల రాట్నం** · వాలాంగి పనిలో కండెలకు నూలు చుట్టడానికి వాడే పనిముట్టు (తె 11)

**కందిబద్దపిడి** : లేసు అల్లికలో సూది తేలికగా ఉండేందుకు పై చివర వేసిన చెక్కపిడి. చూ చిత్రం-1 1;3 (కో 20)

**కప్పకాళ్ళు** : లేసు అల్లికలో కప్పకాళ్ల రూపాన్ని పోలిన డిజైన్. (కో 20)

**కలబంద** : ఇదొక ఎడారి మొక్క దళసరిగా ఉన్న దీని ఆకుల నుంచి నారతీస్తారు ఈ నారతో పగ్గాలు చేస్తారు Aloe plant, The Barbadoes Aloe, Indian Aloe, Agave americana, Aloe americana, A barbadensis, A Indica or vulgaris, Sank (రా 10)

**కళావరు చుక్క** · లేసు అల్లికల తయారీలో అనాసమొగ్గ తొడిగే ముందు వేసే పువ్వు మాదిరి అల్లిక. (కో.20)

**కళావరు చుక్కలలేసు** : లేసుల తయారీలో కళావరు పువ్వులో ఒక్కొక్క గుండ్రాన్ని విడిగా అల్లిన అల్లిక (కో.20)

**కళావరు పూవు** : కళావరు రూపంలో ఉన్న లేసు అల్లిక. (కో 20)

**కవరింగు బౌల్స్** : తాటాకుతో అల్లిన ఒక రకం బుట్టలు (కో 22)

**కాజా(కట్టు)** : లేసుల అల్లికలో ఒక రకం అల్లిక. (కో.20,22)

**కాజా(కుట్టు)** : చేతి కుట్టులో ఒక రకం. గుండీలు, అద్దాలు ఈ పద్ధతిలో బట్టకు కుడతారు. చూ చిత్రం-19.2 (తె.14)

**కాడకట్టు** : చేతి కుట్టుపనిలో పూవుకాడ ఆకారం గల కుట్టు (తె 14)

**కాయలు(కట్టు)** : లేసు పనిలో తాడు వరస అల్లి ఆ తాడుకు కాయలు వేలాడుతున్నట్లు అల్లు. (కో 21)

**కార్నర్ ట్రే** : (<ఆం corner tray) తాటాకుతో అల్లిన ఒక రకం పళ్లెం. (కో.42)

**కాళ్ళఅల్లిక** : లేసుపనిలో కాడలాగ ఉన్న అల్లిక ఈ అల్లిక పొడవుగా ఉంటుంది (కో 21)

**కాళ్ళపూవు** : లేసుపనిలో కాడతో పూవు గుర్తు వేసిన అల్లిక. (కో.20)

**కాళ్ళమట్టు** : లేసుపనిలో కప్పకాలు అడుగుభాగం ఆకారంతో ఉన్న ఒక రకం అల్లిక (కో.20)

**కాళ్ళవరస** : లేసుపనిలో ఆకు కాడ, తీగకాడ రూపంలో రెండు మూడు వరసలున్న అల్లిక. చూ.చిత్రం-8 2. (కో 21)

**కుచ్చు** . పూసల, అద్దాల సంచుల తెయారీలో బట్టని దగ్గర దగ్గరగా నెట్టి కుట్టిన చేతి కుట్టు. చూ.చిత్రం-19.4. లేసుల పనిలో అల్లిక వదులుగ దగ్గర దగ్గర రావడం. (తె 14, కో 21)

**కుర్చీతొడుగు** : కుర్చీకి వెనకభాగంలో తొడగడానికి వీలుగా లేసుపనిలో చేసిన ఒక రకం అల్లిక. (కో.22)

**కూర్పు** . లేసుపనిలో రింగువరస మీద ఆకు రూపంలో తేలికగ అల్లు బూరాకు పూవు అల్లికలో ఇటువంటి కూర్పు కనిపిస్తుంది (కో 20)

**కృష్ణడిజైను** . వాలాంగి పనిలో చేసే కృష్ణుని బొమ్మ. మొదట పగ్గానికి నూలు చుట్టి తరువాత డిజైను వేస్తారు (తె.11)

**కొండపర్తి డిజైను** : వాలాంగి పనిలో ఇదొక రకం డిజైన్. (తె.11)

**కొత్తకుచ్చుమట్టు** : లేసుపనిలో కుచ్చుగ అల్లిన దానిని

గుండ్రని మట్టుగ మలచడం (కో.20)

**కొత్తచక్రాలు** : లేసుపనిలో ముందు అల్లిన చక్రాలు గాకుండా వేరే విధంగా కొద్ది మార్పులతో అల్లిన చక్రాలు. (కో.21)

**కొవ** : అంచు, చివరి భాగం. (రా 4,13)

**కొబ్బరి ఆకు** . లేసుపనిలో కొబ్బరి ఆకు పోలిన అల్లిక (కో.20)

**కొబ్బరీనెలు** : ఈనుల వరస. లేసుపనిలో కొబ్బరి ఈనెల మాదిరి అల్లిక చూ.చిత్రం-18 4 (కో.21,22)

**కోట్స్ కంపెనీ దారం** · "కోట్స్ కంపెనీ" తయారు చేసిన నూలు. లేసుపనిలో దీనిని వాడుతారు (కో 20)

**కోడి** : బంజారీ అల్లికలకు వాడే గవ్వ. (తె 1)

**కోడి గుడ్డు ఆకారం** : పర్యా. ఒవల్ (oval) లేసుపనిలో కోడిగుడ్డును పోలిన అల్లిక (కో 20)

**కోణం** : రెండు బుజాలు కలిపిన మూలను కోణం అంటారు. లేసుపనిలో కోణం వచ్చేట్టు అల్లడం. (కో.20)

**కోరా** · బట్టమీద ఆకురూపం డిజైనుకు వాడుతారు. చెమ్కీలో ఒక రకం (కో 29)

**క్లబ్‌డాన్స్ డిజైన్**: వాలాంగిపనిలో వేసే ఆధునిక నృత్యభంగిమ ఈడిజైన్ నూలు మీదవేస్తారు. (తె.11)

**క్లాత్** : (cloth) పర్యా గుడ్డ, బట్ట, వస్త్రం (కో 7)

**క్రింది తొడుగులు** . అందం కోసం లోటాల (wine glasses) కింద పీటిని తొడుగుతారు లేసుపనిలో ఇదొకరకం అల్లిక. చూ చిత్రం-4,5 (కో.21)

## ఖ

**ఖద్దరు రంగు** : లేసుపనిలో వాడే ఖాదీనూలు రంగు (కో 21)

## గ

**గచ్చకాయ రంగు** : లేత బూడిద వన్నె. గోగునార సంచులకు ఈ రంగు వేస్తారు గచ్చకాయ Bnduc, the fever nut physic nut, caesalpina bonducella, Flem, Crista, W.I Guilandia bonducella, Ainsl. (తె 14)

**గంజి** : బియ్యపునూకను ఉడికించి వార్చగా వచ్చిన నీరు. వాలాంగి పనిలో నూలును సాపు చేయడానికి దీనిని పూస్తారు లేసుపనిలో అల్లిక పూర్తయిన తరువాత సగ్గుబియ్యం ఉడికించిన గంజి నీటిలో ముంచుతారు. దీనివల్ల అల్లిన అల్లిక పెళుసుగా ఉంటుంది. (తె.11; కో 20)

**గడిచిలుకు** : గడిగా అల్లే అల్లికను చిలుకు అంటారు. దీనినే గడిచిలుకు అని కూడ అంటారు (కో 20)

**గడొరప** : లేసుపనిలో గడులు గడులుగా ఉన్న అల్లిక వరస. (కో 20)

**గణపతి డిజైను** : వాలాంగి పనిలో వేసే వినాయకుని డిజైన్. (తె 11)

**గది** · వట్టివేళ్ల చాపల అల్లికలో ప్రతి అడుగుకూ ఒక్కో అడ్డబద్ద వేస్తారు. ఒక అడ్డబద్దకి మరో అడ్డబద్దకి మధ్యనున్న భాగం 'గది'. (కో 14)

**గదుల్లేసు** చూ పర్యా.వలలేసు లేసుపనిలో గదిమాదిరిగ ఉన్న అల్లిక చూ.చిత్రం-6. (కో 20)

**గవ్వకట్టు** : లేసుపనిలో అంచు అల్లిక (కో 22)

**గవ్వసంచి** : గవ్వలతో తయారు చేసిన సంచి. చూ.చిత్రం-20 (రా.3)

**గుచ్చు** : దారానికి పూసలు, ముత్యాలు మొదలైనవి ఎక్కించు. (కో.29)

**గుచ్చుళ్ళు** : లేసుపనిలో కొన్నిడిజైన్లకి సూదికి ముందుగా దారం వేయకుండా వట్టి సూదినే గుచ్చి కింది నుంచి

దారం సూదికి ఎక్కించి పైకిలాగి మళ్ళీ గుచ్చి లాగడం (కో 20)

**గుంజ :** వాలాంగిపనిలో నూలు సాపు చేయడానికి వాడే మొద్దు. (తె.11)

**గుడ్డచదరం :** లేసుపనిలో కొన్ని డిజైన్లకు అనుకూలంగా నలుచదరంగా కత్తిరించిన బట్ట (కో.20)

**గులాబి స్తంభం :** లేసుపనిలో మొదట మట్టు అల్లి తర్వాత తాడులాగ అల్లి అటు తర్వాత గులాబికాడ లాగ అల్లిన అల్లిక. (కో.20)

**గువ్వకన్ను :** లేసుపనిలో గువ్వకన్ను లాగ ఉన్న అల్లిక (కో 20)

**గూళ్లగుబ్బ :** లేసుపనిలో గూళ్ల రూపంలో ఎత్తుగ ఉన్న అల్లిక (కో.21)

**గొడుగు డిజైన్ ·** లేసుపనిలో గొడుగు రూపాన్ని పోలిన అల్లిక (కో.22)

**గొడుగు స్తంభం :** లేసుపనిలో మొదట మట్టు అల్లిన తరువాత గొడుగురూపంలో ఉన్న అల్లిక. (కో.20)

**గొలుసు :** లేసుపనిలో కొక్కీల మాదిరి పొడవుగా ఉన్న అల్లిక చూ చిత్రం-1 4; 4 2, 16.3. (కో 20,22)

**గొలుసుకుట్టు ·** అద్దాలను కాని, పూసలను కాని వరుసగా పొడవుగా కూర్చిన చేతికుట్టు (తె.14).

**గొలుసుల గుండ్రం :** లేసుపనిలో కొక్కీల (గొలుసు) వలె పొడవుగా అల్లిన పిదప గుండ్రంగా తిప్పిన ఒక రకం అల్లిక చూ చిత్రం-8.1,18.1 (కో 20)

**గోగువార జడ :** జడలుగా అల్లిన ఎండిన గోగునార. (తె.14)

**గోటు :** అద్దాల, పూసలపనిలో కుట్టేబట్ట అంచుకు వేరే బట్టగాని లేసుగాని సన్నగా అతుకు వేయడం అల్లిక చివరి భాగం. చూ.చిత్రం-4.1 (తె.14)

**గోతం(పీచు) :** గొనె సంచి, గోనుసంచి (కో 40)

**గోపురం డిజైన్ :** తాటాకు పనిలో గోపురం రూపంలో ఉన్న డిజైన్ (కో.42)

**గ్లాసుకింది తొడుగు :** చూ. పర్యా. క్రింది తొడుగులు. లేసుపనిలో అందంకోసం గ్లాసు(wine glass) కు వేసే ఒకరకం తొడుగు చూ.చిత్రం-5. (కో.22)

**గ్లాసు(లోటా)మట్లు :** గ్లాసుకింద అందంకోసం తొడిగే తొడుగు. చూ.చిత్రం-4 (కో 22)

## చ

**చక్రం ·** లేసుపనిలో గుండ్రంగా అల్లిన అల్లిక. చూ.చిత్రం-10 (కో 22)

**చట్రం :** చూ పర్యా టాంక్. వాలాంగి పనిలో నూలు నేయడానికి వాడే మగ్గంలో ఒక భాగం. (తె.11)

**చతురస్రం :** పర్యా. చతురం. లేసుపనిలో నాలుగు వైపులా సమానంగా ఉండే అల్లిక. అద్దాల, పూసల సంచుల తయారీలో అలంకారానికి అద్దాలు కూర్చేటప్పుడు మొదట నలుచదరంగా బట్ట మీద గీసుకొంటారు (కో.20, తె.14)

**చరఖా :** వాలాంగి పనిలో నూలు చుట్టడానికి వాడే పనిముట్టు (తె.11)

**చాకు :** పర్యా రేకు తాటాకుపనిలో లేత ఆకుల్ని కోయడానికి వాడే పనిముట్టు. (కో.42)

**చాపఅంచు** చాప చివర భాగం వట్టివేరు చాపల అంచులు (కొసలు) జారిపోకుండ బట్టవేసి కుడతారు (కో 14)

**చాప గుడ్డకుట్టు(మగ్గం) :** వట్టి వేళ్ల చాప చుట్టూ గుడ్డ గట్టిగా కుట్టడానికి వట్టివేళ్ల చాపను ఈ మగ్గంమీద వేసి నాలుగు వైపులా లాగి కట్టి అప్పుడు చుట్టూ అంచులు కుడతారు (కో.14)

**చిట్టిచిలుకు .** లేసుపనిలో కొన్ని డిజైన్లకు అంచులు అందంగా ఉండటానికి చిన్నపూల రూపంలో అల్లిన అల్లిక (కో 20)

**చిట్‌ట్రే :** (<tray) తాటాకుతో చేసిన ఒకరకం పళ్లెం. (కో 28)

**చిరబంతిపూవు** : లేసుపనిలో చిన్న రకం బంతిపూవు అల్లిక (Marigold, Tagetes patula, Sank ) (కో 21)

**చిన్నగజ్జె** : అద్దాల, పూసల పనిలో బట్టకు కుట్టే చిన్నమువ్వ. తమలపాకు సంచులకు తాడు చివర అలంకారానికి కట్టిన చిన్న మువ్వ. చూ చిత్రం-19 1 (తె 14)

**చిన్నసంచి** . తమలపాకుల సంచికి కింది అరలో ఉండే మరొక చిన్నసంచి చూ చిత్రం 19 6. (తె 14)

**చిలుకు** · లేసుపనిలో అంచులకు అల్లే ఒక రకం అల్లిక చూ.చిత్రం-15.3; 16.5. (కో 20,22)

**చుట్టు** : వాలాంగిపనిలో నూలును చుట్టడం మగ్గం మీద నేయడానికి వీలుగా నూలును కండెలుగా చుట్టడం (తె 11)

**చుట్టూచెట్లు** : లేసుఅల్లికలో ఒక డిజైన్ చెట్ల రూపం వచ్చేలా అల్లిన అల్లిక చూ చిత్రం-17. (కో.20)

**చుట్టూపద్మం** · లేసుఅల్లికలో ఒక రకం డిజైన్. పద్మం రూపం వచ్చేలా అల్లిన అల్లిక. చూ చిత్రం-9. (కో 22)

**చెవులు** : తాటాకులో చేసిన మూతలకు ఇరువైపులా పట్టుకోడానికి వీలుగా అల్లిన భాగం. (కో 42)

**చేతిసంచి** : చేత్తో పట్టుకోడానికి వీలుగా అద్దాలతో, పూసలతో కుట్టిన ఒక రకం సంచి (తె.14)

**చేతుల తొడుగు** : డాక్టరు ఆపరేషన్ చేసే సమయంలో చేతులకు తొడుక్కునే రబ్బరుగుడ్డను పోలిన లేసు అల్లిక (కో 21)

**చేయిపిడి** : తాటాకుతో చేసిన సంచిని పట్టుకోడానికి వీలుగా అల్లిన భాగం. (కో.42)

## జ

**జడ** : జడ లాగ అల్లిన ఎండిన గోగునార గోగునార సంచుల తయారీలో ఇలా అల్లుతారు (తె 14)

**జడల చుట్టల సంచి** : ఎండిన గోగునారని మొదట జడలుగా అల్లుతారు వాటిని ఒకదాని కొకటి కలిపి వరుసగా కుట్టిన సంచి. చూ.చిత్రం-22 (తె 14)

**జండా డిజైను** తాటాకు అల్లికలో ఇదొక రకం డిజైన్ (కో 42)

**జండాలేసు** జండా రూపంలో ఉన్న లేసు అల్లిక ముందుగా గొలుసులు అల్లుకొని దానికి కిందా, పక్కనా గదులు అల్లుకోవాలి. ఈ రకంగా నాలుగువరసలు అల్లిన తరువాత జండా ఆకారం వచ్చేట్లు అల్లుతారు (కో 20)

**జమకాణా** నేలపైవేసు కోడానికి వాడే గుడ్డ దీనిని వాలాంగి పనిలో చేస్తారు (తె.11)

**జాలడిజైను** . వాలాంగిపనిలో ఒక రకం డిజైన్ (తె 11)

**జాలలు** · వాలాంగిపనిలో వాడే మగ్గంలోని భాగాలు (తె 11)

**జీడిబద్ద అట్ట** . జీడిబద్ద డిజైన్‌లో మధ్యన ఉన్న అల్లిక భాగం. చూ చిత్రం-12.1 (కో 20,21,22)

**జీడిబద్ద డిజైన్** : లేసుపనిలో జీడిబద్దల మాదిరి అల్లిక చూ చిత్రం-12. (కో 20,21,22)

**జీలిగిబండిచెక్క** : లేసుల అల్లికలో వాడే సూదికి ఊతకోసం పైనపెట్టిన పిడి చూ చిత్రం-3 (కో 21)

**జేబురుమాలు** · లేసుపనిలో అల్లిన చేతిగుడ్డ. (కో 20,22)

## ఝ

**ఝూంఢీకట్టా** . బంజారీ అల్లికలో బెల్టుకు బార్డరుగా దారం పూసలతో అల్లిన అల్లిక (తె 1)

## ట

**టకోరో** . బంజారీ అల్లికలకు వాడేబట్ట. లంగా, ఓణి, రవికలకు ఈబట్టను వాడతారు. దీనిపైన అద్దాలు కుట్టడానికి అనుకూలంగా ఉంటుంది. (తె 1)

**టాకాలు (వేయు)** : గోగునార సంచుల తయారీలో గోగునారను లోపలి బట్టను కలిపి కుట్టు (తె.14)

**టాంక్** పర్యా చట్రం వాలాంగి పనిలో నూలునేయడానికి వాడే మగ్గంలో ఒక భాగం (తె 4)

**టేప్** : లేసుపనిలో బద్దెమాదిరి డిజైన్ చూ చిత్రం-8 4, 15 2 (కో 20)

**టేపిస్ట్రీ వర్క్** : పర్యా వాలాంగిపని (తె 11)

**టేపుల గుండ్రం** : లేసుపనిలో టేపుల మాదిరి గుండ్రంగా అల్లిన అల్లిక (కో.20)

**టేపులు(తెరుచు)** · డిజైనులో కొన్నిరకాల అల్లిక పూర్తయిన తరువాత టేపుమాదిరి కొంత వెడల్పు కనబడేటట్లు అల్లు చూ చిత్రం-8 4; 15 2 (కో 21)

**టేపారప** . చూ టేప్ (కో 20)

**టేబుల్‌మేట్** బల్లపై వేసేటందుకు తాటాకుతో అల్లిన చాప (<Table mat) (కో.42)

**టోఫీ బేడ్** తాటాకుతో అల్లిన ఒక వస్తువు (కో 42)

**ట్రయాంగిల్** : పర్యా త్రిభుజాకారం త్రికోణపు ఆకారం లేసుపనిలో త్రిభుజారంగా ఉన్న అల్లిక (కో 20)

**ట్రీడిజైన్** (<Tree design) వాలాంగిపనిలో మగ్గంమీద నూలు అమర్చిన తరువాత చెట్టు ఆకారంతో వేసిన డిజైన్ (తె 11)

## డ

**డబుల్‌మట్టురోజా** లేసుపనిలో గులాబి పువ్వుకాడ భాగం రెండుమట్లు అల్లిన తరువాత అల్లిన మరో డిజైను పేరు (కో 20)

**డబ్బా** వాలాంగిపనిలో నూలు చుట్టడానికి ఉపకరించే రేకు పరికరం (తె 11)

**డబ్బాలరాట్నం** . వాలాంగి పనిలో నూలు చుట్టడానికి వాడే పరికరం (తె.11)

**డ్రా వీవింగ్** . వాలాంగిపనిలో జంపకానా నేతపని. (తె 11)

**డాగు** · లేసుపనిలో దారం మీదపడిన మరక (కో 21)

**డిబ్బీమట్టు** · లేసుపనిలో మొదట గొలుసుల మాదిరి గుండ్రని అల్లిక అల్లి, తర్వాత చిన్న ఆకుల మాదిరి అల్లి, తర్వాత టేపు మాదిరి అల్లి, చివర్లో చిలుకు అల్లితే డిబ్బీమట్టు అవుతుంది. (కో 20)

**డిబ్బీమట్టు గుండ్రం** . లేసు అల్లికలో ఒక రకం గొలుసు అల్లిక గుండ్రంగా అల్లి, తరువాత సూదిమీది దారంతోనే ఆరు ఆకులు అల్లి, మధ్య మధ్యలో గదులు అల్లి, తరువాత శనగబద్ద అల్లి, గడి అల్లి, ఆఖరున బార్డరు అల్లితే డిబ్బీమట్టు గుండ్రం అవుతుంది (కో 20)

**డిబ్బీస్తంభాలు** · లేసుపనిలో ఒక రకం అల్లిక మట్టు కట్టిన తరువాత డిబ్బీలేసి చుట్టూ కట్టు కట్టి, స్తంభం వేసి, మళ్లీ కట్టు కట్టి, స్తంభాలు వేసి చుట్టూ చిలుకు వేయడం (కో 21)

**డైమండ్‌కంపెనీ దారం** . డైమండ్ కంపెనీ తయారు చేసిన లేసు అల్లే దారం (కో 20)

**డైమన్** తాటాకు పనిలో ఒక రకం డిజైన్ (కో 42)

## త

**తమలపాకులసంచి** . తాంబూలం పెట్టుకోడానికి లేసు అల్లికలతో చేసిన ఒక రకం సంచి చూ చిత్రం-19 (తె 14)

**తలగడతొడుగు** తలకింద పెట్టుకొనే దిండు తొడుగు లేసుఅల్లికలలో ఇది ఒకరకం డిజైన్. (కో 20)

**తాటాకు** : తాటి చెట్టు ఆకు రూ తాడి (Brab tree, Fan Palm tree, palmyra palm, Borassus flabelliformis, Watts) దీనితో బుట్టలు, తట్టలు మొదలైనవి అల్లుతారు. (కో 42)

**తాటాకుల నగిషీ(పని)** · తాటాకుతో రకరకాల డిజైన్లలో రంగులు వేసి బుట్టలు మొదలైనవి అల్లే అల్లికపని (కో 42)

**తాడు** . తమలపాకు సంచికి ఉండేదారం గోగునారతో

తాడు పేనుతారు. దీనితో గోగునార సంచులు చేస్తారు చూ.చిత్రం-19 3 (తె 14)

**తాళ్లవరస** : వత్తుగుచ్చు ముత్యాల ముగ్గు డిజైనులోని నిలువు అల్లిక. చూ చిత్రం-14.2 (కో 20)

**తింపు** : రూ తిప్పు పర్యా తిరుగు లేసుపనిలో డిజైనుకు వీలుగా సూదిని కదల్చడం (కో 22)

**తిరగలు** : లేసుపనిలో అల్లిన అల్లిక అడుగు భాగం. (కో 22)

**తిరుచ్చిట్రే** : తాటాకుతో చేసిన ఒకరకం పళ్లెం(tray) తిరుచ్చి తమిళనాడు రాష్ట్రంలో ఒక నగరం (కో 42)

**తుమ్మకాయల డిజైన్**. లేసుపనిలో తుమ్మకాయల రూపం వచ్చేలా అల్లిన డిజైన్ ముందుగా ఆకుల పూలు మట్టుపెట్టి, దానిపైన తాడొరస వేసి, కాయలు కట్టి, చుట్టూ లేసు అతకాలి (The thorny babul, cassia flower tree, Acacia barnesiana, W l) (కో.21,22)

**తెలుపు నూలు** . వాలాంగి పనిలో వాడే తెల్లదారం (తె 11)

**తేట** : లేసు అల్లికలో బాగా నదురుగా కనిపించే రంగు. (కో 20)

**తేల్చు** · లేసుపనిలో డిజైను కొంత అల్లి తర్వాత రథాలమాదిరి అల్లటం. (కో 21)

**తొమ్మిది చిలుకులు** : లేసు అల్లికలో తొమ్మిది వంపుల డిజైన్ (కో.22)

**త్రిమూర్తి డిజైన్** : వాలాంగి పనిలో వేసే బ్రహ్మ, విష్ణు, మహేశ్వర చిత్రాలు. (తె.11)

# ద

**దండెం** గోగునార సంచుల తయారీలో గోగునారను రంగునీళ్లలో ముంచి ఆరవేయడానికి కట్టేతాడు (తె 14)

**దంత్రం** : వాలాంగి పనిలో నూలు చుట్టడానికి వాడే యంత్రం (తె 11)

**దారం** . పర్యా నూలు (తె 11)

**దిపీసా** · బంజారీ కుట్టులో రెండు పైసల బిళ్లలతో బోర్డర్లు కుట్టడం (తె 1)

**దుప్పటి** : మంచాలపై వేసుకొనే, చలికి కప్పుకొనే దళసరి గుడ్డ దీని అంచులకు లేసుఅల్లికలు అల్లుతారు పూర్తయిన అల్లికలు దీనిమీద వేసి సాపు చేస్తారు. (కో 20,22)

**దుబ్బు** : వట్టివేళ్ల చాపల అల్లికకు వాడే ఆవిరి దుబ్బు. ఎండిన చెరువుల నుండి దీనిని తవ్వి తీస్తారు. (కో 14)

**దూరా** : బంజారీ అల్లికలలో వాడే దారం (తె 1)

**దూర్చు** : అద్దాలతో, పూసలతో సంచులు అల్లేటప్పుడు గాజాపలకని బట్టకు కుట్టిన కాజా కుట్టులోనికి చొప్పించు (తె 14)

**దొడ్డుబట్ట** . అద్దాల, పూసల సంచుల తయారీకి వాడే దళసరి బట్ట (తె 14)

**దొరసానమ్మ డిజైన్** · లేసుపనిలో ఒక డిజైన్ దొరసానమ్మ అల్లిచూపించి ఈ రకంగా అల్లుకొనండి అని చెబితే తతిమ్మావాళ్లు ఈ అల్లిక మొదలుపెట్టి ఉత్సాహంగా అనేక రకాల అల్లికలు అల్లి జీవిస్తున్నారు దొరసానమ్మ నేర్పింది కాబట్టి ఆమె పేరు మీదుగా దొరసానమ్మ డిజైన్ అయింది (కో 20)

**దోసగింజ డిజైన్** · లేసుపనిలో దోసగింజ ఆకారంలో అల్లిన అల్లిక. (కో.22)

**ద్రాక్షగుత్తుల లేసు** లేసుపనిలో ద్రాక్షగుత్తుల ఆకారంలో అల్లే అల్లిక. (కో 20)

# న

**నక్షత్రం** . అద్దాల, పూసల పనిలో నక్షత్రం ఆకారం వచ్చేలా కుట్టిన కుట్టు. (తె.14)

**నగిషీపని** అందమైన డిజైన్లతో, రంగు రంగుల తాటాకులతో

రకరకాల తాటాకు బుట్టలు, చాపలు అల్లడం (కో 42)

**వదరువైపు** . ఆకర్షణీయంగా ఉన్న భాగం. లేసుపనిలో అల్లే అల్లిక పైభాగం (కో 22)

**వప్పు** . లేసుపనిలో అల్లిక చివర చిలుకు వేస్తే సరిపోవడం. (కో 20)

ఆ డిజైన్ బట్ట దానికి సరిపోవడం (కో 20)

**వాడె** · జమకాణాల తయారీలో నూలు చుట్టడానికి వాడే పనిముట్టు (తె.11)

**వాన (వేయు/బెట్టు)** వాలాంగి పనిలో వాడే నూలుని గంజిలో గాని (అంబలిలో గాని) ఊరబెట్టడం, కొంతసేపు ఉంచడం (కో 10,27,41)

**విలువు** : పర్యా పొడవు లేసుపనిలో అల్లే అల్లిక పొడవు భాగం (కో 20)

**నీలగిరి తెలుపు వట్టివేరు** · నీలగిరిలో దొరికే ఒక రకం వట్టివేరు. ఇది తెల్లగా ఉంటుంది దీనితో వట్టివేరు చాపలు అల్లుతారు తమిళనాడులో గల ఎత్తైన కొండప్రదేశం నీలగిరి (కో.14)

**మన్నటి రాయి** . లేసు పనిలో ముద్దపువ్వుల్ని అల్లిన పిదప ముడతలు లేకుండా సమానంగా సాపు చేయడానికి వాడే రాయి (కో 20)

**నూలు** : వాలంగి పనిలో వాడే దారం (తె 11)

**నేత** వాలంగి పనిలో నూలుతో మగ్గాలు నేయడం (తె.11)

## ప

**పక్కారంగు** : తడి తగిలినా చెరిగి పోని మంచి రంగు గోగునార సంచుల తయారీలో ఈ రంగు వాడతారు. (తె 14)

**పట్టా** · గోగునార సంచి గోనుసంచి (కో 33)

**పడుగు (చేయు)** : వాలంగి పనిలో నూలుని సైజు చేయడం. (తె 11)

**పద్మపాణి డిజైన్** . వాలంగి పనిలో వేసే అజంతా డిజైను. (తె 11)

**పద్మం** : పర్యా తామర లేసుపనిలో పద్మం ఆకారంలో అల్లిన అల్లిక (కో 21)

**పర్తి** వాలంగి పనిలో వాడే దంత్రంలోని ఒక భాగం. (తె 11)

**పాకోడు చెక్కలు** వాలంగి నిలో మగ్గంలోని నూలుని పైకి కిందికి కదలటానికి తొక్కే చెక్కలు (తె.11)

**పాతివగుంజ** వట్టివేళ్ళ తడికలు అల్లడానికి పాతిన కఱ్ఱ. (కో.14)

**పాప్లయిన్** బంజారీ అల్లికకు వాడే ఒక రకం బట్ట (తె 1)

**పిక్‌నిక్ బాక్స్** : (Picnic box) తాటాకుతో అల్లిన ఒకరకం పెట్టె (కో 43)

**పిడి** వాలంగి పనిలో రాట్నం తిప్పడానికి ఉపకరించే ఒక భాగం (తె.11)

**పురాని డిజైన్** . వాలాంగి పనిలో ఒక రకం డిజైను (తె 11)

**పులిగోరు** · లేసుపనిలో పులిగోళ్ళను పోలిన అల్లిక (కో.21)

**పూడ్చు** : లేసు పనిలో ఒత్తుగా ఉన్న అల్లిక తరువాత దాని దగ్గరగా అల్లిన లేసు అల్లిక (కో 20)

**పూస** · అద్దాల, పూసల పనిలో ఇది ఉపకరిస్తుంది దీనితో సంచులు చేస్తారు (తె 14)

**పూసల సూది** . పూసల సంచులు కుట్టే ఒక ప్రత్యేకమైన సూది (తె 14)

**పెద్దబంతి పూలు** : లేసు పనిలో పెద్ద బంతి పూవు మాదిరి అల్లే అల్లిక. Marigold, Tagetes patula, Sank (కో 27)

**పెద్దలేసు** . లేసు పనిలో అల్లిన వెడల్పు అల్లిక. (కో.20)

**పైవలేసు** · జీడి బద్ద డిజైనులో చుట్టూ ఉన్న లేసు అల్లిక. చూ చిత్రం-12 3 (కో.20,21,22)

**పొట్టుకుచ్చు** · లేసు పనిలో ఒక రకం అల్లిక (కో 21)

**పొట్లపువ్వు** : లేసు పనిలో పొట్లపువ్వు మాదిరి అల్లిన అల్లిక (కో.20,21,22)

**పొట్లపువ్వు మట్లు** : లేసు పనిలో అల్లిక చివర పొట్లపువ్వు మాదిరి అల్లిన అల్లిక (కో 20)

**పొర** : పర్యా. మడత తమల పాకు సంచి తయారీలో దారాన్ని పదివరసలుగా తీయడం. (తె.14)

**పోయు** : వాలంగి పనిలో నూలుని అసుమీద చుట్టు (తె.11)

**ప్లాండర్** · తాటాకుతో అల్లిన ఒకరకం వస్తువు (కో 42)

**ప్యూడోదూరా** : బంజారీ అల్లికలో వాడే పసుపురంగు దారం (తె.17)

## ఫ

**ఫట్టీ బ్యాగ్** · తాటాకుతో అల్లిన ఒక రకం సంచి (కో.42)

**ఫ్యాక్టరీ** : యంత్రాలతో నడిచే పరిశ్రమ వాలంగి పనిలో వాడే దారాలకు ఫ్యాక్టరీలో రంగులు వేస్తారు. (తె 11)

**ఫ్లవర్ డిజైన్** : పర్యా ఫ్లవర్ వాజ్. వాలంగి పనిలో వేసే పువ్వుల డిజైన్ (తె 11)

## బ

**బంజారీ అల్లిక** : లంబాడీలు అల్లే అల్లిక (తె.1)

**బట్టమీద అద్దాలపని** : బట్టమీద అద్దాలు కుట్టడం (కో 29)

**బట్వా** . డబ్బులు వేసుకొనే సంచి కూరగాయలు అమ్మేవారు ఈరకం సంచిని ఉపయోగిస్తారు. (తె 14)

**బల్లగుడ్డలు** : బల్ల మీద వేయడానికి లేసుతో అల్లిన ఒక రకం అల్లిక (కో 22)

**బస్తతట్టు** : గోను సంచి (తె 1,12)

**బాలాజీడిజైన్** · వాలాంగి పనిలో వేసే వేంకటేశ్వర స్వామి డిజైన్ (తె 11)

**బిండ** · వాలాంగిపనిలో నూలు చుట్టడానికి వాడే ఒకరకం పనిముట్టు (తె.11)

**బిన్ని కేస్‌మెంటుబట్ట** : లేసు అల్లికలో వాడే ఒకరకం బట్ట (కో.22)

**బిన్నీబట్ట** : అద్దాలు, పూసల పనిలో సంచులు కుట్టడానికి వాడే వస్త్రం. (కో 22)

**బిళ్ళవరస** · లేసుపనిలో బిళ్ల బిళ్లలుగా అల్లే ఒక రకం అల్లిక (కో 22)

**బీము** : వాలాంగిపనిలో నూలు చుట్టడానికి మగ్గంలో ఉన్న ఒక భాగం (తె 11)

**బుట్ట** : తాటాకుతో అల్లిన ఒక రకం బుట్ట (కో 42)

**బూడిదరంగు** : లేసు అల్లికకు వాడే బూడిదరంగు దారం. (తె.4)

**బూరస్తంభం డిజైన్** : లేసు పనిలో బూరుగుమాను రూపం అల్లిన అల్లిక. (కో 22)

**బూరాకు పూలు** : లేసు పనిలో బూరాకు రూపంలో అల్లిన అల్లిక గొలుసులతో గుండ్రం చేసి, వత్తి పూడ్చి, పైన ఏడురింగు లేసి, ఒక్కోరింగుకి ఒక్కోరేఖ వచ్చేటట్లు గట్టి గొలుసులతో, ఏడు ఆకులు పూడ్చి. మీద గుండ్రంగా గడులేసి పైన శనగబద్ద వేయాలి. చూ.చిత్రం-18 (కో 21)

**బేబి బాస్కెట్** : (<baby basket) తాటాకుతో చేసిన ఒకరకం బుట్ట (కో 41)

**బేలు** · లేసు అల్లికలు భద్రపరిచే అట్టపెట్టెలు. ఈ పెట్టెలలో ఎగుమతి కూడ చేస్తారు (కో 20)

**బొందు దారం** · లేసుపనిలో వాడే ఒకరకం దారం (కో 20)

**బోర్డరు** : (<border) తాటాకుతో అల్లిన ఒక రకం పళ్లెం (కో 42)

**బోర్డరు వలటేపు** లేసుపనిలో అంచుని వల మాదిరిగ అల్లిన టేపుల అల్లిక (కో 20)

**బౌల్స్** · తాటాకుతో అల్లిక ఒక రకం వస్తువు (కో.42)

బ్రెడ్‌ట్రే . (< bread tray) తాటాకుతో అల్లిన ఒక రకం పళ్లెం (కో 42)

# మ

మగ్గం . వాలాంగి పనిలో నూలు నేసే సాధనం (తె 11)

మగ్గం గుంజ . మగ్గం స్థిరంగా ఉండటానికి పాతిన బొంగు (కో 14)

మంగమ్మకాయలు . లేసుపనిలో ఒక అల్లిక పేరు మంగమ్మ పేరుగలామె మొదట ఈ కొత్తరకం అల్లినందున దీనికీ పేరు వచ్చింది చూ చిత్రం-7 (కో 20)

మంచివేపు చూ నదరువైపు లేసుపనిలో అల్లే అల్లిక పైవైపు (కో 22)

మట్టు : లేసుపనిలో అల్లే అల్లిక చివరి భాగం చూ చిత్రం-4.3 (కో.20,22)

మట్టుగుడ్డ · లేసు అల్లికలో వాడే బట్ట (కో 20)

మధురట్రే (< Madhura tray) తాటాకుతో చేసిన ఒక రకం పళ్లెం (కో 42)

మరగబెట్టు · గోగునార సంచుల తయారీలో నారకు రంగులు వేయడానికి నీటిలో రంగు పొడిని వేసి బాగా కాచు (తె 14)

మలబారు తెలుపు వట్టివేరు : మలబారులో లభ్యమయ్యే తెల్లని వట్టివేరు దీనితో వట్టివేళ్ల తడికలు అల్లుతారు (కో.14)

మల్లెపువ్వు . లేసు అల్లికలో మల్లెపువ్వు రూపాన్ని పోలిన అల్లిక Jasmine, Jasminum sambac, Sank (కో 22)

మినాయించుకొను · అల్లిక బాగలేక పోతే ఇచ్చే కూలీలో కొంత తగ్గించుకోవడం (కో 20)

మిషన్. గోగునార సంచులు కుట్టడానికి, పత్తిబట్ట తయారీలో బొమ్మలు కుట్టడానికి వాడే కుట్టు యంత్రం. (తె 14, రా 7)

ముక్క · చూ తునక లేసుపనిలో అక్కడక్కడ పెట్టడానికి కావలసిన ఆకారంలో కోసిన బట్ట (కో 20)

ముదత లేసుపనిలో అల్లేటప్పుడు ఒకేసారి అల్లిక దగ్గర దగ్గరగా ముడుచుకుపోవటం (కో 20)

ముడికుట్టు : అద్దాల, పూసల సంచుల తయారీలో ముడులు ముడులుగా కుట్టే చేతికుట్టు డిజైన్‌లోనే ఇటువంటి ముడికుట్టు కుడతారు (తె 14)

ముడిసరుకు :. గంజి పెట్టక ముందు, సాపు చేయక ముందున్న నూలు వాలాంగిపనిలో ఇటువంటి నూలు వాడతారు (తె 11)

ముత్యాలముగ్గు డిజైన్ : లేసు అల్లికలో ముత్యాలముగ్గు సినిమాలోని ముగ్గులాంటి ఒక రకం డిజైన్ మొదట గొలుసులతో గుండ్రం వేసి దానిమీద కొళ్ళువేయాలి. దానిమీద వత్తి పూడ్చి ఒక వరస వట్టిసూదులు వేయాలి దానిపై రెండారసలు ముద్ద గడులేసి చుట్టూ శనగబద్ద వేయాలి దానిపై ఒక తాళ్లొరస వేసి పైన నాలుగు ముద్ద తాళ్లొరారసలు వేయాలి చూ చిత్రం-8. (కో 20)

ముదురాకు : తాటాకు పనిలో వాడే ఒక రకం ముదురు తాటాకు (కో 42)

ముద్దగడులు . వత్తుగుచ్చు ముత్యాల ముగ్గు డిజైనులో మధ్యలో అడ్డంగా ఉన్న తాళ్ళవరుసలు చూ చిత్రం-14 1 (కో 20)

ముద్దతాళ్ళవరస . వత్తుగుచ్చు ముత్యాల ముగ్గు డిజైనులో అంచు కిందుగా అడ్డంగా వున్న తాళ్ళవరుస. చూ చిత్రం-14 4 (కో 20)

ముల్లుకుట్టు · అద్దాలతో, పూసలతో సంచులు కుట్టేటప్పుడు డిజైన్లో కుట్టే చేపముల్లు మాదిరి ఒకరకం కుట్టు. (తె 14)

మూత కప్పు తాటాకుతో చేసిన సంచి పైకప్పు (కో 42)

మూల లేసు పనిలో అల్లే అల్లిక చివరి భాగం రెండు

అంచులు కలిసిన చోటును కూడ 'మూల' అంటారు. (కో.20)

**మెలిక :** వట్టివేళ్ల చాపల అల్లికలో రాయి కట్టిన తాళ్లమీద వట్టివేరు పెట్టి అటు తాడు నిటు, ఇటుదాన్ని అటు వేయడం. (కో.14)

**మేదర .** ఒక కులం వీరి ప్రధాన వృత్తి బుట్టలు అల్లడం. (తె 1)

**మేదరబుట్ట :** మేదర వాళ్ళు వెదురుబద్దలతో అల్లే ఒకరకం బుట్ట. (సొరకాయ లాగ అల్లించి వీణకు వాడతారు) (కో.23)

**మేస్త్రి ·** వట్టి వేళ్ల తడికలు అల్లే పనివారిలో పెద్ద. (కో.14)

**మొక్కపోవు :** లేసుపనిలో వాడే సూది చివర వంకర పోవడం, లేదా పదును పోవడం (కో.20)

**మొండిరథం** లేసుపనిలో రథం డిజైను పూర్తిగా అల్లకుండా కొంత వరకు అల్లి పైన చెట్ల మాదిరి అల్లడం (కో.20)

**మొల :** ఇనపమేకు పరదాలపై అద్దకం వేసే పనిలో బట్టను గోడకు కొట్టడానికి వాడే మేకు (తె.2)

**మొవ్వాకు** తాటాకు పనిలో వాడే లేత తాటాకు. (కో.42)

**మోడీ కంపెనీ దారం .** లేసు అల్లికలలో వాడే మోడీ కంపెనీ తయారీ చేసిన ఒక రకం నూలు (కో.22)

**మోపు .** ఆధారం వట్టివేళ్ల తడికల అల్లికలో నేలలో పాతిన గుంజలకి ఆధారంగా వెదురు బొంగులు జతచేసి కట్టడం (కో.14)

**మ్యాచింగ్ బాక్స్ :** తాటాకుతో అల్లిన ఒక రకం పెట్టె. (కో 42)

# ర

**రంగుపొడి :** తాటాకు రంగు రావడానికి ఈ రంగుపొడి (colour powder) వేసిన నీటిలో మరగబెడతారు. దీనితో తాటాకుకు మంచి రంగువస్తుంది (కో.42)

**రంగుల బుట్ట :** రంగు వేసిన తాటాకుతో అల్లిన బుట్ట (కో.42)

**రంగువేసిన ఆకు :** రంగువేసిన తాటాకు. ఏరంగు కావాలంటే ఆ రంగుపొడి నీటిలో వేసి ఉడికించి అందులో తాటాకువేసి మరికొంతసేపు ఉడక బెట్టాలి తరువాత దాన్ని తీసి నీడలో ఆరబెట్టాలి (కో 42)

**రథ చక్రం :** లేసు పనిలో ఒక రకం అల్లిక. (తె 7)

**రవుండుట్రే ·** (< Round tray). తాటాకుతో అల్లిన ఒక రకం గుండ్రటి పళ్లెం. (కో 42)

**రవుండు ప్లేట్ :** (<Round plate) తాటాకుతో అల్లిన ఒక రకం గుండ్రటి పళ్లెం. (కో 42)

**రవుండు బ్యాగ్ :** (< Round bag). తాటాకుతో అల్లిన ఒక రకం గుండ్రని సంచి (కో.42)

**రవుండ్ హాట్ మేట్ :** తాటాకుతో అల్లిన ఒకరకం వస్తువు (కో.42)

**రాట్నం** వాలాంగి పనిలో నూలు చుట్టడానికి వాడే పరికరం. (తె.11)

**రాతిడొదూరా ·** బంజారీ అల్లికలో వాడే ఎరుపు రంగు దారం. (తె.1)

**రాధాకృష్ణడిజైన్** వాలాంగి పనిలో నూలుమీద వేసిన రాధాకృష్ణుల చిత్రాలున్న డిజైన్ (తె 11)

**రాయాకు బొడ్డు :** లేసుపనిలో రావిఆకు డిజైన్ అల్లి దానిమీద టేపులు అల్లడం (కో 20)

**రావాకు .** లేసుపనిలో రావాకు మాదిరి అల్లుతూ ఆకులనే చెట్ల ఆకారంలో మలిస్తే 'రావాకు చెట్టు' ఆకారం వస్తుంది. చూ చిత్రం-15, 15.1 (కో 20)

**రింగన్న పురుగు రెక్క :** అద్దాలతో, పూసలతో అల్లే సంచులకు అద్దాలకు బదులుగా వాడే రింగన్న పురుగు రెక్కభాగం. (తె.14)

**రింగు :** లేసుపనిలో గొలుసుమాదిరి అల్లి దానిని వంపులు వంపులుగా తిప్పడం చూ.చిత్రం-15 , 16 1 ; 18 2 (కో 20)

**రింగుల రౌండ్** : లేసు అల్లికలో గుండ్రని బట్టముక్కలు అతుకుతూ అల్లడం (కో 20)

**రిపేరు** : (<Repair) లేసు అల్లిక పాడైపోతే బాగు చేయించడం (కో 20)

**రీలు** . వాలాంగి పనిలో వాడే మగ్గంలో ఒక భాగం లేసుపనిలో వాడే దారం చుట్ట (కో 22, తె.11)

**రెండొత్తులలేసు** : లేసు అల్లికలో ఒకరకం డిజైన్ చూ.చిత్రం-11 (కో 22)

**రేఖ(లు తేల్చు)** · లేసుపనిలో అల్లే పువ్వులోని భాగం, అల్లికలో రేఖలు కనబడేటట్లు అల్లడం (కో 20,21)

**రోజాపట్టు** : లేసుపనిలో ఒకరకం అల్లిక. (కో 22)

**రోజాపువ్వు** గులాబి. లేసుపనిలో గులాబి ఆకారంలో అల్లిన అల్లిక (కో 20)

## ల

**లంగాలేసు** · లేసుపనిలో అందానికి లంగాలకు చివర చుట్టూఅల్లే అల్లిక. (కో 21)

**లంచ్‌పెట్టు** భోజనం చేయడానికి వాడే బల్లపై రకరకాల పాత్రలు పెట్టుకోడానికి లేసుపనిలో అల్లిన అల్లిక (కో.22)

**లంబాడి** . ఒక గణం బంజారీ అల్లిక పని చేస్తారు. (తె.1,3)

**లావు** : వాలాంగి పనిలో చేసేపనిని బట్టి డబ్బాకి నూలుని మందంగా చుట్టడం (తె.11)

**లూప్** . చెమ్కీలో ఒక రకం లేసుపనిలో బట్టమీద పూలకు దీనిని వాడతారు (కో 29)

**లేజి డిజైన్ కుట్టు** : అద్దాల, పూసల సంచుల తయారీలో చేతికుట్లులో ఒకరకం (తె.14)

**లేత** : తాటాకుపనిలో వాడేతాటాకు ముదరకుండ ఉండడం (కో 42)

**లేతమట్టిరంగు** . మట్టిరంగులోనే తేలిక రంగు గోగునార సంచులకు వేసే రంగు (తె.14)

**లేబర్ డిజైన్**. (<Labour design) వాలాంగి పనిలో వేసే శ్రామికచిత్రం (తె 11)

**లేసుఅల్లిక** : లేసుఅల్లే విధానం చూ చిత్రం-1 (కో 20)

**లైనింగ్** : అద్దాల, పూసల సంచుల తయారీలో సంచి అడుగున కుట్టే వేరే గుడ్డ (తె 14)

**లొట్టు** : లేసు అల్లికలో పువ్వుకు పువ్వుకు మధ్యనున్న ఖాళీ భాగం. (కో.22)

**లోటాకింది తొడుగు** గ్లాసుకింద తొడిగే తొడుగు చూ చిత్రం-5 (కో.21)

**లోటా తొడుగు** · గ్లాసులోని పానీయాలపై ఈగలు వాలకుండా తొడిగే తొడుగు చూ చిత్రం-4 (కో.21)

## వ

**వంకర** లేసు అల్లిక డిజైన్ ప్రకారం రాకుండా కొద్దిగా పక్కకు రావడం అల్లిక హెచ్చుతగ్గులుగా ఉండడం (కో 20)

**వంకీవరస** · వంపులు వంపులుగా పొడవుగా అల్లే అల్లిక (కో 20)

**వంకెన** . వాలాంగి పనిలో వాడే ఊడితలోని భాగం (తె 11)

**వంగమొగ్గ** లేసు అల్లికలో వంగమొగ్గ రూపంతో ఉన్న ఒకరకం అల్లిక. (కో 20)

**వట్టిసూది** : లేసుపనిలో సూదిపైగా దారం వేయకుండా కిందగా దారం సూదికి వేసి లాగడం (కో 20,21)

**వడ్ల గింజవరస** లేసుపనిలో వడ్లగింజ రూపంలో వరసగా ఉన్న ఒకరకం అల్లిక (కో 20)

**వత్తి** . లేసుపనిలో సన్నగా అల్లిన అల్లికను గుండ్రంగా ముద్ద మాదిరిగా తిప్పడం (కో 20)

**వత్తు** · లేసు పనిలో అల్లిన అల్లికను ఆఖరున సమానంగా చేయడం చూ.చిత్రం-8 3. (కో 22)

**వత్తుగుచ్చు ముత్యాలముగ్గు** . లేసు అల్లికలో ఒకరకం డిజైన్ చూ చిత్రం-14 (కో 20)

**వత్తుపూలు** తెలుపు దారంతో అల్లిన లేసులో అక్కడక్కడా రంగు దారంతో లేసుపూలు అల్లటం. (కో 22)

**వదులు** : లేసుపనిలో అల్లిక సరిగా ఉండక పోవడం (కో 20)

**వదులు గొలుసు** : లేసుపనిలో అల్లిక గొలుసు మాదిరి కొద్దిదూరం పొడవుగా అల్లడం (కో 20,21)

**వరస** వాలాంగి పనిలో డిజైన్ వేసేటప్పుడు ముందు నమూనా చూసుకొనేందుకు అల్లే (ఒక లైను) అల్లిక (తె 11)

**వలటేపు** . లేసుపనిలో టేపు అల్లిక వలమాదిరిగ అల్లడం చూ చిత్రం-12 2 (కో 20)

**వలలేసు** . పర్యా గదుల్లేసు. లేసుపనిలో గదిమాదిరిగా ఉన్న అల్లిక. చూ చిత్రం-6 (కో.20)

**వార్పు** : వాలాంగి పనిలో మగ్గానికుండే బీములపై నిలువుగా ఉండే నూలు పోగులు (తె 11)

**లాంగి డిజైన్** వాలాంగి పనిలో ఒకరకం డిజైన్ (తె.11)

**లాంగిపని** : (< Tapestry work) గోడలకు తగిలించే టందుకు గుడ్డపై వేసే రకరకాల చిత్రాల పని. (తె 11)

**విసనికర్ర డిజైన్** : లేసుపనిలో విసన కర్ర రూపమున్న డిజైన్ (కో 20,22)

**వేయు** : వాలాంగి పనిలో పడుగుమీద వేరేనూలుతో వేసే అద్దకం (తె 11)

**వేస్ట్ పేపర్ బాస్కెట్** . (< Wast paper basket) చిత్తు కాగితాలు వేసుకొనేటందుకు తాటాకుతో అల్లిన బుట్ట (కో 42)

**వోవల్ట్రే** (<Oval tray) తాటాకుతో అల్లిన ఒక రకమైన గుండ్రటి పళ్లెం (కో.42)

## శ

**శనగబద్ద** : లేసుపనిలో శనగపప్పు బద్దలా ఒక రకమైన అల్లిక చూ చిత్రం-14 3, 18 5 (కో 20)

**శలాండరు** . తాటాకుతో అల్లిన (ఒక రకమైన) వస్తువు (కో 42)

**శుభలక్షణాలపూవు** సుభద్ర అనే ఆమె ఒక కొత్తరకం డిజైన్ అల్లితే దానికి శుభలక్షణాల పూవు అనే పేరు పెట్టారు (కో 21)

**శూల** · వాలాంగి పనిలో నాడెలో నూలు కండె పెట్టడానికి ఉపకరించే ఒక పనిముట్టు (తె 11)

## స

**సక్క (చక్క) రాలడిజైన్** లేసుపనిలో ఒకరకం గుండ్రని అల్లిక (కో 22)

**సదరు(-కొట్టు)** ఎగుడు దిగుడు లేసు అల్లికలో వచ్చిన ఎత్తుపల్లాలు, హెచ్చుతగ్గులు సరి చేయడం (కో 20)

**సంత్రారంగు** : కమలారంగు (Orange colour) లేసు అల్లికలో వాడే దారం రంగు (తె 1)

**సన్న-(ంతిప్పు)** . రూపా సన్నం వాలాంగిపనిలో నూలుని పల్చని పోగులుగా చేయడం (తె 11)

**సంపెంగ డిజైన్** · లేసుపనిలో సంపెంగ పువ్వులాగ ఉన్న ఒకరకం అల్లిక చూ.చిత్రం-16 (కో 20,22)

**సంపెంగపూలు** · సంపెంగ డిజైన్ అల్లికలో లోపల ఉన్న పూవు భాగం. చూ చిత్రం-16 2 (కో 20,22)

**సరిపెట్టు** · తాటాకు పనిలో వస్తువులను కావలసిన కొ( ప్రకారం సమంగా సరిచేయడం (కో 42)

**సవరు (లాగు)** నునుపు లేసు అల్లిక పూర్తయిన తరువాత హెచ్చుతగ్గులు గాని, వంకర్లు గాని లేకుండ సరిగ సాపు చేయడం (కో 20)

**సాగు** వాలాంగి పనిలో నూలుని సరిగా బాగుచేయడం (తె 11)

**సామర్ల వట్టివేరు** · సామర్లకోటలో లభ్యమయ్యే వట్టివేరు (కో.14)

**సాలెగూడు డిజైన్** : లేసుపనిలో సాలెగూడులా ఉన్న ఒకరకం డిజైన్ (కో 22)

**సాసు** . డిజైనులో లోపం రావడం లేసుపనిలో అల్లవలసిన డిజైనుకి ఉండవలసిన వాటికన్న గళ్లు తక్కువ అయితే లాక్కుపోయినట్లుగా ఉంటుంది. దీన్నే సాసు అంటారు. (కో 21)

**సిగరెట్ కేస్** : (ఆం < cigarette case) సిగరెట్లు పెట్టుకోడానికి తాటాకుతో అల్లిన ఒక చిన్న పెట్టె (కో 42)

**సిట్‌లేసు** చూ అంచుకట్ట చిన్న లేసు అల్లిక. సాధారణంగా అంచులకి ఇటువంటి అల్లిక అల్లుతారు (కో 22)

**సిలెండర్ పాట్** : తాటాకుతో అల్లిన బుట్టలాంటి వస్తువు (కో.42)

**సతారం** : అద్దాల, పూసల పని నేర్పడం (తె.14)

**సుతిలి** : సంచుల తయారీలో వాడే నార. (తె 14)

**సూది** . లేసు పనిలో ఒక సూది. చూ చిత్రం-1 2; 2. (కో.22)

**సూదిగుచ్చుడు** : లేసుపనిలో సూది కిందగా దారం తీసి సూది వంపుతో పైకి లాగడం (కో.20)

**సూదిగుచ్చుళ్ళు** : లేసుపనిలో డిజైన్ ఎక్కువ లేకుండా సూది(దింపి) గుచ్చి తీయడం (కో.20)

**సూదిమీదదారం** . లేసు అల్లేటప్పుడు ప్రథమంగా అల్లే సూదికిపైన దారం వేయడం. (కో.20)

**సూది వంపు** : లేసు అల్లికలో ఉపయోగించే సూది చివర వంపు తిరిగి ఉండటం చూ.చిత్రం-1.3, 2 1. (కో 22)

**సూర్య డిజైన్** : వాలాంగి పనిలో వేసే ఒకరకం డిజైన్ (తె 11)

**సేల్** (< sale) వాలాంగి పనిలో చేసే వస్తువుల అమ్మకం (తె 11)

**సైకిల్ బ్యాగ్** : (< cycle bag) సైకిల్‌కు తగిలించు కోవడానికి వీలుగా అల్లిన తాటాకు బుట్ట. (కో 42)

**సైజుని బట్టిమట్టు** : లేసుపనిలో అల్లే డిజైన్ కొలతనుబట్టి కింది మట్టు (కడతారు) అల్లుతారు (కో 21)

**సోఫాకవరు** లేసు అల్లికలో సోఫా వెనుక భాగానికి వేసే ఒక రకమైన తొడుగు. (కో 20)

**స్తంభాలు** ముత్యాలముగ్గు డిజైనులో అడ్డంగా ఉన్న అల్లిక చూ చిత్రం-8 5 (కో 20)

**స్టాండ్** : (ఆం. < stand) తాటాకు సంచి అడుగు భాగం (కో 42)

వాలాంగి పనిలో వాడే దంత్రంలో భాగం (తె 11)

**స్టార్** · (< star) తాటాకుపనిలో సంచికి అల్లే నక్షత్రం డిజైన్ (కో 42)

**స్మాల్ బౌల్స్** : తాటాకుతో అల్లిన ఒక వస్తువు (కో 42)

## హ

**హరోదూరా** . బంజారీ అల్లికలకు వాడే ఆకుపచ్చరంగు దారం. (తె.1)

**హేట్**: (< hat) తాటాకుతో అల్లిన ఒకరకం టోపీ (కో.42)

# అల్లికలు, కుట్టుపనులు, పూసల పనులు

## 1. లేసు అల్లిక




## 2. ఇనపసూది




## 3. కందిబద్ద పిడి/జీలిక బండి చెక్క



## 4. గ్లాసు (లోటా) మట్లు / లోటా తొడుగు




## 5. లోటా / గ్లాసు కింది తొడుగు



## 6. గదుల్లేసు / వలలేసు



## 7. మంగమ్మ కాయలు



# 8. ముత్యాలముగ్గు డిజైన్



## 9. చుట్టూ పద్మం



## 10. చక్రం



## 11. రెండొత్తుల లేసు



## 12. జీడిబద్ద డిజైన్




## 13. చిక్కాల చక్రం



## 14. వత్తుగుచ్చు ముత్యాలముగ్గు



## 15. రావాకు




## 16. సంపెంగ డిజైన్



## 18. బురాకు పూలు



## 19. తమలపాకుల సంచి






## 20. గవ్వ సంచి



### ఉత్తరాల సంచి



# 22. జడల చుట్టల సంచి



## అ

**అగరు వత్తుల స్టాండు** : రూపా. అగరొత్తిస్టాండు. సాంబ్రాణీ కడ్డీలను గుచ్చటానికి చిల్లులతో చేసిన కొమ్ము బొమ్మ. (కో.32)

**అగరు**: కొయ్యపనిలో వాడే పరికరం. చూ.చిత్రం-173.

**అగ్గిచూపు** : పర్యా. కాకచూపు, గరంచేయు, వేడిచూపు, వేడిచేయు. వెండితీగను సుడులుగా తీసి చెక్కమీద తేనె మైనం పూసి ఈ సుడులను డిజైన్‌గా పెట్టి వేడి చూపితే అంటుకుంటవి (తె.8)

**అగ్గితగులు** : వేడెక్కు వెచ్చబడు. తోలుబొమ్మలకు అగ్గితగిలితే ముద్దగా ఔతయి. (కో.15)

**అగ్గిపెట్టె** : వెండినగిషీ పనిచేసిన నిప్పు పెట్టె (తె 8)

**అగ్గిపాదలు** : మకరతోరణంలో ఒక భాగం. కిరీటంలో భాగం చూ.చిత్రం-13 3; 16.3

**అగ్గిపోయు** : లోహపు బొమ్మలకు మెరుగు పెట్టేటప్పుడు పాత్ర/బొమ్మ లోపల నిప్పుచేయటం (కో.4)

**అగ్గిల పెట్టు** : నిప్పులో ఉంచు. (తె 8)

**అగ్గివొంపు** : లోహపు బొమ్మలకు మెరుగు పెట్టే నిమిత్తం వాటిలో వేసిన నిప్పుకణికలను బయటకు తీయడం (కో.4)

**అగ్గిసెగ**: పర్యా. కాపు. నిప్పుసెగ. లక్క బొమ్మల తయారీలో వాడే కొద్ది వేడి. (కో.12)

**అగ్నిద్రావకం** : పర్యా. మహాద్రావకం నత్రికామ్లం (Nitrc acid, $NO_3$) లోహపు వస్తువులకు మెరుగు పెట్టడానికి వాడే ఆమ్లం. (కో 39)

**అంకుడు కర్ర** : పర్యా. తెడ్లపాల, తెల్లపాల, పాలబరికి, పాలకర్ర, వనదంతం తెల్లగా మెత్తగా ఉండి బొమ్మల తయారీకి, చిన్న పనిముట్లు చేయటానికి పనికి వచ్చే కొయ్య. Wrightia tomentosa, Man (కో 11)

**అంగడి** · కొట్టు, దుకాణం (రా 10)

**అంగూర్ బేలు** · రేకులమీద శెకనం పని చేసి వేసిన ద్రాక్షతీగల, ఆకుల, పండ్ల డిజైన్ (తె 12)

**అచ్చం నలుపు** : ఆముదం దీపం పెట్టి, మండిగకు గుంటకలవరాకు పసరు పూసి, దీపం పొగ పట్టించి ఆ మసికి వేప బంగారం కలిపి, నీటిలో నానబెట్టి, చేత్తో మర్దించి, రంగరించి, తోలు బొమ్మలకు వేయటానికి తయారు చేసిన నలుపు రంగు (కో.15)

**అచ్చు** : పర్యా. మోల్డింగ్, మోల్డు

1. బొమ్మల రూపాల నమూనా. (కో 16,17,33, తె.12)

2. లోహం బొమ్మలకు రూపమిచ్చే మూస (కో 4)

3 లోహం పనిలో బొమ్మల ఆకారం నిరూపించే దిమ్మ. (తె 2)

**అచ్చుదిమ్మ** . మట్టి బొమ్మ నమూనా (కో 10)

**అచ్చుపడు** : దరియ పెట్టెలో అడుగున మసాలమన్ను, పైన రోజిన్‌మట్టి గరంచేసి పోసినప్పుడు మట్టికి పానం వచ్చి పుచ్చెను విడదీసిన తరువాత విగ్రహం రూపం కట్టు. (తె 2)

**అచ్చుపోగారు** : పర్యా అచ్చుసీర్నం, పువ్వచ్చు సీర్ణం కొయ్య బొమ్మల హారాల్లో పువ్వులు చెక్కటానికి వాడే పోగరు ఇది రూపంలో డిజైన్ చెక్కుతుంది (రా 4)

**అచ్చుసీర్నం** . చూ అచ్చుపోగారు. (రా 4)

**అంచు** : (ఉ అంసు) పర్యా. బోర్డరు, గోటు చివరి భాగం, కొస, కొన (కో 3,6,19,22,27,28; తె.1,2,4,6,10,12)

**అంచు(-కట్టు)** . పర్యా కట్టకట్టు, గట్టుకట్టు మట్టు మూసలోంచి బయటకి పోకుండా చుట్టూ గట్టుకట్టు (కో 17)

**అటుకులక్క** : పల్చగా ఉండేలక్క దీన్ని స్పిరిట్‌తో కలిపితే రంగు వస్తుంది. (తె 13)

**అట్ట (ముక్క)** : దళసరి కాగితం (కో.7,33,41 ,తె. 3,9,13; రా 13)

**అట్టెం (ఏయు)** : గుగ్గిలం గూనపెంకుల పొడి/ అటిక పొడి, మంచినూనె/మైనం, లక్క కలిపిన మిశ్రమం రేకులను కొయ్యకు అతికించటంలో వాడ్తారు. చూ చిత్రం-14 2. (తె 1,10,12,15, రా 11)

**అడపోయు (బోయు)** · వడపోయు (తె.4,7)

**అడిలి** కట్టెలమ్మే అంగడి (కో 23)

**అడివి చందనపు కొయ్య**: మంచం కోళ్ళు చేయటానికి వాడే కొయ్య. (కో 35)

**అడవిటేకు** మంచం, కుర్చీలు చేయటానికి వాడే కొయ్య. (కో 35)

**అడుక్కునేవాడు** . బిచ్చగాడు. (తె 9)

**అడుక్కొను** : బిచ్చమెత్తుకొను (తె 7)

**అడుగు** · 1 కింది భాగం. (కో 2,5,7,9,37,42, తె 1)

2 12 అంగుళాలు (కో 3, రా.6)

**అడుగు కప్పు** బిందె కింది భాగం (కో.4)

**అడుగు దిమ్మ** : పర్యా. బేస్‌మట్టం కొయ్యబొమ్మలు చేసేప్పుడు బొమ్మకు కింది భాగంలో ఆధారంగా ఉండే బల్ల (కో 16)

**అడుగు భాగం** కింది భాగం (కో 18)

**అడుగు రేకు** : బిందెలో కింది భాగం చూ చిత్రం-23 (కో.4)

**అడుగు షెట్ల** గవ్వ బొమ్మలు చేసేప్పుడు కింది స్టాండుకు వాడేగవ్వ (కో 5)

**అడ్డ**[1] : ఉత్తరాసి, అడ్డకమ్మి ద్వార బంధంపై చెక్క (రా.4)

**అడ్డ**[2] పర్యా తరణి, సంగడి కొయ్యబొమ్మల తయారీలో వాడే చేతియంత్రం చూ చిత్రం-6 (కో 12)

**అడ్డఊస** . అడ్డలో భాగం చూ చిత్రం-6 1, 6 1.3. (కో 12)

**అడ్డకన్నుపెట్నుమొల** . లోహం బొమ్మలు చేసేప్పుడు కన్ను మొదలైన చిన్న చిన్న ఖాళీలను సాపు చేయడానికి ఉపయోగించే పోగరు. (తె 12)

**అడ్డకర్ర** రంపం పిడి (తె 13)

**అడ్డకాయ** అడ్డలో భాగం చూ చిత్రం-6.VII

**అడ్డకొయ్య** పర్యా అడ్డగడ, అడ్డబొంగు తోలుబొమ్మలాటలో తెరకట్టడానికి వాడే కొయ్య (రా 2, కో 30)

**అడ్డగన్ను సుత్తె** · గుండ్రంగా వున్న రేకు మీద శెకనం చెక్కేప్పుడు, లేదా దాన్ని లోపలికి కొట్టడమో, లెవెల్ చెయ్యడమో చేసేప్పుడు రౌండ్ షేప్ చెడిపోకుండా కొట్టడానికి వాడే సుత్తి (తె.1,12)

**అడ్డదుక్క** : పర్యా లేతు. దుక్క అడ్డలో అడ్డసీకుకు రెండు వైపులా పట్టుకొని ఉండే చెక్క. (కో 11,12)

**అడ్డపని** కొయ్య, లక్క బొమ్మలను తయారు చెయ్యడం (కో 11)

**అడ్డపీట** అడ్డవారుని తిప్పే వాడు కూర్చునే పీట (కో.12)

**అడ్డపొట్టు** · అడ్డపనిలో కింద రాలిన చెక్కపొట్టు (కో,12)

**అడ్డబుర్ర** · అడ్డను తిప్పడానికి ఉపయోగించే కొయ్య తిప్పడంలో వడి, వేగం కోసం ఉంటుంది. దీన్ని బిళ్ల చెట్టు కర్రతో చేస్తారు (కో 11) చూ చిత్రం-6 I A

**అడ్డం** · కొయ్య పనిలో చెక్కను తోపుడుతో సమంగా చేసేప్పుడు చెక్క కదలకుండా ముందర ఉండే కొయ్య. (రా 3)

**అడ్డం కోరా** పర్యా సొకంకోరా చదునుగా వున్న రేకును నగిషీ చెక్కటానికి ఈ అడ్డం కోరాను రేకు కింద పెట్టి కొడతారు (కో 4, రా 5)

**అడ్డమాను** అడ్డలో భాగం చూ.చిత్రం-6 II (కో 4)

**అడ్డమొన.** అడ్డలో అడ్డ దుక్కకు అడ్డ బుర్రకు మధ్య ఉండే సన్నని ఇనుపరేకు (కో 12)

**అడ్డవూస** : పర్యా అడ్డసీకు అడ్డతిరగటానికి అడ్డవారుల తిప్పే సాధనం. (కో.11,12)

**అడ్డవారు:** అడ్డను తిప్పటానికి ఉపయోగించే తోలుతాడు. (కో.11)

**అడ్డు** . అడ్డం. (కో 6,33)

**అడ్డుకోతరంపం** : చెక్కని అడ్డంగా కోయటానికి వాడే రంపం. (కో.16)

**అణాఎత్తు** : రూపాయలో 16వ వంతు తూకం (బంగారం, వెండి తూచటానికి వాడతారు) (తె 8)

**అణిగేయు** : లోహపు సన్నతీగను వంచు (తె 8,12)

**అంటించు**: 1. అతికించు. (కో.19,34; తె.7,8,12,15; రా.5,6)

2. వెలిగించు (రా 10)

**అంటు(కొను)** : పర్యా. కమ్ముకొను 1 ముట్టుకొను. (తె 12; రా.5,9)

2 జిగురు. (తె.7)

**అంటు (పెట్టు)** : అతుకు పెట్టు, అతికించు. (తె 3,4,7)

**అండ** : 1. పాడుగాటి ఇత్తడి పాత్ర (కో 4)

2. లోహం బొమ్మలు చేసేప్పుడు మొదట మట్టిలో చేసే ఆకారం. (కో.1)

**అతికించు** : అంటించు. (కో.41; తె 4,7,8,13)

**అతికే రవ్వ** : లోహంపనిలో కింద రాలిన చిన్న చిన్న లోహం ముక్కలు. (తె.12)

**అతి పవ్వం కాయితం** : సున్నిత మైన కొయ్యబొమ్మలు సాపుచేయటానికి వాడే గరుకు కాయితం (కో 16)

**అతుకు** : తోలుబొమ్మలు చేసేప్పుడు రెండు భాగాలు దగ్గరకు చేర్చటం (కో.15)

**అత్రా**: గాజులు చేసేప్పుడు వంకర లేకుండా సరిచేయడానికి వాడే సాధనం. (తె 1)

**అత్తి కొయ్య** : కొయ్యబొమ్మలు చేయటానికి వాడేకొయ్య (కో 39,41)

**అతుకు గొట్టం** : పర్యా. కొడగొట్టం. వెండి వస్తువులు అతకటానికి దీపం మంటని ఊదే గొట్టం (కో.27)

**అద్దిలం** : పర్యా గడప్పచ్చ, అర్దులం, తేవుడి, పసుపురంగు, మిడిల్‌క్రీం. రంపంపొట్టి బొమ్మలకు వేసే "పసుపు రంగు" (కో 40)

**అద్దు** . 1 పూయు, చల్లు (కో 3; తె 12, రా 8,13)

2. లోహం బొమ్మలు చేసేప్పుడు దరియా పెట్టెలో అడుగున పుట్టమన్ను పైన రోజన మట్టి పోశాక విగ్రహాన్ని ఒత్తు అదుము (తె 12)

**అనారస్ తీగ** : కొయ్యపనిలో సింహద్వారాలపై చెక్కే డిజైన్ (రా.4)

**అనార్కలీ నెక్లేసు** : నెక్లేసుల్లో ఒక రకం. చూ చిత్రం-95. (కో 27)

**అనుభవం** . ఒకవృత్తిలో చాలా కాలం పని చెయ్యటం (కో.30)

**అనుసు** : తోలు బొమ్మలు చేసేప్పుడు తోలును కోయటానికి రంపికి పిడి కింద ఉండే రేకుతో చేసిన కట్టు (రా.10)

**అపోలో రాళ్ళనెక్లేసు** : నెక్లేసుల్లో ఒక రకం. చూ చిత్రం-96 (కో 27)

**అప్పరాగొలుసు** : ఎర్రరాళ్ళు మధ్యలో పెట్టి తయారుచేసే రోల్డ్‌గోల్డు గొలుసు (కో 33)

**అప్పడం మాదిరి** : కాగితం గుజ్జు బొమ్మలు చేసేప్పుడు మైదాపిండి ఉడికించి కాగితం పొడిని కలిపి ఆ ముద్దను అప్పడాల కర్రతో పల్చగా చేయడం. (కో.17)

**అప్పడాలకర్ర** . పర్యా. పూరీకర్ర అప్పడాలు ఒత్తే కర్ర (కో 17)

**అభినయం** : తోలుబొమ్మలాటలో కధకు తగ్గట్టు బొమ్మల్ని ఆడించటం (కో.15,30)

**అమర్చు** : ఏర్పాటు చేయు (కో 6,7,33, తె 8,11, రా 9)

**అమాస** రూపా అమావాసి అమావాస్య (రా.2,6)

**అమ్మోరి జాతర్లు** · దేవతలకు జరిగే ఉత్సవాలు. (కో.15)

**అంపకాగితం** : పర్యా ఉప్పుకాగితం, ఎమ్రీపేపరు, లేగ్‌మల్ కాగితం గరుకు కాగితం, చెక్కును నునుపు చెయ్యటానికి వాడేది. (కో.6)

**అంపు** · పర్యా పొన్ను, తొడి, అంచు ఉలి మొదలైన వాటికి

పిడికింద ఉండే రేకుకట్టు (తె 5,13)

**అరగదీయు** : లోహం పనిలో బొమ్మ మౌల్డింగ్ అయిన తర్వాత ఎక్కువ తక్కువ భాగాల్ని ఆకురాయితో సరిచేయు (తె.1)

**అరడు** : లోహంతో చేసే కొవ్వొత్తి స్టాండులో మట్టుపై భాగం. (తె 12)

**అరడు ఈశవ** : లోహంతో చేసే కొవ్వొత్తి స్టాండులోని మట్టు పైభాగం (అ డు) వెడల్పు. (తె.12)

**అరతులం** : తులంలో సగం. (తె 8)

**అరపాశం** · శిల్పం (రాతి) పనిలో ఉపయోగించే పరికరం. చూ.చిత్రం-163 (రా.5)

**అరపూస** : కొయ్య బొమ్మలు చేసేప్పుడు అడుగున వేసే అట్ట. (కో.27)

**అరపాను అట్ట** : కాగితం గుజ్జు బొమ్మలు చేసేప్పుడు అడుగున వేసేఅట్ట. (కో 27)

**అరల్‌డైట్** : మట్టి బొమ్మలు విరిగితే అతికించటానికి వాడే జిగురు (రా 9)

**అరవంకీ** : ఒక రకం ఆభరణం చూ.చిత్రం-71

**అరిగి పోవు** : కొయ్య బొమ్మలకు వేసే రంగు పోవటం (తె 7)

**అరించి** : అంగుళంలో సగం. (రా.4)

**అరించి ఆకురాయి** : కొయ్యపనిలో బొమ్మను సాపు చేయడానికి వాడే పరికరం. (రా.4)

**అరుగు** · వెండి వస్తువులకి సముద్రం ఇసకతో మెరుగు పెట్టేప్పుడు ఇసక మెత్తబడు (తె 15)

**అర్చి** : 1 కిరీటానికి వెనక ఉండే భాగం. (రా 8)

2 లతలని ఎక్కించట్టం (సాకించటం) కోసం ఇనప ఊసలతో చేసిన ఒక ఆకారం. (రా.13)

**అర్ధ** : ఎనిమిది అణాలు. బంగారాన్ని కొలిచే తూకం. (తె 8)

**అర్ధచంద్రాకారం** : లోహం పనిలో విగ్రహాలకు కనుబొమలు చెక్కే ఆకారం. (తె.12)

**అర్ధరూపకం** : తోలు బొమ్మలాటలో మృదంగం మీద వాయించే తాళం (రా 2)

**అలంకరణ** . మట్టి సుద్ద బొమ్మలకు ఆభరణాలతో చక్కగా రూపుదిద్దిటం. (కో 17)

**అలుక్కు పోవు** : తోలుబొమ్మలకు వేసిన రంగులన్నీ కలిసి పోవు. (కో 30)

**అలుగు** 1 తోపుడులో చెక్కటానికి పెట్టే ఉక్కు బ్లేడు. (కో 41, రా.4,5,6,8)

2 బర్మాకు చివర చిల్లులు పెట్టటానికి ఉండే సన్నని ఇనుప ఊస (కో.6,16,31,39)

3 కొయ్యబొమ్మల్ని చెక్కటానికి వాడే పరికరం. (రా 3)

4 మట్టి బొమ్మకి కళ్ళు, ముక్కు మొదలైన భాగాలు చెక్కటానికి వాడే పరికరం (కో 17)

**అల్లిక** : పర్యా ఎల్లకం వెండి, బంగారం గొలుసులు చేసేప్పుడు సన్నని తీగను చేతితో నేయటం (కో 33)

**అల్లిక గొలుసు** . ఒక రకం ఆభరణం చూ.చిత్రం-86

**అల్యూమినియం రింగు** . రాళ్ళగాజులు చేసేప్పుడు మొదట లక్కతో చేసిన గాజు వంగకుండా లక్కగాజుని వేడి చేసి లోపల పెట్టే వలయం (తె 1)

**అల్యూమినియం రివిట్** : చేతికర్రల పిడికి చేసే డిజైన్లలో ఏనుగు, చేప, మొదలైనవాని కళ్ళు పెట్టడానికి వాడే అతుకు (కో 23)

**అవనద్ధం** గట్టిగ బిగించిన తోలు కదలికవల్లనో, లోహం కదలికవల్లనో, కర్రలు ఒక దానికొకటి చేర్చటంలోనో కలిగే శబ్దం (రా 5)

**అవయవం** . శరీరంలో భాగం (కో 1,31,33,39)

**అవుట్ ఆర్మ్స్(బ)** : పత్తి, చిట్ట బొమ్మలు చేసేప్పుడు విడిగా బయటికి ఉండే చేతులు (రా.7)

**అవుట్‌లయను** : కొయ్య బొమ్మలు చేసేప్పుడు కొయ్యని

కోయటానికి పెట్టిన గుర్తు (రా 5)

**అవుసలోడు** బంగారం, వెండిపని చేసేవాడు (తె 8)

**అష్టిమి** · అష్టమి తోలుబొమ్మలాటకి అశుభకరమైన రోజు. (రా 2)

**అసలు రంగు** : కొయ్యబొమ్మలలో చెక్కకున్న సహజమైన ఛాయ (కో.16)

**అస్తర్ కలర్** నిర్మల్ బొమ్మలకి వేసే రంగు (తె 4)

**అస్తర్ మన్ను** · లోహం బొమ్మలు చేసేప్పుడు బొమ్మ సాపుగ రావటానికి బొమ్మమీద వేసేమట్టి (తె 1)

**అస్తరకారి** . సుద్దమట్టి దీన్ని కొయ్యబొమ్మలకి వేసిన మక్కు పగిలిపోకుండా బట్టపొరవేసి దానిమీద పూస్తారు. (తె 1)

## ఆ

**ఆకారం** : పర్యా రూపం నమూనా. (కో.1,6,8,13,16,27, 31,32,33,41; తె.1,7,14; రా.4,8,11)

**ఆకారం తీయు** . చేతికర్రలు, కొయ్య బొమ్మలు చేసేప్పుడు కొయ్యని అనుకున్న రూపంలోకి మలచు (కో 23, రా 4)

**ఆకాశ దీపాలు** పర్యా గోపుర కలశాలు దేవాలయం గోపురాల చివర ఉండే కలశం (కో.33)

**ఆకుతీగ** . పర్యా బేలు కొయ్యపనిలో, బంగారం పనిలో చేసే లతల డిజైన్. (తె.1,6,8, రా 4)

**ఆకు తీగల శెకనం** : కొయ్యపనిలో లతల డిజైన్ చెక్కటం (=శెకనం) (తె 13)

**ఆకుపచ్చ** పర్యా చిలకపచ్చ, విలిడియన్‌గ్రీన్ బొమ్మలకు వేసే రంగు (కో.1,26,28, తె 1,4,7,9, రా 8)

**ఆకురాయి** . పర్యా గురువిందం రాయి, పాలిష్ స్టోన్, సానరాయి, సానరౌతు. ఇనపపనిముట్లు పదును పెట్టడానికి, ఇనుపవస్తువుల్ని, రంపం పొట్టు బొమ్మల్ని, కొయ్యబొమ్మల్ని, లోహం బొమ్మల్ని, సాపుచేయడానికి వాడేది చూ చిత్రం-106, 106 2 (కో 1,4,7,8,10, 12,27, తె 1,2,3,4,5,6,7,8,9,12,13, రా 4,8)

**ఆకురాయిపళ్ళు** ఆకురాయికి ఉండే చిన్నచిన్న మొనలు (తె 13)

**ఆక్సాబ్లేడు** · లోహం బొమ్మల రూపం సరిచేయడానికి వాడే పదునైన సాధనం (కో 28)

**ఆఖరు** చివర (రా 11)

**ఆగరు** · కొయ్యబొమ్మలు చేసేప్పుడు కొయ్యకు చిల్లులు పెట్టడానికి వాడే పరికరం (కో 39)

**ఆగు** పర్యా వాగు. కాలువ (తె 4)

**ఆచార్లు** . వడ్రంగులు, విశ్వబ్రాహ్మణులు. (రా.4)

**ఆట్‌ఫైల్‌మెట్లు** ఎనిమిది మూతుల మెట్లు నమూనా చేతికర్రలలో ఒకరకం (తె 5)

**ఆట** . తోలుబొమ్మలాట (కో 37, తె 7)

**ఆడించు** . 1 రంపంపొట్టు బొమ్మలకి, కొయ్య బొమ్మలకి, పూసే ముక్కు చేయటానికి చింతగింజలని మిషనులో పొడిగా చేయు (కో 19,40)

2 బర్మాని కొయ్యమీద పెట్టి చిల్లులు చేయడానికి తిప్పు (రా 4)

3 తోలు బొమ్మల్ని కదలించు. (రా 10)

**ఆడించేఊతపుల్ల** . తోలు బొమ్మల్ని ఆడించటానికి వాడేపుల్ల చూ చిత్రం-10 1.1. (రా.4)

**ఆడించే బొమ్మ** తోలు బొమ్మలాటలో చేతులు, కాళ్ళు కదలించే బొమ్మ (కో 30)

**ఆడు** 1 వాడు (తె.6)

2. తోలు బొమ్మల్ని కదలించు (కో 7)

**ఆది** . చేయవలసిన కొలత (కో 33)

**ఆన్** : యంత్రం తిరగటానికి స్విచ్ నొక్కటం (రా 11)

**ఆనర్** : తరువాత (కో 7)

**ఆను** : మోపు, తోలు బొమ్మ తెరమీద పూర్తిగా నిలుపు (కో 7, రా 3,5,10)

**ఆనైక్కాలు** : ఏనుగుకాలు (రా 5)

**ఆపు** : తోపుడులో అలుగుకి, మెరికి ముందు పెట్టే కొయ్యముక్క (కో 41; రా 4,5)

**ఆపెలు** రాతిపనిలో శిలను తొలవటానికి ఉపయోగించే సాధనం. చూ.చిత్రం-162. (రా 1)

**ఆఫ్‌కో వైట్ పెయింట్స్** : కాగితం గుజ్జు బొమ్మలకి వేసే రంగు (కో 41)

**ఆఫ్‌రౌండ్ ఆకురాయి** : బంగారం, వెండి పనిలో ఉపయోగించే పరికరం గుండ్రంగా ఉన్న వస్తువుని సాపుచేయడానికి వాడతారు (తె 8)

**ఆలిరంగు** · కొండపల్లి బొమ్మలకి వేసే పిట్టమార్కు నీలంరంగు (కో 26)

**ఆభరణం** · పర్యా సొమ్ము అలంకారానికి ధరించే నగ (కో 28,41, తె 12, రా.1,8)

**ఆముదం** : 1 అడ్డమునపై సులువుగా తిరగటానికి పూసే చమురు. (కో 12)

2. లోహం పనిలో ముందు బొమ్మచేయడానికి వాడే మైనం తయారీలో గుగ్గిలం తేనెమైనంలో కలిపే ద్రవ్యం. (తె 3)

**ఆముదం దీపాలు** : తోలు బొమ్మలాటలో వెలిగించే ప్రమిదలు చూ చిత్రం-9 6. (రా 4)

**ఆయిలు** : నూనె. చమురు (కో 7, తె 12, రా 5)

**ఆయిల్ ఫినిషింగ్** వస్తువుకు, బొమ్మకు మెరుపు రావటానికి ఆఖర్న నూనె పెట్టడం (తె 1)

**ఆయుర్వేదం మందు** · వనమూలికలతో తయారయ్యే మందు / ఔషధం (కో 32)

**ఆరగొట్టు** పర్యా ఆరేయు, ఎండబెట్టు. తోలు బొమ్మలకి రంగులు వేసే ఎండబెట్టు (రా 10)

**ఆరదీయు** . పర్యా ఆరపోయు, ఎండిపోవు, ఆరబెట్టు ఎండబెట్టు (రా 2)

**ఆరపోయు** చూ. ఆరదీయు (కో 17)

**ఆరబెట్టు** . ఎండతగలకుండా గాలిలో మాత్రమే పెట్టడం చూ. ఆరదీయు (కో 5,7,13,27,42)

**ఆరా** పర్యా రంపం కొయ్యని కోయడానికి వాడే రంపం. (తె 13)

**ఆరాకష్‌వాళ్ళు** . రంపంతో మొద్దుల్ని కోసే వృత్తివాళ్ళు (తె 13)

**ఆరిపోవు** ఎండిపోవు (తె 11, రా 8,13)

**ఆరించుల ఆకురాయి** : కొయ్య బొమ్మలు సాపుచేయడానికి వాడే పరికరం (తె 4)

**ఆరు** · బాడితె, ఉలి, కోతరేకులలో భాగం చూ.చిత్రం-104 3, 105 2, 107 1 (తె 13)

**ఆరె** తోలు బొమ్మలు చేసేప్పుడు తోలుని శుభ్రం చేయడానికి, తోలుకి ఇంకా అంటుకొని ఉన్న మాంసాన్ని తీసేయడానికి వాడే పరికరం పర్యా కత్తి, సూరకత్తి, రంపి, చాకు (రా 10)

**ఆరేయు** : చూ.ఆరగొట్టు చర్మాన్ని ఎండలో పెట్టు (కో 30; రా 11)

**ఆర్డర్** . కావల్సిన వస్తువులు చెయ్యమని ముందుగా చెప్పడం (కో 20,26,42, తె 11,13, రా 4,5)

**ఆర్యకాపు** : బొందిలి కులం తోలుబొమ్మలాటవారి కులం (కో 37, రా.2)

**ఆర్యక్షత్రియ** . పర్యా నకాష్, నకాషి ఒకజాతి (కో 13)

**ఆర్యబొందు** ఒకజాతికి, కులానికి చెందిన వారు తోలుబొమ్మలు తయారు చేసేవారు (కో 15,15)

**ఆర్యమరాఠీ** . ఒకజాతి తోలుబొమ్మలాట ఆడేవారు. (రా 13)

**ఆల్కహాల్** · మత్తుపానీయం (కో 33)

**అవుకొమ్ము**. కొమ్ము దంతం పనిలో వాడేది (కో.9; తె.5)

**అవుచర్మం** · అడ్డవారులోని తోలు భాగం చేయటానికి వాడేది (కో.5,12)

**అవుదం** · ఆముదం (కో 8)

**అవుమార్కు** · తోలుబొమ్మలకి వేసే రంగులో రకం (కో 37)

**అస్మాన్**. కర్ర బొమ్మలకు వేసే ఆకాశం రంగు (తె 4)

## ఇ

**ఇగురు** : చూ ఆరు. ఆరటం, ఎండిపోవడం (కో 1,2)

**ఇగ్గు** తోలుమీద బొమ్మవేసేప్పుడు ముందు చర్మం నాలుగు వైపులకు లాగు (రా 11)

**ఇంచి** : అంగుళం (కో 1,3,39, తె 4,7,12, రా 5)

**ఇంజక్షన్ మోల్డింగ్ మిషన్** : ప్లాస్టిక్‌తో నమూనాలు తయారుచేసే యంత్రం (తె 1)

**ఇటక మట్టి** శెకనం పనిలో అట్టెం చేయడానికి గుగ్గిలం, నూనెలో కలిపే ఇటుకపొడి (తె.12)

**ఇటుకపొడి** : చూ ఇటుకమట్టి (కో 28; తె.1)

**ఇటుక పొడి రంగు** · పర్యా ఇటుక రంగు (కో.7,17) తోలు బొమ్మలకి వేసే ఎరుపురంగు (కో 30)

**ఇటుక రాయి బట్టీ** : పచ్చి ఇటుకలు కాల్చడానికి పేర్చిన బట్టీ. (కో 27)

**ఇడగొట్టు** : పర్యా. వేరుచేయు, విడదీయు. అతికిన భాగాలను రెండుగ విడదీయు (కో.27)

**ఇడిబొమ్మ** : విడిగా ఉండే బొమ్మ (రా.4)

**ఇంటికప్పు**. పర్యా. ఇంటిటాపు ఇంటి పైభాగం (కో 26)

**ఇంటి కర్ర** : తొరపణాన్ని తిప్పటానికి ఉపయోగించే కర్ర. చూ చిత్రం-174. (కో 9,6)

**ఇత్తడి** : లోహం. రాగిలో సత్తు కలిపి చేస్తారు. (కో 4,6,7,28,37, తె 1,2,3,10,12, రా.5,11)

**ఇత్తడి గిన్నె** : ఇత్తడితో చేసిన పాత్ర (కో 28)

**ఇత్తడి తొట్టి** : లోహంపనిలో మన్ను కలపడానికి. విగ్రహాల్ని చల్లార్చడానికి నీరుపోసే ఇత్తడి పాత్ర (తె 12)

**ఇత్తడి పల్లెం** : ఇత్తడి లోహంతో చేసిన వెడల్పు పాత్ర (కో 33)

**ఇత్తడి పాత్ర** : ఇత్తడితో చేసిన గిన్నె. (తె 10,12)

**ఇత్తడి పొన్ను** : గాడిదూగోడలో ఇత్తడి పట్టా ఉన్న భాగం. (తె.13)

**ఇత్తడి పోగు** ఫిలిగ్రీ పనిలో వాడే సన్నని ఇత్తడి తీగ. (కో.33)

**ఇత్తడి బ్రష్** వెండి, ఇత్తడి వస్తువులు శుభ్రం చేయడానికి సన్నని ఇత్తడి తీగలతో చేసిన కుంచె (కో 33, తె 1, 8,10)

**ఇత్తడి రేకు** · లోహపు వాహనాలు చేయటానికి, బొమ్మలు వేయటానికి ఉపయోగించే రేకు (కో.31, తె 12, రా 11)

**ఇన్‌కటింగ్ మిషను**. రోల్డుగోల్డు వస్తువులు చేసేప్పుడు డిజైన్లలో భాగంగా చిల్లులు చేయటానికి వాడే యంత్రం (కో 33)

**ఇనప ఊస** · 1 కాగితం గుజ్జు బొమ్మలకు ఆభరణాలు చెక్కటానికి ఉపయోగించే అలుగులు చేయడానికి వాడే కడ్డీ (కో 17)

2 కొండపల్లి బొమ్మలు చేసేప్పుడు బొమ్మలు సాపు రావటానికి ఉపయోగించే ఆకురాయి చేయడానికి వాడే కడ్డీ (కో 26)

**ఇనపకట్టర్**. లోహపు వస్తువుల్ని కత్తిరించటానికి వాడే సాధనం (కో 33)

**ఇనపకత్తి** : 1 కర్రలను నరకటానికి వాడే కత్తి. (కో.23)

2 చేతి కర్రల తయారీలో కర్రకు అమర్చే కత్తి చూ.చిత్రం-22 (కో.27)

**ఇనపకత్తెర** : చూ ఇనప కట్టర్ (కో.28)

**ఇనప కంట్రాణి** . కొయ్యకు బెజ్జాలు చేయడానికి వాడే సాధనం. (కో.26)

**ఇనప గుళిక** : వెండి పనిలో నగిషీ వస్తువులు చేసి మెరుగు రావటానికి పాలిష్ మిషన్‌లో వేసే గుండు. ఈ పాలిష్ మిషన్ తొట్టి మాదిరిగా ఉంటుంది. ఇందులో నీళ్ళు, సబ్బు, సల్ఫరు, ఇనపగుళికలు, వెండి నగిషీ వస్తువులు, వేసి మిషను తిప్పితే సబ్బు నురగలో వస్తువులు, ఇనప గుళికలు రాసుకోవటం వలన వెండి వస్తువులకి మెరుగు వస్తుంది (కో 27)

**ఇనప గొట్టం** : లోహం పనిలో పంకా తిప్పితే వచ్చే గాలి మఠి పొయ్యిలోకి రావటానికి ఉపయోగపడే గొట్టం. (కో.8)

**ఇనప గోరుగోలు** : తోలు బొమ్మలు చేసేప్పుడు బొమ్మలకి ఆభరణాల డిజైన్లు గీయటానికి వాడేది (కో 30)

**ఇనప తవ్వ** : ఇనప రింగు. (కో.7)

**ఇనప తీగ** : ఇనుములో తయారుచేసినసన్నని కడ్డీ _(కో.27)

**ఇనప తొడి** : అడ్డ ఊసలో భాగం చూ చిత్రం-6 1 2 (కో.11,12)

**ప దిమ్మె** : పర్యా ఇనప పట్టెడ, పట్టెడ మొద్దు, మొద్దు పట్టెడ, కింది పట్టెడ. లోహం పనిలో వస్తువుల్ని పోగర్లతో కత్తిరించటానికి అడుగున పెట్టే పెద్ద ఇనప దుంగ. (కో 33)

**ఇనపపట్టీ** : లోహం పనిలో అచ్చుని మోల్డింగ్ నుండి పైకి తీయడానికి వాడే ఇనప బద్ద. (తె 1)

**ఇనప పట్టెడ** : రూపా. ఇనప పట్టెడి చూ. ఇనపదిమ్మె. ఇనపదిమ్మె వెండితీగ చిన్న రింగులుగా రావటానికి దీనిమీద పెట్టి శానంతో కొడతారు. (కో 27)

**ఇనపపోగర్** : లోహం పనిలో పోతపోసిన లక్కకు అతికిన ఇత్తడి రేకుకి డిజైన్లు చెక్కటానికి వాడే సాధనం. (కో.28)

**ఇనప బొచ్చె** : ఇనుముతో తయారైన వెడల్పాటి పాత్ర. (కో 28)

**ఇనప ముక్క** : కొయ్యపనిలో బొమ్మలు చేయటానికి వాడే పనిముట్లు చేయటానికి ఉపయోగించే రేకు (తె.13)

**ఇనపమొల** : 1 లోహం పనిలో ఇత్తడి నగిషీ చెక్కటానికి వాడే పరికరం (తె.10)

2 అడ్డఊసలో భాగం చూ చిత్రం-6.I.5 (కో 11,12)

**ఇనపరింగు** : ఇనుముతో చేసిన గుండ్రని రేకు (కో.5, తె 2)

**ఇనపసీకు** : రూపా ఇనపసేగు పర్యా పట్టాముక్క కారవాయిలో ఉండే ఇనపకడ్డీ. (తె 10)

**ఇనపసుత్తి** · ఇనుముతో చేసిన సుత్తి. (కో.16,34)

**ఇనపసువ్వ** : ఇనపతీగ (కో.23)

**ఇనపస్కేలు** . పర్యా. కొలబద్ద కొలతలు కొలవడానికి ఉపయోగించే సాధనం (తె 1)

**ఇనప వస్తువు** : ఇనుములో తయారైన పరికరం (కో.16)

**ఇనుపఅంను** : పర్యా. ఇనుప పన్ను, కట్టు ఇనుప కట్టు. పక్క దూగోడా పైనా, కిందా ఉంటుంది చేతి బర్మాకు ఉండే ఇనుపపట్టీ. (తె 12,13)

**ఇనుప ఆకురాయి** : కొయ్య చెంచాలు నునుపు చేయడానికి వాడే పరికరం (కో 35)

**ఇనుపకట్టు** : చూ ఇనుప అంను (తె 12)

**ఇనుప డ్రిల్లు** : లోహం పనిలో ముందు మైనంతో విగ్రహం చేసి దానిపైన వండ్రుమట్టి పూసి పైన చుట్టే ఇనప తీగ (కో 18)

**ఇనుప ఫంతి** : ఇనుపతీగ (రా.11)

**ఇనుప పూస** : గజ్జెలలో ధ్వని రావటానికి వేసే ఇనుపగుండు. (రా 10)

**ఇనుపముక్కు** . బర్మా చివర ఉండే ఇనుప బ్లేడ్ (రా 4)

**ఇనుపముల్లు**: తొరపణం బరమాలో భాగం చూ.చిత్రం-175.A (కో.8)

**ఇనుపరేకు** : రంపం చేయడానికి వాడేది (కో.12,29)

**ఇనుపసీల** : ఇనుప మేకు. (కో 35)

**ఇనుమద్ది** . కొయ్య గూటం చేయడానికి వాడే కొయ్య (కో 34)

**ఇనుము** : లోహం. (కో.5,7,29, తె.2,8, రా.4,5,6,13)

**ఇన్నర్ ఆర్ట్సు** : పత్తి, బట్ట బొమ్మలు. (రా.7)

**ఇప్ప** : విప్పకొయ్య. (రా 5,6)

**ఇముడు** : సరిపోవు. (తె 12)

**ఇరణాక్షి** · ఒక జానపద దేవత (రంపం పొట్టు బొమ్మ). (తె 9)

**ఇరుగు** : విరిగిపోవు. (కో.16, తె.12; రా 4,5,6)

**ఇరుపార్శ్వం** : తోలు బొమ్మలకు కిందా, పైనా (రా.2)

**ఇరుసు** : ఒకవైపు గుండ్రంగా ఒకవైపు గుంటగా ఉండి లోహం రేకుకి డిజైన్లు చెక్కటానికి వాడే సాధనం (తె 12)

**ఇలాచీ** . ఏలక్కాయి నిర్మల్ బొమ్మలు చేసేవాళ్ళు కొయ్యతో చేస్తారు. (తె 4)

**ఇల్లెత్తు** : గొండోళ్ళు అడుక్కునేటప్పుడు వారి దగ్గరుండే 'ఎల్లమ్మ' బొమ్మ ఉండే ఎత్తు (ఇల్లు అంత ఎత్తు) (తె.7)

**ఇసక** : రూపా. ఇసుక (రా.13), ఉసికె (తె.15). మట్టి బొమ్మలు చేసేప్పుడు ఊకతో కలిపే మట్టి (తె.12, రా 13)

**ఇసుకమెరుగు** : వెండి వస్తువులని ఇసకతో తోమితే వచ్చే మెరుపు. (తె.15)

**ఇసురురాయి** : పర్యా. తిరగలి రాయి. పిండిని చేయటానికి వాడే తిరగలి రాయి. (తె.15)

**ఇస్త్రీబొగ్గులు** : గాజుల పనిలో గాజువేడి చేయటానికి పొయ్యిలో వేసే బొగ్గులు (తె 1)



**ఈక** : పక్షులకి తోక చివర ఉండే వెంట్రుక. (తె.1)

**ఈకల డిజైన్** : కొయ్యపనిలో చేసే ఒక రకం నగిషీ పని (రా.4)

**ఈత** : ఒక చెట్టు పేరు (కో.7)

**ఈతపుల్ల** : పర్యా ఈత రువ్వ (కో.15), ఈతమట్ట (రా.13), ఈతబర్ర (రా 10,11), ఈత చెట్టు పుల్ల తోలుబొమ్మలు కదల్చటానికి కట్టే ఈతదబ్బ, కణితపుల్ల (కో 30,37)

**ఈతముల్లు** : ఈతచెట్టు ముల్లు. తోలుబొమ్మ లాటలో బొమ్మల్ని తెరకు గుచ్చటానికి ఉపయోగిస్తారు (కో 15)

**ఈరగోల** . వొగ్గు కథ చెప్పేప్పుడు దేవుణ్ణి పెయి మీదకు తెప్పించినప్పటి ఏసంలో చేతిలో వుండే కొరడా మాదిరి కర్ర. (తె.1)

**ఈశన** . వెడల్పు. (తె.12)



**ఉక్కు(తీగ)** . అకురాయి చెయ్యడానికి వాడే తీగ. (కో.23)

**ఉక్కు వంకీ** : కొయ్య పనిలో చంచాగుంత నునుపు చెయ్యడానికి వాడే వంపుకర్ర. చూ.చిత్రం-178 (కో 35)

**ఉక్కుసేనం** : కొయ్యని చీల్చడానికి వాడే సేనం. (కో.35)

**ఉగ్గు బల్ల** : అడ్డలో భాగం చూ.చిత్రం-6.V (కో 12)

**ఉంగరం** · చేతివేళ్ళకి పెట్టుకునే ఆభరణం. (కో 3,33)

**ఉజ్జాయింపు** : సుమారు. (కో.33,41; తె.11)

**ఉడక(పెట్టు)** . పర్యా. ఉడికించు, వంటచేయు. పొయ్యి మీద కాచు (కో 7,13,17,28,29,41,42;తె 1,2,3,

4,9, రా 5,11,13)

**ఉడుకు(చేయు,పెట్టు)** · బాగా వేడి చేయటం (కో 7, తె.8,12)

**ఉడుకునీళ్ళు** : పర్యా ఏడినీళ్ళు, వేడినీళ్ళు తోలుబొమ్మలు చేసేప్పుడు మొదట తోలుని శుభ్రం చేయటానికి బాగా కాచిన నీళ్ళు (కో 37, రా 2,10)

**ఉండం** . లోహం పనిలో రేకుని షేపు చేయడానికి ఉపయోగించే ఇనపదిమ్మ (తె 12)

**ఉప్పు** : 1 జంతువుల చర్మం వాసన రాకుండా నిలవ ఉంచేప్పుడు తోలుమీద పూసే ద్రవ్యం (రా 2)

2 లోహం పనిలో వెండిని కరిగించేప్పుడు నీళ్ళలో వేసే ద్రవ్యం (కో 7)

**ఉప్పు కాయిదం** . రూపా ఉప్పు కాయితం, ఉప్పు కాగితం పర్యా. కరాజా కాగితం, గరుకుకాయితం, మెరుగు కాగితం చూ అంస కాగితం. కొయ్య వస్తువులు నునుపు రావటానికి వాడేది (కో.41, తె 1,4,5,13, రా 4,5,6)

**ఉప్పురాయ** ఉప్పుగల్లు (రా 3,6)

**ఉబికివచ్చు** : లోహం పనిలో రేకుమీద చెక్కేఎత్తు (ఉబ్బు) భాగం స్పష్టంగా కనిపించు. (తె 12)

**ఉబ్బిబండ** : తోలు ఎక్కువసేపు ద్రావకం నీటిలో నానితే మందంగ అవటం (కో 30)

**ఉబ్బు(చేయు)** · 1 లోహం పనిలో విగ్రహాలకి పైని ఎత్తుగ వచ్చిన భాగం (కో 30)

2. పర్యా బొద్దు కొయ్య పని. దంతం పనిలో బొమ్మలు ఎత్తులు వచ్చేటట్లు చెక్కిన భాగం (కో 9,11,12,28,29, తె 1,2,7,9,12,13,15; రా 11)

**ఉబ్బెత్తు(పని)** · ఎంబోజ్‌వర్క్ లోహం పనిలో రంధ్రాలు లేకుండా పలకల మీద చెక్కడం చేయడం ఉదా· ఫ్లవర్‌వాజ్‌లు, పూలతొట్లు మధ్యభాగం ఉబ్బుగ ఉండేటట్లు చేసేపని (తె 12)

**ఉత్సవం** పర్యా సంబరం వేడుక ఆనందంతో చేసుకునే పండుగ (కో 13,33)

**ఉలి** · పర్యా చిన్న క్షాణం కొయ్య బొమ్మల్ని చెక్కడానికి వాడే సాధనం చూ.చిత్రం-105 (కో.7,11,13,16,25, 28,30,31,32,33,35, తె 1,4,6,13; రా 1,3,4,5,8,13)

**ఉలి తయారి** . ఉలిని చెయ్యటం (రా 5)

**ఉలిపట్టు** : పట్టుకారుకి చివరన వస్తువుల్ని పట్టుకోడానికి ఉండే భాగం (రా 5)

## ఊ

**ఊక** వరిపొట్టు. మట్టి బొమ్మల తయారీలో మట్టి గడ్డికి అంటుకోవడానికి మట్టిలో కలుపుతారు (కో 10)

**ఊకకాల్చిన బూడిద** · వరిపొట్టుకాల్చితే వచ్చే పొడి మట్టి బొమ్మల తయారీలో మట్టిలో కలుపుతారు (కో.27)

**ఊడివచ్చు** : కాగితం గుజ్జు / మట్టి బొమ్మలు విడివడు. (కో 27)

**ఊడు** పర్యా ఊసు విడిపోవు సున్నం పెడితే చర్మానికున్న వెంట్రుకలు రాలిపోవు (కో 20,37, తె.3)

**ఊత్త** . ఒక రకం గవ్వ చూ చిత్రం-35 (రా 5)

**ఊను** · కొయ్య బొమ్మలు చేసేప్పుడు ముందుకొయ్యమీద పెన్సిల్‌తో గుర్తు పెట్టుకొని దానిమీద శీర్ణంతో చెక్కు. (రా.3,5,6)

**ఊపిరి తిత్తి** . మనిషి గాలి పీల్చడానికి ఉపయోగపడేది. కొమ్ము బొమ్మలు చేసేప్పుడు కొమ్ముల బోలులోని దుమ్ము లోపలికి పోతే ఊపిరి తిత్తులు పాడైపోతాయి. (తె 5)

**ఊస** . ఇనపకడ్డీ బుక్కారు పట్టుకునేందుకు ఉండే కడ్డీ. (కో 8)

**ఊసతొలి** అడ్డలో భాగం చూ చిత్రం-6 II 1 (కో 12)

**ఊసల కారు** : పిడకల్లో వేడిచేసిన మూస పట్టుకోటానికి

వాడే పరికరం (కో 8)

**ఊసివచ్చు** : రూపా ఊసొచ్చు ఊడివచ్చు (తె 2,8)

# ఎ

**ఎక్కతక్క** : ఎక్కువ తక్కువ (తె.1,3)

**ఎక్కువ** : చేతికడ్రలు చేసేప్పుడు పిడి అతికించటానికి వాడే లక్కను కరిగించటానికి ఉపయోగించే పాలెలో ఒక వైపు ఎత్తుగ ఉండటం (కో.8)

**ఎక్సుపోర్టు** · కొయ్య బొమ్మలు (ఏవైనా వస్తువులు) ఇతర దేశాలకి పంపించడం (కో.రా)

**ఎగిరిపోవు** · కొయ్యమీద డిజైనులు చెక్కేప్పుడు సుత్తితో గట్టిగ కొడితే కొయ్య విరిగి బయటకు పోవు (కో 34)

**ఎగుడు** : కొయ్య బొమ్మలు చేసేప్పుడు వాడే కొయ్య ముందు సమానంగా లేక ఎత్తుగా ఉండటం. (రా.6)

**ఎగుడు దిగుడు** : 1. కొయ్య బొమ్మలకు వాడే చెక్కలు ముందు ఎత్తు పల్లాలుగా ఉండటం (కో 35, రా.3)

2 పోతపోసిన విగ్రహం ఎత్తుపల్లాలుగా ఉండటం. (రా 5)

**ఎచ్చుతగ్గు** : చూ ఎగుడు దిగుడు. లేసు అల్లికలో ఎగుడు దిగుడు (కో 17,21,30,33; తె 14)

**ఎడం**. కొయ్య బొమ్మల తయారీలో బొమ్మల మధ్య జాగా (రా 5)

**ఎడశీర్ణం** : కొయ్య బొమ్మలు చేసేప్పుడు బొమ్మ ఆకారాన్ని ముందు (రఫ్)గా తీయటానికి వాడే పరికరం (కో 41, రా 3,5)

**ఎడ్లబండి** . కొయ్యల్ని నరికించి తీసుక రావటానికి ఉపయోగించే ఎద్దులు లాగే బండి (కో 6)

**ఎంటిక** : 1 రంపం పొట్టు బొమ్మలకు రంగులు వేయటానికి వాడే కుంచెలు చేయడానికి వాడే మేకతోక వెంట్రుక (తె.9)

2. పర్యా వెంట్రుక. నిర్మల్ బొమ్మలకు రంగులు వేసేప్పుడు వాడే కుంచెకు ఉండే ఉడుత వెంట్రుక (తె 4)

**ఎంటిక మందం** : పర్యా. ఎంటిక సన్నం వెండి తీగ పనిలో వాడే వెండితీగ ఉండేలావు (తె 8)

**ఎండ** పేపరు మట్టి బొమ్మలు బాగా ఆరటం (కో 41)

**ఎండగట్టు** : పర్యా ఎండవెట్టు.

1 తోలు బొమ్మలకి వాడే చర్మం ముందు శుభ్రం చేసి ఆరబెట్టు (రా 2)

2 చూ ఆరగొట్టు కొమ్ము బొమ్మల తయారీలో వాడే కొమ్ము పచ్చి ఆరే వరకు ఆరపెట్టు (కో 1)

**ఎండి** వెండి (తె.12)

**ఎండితీగ** వెండి తీగ తీగపనిలో వాడతారు (తె 8)

**ఎండిపొడి** . వెండి తీగపనిలో రాలిన వెండి రవ్వ (తె.8)

**ఎండిబిల్ల** నిర్మల్ బొమ్మల వారికి బహుమతిగ ఇచ్చిన వెండి పతకం (తె 4)

**ఎండిన** కొయ్యపనిలో వాడే బాగా ఆరిన కొయ్య (కో 19)

**ఎల్తుర** : తోలుబొమ్మ లాటలో వాడే ప్రమిద దీపం వెలుతురు (రా2)

**ఎత్తుపల్లాలు** పర్యా ఎత్తులు వంపులు (తె 1)

చూ. ఎగుడు దిగుడు (కో.31,16, రా 11)

**ఎత్తులు గుంటలు** లోహం బొమ్మలో ఉండే ఎత్తు పల్లాలు (తె 1)

**ఎదర చెక్కు** కొయ్య బొమ్మకు ముందు వైపు చెక్కు (కో 16)

**ఎదరవైపు** . కొయ్య బొమ్మకు ముందర భాగం (కో.33)

**ఎదురుకట్టె** : గాజుపనిలో చిప్పలో లక్కను కరిగించేప్పుడు కలపడానికి వాడే వెదురు పుల్ల. (తె 1)

**ఎదురుపుల్ల** . తోలు బొమ్మలని కదపడానికి (ఆడించడానికి) కట్టే వెదురు బద్ద (కో.15,30)

**ఎదురుబద్ద :** పర్యా వెదురు బద్ద
కాగితం గుజ్జు, సుద్ద బొమ్మలకి రంగులు వేసేప్పుడు సొంతంగా బ్రష్ చేయడానికి వాడే వెదురు పుల్ల ఈ పుల్లకి చివర దారంతో ఉడత వెంట్రుకల్ని కుచ్చులా కట్టుకొని బ్రష్ చేస్తారు. (కో.27)

**ఎదురుబొంగు** తోలు బొమ్మలాట ఆడేప్పుడు పందిరికి ఉపయోగించే ఎదురుగడ (రా 2)

**ఎద్దు కొమ్ము .** 1. కొమ్ము బొమ్మలకి ఉపయోగించేది. (కో 10)
2 చేతికర్రలు చేసేప్పుడు పిడిదగ్గర కొమ్ములని చెక్కి అందానికి పెడతారు కాని ఆవుకొమ్ము లోపల బోలుగా ఉంటుంది కాబట్టి గట్టిదనం ఉండదని దీన్ని వాడతారు. (తె 5)

**ఎనకయ్య మొకం .** ఎండి తీగ పనిలో తీగని పురిపెట్టడానికి వాడే రాట్నంలో ఉండే కదురు కదురుకు సాంప్రదాయికమైన వాడుక గణపతి (తె 8)

**ఎనామిల్ :** కొయ్య బొమ్మలకి రంగులు వేసేప్పుడు ఆ రంగులు కొయ్య పీల్చకుండా ఉండటానికి ముందు కొయ్యకు వేసే పూత (కో 16)

**ఎనామిల్ పెయింట్ :** రూపా ఎనామలు పెయింట్.
1 గవ్వ బొమ్మలకి వేసే రంగు. (రా 5)
2. జక్క బొమ్మలకి వేసే రంగు (తె 1)
3. కాగితం గుజ్జు బొమ్మలకి వేసే రంగు. (కో 27)

**ఎనిమిదంచుల ఆకురాయి .** నిర్మల్‌బొమ్మలు చేసేప్పుడు బొమ్మలని సాపు చేయడానికి వాడే ఎనిమిది అంగుళాల ఆకురాయి. (తె 4)

**ఎమ్రిపేపరు ·** రూపా ఎమ్రీపేపర్ చూ అంస కాగితం కొయ్య బొమ్మల్ని నునుపు చేయడానికి వాడే గరుకు కాగితం. (కో 26,38,41; తె.1)

**ఏముక :** దంతం పనికి ఉపయోగించే ఏనుగు బొమిక. (కో 9)

**ఎయిదిగం .** కొయ్యపనిలో వాడే సూరి పలకలో భాగం (రా 4)

**ఎర్రచందనం :** కొయ్యపనిలో వాడే ఎర్రచందనం చెట్టు కొయ్య (కో 41, రా 3,4,5,6)

**ఎర్రన్న .** రంపంపొట్టు బొమ్మలు చేసేవారు చేసే జానపద పాత్ర బొమ్మ (తె 9)

**ఎర్రపేవిడి** కొయ్య బొమ్మలకు వేసే ఎరుపు రంగు (తె.7)

**ఎర్రమట్టి .** 1 మోల్డింగ్ చేసేప్పుడు వాడే మన్ను (కో.7,10; తె.1,12)
2 రూపా ఎర్రమన్ను. పూర్వం ఎరుపు రంగు చేయడానికి వాడే మన్ను. (రా 11)

**ఎర్రరంగు :** ఎరుపు రంగు చూ ఇంగ్లీకం. (కో.7, తె.2, రా 5,8)

**ఎర్రశంకు** ఒక రకం గవ్వ చూ.చిత్రం-27. (రా 5)

**ఎరాల్డైయిట్ :** లోహం పనిలో విరిగిన లోహం వస్తువులు అతకటానికి వాడే ద్రవ్యం. (కో 33)

**ఎవుతబద్ద ·** చూ ఎదురు బద్ద. (తె 2,7)

**ఎలమనాయుడు** రంపం పొట్టు బొమ్మలు చేసేవారు చేసే జానపద పాత్ర బొమ్మ. (తె 9)

**ఎలక్ట్రిక్ పద్ధతి :** వస్తువులకి వెండిపూత పూయడానికి వాడే కరెంటు విధానం (తె.12)

**ఎలిగారం(ముక్క) ·** పర్యా. వెలిగారం. వెండి పనిలో అతికించడానికి వాడే ద్రవ్యం. (కో.27, తె.8)

**ఎలుపు కొట్టుడు ·** పర్యా సెప్టీ కొట్టు, పట్టెం కొట్టు. వెండిపనిలో వెండితీగను వెడల్పుగా కొట్టడం (తె 8)

**ఎల్లబొమ్మ .** రంగు వేయని కొయ్య బొమ్మ వెల్లిబొమ్మ (కో.12)

**ఎల్లోటేక్ :** (yellow ochre) కొయ్యపనిలో వాడే పెద్దేగి కర్ర (తె 13)

**ఎల్లోడక్ :** పత్తి, గుడ్డ బొమ్మలలో ఒక రకం గుడ్డ బొమ్మ. (రా 7)

**ఏక తాళం** . తోలుబొమ్మలాటలో మృదంగం మీద వాయించే తాళం ఈ తోలు బొమ్మలాటలో మృదంగానికి హార్మోనికి లయప్రమాణం కలవాలి (రా 10)

**ఏకపటబొమ్మలు** . తోలు బొమ్మలలో ఒక రకం బొమ్మ ఈ బొమ్మని ఒక చర్మంపైన వేస్తారు కాళ్ళు, చేతులు తల విడిగా ఉండవు (రా 10)

**ఏక్సాబ్లేడ్** : కొయ్యను నునుపు చేయడానికి వాడే తోపుడులా ఉండే సాధనం (రా 4)

**ఏగిస కర్ర** : రూపా ఏగిసి కర్ర ఏగి (కో 5,7)

**ఏటపిల్ల(కోయు)** బిచ్చగాళ్ళ కొమరమ్మ, పెద్దమ్మదేవి, సిరిదేవి మొదలైన రంపం పొట్టు బొమ్మలు చేయించుకొని తాళ్ళగూడెంలో పందిరి మాదిరిగా కట్టి ఆ బొమ్మలను పెట్టి వాళ్ళ కులదేవత ముందు ఆడి పండుగ చేసుకునేప్పుడు బలిఇచ్చే పిల్ల (తె 9)

**ఏటవాలు** : 1. తోలు బొమ్మలాట ఆడించేప్పుడు తెరమీద బొమ్మలు నిలవటం కోసం తెరను వంకరగ కట్టడం (కో.10)

2 కొయ్యపనిలో బొమ్మలకి కొంచెం లోతు చెక్కటం. (తె 13)

3. లోహం పనిలో దరియా పెట్టెకు చిల్లులు వంకరగ పెట్టడం (తె 12)

**ఏడు అంకెల మోడలు** : చేతి కర్రల తయారీలో ఏడు (7) అంకె మాదిరిగా కర్ర చేయడం (కో.23)

**ఏనుగు** 1 రంపం పొట్టుతో చేసే బొమ్మ (కో 40)

2 కొయ్య పనిలో కొయ్యతో చేసే బొమ్మ (కో 3)

3. చేతి కర్రల తయారీలో ఏనుగు బొమ్మ పిడిగలది (తె 5)

**ఏనుగు అంబారీ** · ఏనుగు మీద అలంకరించిన పీఠం. దీన్ని కొండపల్లి బొమ్మలు చేసేవారు చేస్తారు (కో 26)

**ఏనుగు తలకాయపిడి** : చేతికర్రల తయారీలో ఏనుగు తల మాదిరిగా చేసిన పిడి (పట్టుకొనే చోటు) (కో 23)

**ఏనోడ్** : రోల్డుగోల్డ్ వస్తువుల తయారీలో గోల్డ్ కవరింగుకి వాడే ఎలక్ట్రికల్ ఎలిమనేట్ ఉండే రుణధ్రువం తీగ (కో 27)

**ఏమాటి వాండ్లు** . పర్యా గంజికుంటోడు, పటంవారు. చాకలివారిలో అడుక్కునేవారు (తె 9)

**ఏప** కొయ్యపనిలో వాడే వేపచెట్టు కొయ్య (రా.5)

**ఏపి** : కొయ్యపనిలో వాడే కొయ్య (రా.5)

## ఐ

**ఐతంరాజు** : రంపంపొట్టు బొమ్మలు చేసేవారు చేసే జానపద పాత్ర బొమ్మ (తె 9)

**ఐదు జానలు** తోలు బొమ్మల తయారీలో కిరీటం నుంచి తొడల వరకు ఉండే చర్మం కొలత. (రా 2)

**ఐదు వర్ణాల వాండ్లు** : ఐదు కులాల వాండ్లు బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు, మాలలు (తె 8)

**ఐదువేళ్ళశంగు** · ఒక రకం గవ్వ చూ.చిత్రం-29 (తె 9)

**ఐనమ్ నూనె** జస్త బొమ్మలు చేసేప్పుడు మట్టిలో కలిపే చమురు (తె 1)

**ఐరన్** ఇత్తడి పనిలో వస్తువులు సాపు చేసేప్పుడు వాడే సాధనం. (తె 1)

## ఒ

**ఒకకేజి** లోహం పనిలో పంచ లోహం బొమ్మలు చేసేప్పుడు రాగి కలిపే భాగం (రా 5)

**ఒకపాలు** . లోహం పనిలో మైనం చేయడానికి తేనె మైనం కలిపే భాగం (కో 28)

**ఒకపొద్దు** : (ఇడుసు) ఉపవాసం (ముగించు) (తె 1)

**ఒకించి ఆకురాయి** . కొయ్య బొమ్మల తయారీలో వాడే ఆకురాయి (రా 4)

**ఒగ్గుబల్ల :** దుక్క (కో.8)

**ఒడగట్టు :** కాగితం గుజ్జు, మట్టి సుద్ద బొమ్మలు చేసేప్పుడు వాడే అచ్చులు చేయడానికి ఉపయోగించే మట్టిసుద్దను నీటిలో కలిపి గుడ్డలో వేసి పిండు (కో.17)

**ఒడి :** వస్తువులకి నగిషీపని చేసేప్పుడు పట్టుకుంటే జారి పోకుండా ఉండటానికి పోగరుకు ఉండే వంపు. (తె.15)

**ఒంటికొమ్ము బొల్లావు :** రంపం పొట్టు బొమ్మ. జానపద పాత్ర. (తె.9)

**ఒంటిపేట 'వి' నెక్లేసు :** ఒక రకం ఆభరణం చూ చిత్రం-102. (కో.27)

**ఒంటిరాయి ఉంగరం :** చేతిపెట్టుకునే ఆభరణం. చూ.చిత్రం-61. (కో 27)

**ఒంటిరాయి లాకెట్లు :** ఒక రకం ఆభరణం. చూ చిత్రం-82. (కో.27)

**ఒండుమట్టి :** కాగితం గుజ్జు మట్టిసుద్ద బొమ్మల తయారీలో వాడే మన్ను. (కో 10)

**ఒంపు :** గాజుల పనిలో గాజుని వేడి చేయడానికి కుం‍ వంకరగా పెట్టు (తె 1)

**ఒరిజనల్ కొమ్ము :** చిత్రలేఖనంలో వేసిన (కొన్ని) బొమ్మలకు అసలు రూపం (మాతృక) (తె 1)

**ఒలు** పర్యా. బలుపు, చెక్క. కొయ్యపనిలో కొయ్యని చెక్కడం (రా 5,6)

## క

**కక్కు :** ఆకురాయిలో గొగ్గులు గొగ్గులుగా ఉండే భాగం. (కో.26)

**కక్షమందులవారు ·** ఒక జాతికి చెందిన వారు (తె 1)

**కచ్చికబూడిత :** ఎలు బూడిద. పిడకలను కాలిస్తే వచ్చే పొడి చేతికర్రల పిడికి వాడే కొమ్ము నునుపు రావటానికి కచ్చిక బూడిద వేసి తోముతారు. (కో.23)

**కచ్చు(కొట్టు) :** 1 (Extra) లోహం పనిలో మిగిలిన భాగాలు (కో 8)

2. పర్యా దొడ్డుపని, బజారుపని ఎక్స్ట్రా. లోహం పనిలో చిన్న గుట్టలమొలతో కొట్టిన చిన్న చిన్న లోతు చుక్కలు (తె.12)

**కంచంచు :** లోహం పనిలో మెరుగు చేయడానికి వాడే కంచు సుత్తెలో భాగం (తె 12)

**కంచరి ·** పెంబర్తి లోహం నగిషీ వారి కులం (తె 12,10)

**కంచు :** లోహం లోహం పనిలోను, ఇతర వస్తువులు చేయడానికి వాడతారు (కో.6,7,8,13,18,27, తె.1, 12, రా.5,8)

**కంచుదిమ్మె :** ఫిలిగ్రీపనిలో ముందు కావలసిన బొమ్మను కంచుతో తయారు చేసిన అండ (కో 27)

**కంచుపోగరు .** ఫిలిగ్రీపనిలో రేకుమీద ఆకారం తీయడానికి వాడే సాధనం. (తె 15)

**కంచుముక్క :** లోహం ముక్క రోల్లుగోల్లు వస్తువుల తయారీకి వాడేది (కో.27)

**కంచుసుత్తె** లోహం పనిలో వస్తువులు మెరుగు రావటానికి వాడే సుత్తె (కో.6, తె 12)

**కట్(చేయు) ·** కోయటం (కో.7,31,34,41, తె 1,3,4,12,13, రా 4,5,7,8,13)

**కటార్లు(బ) :** పెద్ద కత్తులు. ఇవి రెండు పాయలుంటాయి. (తె.1)

**కటికోడు :** పర్యా కపాలాలవాడు కసాయివాడు మేక, గేదె, ఆవు మొదలైన జంతువులను చంపేవాడు (కో.15, తె.3,9)

**కటింగు మిషను :** పర్యా మిషను కొయ్యను కోసే యంత్రం (కో 6)

**కటింగుమొల .** లోహం పనిలో బొమ్మ భాగాలను మలిచే పదును గల మొల (తె.1)

**కటాట్ వావడిజైన్ :** జాలీపనిలో చేసే ఒక రకం డిజైన్ (తె 12)

**కట్టు** 1. తోలు బొమ్మలాటలో ఆడించేవాళ్ళు కాళ్ళకు గజ్జెలు బిగించు (కో.7, రా.12)

2 తోలు బొమ్మలు ఆడించేందుకు బొమ్మలకి పుల్లలు కట్టడం (రా 10)

3 కొయ్య పనిలో చిల్లులు చేయడానికి వాడే 'పిడిసాని' కి ఉండే ఇనుప పన్ను (కో.39)

4 బిందెలో భాగం చూ చిత్రం-23 1. (కో 7)

**కట్టె గోసిన పొట్టు :** రంపంతో చెక్కను కోసినపుడు వచ్చే రద్దీ దీన్ని రంపం పొట్టు బొమ్మల తయారీకి వాడుతారు (తె 9)

**కట్టెపిడి :** చేతికర్రల తయారీలో పట్టుకునేందుకు కొయ్యతో చేసిన భాగం. (తె 9)

**కట్టెబిచ్చి .** కట్టె గోసిన పొట్టు. (తె.7)

**కట్టెబొగ్గు :** కొయ్యను కాలిస్తే వచ్చే బొగ్గు దీన్ని కొలిమిలో వాడతారు (కో.33, తె.1,12)

**కట్టెదుకాణం ·** కట్టెలమ్మే చోటు (Timber depot). (తె.13)

**కట్టెవజ్రం .** పర్యా జిగురు, బంక. కట్టెలని అతికించటానికి వాడే ద్రవ్యం. (రా.8,11)

**కట్టెసుత్తి ·** కొయ్యతో తయారుచేసిన సుత్తి. దీన్ని లోహం పనిలో ఇత్తడి షీట్‌ని సాపుచేయడానికి వాడుతారు. (తె.1)

**కటిబంధన .** పర్యా ఉదర బంధం కటిస్థానంలో ఉండే ఆభరణం ఒడ్డాణం (రా.8)

**కటోర ·** ఇత్తడి పాత్ర మోల్డింగ్ (పోతపని)లో ముందు మైనం కరిగించి అచ్చుపోసి దీన్ని సాపు రావటానికి వాడే మైనం కర్రపుల్లలు పెట్టుకునే పాత్ర. (తె 12)·

**కడగ ·** దూరంగ. (రా 5)

**కడగొట్టు .** ఉలి తయారీలో చివరన సన్నగ కొట్టడం. (రా 5)

**కడుగు .** 1 తోలు బొమ్మల తయారీలో వాడే చర్మాన్ని ముందు నీటితో శుభ్రం చేయు (తె.3, రా 2,12)

2 లోహం పనిలో బొమ్మలకి అగ్ని ద్రావకంలో మెరుగుపెట్టడం (కో 33)

**కడెం :** తోలు బొమ్మలకు రంగులు వేసే బోర్డరు. (కో.37)

**కడ్డీ :** ఫిలిగ్రీ పనిలో వాడే వెండి ఊస వెండి కడ్డీలు అమ్ముతారు వాటిని కొని కరిగించుకొని కావలసిన వస్తువులు చేస్తారు (తె 8)

**కడ్డీఎండి :** ఫలిగ్రీ పనిలో వాడే వెండి ఇది లావు ఊసలా ఉంటుంది (తె 8)

**కడ్డీమెరుగు :** ఫిలిగ్రీపనిలో వస్తువులకి మెరుక్కడ్డీతో పెట్టిన మెరుగు. (తె 8)

**కణీతపుల్ల :** చూ. ఈతపుల్ల తోలు బొమ్మలాటలో బొమ్మలని ఆడించేందుకు చేతికి కట్టుకునే పుల్ల. (కో 7)

**కణుసుకొమ్ము :** ఒక రకమైన దుప్పికొమ్ము దీనిని ఏనుగు దంతానికి బదులుగా దంతం పనిలో ఉపయోగిస్తారు (కో 9)

**కంటాని :** కొయ్యపనిలో చెక్కకి సన్నని మేకు గుచ్చటానికి వాడే పరికరం (కో.16,28)

**కంట్రీవుడ్ :** పర్యా నాటుకొయ్య కొయ్యపనిలో వాడే కొయ్య (కో 41)

**కంఠాన మొల .** రంపం పొట్టు బొమ్మల తయారీలో రంధ్రాలు చేయడానికి వాడే మేకు (కో.17)

**కంఠాహారం :** మెడలో వేసుకునే ఆభరణం. (కో 7)

**కంఠోపాఠం .** తోలు బొమ్మలాట చెప్పేవాళ్ళు కథలు పుస్తకం చూడకుండా చెప్పటం (కో 30)

**కండెం ·** 1 చూ. కండెం (తె 11)

2. కొయ్య బొమ్మలు కిందపడితే నాశనమవటం (కో.41)

**కత్తి** · చూ. ఆరె నరకటానికి, కోర్యటానికి వాడే సాధనం (కో 5,7,14,41; తె 2,12, రా 12)

**కత్తిఆకురాయి** · పర్యా. కత్తి ఆకుళ్ళు. కొయ్యపనిలో చెంచాలకు డిజైన్లు కోయటానికి వాడే సాధనం (కో.35)

**కత్తికర్ర** : చేతికర్ర పనివారు చేసే కత్తి ఉన్న కర్ర చూ.చిత్రం-2 (కో.27)

**కత్తికాసు** : కొయ్యపనిలో కొలతలకు వాడే సాధనం. (కో.9,16)

**కత్తిపిడి** : చూ. కత్తి కర్ర (తె 13)

**కత్తిపెట్టికొట్టు** : తోలు బొమ్మలకి వాడే చర్మం మీది వెంట్రుకల్ని కత్తితో తొలగించు (కో 30)

**కత్తెర** · రూపా. కత్తిరి, కత్తెర కత్తిరించటానికి వాడే సాధనం. (కో 7,12,29,31,41; తె.1,7,8,12,15; రా 2,5,7,8,13)

**కత్తిరించు** : కత్తిరతో కోయు. (కో.6,7,16,28,30; తె.2,3,8,10,12,13,14; రా 2,5,11)

**కథ(చెప్పు)** : రూపా కత (తె 7; రా 2)

తోలు బొమ్మలాటలో కధను చెప్పటం (కో 30)

**కథచెప్పువాడు** : పర్యా. చెప్పేవాడు సూత్రధారుడు. తోలు బొమ్మలాటలో కధను చెప్పేవారు (రా 12)

**కదిలించు** : తోలుబొమ్మలాటలో బొమ్మల కాళ్ళు చేతులు కదుపు (రా 2)

**కదురు** . 1. ఫిలిగ్రీ పనిలో వెండితీగ తీసే రాట్నంలో భాగం (తె.8)

2. చూ. ఉపకరణం కొయ్య బ్లాకులు చేయటానికి వాడే సన్నని పనిముట్టు. (కో 41)

**కనకాంబరం రంగు** : తోలు బొమ్మలకి వేసే కనకాంబరం పూలం రంగు (కో 15)

**కన్నం** : బొక్క, రంధ్రం, బెజ్జం, చిల్లు, బొర్రు, తొంట్లు. కొయ్యకు, తోలు బొమ్మలకు, ఫిలిగ్రీపనిలో వేసిన చిల్లు (కో 6,7,9,12,16,23,27, రా 3,4)

**కనిక్** : బోనం. (తె 3)

**కన్నీరు** : పర్యా గేడి భాగం బ్లాకులు చేయడానికి వాడే కొయ్య మధ్య భాగం (కో.41)

**కనుక్కొను** . తోలు బొమ్మలు చేసేప్పుడు తోలుని శుభ్రం చేయడానికి కాచే నీరు వేడిమిని సరిగా కనిపెట్టు. (కో 37)

**కన్నుపోగర** కొయ్యపనిలో బొమ్మల్ని చేసేప్పుడు వాడే సాధనం (రా 3,5,6)

**కన్నుమొల** లోహం పనిలో ఆభరణాల మీద గుండ్రని రౌండ్స్ కొట్టడానికి వాడే సాధనం. చూ చిత్రం-13.4. (రా 6)

**కపడా** కొయ్య బొమ్మలకు మక్కుపూసి విడిపోకుండా పైన చుట్టే బట్ట (తె.7)

**కప్పు-ఈశన** లోహం పనిలో చేసే కొవ్వొత్తి స్టాండు పై భాగం వెడల్పు (తె 12)

**కప్పుపని** . వడ్రంగి పనివారు చేసే ఇంటి కప్పుపని. (రా.4)

**కమరకారు** . లోహం పనిలో దుకాణం దగ్గిర పనిచేసేప్పుడు వాడే సాధనం (కో.8)

**కమల అత్తర్ దాన్** · ఫిలిగ్రీ పనిలో కమలం ఆకారంలో వున్న వెండితో చేసిన పన్నీరు బుడ్డి. (తె 8)

**కమల డిజైన్ కిష్తీ** ఫిలిగ్రీ పనిలో కమలం డిజైన్‌లో నగిషీ చేసిన ట్రే (తె 8)

**కమలం** : 1. ఫిలిగ్రీ పనివారు చేసే వస్తువు (తె.8)

2 పర్యా. తామరపువ్వు. కాగితం గుజ్జు, మట్టిబొమ్మలు తయారు చేసేవారు చేసే పువ్వు (కో.27)

**కమాను** . రూపా కమాన్

లోహం పనిలో రంపం పొట్టు బొమ్మల తయారీలో పరదాలపై అద్దకం పనిలో చేసే ఒక డిజైన్ (తె 2,7,9,12)

**కమాన్ల డిజైన్** లోహం పనిలో తయారు చేసే డిజైన్ (తె 1)

**కమిచ్చు** . రోల్డ్‌గోల్డ్ వస్తువుల తయారీలో వదులుగ, డొల్లగ ఉన్న వస్తువులని దగ్గరకు తోసే గుండ్రని గొట్టం (కో 33)

**కముకు** · చూ కమాను (రా 5)

**కమేలా** మేక, గేదె, ఎద్దు మొదలైన జంతువుల చర్మాలు అమ్మేచోటు (కో.5,7)

**కంపాసు** . కొయ్యపనిలో కొలతలు తీయడానికి, గుండ్రాలు గీయటానికి వాడేది. (కో 13,19; తె 1, రా 8)

**కంపెనీ** . యంత్రాలలో వస్తువులు తయారు చేసే చోటు (కో 36)

**కంపెనీ తయారీ** యంత్రాలతో చేయటం. (కో 36)

**కంపెనీ గం** . కొయ్యపనిలో అతికించడానికి వాడే జిగురు (కో 34)

**కంబకర్ర** . పర్యా దొద్దుగు, బండారు కొయ్యపనిలో వాడే కంబచెట్టు కొయ్య (కో 16)

**కంబచెక్క** . చూ. కంబకర్ర (కో 34)

**కంబతొట్టి** దంతం పనిలో కంబకొయ్యతో చేసే నాలుగు పలకల తొట్టి. పై మూత, కింది మూత ఉండదు (కో 9)

**కంబీ** · పర్యా కమ్మీ ఉలి తయారీకి వాడే ఇనుప ముక్క. (రా 5)

**కమ్మ** 1 కొండ్య బొమ్మల తయారీలో బొమ్మల చెవులకు చేసే దుద్దు. (తె 1)

2 రోల్డుగోల్డు ఆభరణాల తయారీలో చెవులకు చేసే ఒక రకం ఆభరణం (కో 27)

**కమ్మరం** · కుమ్మరి పనిచేసే దుకాణం (కో 6)

**కమ్మరి వారు** . ఇనుము పని చేసేవారు (తె.8)

**కమ్మరేకు** · కొయ్యపనిలో కొయ్యమీద గుండ్రంగ గీయటానికి పూర్వం వృత్తలేఖిని బదులువాడే సాధనం (కో 12)

**కమ్మీకొట్టు** శీర్షం తయారీకి వాడే ఇనుప ఊస (రా.3)

**కమ్మీసీర్నం** పర్యా సన్నపోగారు. కొయ్యపనిలో బొమ్మలకి కండ్లు, చెవులు, వెంట్రుకలు మొదలైన సన్నభాగాలు చేయటానికి వాడే సాధనం (రా.4)

**కమ్మెచ్చు** లోహం పనిలో ఇత్తడి తీగను కావలసిన సైజుకి రావడానికి వాడే గొట్టం (తె 1,8)

**కరగు** గట్టిగ ఉన్న పదార్థాన్ని నీటితో గాని వేడిచేసిగాని ద్రవపదార్థంగా చేయు. (కో.1,8,23,24,27,28,33, 34, తె 1,5,8,12, రా 5)

**కరచు(కరిపించు)** అంటుకోవటం, అతికించటం. (కో 6,32,41, రా 8,13)

**కరవాయి** . లోహం పనిలో ఇత్తడి పాత్రలు చేసేప్పుడు రేకుమీద డిజైన్ కొట్టేప్పుడు అడుగున ఒత్తుగ పెట్టుకునే ఇనుప దిమ్మ (కో 33, తె 10)

**కరలై** రూపా కరలైన్ చూ కరవాయి (కో 1; తె 1)

**కరాచి ఆకు** : రూపా కరాచాకు, ఖరాస ఆకు. కొమ్ము బొమ్మల తయారీలో దంతం పనిలో మెరుగుపెట్టడం కోసం వాడే ఆకు (కో.1,9)

**కరాసు ఆకురాయి** కొయ్యపనిలో చెక్కను నునుపు చేయడానికి వాడే పరికరం (కో 9)

**కరిగిపోవు** · చూ. కరగు (తె 12)

**కరిగించిన ఎండి** ఫిలిగ్రీ పనిలో కరిగించి కడ్డీ కింద పోతపోసిన వెండి (తె 8)

**కరిగించి కమ్మిపోయు** ఫిలిగ్రీ పనిలో వెండిని కరిగించి కడ్డీ కింద పోతపోయు (తె 8)

**కరుగుడు, కాసుడు** : ఫిలిగ్రీ పనిలో వెండిని కరిగించడం, వేడి చేయడం (తె.8)

**కరుడు** తోలు బొమ్మలకు వాడే నలుపు రంగు తయారీలో మసిలో జిగురు వేసి నూరి ఎండబెడితే గడ్డగ అవటం (రా 12)

**కరెంటు** : విద్యుత్తు (కో 30, తె 8,13, రా 11)

**కరెంటు దీపం** : తోలు బొమ్మలాటలో వాడే విద్యుద్దీపం (రా.10)

**కర్ర** : కత్తి కర్ర, వెదురు చేతికర్ర, అడ్డలతో భాగం చూ చిత్రం-2 3, 3 2; 6 I 1 (తె 13)

**కర్రవగిషీపని** : కొయ్యపనిలో చెక్కపై డిజైన్ చెక్కటం, చెకనం పని (తె 13)

**కర్రమేకు** : కొయ్యలో చేసిన సీల (కో 13)

**కర్రపొంచ** : నిర్మల్ బొమ్మల తయారీలో బొమ్మలు చేయడానికి వాడే కొయ్యఅచ్చు. (తె 4)

**కర్రసీకు** · అడ్డముక్కల మధ్య విరగడానికి వీలుగ ఉండే పొడవు కొయ్య అడ్డసీకు. (కో.12)

**కర్రసుత్తె** . పర్యా టెక్క, మెలెట్టు లోహం పనిలో వాడే కొయ్యతో చేసిన సుత్తి చూ చిత్రం-150. (తె.1,12)

**కర్రావుల రాజు** : రంపం పొట్టు బొమ్మల తయారీలో చేసే బొమ్మ. జానపద కథా నాయకుడు (తె 9)

**కర్రు** : నాగలికి చివరన ఉండే ఇనప ముక్క (తె 8)

**కలకత్తా రంగు** . అడ్డపనిలో బొమ్మలకి లక్కరంగు వేయడానికి ముందు వేసే రంగు (కో 12)

**కలదొక్కు** : సుద్దమట్టి బొమ్మల తయారీలో సుద్ద, మట్టి, కాగితం గుజ్జు మూడింటిని కలిపి కాళ్ళతో తొక్కు (కో.17)

**కలర్ ఈకలు** : గవ్వ బొమ్మలతో నెమలి చేసి తోకకు వాడే ఈకలు (రా 5)

**కలర్‌డక్** పత్తి, గుడ్డ బొమ్మల తయారీలో చేసే రంగు బొమ్మ. (రా 7)

**కలవర్‌షేప్** · కొయ్యపనిలో చెక్కే కళావరు ఆకారం (కో.34)

**కలాల గొట్టం** : పర్యా బులుసుల గొట్టం రంపం పొట్టు బొమ్మలకి రంగులు వేసేప్పుడు వాడే కుంచెలు వేసుకునే పెట్టె (తె.9)

**కలివి కొయ్య** : కొయ్య వస్తువులు చేసేప్పుడు వాడే కొయ్య. (కో.35)

**కలుపు** : రెండు, మూడు పదార్థాలను ఒకటిగా చేయటం చూ కలదొక్కు (కో 6,19,41,42, తె 12, రా 9)

**కల్తీ** · ఫిలిగ్రీ పనిలో వాడే వెండి స్వచ్ఛంగా ఉండక పోవటం

**కల్లు** సరుగులో ఒక భాగం (తె 1)

**కల్లుగీతగాడు** : తాటిచెట్టు నుంచి కల్లుగీసేవాడు చూ చిత్రం-1 3. (తె 1)

**కళాకాంతి** : తోలు బొమ్మ తేజస్సు (కో 30)

**కళావరు నక్లేసు** : మెడకు వేసుకునే ఒక రకం ఆభరణం చూ చిత్రం-94 (కో 27)

**కళ్యాణమండపం** · కొయ్యపనివారు చేసే పెళ్ళి జరిపే ఎత్తైన మండపం (కో.13)

**కళ్యాణి** : తోలు బొమ్మలాటలో ఆడించేవారు పాడే ఒకరాగం పేరు (రా 2)

**కళాయి** . 1 ఇత్తడి పాత్రలకు లోపలి భాగంలో పదార్థాలు చిలుము ఎక్కకుండా వేసే పూత (తె 1)

2 లోహం బొమ్మల తయారీలో బొమ్మలు మెరుగు రావటానికి వాడే పూత (తె 1,12)

**కళాసం** తోలు బొమ్మల తయారీకి వాడే చర్మం (రా 2)

**కళియాళ్ళు**, పర్యా చిమ్టా లోహం బొమ్మల తయారీలో బొమ్మ భాగాలను అతకటానికి వేడిచేసేప్పుడు పట్టుకునే పట్కారు (తె 1)

**కళ్ళపెట్టు** : కొయ్య బొమ్మల తయారీలో కళ్ళస్థానంలో నల్లపూసలు అమర్చటం (రా.4)

**కవి(చేయు)** . కవిత్వం చెప్పేవాడు- రచించు (రా.2,2)

**కవురు పోగర** : లోహం పనిలో విగ్రహం చెక్కటానికి వాడే పరికరం (కో 19)

**కంసాలి** · బంగారం పనిచేసేవాడు (కో 15 , తె 4, రా 2,9)

**కాక** లోహం పనిలో వస్తువుల్ని వేడిచేయడం (తె 12)

**కాకచూపు** వేడిచేయు చూ అగ్గిచూపు (తె 8,12)

**కాకామూకు (తమిళం)** 1 కాకి ముక్కు (రా 5)

2 గవ్వలలో ఒకరకం చూ చిత్రం-47 (రా 5)

**కాకిపడిగెలవాళ్లు** ముతరాసు కులంలో అడక్కునేవాళ్ళు (రంపం పొట్టు బొమ్మలు) (తె 9)

**కాకివెదురు** తోలు బొమ్మల తయారీలో ఉపయోగించే పరికరం చూ చిత్రం-117. (కో 39)

**కాకెదురుపుల్ల** తోలు బొమ్మలకు రంగులు వేసేందుకు ఉపయోగించే పేనా చేయటానికి వాడే పుల్ల (కో 39)

**కాగడ .** పూర్వం తోలు బొమ్మలాటలో దీపాలకి బదులుగా కర్రకి నూనెగుడ్డలు కట్టి వెలిగించే సాధనం (కో 30)

**కాగితం గుజ్జు** కాగితం నీటిలో నానబెట్టి రుబ్బినది దీంతో బొమ్మలు చేస్తారు. (కో 27)

**కాగు** లోహం బొమ్మల పనిలో బొమ్మని వేడిచేసినప్పుడు వేడెక్కు (తె 12)

**కాచు(టం)** · తోలు బొమ్మలకువాడే చర్మం శుభ్రం చేయుడానికి నీటిని వేడిచేయటం (రా 10)

**కాటమరాజు .** జానపద కథానాయకుడు ఈ బొమ్మను పొణికె కర్రతో చేస్తారు (తె 9)

**కాటిక శాయిపొడి** నిర్మల్ బొమ్మలకి వేసే నలుపురంగు. (తె 4)

**కాటికాపరి** కోమట్లను అడుక్కునేవారు (తె 7)

**కాటు (కొట్టు)** · పర్యా గాటు, గుర్తు, మార్కు లోహం పనిలో గుర్తుకు పెట్టుకునే గీత గీతకొట్టు (తె 10,12, రా.3,5)

**కాటుక్కాయ** కొమ్ముపనిలో చేసేకాటుక పెట్టుకునే భరిణి (కో 32)

**కాటుబంక :** నల్లని జిగురు. (తె.4)

**కాటురంగు :** నిర్మల్ బొమ్మల తయారీలో బొమ్మలకు వేసే చాక్లెట్ రంగు (తె 4)

**కాడి :** కొయ్యపనిలో చెక్కమీద గీతపెట్టడానికి వాడే శీర్ణంలో భాగం (రా 5)

**కాపరు** · రాగిలోహం (కో 27)

**కాపర్‌సాల్టు** · లోహంపనిలో అల్యూమినియం బొమ్మలకి రాగిరంగు కావాలంటే సైనేడ్‌లో కాపర్‌సాల్టు పొడివేసి నీటిలో కలిపి బొమ్మని అందులో ముంచుతారు (తె.1)

**కాపీగింజల గొలుసు :** ఒకరకం ఆభరణం. చూ చిత్రం-87 (కో 27)

**కాపీరంగు :** గవ్వబొమ్మలకి, కొయ్య బొమ్మలకి వేసే కాఫీ పొడిరంగు (రా 5,6)

**కాపు .** చూ అగ్గిసెగ అడ్డపనిలో లక్కని సంచిలో వేసి వేడిచేయటం (కో 12)

**కాపీ** · తోలు బొమ్మలాటలో బొమ్మలాడించేవారు పాడే రాగం (రా 2)

**కామ** చెక్కపిడి. (కో 18)

**కామధేను .** 1 కొయ్యపనిలో చెక్కమీద చెక్కేడిజైన్ (రా.4)

2 రంపంపొట్టు బొమ్మలు చేసేవారు చేసేబొమ్మ. (కో 4)

**కామిక్కు** పర్యా ఆస్యం, హాస్యం తోలుబొమ్మలాటలో బంగారక్క, జుట్టుపోలిగాడు చేసే హాస్యం (కో.37)

**కాయ** 1 అడ్డవారు చివరన ఉండే కొయ్యపిడి చూ.చిత్రం-61 (కో 11)

2 లోహం పనిలో చేసే కొవ్వొత్తి స్టాండు మధ్యభాగం. (తె 12)

**కాయితం** రూపా. కాయిదం(కొట్టు), పేపరు గరుకుకాగితం కొట్టు కాగితం. (కో 29, తె.4,6,12, రా 4,7)

**కార్నర్ :** పత్తి బట్ట బొమ్మల తయారీలో బొమ్మకు ఉండే మూలభాగం. (రా.7)

**కారు :** లోహం పనిలో కొలిమిలో వేడిచేసే వస్తువుల్ని పట్టుకోడానికి వాడే సాధనం. చూ.చిత్రం-153, 156, 157 (కో 1,7,8,9,31, తె 8,10,12)

**కారు పిడక :** పర్యా సిడక పేడతో చేసిన పిడక కొలిమిలో వాడతారు (కో 1)

**కార్తీకమాసం :** కాగితం గుజ్జు, మట్టి, సుద్ద, బొమ్మలు తయారు చేసే కాలం ఆ కాలంలో వర్షాలు ఉండవని, పండుగలు ఎక్కువగా వస్తాయి కాబట్టి 'గిరాకి' ఉంటుందని అప్పుడు చేస్తారు (కో 27)

**కాలాకోడి .** గవ్వ బొమ్మ చూ చిత్రం-26 (రా 5)

**కాలిరేకు :** రేకు గుర్రంలో ఒక భాగం చూ చిత్రం-2 8. (కో 9)

**కాలు** దంతం పనిలో చేసే దంతం పెట్టె అడుగున ఉండే కోడువంటి చిన్న భాగం. (కో 9)

**కాలు ఆడు :** తోలు బొమ్మలాటలో బొమ్మ కాలు ఆడించటం (రా.2)

**కాలు రావాల .** కాలు ఆడు (రా 2)

**కాల్చు(అతుకు) .** వస్తువుల్ని వేడిచేసి అతకడం. (కో 1,6,7,13,27,28, తె 8)

**కాల్‌బూత్ .** గాజుల తయారీలో గాజుని వేడిచేయడానికి, పట్టుకునేందుకు వాడే సాధనం (తె.1)

**కాల్వ(చెక్కు) :** లోహం పనిలో సన్నటి ఉబ్బు చెక్కడం (తె 12)

**కాల్వమొుల :** పర్యా దోయార్ మొల లోహం పనిలో సన్నటి ఉబ్బును చెక్కడానికి వాడే పరికరం చూ.చిత్రం-130 (తె 12)

**కాళ్ళపట్టీ :** ఫిలిగ్రీపనిలో చేసే కాళ్ళ మడిమలకు పెట్టుకునే వెండిపట్టీ (కో 27)

**కాళ్ళు(బ) :** 1 కొయ్యపనిలో చేసే మంచం కోళ్ళు. (తె 13)
2 నిర్మల్ బొమ్మల తయారీలో బొమ్మలకు చేసే కాళ్ళు (తె 4)

**కావలిసిద్దులు :** జానపద పాత్రలు (తె 7)

**కావించి** పావు అంగుళం (రా 4)

**కావించి ఆకురాయి :** పావు అంగుళం ఆకురాయి (రా.4)

**కావిరంగుపొడి :** కాషాయరంగు పొడి. (కో 28)

**కావూసు** ఇష్టపడు, కోరిక (తె 1)

**కాశీకాయలమాల :** ఒక రకం ఆభరణం చూ.చిత్రం-93. (కో 27)

**కాషాయరంగు ·** కొమ్ము బొమ్మలకు వేసే రంగు (కో.32)

**కాసులపేరు .** ఫిలిగ్రీపనిలో చేసే మెడలో వేసుకునే గొలుసు. (కో 27)

**కాసెగడ్డిపుల్ల ·** గాజుల తయారీలో గాజులకి పూసలు అతకటానికి వాడే పుడక (తె 1)

**కింగ్‌ఫిషర్** నిర్మల్ బొమ్మలలో ఒక బొమ్మపేరు (తె.4)

**కిందపెట్టి :** దరియా పెట్టెలో భాగం చూ.చిత్రం-18.4. (తె.1,10)

**కిరసనాయిలు బుడ్డి :** కిరసనాయిలు దీపం. (కో 23,27)

**కిరసనాయిలు మసినలుపు ·** కొండపల్లి బొమ్మలకి పూర్వం వేసే నల్లరంగు కిరసనాయిలు దీపానికి పెట్టిన గుడ్డ కాలి నల్లని మసిగ అవుతుంది దానిలో తుమ్మ జిగురు కలిపి నల్లరంగుగా వాడతారు (కో 26)

**కిరీటం :** లోహం పనిలో చేసే తలపైపెట్టుకొనే నగ. చూ చిత్రం-16 (కో 7,19)

**కిర్మారంగు :** రంపం పొట్టు బొమ్మలకి వేసే రంగు (కో 40)

**కిస్తీ** ట్రే (Tray) ఫిలిగ్రీ పనివారు చేసే వస్తువు (తె.8)

**కీ :** తాళం చెవి (కో 9)

**కీట్లసుత్తె :** లోహం పనిలో గీతలు కొట్టడానికి వాడే సుత్తి. (తె 10,12)

**కీతరేకు :** పర్యా. కత్తికాసు దంతం పనిలో, కొయ్యపనిలో

సాపురావటానికి వాడే పరికరం చూ.చిత్రం-107 (కో 27, తె 8)

**కీర్తిముఖం** · ఫిలిగ్రీపనిలో మకర తోరణాల పైన ఉండే భాగం (కో 33)

**కీలు :** తోలు బొమ్మల తయారీలో బొమ్మల చేతులు, కాళ్ళు కదపటానికి ఉపయోగించే మర (రా.5)

**కీలు బెజ్జాలు .** తోలు బొమ్మలలో భాగం. చూ చిత్రం- 10 I 3 (రా 5)

**కీలుబొమ్మ :** పర్యా. సూస్యం బొమ్మ తోలు బొమ్మలలో తల, చేతులు, కాళ్ళు విడివిడిగ కదపటానికి వీలుగ ఉండే బొమ్మ (కో 37, రా 10)

**కుక్కముఖం కర్ర** · చేతి కర్రలలో ఒక రకం కుక్క ముఖం పిడితో ఉంటుంది చూ చిత్రం-4 (కో 23, తె 5)

**కుక్కుటం .** కోడి తోలు బొమ్మలాట ఆడే ముందు దిష్టి తగలకుండా రక్తదానం చేసేప్పుడు బలిచేసే కోడి (రా.2)

**కుంకుడు (కాయ) :** పర్యా కుంకుళ్ళు లోహం పనిలో వస్తువుల్ని శుభ్రం చేయడానికి వాడేది (తె 8,10)

**కుంకుడు కట్టె** · లోహం పనిలో వాడే మొలకు పదును రావటానికి పూర్వం వాడే కర్ర (తె 10)

**కుంకుడుకాయ రసం** చూ కుంకుడు వెండి, రోల్డుగోల్డు వస్తువులకు మెరుగు రావటానికి వాడేది (కో 27,33, 39, తె.1,7)

**కుంకుంభరిణ .** ఫిలిగ్రీపనిలో, దంతం పనిలో చేసే కుంకుమ పోసుకుందుకు ఉపయోగించే పెట్టె (కో 9,27,32, తె 8)

**కుచ్చు :** ఫిలిగ్రీపనిలో దారానికి మెరుగుపూసలు గుచ్చు (తె 8)

**కుచ్చెవద్క :** ఫిలిగ్రీపనిలో మువ్వలు, గజ్జెలు చేయడానికి వాడే కడ్డీ (తె 8)

**కుట్టు(కొను) :** తోలు బొమ్మలాటలో బొమ్మల్ని తెరకు కుట్టడం (కో 7, రా 2)

**కుడికి చిల్లట** కొయ్యపనిలో బొమ్మకు కుడివైపు చెక్కడం (తె 13)

**కుండపెంకు** · చేతికర్రల తయారీలో నలుపురంగు చేసేప్పుడు పొగని పట్టడానికి వాడే మట్టితో తయారైన కుండ భాగం (కో.23)

**కుదురు** 1 లోహం పనిలో అట్టెం అంటించిన రేకు పీటను ఉంబిశెకనం పని చేయడానికి వాడే మట్టు (తె 12)

2 ఫిలిగ్రీపనిలో వాడే కుంపటిలోని పై భాగం (తె 8)

**కుంపటి :** బొగ్గులు వేసి వాడే పొయ్యి చూ చిత్రం-6 VI (కో 5,12,26,27, తె.1,4,8,12,15)

**కుంభకర్ణ విద్దం :** తోలు బొమ్మలాటవారు చెప్పే కుంభకర్ణ యుద్ధం కథ (రా 2)

**కుమ్మరి మూస .** పర్యా మట్టిమూస, చిన్నమూస. ఫిలిగ్రీపనిలో వెండిని కరిగించటానికి వాడే మూస (తె 8)

**కుమ్ము** · 1 తోలు బొమ్మల తయారీలో ముందు తోలుని నీటిలో గుంజు (రా 12)

2 పర్యా దంచు కాగితం గుజ్జు, మట్టి, సుద్ద బొమ్మల తయారీలో ముందు మూడింటిని రోటిలో వేసి రోకలితో దంచు. (కో.17)

**కుయ్యి .** లోహం పనిలో రేకుని పేపు తీయడానికి వాడే 'గన్ను' అడుగు భాగం. (తె 12)

**కురస :** పొట్టిగ ఉండటం. (కో.7,28)

**కుర్చీ :** కొయ్య పనిలో చెక్కతో కూర్చునేందుకు చేసిన వస్తువు. (కో.35, తె 1)

**కురుజంపె :** తోలు బొమ్మలాటలో మృదంగం మీద వాయించే తాళం (రా.2)

**కులందేవుడు** రంపంపొట్టు బొమ్మలు చేసేవాళ్ళు చేసే ఒక కులానికి సంబంధించిన దేవుడి బొమ్మ (తె.9)

**కూజావులి** : అడ్డ, కర్ర పనిలో చిన్న భాగంలో డొల్ల చేయడానికి , చిన్న రంధ్రాలు చేయడానికి వాడే ఉలి (కో 12)

**కూజాషేప్** కొయ్యపనిలో చేసే కూజా ఆకారం. (కో 34)

**కూడిక** · కంచు విగ్రహాల తయారీలో రాగి, తగరం కలయిక. (కో 8)

**కూర్పోపెట్టు** : పర్యా కూలబెట్టు కొయ్యపనిలో తలుపులు మొదలైన వాటికి కొయ్యతో డిజైనులు చెక్కేప్పుడు ముందు తలుపుకి చేసిన డిజైన్ ప్రకారం తొలిచి అందులో చెక్కిన డిజైన్ అతికించు. (కో 34)

**కూరు** . 1 ఉలి తయారీలో మొనని వాడి (sharp) చేయు (రా 5)

2 మట్టి బొమ్మల తయారీలో ముందు ప్లాస్టర్ అఫ్ ప్యారిస్‌తో చేసిన అచ్చులో బంకమట్టి పెట్టు (రా 9)

3. కాగితం, మట్టి బొమ్మల తయారీలో ప్లాస్టర్ అఫ్ ప్యారిస్ అచ్చులోకి కాగితం గుజ్జుని అరిగిపోయిన బ్రష్‌తో నెట్టు (కో 4)

**కూర్చు** తోలుబొమ్మలాట వాళ్ళు కాళ్ళకు కట్టుకునే గజ్జెల తయారీలో తొడుగు మువ్వలని దోపు (కో 7)

**కూర్చు** : తోలు బొమ్మల తయారీలో బొమ్మలకి కీళ్ళు కుట్టు (కో.30)

**కూసం** : 1. చూ.చిత్రం-24 2 కుర్చీ తయారీలో రెండు చెక్కలు బిగించే చోట సన్నగ చెక్కిన భాగం. (తె 6)

**కెంపురంగు** తోలుబొమ్మలకి వేసే రంగు. (కో 7)

**కేటి ఎండి** : ఫిలిగ్రీ పనిలో అతుకు తగిలిన వెండి, రాగి కలిపిన వెండి (రా 8)

**కేతిగాడు** : పర్యా ఊసుగాడు, బుడ్డకేతిగాడు తోలు బొమ్మలాటలో ఒక హాస్యపు బొమ్మ పేరు జుట్టుపోలిగాడి అల్లుడు. (రా.10)

**కైవారం** : కొలతలు కొలవడానికి, వృత్తాలు గీయడానికి ఉపయోగించే పరికరం: (కో.7,24,28; తె.1,2,6,12)

**కైవారం చేయు** · అడ్డపనిలో బొమ్మలు చేసేప్పుడు లోపలి భాగం గుల్లగ చేయు (కో 11)

**కొంకి** తోలుబొమ్మలాటలో పూర్వ ఆముదం దీపాలు తగిలించటానికి వాడే వంకీ (కో.30)

**కొంగ** 1 చేతి కర్రలకి పిడి భాగంలో చెక్కే రూపం. (తె 5)

2 కొమ్ము బొమ్మలు చేసేవారు చేసే పక్షిబొమ్మ (కో 1)

**కొట్టు** · దుకాణం, అంగడి గీతలు గీయటం, చెక్కటం. గరుకుకాయితంలో సైను చేయటం మట్టిని దంచటం, నీరు చల్లటం (కో.3,4,5,6,7,19, 31,34,37,42, రా 3)

**కొట్రామం** · లోహం పనిలో చేసే పంచలోహ పాత్ర (తె.1)

**కొడగొట్టం** : చూ అతుకుగొట్టం ఫిలిగ్రీపనిలో దీపం మంట తీగమీద వెడల్పుగా ప్రసరింపచేయటానికి వుండే గొట్టం (తె 8)

**కొడితి** : మక్కు బొమ్మలు చేసేప్పుడు సుత్తికి బదులుగా వాడే సాధనం దీన్ని చింత కట్టెతో చేస్తారు (రా 13)

**కొడిపి** మక్కు బొమ్మల తయారీలో ఉపయోగించే పరికరం చూ చిత్రం-172 (రా.11)

**కొండి** : పర్యా హుక్కు (ఫిలిగ్రీ) గంగాళం వంటి పాత్రలు పట్టుకోవటానికి ఉండే వంపు (తె 10)

**కొదమ** తోలు బొమ్మలాటలో నాటకం మిగలటం (రా.2)

**కొనుక్కొచ్చు** : కొయ్యపని చేసేవారు కొయ్యను కొని తీసుకరావటం (రా.4)

**కొప్పిర** : లోహం పనిలో చేసే నగిషి ఉన్న పెద్ద పాత్ర (తె 10)

**కొబ్బరికాయ** : పర్యా. టెంకాయ.

1. లోహం పని ప్రారంభించేప్పుడు విగ్రహం బాగా రావటానికి కొట్టే పండు. (తె.6,12)

2. సివసానంలో భాగం. (తె.1)

**కొబ్బరికాయ డిబ్బీ :** కాగితం గుజ్జు, మట్టి, సుద్దపనివారు కొబ్బరికాయ ఆకారంతో చేసే చిల్లర డబ్బులు వేసుకునే భరిణ (కో.17)

**కొబ్బరితాడు గొలుసు :** ఫిలిగ్రీపనిలో కొబ్బరితాడు మాదిరి చేసే గొలుసు. (కో 33)

**కొబ్బరి నూనె :** కొబ్బరికాయ నుంచి తీసిన నూనె.

1. కాటుక తయారీలో వాడే చమురు. (కో.7, రా.8,5)

2. ఉలిపదును పెట్టేప్పుడు సానరాయి మీద వేసేది (కో 17)

**కొబ్బరిపీచు :** కొయ్యపనిలో చెక్కని శుభ్రం చేయడానికి వాడేది. (కో 19,28,35, రా.1)

**కొబ్బరిమట్ట :** కొయ్య పనిలో చెక్కకి ఉండే చిల్లులు పూడ్చటానికి లప్పం, మైనం ఉడికించి చిల్లుల్లో వేసి ఆరిన తరువాత సమానంగా రావటానికి రుద్దేందుకు వాడే మట్ట. (కో.35)

**కొమరమ్మ :** రూపా కొమురమ్మ. ఒక దేవత. రంపం పొట్టు బొమ్మలు చేసేవారు చేసే బొమ్మ. (తె 9)

**కొమ్ము :** బొమ్మల తయారీకి వాడే వస్తువు (కో 1, తె 1,5)

**కొమ్ముకర్ర :** గేదె కొమ్ముతో తయారుచేసిన కర్ర (కో 23)

**కొమ్ము కోసే రంపం :** కొమ్ముని, దంతాన్ని కోయడానికి వాడే రంపం. (కో 9)

**కొమ్ముపని :** కొమ్ముతో చేసే పని. (కో.9)

**కొమ్ముపిడి :** చేతికర్రల తయారీలో కర్ర పట్టుకొందుకు కొమ్ముతో చేసిన కామ. (కో 9)

**కొమ్ముపేడు :** దంతం పనిలో చేసే కంచు తొట్టి మీద అతికించే ముక్క. (కో 9)

**కొమ్ము బొమ్మ .** కొమ్ముతో చేసిన బొమ్మ (కో.1)

**కొయ్య :** కొయ్యపనికి వాడే చెక్క (కో 7,36; తె 8, రా.1,5,6)

**కొయ్యకాలు :** కొయ్యపనిలో బొమ్మకు చేసే చెక్కకాలు (రా.3)

**కొయ్యగూటం ·** కొయ్యపనిలో వాడే కొయ్యసుత్తి (కో 41)

**కొయ్యచీల :** కొయ్యపనిలో చేసే చెక్కమేకు (కో 35, రా 4)

**కొయ్యదిమ్మ .** కొయ్యపనిలో బొమ్మలు చేసేప్పుడు బొమ్మకు అడుగున పెట్టే చెక్కమొద్దు చూ చిత్రం-143 2 (కో 35)

**కొయ్యనగిషీ :** కొయ్యపనిలో చెక్కపై చెక్కే డిజైన్ (కో 35)

**కొయ్యపని :** పర్యా చెక్కుడు పని, వడ్లపని చెక్కపని (రా.5)

**కొయ్యపిడి :** 1 సుత్తిని పట్టుకోడానికి చేసిన చెక్కకామ (రా 5)

2 బరమలో భాగం చూ చిత్రం-169 1 (కో 19)

**కొయ్యపొట్టు :** చూ కట్టెగోశిన పొట్టు చెక్కని రంపంతో కోసినప్పుడు వచ్చేపొడి దీన్ని బొమ్మలు చేయడానికి వాడతారు (కో 40)

**కొయ్యబ్లాక్ :** చెక్కతో చేసిన అచ్చు (కో 41)

**కొయ్యబిట్టు ·** చెక్కముక్క (రా 13)

**కొయ్యబొమ్మ :** కొయ్యపనిలో చెక్కతో చేసిన బొమ్మ (కో.41)

**కొయ్యముక్క :** చూ. కొయ్యబిట్టు చూ చిత్రం-113 2 (కో.7)

**కొయ్యమేకు .** చూ కొయ్యచీల (కో 5,7)

**కొరాం ·** లోహం పనిలో రేకుపని చేసేప్పుడు వాడేది ఇది చిన్న రైలుపట్టా మాదిరిగా ఉండి దీనికున్న చిన్న రంధ్రంలో బిగించిన రేకుమీద రేకుపని చేస్తారు (తె 10,12)

**కొలతబద్ద ·** పర్యా గీతకట్ట, స్కేలు స్కేలు. కొలతలు చూడటానికి వాడేది (రా 8)

**కొలిమి (ఆడించు) :** పర్యా బట్టీ, దుకాణం, రూపా కొల్మి లోహం పనిలో లోహం కరిగించటానికి, వడ్రంగి పనిలో ఇనప వస్తువుల్ని వేడి చేయడానికి పనికొచ్చే పొయ్యి (బట్టీ) పంకాను తిప్పు (కో 18,23,28; తె 1,10,12, రా 3,4,5,11)

**కొవ్వొత్తిస్టాండు** · లోహం పనిలో చేసే వస్తువు చూ చిత్రం-7 (తె 12)

**కొశ్శిగ :** నిర్మల్ బొమ్మల తయారీలో చెక్కను వాడిగా చెక్కటం (తె 4)

**కోట్(గొట్టు) :** పర్యా కోటింగ్ కొయ్యపనిలో బొమ్మలకు పాలిష్ పూయటం (కో 28,34, తె 4,7)

**కోడి :** తోలు బొమ్మలాటకు బలి ఇచ్చే పక్షి (రా 2)

**కోడిపుంజు** తోలు బొమ్మల తయారీలో చేసే ఒక బొమ్మ (రా 2)

**కోత(కోయు) :** చెక్కని కోయటం (కో 6)

**కోతమిషను** కొయ్య దుంగలను కావల్సిన కొలత ప్రకారం కోసే యంత్రం (కో 26)

**కోయించు .** కొయ్య దుంగను యంత్రంతో నరికించు (కో 7,16,23,24,34,42)

**కోరడి :** రూపా కోరడ ఉలికిపై భాగంలో వేసే ఇనుపకట్టు (కో 35, రా 4)

**కోరమొల** · లోహం వాహనాల తయారీలో వాడే సాధనం (కో 31)

**కోరల్పు .** గవ్వబొమ్మ (రా 5)

**కోరాగుడ్డ** · కొయ్యబొమ్మకి అతికించటానికి వాడే గుడ్డ (కో 39)

**కోరాంగుండు** కోరాం పట్టలో భాగం చూ చిత్రం-143 1 (తె 10)

**కోరాంపట్ట :** లోహం పనిలో వాడే పరికరం. చూ.చిత్రం-143 (తె.10)

**కోలకొరాం .** చూ కోరమొల (తె.10)

**కోళ్ళు** కొయ్యపనిలో మంచానికి గాని కుర్చీకి గాని చేసే కోడులు (కో 35)

**కోళ్ళు లేని చెక్క :** తోలు బొమ్మలాటలో బొమ్మల్ని ఆడించే వాళ్ళు బొమ్మల కదలిక ప్రకారం చప్పుడు చేయడానికి కాళ్ళ కింద వేసుకునే పలక (కో.15)

**కోవంజి :** గవ్వ బొమ్మ చూ చిత్రం-36 (రా 5)

**కోశానం :** కంచు విగ్రహాల తయారీలో విగ్రహాల్ని ఫైల్ చేయడానికి వాడే తరిణదొడ్డిలో ఉండే ఆకురాయి. (కో 8)

**కోసుకొను .** రూపా కోస్కోటం కత్తిరించటం, కొయ్యటం (కో.7, రా 4)

**కోసే చెవులు** · కొయ్యకు చిల్లులు చేయడానికి వాడే ఆగరుకి చివర చెక్కను కోయడానికి ఉపయోగించే మొనలు (కో 39)

**క్యాతోడ్ .** రోల్డ్‌గోల్డ్ వస్తువుల తయారీలో గోల్డ్ కవరింగ్ చేయడానికి వాడే ఎలిమినేటర్‌లో భాగం (ధనధ్రువం). (కో 27)

**క్యాటలాగు** · నమూనాల పుస్తకం (కో 27)

**క్యారంబోర్డు .** కొయ్యపనివారు చేసే ఆటవస్తువు (కో.16)

**క్రాస్‌అలుగు** · కొయ్యపనిలో వాడే వారతోపుడులోని వంకర అలుగు మొన (రా.4)

**క్రాస్‌పువ్వులు .** లోహం పనిలో చేసే ఒక డిజైను (తె 1)

**క్రాస్‌మొగ్గలు** లోహం పనిలో చేసే ఒక డిజైను వంకర మొగ్గలు (తె.10,12)

**క్లాతు** (Cloth) బట్ట పర్యా గుడ్డ, బట్ట, వస్త్రం (కో 7)

**క్రింది పీటలు** · కొయ్యపనిలో బొమ్మ కింది ఆధారం. (Base) (కో 35)

**క్లీన్**(clean) శుభ్రం చూ కడుగు (కో.40, రా 5,10)

**క్లే** · పర్యా బంకమట్టి, బంకమన్ను, బాల్‌క్లే, నల్లమట్టి మట్టి.

బొమ్మలు తయారీకి వాడేది (కో.41)

**క్లేంప్** కొయ్యపనిలో చెక్కేప్పుడు చెక్క కదలకుండా బిగించటానికి వాడే సాధనం (కో 35,39)

**క్విక్‌ఫిక్స్** మట్టి బొమ్మల తయారీలో బొమ్మ విరిగిపోతే అతికించటానికి వాడే ద్రవ్యం (రా 9)

# క్ష

**క్షౌణం** మట్టి బొమ్మల తయారీలో వాడే చిన్న ఉలి (రా 9)

**క్షేమపీఠం** . ఫిలిగ్రీ పనిలో ఉత్సవ విగ్రహాల కిందికి చేసే పీఠం (కో 3,3)

# ఖ

**ఖజారో** ఖజురహో కొయ్యపనివారు చేసే ఒక బొమ్మపేరు (కో 41)

**ఖరాబు(అగు)** ఫిలిగ్రీ పనిలో వస్తువులు పాడైపోవటం, చెడిపోవటం (తె 8)

**ఖరాస ఆకు :** చూ కరాచి ఆకు (కో 10)

**ఖరీదు** · వెల (కో.7)

**ఖర్పూరతైలం** కొయ్య బొమ్మలకు వేసే రంగు పల్చన అవాలంటే రంగులో కలిపే చమురు (కో 41)

**ఖంబెబ్బా** నిర్మల్ బొమ్మలు చేసేవాళ్ళు చేసే పెద్ద పళ్ళెం ముస్లిములు అల్లుడికి ఫలహారాలు పంపడానికి ఉపయోగించేది (తె 4)

**ఖావా** నిర్మల్ బొమ్మలు తయారు చేసేవాళ్ళు చేసే 'బురుగుల సంధూన్' అనే పెట్టెలో ఉండే సొరుగు (తె 4)

**ఖాళీ** 1 మట్టి బొమ్మల తయారీలో మోల్డల్‌మట్టి కూరి, వాడిన తరువాత మోల్డ్‌ని తీయటానికి కొద్దిగ చేసిన సందు (కో 41)

2 చేతికర్రల తయారీలో వాడే కొమ్ముల లోపలి గుల్ల (తె 5)

**ఖిలోన** (నిర్మల్) బొమ్మల తయారీ పని (మక్కుపని) (తె 4)

**ఖైరీకొట్టు** లోహం పనిలో విగ్రహాలకు ఖైరీమొలతో ఆభరణాలు చెక్కు (తె 12)

**ఖైరీమొల** లోహం పనిలో విగ్రహాలకు ఆభరణాలు చెక్కడానికి వాడే సాధనం చూ చిత్రం-132 (కో 1,12)

# గ

**గంగ సింధూరం** · రూపా గంగ చందూరం పర్యా కాషాయ రంగు కొండపల్లి బొమ్మలకు వేసే రంగు (కో 26)

**గంగడోలు** ఆవు మెడ కింది భాగం కొండపల్లి బొమ్మలు చేసేవారు చేసే ఆవు బొమ్మలో భాగం (కో.26)

**గంగా జమునా పద్ధతి** లోహం పనిలో ఒకే రేకుపై కొంత భాగం బంగారం పూత, కొంతభాగం వెండిపూత రావాలంటే అవలంబించే ఎలక్ట్రిక్ పద్ధతి. (తె 12)

**గంగాణం :** లోహం పనిలో చేసే ఒక పెద్ద పాత్ర గంగాళం (తె 10)

**గంగిరేగి** · కొయ్యపనిలో మంచం, కుర్చీలు చేయడానికి వాడే కొయ్య (కో 35)

**గజం** కొలత మూడు అడుగులు (కో 4, తె 6,13, రా 10)

**గజం బద్ద** స్కేలు (కో 6,9)

**గజం ముక్క** . చేతికర్రల తయారీలో కొయ్యని సగం పొడవు కోసిన భాగం (కో 23)

**గజ్జల వడ్డాణం** . నడుముకి తగిలించుకునే ఆభరణం (కో 3)

**గజ్జె** తోలుబొమ్మలాట చెప్పేవారు కాళ్ళకు కట్టుకునే మువ్వ కంచుతో చేస్తారు (కో 3,7,15,37, తె 1,6,8, రా 2,10)

**గజ్జలపోగర** · లోహం పనిలో వాహనాలు చేయడానికి వాడే సాధనం. (కో 31)

**గంజి కుంటోండ్లు :** చూ ఏనూటి వాండ్లు చాకలి వారిలో అడుక్కునే వారు (తె 9)

**గంజిపిండి** పేపరు మట్టి బొమ్మల తయారీలో వాడేది మైదాపిండి మాదిరిగా ఉంటుంది (కో 41)

**గంజీపు** · నిర్మల్ బొమ్మలు తయారు చేసేవాళ్ళు చేసే పేకముక్కల్లాగ ఉండే గుండ్రని కొయ్యముక్క (తె 4)

**గంజీప్‌డబ్బా .** నవాబుల కాలంలో ఉపయోగించే ఒక డబ్బా దీన్ని ఒక ఆటకు ఉపయోగించేవారు. ఇందులో 96 గంజీపులుంటాయి (తె 4)

**గట్టి(దనం)** చేతికర్రల తయారీలో పిడికి వాడే కొమ్ము గట్టిగ ఉండటం (తె 5)

**గట్టు(కట్టు) :** మట్టి, సుద్ద, కాగితం గుజ్జు బొమ్మల తయారీలో మోల్డింగ్ అచ్చుకి చుట్టూ ఎత్తుగ కట్టే కట్ట. (కో 27)

**గడకర్ర** చేతికర్రల తయారీలో వాడే కట్టె (కో 23)

**గడప్పచ్చ :** చూ అద్దిలం. పసుపురంగు, రంపం పొట్టు బొమ్మలకు వేస్తారు (కో 40)

**గడ్డ .** లోహం పనిలో అతకటానికి వాడే వెలిగారం ఘనరూపంలో ఉండటం. (తె.1)

**గడ్డరంగు :** రంపం పొట్టు బొమ్మలకు వేసే రంగు. (తె 9)

**గడ్డలబరం** · లోహం పనిలో వాహనాల తయారీలో చిల్లులు కొట్టటానికి వాడే సాధనం. (కో.31)

**గణపతి(ప్రార్థన) .** 1 చూ. కదురు (తె 8)

2. తోలు బొమ్మలాటవాళ్ళు మొదట ప్రార్థన చేసే దేవుడు (రా 10)

**గంట** రాతిపనిలో నంది విగ్రహం మెడ కింద చెక్కేది. (తె.6)

**గంట చాపు పేవడా :** పూర్వం పెండ(పేడ) బొమ్మలకి వేసే పసుపురంగు (తె.4)

**గంటె :** 1 కొయ్యపనిలో చేసే చెంచా (కో 35)

2 కొలిమిలో బొగ్గులు వేయటానికి వాడే గరిట. (తె 1,4,12)

**గద్దపాము** · నిర్మల్ బొమ్మల తయారీలో ఒక బొమ్మ. (తె 4)

**గద్దూలి** కొమ్ము బొమ్మల తయారీలో ఉపయోగించే పరికరం చూ చిత్రం-110 (కో 9)

**గద్దె** · లోహం బొమ్మల తయారీలో విగ్రహాలను ఉంచటానికి చేసేది చూ చిత్రం-21 (తె 1)

**గద్దెకెక్కించు** · కొయ్యపనిలో దేవుని బొమ్మను సింహాసనం మీద ఉంచు (కో 13)

**గంధకపు తేజాపు** ఫిలిగ్రీపనిలో వెండి, బంగారం వస్తువుల్ని శుభ్రం చేయడానికి వాడే ద్రవ్యం ద్రవరూపంలో ఉంటుంది (తె 1)

**గంధర్వ** కొయ్యపనిలో సింహద్వారంపైన చెక్కే డిజైన్ (కో.3)

**గన్నుకోరాం** · లోహం పనిలో ఉపయోగించే పరికరం. చూ చిత్రం-149. (తె 1)

**గన్నేరివాన** పర్యా గన్నేరు పువ్వు నిర్మల్ బొమ్మల తయారీలో గన్నేరు పువ్వు అచ్చు నమూనా పేరు (తె 4)

**గర్భగోళం :** తోలుబొమ్మల తయారీలో వాడే చర్మం లోపలి భాగం (కో 30)

**గరం(చేయు) .** చూ. అగ్గిచూపు వేడిచేయు (తె.8,12)

**గరుకు** కొయ్యపనిలో వాడే కొయ్య, లోహం పనిలో మోల్డ్ తీసిన బొమ్మ గొగ్గులు గొగ్గులుగా ఉండటం (కో 6,18,33, తె 2, రా 4)

**గరుకుకాయితం .** పర్యా మెరుక్కాయితం, ఉప్పు కాయితం, సాండ్ పేపరు, సైన్ కాయితం. చూ. ఎమ్మీపేపరు, అంసకాగితం (కో 16,19,27)

**గరుడవాహనం** లోహం పనిలో చేసే దేవాలయాలలో ఉండే పక్షి వాహనం (కో 19)

**గరుత్మంత :** కొయ్యపనిలో దూరి పలకమీద వేసే బొమ్మ (రా 4)

**గల్తకోరాం :** లోహం పనిలో పాత్రలకి నగిషీ చెక్కటానికి వాడే సాధనం చూ.చిత్రం-145 (తె 1)

**గవళ** తోలు బొమ్మలాటలో వాడే రాగం పేరు (రా 2)

**గవ్వ(కట్టు) :** గవ్వ బొమ్మల తయారీలో వాడే కట్టు చూ.చిత్రం-31 (తె 14, రా.5)

**గవ్వబొమ్మ :** గవ్వలతో చేసిన బొమ్మ చూ చిత్రం-25,26 (తె 14, రా 5)

**గాజుపూస** · ఫిలిగ్రీ పనిలో వస్తువుల్ని మెరుగు చేయడానికి వాడే రవ్వ (తె 8)

**గాజుల స్టాండు** . కొయ్యపనిలో చేసే గాజులు తగిలించుకునే పరికరం. (కో 23)

**గాడి :** పర్యా. గాటు లోహం పనిలో, కొయ్యపనిలో, దంతం పనిలో బొమ్మలకు, వస్తువులకు పెట్టిన లోతైన గీత (కో 3,6,7,9,14,28, తె 8,10,13, రా.4)

**గాడిగుల్ల :** కొయ్యపనిలో చెక్కకి పొడవుగ గుంట గీయడానికి వాడే సాధనం (కో 16)

**గాడిదూగోడా** కొయ్యపనిలో లోతుల్ని సాపు చేయడానికి వాడే సాధనం. (తె 13)

**గాడిపోగారు :** కొయ్య బొమ్మలకి హారాలు చెక్కేప్పుడు గుండ్లు, గుండ్లుగ రావడానికి వాడే సాధనం (రా 4)

**గాడిరాయి** ఫిలిగ్రీపనిలో వెండి కడ్డీలుగా రావటానికి పొడవు గాడి ఉండే రాయి (తె 8)

**గాడిసీర్నం :** పర్యా ఒకటవ సీర్నం, రేకల సీర్నం కొయ్యబొమ్మకి ఆభరణాలు చెక్కేందుకు వాడే పరికరం (రా 4)

**గాత :** లోహం పనిలో వాడే తరిణ దొడ్డిలో భాగం (కో 8)

**గాతకర్ర** · గాలిచెట్టు కర్ర లక్క బొమ్మలకి వాడేది (కో 12)

**గాలి(తగలడం)** · తోలు బొమ్మలకి రంగులు వేసి ఆరపెట్టటం. (రా.2)

**గాలిపంకా** · చూ గాలితిత్తి కొలిమిలో గాలి రావటానికి వాడేది (బ్లోవెల్) (కో 28)

**గిట్ట :** లోహం పనిలో చేసే వాహనాల కాళ్ళ చివరి భాగం (కో 31)

**గిట్టుబాటు** చేసిన పనికి ప్రతిఫలం లభించటం (కో 27, రా 4)

**గిరలు** . కొయ్యపనిలో పూర్వం వాడే కొలత రెండున్నర అంగుళాలు (తె 13)

**గిరాకి** · అమ్మకం ఎక్కువగా ఉండటం (కో 13,14; తె 1)

**గిర్ని :** రూపా గిర్నీ పిండిమర (తె 4,7)

**గిర్మిట్** · కొయ్యపనిలో రంధ్రాలు చేయడానికి వాడే సాధనం (తె 13)

**గీకు** . 1 తోలుబొమ్మల తయారీకి వాడే చర్మాన్ని వెంట్రుకలు లేకుండా శుభ్రం చేయు (రా 12)

2 పర్యా గోకు. లోహం పనిలో విగ్రహాల నగిషీకి లాగెతో రుద్దు (తె 1)

**గీకుడు రేకు** చేతికర్రల తయారీలో కర్రని నునుపు చేయటానికి వాడే రేకు (తె 5)

**గీత(కొట్టు) :** పర్యా. గోర వస్తువుల్ని చేసేప్పుడు ముందు కొలతని గుర్తుగ గీసుకోవడం (కో.4,5,6,7,16,19,32; తె 2,5,6,7,12, రా.5,6,13)

**గీతకట్ట** . చూ కొలతబద్ద స్కేలు, కొలతబద్ద. (కో 3; రా 6,35)

**గీతపలక** · కొయ్యపనిలో కొలతలు చూడడానికి వాడే సాధనం. చూ చిత్రం-176 (కో.35)

**గీతమొల :** లోహం పనిలో ఉపయోగించే పరికరం చూ.చిత్రం-126 (కో 31)

**గీయు** చిత్ర లేఖనంలో బొమ్మల్ని వేయు కొయ్య పనిలో చెక్కపై గుర్తులు పెట్టు (కో 6,19,41; తె.6, రా 5)

**గుగ్గిలం** : వార్నీష్‌తయారీలో వాడే ద్రవ్యం (కో 8,19,24,28, తె 1,3,4,9,12; రా 5)

**గుచ్చు** · తోలు బొమ్మలాటలో తెరకి బొమ్మకి అంటుకొని ఉండటానికి తుమ్మముల్లు పెట్టు (కో 30)

**గుచ్చెలు** : లోహం పనిలో విగ్రహానికి, చీరల మీద, కడియాల మీద వేసే డిజైను. (తె 1,12)

**గుజారు** : పర్యా. గుజ్జు; గుజ్జు గింజ కొమ్ము బొమ్మల తయారీలో వాడే కొమ్ము లోపల ఉండే గుంజు వంటి పదార్థం (కో 9)

**గుంజ(-కొట్టు)** · జగ్గు తయారీలో జగ్గుకి వారు బిగించు (తె 22)

**గుట్టల మొల** రూపా గూటికమొల. లోహం పనిలో విగ్రహానికి అర్ధ చంద్రాకారంగా డిజైన్ చెక్కడానికి వాడేది చూ చిత్రం-136 (తె 1,10,12)

**గుడ్లతెలుపు** : రంపం పొట్టు బొమ్మల తయారీలో బొమ్మ కళ్ళకి వేసే రంగు. (కో.40)

**గుడ్డ** : చూ. క్లాతు బట్ట, వస్త్రం. (కో 3,4,6,7,41, తె 3,9)

**గుడ్డగుండు** : లోహం పనిలో ముందు అండ చేయడానికి వాడే చౌడు మట్టిలో కలిపే చిన్న చిన్న గుడ్డ ముక్కలు. (కో 1)

**గుడ్డతో రాయు** కొయ్య బొమ్మల తయారీలో గుడ్డని నానబెట్టిన మద్దలో ముంచి బొమ్మకు పూయు. (కో 13)

**గుడ్డ బిగింపు** · తోలు బొమ్మలాటలో స్టేజీ ముందు భాగంలో తెరను బిగించి కట్టడం. (రా.2)

**గుడ్డబొమ్మ** : తోలు బొమ్మ లాడించటానికి గుడ్డ తెర కడతారు కాబట్టి తోలు బొమ్మల్ని గుడ్డ బొమ్మ లంటారు. (కో.15)

**గుడ్డమూట** . చేతికర్ర తయారీలో కర్రకి వార్నిష్‌పూయుటానికి బట్టను దగ్గిర పట్టుకోవటం (కో 23)

**గుడ్డవత్తి** . దీపంలోకి వాడే బట్టను మెలిపెట్టిన వత్తి (కో 27,30,33)

**గుంటకలప రాకు పసరు** · తోలు బొమ్మలకు వాడే నలుపు రంగు తయారీలో పళ్ళానికి పూసే ద్రవ్యం. (కో.15)

**గుండ** . 1 పొడి పొడరు (కో 3,4,7)

2 గుండ్రం (Round) (కో 1,5,7,20,41,42; తె.14; రా.9)

**గుండిమెట్టు** : చేతికర్రలకు చేసే మెట్టు నమూనాలో ఒక రకం (తె 5)

**గుండీ** : 1 గురిగింజ ప్రమాణం ఫిలిగ్రీ పనిలో వాడుతారు. (తె 4)

2 కొమ్ము పనిలో తయారు చేసే చొక్కాకి వాడే వస్తువు (కో 32)

**గుండు** · 1. బిందె తయారీలో ముందు రేకును వంపు చేయడానికి వాడే వస్తువు (కో.4)

2 కొయ్యపనిలో చెక్కే గుండ్రంగా ఉండే ఉచ్చు (రా 4)

3 మువ్వలోపల గుండ్రంగా ఉండే భాగం. (తె.8)

4 తోలుబొమ్మల తయారీలో బొమ్మలకు చెక్కే డిజైన్. (రా 2)

**గుండు చీర్ణం** : రూపా గుండ్ల సీర్ణం

1 తోలు బొమ్మలకు ఆభరణాలు చెక్కటానికి వాడే సాధనం (కో 37)

2 కొయ్యపనిలో బొమ్మలకు గుండ్రంగా, సున్నాలాగా చెక్కటానికి వాడే సాధనం చూ చిత్రం-120 (రా.4)

**గుండుపోగర** · తోలు బొమ్మలకు ఆభరణాలు చెక్కేప్పుడు గుండ్రంగా చిల్లులు చేయటానికి వాడే సాధనం. (రా.10)

**గుండె**: పర్యా గుండికాయ కొయ్యపనిలో వాడే కొయ్యమొద్దు (రా 4)

**గుండ్రని లాకెట్** . ఫిలిగ్రీ పనిలో చేసే వస్తువు (తె 8)

**గుండ్ల డిజైన్** లోహం పనిలో విగ్రహాలకి గుండ్రంగా చెక్కటం (తె.1,8)

**గుండ్లపూస** కొయ్య బొమ్మలకి చెక్కే కంఠాభరణం (తె 7)

**గుత్త**: కొయ్యపనిలో బొమ్మల్ని 'కాంట్రాక్టు' తీసుకోవటం (తె 13)

**గుత్తి**: తోలు బొమ్మలాటలో వాడే గజ్జెల తయారీలో గుచ్చిన మువ్వల దండ (కో 7)

**గుంత** పర్యా గుంట (కొట్టు, తీయు)

1 కొయ్య పనిలో చేసే చెమ్చాలకు చివర ఉండే గుంట (కో 35)

2 లోహం పనిలో బొమ్మలను అక్కడక్కడ లోతుగ చెక్కిన భాగం (కో 27; తె 12;)

3. కొయ్యపనిలో బొమ్మలకి లోతుగా చెక్కటం, లోతు తీయటం (తె.4, రా 4)

**గుద్దేరాయి** . అడ్డయంత్రం సమీపంలోని రాయి అడ్డసీకు చివర తొడికి కొయ్య దిమ్మని బిగించటానికి అడ్డసీకులో దిమ్మపెట్టి ఈ రాయిని కొడతారు (కో 12)

**గునపం** లోహం పనిలో రేకుని వంచటానికి నేలలో దింపే సాధనం (తె 1)

**గుబ్బ** గడ్డల బరాంలో భాగం (కో 31)

**గుబ్బేగర** · లోహం పనిలో వాహనాల తయారీలో వాడే వస్తువు. (కో 31)

**గుమ్మటం** పెద్ద ముద్ద, పెద్ద కడ్డీ (తె 8)

**గుమ్మటేకు** . పర్యా గుమ్మడి కర్ర

సంగీత పరికరాలకి, కొయ్య బొమ్మలకి వాడే కొయ్య (కో 7,16, తె.3)

**గుర్రపోళ్ళు** . మాలవారిలో కధలు చెప్పి అడుక్కునే వారు (తె 9)

**గుర్రం** · బొమ్మలు చేసేవాళ్ళు చేసే ఒక జంతువు బొమ్మ (కో.16,40)

**గుర్తు** : కొయ్యపనిలో, ముందు గీసిన ఆనమాలు (కో 6, తె 2, రా.5,13)

**గుల్ల** 1. గాజుల తయారీలో లక్కని పొడిగ కొట్టడం (తె 1)

2 పర్యా డొల్ల కోడిగుడ్డు పై భాగం (కో 25)

**గుల్ల(కొట్టు)** : 1 లక్క బొమ్మల తయారీలో లోపలి భాగం డొల్లచేయు (కో.11)

2 చేతికర్రల తయారీలో కర్రని గుండ్రంగా చేయు (కో 23)

3 కొయ్యపనిలో వస్తువుల లోపలి భాగం డొల్ల చేయు (కో 12)

**గూటం** . కొయ్య, లోహం పనిలో డిజైన్లు చేసేప్పుడు సుత్తికి బదులు వాడే చింత కొయ్యతో చేసిన సాధనం (కో 9,34, రా 3,4,5,6)

**గూటికమొల** : లోహం పనిలో గుంట చేయడానికి ఉపయోగించే సాధనం చూ చిత్రం-128 (తె 12)

**గూటిమసి** · పర్యా మసికరడు, మసిపొడి తోలు బొమ్మకి వేసే నలుపు రంగు తయారీకి వాడే పొగమసి. (కో 37)

**గూడెత్తు** కొయ్యపనిలోవాడే తోపుడులో ఉండేరేకు (కో 16)

**గూడెం**: గుడిసెల సమూహం (తె 9)

**గూనపెంకులపొడి**: లోహం పనిలో అట్టె తయారీకి వాడే (ఇంటిమీదవేసే) పెంకుల పొడి (తె 10,12)

**గేజింగ్** · కొయ్యపనిలో చెక్కకి చిల్లులు చేయుటం (కో 35)

**గేడి భాగం**: పర్యా కన్నీరు కొయ్యపనిలో బ్లాకులు చేయడానికి వాడే భాగం (కో 41)

**గేదెకొమ్ము** 1. కొమ్ము పనిలో వాడే వస్తువు (కో 1,9,23,32; తె 12)

2 పర్యా. బర్రెకొమ్ము తోలు బొమ్మలకి డిజైన్ చెక్కేప్పుడు బొమ్మ అడుగున పెట్టే వస్తువు (కో 15,30)

**గొగ్గులు** · లోహం పనిలో విగ్రహానికి చెక్కే హెచ్చు తగ్గులు (తె 1)

**గొట్టం** 1 లోహం పనిలో నిప్పును ఊదటానికి వాడే సాధనం (తె 8)

2 పర్యా మెట్టె లోహం పనిలో చేసే కొవ్వొత్తి స్టాండుకి పైన కొవ్వొత్తి పెట్టడానికి ఉండే భాగం (తె 12)

**గొడ్డ** : సన్నికల్లు. మట్టిని మెత్తగా చేయటానికి వాడేది (కో 1)

**గొడ్డు నరం** · లోహం పనిలో పంకా తిప్పడానికి వాడేతాడు (తె 12)

**గొబ్బెమ్మసెట్లు** : కొండపల్లి బొమ్మల తయారీలో ఒక రకం సెట్టు. (కో 26)

**గొర్రె** ఒక జంతువు తోలు బొమ్మల తయారీకి దీని చర్మం వాడుతారు (కో 29, రా.8)

**గొలుసు** · 1. ఫిలిగ్రీ, రోల్డుగోల్డు పనిలో చేసే వస్తువు (కో 27)

2. చూ కంఠమాల. కొయ్యపనిలో బొమ్మకు మెడలో చెక్కే ఆభరణం (తె 1)

**గోకు** : తోలు బొమ్మల తయారీలో ముందు చర్మాన్ని శుభ్రం చేయు (రా 10)

**గోతం(పీచు)** : కొయ్య బొమ్మల తయారీలో వాడే 'లప్పం' తయారీలో రంపం పొట్టులో కలిపే గోనుసంచి పీచు. (కో 39)

**గోందు** : జిగురు (తె 1,2,9)

**గోపురం** : 1 కొయ్య పనిలో బంగళా మీద అలంకరించటానికి చేసే భాగం. (తె 13)

2. కొయ్య పనిలో చేసే దృశ్యంలో భాగం (తె 7)

**గోపికాకృష్ణుడు** : కొయ్యపనిలో చేసే బొమ్మ. (రా.4)

**గోరక దంతం పని** : చేతి కర్రల తయారీలో ఎక్కువగా కష్టపడవలసిన పని చాలా పెద్ద పని విధానం (process) ఉన్న పని. (తె.5)

**గోరంచు** : బీరపీచు సంచుల తయారీలో చివర సన్నగా మడిచి కుట్టిన మరో గుడ్డ. (కో 32)

**గోరు** . గోరుసీర్షం అంచు ఉండే పద్ధతి. (రా 4)

**గోరుఅలుగు** : బొద్దుతోపుడు లోని బ్లేడ్. (రా 4)

**గోరుఉలి** : రూపా. గోరులి. పర్యా చిన్న ఉలి.

1. కొమ్ము బొమ్మల తయారీలో వాడే సాధనం. (కో.1)

2. కొయ్య పనిలో బొమ్మ నునుపు రావటానికి వాడే సాధనం (కో 11,12)

**గోరుగల్** : రూపా గోర్గల్, గోరుగల్లు. తోలు బొమ్మల తయారీలో చర్మం మీద డ్రాయింగ్ వేయటానికి వాడే సాధనం. చూ.చిత్రం-118. (కో.15,37; రా.2)

**గోరుచీర్లం** : కొయ్యపనిలో బొమ్మలకు నడుము మొదలైన సన్నటి భాగాలు చెక్కేందుకు వాడే సాధనం. (కో.18,41, తె.13, రా.3,4,5,6)

**గోరుపోగర** : లోహం పనిలో విగ్రహం చెక్కటానికి వాడే సాధనం (కో 18,39)

**గోరుమొల** . లోహం పనిలో విగ్రహం చెక్కటానికి వాడే సాధనం (తె.10)

**గోలుతీయు** . కొయ్యపనిలో గుండ్రంగా చెక్కు (తె.13)

**గోల్డుకవరింగు** : రోల్డుగోల్డు వస్తువుల తయారీలో వస్తువులకి పూసే బంగారు పూత. (కో.33)

గోవర్ధన గొలుసు : లోహం పనిలో చేసే అలంకరణ వస్తువు చూ చిత్రం-89. (కో 39)

గోళీకాయ · కొయ్యబొమ్మలకు కన్నులుగా పెట్టేందుకు వాడే వస్తువు (కో 19)

గొడజట్టీలు గొండ్లవారిలో అడుక్కునేవారు. (తె 9)

గొడ పురాణం . గొండ్ల వారిలో అడుక్కునే వారు చెప్పే కథ. (తె 9)

గొండ్లశెట్టిపటం : గొండ్లవారి ఎల్లమ్మ కథను తెలిపే బొమ్మ (తె.7)

గొర . లోహం పనిలో చేసే పూలతొట్టిపై భాగం (తె 12)

గ్యాపు లోహం పనిలో చేసే విగ్రహాలకి అక్కడక్కడ ఉండే ఖాళీ స్థలం (తె 12)

గ్రాఫైట్‌మూస : లోహం పనిలో లోహాన్ని కరిగించటానికి వాడే పాత్ర (కో 1)

గ్రాస్ మెటల్‌పాలిష్ : లోహం పనిలో విగ్రహం మెరుగు పెట్టటానికి వాడే ద్రవ్యం (కో 1)

గ్రీజు : బొమ్మలకి పాలిషింగ్ చేసేముందు గుడ్డకు పూసే జిగురు (రా 11)

గ్రేసరు రాతిపనిలో ఉపయోగించే పరికరం. చూ చిత్రం-158 (రా 5)

గ్రైండరు : లోహం పనిలో బొమ్మలు నునుపు రావటానికి వాడే సాధనం. (తె 1)

గ్లాస్కోగుడ్డ : తోలుబొమ్మలాట స్టేజికి ముందు వైపు కట్టే తెల్లటి బట్ట (కో 37)

గ్లాస్కోపంచె . చూ గ్లాస్కోగుడ్డ (రా 7)

# ఘ

ఘట్టన : లోహం పనిలో బొమ్మకి ఆకారాలు చెక్కడం. (కో.12)

ఘట్టనపోగర లోహం పనిలో విగ్రహం చేయడానికి వాడే సాధనం (కో 1)

ఘనరూపం · వెలిగారం గట్టిగ ఉండటం (రా.11)

ఘనాదులు పర్యా శివసత్తులు సిగం ఊగేవాళ్ళు

# చ

చకనం మొల . ఫిలిగ్రీ పనిలో వెండి రేకుతో కళ్ళు మొదలైనవి చేయటానికి వాడే సాధనం (తె 1)

చక్క · కొయ్యపనిలో వాడే కర్ర (కో 7, రా 5)

చక్కగ పర్యా తిన్నగ తోలు బొమ్మల తయారీలో చర్మాన్ని సమానంగా కోయటం (కో.37)

చక్కటి వాల్మోలి . లోహం పనిలో చక్కగ గీత కొట్టడానికి వాడే సాధనం (తె 12)

చక్రాలుకోయు(ట) కొయ్యపనిలో బండికి గుండ్రంగా చక్రం చేయటం (కో.16)

చటాక్ . లోహం పనిలో వాడే కొలత ఏభై గ్రాములు (తె 12)

చట్రం · కొయ్యపనిలో మంచం ఆకారంగా చేసిన భాగం (కో.35)

చదరపు పోగరు లోహం పనిలో బొమ్మలు చేయటానికి వాడే సాధనం (కో.39)

చదరం . కొయ్యపనిలో బొమ్మలను మట్టం సీర్షంతో చేసిన నలుపలకలు (రా 4)

చదరుగీత కొయ్యపనిలో హంసబొమ్మ వంటి మీద వేసే గీత (రా 4)

చదరం లేగ బిందెలు చేసేప్పుడు ఉపయోగించే సాధనం (కో 4)

చదువు : విద్య. (రా 2)

చంద్రహారం : లోహం పనిలో చేసే ఒక రకం ఆభరణం. చూ.చిత్రం-92. (కో.39)

**చపాతి పిండి** : కాగితం గుజ్జు, బొమ్మలు చేసేప్పుడు ముందు కాగితం గుజ్జును మెత్తగ చేయటం (కో 41)

**చమురు దీపం** పూర్వం తోలు బొమ్మలాట ఆడేవాళ్ళు పెట్టే ఆముదం దీపం (రా 10)

**చంప సరం** · తోలు బొమ్మలకి చెక్కే ఆభరణం ఇది ముక్కుకి, చెవుకి తగిలించి ఉంటుంది (రా 2)

**చరమ నాటకం** · పర్యా తోలుబొమ్మలాట, చొమ్మరాట, బొమ్మలాట తోలు బొమ్మలాట (కో 7)

**చరాపుమొల** . లోహం పనిలో ఉపయోగించే పరికరం చూ చిత్రం-125 (కో 39)

**చర్మగతి నాటకం** తోలు బొమ్మలాట (రా 2)

**చర్మమూత** తోలుమూత (కో 7)

**చర్మం** · తోలు (తె 2 3, రా 2,9,10)

**చర్మం ఊను(ట)** తోలు బొమ్మల తయారీలో ముందు తోలుని ద్రావకం నీటిలో పెట్టినప్పుడు తోలు నాను (కో 30)

**చర్మం బిళ్ళ** . తోలు బొమ్మల భాగాల్ని కలిపేప్పుడు వాడే తోలు బిళ్ళ (రా 2)

**చర్మం వేయు(ట)** కొయ్యపనిలో బొమ్మలకి మక్కు పూయు (కో 13)

**చలవ(ముక్క)** ముందు చర్మాన్ని మధ్య భాగం నుండి కోసినప్పుడు బయట ముక్కకి పేరు (కో 7)

**చలాకు** · తోలు బొమ్మల్ని సాపు చేయటానికి వాడే సాధనం (కో 1)

**చల్లారబెట్టు** నిర్మల్ బొమ్మలకి వేసే వార్నిష్‌ని అవిశనూనె, గుగ్గిలంతో కలిపి ఉడకబెట్టిన తర్వాత కొద్దిసేపు ఆరనిచ్చు (తె 4)

**చల్లారు** : వేడిగ ఉన్నది చల్లగ అవటం (కో 1,6, రా 11)

**చవక** · పర్యా బండినగ తోలు బొమ్మలాటలో స్టేజీ నిర్మించటానికి వాడేది (కో 37)

**చవితి** · తోలుబొమ్మలాట ఆడకూడని రోజు (రా 2)

**చవుక** ధర తక్కువ (రా 11)

**చాక్‌పీసు** . 1 సుద్దముక్క దీని మీద బ్లేడుతో బొమ్మలు చెక్కుతారు. (కో 25)

2 కొయ్యపనిలో ముందు చెక్కపై గుర్తు గీసుకుందుకు వాడే వస్తువు (కో 39)

**చాక్‌పొడి** పర్యా సుద్దపొడి, చాక్‌పౌడరు, సీమసున్నం పొడి

1 కొయ్యపనిలో కొయ్యబొమ్మకు కోరాగుడ్డను అతికించి పైనపూసే పిండి (కో 35)

2 సుద్ద బొమ్మల తయారీకి వాడే ద్రవ్యం (కో.17)

**చాకు** 1 చర్మాన్ని సాపు చేయడానికి, కోయటానికి వాడే చిన్న కత్తి (కో 28, తె 1,12)

2 మైనం బొమ్మను చెక్కటానికి వాడే సాధనం. (కో 5,7,42; తె 2,3,5, రా 2,5)

3 చేతికర్రల తయారీలో కర్ర మధ్యన బిగించే కత్తి (తె 5)

**చాక్కోలి** : గవ్వబొమ్మ చూ చిత్రం-38 (రా 5)

**చాక్లెట్ కలర్** · పర్యా గోరెంకల రంగు నిర్మల్ బొమ్మలకు వేసే రంగు (తె 4)

**చాకొలేట్** పత్తి బట్టతో బొమ్మల తయారీలో వాడే రంగు (రా 7)

**చాప** : తోలు బొమ్మలు చేసేప్పుడు కూర్చుందుకు వాడే వస్తువు (కో 37)

**చేప** . చేతికర్రల పిడి నమూనా (తె 5)

**చార** కొయ్య పనిలో బొమ్మలపై వేసే గీత. (రా 4)

**చారలు వేసే గూటం** కొయ్యపనిలో చారలు వేసే సీర్నాన్ని కొట్టడానికి వాడే గూటం (రా 4)

**చావ** · (కొయ్యబొమ్మల) గట్టి భాగం (రా 6)

**చావుదారు** . కొండపల్లి బొమ్మల తయారీలో ఉపయోగించే పరికరం చూ.చిత్రం-112 (కో 29)

**చిక్కదనం** : కొయ్యపనిలో బొమ్మలకు వేసే మక్కు తయారీలో పొయ్యి మీద వేడి చేస్తున్నప్పుడు ముద్దగ అవటం. (కో 16)

**చిట్లాలబొగ్గు** కమ్మర కొలిమిలో వాడే బొగ్గు (కో 28)

**చింద్రగ** · కొయ్యపనిలో మంచం, కుర్చీ చేయటానికి వాడే కొయ్య. (కో 35)

**చితగ్గొట్టు** . లోహం పనిలో మోల్డింగ్ పోసి తర్వాత మట్టిని తీసేసేప్పుడు బద్దలు కొట్టడం (కో 8)

**చిత్రి(పట్టు)** : దూగోడ, కొయ్య పనిలో చెక్కని నునుపు చేయటానికి వాడే దూగోడ (పట్టు) (కో.1,6,9,16, 28, రా 4)

**చిత్రిక గుల్ల** : రూపా. చిత్రీగుల్ల పర్యా తోపుడు, దూగోడ, పాలంగుల్లి చెక్కతో చేసిన దూగోడ చట్రం (కో.16,23,33)

**చిత్రికపళ్ళు** . పర్యా చిత్రిక బ్లేడు దూగోడలో ఉండే ఇనప బ్లేడు. (కో 6,16)

**చిత్రికసాపు** : కొయ్యని చిత్రికతో నునుపు చేయటం (కో 6)

**చిత్రిదిమ్మ** : రూపా చిత్రిక దిమ్మ చెక్కను నునుపు చేయటానికి వాడే సాధనం (కో.9)

**చిత్రీ కాయితం** . చూ ఉప్పు కాయితం (కో 6)

**చిన్న ఆక్సా** : కొయ్యపనిలో చిల్లులు వేయడానికి వాడే సాధనం (రా 5)

**చిన్నకట్టె** : 1. చిన్న కర్ర ముక్క (తె 13)

2 నౌబత్ తయారీలో వాడే కర్ర (తె 2)

**చిన్న కంఠానమొుల** . రంపం పొట్టు బొమ్మలకు చిల్లులు పెట్టటానికి వాడే సాధనం (తె 9)

**చిన్నకారు** : లోహం పనిలో కొలిమిలో మూసలో లోహం కరుగుతుండగా మూసను పట్టుకోడానికి వాడే పట్టుకారు (తె 2)

**చిన్న గుట్టలమొుల** లోహం పనిలో చిన్న, చిన్న అర్ధ చంద్రాకారాల్ని చెక్కటానికి, తామరపువ్వు రేకులు మొదలయినవి చెక్కడానికి వాడే సాధనం చూ చిత్రం-138 (తె 12)

**చిన్న గుండ్రని పోగరు** . తోలు బొమ్మల తయారీలో తోలు మీద బెజ్జాలు తీయడానికి వాడే సాధనం (కో 30)

**చిన్న చిమ్టా** లోహం పనిలో మోల్డింగ్ నుండి నమూనా అచ్చుని పైకి తీసే పట్కారు (తె 1)

**చిన్న పట్కారు** . పర్యా సవనం ఫిలిగ్రీ పనిలో వెండి తీగని స్ప్రింగ్ మాదిరి తిప్పటానికి వాడే సాధనం (తె 8)

**చిన్నపెస్సుత్తె** లోహం పాత్రలకి డిజైన్ చెక్కేప్పుడు వాడే సాధనం (తె 10)

**చిన్న పొడుసుత్తె** లోహం పనిలో రేకు మీద చిన్నగా కొట్టడానికి వాడే సుత్తె (తె 12)

**చిన్న పోగర** · 1 కొయ్య పనిలో వాడే సాధనం (రా.5)

2. తోలు బొమ్మల తయారీలో డిజైన్ తీయటానికి వాడే పరికరం (కో 30)

**చిన్నఫైల్** . లోహం పనిలో బొమ్మలకి చిన్న చిన్న సందులలో నునుపు రావటానికి రుద్దే ఆకురాయి (తె.1)

**చిన్న బద్ద** తోలు బొమ్మల్ని కదిలించడానికి కట్టే పుల్ల. (కో 15)

**చిన్నబ్రష్** కొయ్యపనిలో బొమ్మలకి రంగులు వేయడానికి వాడే కుంచె (రా 5)

**చిన్న బోయోళ్ళు** . వాల్మీకి కులంలో ఉపకులం (రా 10)

**చిన్నమూస** · చూ కుమ్మరి మూస లోహం పనిలో వెండిని కరిగించడానికి వాడే మూస (తె 8)

**చిన్న రంపం** : రూపా సిన రంపం పర్యా సన్నపళ్ళ రంపం కొయ్యపనిలో చిన్న, చిన్న దుంగలని కోయడానికి వాడే రంపం (రా.4,6)

**చిన్న రాయి** : పేపరు, మట్టి బొమ్మల తయారీలో మోల్డ్‌లో

పేపరు ముద్ద వేసి పైన బరువుకి పెట్టే రాయి (కో 40)

**చిన్నవంపు కైవారం :** లోహం పనిలో బొమ్మల మీద గీతలు గీయడానికి వాడే సాధనం చూ చిత్రం-142 (తె 8)

**చిన్నశీర్ణం** రాతిపనిలో ఉపయోగించే పరికరం చూ చిత్రం-167 (రా 5)

**చిన్న పవనం** · చూ చిన్న పట్కారు (తె 8)

**చిన్న సుత్తె** తేలిక పనులు చెయ్యటానికి ఉపయోగించే సుత్తె (కో 7, తె 6,15,1,1, రా 5)

**చింత అంబలి .** పర్యా చింత గింజల అంబలి, తోప, బందన చింత గింజల్ని నానబెట్టి, రుబ్బి, వేపపొట్టు లేదా పొనిక కర్ర పొట్టు కలిపి ఉడకబెట్టి కొయ్య బొమ్మలకి, రంపం పొట్టు బొమ్మలకి పైన పూయటానికి వాడేది (కో 7, తె 1,4,7,9)

**చింతకట్టె :** పర్యా చింతకొయ్య, చింతకర్ర

1 కొయ్య పనిలో డిజైన్లు చెక్కేప్పుడు వాడే కొయ్య గూటం తయారీకి వాడే కర్ర (కో 34)

2 లోహం పనిలో రేకుని చింత దుంగమీద పెట్టి డిజైన్ చెక్కుతారు (తె.1)

**చింతగింజ** · పర్యా చింతపిక్క చింత అంబలి చేయటానికి వాడేది (కో 7,9,25, తె 7,4, రా 13)

**చింతచేవ** మక్కు బొమ్మల తయారీలో ఉపయోగించే పరికరం చూ చిత్రం-172 (కో 7,11)

**చింత జిగురు** పర్యా. తోప. బందన చూ చింత అంబలి (కో 13,26)

**చింతపండు :** లోహం పనిలో వస్తువులు మెరుగు రావటానికి తోమటానికి వాడే పదార్థం (తె 1,8,10,12, రా 5)

**చింతపండు నీళ్ళు .** చూ చింతపండు (కో 33)

**చింతపండు రసం :** చూ. చింతపండు. (కో.39)

**చింతపిక్కల తోపు :** పర్యా. నుక్క. చూ. చింత అంబలి. (కో 26)

**చింతపిక్కల పొడి .** చింతగింజల్ని దంచి చేసిన పొడి చింత అంబలికి వాడతారు (కో.26)

**చింతపులుసు** చూ చింతపండు (కో 31, తె 4)

**చింతబొగ్గు** చింత కట్టె బొగ్గు, నక్ష గీసుకోడానికి వాడే సాధనం (తె 2)

**చింత సరి** చింత గింజలతో చేసిన జిగురు కొయ్య బొమ్మలకి పూయటానికి వాడతారు (రా 13)

**చిందువేయు** తోలు బొమ్మలాటలో బొమ్మల్ని ఆడించేవాడు చెక్క మీద కాలుతో నడుస్తున్నట్లు అడుగులు వేయు. (కో 30)

**చిప్ప** 1 (నిర్మల్) తోలుబొమ్మల తయారీలో బొమ్మలకి రంగు వేసేప్పుడు రంగులు కలుపుకొనేందుకు వాడే కొబ్బరి చిప్ప లేదా మట్టిసాత్ర (కో 30, తె 4,9)

2 లోహం పనిలో వేడైన పదార్థాన్ని తిసి అచ్చు మీద పోసే గరిట (తె.1)

**చిప్పగరిటె** · పర్యా గుంట గరిటె తెడ్డు చూ చిప్ప 2. (తె 1)

**చిప్పచెక్కపల్చన** కొబ్బరి చిప్ప బొమ్మల తయారీలో వాడే కొబ్బరి చిప్ప పల్చగా ఉండటం (కో 32)

**చిరిగిపోవు** కాగితం గుజ్జు, బొమ్మల తయారీలో కాగితం గుజ్జును అప్పడంలా పల్చగా చేసికొనేప్పుడు చినిగిపోవు (కో 41)

**చిలక** కొయ్యపనిలో చేసే డిజైన్ (రా 4)

**చిలక గులాబి** తోలు బొమ్మలకు వేసే చిలక మెడ భాగంలో ఉండే ఎరుపు రంగు (కో 15)

**చిలక పచ్చ** చూ ఆకుపచ్చ తోలు బొమ్మలకి, నిర్మల్ బొమ్మలకి వేసే ఆకు పచ్చ రంగు (కో.15, రా 7)

**చిలకమూతి :** ఫిలిగ్రీ పనిలో చెక్కే డిజైన్ (తె.8)

**చిలటపుళ్ళి :** తోలు బొమ్మల్ని ఆడించటానికి కట్టే పుల్ల. (కో 15)

**చివికిపోవు** . తోలు బొమ్మలకి వేసే రంగు గుజ్జు గుజ్జుగా మారి చెడిపోవటం (కో 30)

**చిల్లి** · పర్యా చిల్లు, బొక్క (సన్నాయి) లోహం పనిలో, కొయ్య పనిలో చేసే చిల్లు (తె 12,13)

**చిల్లు** · చూ చిల్లి (కో 1, తె 1, రా 1,9)

**చివ్వు** : కొయ్యపనిలో చెక్కను నున్నగ చెక్కు (కో 15,39,40, రా 6)

**చివ్వుడు చీర్ణం** రూపా చివ్వే చీర్ణం, చీవే శీర్ణం. కొయ్యపనిలో బొమ్మ ఫినిషింగ్ చేసేప్పుడు వాడే సాధనం (కో 41, రా.5,6)

**చీటీ** · పత్తి, బట్ట బొమ్మల తయారీలో వాడే ఒక గుడ్డ రకం (రా 7)

**చీతాబలం** : కాగితం గుజ్జు, మట్టి, సుద్ద బొమ్మల తయారీలో చేసే 'సీతాఫలం' (కో 17)

**చీర్ణం(కొట్టు)** : 1. కొయ్య పనిలో బొమ్మకి అవయవాలు చేయటానికి వాడే పరికరం (కో 39,13)

2 తోలు బొమ్మల తయారీలో ముందు తోలు మీద బొమ్మ వేయటానికి వాడే సాధనం. (కో 15, రా 2)

**చీరు** : బీరకాయ పీచుతో పర్సు చేసేప్పుడు బీరకాయని మధ్యకు కోయు. (కో 32)

**చీరే శీర్ణం** : కొయ్య పనిలో బొమ్మల తయారీలో వాడే సాధనం. (రా 3,5,6)

**చీల** · 1. మేకు (కో 31,35)

2. అడ్డవారు కాయల చివరన ఉండే భాగం (కో 12)

**చీల్చు** . కొయ్యపనిలో కొయ్యను రెండుగ చేయు (కో 35, రా 4)

**చీవే శీర్ణం** : చూ చివ్వుడు చీర్ణం కొయ్య పనిలో బొమ్మల తయారీకి వాడే సాధనం (కో 15, రా.5)

**చుక్క** . 1 తోలు బొమ్మలకు చెక్కే డిజైను (రా.2)

2 లోహం పనిలో చెక్కే డిజైను (తె 1,12)

**చుక్కమొల** . లోహం పనిలో చుక్కలు కొట్టడానికి వాడే సాధనం (తె 1)

**చుట్టిపెట్టు** తోలు బొమ్మలకి వాడే తోలు శుభ్రం చేసి తరువాత చుట్టగ చుట్టు (రా 10)

**చుట్టు** . ఫిలిగ్రీపనిలో రేకుని గుండ్రంగా చుట్టడం. (కో 27)

**చుట్టిళ్ళు** కొండపల్లి బొమ్మలు చేసేవారు చేసే ఇంటి బొమ్మలు చుట్టు గుండ్రంగా గోడపెట్టి నడుమ నిట్రాడు పాతి దూలాలు లేకుండా కట్టిన ఇళ్లు. (కో 26)

**చుట్టూర** బిందె తయారీలో అతకటానికి వేడి చేసే బిందె చుట్టు భాగం. (కో 4)

**చూరబొగ్గు** లోహం పనిలో కొలిమిలో వాడే బొగ్గు (తె 1)

**చూర్ణం** పర్యా పొడి, పౌడరు, గుండ తోలు బొమ్మలకి వాడే రంగుల పొడి (రా 10)

**చెకనం** . పర్యా శెకనం, చెక్కనం లోహం రేకుమీద శిల్పాన్ని చెక్కడం (తె 6,12)

**చెకనం మొల** లోహం పనిలో నగిషీ చెక్కేందుకు వాడే సాధనం (తె 10)

**చెక్క** : 1. కొయ్యపనిలో వాడేది (కో 1, తె.4,13, రా 13)

2 ఫిలిగ్రీ పనిలో డిజైన్‌లోని భాగాల్ని అతికించటానికి చెక్క మీద వాటిని పెట్టి దీపంతో కాలుస్తారు (తె 8)

3 తోలు బొమ్మలాటలో చప్పుడు రావటానికి కాళ్ళ కింద వేస్కొనే బల్ల. (కో 37; రా 10)

4 లోహం పనిలో లక్కని కరిగించి పోయడానికి వాడే బల్ల (తె 12)

**చెక్కడం పోగు** · ఫిలిగ్రీ పనిలో నగిషీపని చేసిన చెవుల దుద్దు (తె.15)

**చెక్కణపు పోగర** లోహం వాహనాలు చేయడానికి వాడే సాధనం (కో.31)

**చెక్కతెడ్డు** : చెక్కతో చేసిన గుంట గరిట తోలు బొమ్మలకు

వాడే తోలుని ముందు వేడినీటిలో ముంచి సాపు చేయటానికి వాడేది (కో 15)

**చెక్కపీట** 1 చూ చెక్క 3,4 (కో 28, రా 12)

2 పర్యా పీట కాగితం గుజ్జు మట్టిమెత్తగా చేసేందుకు వాడేది. (కో 41)

**చెక్కపెట్టె** : 1 ఫిలిగ్రీ పనిలో వాడే సామానులు పెట్టుకునే పెట్టి (తె 8)

2 శెకనం పనిలో కింది పెట్టె చూ చిత్రం-141 (తె 6,12)

**చెక్కపొట్టు** : కొయ్యపనిలో కొయ్యని సీర్నాలతో చెక్కేప్పుడు రాలిన పొట్టు. (తె.13)

**చెక్కబేంగ** : కొయ్య పనిలో వాడే పరికరం చూ చిత్రం-177 (కో 19)

**చెక్కబొమ్మ** · పూర్వం తోలు బొమ్మలకి బదులుగా వాడే బొమ్మ (రా 2)

**చెక్క ముదుగు రంగు** · కొమ్ము బొమ్మలకి వేసే చెక్క రంగులో ముదురు రంగు (కో 32)

**చెక్కి** . తోలు బొమ్మల తయారీలో ఉపయోగించే పరికరం చూ చిత్రం-116 (రా 5)

**చెక్కు** లోహం పనిలో, కొయ్య పనిలో బొమ్మల డిజైనులు చెక్కటం (కో 1,3,6,19,23,31,41, తె 4,9; రా 1,4,10)

**చెక్కుడు** . చేతికర్రలకు డిజైన్ చెక్కడం. చూ కొయ్యపని (తె 5)

**చెక్కుడు పోగర** లోహం పనిలో విగ్రహం చేసేప్పుడు వాడే సాధనం (కో 1)

**చెక్కోలి** · గవ్వబొమ్మ. (రా 5)

**చెట్టిబల్జి** : ఒక కులం వారు (కో.13)

**చెడుద్రిష్టి** తోలు బొమ్మలాటకు ముందు చెడుదృష్టి తగలకుండా రక్తదానం ఇస్తారు (రా 2)

**చెత్త** లోహం పనిలో తేనె మైనం కరిగించి వడపోసినప్పుడు గుడ్డలో మిగిలే పదార్థం (తె 12)

**చెదలు** : కొయ్యకు పట్టే పురుగులు (తె 13)

**చెన్ని** లోహం పనిలో బొమ్మకున్న చిన్న భాగాలు ముక్కు, కన్ను, చెవులు స్పష్టంగా కనపడడానికి వాడే పరికరం (తె 1)

**చెమ్మ** · 1. తోలు బొమ్మలకి వాడే చర్మం తడిగ ఉండటం (కో 30)

2 ఫిలిగ్రీ పనిలో పాలిష్ మిషన్‌లో వస్తువులకు ఉండే తడి (కో 27)

3 పర్యా తడి కొయ్య పనిలో బొమ్మలకు, మక్కుపెట్టినప్పుడు ఉండే తడి (కో.26)

**చెంబు** : లోహం పనిలో తయారు చేసే వస్తువు (తె 12)

**చెయ్యి బాడిశ** కొయ్య పనిలో చెక్కడానికి వాడే సాధనం. (రా 5)

**చెయ్యి రంపం** కొయ్య పనిలో చెక్కను కోయడానికి వాడే చిన్న రంపం (రా 5)

**చెవికమ్మలు** : లోహం పనిలో చేసే చెవులకి పెట్టుకునే అభరణం చూ చిత్రం-48 (తె 12)

**చెవు(లు)** . కొయ్య బొమ్మలకు కొన్నిటికి రేకుతో చేసే చెవులు (తె 4)

**చేతికర్ర** · కొయ్య పనిలో చేత్తో పట్టుకొందుకు చేసే కర్ర (కో 23,35, తె 5)

**చేతికర్రలపని** · చేతికర్రల తయారీ (తె 5)

**చేతికుట్టు** బీరకాయ పీచు సంచుల తయారీలో సంచి లోపలవైపు బట్టవేసి చేతితో కుట్టు (కో 32)

**చేతికోత** : కొయ్యతో చెంచాలు చేసేప్పుడు ముందు కొయ్యని ఆకురాయితో అరగదీయటం (కో 35)

**చేతి కంకణం** . ఫిలిగ్రీ పనిలో చేసే చేతికి వేసుకునే లావు గాజు. (తె 15)

**చేతి గుండీ** · బొత్తాం పొడుగు చేతుల చొక్కాకి చేతి చివర పెట్టుకునే వెండి నగిషీ చేసిన బొత్తాం (తె 8)

**చేతి తీగ** : ఫిలిగ్రీ పనిలో రాట్నం మీద తీసిన వెండి తీగ (తె 8)

**చేతిపని** కొయ్యపనిలో చేత్తో చేసే పని (తె 13, రా 13)

**చేతి బర్మా** కొయ్యపనిలో, లోహం పనిలో రంధ్రాలు చేయడానికి వాడే సాధనం (కో 35, తె 12)

**చేత్తో తొలుచు** లోహం పనిలో ముందు మైనం బొమ్మకి ఆకారం చేతితోనే చెక్కు (కో 33)

**చేపమూతికర్ర** . చేతి కర్రలలో చేపమూతి పిడిగల కర్ర (తె 5)

**చేపమొకం** చేప మొకం ఉన్న చేతి కర్ర పిడి (తె 5)

**చేబాడిత** . రూపా చేయి బాడిస చూ చెయ్యి బాడిశ (కో 32,41)

**చేయిఆడు** తోలు బొమ్మలాటలో ఆడించేవాడు చేయిని కదపటం (రా 2)

**చేయి రంపం** : చూ. చెయ్యి రంపం (కో 23)

**చేయు** పనిచేయటం (కో 31,34,41, రా 1)

**చేలు** అలంకరణ వస్తువు చూ చిత్రం-15 (రా 11)

**చొక్కా గుండీ** చొక్కాలకు పెట్టుకునే బొత్తాం చూ.చిత్రం-75 (కో 25)

**చొట్ట(లు)** : పర్యా పల్లం కొయ్యపనిలో బొమ్మలు సాపుగా లేకుండా గుంటలుగా ఉండటం (కో 28, తె 1)

**చోవి** గవ్వ బొమ్మ (రా 5)

**చౌకం** రూపా. చొక్కం మంచి, స్వచ్ఛమైన (తె.7)

**చౌకం ఎండి** మంచివెండి, నిప్పులో పెట్టిన వెండి (తె 8)

**చౌకం కోరాం** : లోహం పనిలో ఉపయోగించే పరికరం చూ చిత్రం-148 (తె 8)

**చౌకలు** : రూపా చౌకేట్ పర్యా డైమన్ లోహం పనిలో ఒక డిజైను పేరు (తె 1,12)

**చౌడుమట్టి** లోహం పనిలో ముందుమట్టి బొమ్మ చేయడానికి వాడే మన్ను (కో 1)

# ఛ

**ఛత్రీవంపు** పర్యా ఛత్రీనమూనా చేతి కర్రల తయారీలో పిడిని గొడుగుకామ మాదిరి చేసే వంపు (తె 3,5)

**ఛత్రికడ్డీ** తోలు బొమ్మలని ఆడించటానికి కట్టే పుల్ల. (రా 10)

**ఛిద్రం** ఫిలిగ్రీ పనిలో వస్తువులకు చేసే చిల్లు (తె 8)

# జ

**జక్కమ్మ కమ్మలు** : చెవులకు పెట్టుకొనే ఆభరణాలు చూ చిత్రం-51 (తె 4)

**జంగం** ఒక జాతి (కో 19, తె 1)

**జడకుప్పెలు** ఫిలిగ్రీ పనిలో చేసే జడలకు చివర పెట్టుకునే కుప్పెలు (కో 33)

**జడగంటలు** · రోల్డుగోల్డు వస్తువుల తయారీలో జడలకు పెట్టుకునే గంటలు చూ చిత్రం-73 (కో 27)

**జడపిన్ను** ఫిలిగ్రీ పనిలో తలకు పెట్టుకునే వెండితో చేసిన పిన్ను (తె 8)

**జతచేయు** బొమ్మల తయారీలో సమానమైన గవ్వలను తీయు (రా 5,5)

**జనపనారతోక** కొయ్య పనిలో గుర్రం బొమ్మలకు పెట్టే తోక (కో 13)

**జంతుబలి** కొయ్య పనిలో విగ్రహం పూర్తయిన తరువాత జంతువుల్ని బలిఇవ్వటం (రా 4)

**జందెం మీద వళ్ళు** · చూ చిత్రం-17 (కో 25)

**జప్పన** ఫిలిగ్రీ పనిలో కడ్డీని సుత్తితో కొట్టినపుడు తొందరగా మెరుగవడం (తె 8)

**జములు పోగర** . లోహం పనిలో వాహనాలు చేయడానికి వాడే సాధనం (కో 31)

**జంపు** : పర్యా పొడవు, నిడివి పొడవు (రా 2)

**జంపెతాళం** : తోలు బొమ్మలాటలో మృదంగం మీద వాయించే తాళం (రా 2)

**జరుపు** . ఫిలిగ్రీ పనిలో డిజైన్లు చెక్కేప్పుడు వస్తువుని కదపటం (కో 27)

**జలజ (గొలుసు)** : రోల్డ్‌గోల్డ్ వస్తువుల తయారీలో చేసే గొలుసు (కో 33)

**జల్లు** : పేపరు, మట్టి బొమ్మల తయారీలో మట్టిని పల్చగ చేసి పైన పౌడరు చల్లటం (కో 41)

**జవరంపం** · 1 దంతం పెట్టి తయారీలో అంచులు కత్తిరించటానికి ఉపకరించే సాధనం (కో 9)

2 డిజైనులకు కొయ్యపై చెక్కటానికి వాడే రంపం (కో 34)

**జవ్వ** 1 దూగోడలో ఒక భాగం (తె 3,13)

2 ఇత్తడి బిందెలలో ఉండే కట్టు చూ చిత్రం-23 1. (కో 4)

3. సింహద్వారంలో నిలువు పక్క భాగం (రా.4)

**జస్త** బొమ్మల తయారీలో ఒక రకం. (తె.1)

**జాకీ** : కొయ్య పనిలో బొమ్మల భాగాలని బిగించటానికి వాడే పరికరం (కో 16)

**జాజిరంగు** : 1. నిర్మల్ బొమ్మలకు వేసే కాలిరంగు (తె.4)

2 కొండపల్లి బొమ్మలకు వేసే ఎర్రమట్టి రంగు. (కో.26)

**జాన** · చేతి ప్రమాణం (కో 5,7, తె.12)

**జాయింట్** . అతికించటం, రెండు వస్తువులని దగ్గరగా చేర్చటం; బొమ్మలో రెండు భాగాలు కలిపిన ప్రదేశం (కో 7,16,33,34; రా.4,5)

**జాయింట్‌బ్లేడు** : తోపడాలో బ్లేడుపైన ఉండే మరో బ్లేడు (కో.35)

**జారిపోవు** · కొబ్బరి పీచు వస్తువులు ముసుర్లో చేసేప్పుడు లక్క వేస్తే పీచుకు అంటకుండపోవు (కో 32)

**జార్జిలక్క** కొమ్ము బొమ్మల తయారీలో రంగు చేయటానికి వాడే లక్క (కో 32)

**జాలర్‌కమ్మలు** . చెవులకు పెట్టుకునే ఆభరణాలు చూ చిత్రం-49 (కో 27)

**జాలి** : కొయ్యపనిలో చెక్కే రంధ్రాల డిజైన్ (తె 13)

**జాలీ కటింగ్ మిషన్** . కొయ్య పనిలో జాలీ పనికి వాడే యంత్రం (తె 13)

**జాలీపని** : లోహం పనిలో రేకు కత్తిరించి జల్లెడవంటి నగిషీ పనిచేయడం (తె.8,10,12)

**జాలీమిషన్** · కొయ్యపనిలో కర్రకు రంధ్రాలు వేసే యంత్రం (తె 13,13,13)

**జాలీలుగీయు** కొయ్య పనిలో చెక్కకు రంధ్రాల డిజైన్ గీయు (తె 13)

**జాలీశెకనం** కొయ్య పనిలో రంధ్రాలలో డిజైన్ వచ్చే విధంగా చెక్కడం. (తె 13)

**జాలు** : దంతం పనిలో డిజైన్ గీసి చెక్కిన కొమ్ము దంతం పేడు. (కో 9)

**జావ** : తోలు బొమ్మలకి వేసే రంగుల గరిట జారుగ ఉండటం. (కో.30)

**జిగట** . జిగురు, బంక. (కో.26,32, తె 1,12)

**జిగురు** · పర్యా. గోందు వస్తువుల్ని అతికించటానికి వాడే ద్రవ్యం. చూ కట్టెవజ్రం (కో 17,19,41, తె.1,4, రా.8,11,13)

**జిగురుమట్టి** . మట్టి బొమ్మల తయారీలో వాడే బంకమన్ను. (కో.10)

**జింక్‌పౌడర్** : నిర్మల్ బొమ్మలకి వేసే తెల్లరంగు. (తె.4)

**జింక** : జిగురు. (జి(గురు) (బ)ంక), (కో.7)

**జింక తలకాయ** : కొయ్యపనిలో చేసే బొమ్మ. (రా.4)

**జింక రంగు** : కొండపల్లి బొమ్మలకు వేసే తెల్లరంగు (కో 26)

**జిట్టరేగు** : రూపా జిట్రేగి, జిట్టేగి, పర్యా రోస్‌వుడ్ చూ ఏగి

1 కొయ్యపనిలో వాడే కొయ్య (తె 13,13)

2. చేతికర్రల తయారీలో వాడే కలప (తె 5,5,5,5)

3 ఫిలిగ్రీ పనిలో 'తార్సు' తయారీకి వాడే కట్టె (తె 8)

**జిల** · కొమ్ము బొమ్మల తయారీలో బొమ్మకి పొయ్యి బూడిద రాస్తే వచ్చే మెరుగు (కో 1)

**జీడీనాయుడుపాలిష్** . రూపా జీడినాడి పాలిష్ కొయ్య బొమ్మలకు వేసే పాలిష్ (కో 23, రా 4)

**జీలుగుకర్ర** : పర్యా నల్లమద్ది కర్ర దంతం పనిలో కంబతొట్టి చేయడానికి వాడే కట్టె (కో 9)

**జీవకళ** : కొయ్య పనిలో సహజత్వం (రా 4)

**జుట్టుపోలిగాడు** · తోలు బొమ్మలాటలో హాస్య పాత్ర బంగారక్క మొగుడు (కో 30,37, రా 2,10)

**జుంకా/జూకా** : లోహం పనిలో చేసే ఒక రకం ఆభరణం చూ చిత్రం-55 (తె 4)

**జువలరీ బాక్సు** · కొయ్య పనిలో చేసే నగలు పెట్టుకునే పెట్టె (కో 35)

**జువ్వు** నునుపు చేయటం, సాపు చేయటం (కో 26,30,36)

**జూలు** : కొయ్య పనిలో చేసే గుర్రం బొమ్మకు మెడమీద ఉండే వెంట్రుకలు (కో 16)

**జోడిగుర్రాలు** · ఒక తోలుబొమ్మ (రా 2)

**జోడు తాళాలు** : తోలు బొమ్మలాటలో ఉపయోగించే సంగీత పరికరం (రా 2)

# ఝ

**ఝాము** సుమారు ఒకటిన్నర గంట కాలం (రా 10)

# ట

**టంకం** 1 లోహపు భాగాలని అతికించటానికి వాడే ద్రవ్యం (కో 8,4,27)

2 కాగితం గుజ్జు బొమ్మలు అతకటానికి వాడే పదార్థం (రా 11)

**టంకం కమ్మె** . బిందెలు అతికేప్పుడు టంకం వేయటానికి వాడే తీగ (కో 4)

**టంగుదారం** తోలు బొమ్మల భాగాలు కలిపి ముడి వేయటానికి వాడే ట్వయిన్ దారం (కో 30)

**టన్నింగ్ మిషన్** · పర్యా సంగడి మిషన్, దీంట్లో కర్రను బిగించి ములులతో చెక్కుతారు ఇది ఆయిల్‌తో నడుస్తుంది (తె 13)

**టర్కీటవల్** ప్రత్తి బట్టల బొమ్మల తయారీలో డక్ బొమ్మ చేయటానికి వాడే గుడ్డ (రా 7)

**టర్నకోటం** 1 కర్రని గుండ్రంగా మలచటం (తె 1)

2 కంచు విగ్రహాలకు తరిణ పట్టటం (కో 8)

**టర్నెల్‌స్క్రూ** . స్క్రూలు బిగించే సాధనం (కో 9)

**టాపు** లోహం పనిలో చిల్లులు చేయటానికి వాడే మేకు లాంటి సాధనం (తె 1)

**టాయలట్ బాక్సు** ఫిలిగ్రీ పనిలో చేసే అలంకరణ సామగ్రి పెట్టుకునే పెట్టె (కో.27)

**టిన్నరు** కొయ్య బొమ్మలకు వేసే కలకత్తా రంగు ఆరిపోవడానికి వాడే పదార్థం (కో 12)

**టింబరు** (Timber Depot) : కట్టెల దుకాణం (తె 13, రా 3,5,6)

**టుంగమొద్దు** . పర్యా దుక్క లోహం బొమ్మల తయారీలో వాడే కరవాయిని నిలబెట్టే సాధనం (తె 10)

**టెక్క** · కొయ్యపనిలో చెక్కమీద కొట్టడానికి వాడే కట్టెతో తయారయిన సుత్తి (కో 16)

**టెంకాయ** కొబ్బరికాయ (కో 32, తె 6)

**టెంకాయచిప్ప** . తోలు బొమ్మలకి రంగులు వేసేప్పుడు రంగులు కలుపుకోడానికి వాడే పాత్ర (రా 12)

**టెంకాయ పుల్లబ్రష్** · కొయ్య బొమ్మని ఫినిషింగ్ చేయటానికి వాడే కుంచె (కో 41)

**టెంకాయ నూనె** కొబ్బరినూనె (రా 4,5)

**టెంకి** · బర్రె లేదా ఎద్దుకొమ్ము - ఈ కొమ్ము మీద పెట్టి తోలుబొమ్మలకి ఆభరణాలు చెక్కుతారు (కో 37)

**టెంటుగుడ్డ** తోలు బొమ్మలాట వేసే తెరగుడ్డ (రా 2)

**టెంపర్ రాయి** : 1 వాడిగల ఆకురాయి (రా 4)

2. ఉలిని పదును పెట్టడానికి వాడే సానరాయి (రా 5)

**టేకు** : కొయ్య బొమ్మల తయారీకి వాడే కట్టె (కో 7,19,24, 28,29,34,36,41)

**టేప్** : లోహం బొమ్మల తయారీలో కొలతలు చూడటానికి వాడే గుర్తులున్న పట్టీ (తె.1,12)

**టేబిల్‌కాట్స్** . కొయ్య పనిలో చేసే పందిరి మంచాలు (రా 4)

**టేబుల్** రూ టేబిల్ కొయ్యపనిలో చేసే బల్ల (తె 13,13)

**ట్రైగర్ గాజులు** . స్త్రీలు చేతులకి వేసుకునే ఆభరణాలు చూ చిత్రం-63 (కో 29)

**టోబెన్** దబ్బనం లాంటి పరికరం కంరానమోల. (తె 4)

**ట్రిమింగ్స్** పత్తి బట్ట బొమ్మల తయారీలో వాడే దారం (రా 7)

**ట్రే** · కిస్తీ పళ్లెం (తె 12)

# డ

**డక్** · ఒక గుడ్డ బొమ్మ (రా 7)

**డబల్ కొంగలు** : కొయ్యపనిలో ఒక బొమ్మపేరు (రా 4)

**డబల్ చిలకలు** లోహం పనిలో ఒక డిజైన్ పేరు (తె 12)

**డబల్ తీగ** ఫిలిగ్రీ పనిలో వాడే జంట తీగ (తె 8)

**డబల్ వాల్మోల** లోహం పనిలో రెండు గీతలు పక్క పక్కన కొట్టడానికి వాడే పరికరం (తె 12)

**డబ్బామూత** మట్టి బొమ్మలకి రంగులు వేసేప్పుడు రంగులు కలుపుకోడానికి వాడే పళ్లెం (రా 9)

**డబ్బారేకు** నిర్మల్ బొమ్మల తయారీలో కొన్ని జంతువుల చెవులకి వాడే రేకు (తె 4)

**డల్లనీలి** నిర్మల్ బొమ్మలకు వేసే నీలిరంగు (తె 4,7)

**డాకలి** పర్యా డాగలి, డాకలి ఆధారంగా వాడే సాధనం లోహం పనిలో రేకుని సాపు చేయడానికి డిజైన్ చెక్కటానికి దీని మీద పెట్టి సుత్తితో కొడతారు (కో 33, తె 1,10,12,15)

**డాల్** డాలు (తోలుబొమ్మ) (రా 2)

**డిక్లాంపు** . జిక్లాంపు ఒక పరికరం. (రా 5)

**డిజైన్** కొయ్య, లోహం, ఫిలిగ్రీ పనుల్లోను, తోలు బొమ్మల లోను చేసే నగిషీ (కో 7,4,9,13,16,19,20,21,25, 29,31,33,42,41, తె 1,4,7,8,9,10,11,12,13,14, రా 2,3,4,7,8)

**డిజైను పోగరు** : లోహం బొమ్మలకి డిజైను చెక్కటానికి వాడే సాధనం (తె.1)

**డిజైను సామాను** ఫిలిగ్రీ పనిలో వాడే సుడుగులు, పాట్కారు మొ॥ (తె 8)

**డిటైల్** . కొయ్య పనిలో బొమ్మకు ఆకారాలు స్పష్టంగా చేయటం (తె 1)

**డిప్ప** . 1 అడ్డకర్ర పనిలో చేసే దస్తా బొమ్మలలో విడదీయడానికి వీలుండే రెండు భాగాలు (తె.13)

2 మట్టి బొమ్మలు తయారీలో వాడే ప్లాస్టర్ ఆఫ్ ప్యారిస్ అచ్చు ముందు భాగం (రా 9)

**డుంగ** . లోహం పనిలో దీంట్లో బండి ఇరుసుని బిగించి రేకును దీని మీద పెట్టి సుత్తితో కొడతారు (తె 12)

**డెకరేషన్** అలంకరణ (తె 1, రా 4)

**డెకొరేటివ్ పీసెస్** కొయ్య పనిలో గృహాలంకరణ కోసం తయారు చేసే చిన్న వస్తువులు (తె 13)

**డెక్కసుత్తి** · పర్యా కటింగ్ ప్లేయర్. కొయ్య పనిలో చెక్కకు మేకులు గుచ్చటానికి లేక మేకులు తీయటానికి వాడే సాధనం. (కో 16)

**డెగ్గా** : డగ్గ (కో 7)

**డెప్త్** లోహం బొమ్మలకి అక్కడక్కడ ఉండే లోహ భాగం (తె 1)

**డేగిసా** : లోహం పనిలో చేసే పాత్ర (కో 4)

**డేంజరు** · కొమ్ముపని చాలా ప్రమాదం. కొమ్ము లోపలి దుమ్ము లోపలికి పోతే ఊపిరితిత్తులు పాడైపోతాయి (తె 5)

**డై** · అచ్చు (తె 12)

**డైమన్** రూపా డైమండ్ లోహం పనిలో చెక్కే డిజైన్ పేరు చౌకీట్. (తె 1,12; రా 4)

**డైల్యూటిడ్ సల్ఫ్యూరిక్ యాసిడ్** ఫిలిగ్రీ పనిలో వస్తువులు మెరుగు చేయడానికి వాడే ద్రవ్యం (కో.33)

**డొక్కు** : పర్యా అక్కపెట్టె అడ్డ కర్రపనిలోవాడే పరికరాలు వేసుకునే చెక్కడబ్బా (కో 12)

**డొక్కు పిడాలు** · అర్థచంద్రాకారంగా లోతుచెక్కడానికి కర్ర నగిషీలో ఉపయోగించే పరికరం (తె 13)

**డొల్ల** : 1 కొయ్యపనిలో అతికించవలసిన డిజైన్ కొయ్యమీద చెక్కటం (కో 34)

2 కోడిగుడ్డు లోపలి పదార్థం తీసివేస్తే మిగిలిన గుల్ల. (కో.25)

3 చూ గుల్ల. లోహం పనిలో బొమ్మల లోపలి భాగం గుల్లగ ఉండటం. (కో.28, తె 12)

# త

**తగరం** · 1 ఒక లోహం (తె 12 , రా 5)

2 బొమ్మలకు, ఆభరణాలకు వాడే మిశ్రమంలో కలిపే పదార్థం (తె 1)

**తగిలించు** 1 తోలు బొమ్మలాటలో తెరకు మూరెడు దూరంలో దీపాల్ని పెట్టు (కో 37)

2 లోహం బొమ్మని పాలిష్‌మిషన్‌కి తాకించు (రా 11)

**తంగడిచెక్క** : తోలు బొమ్మలకి వాడే తోలుని శుభ్రం చేసేప్పుడు చర్మానికి ఉండే వెంట్రుకలు సులభంగా ఊడిపోవడానికి నీటిలో కలిపే పదార్థం (రా 12)

**తట్టుకొను** లోహాన్ని గ్రాఫైట్ మూసలో కరిగించేప్పుడు వేడికి మూస ఓర్చుకొను (కో 18)

**తట్టులు తీయు** పర్యా పేడులు తీయు కొయ్యపనిలో చెక్కకు పెచ్చులు తీయు (కో 16)

**తడకర్ర** చేతికర్రల తయారీలో వాడే తడచెట్టు కర్ర (తె 5)

**తడపట్టె** కొయ్యపనిలో మంచం చేయడానికి వాడే కొయ్య (తాటిపట్టె) (కో 35)

**తడలిచ్చు(ట)** నిర్మల్‌పెయింట్‌కి తగరం రాసి మోరరాయి (అగేట్‌స్టోన్)తో రాస్తే మెరుపు రావటం (కో 7)

**తడికె** : తోలు బొమ్మలాట స్టేజికి వాడే నిర్మాణం (రా 2)

**తడిగుడ్డ** · పేపరు మట్టి బొమ్మలపై దుమ్ముపడితే తుడవటానికి వాడే తడిసిన బట్ట (కో 41)

**తడుపు** కొమ్ము బొమ్మలకు పాలిష్ చేసేప్పుడు కరాబు ఆకుని నీటిలో ముంచు (కో 1)

**తన్నుకర్ర** . పర్యా. తాపుకర్ర. అడ్డ కర్రపనిలో తీరుగాడు దీనిమీద కాలుమోపి, అడ్డను తిప్పుతాడు (కో.12)

**తప్పెట** · తోలుబొమ్మలాటలో వాడే నగారా. (కో.37)

**తబలావాల్మోల** : లోహం పనిలో ఉపయోగించే పరికరం చూ చిత్రం-129 (తె.12,13)

**తమలపాకుతీగ** . కొయ్యపనిలో సింహద్వారాలకి చెక్కే డిజైన్ (రా 4)

**తమలపాకుపెట్టె** . పర్యా పాన్‌డబ్బీ లోహం పనిలో చేసే పాం దాన్ (కో 27, తె 12)

**తయారీ వస్తువులు** లోహం పనిలో తయారయిన వస్తువులు (కో.33)

**తరణి** · చూ అడ్డ చూ చిత్రం-6 (కో 12)

**తరాజు** : ఫిలిగ్రీ పనిలో తూచటానికి వాడే పరికరం (తె 8)

**తరిచ్చు** రూపా. తరిచ్చి కంచు విగ్రహాలకి తరిణపెట్టే యంత్రం (కో 8)

**తరిణపట్టు** చూ చెక్కు లోహం పనిలో విగ్రహం మోల్డింగ్ అయిన తరువాత తరిచ్చి మీద ఆకారాలు సమానంగా చెక్కటం (కో 8)

**తరిణం మిషను** · బొమ్మలు, వస్తువుల ఆకారాలు సరిగా తీసే యంత్రం (కో.32)

**తరిత్తి** బిందెలు పాలిష్‌చేసేప్పుడు వాడే యంత్రం (కో 4)

**తరిమొన(పట్టు)** రూపా తరుణ(పట్టు), తరిణి, తరన (పట్టు), తరిణం(పట్టు)

1 చూ తరిణ కొయ్యపనిలో చెక్కు

2 చిత్రికపట్టు (కో 11,13,32,35,36)

**తల** : రేకు గుర్రంలో భాగం. చూ చిత్రం-20 1 (కో.16,40)

**తలతాకు** · పర్యా. తల తగులు కొయ్యపనిలో శాస్త్రోక్తంగా సింహద్వారాలు (5 అడుగుల 5 ఇంచులు) చేస్తే మనిషి వేగంగా వస్తే తలకి తగులు (రా 4)

**తలకాయ** లోహం పనిలో, కొయ్యపనిలో చేసే బొమ్మల పై భాగం (తె 4,12,13)

**తలకాయలబొమ్మలు** : జింక తల మొదలైన కొయ్య బొమ్మలు (రా.4)

**తలగడ** కొయ్యపనిలో చేసే బ్రాకెట్లను మంచానికి చేసే ప్రాంతం (తె 13)

**తలగుడ్డ(కట్టు)** తోలు బొమ్మలాట ఆడటానికి తెరకట్టడం. (రా 2)

**తలనుండి నడుము భాగం** · తోలు బొమ్మలో భాగం చూ చిత్రం-10 I (రా 5)

**తలనెమ్ము** : కొయ్య పనిలో కొయ్యను చీల్చటానికి వాడే "నెమ్ము" పై భాగం. (రా 5)

**తలుపు** కొయ్యపనిలో గుమ్మానికి చేసే భాగం (తె 13)

**తవుడు** నిర్మల్ బొమ్మలు చేసేవారు పూర్వం చేసే పెండ(పేడ) బొమ్మలకు వేసే రంగు చేతికి· అంటుకుంటే చేతికి అంటుకున్న రంగు పోవటానికి వాడే ద్రవ్యం (తె 4)

**తళతళ** తోలు బొమ్మల వేసిన రంగు బాగా మెరవటం. (కో 37)

**తాజా** · తోలు బొమ్మల తయారీకి వాడే మేక చర్మం నిలవ ఉంచకపోవటం (కో 15)

**తాటాకులు** : తాటి చెట్టు కల్లు గీయటంలో తాటి చెట్టుకుండే ఆకులు చూ చిత్రం-1 1 (కో 23,27)

**తాటికర్ర** చేతికర్రల తయారీలో వాడే కట్టె. (కో 23; తె 5)

**తాటిచెట్టు** కల్లు గీయటానికి పనికి వచ్చే ఒక రకం చెట్టు. చూ చిత్రం-1 4. (కో 27)

**తాటిచెట్టు కల్లు గీయటం** తాటిచెట్టు నించి కల్లు గీసే విధానం చూ చిత్రం-1. (కో 23,27)

**తాటిచెట్టు మొదలు** . తాటిచెట్టు అడుగు భాగం చూ చిత్రం-1 5. (కో.23,27)

**తాటిచిత్రి(పొట్టు)** · తాటిచెక్కను కోస్తే వచ్చే పొట్టు. తాటిచేవ బొమ్మల తయారీలో బొమ్మపై తాటి చెక్కను కోయిస్తే వచ్చే పొట్టు వేసి మొగలి రేకుతో మెరుపు కోసం రుద్దుతారు. (కో 32)

**తాటిచేవబొమ్మ** · మంచి బలం ఉన్న తాటిచెట్టు చెక్కతో చేసిన బొమ్మ (కో 32)

**తాటిబుర్ర** · తాటి పండులో ఉండే టెంక బొమ్మ చేయడానికి వాడతారు. (కో 32)

**తాడు** . 1 కొలిమిలో గాలి రావటానికి పంకాని తిప్పటానికి వాడే సన్న మోకు (కో 6)

2 తోలుబొమ్మలాటలో వాడే గజ్జెలను దండగా గుచ్చటానికి వాడే గట్టిదారం (కో 7)

3 ఫిలిగ్రీ పనిలో వాడే రాట్నం తిప్పటానికి వాడే వస్తువు (తె 8)

4 బర్మాని తిప్పటానికి వాడే నూలుదారం చూ చిత్రం-113 6 (కో 3)

**తాపడా** · లోహం పనిలో విగ్రహం తరిణ పట్టేప్పుడు విగ్రహానికి మేకులు కొట్టడం (కో 8)

**తాపుకర్ర** చూ తన్నుకర్ర తీతగాడు అడ్డను తిప్పుతూ దీనిమీద కాలు ఆనిస్తాడు. (కో 31)

**తాపీ** : కొయ్యపనిలో బొమ్మలకు లప్పం పూయటానికి వాడే పరికరం చూ చిత్రం-159 (కో 3; తె 4,6; రా 13)

**తాబేలు** . నీటిలోను, భూమిమీద నివసించే జంతువు దీనిపై పెంకును దంతం పనిలో వాడతారు (కో 9)

**తాబేటి చిప్ప** పర్యా తాబేటిపేడు (దంతంపని) తాబేలు వీపుపై ఉన్న గట్టి భాగం దంతం పనిలో వాడతారు (కంబపెట్టెకి) (కో 9)

**తాబేటిపేళ్ళు** : తాబేటి చిప్పను నీరుపారే భూమిలో పాతిపెడితే కొన్ని రోజులకు ఏర్పడే చిప్పపొరలు (కో.39)

**తామర పువ్వు రేకులు** : లోహం పనిలో చేసే తామరపువ్వు రేకులు. (తె 12)

**తాంబరునైరు** : లోహం పనిలో అల్యూమినియం బొమ్మలకి రాగి రంగు రావటానికి సైనైడ్ నీళ్ళలో వేసేప్పుడు బొమ్మల్ని కట్టడానికి వాడే తీగ. (తె 1)

**తాంబాణం** : తోలు బొమ్మలకి రంగులు వేసేప్పుడు బొమ్మ అడుగున పెట్టే ఆధారం (కో.37)

**తార్పు** ఫిలిగ్రీ పనిలో సుడుగులు మొదలైన సామగ్రి పెట్టుకునే సొరుగుల పెట్టె. (తె 8)

**తార్‌పని** : పర్యా తీగపని వెండితీగ పని. (తె 8)

**తాలూకు** . రూపా తాలుకు, తాలూకా సంబంధించిన (కో 2,5,7)

**తావు** ఫిలిగ్రీ పనిలో ఆకురాళ్ళు వాడవలసిన ప్రదేశం (తె.8)

**తాసు** · తరాజు, త్రాసు (తె 8)

**తాళంగుత్తి** : ఫిలిగ్రీ పనిలో చేసే వస్తువు (తె 8)

**తాళం చేయిల పతకం** : ఫిలిగ్రీ పనిలో చేసే వస్తువు (తె 8)

**తాళిబొట్లజత** లోహం పనిలో చేసే పెండ్లిలో భర్త భార్య మెడలో వేసే ఆభరణం చూ చిత్రం-76 (రా 5)

**తిత్తులు ఊదు** · కొలిమిలోకి గాలి రావటానికి పంకా లాగు (తె 12)

**తిప్పుబాయి** లోహం పనిలో వాడే తరిణదొడ్డిని తిప్పటానికి వాడే సాధనం. (కో 8)

**తింపు** రూపా తిప్పు

1 తోలు బొమ్మలాటలో బొమ్మల్ని కదిలించు (కో 37)

2 లోహం పనిలో పంకాని తిప్పు. (తె.12)

**తిర్మణి గోందు** · పర్యా తిరుమణంటు రూపా చిర్మణి గోందు. తిరుమణి చెట్టు నుండి తీసిన జిగురు

1 రంపం పొట్టు బొమ్మలకి చుట్టే గుడ్డకి పూస్తారు (తె 9)

2 కొయ్య బొమ్మలకి పూసే పాలిష్ తయారీలో వాడ్తారు (తె 7)

**తిర్మణి చెట్టు** · ఈ చెట్టు జిగురు రంపం పొట్టు బొమ్మలకి వాడ్తారు (తె 9)

**తిరుగు** : తరిణదొడ్డి పనిచేయడం (తిరగడం) (కో 7)

**తిరునాళ్ళు** : పండుగ దినాలు ఈ రోజుల్లో రంపం పొట్టు బొమ్మలు, కాగితం గుజ్జు బొమ్మలు చేసి అమ్ముకుంటారు (కో 27,40)

**తిరువుడి** 1 వీణ మెట్లను ఆకురాయితో నునుపు చేసేప్పుడు వాటిని పట్టుకోవటానికి వాడే సాధనం (కో 13)

2. ఫిలిగ్రీ పనిలో వెండి తీగను చుట్టగా తిప్పటానికి వాడే సాధనం (కో 27)

**తిలకామోద** తోలు బొమ్మలాటలో వాడే ఒక రాగం పేరు (రా 2)

**తివ్వ** . తంతి లోహం పనిలో మట్టి మూసకి చుట్టటానికి వాడే తీగ (కో 8)

**తీగ** చూ తివ్వ (కో 3,6,7, తె 1, రా 5)

1 లోహం పనిలో చేసే ఒక డిజైన్ చూ చిత్రం-15 (తె 12)

2 ఫిలిగ్రీ పనిలో వాడే సన్నని కడ్డీ (కో 27)

3. బుర్ర కథ తంబురా కుండే తంతి (కో 23)

**తీగ తలుపులు** · కొయ్య పనిలో తీగ డిజైను చెక్కిన తలుపులు (కో 34)

**తీగషేప్** కొయ్య పనిలో చేసే తీగ ఆకారం డిజైన్. (కో 34)

**తీగెపని** · చూ. తార్‌పని ఫిలిగ్రీ పనిలో చేసే తార్‌పని (తె 8)

**తీతగాడు** : అడ్డకర్ర పనిలో అడ్డసీకును అడ్డవారుతో తిప్పేవాడు (కో.11,12)

**తీత్రీ వమూవ** : పర్యా. సీతాకోక చిలుక డిజైన్ ఫిలిగ్రీ పనిలో చేసే సీతాకోక చిలుక డిజైన్ (తె 8)

**తీయు** . కొయ్య పనిలో తోపుడును ఉపయోగించు (రా.4)

**తీరు** · 1 కొయ్య పనిలో బొమ్మను నైస్ చేయడం (కో 41; రా 3,5,6)

2 లోహం పనిలో విగ్రహాన్ని సరిగ చేయటం (కో 7)

**తీరు చీర్ణం** : కొయ్య బొమ్మని ఫినిషింగ్ చేయటానికి వాడే పరికరం. (కో.41)

**తీర్థాలు** : జాతరలు. ఈ సమయంలో బొమ్మల్ని అమ్ముతారు (తె.4)

**తుక్కు** : పర్యా మైల లోహం పనిలో తేనె మైనం తయారీకి వాడే తేనెపట్టు తుక్కు. (కో 33)

**తుట్టె** : చూ తుక్కు (తె.12)

**తుడుచు** · కొయ్య వస్తువులకి పాలిష్ చేసే ముందు గుడ్డతో బాగా శుభ్రం చేయు (కో 35)

**తుడుపు** కొయ్య బొమ్మకు సైను బట్ట చుట్టి పైన సుద్దను రాయడం (తె.7)

**తుంట** తోలు బొమ్మలకి ఆభరణాలు చెక్కటానికి వాడే దోసగింజ చీర్ణం చివర ఉండే ఇనుప భాగం (కో.37)

**తునక** : పర్యా బిట్టు, ముక్క కొయ్య పనిలో వాడే కొయ్య ముక్క (తె 7, రా 4)

**తునికి కర్ర** · చేతికర్రల తయారీలో వాడే తునికి చెట్టు కర్ర. (కో 23)

**తునికిశేగ** తునికి చెట్టు బెరడు లోపల తెల్లకట్టె ఉంటుంది. దానిలో మధ్యగా ఉండే నల్లకట్టె (తె.5)

**తుప్పుపట్టు** : ఇనుముకి తడి తగిలితే ఎర్రబడి పెచ్చులు, పెచ్చులుగా రావటం ఓడలు నీటిలో తిరుగుతాయి కాబట్టి ఇనుప మేకులు తుప్పు పడతాయని వాటికి బదులు కొమ్ముని వాడతారు (కో.32)

**తుమ్మ** : ఒక రకం చెట్టు దీని నుండి జిగురు తీస్తారు దీని కొయ్యని కొయ్యపనిలో వాడతారు (రా.8, కో.16)

**తుమ్మకర్ర** : పర్యా. తుమ్మ చెక్క కొయ్యపనిలో వాడే కొయ్య. (తె.13)

**తుమ్మబంక** : పర్యా తుమ్మ జిగురు. కొయ్య బొమ్మలకి గుడ్డ చుట్టి అంటుకుని ఉండటానికి పూసే జిగురు. (కో 26,27)

**తుమ్మముల్లు** తోలు బొమ్మలాటలో తెరకి బొమ్మకి కలిపి గుచ్చటానికి వాడేది. (కో 15,30, రా 10)

**తురుము** . కొయ్య పనిలో బొమ్మను అడ్డమీద ఉలితో చెక్కేప్పుడు లోతు తీసుకవచ్చు మనులితో ఈ పని చేస్తారు (కో 12, రా 4)

**తూకం** . కొలత, బరువు (కో 27; తె 8)

**తూంగుమూంజి** పర్యా నిద్రమాను (తురం) కొయ్య పనిలో వాడే నిద్రమాను కొయ్య (రా 4)

**తూట్లు** తోలు బొమ్మల డిజైన్‌కి వేసే చిల్లులు (కో 30)

**తెగలు తెగలు** గుంపులు, గుంపులుగా తోలు బొమ్మలాట ఆడించటం (రా 2)

**తెగ్గొట్టు** 1 లోహం పనిలో విగ్రహం మోల్డ్ పోసిన తర్వాత విగ్రహానికి కొన్ని చోట్ల ఎక్కువగా పడిన లోహాన్ని తీసేయు (తె 1,12)

2 కొయ్యపనిలో కొయ్యను మధ్యకు కోయు (తె 13)

**తెడ్డలపాల** చూ అంకుడు కర్ర అడ్డకర్ర పనిలో వాడే అంకుడు చెట్టు కొయ్య (కో 11)

**తెడ్డు** . 1 కొయ్య పనిలో చెక్కతో చేసిన గరిట (కో 16,33)

2. తోలు బొమ్మలకి వాడే తోలుని ఉడకబెట్టేప్పుడు కదపటానికి వాడే కొయ్యగరిట (కో 30)

**తెవగోళ్ళు** · తెలగవాళ్ళు వీరు పూర్వం లోహం పనిలో ఇత్తడిని బిళ్ళల కింద పోతపోసి సాపు చేయటానికి సమ్మెటతో కొట్టేవారు (తె 12)

**తెర** . తోలు బొమ్మలాటకి వాడే గుడ్డ చూ చిత్రం-9 2 (కో 7)

**తెరగుడ్డ** చూ తెర (రా 2)

**తెర వెనుక బొమ్మ** . తోలుబొమ్మ. తోలుబొమ్మలాటలో బొమ్మల్ని తెరవెనుక భాగంలో ఉంచి ఆడిస్తారు కనక తోలు బొమ్మలనే తెరవెనుక బొమ్మలు అంటారు (కో 30)

**తెరపిగ ఉండు** కొబ్బరి చిప్ప బొమ్మలు తయారు చేసేప్పుడు వానగాని, ముసురుగాని లేకుండా ఉండు (కో 32)

**తెల్లకర్ర** పర్యా తెల్లకొయ్య, తెలుపు కొయ్య, పాలపరిగి, రేపాలకొయ్య

1 కొయ్యపనిలో వాడే పాలపరిగె తెలుపుచెక్క (కో 34 రా 4)

2 చేతికర్రల తయారీకి వాడే బెండులోపలి తెల్లని భాగం (తె 5)

**తెల్లగుల్ల** అలంకరణ వస్తువు చూ చిత్రం-41 (తె 14)

**తెల్లటి గుడ్డ** రూపా తెల్లగుడ్డ

1 కొయ్య పనిలో బొమ్మలకి ముక్కు పెట్టడానికి ముందు చుట్టే బట్ట (తె 4)

2 కొయ్య బొమ్మలకి పాలిష్ చేసేప్పుడు పాలిష్‌లో ముంచటానికి దూదిని చుట్టిన బట్ట (కో 34)

3 తోలు బొమ్మలాట తెరకి వాడే బట్ట (కో 30)

**తెల్లపానికి** . రూపా తెల్లపాణికి పోలకకట్టె కొయ్యపనిలో వాడే కొయ్య (కో 26 తె 7)

**తెల్లమచ్చ** . తాబేటి పేళ్ళపై ఈ మచ్చలుంటే పనికిరాదు (కో 9)

**తెల్లమేక చర్మం** తెలుపు రంగు మేక చర్మం (కో 37)

**తెల్లశంకు** ఒక రకం గవ్వ చూ చిత్రం-28 (తె 14, రా 8)

**తెల్లశేగ** కొయ్య పనిలో వాడే కర్రలో ఉండే ఒక విధమైన చెడు లక్షణం (తె 13)

**తెల్వామం** లోహం పనిలో రేకును తెగ్గొట్టటానికి వాడే పరికరం చూ చిత్రం-123 (తె 1,10,12)

**తేకు** · కొయ్య పనిలో వాడే 'టేకు' కొయ్య. (రా.3)

**తేజ్** కొయ్య పనిలో శీర్షాలకి పెట్టే పదును (తె 13)

**తేజాప్(ఎండి)** నైట్రిక్ యాసిడ్‌లో శుభ్రపరచిన వెండి (తె 8)

**తేనెపట్టు** · పర్యా తేనె తుట్టె లోహం పనిలో వాడే తేనెలో మైనం చేయడానికి వాడేది (కో 3,6,8,24, తె 1,8,12, రా 5)

**తేర్లు** : కొయ్య పనిలో చేసే కొయ్యరధాలు (రా 4)

**తేలికపని** 1 కొయ్య బొమ్మలు బరువు లేకుండా ఉండటం (కో 19)

2 ఫిలిగ్రీ పనిలో సులభ పద్ధతి (తె 15)

**తేట** : లోహం పనిలో వెండిని కరిగించేప్పుడు సైలైట్‌ని వెండి నీళ్ళలో వేస్తే పెరుగులాగ తేలటం. (తె 12)

**తేపుడి** . పర్యా అర్ధులం, అర్ధులం, పేవడా రంపం పొట్టు బొమ్మలకి వేసే పసుపు రంగు (తె.9)

**తొగరకర్ర** : తొగర చెట్టు కర్ర లక్క బొమ్మల తయారీలో వాడతారు (కో 12)

**తొట్టి** . 1 ఫిలిగ్రీ పనిలో వెండికి పాలిష్ పెట్టటానికి వాడే మిషన్‌లో ఒక భాగం. (కో 24)

2 మట్టి బొమ్మల తయారీలో మోల్డింగ్ తీసేప్పుడు చుట్టూరా కట్టే అంచు (కో.17)

**తొడరేకు** : రేకు గుర్రంలో భాగం చూ చిత్రం-20 7 (కో.16,40)

**తొడలు** . తోలు బొమ్మలో భాగం చూ చిత్రం-10 IV (కో.30, రా 2)

**తొడి** : పర్యా. పొన్ను.

1. పొన్ను, అడ్డసీకు చివరి ఇనుపపట్టా భాగం (కో 12)

2 ఉలి పిడికి అడుగు భాగంలో ఉండే కట్టు (కో 6,7,12)

**తొడుగు** · లోహం పనిలో చేసే విగ్రహాలకి అదే రూపాల్ని వెండితో పల్చగా చేసి విగ్రహం ముందువైపు తొడిగేది (కో 33)

**తొంటికెళ్ళివోడు** : తోలు బొమ్మలలో ఉండే పుసగడు, బంగారక్క, బుడ్డకేతిగాడు మొదలయిన వారి తలదన్నినవాడు (రా 2)

**తొంట్లు** . చూ కన్నం తోలు బొమ్మలకి వేసే చిల్లులు. (రా 10)

**తొంభై తొమ్మిది** తోలు బొమ్మలలో రకాలు (రా.2)

**తొమ్మిది పగ్గాలు** : తోలు బొమ్మలాట తెర బిగింపుకు అవసరమైన పగ్గాలు (రా 2)

**తొరపణం బరమ** · కొయ్యపనిలో ఉపయోగించే పరికరం. చూ.చిత్రం-175 (కో 8)

**తొలగించు** · తోలు బొమ్మలకి డిజైన్ గీసేప్పుడు మేకులతో బిగించి డిజైన్ వేసిన తర్వాత మేకులు తీసేయు. (కో 30)

**తొలవవలసిన కర్ర** చేతికర్రల తయారీలో ఉపయోగించే పరికరమైన బర్మాలో భాగం చూ.చిత్రం-113 4 (కో 23,35, తె 5)

**తొలి** : రూపా తొల్లు, పర్యా కన్నెలు, కండ్లు కుర్చీ తయారీలో రెండు చెక్కలు బిగించేప్పుడు కూసం అమర్చటానికి చేసే రంధ్రం. (తె 13)

**తొలిచే బర్మామొల** · మక్కు బొమ్మల తయారీలో ఉపయోగించే బరమాలో భాగం చూ చిత్రం-169 (రా 11,13)

**తొలియు** రూపా తొలుచు

1 కొయ్యపనిలో చెక్కను చెక్కు (తె 13, రా.4)

2 తోలు బొమ్మల తయారీలో బొమ్మకు ఆభరణాలు చెక్కు. (రా 10)

**తొలుత** ముందర (రా 10)

**తోక** . రేకు గుర్రంలో భాగం చూ చిత్రం-20 6. (కో 16,40)

**తోక మల్లిపువ్వు** . కొయ్యపనిలో చేసే డిజైన్ (రా.4)

**తోడి** · తోలు బొమ్మలాటలో పాడే రాగం పేరు. (రా 2)

**తోడేలు** గొల్లోల్లకు మేనమామ ఒక తోలు బొమ్మ (రా 2)

**తోప** చూ చింత అంబలి చింత పిక్కలను ఉడికిస్తే తయారయ్యే గుజ్జులాంటి పదార్థం (కో 26)

**తోపడా** · రూపా తోపుడు. పర్యా. దూగోడ కొయ్యపనిలో చెక్కను నున్నగ చెక్కటానికి వాడే సాధనం (కో 34,35,41, రా.3,4,5,6,8)

**తోపుడు అలుగు** తోపడాలో ఉండే కొయ్యను చెక్కే సాధనం (రా 5)

**తోపుడు ఉలి** . చూ. తోపుడు అలుగు (కో 39)

**తోము** 1 లోహం పనిలో బొమ్మలకి మెరుగుకోసం చింతపండు, గోదావరి ఇసుక, సల్ఫర్ యాసిడ్, నైట్రిక్ యాసిడ్ కలిపి రుద్దు (కో 18, తె 10)

2 తోలు బొమ్మలకి వాడే తోలుని శుభ్రం చేసేప్పుడు సబ్బుతో తోలుని కడుగు (రా.2)

3 తోలు బొమ్మలాటలో వాడే మృదంగానికి కరిణ పిండివేసి కరిణ రాయితో రుద్దు (కో 7)

4 కొమ్ము బొమ్మలకి మెరుగు కోసం పొయ్యి బుగ్గితో రుద్దు (కో 1)

5 చేతికర్రల తయారీలోను, నిర్మల్ బొమ్మల తయారీలోను గరుకు కాగితంతో రుద్దు (కో 23, తె 4)

**తొరపణం** . దంతం పనిలో జాలులో కన్నాలు పొడవడానికి వాడేది (బర్మా) (కో 8)

**తోయడం** . తోపుడును ఉపయోగించటం. (రా.4)

**తోయం** . తోలు బొమ్మలాట ప్రారంభంలో గణపతి ప్రార్థన చేసి తాంబూలం, ఫలంతో సమర్పించే నీరు (రా.2)

**తోలు** · జంతువుల చర్మం

1 తోలు బొమ్మల తయారీకి ఉపయోగిస్తారు (కో 12; తె 1,2; రా 2,5,11)

2 అడ్డవారులో ఉపయోగిస్తారు చూ చిత్రం-6 VIII 1 (కో 16)

**తోలుటేపు** : తోలుతో తయారైన టేపు. (కో 22)

**తోలు తిత్తి** : లోహం పనిలో వాడే పంకాకు ఉండే తిత్తి. (కో 28, తె.12)

**తోలుబొమ్మ** : జంతువుల చర్మంతో చేసిన బొమ్మ చూ.చిత్రం-9 3, 10 (రా 5)

**తోలుబొమ్మలాట** : చూ చరమనాటకం. తోలు బొమ్మలతో నాటకాలు, కథలు చెప్పటం చూ.చిత్రం-9 (రా.2)

**తోలు బొమ్మకు తూటే అందం** : తోలు బొమ్మల తయారీలో బొమ్మలకి ఆభరణాలు చెక్కేప్పుడు చిల్లులు చేయడమే అందం. (కో 30)

**తోలు మండి** · తోలును అమ్మే అంగడి (రా 5)

**తోలు వలపు** : కొయ్యపనిలో వాడే కొయ్యపై భాగం చెక్కటం (రా 5)

**తోల్లోల్లు** . తోళ్ళు అమ్మే వాళ్ళు. (తె 3)

**త్రికోణ బల్పి** : చేతికర్రల తయారీలో ఉపయోగించే పరికరం చూ చిత్రం-114 (కో 4)

**త్రిపుట తాళం** : తోలు బొమ్మలాటలో మృదంగం మీద వాయించే తాళం (రా 2)

**త్రిప్పుడు మీసం** నాటకంలో పెట్టుకునే మీసం (కో 7)

## ద

**దంచు** : 1 రంపం పొట్టు బొమ్మల తయారీలో చింత గింజలని మెత్తగ చేయు (తె.9)

2 తోలు బొమ్మలకి రంగులు వేయటానికి వాడే కుంచెల తయారీలో ఈతపుల్ల చివర మెత్తగా చేయు (రా 10)

3 మట్టి బొమ్మల తయారీలో మట్టి, దూది కలిపి గట్టిగ దంచు (రా 11)

4 కాగితం గుజ్జు బొమ్మల తయారీలో కాగితం గుజ్జు, ప్లాస్టర్ ఆఫ్ ప్యారిస్, తుమ్మ జిగురు, సుద్దిపొడి కలిపి నూరు. (కో.27)

**దట్టం పొయి** : పర్యా ముదురు రంగు. తోలు బొమ్మలకి వేసే ముదురు రంగు. (రా 2)

**దట్టి :** తోలు బొమ్మలోని పొట్ట భాగం (కో.37)

**దట్టిచెంగు** కొండపల్లి బొమ్మల తయారీలో దశావతారాల బొమ్మలు చేసేప్పుడు వామనావతారానికి తప్ప మిగిలిన తొమ్మిది అవతారాలకు రెండు కాళ్ళ పక్కల అమర్చే చెంగు (కో 6)

**దట్టించు :** లోహం బొమ్మల తయారీలో విగ్రహం చుట్టూ మట్టి పూయు (కో.33)

**దడ్ల బర్మ** ఫిలిగ్రీ పనిలో ఇప్పుడు వాడే బర్మాకు పూర్వం వాడే పరికరం (తె 8)

**దండ .** కొయ్యపనిలో బొమ్మకు చెక్కే కంఠాభరణం (కో 3, తె 7)

**దండపూస** పర్యా రాయి పూస, నల్లపూస కొయ్యపనిలో బొమ్మలకి కన్ను భాగంలో అమర్చే పూస (రా 4)

**దండి(కట్టు) :** లోహం వాహనాల తయారీలో చిల్లులు చేయటానికి వాడే గడ్డల బరంలో ఒక భాగం (కో 31)

**దంతం ·** దంతం బొమ్మల, పెట్టెల తయారీలో వాడే ద్రవ్యం (కో 9)

**దంతం గాడి :** దంతం పనిలో వస్తువులకి పోగరుతో చెక్కిన డిజైనులోని లోతు ఈ లోతులో రంగు లక్క పోస్తారు. (కో.5)

**దంతం పని :** దంతంతో చేసే పని (కో 9)

**దంతం బొమ్మ** చింత పిక్కల మీద బొమ్మని చెక్కితే చూడటానికి దంతం బొమ్మ మాదిరి ఉంటుంది (కో 25)

**దప్పం .** మందం తోలు బొమ్మల తయారీకి మేక చర్మం గాక వేరే చర్మం దేన్నైనా వాడితే బొమ్మ సరిగ్గా రాదు మిగిలిన జంతువుల చర్మం మందంగా ఉంటుంది (రా 10)

**దమ్ము కర్ర :** అడ్డలో భాగం చూ.చిత్రం-6 IV (కో 12)

**దబ్బ .** తోలు బొమ్మల్ని ఆడించటానికి కట్టే బద్ద (రా 12)

**దబ్బ ఆకురాయి :** కొయ్య చంచాలను నునుపు చేయడానికి వాడే ఇనుప ఆకురాయి (కో 35)

**దబ్బ పోగర** తోలు బొమ్మలకి ఆభరణాలు చేయటానికి వాడే పరికరం దీంతో చిల్లులు ఏటవాలుగా వస్తాయి (రా 10)

**దబ్బబొమ్మ :** చూ ఏకపటం బొమ్మ తోలు బొమ్మల తయారీలో ఒక్క తోలు మీదే బొమ్మని పూర్తిగా వేసే బొమ్మ దీనికి కాళ్ళు, చేతులు, తల కదిలించటానికి ఉండదు చూ చిత్రం-12 (రా.5)

**దబ్బ శీర్ణం ·** రాతిపనిలో ఉపయోగించే పరికరం చూ చిత్రం-166 (రా 3,5,6)

**దబ్బాకు అలుగు ·** కొయ్య పనిలో చిన్న చిన్న బెజ్జాలు చేయడానికి వాడే సాధనం (కో 16)

**దరియాపెట్టె** లోహం పనిలో విగ్రహాల్ని పోతపోయడానికి వాడే పెట్టె. చూ చిత్రం-18 (తె 1,10,12)

**దర్వాజా :** కొయ్య పనిలో చేసే తలుపు (తె 13)

**దళసరి** రూపా దళసరం. పర్యా మందం, మొద్దు.

1. లోహం బొమ్మకి పాలిష్ పెట్టడానికి వాడే గుడ్డ మందం (రా 11)

2 తోలు బొమ్మ మందం (కో 30)

3. ఇత్తడి బొమ్మలు తయారీలో మైనం పూత మీద మట్టి పూసే మందం (కో 1)

4 పొట్టేలు చర్మం మొద్దుగ ఉండటం (కో 37)

**దళసరిఅట్ట :** దంతం పనిలో పెట్టెని చేసేప్పుడు తాబేటి చిప్ప పేళ్ళు అతికించిన దిమ్మ చుట్టూ కట్టటానికి వాడే అట్ట (కో.9)

**దవగారు :** ఫిలిగ్రీ పనిలో వెండి తీగను మెలిక తిప్పటానికి వాడే పరికరం (పట్కారు) చూ కటింగ్ ప్లేర్ (కో 1)

**దశావతారాల సెట్** 1 కొయ్య పనిలో చేసే బొమ్మ (దారు శిల్పం). (రా.4)

2 ఫిలిగ్రీ పనిలో వెండి రేకు మీద చెక్కే బొమ్మ (కో 33)

**దస్తా బొమ్మలు :** బొమ్మలో బొమ్మ ఈ విధంగా 7 బొమ్మలు ఒకే బొమ్మలో ఉండేట్టు అమర్చిన కొయ్య, లక్క బొమ్మలు ఒక దానికంటే ఒకటి చిన్న బొమ్మలు వరుసగా ఉంటాయి (కో 11, తె 1)

**దాకలి .** రూపా. దాగిలి

1 లోహం పనిలో దీని మీద వెండి పెట్టి సుత్తితో కమ్మి కొడతారు (తె 8)

2 చూ డాకలి ఇత్తడి బిందెల తయారీలో వాడే సాధనం (కో 4)

**దామర ఆకు .** కొయ్య పనిలో చెక్కే డిజైన్ పేరు (రా 4)

**దామర తీగ :** కొయ్య పనిలో చెక్కే డిజైన్ పేరు (రా 4)

**దామరపుష్పం :** 1 కొయ్యపనిలో అడ్డ పలకమీద చెక్కే డిజైన్ (రా 4)

2 ఫిలిగ్రీ పనిలో చేసే వస్తువు. (తె 8)

**దారం :** నూలు (కో 7,41, తె 4,6,8,9,11,12,14, రా 9)

**దార్లమొల :** లోహం పనిలో విగ్రహానికి వెంట్రుకలు చెక్కడానికి వాడే సాధనం (తె 12)

**దారి :** లోహం పనిలో దీపపు సిమ్మెని మోల్డింగ్ చేసేప్పుడు మట్టి లోపల ఉండే మైనం కరిగి బయటికి రావటానికి పెట్టే తోవ. గాడి ( 8)

**దారు(చేయు) :** 1 లోహం పనిలో మెరుక్కడ్డీలకు మెరుగు రావటానికి వాడే కుంకుడు కట్టెకు మధ్యన ఉండే లోతు భాగం (తె 12)

2. అడ్డపనిలో కొయ్యని చెక్కడానికి వాడే బాడితకి చివర వాడిగా ఉండే భాగం (కో 10,11)

**దారురాయి :** ఆకురాయిని, ఉలులని సాన(పదును) పట్టడానికి వాడే రాయి. పర్యా నూర్రాయి. (కో 12)

**దార్లు(చెక్కు) :** లోహం పనిలో విగ్రహానికి వెంట్రుకలు వంటి భాగాలు చెక్కు (తె 12)

**దిగిపోవు** కొయ్యపనిలో డిజైన్‌లు చెక్కేప్పుడు 'కొయ్యగూటం' వాడకుండా ఇనుప సుత్తితో కొడితే ఉలి చెక్క లోపలికి దిగు (కో 34)

**దిగు** వచ్చు (కొయ్యని ఎన్ని ముక్కలు దిగుతాయో అన్ని ముక్కల్ని కోయిస్తాం) (కో 6)

**దిగుడు(ఎగుడు, దిగుడు)** కొయ్య పనిలో ముందు కొయ్య సమానంగా లేకపోవటం (రా 6)

**దిగ్గొట్టే రాయి :** అడ్డలో భాగం చూ చిత్రం-6 X (కో 12)

**దిండు** పర్యా రఫ్ షేప్ నిర్మల్ బొమ్మలు, రంపం పొట్టు బొమ్మలు తయారీలో ముందు పాణికి చెట్టు కర్రతో చేసిన బొమ్మ రఫ్ షేప్. (తె 4,9)

**దిద్దు(కొను)** 1 చెవులకి పెట్టుకునే ఆభరణం (కో 33)

2 ఫిలిగ్రీ పనిలో పెన్సిల్‌తో గీసిన డిజైనును రేకుమీద ఇనుప మొలతో కొట్టు (తె 10)

**దిమ్మ(కత్తిరించు)** 1. అడ్డ కర్ర పనిలో ముక్కలుగా కోసిన అంకుడు కొయ్య (కో 12)

2 నాలుగు వైపులా మూసిన కొయ్య దిమ్మ దీని మీదే దంతం పేళ్ళు అతికించి దంతం పెట్టె చేస్తారు (కో.9)

3 ఫిలిగ్రీ పనిలో ముందు కంచుని కరిగించి పోసే దిమ్మ (అచ్చు) (కో 27)

4 కొయ్య పనిలో కోసిన కొయ్య ముక్క (రా 4)

**దివాన్ .** కొయ్య పని చేసే ముస్లిం ఇండ్లలో వాడుకలో ఉండే పెద్ద కుర్చీ (తె 13)

**దివాల్‌గిరి** (ఉర్దూ) పర్యా బ్రాకెట్లు, బక్షీబద్దలు, సపోర్టులు కొయ్యపనిలో చెక్కపై చేసే డిజైనులు (తె 13)

**దిష్టి(తగులు, ఆను)** 1 చూపాను, చూడగలుగు (తె 6)

2 దిష్టి తగలటం (రా 4)

**దీపపుసిమ్మె .** రూపా. దీపం సిమ్మె

లోహం పనిలో, కొయ్య పనిలో చేసే దేవాలయంలోని గర్భగుడిలో ఉపయోగించే దీపం స్టాండు (కో 8, తె 12,13,15)

**దీపం** 1 ఫిలిగ్రీ పనిలో వెండిని, తీగని కాల్చేందుకు వాడే దివ్వె (తె 8)

2 గణపతి ప్రార్థనప్పుడు దేవుడి దగ్గర పెట్టేది తోలు బొమ్మలాటలో వెలుగు కోసం వాడే దివ్వె (రా 2,10)

**దీపం కాగడా** చూ దీపం (1) (కో 27)

**దీపం స్తంభం** దీపపు సిమ్మె (తె 13)

**దీపాంతరం** పర్యా ప్రమిద తోలు బొమ్మలాటలో వాడే ప్రమిద (రా 2)

**దుక్క** పర్యా. దుంగ, మొద్దు

1 కొయ్య పనిలో వాడే కొయ్య దుంగ, కొయ్య మొద్దు (కో 4,12,13)

2 చూ కర్ర లోహం పనిలో తరిణ దొడ్డి కుండే ఒగ్గు బల్ల (కో 8)

**దుకాణం** : రూపా దుకాన్

1 అంగడి (తె 3,8,12)

2 చూ కొలిమి కొలిమి ముందు భాగం (కో 4,8, తె 4)

**దుకాణం పని** ఫిలిగ్రీలో వస్తువుల తయారీ (కో 27)

**దుగిలిపోవు** కొమ్ము పనిలో గుల్లకొమ్ముతో పనిమొదలు పెడితే పొట్టు, పొట్టుగ రాలిపోవు. (కో 32)

**దుగులు** ఫిలిగ్రీ పనిలో బాగా బిగుసుకున్న లక్క వేడి చూపిస్తే కొంచెం వదులగు (కో 27)

**దుంగ** . చూ దుక్క(1), కర్ర (కో 16,24, తె 1)

**దుంగపొట్టు** పర్యా కర్రపొట్టు

కొండపల్లి బొమ్మలకి మక్కుపూసి పచ్చి ఎండటానికి కుంపట్లో వేసే పొట్టు (కో 26)

**దుప్పటి** · పర్యా దుప్పటిరేకు తోలు బొమ్మల తయారీలో చర్మాన్ని సైస్ చేసేప్పుడు దీనిమీద పెట్టి చీలలు కొడతారు (కో 37)

**దుప్పి కొమ్ము** · 1 దీనిని దంతం పనిలో ఏనుగు దంతానికి బదులుగ వాడతారు (కో 9)

2 కొమ్ము బొమ్మల తయారీలో కళ్ళకు మాత్రం దీన్ని వాడతారు (కో 1)

3 చేతికర్రల తయారీలో పిడికి వాడే వస్తువు. (కో 23, తె 5)

**దుప్పిబొమ్మ** కొయ్య పనిలో చేసే బొమ్మ (తె.4)

**దుబ్బ (మన్ను)** లోహం పనిలో విగ్రహాల తయారీలో ముందు మట్టి బొమ్మని చేయడానికి వాడే మన్ను. (తె 1,12)

**దుమ్ము** : 1 కొమ్ముల్లో ఉండే చెత్త (తె 5)

2 చూ గుంజా, గలీజు బొమ్మల మీద పడే ధూళి (కో 41)

**దువ్వెన** . 1 (మేకప్‌లో) తల దువ్వుకోను వాడేది (కో.7)

2 కొమ్ము పనిలో చేసే వస్తువు (కో 1)

**దూగోడుపట్టు** · 1 కర్రను సాపు చేయు (కో 26, తె 3,5,13)

2 చూ. చిత్రి

**దూగోడా కర్ర** . దూగోడాలో ఒక భాగం (తె 13)

**దూది** పర్యా. పత్తి

1 తోలు బొమ్మలకి రంగులు వేయటానికి వాడే కుంచెను చేసేప్పుడు పుల్లకి చివర కట్టే ద్రవ్యం (కో 37)

2 ప్రత్తి బొమ్మల తయారీకి వాడే వస్తువు (రా 7)

3 కొయ్య బొమ్మల పాలిష్‌చేయడానికి వాడే పదార్థం. (కో 34)

4. మట్టి బొమ్మల తయారీలో మట్టిలో కలిపేందుకు వాడే ద్రవ్యం (రా 41)

**దూదేకు లకిడీ :** (ఉర్దూ) కొయ్య పనిలో వాడే పాల కురిశెకొయ్య (తె 13)

**దూప :** కొయ్య పనిలో మొద్దుల్ని కోసేప్పుడు వేసే 'దాహం' (వీళ్ళు దాహం కాకుండా బెల్లం నీళ్ళు తాగుతారు) (తె.13)

**దూపు** కొయ్య పనిలో మంచం, కుర్చీ చేసేప్పుడు రీపర్లను ఒకదాన్లో ఒకటి దోపు (కో 35)

**దూరిపలక :** కొయ్య పనిలో చేసే సింహద్వారంలో భాగం (కో 3)

**దేవతాబొమ్మలు :** తోలు బొమ్మల తయారీలో చేసే దేవతలకి సంబంధించిన బొమ్మలు. (కో 15)

**దేవదారు(కొయ్య)** 1. (చెక్క) కొయ్య పనిలో చెంచాలు చేయడానికి వాడే కట్టె. (కో 35)

2 దంతం పనిలో కంబతొట్టె తయారీకి వాడే చెక్క (కో 9)

**దొడ్డాకురాయి :** లోహం పనిలో గొగ్గులుగా ఉన్న చోట నునుపు చేయటానికి వాడే సాధనం (తె 1)

**దొడ్డి :** పర్యా. తరిణె దొడ్డి లోహం పనిలో విగ్రహాల్ని చెక్కటానికి వాడే తరిణ దొడ్డికి ఉండే కర్ర చక్రం దగ్గరుండే ఖాళీ (కో 8)

**దొడ్డు :** 1 లోహం పనిలో చేసే పూలతొట్టి మధ్య భాగం (తె 12)

2. కొయ్య బొమ్మలకి ముందుగ పెట్టే ముక్కు లావుగ ఉండటం (దొడ్డుముక్కు) (తె 4)

3. కొయ్య పనిలో డిజైన్లు చేసేప్పుడు ముందు కాగితం మీద డిజైన్ వేసుకుంటారు పూర్వం దీన్ని పుట్టకాయిదాలు (చేతి కాయిదాలు) మీద వేశేవారు ఇవి చాలా మందంగా ఉంటాయి (దొడ్డు = మందం) (తె.13)

4. లావు, మందం ఫిలిగ్రీ పనిలో వాడే వెండి పూర్వం నాట్లని లావుగా ఉండేది. (తె 8)

**దొడ్డుగుంజ :** ఫిలిగ్రీ పనిలో వెండి సాగదీయటానికి వాడే వైర్ మిషన్ బదులు పూర్వం వాడే లావు స్తంభం. (తె 8)

**దొడ్డుతీగ ·** ఫిలిగ్రీ పనిలో వాడే లావు వెండి తీగ (తె.8)

**దొడ్డు పొట్టు** కొయ్య పనిలో బొమ్మలకి వాడే 'ముక్కు' తయారీలో వాడే 'లావు రంపం పొట్టు' (తె.7)

**దొడ్డు బులుసు ·** పర్యా పెద్ద కుంచె, మొద్దు కలరు. రంపం పొట్టు బొమ్మలకి రంగులు వేయటానికి వాడే లావు కుంచె (తె 9)

**దొడ్డు రాపణం** పర్యా. ఎలతబద్దరాయి. కొయ్య పనిలో బొమ్మలని లావు ఆకురాయితో రాయడం (నునుపు కోసం) (తె 4)

**దొడ్డు లప్పం :** పర్యా. దొడ్డుముక్క కొయ్య బొమ్మలకి వాడే లావుపాటి రంపం పొట్టు కలసిన చింతగింజల అంబలి (లప్పం) (తె 4)

**దొంతకట్టె .** తోలు బొమ్మలాటని ఆడేవారు చప్పుడు కోసం కాళ్ళ కింద వేసుకునే చెక్కపీట (కో 7)

**దొంతర .** వెండి, రాగి, బంగారం కలిసిన వస్తువుల తయారీలో లోహాన్ని కరిగించేప్పుడు మూటిని ఒకదాని మీద ఒకటి పెట్టటం (కో 31)

**దోగాడు .** పాకటం (దోగాడే కృష్ణుడు) మట్టి బొమ్మల తయారీలో చేసే రూపం (రా 9)

**దోయార్‌మొల ·** పర్యా కాల్పమొల. లోహం పనిలో బొమ్మలకి జందెం, మొలతాడు వంటి భాగాల్లో బొద్దు రావటానికి వాడే సాధనం (తె 12)

**దోరం ·** సుత్తికి కొయ్యపిడిని పెట్టడానికి ఉండే చిల్లు (రా.5)

**దోసగింజ చీర్లం :** తోలు బొమ్మలకి ఆభరణాలు చెక్కటానికి వాడే చీర్లం చూ చిత్రం-119. (కో.37)

**దోసపలుకుల నమూనా :** ఫిలిగ్రీ పనిలో చేసే డిజైన్ (తె.8)

**ద్రావకం :** తోలు బొమ్మలకి వాడే తోలుని శుభ్రం చేసేప్పుడు నీటిలో కలిపే ద్రవం (కో 30)

**ద్రావకం వెండి** · ఫిలిగ్రీ పనిలో వాడే మంచి రకం వెండి (కో 27)

**ద్రాక్షతీగ** కొయ్య పనిలో చేసే డిజైను (తె 9)

**ద్వారం తొడుపు** లోహం పనిలో ద్వారాలకి కొలతల ప్రకారం ఇత్తడితో చేసే తొడుగు (కో.33)

# ధ

**ధనువోడు బొమ్మ** : పర్యా దబ్బ బొమ్మ; ఏకపటం బొమ్మ (రా 12)

**ధూపం** · తోలుబొమ్మలాట ప్రారంభంలో గణపతి ప్రార్థనప్పుడు వేసే పొగ (రా 2)

**ధ్రువ తాళం** . తోలు బొమ్మలాటలో మృదంగం మీద వాయించే తాళం (రా 2)

# న

**నకలు** : నగిషీ పనిలో సైను బట్ట మీద దించిన స్కెచ్చి (తె 7)

**నకాష్** · ఒక కులం పేరు నిర్మల్ కళాకారుల కులం పేరు పర్యా సోమక్షత్రియ చూ ఆర్యక్షత్రియ (తె 4,9)

**నక్కపిట్టలబొమ్మ** : కొయ్య పనిలో చేసే ఒక కొయ్య బొమ్మ (రా 4)

**నక్ష(గీయు)** . 1 ఫిలిగ్రీ పనిలో చేసే వస్తువు నమూనా (తె 8)

2 లోహం పనిలో నమూనా డిజైను (తె 12)

3 తోలు బొమ్మల తయారీలో బొమ్మల డిజైను. (రా 2)

**నక్షత్రం చీర్ణం** తోలు బొమ్మలకి ఆభరణాలు చేయటానికి వాడే సాధనం (కో 37)

**నక్షత్రం జీర్ణముల** · తోలు బొమ్మల తయారీలో ఉపయోగించే పరికరం. చూ చిత్రం-121 (కో 37)

**నక్షపని** · ఫిలిగ్రీ పనిలో చేసే పోగరు పని, మోలల పని (తె 8)

**నక్లీసు** : ఫిలిగ్రీపనిలో చేసే గొలుసు చూ కంఠమాల (తె 1)

**నగలు(పెట్టు)** : పర్యా. అలంకారాలు తీయు మట్టి బొమ్మల తయారీలో బొమ్మకు మట్టితోనే ఆభరణాలు చేయటం. (కో 27)

**నగారా** తోలు బొమ్మలాటాలో వాడే మాదిగ డప్పు (రా 10)

**నగిషీ (చెక్కు)** : 1 లోహం పనిలో విగ్రహానికి చేసే చెక్కడం పని (కో 33, తె 12)

2 పర్యా నగిషీపని చేతికర్రల తయారీలో కర్రకి చేసే చెక్కడం పని. (తె 5)

**నగిషీకత్తులు** కొయ్యపనిలో చేసే డిజైను కత్తి (కో 35)

**నగిషీచంచా** కొయ్యపనిలో చేసే డిజైను చంచా. (కో.35)

**నగిషీపని** 1 తోలుబొమ్మల తయారీలో బొమ్మకు చేసే చెక్కుడు పని (కో 30)

2 లోహం పనిలో చేసే సున్నితమైన పని. (తె.1,12)

3 దంతంపనిలో దంతంపై బొమ్మవేసి లక్కరంగు అద్దడం (కో 9)

4 నిర్మల్ బొమ్మల తయారీలో బొమ్మకు చేసే చెక్కుడుపని (తె 4)

5 ఫిలిగ్రీపనిలో చెక్కుడుపని. (కో 27)

**నగిషీ పిల్లకుప్పెలు** (రోల్డుగోల్డు) బంగారం పూతతో తయారైన జడలకు పెట్టుకునే చిన్నచిన్న కుప్పెల గుత్తులు (కో 27)

**నగిషీ పేపర్‌కట్టర్** కొయ్యపనిలో చేసే కాగితాన్ని కత్తిరించటానికి వాడే డిజైన్ కత్తెర (కో 35)

**నగిషీఫోర్కు** కొయ్యపనిలో చేసే వస్తువు (కో 35)

**నగుసారం** . పర్యా నవాసారం, సూరేకారం ఫిలిగ్రీపనిలో చెత్తపోవడానికి మూసలో దీన్ని కరిగిన వెండి మీద పోస్తారు (తె 8)

**నజ్జారీ కాం** . కొయ్యపనిలో చేసేకర్ర నగిషీ పని (తె.13)

**నట్** రూపా నట్టం రేజ్ గాడిలో ఒక భాగం (కో 7, తె 8, రా 5)

**నట్‌బోల్టు** : లోహం పనిలో బొమ్మ భాగాల్ని కలపటానికి వాడే సాధనం (తె 1)

**నడిపించు** : తోలుబొమ్మలాటలో బొమ్మల్ని కదిలించు (రా 12)

**నడుం** కొయ్యపనిలో చేసే బొమ్మవెనుక భాగం (కో 41, రా 4)

**నంది** : రంపంపొట్టు బొమ్మల తయారీలో చేసే శివుని వాహనం (కో 40)

**నమూనా** : పర్యా నక్ష, డిజైన్, మోడల్ సాంచ ఆకారం (కో 4,27,35, తె 1,2,4,5,6,7,8,9,12,13)

**నమూనాబొమ్మ** . లోహంపనిలో ముందు చేసే బొమ్మ (తె.12)

**నయం పేపరు** గరుకుపేపరులో ఒక రకం (50 నెం॥) కొయ్యబొమ్మల నునుపుకి వాడతారు (కో 34)

**నయంపోగర** : లోహం పనిలో రేకుపై బొమ్మ చెక్కిన తరువాత బొమ్మను సమం చేయటానికి వాడే సాధనం (రా 11)

**నరవంది విగ్రహం** ఫిలిగ్రీ పనిలో చేసే బొమ్మ. తలవరకు నంది, తరువాత మనిషి ఆకారం (కో 33)

**నరం** : వారు చర్మంతాడు

1 లోహంపనిలో వాడే పంకామీద తిరిగేతాడు (తె.12)

2 తోలు బొమ్మల తయారీలో ఏభాగానికి ఆభాగం చేసి కలిపి కుట్టడానికి వాడే తాడు (కో 15)

**నలగగొట్టు** : రూపా నలగ్గొట్టు

లోహం పనిలో పంకా చక్రానికి వాడేనరాన్ని దంచు (తె.12)

**నల్లకర్ర** పర్యా శేగ

చేతికర్రల తయారీలో వాడే కొయ్యబెరడు లోపలి తెల్లకర్ర లోపల ఉండే చేవ (తె 5)

**నలినాక్షి** రంపం పొట్టు బొమ్మల తయారీలో చేసేబొమ్మ జానపదదేవత (తె 9)

**నలుచదరం** · పర్యా నలుపలకలు తోలుబొమ్మల తయారీలో తోలుని శుభ్రంచేసి ఎండిన తర్వాత నాలుగు పక్కల సమానంగా ఉండేట్లు కోయటం (కో 37)

**నలుపు** . పర్యా నూరు, మర్దించు, మర్దన తోలుబొమ్మలకి వాడే నల్లరంగు తయారీలో మసికరుడులో నూనెపోసి బాగా కలుపు (రా 12)

**నలుపుకొయ్య** . కొయ్యపనిలో వాడే నలుపు కలివికొయ్య. (కో 35)

**నల్లగాజులు** : గాజుల తయారీలో పూర్తిగ తయారుకాని నల్ల రంగు వేసిన గాజులు (తె 1)

**నల్ల తుమ్మముల్లు** . తోలు బొమ్మలాటలో బొమ్మల్ని తెరకు తగిలించడానికి వాడే ముల్లు (రా 2)

**నల్లపూస** పర్యా రాయిపూస కొయ్యపనిలో బొమ్మలకి కళ్ళలా పెట్టడానికి వాడేది (రా 4)

**నల్లబడు** ఫిలిగ్రీ పనిలో వాడే వెండిలో రాగి కలిస్తే నల్లగా అగు (తె 8)

**నల్లమట్టి** . 1 మట్టి బొమ్మల తయారీకి వాడే మన్ను (కో 27)

2. చూ. క్లే లోహం పనిలో బొమ్మని చేసేప్పుడు ముందు మైనంతో తయారు చేసి దానిపైన పూయటానికి వాడే మన్ను (తె 1)

**నల్లమద్ది కర్ర** . (Black Wood) పర్యా జీలుగుకర్ర దంతం పనిలో తొట్టి చేయడానికి వాడేది (కో 9)

**నల్లమాను** : (Rose wood) కొయ్య శిల్పానికి వాడే చెక్క నల్లమాను చెట్టుకొయ్య (రా 4)

**నల్లలక్క** : పర్యా మోటలక్క పూర్వం రెండవ వడపోతలో

వచ్చిన లక్కని నల్లలక్క, మూటలక్క అనేవారు ఇప్పుడు కరగని లక్కని, మంచిదికాని లక్కని నల్లలక్క అంటున్నారు (కో 12)

**నవతాళం** . లోహం పనిలో విగ్రహం చెక్కటానికి వాడే ప్రమాణం (తె 12)

**నవతాళ విగ్రహం** తోలుబొమ్మలాటలో ఒక బొమ్మ చూ చిత్రం-11 (తె.12)

**నవరత్న కిరీటం** . తోలుబొమ్మల తయారీలో బొమ్మకి వేసే కిరీటం. (రా 2)

**నవలాకురాయి** . దంతం పనిలో జాలు గీయడానికి వాడే సాధనం (కో 9)

**నవాసారం** · పర్యా సూరేకారం
ఫిలిగ్రీపనిలో వస్తువుకి వన్నె తేవడానికి కలిపే మిశ్రమంలో వాడే ద్రవ్యం చూ నగుసారం (తె 15)

**వాగసరాలు** . ఫిలిగ్రీపనిలో చేసే తలవెనుక భాగంలో పెట్టుకునే ఆభరణం (తె 15)

**వాగవాసం మొలగొయ్య** లోహం పనిలో వాడే తరిణదొడ్డికి ఉండే కొయ్యమేకు. (కో 8)

**వాగసర్పం** . తోలు బొమ్మలాటలో పాత్రలు, తోలు బొమ్మలు (బ్రహ్మాస్త్రం, నాగస్వరం) (రా 2)

**నాగసర్పాకు** తోలుబొమ్మలాటలో వాడే ముఖవీణ పలకటానికి ఉపయోగించే భాగం (రా 10)

**వాగుపడిగ** . ఫిలిగ్రీపనిలో చేసే ఒక రకం ఆభరణం చూ.చిత్రం-65 (తె 8)

**నాగుంబాము** మట్టిబొమ్మల తయారీలో శివుని మెడలో చేసే నాగుబాము (కో 27)

**వాజూకు** · ఫిలిగ్రీపనిలో సున్నితం (నాజూకువేర్లు) (తె 8)

**నాట** · తోలుబొమ్మలాటలో వాడే రాగం పేరు (రా.2)

**నాటకం** : తోలుబొమ్మలాట (రా 2)

**నాటు** · పూర్వం బొంబాయి నుంచి సరఫరా అయ్యే వెండి కడ్డీ (తె 8)

**నాన(వేయు, బెట్టు)** . 1 తోలు బొమ్మలకు వాడే తోలును ముందు నీటిలో నానపెట్టడం (కో 5,7,13, రా 5)
2 కాగితం గుజ్జు బొమ్మల తయారీలో కాగితాన్ని నీటిలో నానపెట్టడం (కో 41,27,10)
3 కొయ్య బొమ్మలకి వాడే మక్కు తయారీలో చింత గింజల్ని నీటిలో నానపెట్టడం (కో 26, తె 7)
4 గాజుల తయారీలో లక్క గుల్లని నీటిలోవేసి కొంతసేపు ఉంచడం (తె 1)
5 ప్లాస్టర్ ఆఫ్ ప్యారిస్‌తో బొమ్మలు చేసేప్పుడు ప్లాస్టర్ ఆఫ్ ప్యారిస్‌ను నీటిలో నానపెట్టడం (కో 25)
6 పర్యా నీటిలో తడుపు, పదును పెట్టు కొయ్య బొమ్మలకు పూసే మక్కు తయారీలో సర్వీను ముక్కల్ని నానపెట్టడం (కో 16)

**నాంది** · తోలుబొమ్మలాట ప్రారంభించేప్పుడు చేసే గణపతి, సరస్వతీ ప్రార్థన (రా 10)

**నాపరాయి** 1 లోహం పనిలో మోల్డింగ్ చేసేప్పుడు లక్క, సాంబ్రాణి, ఇటుకపొడి, మంచినూనె (కరిగించి) ఉడికించి నాపరాయి మీద పోస్తారు (తె 1)
2. గాజుల తయారీలో వాడే బట్టీలో ఉండే రాయి. (తె 1)

**నాపరాయిసాన** . ఫిలిగ్రీ పనిలో ఎలిగారం అరగదీయటానికి వాడే సాన (కో.27)

**నాము** పర్యా సుద్ద బొమ్మల తయారీకి వాడే నామంసుద్ద. (కో 25)

**నాంపేడు** . అడ్డదుక్క పక్కగా అడ్డసీకును పట్టి ఉంచే వంపు తిరిగిన కొయ్యభాగం. చూ చిత్రం-6 II 2 (కో 11)

**నారికేళం** . కొబ్బరికాయ తోలుబొమ్మలాటలో కొదమ నాటకంలో సమర్పించే ద్రవ్యం (రా 2)

**నారింజరంగు** · కొయ్యపనిలో బొమ్మలకు వేసే రంగు. (కో 16)

**నాలిక** లోహం పనిలో మూసలో లోహం కరిగించి వంపడానికి వీలుగ మూసకి ఉండే భాగం (రా.5)

**నాలుగు పచానమెట్ను** చేతికర్రల పిడుల నమూనా మెట్ను నమూనాల్లో ఒక రకం (తె 5)

**నావసుద్ద .** కొయ్య బొమ్మలకి గుడ్డ చుట్టి పైన పూయడానికి వాడే ద్రవ్యం (కో.19)

**నిడివితెర :** తోలుబొమ్మలాటకు కట్టే పొడుగు తెర (రా 2)

**విద్రమాను** చూ. తూంగు మూంజి కొయ్యబొమ్మలకి ఉపయోగించే కొయ్య (కో 41)

**నిప్పు** మట్టి బొమ్మలు కాల్చడానికి వాడే బట్టీలో ఊకపోసి పైన వేసే అగ్గి (కో 27)

**నిప్పుగరిటె :** కొలిమిలో నిప్పును తీయటానికి వాడే గరిట (రా 5)

**నిప్పుసెగ(చూపు)** పర్యా వెచ్చచేయు కొమ్ము బొమ్మల తయారీలో కొమ్ముల్ని వంపు చేయటానికి నిప్పు దగ్గరగా పెట్టు (కో 32)

**నిమ్మలబద్ద** లోహం పనిలో వాడే సాధనం (కో 8,8,8)

**నిలగుంజ :** నిలువు గుంజ తోలుబొమ్మలాటకు తెర బిగింపులో వాడే నిలువు కొయ్య. (రా.2)

**నిలవ :** ఎక్కువ కాలం ఉంచటం (కో 47)

తోలుబొమ్మలకు వాడే చర్మం దాచి ఉంచటం (కో.12)

**నిలవడు ·** తోలు బొమ్మలాటలో బొమ్మలు తెరమీద నిలిచి ఉండు (రా 10)

**నిలువు ·** కొయ్యపనిలో చేసే సింహద్వారంలో భాగం (రా 4)

**నిలువుకొరాం ·** లోహం పనిలో రౌండు రేకుమీద చెక్కటానికి వాడే సాధనం. (తె 12)

**నిలువు కోత రంపం** కొయ్యపనిలో చెక్కను కోయడానికి వాడే సాధనం (కో 16)

**నిల్చు(ట) :** తోలుబొమ్మలకి వేసిన రంగు ఎక్కువ కాలం ఉండటం (రా.10)

**నీడిల్ఫైల్** కొయ్యపనిలో కొయ్యతో సన్న ఆకారాలు చేసే పరికరం. (తె.1)

**నీరుకారు ·** ఫిలిగ్రీపనిలో వస్తువుల్ని పట్టుకోడానికి, మూసలో కరిగిన వెండి నీరును కలపడానికి, చిన్న కమ్మరి మూసను పట్టుకోడానికి వాడే సాధనం (తె.8,12)

**నీలరంగు ·** రంపం పొట్టు బొమ్మలకి వేసే నీలం రంగు. (తె 9)

**నీలి ·** కొయ్య బొమ్మలకు వాడే నీలం రంగు (తె 7)

**నీలురాయి ·** దంతం పనిలో వాడే కీతరేకుని, ఆకురాయిని నూరుకోవడానికి వాడే రాయి (కో 9)

**నుగ్గుపొడి** మట్టి బొమ్మల తయారీలో మట్టిని ప్లాస్టర్లో వేసేప్పుడు మట్టి దానికి అంటుకోకుండా వేసే బూడిద (రా 9)

**నున్నచేయు ·** రూపా నున్నంగ, నున్నగ, నునుపు చేయు.

1 కొయ్య బొమ్మలని నునుపుగ చేయటం (తె 7)

2 తోలుబొమ్మల తయారీలో వాడే తోలును ముందు సాపు చేయటం (కో 30)

3 కాగితం గుజ్జు బొమ్మల తయారీలో బొమ్మల్ని నునుపుగ చేయటం (కో 4, రా 11)

4 మక్కు బొమ్మల తయారీలో చింత గింజల్ని నాన బెట్టి మెత్తగ రుబ్బటం (రా 13)

**నురగ** ఫిలిగ్రీ పనిలో వస్తువుల్ని సబ్బునీటిలో చిలికితే వచ్చే నురుగు (కో 27)

**నూనె .** 1 తోలుబొమ్మలాటలో వాడే ప్రమిదలో పోసే ద్రవం (కో 7)

2 లోహం పనిలో వాడే అట్టెం తయారీలో గుగ్గిలం, ఇటిక మట్టితో కలిపే ద్రవం (తె 12)

**నూరు ·** 1 లోహం పనిలో చేడుమట్టి, గుడ్డగుండు, రేగడిమట్టి కలిపి మెత్తగ చేయు (తె.12)

2 తోలుబొమ్మలకు వేసే నలుపురంగు తయారీలో మసి కరుడులో వేపబంక కలిపి మెత్తగ చేయు (కో 30)

**మూరుకొను** . సానబెట్టు (తె 6,15, రా 4)

**మూల్దారం** . లోహం పనిలో వాడే పంకాను తిప్పటానికి కట్టే తాడు. (తె 12)

**మూలు(దళసరి)** : 1 కొయ్యపనిలో కొలతలకి గీతలు కొట్టడానికి వాడే దారం (కో 35)

2 కుంపాస తయారీలో వాడే ఊస నూలు మందంగా ఉండటం (కో 6)

**నెక్స్** · గవ్వ బొమ్మ. చూ.చిత్రం-37 (రా 5)

**నెక్లెస్‌వెరైటీ** · ఫిలిగ్రీ పనిలో చేసే మెడలో వేసుకునే గొలుసుల రకాలు. (కో 33)

**నెట్టు** . కాగితం గుజ్జు బొమ్మల తయారీలో మోల్డ్‌మీద వేసిన ప్లేటును చేత్తో తోయు (కో 41)

**నెత్తిబత్తి** . నెత్తిమీద పెట్టుకొని కట్టెలు తెచ్చే బట్ట (రా 4)

**నెత్తురు** . రక్తం ముత్తరాసి కులం వాళ్ళు అడుక్కునేప్పుడు చాట్లో బొమ్మలు పెట్టి నెత్తురుపోస్తారు (తె 7)

**నెమలి తలుపు** : కొయ్యపనిలో నెమలిబొమ్మలు చెక్కిన తలుపు (కో 34)

**నెమలి-ఈక** నెమలి పింఛం కొయ్యబొమ్మల తయారీలో కృష్ణుడి బొమ్మకి తలపైన పెట్టే ఈక (కో 7,26)

**నెమలిరాళ్ళ రాగిడి** : ఫిలిగ్రీ పనిలో చేసే ఒక రకం ఆభరణం చూ చిత్రం-69 (కో.27)

**నెమలి** . ఫిలిగ్రీ పనిలో చేసే పక్షి బొమ్మ (తె 8,10,12, రా 5)

**నెమిలి మూతి** : నెమిలి జాలీపనిలో పోతపోసే భాగం (తె.10)

**నెంబరు** : గరుకు కాగితం రకాన్ని తెలిపే సంఖ్య. (కో 16)

**నెంబు** : పర్యా తడి రంపం పొట్టు బొమ్మలకి వార్నీషుని వేడి చేసి పూస్తే తడి తగిలినా బొమ్మ పాడైపోదు (కో.40)

**నెమ్మ** : కొయ్యపనిలో కొయ్యని చీల్చడానికి వాడే మేకు (కో.15, రా.5,6)

**నె(ఱ్రయిడు** : మక్కు బొమ్మల తయారీలో బొమ్మకు పైన గుడ్డ చుట్టకపోతే బీటలు తీయు. (రా 13)

**నెలవంకతలపిన్ను** · ఫిలిగ్రీ పనిలో చేసే ఒక రకం ఆభరణం చూ చిత్రం-66 (కో 27)

**నేచురల్ కలర్** · కొయ్యబొమ్మల తయారీలో బొమ్మకు రంగులు వేయకుండ చెక్కను సహజమైన రంగులోనే ఉంచటం (రా 4)

**నేనడ** · తోలుబొమ్మలాటలో వాడే రాగం పేరు. (రా 2)

**నేరేడ** : కొయ్యబొమ్మలకు ఉపయోగించే చెక్క (రా.13)

**నేరేడుకర్ర** . లక్కబొమ్మలకి వాడే నేరేడు చెట్టుకర్ర. (కో 12)

**నేరేడుపండు రంగు** : చూ. ఊదారంగు తోలుబొమ్మల తయారీలో బొమ్మలకు వేయటానికి వాడే వైలెట్ రంగు (కో 15)

**నైట్రిక్ యాసిడ్** ఫిలిగ్రీ పనిలో, లోహం పనిలో వస్తువుల్ని శుభ్రం చేయడానికి వాడే ఆమ్లం. (కో.27,28,33; తె.1,10,12)

**నైపుణ్యం** : నేర్పరితనం. (కో 30)

**నైవేద్యం** : తోలుబొమ్మలాటకు ముందు ప్రార్థన చేసేప్పుడు దేవుని ముందు పెట్టే ఆహారం (కో.15)

**నైస్‌చేయు** · కొయ్యపనిలో వస్తువుల్ని నునుపుగ చేయు. (కో 41; తె 13, రా 4,5,6,8)

**నైస్‌చేసేగూటం** . పర్యా మట్టం అలుగు, సవుపీర్నం. కొయ్యపనిలో బొమ్మల్ని నునుపు చేయటానికి వాడే దిమ్మ (రా.4)

**నొక్కు** · కాగితం గుజ్జు బొమ్మల తయారీలో వేళ్ళతో గుజ్జుని అదుము (ఒత్తు) (కో 17,27)

**నొక్కుళ్ళు** : కొబ్బరి చిప్పతో బొమ్మలు చేసేప్పుడు చిప్పని గరుకు కాగితంతో కొడితే పోయే హెచ్చుతగ్గులు. (కో.32)

**న్యూస్‌పేపరు** ; 1. దంతం పనిలో పెట్టెలు చేసేప్పుడు

తాబేటి పేళ్ళు అతికించిన దిమ్మచుట్టూ కట్టడానికి వాడే కాగితం (కో.9)

2 కాగితం గుజ్జు బొమ్మల తయారీలో బొమ్మలకి పైన 4,5 పొరలు అతికించటానికి వాడే కాగితం. (కో 17)

## ప

**పక్కదూగోడా** కొయ్యపనిలో చెక్క పక్క భాగాలకు తురమడానికి వాడే సాధనం. (తె 13)

**పక్వం** · లోహం పనిలో ముందు మైనం విగ్రహాల మూసల తయారీకి వాడే మైనం చేసేప్పుడు గుగ్గిలం, తేనెమైనం, ఆముదం కలిపి ఉడికించటం (రా 5)

**పగడం** . ఫిలిగ్రీపనిలో ఆభరణాలకు ఉపయోగించే వస్తువు చూ చిత్రం-40 (కో 33)

**పగడాలదండ** · ఫిలిగ్రీపనిలో పగడాలు కూర్చి తయారుచేసిన దండ (కో 33)

**పగలకొట్టు** · రూపా పలగగొట్టు, పగలగొట్టు కొయ్యపనిలో కొయ్యని బద్దలు కొట్టు (కో 41)

**పగలకోయు :** తోలుబొమ్మల తయారీలో చర్మాన్ని మధ్యకు చీల్చు. (కో 37)

**పగిలిన కుండమూత :** ఫిలిగ్రీ పనిలో కుంపటి కుదురుగ వాడే కుండ భాగం (తె 8)

**పగిలిపోవు :** లోహం పనిలో ముందు మట్టితో చేసే బొమ్మ ఎండతగిలితే విడిపోవు (కో 33)

**పగులు** పర్యా ఈన

1 సుద్దమట్టి బొమ్మల తయారీలో బొమ్మలు పగిలిపోవటం (కో 10)

2 కొయ్యపనిలో కొయ్యకు ఏర్పడే బీట, ఖాళీ (కో.14)

3. నిర్మల్ బొమ్మల తయారీలో బొమ్మలకి రంగు వేసే ముందు సాపుచేసి తడిగుడ్డతో తుడిస్తే బొమ్మకు కనపడే బీట (తె 4)

4 కొయ్యపనిలో కొయ్యకుండే బీట చూ ఈన (రా 4)

**పంకా** . లోహం పనిలో వాడే కొలిమిలో గాలి రావటానికి ఉండే చక్రం (కో.8,18,27, తె 10,12)

**పంగ** తోలుబొమ్మలకి తగిలించే ఈతపుల్ల చీలిక (కో 18, తె 10)

**పంగకర్ర** · లోహం పనిలో వాడే కరవాయిని నిలబెట్టే సాధనం టుంగమొద్దు (తె 10)

**పంగలకట్టె** పర్యా. పంగలమొద్దు చూ పంగకర్ర (కో 31, తె 8)

**పచిడి** కొయ్యపనిలో వాడే తోపుడులో ఉండే యినప రేకుమీద పెట్టే కొయ్యముక్క (కో 16)

**పచ్చపటారి** కొయ్యపనిలో వాడే కొయ్య (రా 5)

**పచ్చపేవిడి** కొయ్యపనిలో బొమ్మలకి వేసే పసుపు పచ్చ రంగు. (తె 7)

**పచ్చి** 1 కొయ్యపనిలో వాడే కొయ్య తడిగ ఉండటం (కో 7,13,14,19,39)

2 తోలుబొమ్మలకి వాడే నిలవ ఉంచని చర్మం (రా 2)

3 కొమ్ము బొమ్మలకు వాడే కొమ్ములో ఉండే తడి (కో 1)

**పచ్చిచర్మం** నిలవ ఉంచని, సున్నం పెట్టని, ఎండపెట్టని తోలు (తె 2, రా 5,10)

**పచ్చిమట్టి** పర్యా. పచ్చి జిగటమట్టి లోహం పనిలో, మట్టి బొమ్మల తయారీలో వాడే మట్టి (కో 27, తె 12)

**పచ్చిరంగు** తోలుబొమ్మలకి వేసే రంగు పొడి (కో 15,30)

**పచ్చైకిళి** గవ్వపనిలో చేసే పచ్చని చిలక బొమ్మ చూ చిత్రం-32 (రా.5)

**పంచలోహబొమ్మ** రాగి, తగరం, సత్తు, వెండి, బంగారం

లోహాల మిశ్రమంతో చేసిన విగ్రహం (కో 33, రా 5)

**పంచలోహాలు** ఇత్తడి, ఇనుము, రాగి, బంగారం, వెండి (కో 24)

**పంచి :** రూపా పంచె, పంచ పర్యా ధోవతి.

1 'వెంకటరమణమూర్తి' లక్కబొమ్మలోని భాగంపేరు (కో 12)

2 తోలుబొమ్మలాటలో తెరకి వాడే గుడ్డ చూ ధోతి. (కో 7)

**పంచమడత** లోహం పనిలో విగ్రహానికి మెట్నమొలతో చెక్కే మడత. (తె 12)

**పటంవాళ్ళు** · చాకలివారిలో అడుక్కునేవాళ్ళు చు ఏనూటి వాండ్లు (తె 9)

**పట్టకచ్చి** పట్టుకువచ్చి ("ఆకులపారే గువ్వలు పట్ట కచ్చి") (తె 4)

**పటాసి :** కొమ్ముబొమ్మల తయారీలో ఉపయోగించే పరికరం చూ చిత్రం-109 (కో.1, తె 6)

**పట్టకారు :** రూపా. పట్టుకార, పట్టుకారు, పట్కారు చూ (కారు) కటింగ్ప్లేర్ దంతం పనిలో మేకులు పీకడానికి, లోహం పనిలో వస్తువులు పట్టుకోడానికి, రేకుల్ని కత్తిరించడానికి వాడే సాధనం. (కో 3,9,27,33, తె.1,8,29, రా 5,8)

**పట్టగుడ్డ .** తోలుబొమ్మలాటలో స్టేజీకి చుట్టూరా కట్టే గుడ్డ (కో 37)

**పట్టా :** లోహం పనిలో వాడే రైలుపట్టా (తె 12)

**పట్టాపీ** బరాని గవ్వభొమ్మ చూ చిత్రం-30. (రా 5)

**పట్టించు(కొను)** · కొయ్యబొమ్మలకు వేసే నలుపురంగు తయారీలో పెంకుకు కట్టెలపొగ పట్టించటం (తె.1)

**పట్టీ :** తోలుబొమ్మలాటలో వాడే మువ్వలగజ్జెల తయారీలో మువ్వల తొడుగు పేర్చటం. (కో.7)

**పట్టు(కొను)** · 1. కొమ్ము బొమ్మల తయారీలో కొమ్ముని వేడి చేసేప్పుడు కారుతో పట్టుకోవటం (కో.2)

2 ఫిలిగ్రీ పనిలో దొడ్డుతీగను మలచటానికి వాడే బుగ్గపట్కారుకి పట్టుకొనేందుకు ఎక్కువగా ఉండే బలం (తె 8)

3 తోలు బొమ్మల తయారీలో వాడే చర్మాన్ని ముందు బొమ్మ తీయటాన్ని వీలుగా చేయటం (కో 30)

4 కొండపల్లి బొమ్మలకి వేసే రంగు బొమ్మకి బాగా అంటుకోవడం. (కో.26)

**పట్టుమైనం :** లోహం పనిలో మోల్డింగ్ బొమ్మ చేయటానికి వాడే తేనెపట్టు నుండి తీసిన మైనం (కో 1)

**పట్టెడ .** ఫిలిగ్రీ పనిలో వెండి పనిని చేయడంలో ఉపయోగించే ఇనపదిమ్మ దీనిమీద వస్తువు పెట్టి పనిచేస్తారు (తె 8,15)

**పట్టెడదుంగ** · పర్యా పట్టెడమొద్దు

లోహం పనిలో వాడే పట్టెడని బిగించటానికి వాడే కొయ్య మొద్దు (కో 27, తె 8,15)

**పండబెట్టు :** రూపా పండుకోబెట్టు

కాగితం గుజ్జు, మట్టిసుద్ద బొమ్మల తయారీలో బొమ్మను పడుకోబెట్టడం (కో 17,27)

**పండురంగు :** ఫిలిగ్రీ పనిలో వస్తువులకి "వన్నె" పూసి నిప్పులో వేస్తే వచ్చే రంగు (తె 15)

**పండ్లగుత్తి :** కొయ్యపనిలో చేసే వస్తువు (రా 4)

**పండ్లు .** చేతికర్రల తయారీలో పిడిదగ్గర చెక్కే మొసలి బొమ్మ నోటిలోని పళ్ళు (తె 5)

**పత్తి** (దూది) బొమ్మల తయారీకి వాడే ద్రవ్యం చూ దూది (రా 7)

**పత్రం :** తోలుబొమ్మలాటకు ముందు గణపతి ప్రార్థన చేసి సమర్పించే ఆకు (రా 2)

**పదహారు వంతులు .** పూర్వం ఫిలిగ్రీ పనిలో వాడే తూకం (రూపాయికి పదహారు వంతులు, అణాలెక్క) (తె.8)

**పదహైదు** లోహం పనిలో విగ్రహాల్ని చేసేప్పుడు ముందు మట్టితో చేసిన బొమ్మని ఆరబెట్టవలసిన రోజుల సంఖ్య (పదిహేను) (రా 5)

**పది ఆటలు :** తోలు బొమ్మలాటవారు భారతం గురించి చెప్పే కథల సంఖ్య (రా.2)

**పదించిల ఆకురాయి :** నిర్మల్ బొమ్మల తయారీలో వాడే సాధనం (తె 4)

**పదిహేను** · తోలుబొమ్మలాటవారు భారతం గురించి చెప్పే కథల సంఖ్య (రా 2)

**పదును :** 1 లోహం పనిలో మోల్డ్‌పోసిన విగ్రహానికి పైమట్టిని తీసేసి విగ్రహాన్ని నిప్పులో కాల్చటం (కో 8)

2 కొయ్యపనిలో వాడే పనిముట్లకి చివర వాడిగ ఉండే భాగం (కో 16, రా 5)

**పద్మపీఠం .** లింగంలో భాగం. చూ చిత్రం-24 4 (రా 5)

**పద్మపోగర** లోహం రేకులతో వాహనాలు చేసేప్పుడు పద్మం డిజైను చేయటానికి వాడే సాధనం. (కో 31)

**పద్మం .** మకర తోరణంలో భాగం చూ చిత్రం-13 4 (రా 5)

**పద్మమొల** లోహం పనిలో ఉపయోగించే పరికరం చూ చిత్రం-131 (కో 4)

**పనస .** కిరీటంలో భాగం చూ చిత్రం-16 5. (కో 4, రా 5)

**పనసకాయగీతలు** కొయ్యపనిలో చేసే డిజైను (రా.4)

**పనిచేసే కారు** లోహం పనిచేసేప్పుడు వాడే సాధనం (కో 4)

**పనితనం** · ఒక పనిలో నేర్పరితనం, నైపుణ్యం (కో 13,29, తె 8)

**పనిదినం** · పనిచేసే రోజు (ఫిలిగ్రీ పనివారు అమావాస్యనాడు తప్ప మిగిలిన అన్ని రోజులు పనిచేస్తారు) (తె.8)

**పనిముట్టు :** కొయ్యపనిలో, లోహం పనిలో వాడే పరికరం. చూ. ఉపకరణం. (కో 8,31,41, తె 6,8; రా 1,5,8)

**పన్నీరుదాన్ :** పర్యా అత్తరుదాన్ ఫిలిగ్రీ పనిలో చేసే వెండి నగిషీతో నిండిన అత్తరు చల్లే పరికరం (తె 8)

**పన్ను .** ఉలికి ఉండే ఇనుపకట్టు. (కో 39)

**పన్నెండించుల ఆకురాయి** నిర్మల్ తయారీలో ఫైలింగ్ చేయడానికి వాడే సాధనం (తె 4)

**పన్నెండు మూరగుడ్డ** తోలు బొమ్మలాటలో తెరను కట్టడానికి అవసరమైన గుడ్డ పొడవు (రా 2)

**పందిరి** · తోలుబొమ్మలాట ఆడేప్పుడు స్టేజిగా వేసే నిర్మాణం (కో 3,7)

**పప్పు** రంపం పొట్టు బొమ్మల తయారీలో వాడే ముక్కుని చేయటానికి వాడే చింతగింజ బద్ద. (తె.9)

**పరకించి** కొయ్యపనిలో బొమ్మని చెక్కటానికి వాడే శీర్ణం కొలత (రా 4)

**పరదా(గీయు)** తోలుబొమ్మలాటకు కట్టే తెరగుడ్డ (రా.2)

**పరిమాణం** కొలత, బరువు (రా.9)

**పలక** 1 కొయ్యపనిలో కొయ్యని బల్లమీద పెట్టి తోపుడుతో చిత్రిక పెట్టేప్పుడు కొయ్య ముందుకు జరగకుండా ఉండటానికి పెట్టే చెక్కముక్క (తె 7,13, రా 3,4)

2 ఫిలిగ్రీ పనిలో చేసే ఒక డిజైన్ (తె 8)

**పలకబొమ్మ** పలకమీద చెక్కిన కొయ్యశిల్పం పర్యా. ప్లేట్ బొమ్మ (రా 4)

**పలకల పని** వెండి పలకల మీద శిల్పం చెక్కడం కటక్‌లోని ఫిలిగ్రీ పని ప్రత్యేకత (తె 8)

**పలుగురాళ్ళు** గాజు తయారీకి వాడే రాళ్లు (తె.1)

**పలుగురాయిపొడి** 1. కొయ్యపనిలో వాడే సీర్నాలను తేజ్ (పదును) చేయడానికి వాడే పొడి (తె 13)

2 లోహం పనిలో వాడే మొలలను పాలిష్‌చేయడానికి వాడే ద్రవ్యం. (రా 11)

**పలుచన** రూపా పల్చన

1 బిందె తయారీలో వాడే ఇత్తడి రేకు పల్చగా ఉండటం (కో 4)

2 లోహం పనిలో రేకు దళసరిగ ఉంటే మిషన్‌తో తగ్గించటం (రా 11)

3 తోలుబొమ్మల తయారీకి వాడే గొర్రె చర్మం లక్షణం (రా 2)

4 మట్టి, సుద్ద బొమ్మల తయారీలో రెంటినీ నీటిలో మెత్తగా కలపటం (కో 17)

**పల్లకి** . కొయ్య పనిలో దేవుణ్ని ఊరేగించటానికి కొయ్యతో చేసే వాహనం (కో 19)

**పల్లం** . కొయ్య బొమ్మలకు ఉండే గుంట - ఇది సరిగ రావటానికి గుంటల్లో మక్కు వేస్తారు (కో 13,16)

**పల్లికొండ** రంపం పొట్టు బొమ్మల తయారీలో చేసే బొమ్మ. (తె 9)

**పల్లు** . దంతం పనిలో వాడే రంపానికి ఉండే పళ్ళు చూ చిత్రం-108 2 (కో 9)

**పల్లుపట్టం** 'సూరిపలక'లో ఒక భాగం (రా.4)

**పళ్ళు** 1 చూ పల్లు (కో 6,7,19,34)

2 వెండిపనిలో గొలుసుల తయారీలో రాళ్ళు అమర్చటానికి చేసే గూళ్ళకు ఉండే పళ్ళు (కో 27)

**పళ్ళచక్రం** · 1 ఫిలిగ్రీ పనిలో వైర్ మిషన్, ప్లేట్ మిషన్‌లలో ఒక భాగం (తె 8)

2 లోహం పనిలో వాడే తరిణ దొడ్డిలో భాగం (కో 8)

**పళ్ళమొన** . రాతిపనిలో ఉపయోగించే పరికరం చూ చిత్రం-144 (రా 5)

**పళ్లెం** 1 ఫిలిగ్రీ పనిలో వాడే తాసులో భాగం (తె 8)

2 ఇత్తడి పనిలో చేసే పాత్ర (కో 4)

**పల్చనసాయి** : తోలుబొమ్మలకి వేసే పల్చని రంగు (రా 2)

**పవడాల నమూనా పూస** · ఫిలిగ్రీ పనిలో వస్తువులు పాలిష్ చేయటానికి వాడే పూస. (తె 8)

**పసుపు** : పర్యా. అర్దులు, అర్దలం, తేవుడి, పేవడా చూ అద్దిలం రంపం పొట్టు బొమ్మలకి వేసే పసుపు రంగు. (కో 19, తె 1,9, రా 13)

**పసుపుషెల్లు** : గవ్వ బొమ్మ చూ.చిత్రం-42. (రా 5)

**పసిమి** తోలుబొమ్మలకు వేసే పసుపు పచ్చరంగు (రా 2)

**పాంచ** · ఫిలిగ్రీ పనిలో చిన్న గజ్జెలు, మువ్వలు చేయడానికి వాడే పరికరం (తె.8)

**పాజిటివ్ నెగిటివ్ పద్ధతి** ఫిలిగ్రీ పనిలో వస్తువులకి కలరు రావటానికి వాడే ఒక రకం పద్ధతి (తె 12)

**పాటగాడు** . తోలుబొమ్మలాటలో పాడే వాడు (రా 2)

**పాటర్న** . ప్రత్తి బట్టలపనిలో చేసే డిజైన్ (రా.7)

**పాటిలేగ** : బిందె తయారీలో వాడే పరికరం (కో 4)

**పాట్కారు** ఫిలిగ్రీ పనిలో చేసే డిజైన్ నామాలు, బొట్లలో ఒక రకం (తె 8)

**పాట్కారుమొల** . ఫిలిగ్రీ పనిలో వాడే పరికరం. (తె 8)

**పాతగుడ్డ** : పర్యా పాతబట్ట

1 రంపం పొట్టు అంటించిన పాణికె కర్ర బొమ్మల మీద వేసే గుడ్డ (తె 9)

2 నిర్మల్ బొమ్మల తయారీలో బొమ్మకు అతికించ టానికి వాడే బట్ట (తె 4)

3. కొయ్య బొమ్మల తయారీలో బొమ్మకు అతికించ టానికి వాడే వస్త్రం (తె 7)

**పాతట్టి** లోహం పనిలో చేసే పూలతొట్టి అడుగు భాగం (తె.12)

**పాతబర్మా** : లోహం పనిలో చిల్లులు చేయడానికి వాడే సాధనం (తె 12)

**పాతబొమ్మ** . నకాషీ పనిలో బొమ్మ చేసేప్పుడు ఒకోసారి వాడే నమూనా బొమ్మ. (తె.7)

**పాతయిత్తడి** లోహం పనిలో ఇత్తడి బిళ్ళల పోతకి వాడే ఇత్తడి (తె 12)

**పాతికవెడల్పు** · తోలుబొమ్మలాటలో వాడే గజ్జెల తయారీలో మువ్వకు మువ్వకు మధ్యన ఉండే కొలత (కో 7)

**పాతికశానం :** తోలుబొమ్మల తయారీలో బొమ్మలకు డిజైనులు చేయడానికి వాడే సాధనం (కో 7)

**పాతు** · లోహం బొమ్మల తయారీలో లోహాన్ని కరిగించి పోసేప్పుడు ముందు మట్టి బొమ్మని తలకిందుగా ఉంచటం (కో 28)

**పాదం :** తోలు బొమ్మలో ఒక భాగం (కాలు చివరి భాగం) (కో 37, రా 2)

**పాదం అడ్డ .** కొయ్యపనిలో చేసే సింహ ద్వారంలో అడుగు పలక (రా 4)

**పాన్‌డబ్బీ** · పర్యా పాన్‌దాన్ చూ తమలపాకుపెట్టె ఫిలిగ్రీ పనిలో చేసే తాంబూలం పెట్టె (తె 8)

**పానం :** (దచ్చినట్టు) ప్రాణం వచ్చినట్టు, కళకళలాడటం ఫిలిగ్రీ పనిలో మట్టిబొమ్మ చేసేప్పుడు చటాకు ఆముదం, రోజన్‌మట్టి, వేడిచేసి పోస్తే మట్టికి ప్రాణం వస్తుంది (తె 12)

**పానవట్టం :** అంగంలో ఒక భాగం చూ చిత్రం-24 3 (కో 31)

**పానలు** · కొయ్య బొమ్మల తయారీలో చెక్కటానికి వాడే సాధనం (రా 3)

**పాందాన్ :** చూ పాన్‌డబ్బీ (తె.12)

**పాపచ్చికాయరంగు .** పూర్వీకులు తోలు బొమ్మలకి ఎరుపు రంగు వేయటానికి ఉపయోగించే ద్రవ్యం (రా 10)

**పాపమేడ** · రంపం పొట్టు బొమ్మల తయారీలో చేసే బొమ్మ ఒక జానపద దేవత (తె 9)

**పాము .** కొయ్య బొమ్మలకి పాలిష్ చేసేప్పుడు బూడిదలో తోము (కో.1)

**పాము ముంగిస :** నిర్మల్ బొమ్మపేరు. (తె.4)

**పాంబుకన్ను(ణ్ణు)** ఒక రకం గవ్వ. చూ చిత్రం-33. (రా 3)

**పాయింటు (చేసుకొను)** కాగితం గుజ్జు, మట్టిసుద్ద బొమ్మల తయారీలో రంగులు వేయటానికి వాడే కుంచె తయారీలో ఉడుత జుట్టును సమంగ చేసుకోవటం (కో.27)

**పారు** లోహం పనిలో మోల్డింగ్‌లో విగ్రహం ఆకారం రావటం (కో 1)

**పాలకర్ర .** పర్యా పాలకురిశె, దూదేకు లకిడీ (ఉర్దు).

1 అడ్డపనిలో వాడే అడ్డలో అడ్డదుక్కలు, నాంపేడు దీనితో చేస్తారు (కో 12)

2 కొయ్యపనిలో వాడే కొయ్య చూ ఒంకుడు కర్ర. (తె 13)

**పాలకచ్చకాయ రంగు** నిర్మల్ బొమ్మలకు వాడే బూడిద రంగు (తె 4)

**పాలగుల్ల** కొయ్యపనిలో చెక్క హెచ్చుతగ్గులు పోవటానికి చిత్రిక పట్టడానికి వాడే పరికరం చూ చిత్రికగుల్ల. (కో.16)

**పాలపరిగి** · కొయ్యపనిలో డిజైనులు చెక్కటానికి వాడే కొయ్య చూ. తెల్లకర్ర. (కో 34)

**పాలపిట్టరంగు** తోలుబొమ్మలకి వేసే రంగు (కో.7)

**పాలపు చెక్క** కొయ్యపనిలో బొమ్మ ఆకారాన్ని తీయటానికి వాడే ఆవు కొమ్ముతో చేసిన సాధనం (కో 26)

**పాలబరిగి** · కొయ్య వస్తువులు చేయటానికి వాడే కొయ్య (కో 35)

**పాలరాయి** తెల్లగ నున్నగా ఉండేరాయి ప్లాస్టర్ ఆఫ్ ప్యారిస్ బొమ్మలకు రంగులు వేయకపోతే పాలరాయి బొమ్మలా ఉంటుంది (రా 9)

**పాలవెల్లి** · వినాయక చవితినాడు పువ్వులు, పళ్ళు, కాయలు కట్టడానికి కొయ్యతో చేసిన చౌకం (కో.13)

**పాలిష్(కొట్టు) :** లోహం పనిలో, కొయ్యపనిలో మెరుగు పెట్టడం (కో.4,6,8,23,24,34,41; తె.1,3,7,9, 12; రా.3,4,5,8)

**పాలిష్ మిషన్ :** లోహం పనిలో పాలిష్ చేయటానికి వాడే యంత్రం (కో 27; తె 12)

**పాలిష్ మొల .** లోహం పనిలో మెరుగు రావటానికి వాడే సాధనం (తె.1)

**పాలిష్ రాయి :** రాతిపనిలో ఒక పరికరం. చూ చిత్రం-161. (రా.5)

**పాలు :** భాగం (నాలుగుపాళ్ళు = నాలుగు భాగాలు) పర్యా వంతు. (కో 1)

**పాలె(తీయు) :** గాడి (తె 4,5)

**పాళి :** కొయ్యపనిలో వాడే చెక్కపై భాగం (కో 16)

**పావలా(మందం) .** 1 లోహం పనిలో వాడే రేకు మందంలో ఒక రకం (పావలా మందం = 1/40 అంగుళాలు). (రా 11)

2 ఫిలిగ్రీ పనిలో వాడే కొలత రూపాయిలో నాలుగో వంతు (తె.8; రా 5)

**పావుకిలో :** కిలోలో పావు భాగం, లోహం పనిలో వాడే మూసలో పట్టే సరుకు బరువు (తె 12)

**పావుకోడు :** తోలుబొమ్మలాటలో చప్పుడు చేయటానికి వాడే చెక్క (కో 7)

**పావుగారు :** చేతికర్రల తయారీలో పిడికి బొమ్మ ఆకారాలను తీసే పరికరం (కో.23)

**పావులెత్తు :** ఫిలిగ్రీ పనిలో వాడే ప్రమాణం. తులంలో నాలుగో వంతు (తె.8)

**పావ్‌రీమ్స్ :** ప్రతి బట్ట బొమ్మల తయారీలో వాడే ఒక రకం బట్ట (రా 7)

**పిక్కలు ·** తోలుబొమ్మలో భాగం. చూ.చిత్రం-10.V (రా.2)

**పింక్ ·** పత్తి బట్టల బొమ్మల తయారీలో కుట్టడానికి వాడే దారం రంగు (తె 40)

**పింగాణి .** సీనికటోర (తె 12)

**పిచ్చుక .** కొయ్యపనిలోను, కొమ్ముపనిలోను చేసే బొమ్మ. (కో 1,26, తె 4, రా 6)

**పించిస్కారు ·** ఫిలిగ్రీ పనిలో వాడే పనిముట్టు. (తె 8)

**పించౌరా ·** నిర్మల్ బొమ్మలకి రంగు వేసేప్పుడు రంగు కలిపే గాడిలో రంగు అద్దే భాగం (తె 4)

**పిట్ :** కొయ్యపనిలో వాడే తాపడాలో బ్లేడు కదలకుండ ఉండటానికి వాడే సాధనం (కో 34)

**పిట్ట .** కొయ్యపనిలో చేసే బొమ్మ (రా 4)

**పిడకబూడిద .** పిడకలని కాలిస్తే వచ్చే బూడిద. కొమ్ము బొమ్మలు సాపురావటానికి దీంతో తోముతారు. (కో.10)

**పిడకలమంట ·** ఫిలిగ్రీ పనిలో పూర్వం మెరుగు పెట్టడానికి చింతపండు నీళ్ళలో వస్తువులు వేసి ఉడికించేప్పుడు అడుగున పెట్టే మంట (తె 8)

**పిడి** కత్తికర్ర, బాడితె, ఆకురాయి, రంపం, బర్మా, హెక్సా, తొరపణం బరమలలో భాగం చూ చిత్రం-2.1; 104 2, 106 1, 108.1; 113 1; 170.1, 175.1 (కో, తె; రా )

**పిడిబాకు :** తోలుబొమ్మలో ఒక భాగం. (రా.2)

**పిడిసాని :** కొయ్యపనిలో చెక్కపై చిల్లులు చేయటానికి వాడే పరికరంలో భాగం చూ.చిత్రం-175.3 (రా.4)

**పిండి :** చింతగింజల పిండి. మక్కు తయారీకి వాడేది. (తె.4,7)

**పిండు** తేనెతుట్టె నుంచి తేనెను తీయు. (కో 33; తె.12)

**పినిషింగ్ :** (Finishing) కొయ్యపనిలో బొమ్మలకిదిద్దే తుదిమెరుగు (రా.5,6,13)

**పిప్పి :** రంపం పొట్టు బొమ్మల తయారీలో బొమ్మ ఎండిన

తర్వాత పూసే సుద్ద. చింతపండు నీళ్ళలో ఉండే చింతపండు చెత్త (కో 40)

**పిల్లమొగ్గ** · లోహం పనిలో చేసే డిజైన్. (తె 10)

**పిల్లిమార్క్ చింగ్‌రూప్** : కొయ్యపనిలో బొమ్మలకి వాడే ఎరుపు రంగు (చింగ్‌రూప్, ఇంగ్లీకం = ఎరుపు) (కో.10)

**పిస్తోలు** : చేతికర్ర పిడి నమూనా (కో 5)

**పీకముక్క** : తాళం తీసేప్పుడు, వేసేప్పుడు తాళం చెవి ప్రవేశించే భాగంలో ఉండే ఇత్తడి పరికరం (దంతం పని). (కో 9)

**పీల్చు** : పర్యా మింగు కొయ్యతో చేసిన బ్లాకులు రంగులో ముంచినప్పుడు రంగును మింగు. (కో.41)

**పీసురంగు** : తాటిబుర్ర బొమ్మలకి గడ్డానికి, జుట్టుకి ఉండే రంగు. (కో 32)

**పుచ్చె** : లోహం పనిలో చేసే దరియా పెట్టె పై భాగం చూ చిత్రం-18.1 (తె 12)

**పుత్తంరాజు** : రంపంపొట్టు బొమ్మల తయారీలో చేసే బొమ్మ. జానపద పాత్ర. (తె 9)

**పున్నమ** : పూర్ణిమ. ఈ రోజున తోలు బొమ్మలాట ఆడరు (రా.2)

**పురాముట్టె** : పావురం గుడ్డు. గవ్వబొమ్మ. (రా.5)

**పురికోసమందం** : ఫిలిగ్రీ పనిలో వాడే వెండితీగ మందం పురికొస లావు. (తె 8)

**పురిగొలుసు** : ఫిలిగ్రీ పనిలో తాడు మాదిరి చేసే గొలుసు (కో.33)

**పులి** : కొయ్యబొమ్మ (రా 4)

**పులిగోరులాకెట్** : ఫిలిగ్రీ పనిలో చేసే ఆభరణం చూ.చిత్రం-83 (కో.27)

**పులింగ** : పురుష సంబంధమయిన. (రా.8)

**పుల్ల** : 1. తోలు బొమ్మలకి కట్టి, ఆడించే పుల్ల. (రా 5)

2 లోహం పనిలో లోహాన్ని కరిగించేప్పుడు కలపడానికి వాడే కొయ్యముక్క (కో 19)

**పుల్లకొస** తోలుబొమ్మలకు కట్టేపుల్ల చివరి భాగం (కో.7)

**పువ్వు** : పర్యా పుష్పం, పూవు తోలుబొమ్మలాట ప్రార్థనప్పుడు దేవుడి దగ్గర పెట్టేది (రా 2)

**పుష్పహారం** . తోలుబొమ్మలకి చెక్కే పూల దండ డిజైన్ (రా.2)

**పుసకడు** . తోలుబొమ్మలాటలో హాస్యపాత్ర. ఒక తోలు బొమ్మ (కో 37, రా 2)

**పుటంపెట్టు** : లోహం పనిలో బొమ్మని పిడకలతో ఎర్రగ కాల్చు (కో 1)

**పుట్టకాయిదాలు(బ)** : కొయ్యబొమ్మలకి పూర్వం డిజైన్ కోసం అంటించే కాయితాలు (తె 13)

**పుట్టమట్టి** · లోహం పనిలో మట్టి బొమ్మలు చేయటానికి వాడే మన్ను (కో 1)

**పుల్లని అతికే తోలుముక్క** తోలుబొమ్మలో భాగం. చూ చిత్రం-10 I 2. (రా 2)

**పూచికమేకు** : పర్యా చిన్నమేకు కొయ్యపనిలో బొమ్మలకి కొట్టడానికి వాడేది (కో 16)

**పూజ(చేయు)** . 1 ఫిలిగ్రీ పనిలో తోలుబొమ్మలకు డిజైన్లు చేసేప్పుడు చేసే 'సున్న' వంటిది (తె 8, రా 2)

2 కొయ్యపనిలో శిల్పాలు చేసేప్పుడు స్నానంచేసి దేవునికి చేసే పూజ (రా 4)

**పూజల డిజైన్** . తోలుబొమ్మలకి చెక్కే గుండ్రని రంధ్రాల డిజైన్ (రా 2)

**పూజలసీర్నం** . కొయ్య పనిలో బొమ్మలకి సున్నాలు వంటి డిజైన్ చెక్కటానికి వాడే సాధనం (రా 4)

**పూజిలు** : కొయ్యపనిలో రేకశీర్ణంతో చేసే డిజైన్ (రా 3,6)

**పూడుకుపోవు** · లోహం పనిలో మట్టితో చేసిన బొమ్మకు అడుగున చిల్లు మూసుకుపోవు. (కో.33)

**పూడ్చు** · రూపా. పూడ్చు కొయ్యపనిలో చెక్కల కేర్పడిన ఖాళీలు మక్కుతో సమానంగా చేయు (కో.14, రా 5)

**పూత** : 1 రోల్డ్‌గోల్డు వస్తువుల తయారీలో వస్తువులకి పెట్టే బంగారం పూత (కో 27,28, తె.12)

2. కొయ్యపనిలో చెక్కే డిజైను (కో 35)

**పూయు** . పర్యా రాయు లోహం బొమ్మల తయారీలో మట్టి బొమ్మకు పైన మైనం పూత రాయు (కో.1)

**పూరా** · పూర్తిగ (కో 17, రా 5)

**పూరీకర్ర** . కాగితం గుజ్జు, బొమ్మల తయారీలో కాగితం గుజ్జును అట్టలాగ ఒత్తటానికి వాడే చెక్క (కో 41)

**పూర్తిరంగు** : రోల్డ్‌గోల్డు వస్తువుల తయారీలో వస్తువులు చేసిన తర్వాత చింతపండు, కుంకుడునీళ్ళలో ముంచి తీస్తే వచ్చే సహజమయిన రంగు (కో 33)

**పూర్వీకులు** · పర్యా పెద్దోళ్ళు ముందు తరం వారు. (రా 2,10)

**పూలకమ్మలు** . ఫిలిగ్రీ పనిలో తయారుచేసే ఒక ఆభరణం చూ చిత్రం-52, 53 (తె 8)

**పూలకుండీ** : పర్యా. పూలతొట్టె పూలమొక్కలు పెట్టుకునే కుండీ (తె 12; రా 13)

**పూలకుండీలో లక్ష్మి** : కొయ్యపనిలో చేసే డిజైను (రా 4)

**పూలు** : ఫిలిగ్రీ పనిలో చేసే వస్తువు (తె.8)

**పూస** : కొయ్యపనిలో పక్షుల కళ్ళకువాడే ద్రవ్యం (రా 4)

**పూసలదండ** : కిపాస్‌కుపైన ఉండే హారం (రా.8)

**పూసహారం** . మెడలోని హారాల డిజైన్‌పేరు. (రా 2)

**పెంగ్విన్** . పత్తి, బట్ట బొమ్మల తయారీలో చేసే ఒక గుడ్డ బొమ్మ (రా 7)

**పెచ్చు** : మట్టి బొమ్మల తయారీలో మట్టిని కలిపేప్పుడు వచ్చే రాళ్ళు మొదలైనవి (కో 10)

**పెటాపు** (Fit up) బిందె తయారీలో బిందెకు సెలును అతికించటం (కో 4)

**పెట్టె** : 1 లోహం పనిలో విగ్రహం మోల్డింగుకు వాడే దరియా పెట్టె. (తె.12)

2 కొయ్యపనిలో చేసే వస్తువు (రా 4)

**పెట్రోమాక్సులైటు** తోలు బొమ్మలాటలో వెలుగుకోసం వాడే దీపం (రా 10)

**పెండ (బొమ్మ)** పేడతో చేసిన బొమ్మ (తె.4)

**పెండ్లి నెక్లేసు** : ఫిలిగ్రీ పనిలో చేసే ఆభరణం చూ చిత్రం-101 (రా 2)

**పెదరంపం** . పర్యా బండపళ్ళ రంపం. కొయ్యపనిలో చెక్కను కోయటానికి వాడేది. (రా 3,4)

**పెదకరవాయి** . శిల్పంలో లోహంతో వాహనాలు చేసేప్పుడు వాడే పరికరం (కో 31)

**పెద్దకారు** . లోహం పనిలో లోహాన్ని మూసలో వేసి కొలిమిలో కరిగించేప్పుడు పట్టుకొందుకు వాడే సాధనం (తె 8,12)

**పెద్దకొంగ** : కొయ్యపనిలో చేసే బొమ్మ (రా.4)

**పెద్దా కంరానమొల** రంపం పొట్టు బొమ్మల తయారీలో బొమ్మలకు రంధ్రాలు చేయటానికి వాడే సాధనం. (తె 9)

**పెద్దచిమ్టా** · పర్యా. సోనం కొలిమిలో బొగ్గులు పట్టుకొందుకు వాడే సాధనం (తె 1)

**పెద్దతాపి** . మట్టి బొమ్మల తయారీలో మట్టిని పూయటానికి వాడే పరికరం (కో 27)

**పెద్ద తోపుడు** . కొయ్యపనిలో చెక్కను నునుపు చేయటానికి వాడే పరికరం (రా 4)

**పెద్దేగి కర్ర** పర్యా. బీజాసర్ కొయ్యపనిలో వాడే పెద్దేగి చెట్టుకర్ర (తె.13)

**పెద్ద పట్కారు** . వస్తువుల్ని పట్టుకొందుకు వాడే బుగ్గకారు (కో 28, తె.1)

**పెద్దపోగర** కొయ్యపనిలో బొమ్మల తయారీలో వాడే సాధనం (రా 5)

**పెద్దబ్రష్.** (Big Brush) కొయ్య పనిలో బొమ్మలకు రంగు వేయటానికి వాడే పెద్ద కుంచె (కో 26, రా 5)

**పెద్దమ్మదేవి :** రంపం పొట్టు బొమ్మల తయారీలో చేసేది ఒక జానపద దేవత (తె 9)

**పెద్ద రేకల సీర్నం** · కొయ్యపనిలో పెద్దరేకలు కొట్టడానికి వాడే పరికరం (రా 4)

**పెద్దలోతుకొలిమి** లోహం పనిలో లోహాన్ని కరిగించడానికి వెడల్పుగా, లోతుగా ఇటుకలతో నిర్మితమైన పొయ్యి (కో 28)

**పెద్దవాల్మోల** . లోహం పనిలో గీతలు కొట్టడానికి వాడే సాధనం (తె 10)

**పెద్దవులి** · కొయ్యపనిలో కేవలం కొయ్యను తెగగొట్టడానికే వాడే వులి (కో 12)

**పెద్ద సవనం** · ఫిలిగ్రీ పనిలో తీగను మలచటానికి వాడే సాధనం (తె 8)

**పెద్దసీవనం :** రూపా. పెద్దసీర్నం, పెద్ద శీర్ణం కొయ్యపనిలో డిజైన్లు చెక్కటానికి వాడే పరికరం (కో 34, రా 3)

**పెద్దసలాక** · చూ పెద్ద చిమ్టా. (తె 12)

**పెద్దసుత్తె :** రాతిపనిలోను, లోహం పనిలోను వాడే పరికరం (తె.1,6)

**పెద్దిరాజు :** రంపం పొట్టు బొమ్మల తయారీలో చేసే బొమ్మ జానపద కధానాయకుడు (తె 9)

**పెన్నులస్టాండు** కొమ్ముపనిలో చేసే కలాలు పెట్టుకోడానికి పనికివచ్చే వస్తువు (కో.1)

**పెన్సిలు :** రూపా పెడిసలు, పెన్సిల్ కొయ్య, రాతిపనిలో గుర్తులు పెట్టుకోడానికి ఉపయోగించే వస్తువు (కో 6,7,16,19,37,34,41, తె 6,9,10,12,13, రా 4,5,6,7,11)

**పెయింటింగ్ :** కొయ్యపనిలో బొమ్మలకు రంగులు వేయటం. (కో 41, తె.1, రా 5,7,9)

**పెయింటింగ్ బ్రష్ .** కొయ్య బొమ్మలకు రంగులు వేసే కుంచె (కో 16, తె 4)

**పెయిరంగు** · పర్యా షేర్ రంగు నిర్మల్ బొమ్మలకు వేసే శరీరం రంగు. (తె 4)

**పెరడుకట్టు** · తోలుబొమ్మలకు వేసే ఎరుపు రంగు తయారీలో మోదుగుపూల రసాన్ని తీసి ఎండపెడితే అచ్చుకింద కట్టడం (రా 12)

**పెలుసు** . బిందెలో భాగం చూ చిత్రం-23 3 (కో 4; తె 4,8)

**పెళసరం** తోలుబొమ్మల తయారీకి వాడే చర్మం బాగా ఎండితే వంచినప్పుడు (విరిగి) చినిగిపోవటం (కో 30)

**పెళ్ళిక** నల్లరంగు తయారీలో పొగమసి డబ్బాకి కట్టేపెచ్చు (కో 26)

**పెళుసు** . రూపా పెరుసు నిర్మల్ బొమ్మల తయారీలో బొమ్మలకి పొణిక కర్ర కాక మిగతా చెక్కలు వాడితే పెళుసరంగా ఉండటం (తె 4)

**పెవికాలు** గవ్వబొమ్మల తయారీలో అంటించడానికి వాడే జిగురు (Pevical) (రా 5)

**పెస్సుత్తి** లోహం పనిలో వాడే సుత్తె (తె 10)

**పేడు** కొయ్యపనిలో చెక్కేప్పుడు వచ్చే కొయ్యముక్క (కో.5,7, తె 13, రా 5)

**పేనా :** తోలుబొమ్మలకి రంగులు వేయటానికి వాడే సాధనం చూ.చిత్రం-117 (కో 37)

**పేను** ఫిలిగ్రీ పనిలో రెండు సన్న తీగల్ని ఒకటిగ చేయడం (తె 8)

**పేనుబెత్తం.** కొండపల్లి బొమ్మల తయారీలో హనుమంతుడి బొమ్మకు తోకగ వాడే తీగ (కో 26)

**పేపర్(కొట్టు)** కొయ్యబొమ్మలు నునుపు చేయటానికి ఉప్పు కాయితంతో తోమటం (తె 4,5)

**పేపరింగు చేయు** . కొయ్య బొమ్మకు మక్కుపూసి పైన (పేపరు) కాగితాల్ని అతికించటం (కో 13)

**పేపరు కటింగ్** · కొయ్యపనిలో చెక్కపై డిజైన్లు చెక్కేప్పుడు ముందు కాగితం మీద డిజైన్‌వేసి దాన్ని కత్తిరించటం (కో 34)

**పేరంటాలు బొమ్మ** కొండపల్లి బొమ్మల తయారీలో చేసే బొమ్మ (కో 26)

**పేరిపోవు** · కొయ్యపనిలో బొమ్మకులప్పం పూసి ఆకురాయితో రాస్తే దానికి లప్పం అంటుకుపోవు (తె 4)

**పేరెంపడుచు** ఫిలిగ్రీ పనిలో వెండితీగను పెట్టి డిజైన్స్ తీయటానికి వాడే సాధనం. (తె 8)

**పేర్చు** . తోలుబొమ్మలాటలో వాడే గజ్జెల తయారీలో తాడుకి మువ్వల్ని పేర్చటం (కో 7)

**పేర్లు** రంపం పొట్టు బొమ్మలకి చెక్కే ఆభరణాలు (తె.9)

**పేవుకోలు** : చూ పెవికాలు (కాగితం గుజ్జు, మట్టి, సుద్ద బొమ్మ) (కో.17)

**పేష్టు** 1 కాగితం గుజ్జు బొమ్మల తయారీలో మెత్తగ చేసిన కాగితం గుజ్జు (కో.41)

2 కొయ్య పనిలో అతికించటానికి వాడే ద్రవ్యం పర్యా ముద్ద (రా 4)

**పైకాన** : ఫిలిగ్రీ పనిలో వాడే సామాను పెట్టుకొందుకు వాడే పెట్టెలోని పైసొరుగు. (తె 8)

**పైటపిన్ను** : రోల్డుగోల్డు, ఫిలిగ్రీ పనిలో వెండినగషీ చేసిన వినియోగ వస్తువు చూ చిత్రం-103 (తె.8)

**పైనలు** : (Final) చివరగ, ఆఖర్న (రా 3)

**పైపూత** . ఫిలిగ్రీ పనిలోను, లోహం పనిలోను వస్తువులకి పైన పూసే పూత (కో 4, తె 1)

**పైపెంకు** · కోడిగుడ్డు పైన ఉండే గట్టి భాగం దీనిమీద బొమ్మలు చెక్కుతారు (కో 25)

**పైపొట్టు** . చింతగింజ మీద ఉండే పెచ్చు దీన్ని తీసేసి బొమ్మ చెక్కుతారు (కో.25)

**పైపొర** : 1 తంగిడి చెక్క కుండే పైబెరడు దీన్ని పొడిచేసి తోలు బొమ్మలకు వాడే తోలుని శుభ్రం చేసేప్పుడు నీటిలో కలిపితే వెంట్రుకలు సులభంగా ఊడి పోతాయి (రా 12)

2 బూరుగు కర్రకు పైన ఉండే తొక్క (కో 19)

**పైల** (File) లోహం పనిలో వస్తువులు నునుపు చేయటం. (కో 8)

**పొక్క** : రంధ్రం నిర్మల్ బొమ్మల తయారీలోను, ఫిలిగ్రీ పనిలోను చేసే చిల్లు (తె 2,4,8)

**పొగ** 1 తోలు బొమ్మకు, కొండపల్లి బొమ్మలకు వేసే నలుపు రంగు తయారీలో ఆముదం దీపం వెలిగించి పెంకుకు పెట్టే మసి (కో 23, రా 20)

2 రంపం పొట్టు బొమ్మలకి వేసే వార్నిషుని చేసి నప్పుడు పైకి పోయే ఆవిరి (కో 40)

**పొగిడింపు** తోలు బొమ్మలాట వాళ్ళు బొమ్మలాట ఆడే ముందర ఆ వూళ్లో ఉండే పెద్దవారిని పొగడటం (రా 12)

**పొంగుమొలలు** . దరియా పెట్టెలో భాగం చూ చిత్రం-18 2 (తె 1,10,12)

**పొంచుపోగర** · లోహం పనిలో విగ్రహం చెక్కటానికి వాడే సాధనం (కో 18)

**పొటేలు చర్మం** · రూపా పొట్టేలు చర్మం తోలు బొమ్మల తయారీకి వాడే గొర్రె చర్మం (కో 15,37, రా 2)

**పొట్ట** తోలు బొమ్మల తయారీలో వాడే మేకచర్మం ముందు కోసే ప్రాంతం (కో 37)

**పొట్టరేకు** · లోహం పనిలో చేసే వాహనం మధ్య భాగం చూ చిత్రం-20 3 (కో 31)

**పొట్టిగుల్ల** : పర్యా కర్రగుల్ల కొయ్యపనిలో చెక్కను చిత్రిక పట్టడానికి వాడే సాధనం (కో 16)

**పొట్టు** . కొయ్యపనిలో చెక్కని చెక్కేప్పుడు రంపంతో కోసేప్పుడు వచ్చే తుక్కు (తె 13)

**పొట్టుబొమ్మ** . పర్యా రంపం పొట్టు బొమ్మ రంపం పొట్టుతో చేసిన బొమ్మ (కో.40)

**పొట్లా్పుపలక** : కొయ్యపనిలో చేసే తలుపుపలక (రా 4)

**పాడి** : 1. కొయ్యపనిలో వాడేసీర్నాలకు పదును పెట్టడానికి వాడే చెక్క ఎండి ఉండటం (పొడిగ ఉండటం). (తె 13)

2 పర్యా పౌడరు, చూ చూర్ణం మట్టి బొమ్మలకు వేసే రంగు పౌడరు (రా 9)

**పాడిచెక్క** · కొయ్యపనిలో సీర్నాలను పదును పెట్టడానికి పలుగురాయి పొడి వేసి నూరే చెక్క (తె.13)

**పొడిరంగు** : కొయ్య బొమ్మలకు వేసే రంగు పొడి. (తె 7)

**పొడిసుత్తె** : లోహం పనిలో గట్టిగ కొట్టడానికి ఉపయోగించే సుత్తి (తె 12,12)

రూపా. పొడుసుత్తె. (తె 8)

**పొడుగు** రూపా పొడవు (కో 2,6,7,28,41, తె 4,6,8,12)

**పొడుచు** · లోహం పనిలో చిల్లులు వేయు (కో.31)

**పొణికికర్ర** : కొయ్యపనిలో బొమ్మలకు వాడే పొణికి చెట్టు కర్ర (తె 1,4,9)

**పొణికెకర్ర బొమ్మ** రూపా పొణికె కట్టె బొమ్మ పొణికె చెట్టు కర్రతో చేసే బొమ్మ ఈ బొమ్మలపై రంపంపొట్టు, బట్ట అతుకుతారు (తె.9)

**పొత్తురౌతు** · రంపం పొట్టు బొమ్మల తయారీలో ముక్కను చేసేప్పుడు చింత గింజలు రుబ్బటానికి వాడే పాత్రం. (తె.9)

**పొద్దంతా** రోజంతా, పగలంతా (నిర్మల్ బొమ్మలు వేసే తెలుపురంగు తయారీలో నత్తగుల్లని రోజంతా నూరాలి) (తె 4)

**పొన్ను** . 1 అడ్డకర్రలో వాడే అడ్డసీకు చివరి భాగంపై ఇనుపపట్టా (కో.11)

2. ఉలికి ఉండే పిడి అడుగు భాగంలో ఉండే ఇనుపకట్టు (కో 35, రా 5)

3 చేతికర్రల చివరి భాగం చూ చిత్రం-2 4,3,3 (కో 23, తె 5)

4 తారపణం బరమలో ఉండే ఇనుపకట్టు. చూ చిత్రం-175 2 (కో 6)

**పొయ్యి** రూపా పొయి లోహం పనిలో వాడే కొలిమి (కో.7; తె 12)

**పొయ్యిబుగ్గి** పర్యా. పొయ్యి బూడిద కొమ్ము బొమ్మలకు, దంతం బొమ్మల మెరుపు రావటానికి వాడే బూడిద (కో 1,9)

**పొర** . నిర్మల్ బొమ్మల తయారీలో బొమ్మకు పూసే లప్పం వరస (తె 2,3, రా 5)

**పొరలచెక్క** . కొయ్యపనిలో బొమ్మల తయారీకి, డిజైన్ల తయారీకి వాడే చెక్క (కో 16,19)

**పొలికచెక్క** మక్కు బొమ్మల తయారీకి వాడే చెక్క (రా 13)

**పోగరు** . రూపా పోగారు

1 లోహపు రేకుపై బొమ్మలు వేయటానికి వాడే సాధనం (రా.11)

2 కొయ్యపనిలో కన్నాలు పెట్టడానికి, డిజైన్స్ చేయడానికి వాడే పరికరం (కో 16,11, రా 44)

3 దంతం పనిలో కొమ్ముమీద, దంతంమీద డిజైన్ గీయడానికి వాడే సాధనం (కో 9)

4 ఫిలిగ్రీ పనిలో డిజైన్ తీయడానికి వాడే కారు (కో 27, తె 8)

5 తోలు బొమ్మలకు డిజైన్ చెక్కటానికి వాడే సాధనం (రా 2)

6 లోహం బొమ్మల తయారీలో వాడే పరికరం (కో 18,39)

**పోటం** · లోహం పనిలో లోహం కరిగించి అచ్చుపోయటం (కో 8)

**పోత(పోయు)** · పర్యా మూసపోయు లోహం పనిలో లోహం కరిగించి బొమ్మ అచ్చు పోయడం (కో 10,18,28, రా 1, తె 1,8,12)

**పోతకారు** · ఫిలిగ్రీ పనిలో వాడే వంపుకారు (తె 8)

**పోతకాలు** లోహం పనిలో మైనపు నమూనాలో లోహం కరిగించి పోయటానికి పెట్టే కంత (కో 33)

**పోతగిట్ట** · రేకు గుర్రంలో భాగం చూ చిత్రం-20 9 (కో 16,40)

**పోతపెట్టె** చూ దరియాపెట్టె చూ చిత్రం-18 (తె 18)

**పోతమొలలు** దరియాపెట్టెలో భాగం చూ చిత్రం-18 3 (తె 1,12)

**పోరగాడు** కొయ్యపనిలో చేసే పిల్లల బొమ్మ పిల్లకాయ. (తె 7)

**పోరమట్టు** . గవ్వ బొమ్మ చూ చిత్రం-45 (తె 14, రా 5)

**పోలకకట్టె** : రంపం పొట్టు బొమ్మల తయారీకి వాడే తెల్ల పొణికి కట్టె (తె 7)

**పోలీసు** కల్లుగీత పనిలో ఉండే గవర్నమెంటు ఉద్యోగి చూ చిత్రం-17 (కో 12)

**పొదరు** . పేపరు మట్టి బొమ్మల తయారీలో కాగితాల్ని పొడిగ చేయటం (కో 41)

**పొదరుకలర్సు** రంపం పొట్టు బొమ్మలకు వేసే పొడిరంగులు (తె 9, రా.11)

**ప్రతిమ** తోలుబొమ్మల తయారీలో చర్మంపై వేసే బొమ్మ (రా 9)

**ప్రతివాది** · తోలుబొమ్మలాటలో బొమ్మల్ని ఆడించే వాడు (కో 37)

**ప్రభ** : కిరీటంలో భాగం చూ చిత్రం-16 4 (తె 6, రా 8)

**ప్రభాతనెక్లేసు** . ఫిలిగ్రీ పనిలో చేసే ఒక ఆభరణం చూ చిత్రం-97 (కో 27)

**ప్రమిద** : 1. తోలు బొమ్మలాటలో వాడే దీపం చూ.చిత్రం-9 6. (కో.7,30; రా.2)

2 లోహం పనిలో చేసే వస్తువు చూ దీపాంతరం (కో 4)

**ఫ్లవర్ వాజెస్** రూపా ఫ్లవర్‌వాజులు లోహం పనిలో చేసే పూలతొట్లు (తె 12)

**ప్యాలెస్** . లోహం పనిలో బొమ్మలకు మెరుగు పెట్టేప్పుడు పూసే ద్రవ్యం (తె 1)

**ప్రెస్సు** 1 లోహం పనిలో కొలిమిలో తయారయి ఉన్న మట్టి అచ్చు (తె 12)

2 మట్టి బొమ్మల తయారీలో మోల్డ్‌లో పోసిన మట్టి సరిగ బొమ్మ ఆకారం రావటం (కో.41)

3. కొమ్ము బొమ్మల తయారీలో ముందు కొమ్ముని వేడిచేసి వైస్‌లో పెట్టి బిగించటం (కో 1)

**ప్రేము** బరమలో భాగం చూ చిత్రం-169 2 (కో 17)

**ప్రేక్షకులు** . ప్రదర్శనను చూసేవారు (కో 29)

**ప్రైమర్‌పెయింట్** తొలి రంగు పూత (కో 29)

**ప్రొద్దు** సమయం. ఉదయం (రా 10)

**ప్లాస్టర్ ఆఫ్ ప్యారిస్** మట్టితో బొమ్మలు చేసేప్పుడు ముందు మోల్డ్ చేయడానికి వాడే ద్రవ్యం. (కో 3,17,25,41, తె 1, రా 9)

**ప్లెయిన్‌వర్క్** వడ్రంగం పని (రా 4)

**ప్లెయిన్‌షీట్** . లోహం పనిలో వాడే చదును రేకు (తె 12)

**ప్లేటు** 1 లోహం పనిలో వాడే తేనె తుట్టె పలక (తె.12)

2 కొయ్యపనిలో ముందు కొయ్యను కోసే నలుచదరం పలక (రా 4)

3 కొయ్య బొమ్మలకు రంగులు వేసేప్పుడు రంగులు కలుపుకొనేందుకు వాడే పళ్లెం (కో 17)

4 కాగితం గుజ్జు బొమ్మల తయారీలో కాగితం గుజ్జుతో చేసిన అట్ట (కో 4)

**ప్లేట్ బొమ్మలు** . పర్యా. పలక బొమ్మలు. కొయ్యపనిలో చేసే దారు శిల్పాలు. (రా.4)

**ప్లేట్‌మిషన్** ఫిలిగ్రీ పనిలో వాడే యంత్రం (తె 8)

**ప్లేను** దూగోడ (రా 5)

**ప్లేసు దూగోడ** · మక్కు బొమ్మల తయారీలో ఉపయోగించే పరికరం చూ చిత్రం-171. (రా 5)

**ఫ్లోరుమిల్లు** . పిండి ఆడే యంత్రం కాగితం గుజ్జు బొమ్మల తయారీలో కాగితాన్ని పిండిగ ఆడిస్తారు (కో 41)

## ఫ

**ఫర్నింగ్ చైర్స్** · కొయ్యపనిలో చేసే నగిషీ కుర్చీలు (రా 4)

**ఫర్నిచర్** · కొయ్యపనిలో చేసే వస్తువులు (తె 13)

**ఫలం :** తోలుబొమ్మలాటలకు ముందు ప్రార్థన చేసేప్పుడు దేవుడి దగ్గర నైవేద్యంగా పెట్టే పండు (రా 2)

**ఫలానా** · చెప్పవలసిన (కో 42, రా 8)

**ఫస్టుపాలిష్** . లోహం పనిలో చెకనం పని అయిన తరువాత సల్ఫర్ యాసిడ్, నైట్రిక్ యాసిడ్, చింతపండు కలిపి ఇత్తడి బ్రష్‌తో తోమటం (తె 10)

**ఫాన్ :** నాటకాలలో కిరీటానికి వెనుక భాగంలో ఉండే చక్రం దీన్ని రాజు వీరత్వాన్ని చూపించేందుకు పెడతారు (కో 7)

**ఫారెస్టు ఆఫీసరు** · అడవిని కాపాడే అధికారి (రా 4)

**ఫిక్స్(చేయు)** · దంతం పనిలో పెట్టె చేసేప్పుడు గాడీలను బిగించటం (కో 19)

**ఫిట్(చేయు)** · బిగించటం (కో 4, తె 2,3,5,8)

**ఫినిషింగు** · కొయ్య బొమ్మలు మొదలైనవి చేసేప్పుడు వాటికి దిద్దే తుదిమెరుగు (కో 1,7,24,31, తె 1,9, 12, రా 5)

**ఫివోకోల్ :** మట్టి బొమ్మ విరిగితే అతకడానికి వాడే ద్రవ్యం. (రా.9)

**ఫెవికాలు :** కొయ్యపనిలో చెక్కని అతికించటానికి వాడే ద్రవ్యం (రా.5)

**ఫేస్‌పౌడరు** · కాగితం గుజ్జు బొమ్మల తయారీలో బొమ్మ మోల్డింగ్‌కు అంటుకోకుండా ఉండటానికి వేసే పొడి (కో 41)

**ఫైల్(చేయు)** చూ నునుపు లోహం పనిలో, కొయ్యపనిలో వస్తువుల్ని నునుపు చేయటం (కో 4,28,39,41, తె 1,4, రా 4)

**ఫోల్ పెయింటింగ్** (Follo Painting) రంపం పొట్టు బొమ్మలకు రంగు వేసే విధానం (తె 9)

**ఫ్రంట్** పత్తి, గుడ్డ బొమ్మల్లో ఒక భాగం (రా 7)

**ఫ్రాడ్సాబ్లేడ్ :** కొయ్యపనిలో వాడే జాలీమిషన్‌లో ఉపయోగించే రేకు (తె 13)

**ఫ్రెంచ్ చాక్‌పొడి :** కొయ్య బొమ్మలకి పూసే మక్కు తయారీకి వాడే పొడి (కో 15)

**ఫ్రెంచిపాలిష్** కొయ్యపనిలో బొమ్మలకు వేసే పూత (రా 4)

**ఫ్రేం(విడదీయు)** · 1 ఫిలిగ్రీ పనిలో చెక్క మీద నుంచి మైనాన్ని విడదీయటం (తె 8)

2 కొయ్యపనిలో చేసే ఫోటో చట్రాలు. (తె 4)

**ఫ్రేము** హెక్సాలో భాగం చూ చిత్రం-170 2 (రా 13)

**ఫ్లవర్స్** కొయ్యపనిలో చేసే పూవులు (డిజైన్) (కో 34)

**ఫ్లవర్‌గేజి** పర్యా ఫ్లవర్‌వాజ్ లోహం పనిలో చేసే వస్తువు (కో 4)

**ఫ్లవర్‌డ్ కలర్** పత్తి, బట్టబొమ్మలకు వేసే రంగు (రా 7)

**ఫ్లవర్‌డిజైను** కొయ్యపనిలో చేసే పూవుల డిజైన్ (కో 34)

**ఫ్లవర్‌వాజ్** 1 ఫిలిగ్రీ పనిలో చేసే వస్తువు (తె 8)

2 లోహం పనిలో చేసే పూసలతొట్టె చూ ఫ్లవర్‌గేజి (తె 10)

**ఫ్లాంట్‌పాత్ర** లోహం పనిలో చేసే వస్తువు (తె 10)

**ఫ్లామెల్ :** గుడ్డ బొమ్మల తయారీలో వాడే ఒక రకం బట్ట (రా 7)

**ఫ్లింట్ పేపర్:** కొయ్యపనిలో బొమ్మలు నునుపు చేయటానికి వాడే గరుకు కాయితం, ఉప్పు కాయితం (తె.4, రా 4)

## బ

**బక్కీ :** తోలుబొమ్మలకు వాడే చర్మాన్ని రెండు వైపులా శుభ్రం చేస్తే మిగిలిన చర్మం (కో.15,30)

**బక్షీబద్ద :** కొయ్యపనిలో డిజైన్ ఉన్న తలుపు పలక (తె 13)

**బంక :** జిగురు చింతగింజల్ని ఉడకబెట్టి చేసిన చింత అంబలి (చింత జిగురు) కొయ్యబొమ్మలకి పూస్తారు చూ కట్టె వజ్రం (తె 4)

**బంకమట్టి ·** 1 మట్టిబొమ్మల తయారీలో వాడే జిగురుమట్టి (కో 17, రా 9)

2 నిర్మల్ బొమ్మలకు పైన బట్ట అతికించి పూయటానికి వాడే జిగురు మట్టి (తె 4)

3 లోహం బొమ్మల తయారీలో మట్టి బొమ్మ చేయటానికి వాడే మట్టి చూ క్లే. (కో 33)

**బంకీరు :** కొయ్యపనిలో వాడే కొయ్య (రా 13)

**బంగారక్క :** తోలుబొమ్మలాటలో హాస్యపాత్ర ఒక తోలు బొమ్మ. (కో 37, రా 2,10)

**బంగారం :** ఫిలిగ్రీ పనిలో వాడే లోహం (తె 8,12, రా 5)

**బంగారంపని :** బంగారంతో ఆభరణాల తయారీ. (తె.15)

**బంగారం పూత :** వేరే లోహంతో తయారుచేసిన వస్తువులకి బంగారం పూత పూయటం (కో.33)

**బంగారం రంగు :** ఇత్తడితో చేసిన గాజులను మహా ద్రావకంలో వేస్తే వచ్చే రంగు (కో.33)

**బజారు** వీధి (కో.19,41, రా 5,9)

**బటవసీర్నం :** కొయ్యపనిలో ఏటవాలు లోతును చెక్కటానికి ఉపయోగించే పరికరం చూ గాడిసీర్నం (తె 13)

**బట్ట(కొట్టు) :** వస్త్రం.

1 నిర్మల్ బొమ్మల తయారీలో బొమ్మకు పైన కట్టే గుడ్డ (తె 4)

2 లోహం పనిలో రేకుమీద డిజైన్ చెక్కేప్పుడు బట్టమొలతో బట్ట మాదిరిగ కొట్టడం (తె 12)

3 లోహం పనిలో రేకు మీద డిజైన్ చెక్కేప్పుడు అక్కడక్కడ చెక్కడంలేని భాగం (తె 12)

4 గుడ్డబొమ్మల తయారీలో మూలవస్తువు చూ. క్లాతు (రా 7)

**బట్టపార :** కొయ్యబొమ్మల తయారీలో బొమ్మకుపైన చుట్టేపార (తె 1,4)

**బట్టమొల** లోహం పనిలో రేకుమీద బట్ట మాదిరి కొట్టే మొల (కో 1,10,12)

**బట్టహేంగరు** చేతికర్రల తయారీలో చేసే బట్టలు తగిలించుకొనేందుకు వాడే సాధనం (కో 23)

**బట్టీ** లోహం పనిలో వాడే కొలిమి చూ కొలిమి (తె 1,12)

**బండ** ఫిలిగ్రీ పనిలో వెండిని సాగేయటానికి వాడే రాయి. (తె 8)

**బండకటింగ్ .** కొయ్యపనిలో దుంగలు కోయటం (కో 16)

**బండపళ్ళరంపం .** కొయ్యపనిలో మందంగ ఉండే చెక్కను కోయటానికి వాడే సాధనం చూ పెదరంపం (కో.16)

**బండారు ·** కొయ్యపనిలో వాడే ఒక రకం కొయ్య (కో 16,23)

**బండి :** కొయ్యపనిలో కొయ్యను తీసుక రావటానికి వాడే వాహనం (రా 4)

**బండియిరుసు ·** బండి చక్రాన్ని ఆపే భాగం చూ చిత్రం-8 (తె.12)

**బద్దఆకురాయి .** దంతం పనిలో దంతం పెట్టె పూర్తయ్యాక ఫినిషింగ్‌లో నున్నబరచటానికి వాడే సాధనం. (కో.9)

**బద్దీ .** లోహం పనిలో వాడే రాగి, ఇత్తడి, సత్తుకడ్డీ పర్యా. బందన (కో 33)

**బందన :** రూపా. బందం

1 రంపం పొట్టు బొమ్మలకు పూసే చింత జిగురు. (కో 40)

2 కొయ్య బొమ్మలకు పూసే మక్కు (చింతగింజల ఉడకపెట్టిన జిగురు) చూ. చింత అంబలి. (కో 39)

**బందలం** . కోమట్లు గంజి వార్చటానికి ఉపయోగించే (లోహం పనిలో తయారు చేసిన) పాత్ర (కో 4)

**బందు(పెట్టు)** 1 ఫిలిగ్రీ పనివారు అమావాస్యనాడు పని మూసివేయటం (తె 8)

2. దంతం పనిలో పెట్టెకు వాడే బిగింపు (కో 9)

**బందూక నమూనా** . తుపాకి నమూనా పిడిగల చేతికర్ర (తె.5)

**బఫ్‌మిషన్** లోహం పనిలో మెరుగు పెట్టడానికి వాడే (మిషన్) యంత్రం (కో 13,23, తె 1,12)

**బఫ్‌పాలిష్** : లోహం పనిలో బొమ్మలకు చివరన మెరుగు పెట్టడం (తె.12)

**బయటదిక్కు** : పైపైపు తోలు బొమ్మల తయారీలో వాడే చర్మంపై భాగం (జుట్టు ఉండే భాగం). (రా 12)

**బరమ** · మక్కు బొమ్మల తయారీలో ఉపయోగించే పరికరం చూ చిత్రం-169 (రా 13)

**బరమా షెల్లు** . గవ్వ బొమ్మ చూ చిత్రం-46 (రా 5)

**బరువు** 1 పేపరు మట్టి బొమ్మల తయారీలో మోల్డ్‌పైన పెట్టే భారం (కో 41)

2 చేతికర్రల తయారీలో తాటికర్రతో చేసినవి ఎక్కువగ ఉండే భాగం (కో 26)

3 కొయ్యపనిలో డిజైన్లు చెక్కేప్పుడు వాడే కొయ్య సుత్తికన్న ఇనపసుత్తి బరువు ఎక్కువగ ఉండటం (కో.34)

**బరువు కర్ర** : కొయ్య పనిలో వాడే కర్రసుత్తి తయారీకి వాడే కొయ్య (కో.16)

**బర్మతాడు** . బర్మాలో ఉపయోగించే తాడు (తె.12,13)

**బర్మ పట్టం** . లోహం పనిలో వాడే చేతిబర్మాఫ్రేం (తె.12)

**బర్మా** కొయ్యపని, లోహంపని, ఫిలిగ్రీ పని, చేతికర్రల పనులలో చిల్లులు చేయటానికి వాడే సాధనం చూ చిత్రం-113. (కో 23,33,35,36, తె 4,5,8,12,13, రా 4,5,6,8)

**బర్మాకమానకట్టె** . బర్మతాడు ఉన్నకర్ర (తె.13)

**బర్రె కొమ్ము** . చేతికర్రలకు పిడి చేయటానికి వాడే కొమ్ము. (తె 5). తోలుబొమ్మలకి ఆభరణాలు చేసేప్పుడు చర్మం కింద పెట్టడానికి వాడే గేదెకొమ్ము (కో.37)

**బలపం పిండి** . లోహం పనిలో విగ్రహం మోల్డ్ చేసేప్పుడు అంటుకోకుండా ఉండటానికి వేసే ద్రవ్యం. (తె.12)

**బలుమొల** · లోహం పనిలో ఉపయోగించే పరికరం. చూ చిత్రం-133. (తె 1,12)

**బలునైన ఘండాలు** . తోలు బొమ్మలాటల్లో ఆడటం కష్టసాధ్యమైన భాగాలు (రా 2)

**బలుసాకు రాయి** · కొమ్ము బొమ్మల తయారీలో కొమ్ముని నైసుగ చేయటానికి వాడే రాయి (కో 17)
పర్యా. బలుసాకు ఆకురాయి, బల్పు ఆకురాయి (కో 7,23)

**బల్లచెక్క** · తోలుబొమ్మలాటకు ఉపయోగించే వస్తువు. చూ చిత్రం-9 9 (కో.5)

**బసర** · తోలు బొమ్మల తయారీకి వాడే చర్మానికి లోపలి భాగంలో అంటుకొని ఉండే మాంసం. (కో 5,7)

**బస్తతట్టు** . లోహం పనిలో చేసే నమూనా బొమ్మకుపైన పూయటానికి వాడే మట్టిలో కలిపేది (తె 1,12)

**బాక్స్ మౌల్డింగ్** : లోహం పనిలో ఒక పెట్టెలో బొమ్మకు పోత పొయ్యడం (తె.1,12)

**బ్రాకెట్లు** : కొయ్యపనిలో చేసే బక్షీ బద్దలు-సపోర్టులు. (తె.13)

**బ్లాక్** · నలుపు. పత్తి బట్ట బొమ్మల తయారీలో వాడే నలుపు రంగు. (రా 7)

**బ్లాక్ఉడ్** : కొయ్యమీద డిజైన్లు చెక్కటానికి వాడే సాధనం (కో.34, రా 5)

**బ్లాక్‌బోర్డు రంగు** కాగితం గుజ్జు, మట్టి, సుద్ద బొమ్మల తయారీలో వాడే నల్లబల్ల రంగు (కో 17)

**బ్లాక్కు** · ఫిలిగ్రీ పనిలో వాడే బంగారం బిళ్ళలు (కో 27)

**బాడి** · పత్తి, బట్ట బొమ్మల తయారీలో బొమ్మకుండే శరీర భాగం (తె 7)

**బాడిగకర్ర** · కొయ్య బొమ్మల తయారీలో వాడే బాడిక చెట్టుకర్ర (కో 13)

**బాడిగలు బాడిగలు(గ)** . కొబ్బరి చిప్ప బొమ్మలకు ముసుర్లో రంగులు వేస్తే సరిగ అంటుకోక మచ్చ ు మచ్చలుగ అవడం (కో 32)

**బాడితె** చూ బాడిగకర్ర చూ చిత్రం-104 (కో 19)

**బాడిశ** · రూపా బాడిశె, బాడిస, బాడిత కొయ్యపనిలో చెక్కను చెక్కటానికి వాడే సాధనం. (కో.5,6,7,12,13, 16,23,26,28,33,36,39, తె 1,3,4,5,9,13, రా 3, 4,6,13)

**బాడితెబుర్ర** · పర్యా బాడిశె తలకాయ బాడిశె ఇనప భాగంపై చదును భాగం (కో 11,12, తె 5,12)

**బాడిసకట్టె** · బాడితపిడి (కో 36)

**బాడిసిప్ప(కొయ్య)** రంపం పొట్టు, బొమ్మల తయారీలో బొమ్మకు మధ్యన పెట్టే కొయ్య పర్యా బాడిసకొయ్య, బాడిచిప్పకొయ్య (కో 40)

**బాడీరంగు** కాగితం గుజ్జు బొమ్మలకు రంగులు వేసేప్పుడు కమలాపండు రంగులో తెలుపురంగు కలిపితే వచ్చే రంగు (కో 27)

**బాండీ** . పర్యా భగోణి బూర్లెమూకుడు లోహం పనిలో లక్కని కరిగించడానికి వాడే కళాయి ఉన్న పాత్ర (తె 1)

**బాతుతలుపు** . కొయ్యపనిలో చేసే బాతు బొమ్మలు చెక్కిన తలుపు (కో 34)

**బాతుమొకం** · చేతికర్రల తయారీలో పిడినమూనా (తె 5)

**బాతులాకెట్టు** రోల్డుగోల్డు, ఫిలిగ్రీ పనుల్లో గొలుసు మధ్య భాగంలో వేయడానికి వేసిన బాతుబొమ్మ ఆకారం బిళ్ళ చూ చిత్రం-84(బి) (తె 15)

**బాదంమెట్నం** చేతికర్ర పిడి నమూనా (తె 5)

**బాదాం** : లోహం పనిలో చేసే ఒక డిజైన్ (తె.6,12)

**బాదాంమెట్నమొల** లోహం పనిలో వాడే సాధనం. (తె.12)

**బాదాంమొల** . లోహం పనిలో ఉపయోగించే పరికరం చూ చిత్రం-137 (తె 1,10)

**బాయిలర్** · లోహం పనిలో వెండిని కరిగించడానికి వాడే పాత్ర పర్యా స్టౌ (తె 12)

**బారుగుల్ల** : కొయ్యపనిలో పెద్ద చెక్కలను చిత్రిక పట్టడానికి వాడే సాధనం. (కో 16)

**బార్ప** : చూ బాడిశ (కో 35,35)

**బార్డర్స్ (కట్టు)** · దంతం పెట్టె మూతపై అంచులు, మూతలేని తొట్టిపై అంచులు - వీటి మీద దంతం పేళ్ళు అతికించటం (కో 9)

**బాలాజీ లాకెట్** ఫిలిగ్రీ పనిలో చేసే ఆభరణం చూ చిత్రం-79 (తె 8)

**బాల్‌క్లే**. పేపరు మట్టి బొమ్మల తయారీలో మోల్డ్ చేయటానికి వాడే ద్రవ్యం రాళ్ళ మాదిరిగ ఉంటుంది చూ. క్లే (కో 41)

**బాల్వాడి** బాలల విద్యాకేంద్రం కొయ్య బొమ్మలు సరఫరా చేసే ప్రాంతం (కో 16)

**బావుదారి** : రూపా బావుదారు చూ బాడిశ (కో 13,26; తె 9)

**బిగ్‌రాబిట్** . ఒక గుడ్డ బొమ్మ (రా.7)

**బిగి** . తోలు బొమ్మలకు డిజైన్లు చెక్కేప్పుడు చర్మాన్ని నాలుగువైపులకి బిగించటం (కో 30)

**బిగించు** · 1 కొమ్ము పనిలో కొమ్ముని వంపు తీయటానికి వైస్‌లో పెట్టి బిగించటం (కో.1)

2 తోలు బొమ్మలాటలో తెరను బిగించటం (కో 7)

3 కొయ్యపనిలో మంచం చేసేప్పుడు కొయ్యను కదలకుండా బిగించటం (కో 33)

4 ఫిలిగ్రీ పనిలో రాకెట్టును గొలుసుకు బిగించటం (కో 27)

**బిగుసుకొను** : 1 ఫిలిగ్రీ పనిలో వస్తువులు లక్కలో బాగా అతుక్కొని ఉండటం (కో 33)

2. లోహం పనిలో విగ్రహం బాగా అమరడం (తె 1)

**బిట్టు** : కొయ్యపనిలో వాడే చెక్కముక్క చూ తునక (కో 35, రా 3,5,6)

**బిందె** . లోహం పనిలో చేసే ఒక పాత్ర చూ చిత్రం-23 (కో 4, తె 1,12)

**బిందెరేకు** : బిందె తయారీలో ఉపయోగించే ఇత్తడిరేకు (కో 4)

**బిరుదు** : తోలుబొమ్మలో ఒక భాగం (రా 2)

**బిర్రు** : తోలు బొమ్మలాటలో తెరను బిగుతుగ కట్టడం (రా.2)

**బిలుకుల్** · పూర్తిగ కొమ్ముని పూర్తిగ సాపు చేయటం (తె 5)

**బివికి** . పర్యా క్రాసు మట్టం కొయ్యపనిలో మూలలు కొలవటానికి వాడే సాధనం (కో 16)

**బిళ్ళ** : లోహం పనిలో తయారుచేసే లోహం పలక. (తె 12)

**బిళ్ళకర్ర** అడ్డ కొయ్యపనిలో అడ్డలోని అడ్డబుర్ర, అడ్డపూస చేయటానికి వాడే బిళ్ళచెట్టు కర్ర (కో 12)

**బిళ్ళకలర్స్** : నిర్మల్ బొమ్మలకు వాడే రంగులు. (తె 4)

**బిళ్హరి** : తోలు బొమ్మలాటలో వాడే రాగం పేరు. (రా 2)

**బీజాపర్** : కొయ్యపనిలో వాడే పెద్దేగికర్ర (తె 13)

**బీట** . కొమ్ము బొమ్మలకి, కాగితం, గుజ్జు బొమ్మలకి ఉండే పగులు చూ ఈన (కో 9,10,27)

**బీరకాయ** నిర్మల్ బొమ్మ పేరు దీని పీచుతో బొమ్మలు వేస్తారు (కో 32, తె 4)

**బుక్కారు** రూపా బుగ్గకారు పర్యా పెద్ద పట్కారు, బుగ్గ పట్కారు

1 లోహం పనిలో ఉపయోగించే సాధనం. (కో.8)

2 లోహం పనిలో వస్తువుల్ని పట్టుకుందుకు వాడే కారు (తె 1)

3. లోహం వాహనాల తయారీలో వాడే సాధనం (కో 31)

4 ఫిలిగ్రీ పనిలో దొడ్డు తీగెను మలచటానికి దీన్ని వాడతారు చూ చిత్రం-152 (తె 8)

**బుగ్గ** . బుక్కారులో వస్తువుల్ని పట్టుకునేందుకు ఉండే భాగం (కో 8)

**బుడ్డ** . ఫిలిగ్రీ పనిలో చిల్లులు చేయటానికి పూర్వం వాడే దడ్లబర్మలో భాగం (తె 8)

**బుడ్డకేతిగాడు** . తోలు బొమ్మలాటలో ఒక హాస్యపాత్ర చూ కేతిగాడు (కో 37; రా 2)

**బుడ్డి** 1 తోలు బొమ్మలాటలో వాడే దీపం (రా 10)

2 లోహం పనిలో వాడే కొలిమిలో భాగం (తె 12)

**బుయ్యబొందు** · పర్యా దండకడియం మట్టిబొమ్మల తయారీలో బొమ్మకు బుజానికి చెక్కే ఆభరణం (కో.27)

**బుర్ర** 1 కొయ్య బొమ్మలోని తల భాగం. (కో 12)

2 ఫిలిగ్రీ పనిలో వాడే కొలిమిలో భాగం (తె.12)

3 కాగితం గుజ్జు బొమ్మలోని తల భాగం (కో.10,41)

4 బాడితెలో భాగం. చూ కీర్తిముకుడి బుర్ర చూ చిత్రం-104 1 (కో 19)

**బురుగుల సంధూక్** · నిర్మల్ బొమ్మలు తయారు చేసేవాళ్ళు చేసే 24 ఖానాలుండే పెట్టె (తె 4)

**బురుసు** రూపా బులుసు కొయ్య బొమ్మలకి రంగులు

వేయడానికి, ఫిలిగ్రీ పనిలో వస్తువుల్ని తోమడానికి వాడే బ్రష్ (కుంచె) (తె 4,7,8)

**బులుగు** : తోలుబొమ్మలకువేసే (బ్లూ) నీలం రంగు చూ నీలం (కో 37, రా 2)

**బులుసు** రంపం పొట్టు బొమ్మలకి, కొయ్య బొమ్మలకి రంగులు వేయడానికి వాడే కుంచె చూ కలం (తె 7,9)

**బూడిర** : కొమ్ము బొమ్మలు పాలిష్ రావటానికి వాడే పొడి (కో 1)

**బూడిర తోడు** . లోహం పనిలో వాడే కొలిమిలో ఉండే బూడిదని గరిటతో తోడటం (తీయటం). (తె 1?)

**బూడిదరంగు** : నిర్మల్ బొమ్మలకు వేసే రంగు (తె ?)

**బూడ్సుపాలిష్** : రూపా బూడుసు పాలిస్ (boot polish) కొయ్య బొమ్మలకు వేసే పాలిష్ (రా 5,6)

**బూడ్సుబ్రస్సు** : (boots brush) కొయ్య బొమ్మలకి పాలిష్ చేయటానికి వాడే కుంచె (రా.6)

**బూతాంకుసం(కర్ర)** చేతికర్రల తయారీలో వాడే బూతాం కుసం చెట్టు కర్ర (తె 5)

**బూరుగుకర్ర** : కొయ్య బొమ్మల తయారీకి వాడే కొయ్య (కో 19)

**బెజ్జం** : చిల్లు పర్యా రంధ్రం, హోలు (తబల, డోలకు, హార్మోణియంలలో భాగం) (కో.5,6,7,9,11,30, 31,33; రా.5,6)

**బెంచ్గ్రైండర్** లోహం బొమ్మలకి చిల్లులు చేయటానికి వాడే పరికరం (తె.1)

**బెట్టగెణుపు** . మంచం, కుర్చీ తయారీకి వాడే కొయ్య. (కో 35)

**బెండు** : 1 కొయ్యపనిలో వాడే కొయ్యలోని పనికి రాని గుల్ల (కో.23,32)

2 కొయ్య పనిలో కొయ్య వంకరగ ఉండటం (కో 35)

**బెత్తగిపోవు** కొయ్య బొమ్మలకి పూసే లప్పం రాలిపోవు (తె 7)

**బెత్తెడు** ఫిలిగ్రీ పనిలో వెండి రేకుని సాగదీసే వెడల్పు. (తె 8)

**బెరడు** కొయ్యపనిలో వాడే కొయ్య పైనుండే పెచ్చు (తె 5; రా 13)

**బెల్లంపీళ్ళు** కొయ్యపనిలో కొయ్యనికోసే ఆరాకష్వాళ్ళు దాహం అయితే తాగేనీరు (తె 13)

**బెసుకు** . కదలటం, పట్టు తప్పటం (కొబ్బరి చిప్పల బొమ్మల తయారీలో చిప్పని నైస్ చేసేప్పుడు, బెసికితే పగిలిపోతుంది) (కో 32)

**బేక్ఫ్రేం** కొయ్యపనిలో చేసే కుర్చీకి వెనక జార్లపడటానికి ఉపయోగించేది (కో 35)

**బేంగ** : కొయ్యబొమ్మలకి లప్పం పూసి సాపుచేయటానికి వాడే పరికరం (కో 39)

**బేడ(ఎత్తు)** ఫిలిగ్రీ పనిలో వాడే కొలత (తులంలో ఎనిమిదో వంతు, రూపాయిలో ఎనిమిదో వంతు) (తె 8)

**బేరింగ్మోపు** · లోహం పనిలో వాడే తరిణ దొడ్డిలో భాగం. (కో 8)

**బేలు** : లోహం పనిలో చేసే ఆకు, తీగల డిజైన్ (తె 1,8,10,12)

**బేషన్** లోహం పనిలో చేసే ఇత్తడి పాత్ర (తె 12)

**బేస్** 1 కొయ్యపనిలో వాడే తోపుడు చట్రం (కో 41)

2 కొయ్య బొమ్మల కింద ఉండే ఆధారం (కో 26)

3 తాటి చెట్టు బొమ్మలో భాగం చూ చిత్రం-1.6. (కో 26)

**బేస్అలుగు** . కొయ్యపనిలో పెద్ద బెజ్జాలు వేయటానికి వాడే పరికరం (కో 16)

**బైటాసర** కొయ్యపనిలో చేసే తలుపుకు బైటి కొలత. (తె 13)

**బైండింగ్ వైరు** 1 లోహం బొమ్మల తయారీలో ముందు చేసే మట్టి బొమ్మకు పైన చుట్టే తీగ (కో 39)

**బొక్క** · 1 తోలు బొమ్మలకు డిజైన్ చెక్కేప్పుడు చేసే చిల్లు (రా 22)

2 కొయ్య బొమ్మలకు చేసే చిల్లు చూ చిల్లి (రా 3)

**బొగ్గు** 1 కొలిమి బట్టీ, పొయ్యిల నిప్పు కోసం వాడే ఇంధనం (కో 4,6, తె 5,8, రా 3,5)

2 మేకప్‌లో కనుబొమలు దిద్దటానికి వాడే ద్రవ్యం (కో 7)

3 కొయ్యపనిలో మంచం చేసేప్పుడు గుర్తుకోసం గీతలు కొట్టడానికి వాడే వస్తువు (కో 35)

**బొగ్గునీళ్ళు**. దీనిలో నూలును తడిపి కొయ్యపనిలో చెక్కపై గుర్తులు పెట్టడానికి వాడతారు (కో 35)

**బొగ్గుల కుంపటి** ఫిలిగ్రీ, లోహం పనులలో వాడే కుంపటి. (కో 27,33, తె 1)

**బొచ్చు** 1 తోలుబొమ్మల తయారీకి వాడే చర్మానికి ఉండే వెంట్రుకలు (కో 29,30, రా 2,5)

2. తాటి టెంక మీది పీచు చూ జుట్టు (కో 32)

**బొటనవేలు** . కాగితం గుజ్జు బొమ్మల తయారీలో మోల్డ్‌లో గుజ్జును చేసి నొక్కటానికి ఉపయోగించే చేతి మొదటివేలు రూపా బొటనేలు, బొట్నేలు (కో 17,27)

**బొణిగె** లోహం పనిలో వాడే కొలిమిలో గాలి రావటానికి పూర్వం ఉపయోగించే తిత్తి మూతి (బొణిగె = మూతి) (తె 12)

**బొత్తంగుల్ల** : గవ్వబొమ్మ చూ చిత్రం-43 (తె 1,14)

**బొత్తాములు** చూ చొక్కాగుండీలు చూ చిత్రం-75 (కో 27)

**బొత్తాలగొలుసు** ఫిలిగ్రీ పనిలో చేసే ఆభరణం చూ చిత్రం-85 (కో 27)

**బొత్తోపుడు** (బొద్దుతోపుడు) కొయ్య పనిలో ఉండే తోపుడు (రా 4)

**బొద్దు** ఫిలిగ్రీ పనిలో, కొయ్యపనిలో చేసే డిజైను (తె 6,8,12, రా 4)

**బొద్దుగుల్ల** కొయ్యపనిలో చెక్కని పెచ్చులుగ తీయటానికి వాడే పరికరం (కో 16)

**బొద్దుతోపుడు** కొయ్యపనిలో చెక్కబొద్దు వచ్చేట్లు చేయటానికి వాడే సాధనం (రా 4)

**బొద్దుల డిజైను** కొయ్యపనిలో చెక్కపై చేసే నగిషీ (రా 4)

**బొద్దుల మిషన్** లోహం పనిలో బొద్దులు కొట్టే మిషన్ (తె 12)

**బొంద(కొట్టు)** రంధ్రం చేయటం

1 కొయ్య బొమ్మల తయారీలో డిజైన్‌లలో కుంట లుంటే దాని ప్రకారం గుంట చేయటం (రా 4)

2 కొయ్య బొమ్మల తయారీలో పక్షులకు జంతువు లకు కళ్ళు పెట్టే చోట చేసే గుంట (రా 4)

**బొందెగొలుసు** ఫిలిగ్రీ పనిలో సూత్రాలు గుచ్చుకొని వేసుకొందుకు చేసే గొలుసు (కో 33)

**బొమ్మలపెట్టె** తోలు బొమ్మలాట ఉపయోగించే పెట్టె చూ చిత్రం-9 10 (కో.7)

**బొమ్మలాట** . తోలు బొమ్మలాట (కో 30,37, రా 2,10)

**బొమ్మని ఆడించేపుల్ల** తోలు బొమ్మలాటలో ఉపయోగించే పుల్ల చూ చిత్రం-9 4. (రా.10)

**బొమ్మని ఆడించేవారు** తోలుబొమ్మలను ఆడించేవారు చూ చిత్రం-9 5 (కో 37, రా 2)

**బొమ్మాకారం** . తోలుబొమ్మల తయారీలో చర్మం మీద చెక్కే బొమ్మ నమూనా. పర్యా బొమ్మ రూపం, బొమ్మ ఫోటో (కో 7)

**బొర్రె** . సుద్ద, మట్టి, కాగితం గుజ్జు బొమ్మల తయారీలో బొమ్మకు కింది భాగంలో ఉండే కంతు. (కో 17)

**బోకె** · ఫిలిగ్రీ పనిలో వస్తువులు మెరుగు రావటానికి చింత పండు నీళ్ళు పోయడానికి వాడే గిన్నె (తె 8)

**బోయరు .** లోహం పనిలో వాడే కొలిమిలో మట్టితో చేసిన ముందు భాగం (కో 4)

**బ్లోయరు .** లోహం రేకుమీద బొమ్మలు చెక్కేప్పుడు రేకును వేడి చేయటానికి వాడే కొలిమిలోకి గాలిరావటానికి ఉపయోగించే ఇనప గాలితిత్తి (రా 11)

**బోర్డరు** పేపరు, మట్టి బొమ్మల తయారీలో బొమ్మ ఆకారం గీయటం (కో 41)

**బోర్లింపు :** 1 లోహం పనిలో దరియా పెట్టెలో విగ్రహం మోల్డ్ చేసేప్పుడు పెట్టిపైన పెచ్చెని పెట్టడం (తె 12)

2 ఫిలిగ్రీ పనిలో వెండి రేకు మీద బొమ్మ చేసేప్పుడు రేకుమీద బొమ్మ అచ్చును తిప్పి పెట్టడం. (కో 27, తె 15)

3 ఫిలిగ్రీ పనిలో వెండి రేకు మీద ఉబ్బుగ రావటానికి రేకుని తిప్పి కొట్టటం. (కో 33)

**బోలి .** తోలు బొమ్మలకి వాడే నలుపు రంగు తయారీలో దీపం పొగ పట్టడానికి వాడే మూతలాంటి వస్తువు (రా 10)

**బోలు :** 1 చేతికర్రల పిడులకు వాడే కొమ్ములోని ఖాళీ భాగం (తె.5)

2 ఫిలిగ్రీ పనిలో చేసే రింగుల లోపల డొల్లగ ఉండటం (తె 15)

**బోళ్ళు :** లోహం పనిలో చేసే బిందెలు మొదలయినవి (తె 12)

**బ్రష్ :** లోహం పనిలో దరియా పెట్టెలోని మట్టి నమూనాలో ఎక్కువగా ఉన్న మట్టిని ఆభరణాల సందుల్లో ఉన్న మట్టిని తొలగించటానికి వాడే కుంచె చూ కలం (తె 12)

**బ్రాప్ .** ఇత్తడి లోహం పనిలో వాడుతారు (కో 8, తె 1)

**బ్లూ ల్యాంపు .** (Blue Lamp) లోహం పనిలో బొమ్మ భాగాలని అతకటానికి వాడే మంట రూపా బ్లోర్ ల్యాంప్ (తె 1)

**బ్లేడ్** 1 తోపుడులో ఉపయోగించే కత్తి (కో 34,35,41, తె 13, రా 4)

2 హెక్సాలో భాగం చూ చిత్రం-170-3 (రా 3)

**బ్లోర్‌ల్యాంపు** చూ బ్లూ ల్యాంపు (తె 1)

**బ్లో ల్యాంపు** చూ బ్లూ ల్యాంపు (కో 33)

**బ్లోవర్** పర్యా గాలిపంకా, ఇనప గాలితిత్తి కొలిమిలో గాలి కోసం వాడేది (తె 1)

**బ్లౌజ్ :** గుడ్డ బొమ్మలో ఒక భాగం (రా 7)

## భ

**భగోణి :** పర్యా బూర్లెమూకుడు, భాండీ లోహం పనిలో చేసే పాత్ర. (తె 1)

**భజన స్తంభం .** ఫిలిగ్రీ పనిలో చేసే వెండి స్తంభం (కో 33)

**భస్మం ·** లోహం పనిలో అంటుపెట్టడానికి వాడే పొడి (తె 12)

**భాగం** బొమ్మల్లోని అంగం, అవయవం (కో 16,27, రా 5)

**భాగేశ్వరి ·** తోలుబొమ్మలాటలో వాడే రాగం పేరు (రా 2)

**భావసార క్షత్రియులు** ఒక జాతివారు (ముచ్చీలు) (కో 19)

**భీంప్లాస్ :** తోలుబొమ్మలాటలో వాడే రాగం (రా 2)

**భుజకిరీటం .** కొండపల్లి బొమ్మల తయారీలో రాముడి బొమ్మకు రెండు భుజాల మీద అమర్చే నగలు. (కో 26)

**భుజకీర్తి ·** 1 తోలు బొమ్మలాటలో ఒక భాగం (రా.2)

2 చూ భుజకంకణం భుజాలకి తగిలించుకునే ఆభరణం (కో 29, రా 8)

**భుజాలు** తోలుబొమ్మలో భాగం. చూ చిత్రం-10 II (కో 37, రా 2)

**భూతప్రేతాదులు :** తోలు బొమ్మలు (రా 2)

**భూమికి కొట్టు** · (చర్మం శుభ్రం చేయటానికి) చర్మాన్ని నేల మీద బాదు (తె.3)

**భూషణం** · రంపం పొట్టు బొమ్మలకి చెక్కే ఆభరణం (తె 9)

**భైరవి :** తోలుబొమ్మలాటలో వాడే రాగం పేరు (రా 2)

**భోజులు :** (కొయ్య, పనివాళ్లు) (తె 13)

# మ

**మకర తోరణం** · లోహం విగ్రహాల వెనక, పక్కన, పైన, చుట్టూ ఉండే మొసలి రూపం గల తోరణం చూ చిత్రం-13 (కో 18,28,33, తె 12, రా.1)

**మకర తోరణాల పని .** లోహం విగ్రహాలకు మకర తోరణాలు చేయటం (తె.10)

**మకర ముఖాలు .** మకరతోరణంలో భాగాలు చూ చిత్రం-13 1 (కో 28,33, తె 12)

**మక్కు .** పర్యా లప్పం కొయ్యపనిలో బొమ్మలకు పూయటానికి, చెక్కలో ఉండే గుంటలని పూడ్చటానికి వాడే ద్రవ్యం (చింతగింజల పొడి, రంపం పొట్టు కలిపి ఉడికించి చేస్తారు) (కో 16,17,19,26,27,28, 34,40, తె.1,4)

**మక్కు బొమ్మ** ఊరేగింపు సమయంలో మూల విగ్రహాలకి బదులుగ ఊరేగించే బొమ్మ (రా 13)

**మగవాళ్ల గొలుసు .** పురుషుల కోసం చేసిన గొలుసు చూ.చిత్రం-88(అ) (కో.27)

**మంగన్ :** 1 చేతికర్రల తయారీలో పిడికి వాడే కొమ్మును చెక్కేప్పుడు కదలకుండ బిగించటానికి వాడే సాధనం. (తె 5)

2 లోహం పనిలో వస్తువులకు రాపణం పనిగాని చెక్కడంగాని చేసేప్పుడు బిగించటానికి వాడే పరికరం (తె.1,10,12)

**మంగళ హారతి** తోలుబొమ్మలాటలో ముగింపు పాట (గీతం). (కో 37, తె 1, రా 10)

**మంగెన** · రూపా మంగన్, మంగన ఫిలిగ్రీ పనిలో ఉంగరానికి రాళ్ళు పెట్టేప్పుడు కదలకుండ ఉంచటానికి వాడే సాధనం (తె 1)

**మచిలి నమూనా** పర్యా చేప మోడలు చేతికర్రల పిడికి చేసే చేప నమూనా (తె 5)

**మజ్జన** · మధ్యన (కో 7)

**మంచికొయ్య :** కొయ్యపనిలో దేవుని విగ్రహాలకు వాడె కొయ్య (రా 4)

**మంచిగంధం చెక్క** · దంతం పనిలో కంబతొట్టి చేయటానికి వాడే కర్ర (కో 9)

**మంచిగ పారు** · లోహం పనిలో విగ్రహానికి పోసిన పోత సక్రమంగ జరగటం (తె.12)

**మంచినూనె .** 1 రంపం పొట్టు బొమ్మలకు వేసే వార్నిష్ తయారీలో కలిపే చమురు. (తె.9)

2 చూ నువ్వుల నూనె లోహం పనిలో అట్టెం తయారీలో గుగ్గిలం ఇటుక పొడిలో కలిపే ద్రవం (తె 1)

**మజూరు** · పనిచేసినందుకు ఇచ్చే డబ్బు. (తె 4)

**మట్ట తోపుడు :** కొయ్య పనిలో మట్టంగా వచ్చేటట్లు తోసే తోపుడు (రా 4)

**మట్టపలక** కొయ్యపనిలో వాడే స్కేలు. (రా 4)

**మట్టం** 1 కొయ్యపనిలో చెక్క సమానంగా ఉండటం (రా.4)

2. కొయ్యపనిలో చెక్కమూలలు సమానంగా చూడటం (కో 16)

3. తోలు బొమ్మల తయారీలో బొమ్మలకు ఆభరణాలు చెక్కేప్పుడు అడుగున వత్తుగ గేదెకొమ్ము పెట్టడం (కో.30)

4 కిరీటంలో భాగం చూ చిత్రం-16 2 (కో.12,26,29, తె.6,12, రా.2)

**మట్టం అలుగు** · కొయ్యపనిలో మట్టి తోపుడులోని అలుగు. (రా.4)

**మట్టం చేయు :** పర్యా సమానం చేయు. కొయ్యపనిలో చెక్కని సమానంగా చేయటం (రా 4)

**మట్టపేర్నం :** కొయ్యపనిలో మట్టంగా నైస్ చేసే సీర్నం (రా 4)

**మట్టసుత్తి .** లోహం వాహనాలు చేయటానికి వాడే సుత్తి. (కో 31)

**మట్టాము ·** మూల మట్టం (కో.6)

**మట్టాం బిళ్ళ .** లోహం పనిలో గాజాకింద ఆధారంగా పెట్టుకునే ఇనప దిమ్మ (కో 33)

**మట్టి :** 1 పేపరు బొమ్మల తయారీలో పేపరును పిండిగ చేసినప్పటి తుక్కు (కో.41)

2 లోహం పనిలో నమూనా బొమ్మ చేయటానికి వాడే ద్రవ్యం (తె.12, రా 5)

3. (మట్టి) బొమ్మల తయారీకి వాడే ద్రవ్యం. (కో.7)

**మట్టిఅచ్చు :** లోహం పనిలో దరియా పెట్టెలో పడిన మట్టి అచ్చు (తె.12)

**మట్టికుండ :** మట్టితో తయారైన పాత్ర (కో 28)

**మట్టిచిప్ప :** గాజుల తయారీలో వాడే రంగులు, లక్కపొడి కలిపి ఉడికించటానికి వాడే పాత్ర (తె 1)

**మట్టివత్తు :** లోహం పనిలో వాడే దరియాపెట్టెలో మట్టిని కూరు. (తె 12)

**మట్టిపెంకు :** కొయ్యపనిలో బొమ్మలకు వేసే నలుపు రంగు తయారీలో పొగపట్టడానికి వాడే పెంకు (తె 1)

**మట్టిపొయ్యి :** లోహం పనిలో లోహాన్ని కరిగించటానికి వాడే పొయ్యి (కో 8)

**మట్టిబొమ్మ :** 1 లోహం పనిలో చేసే నమూనా బొమ్మ. (కో 1)

2 మట్టితో చేసిన బొమ్మ. (కో 27)

**మట్టిముద్ద** లోహం పనిలో వాడే కొలిమికి పూర్వం ఉపయోగించే తిత్తిమూతి దగ్గర పెట్టే ముద్ద (తె.12)

**మట్టిముంత ·** కల్లుగీతలో కల్లు వుంచటానికి ఉపయోగించే పాత్ర చూ చిత్రం-12 (కో 9)

**మట్టిమూస** చూ కుమ్మరి మూస లోహం పనిలో లోహాన్ని కరిగించడానికి వాడే కుమ్మరిమూస (తె 8, రా 5)

**మట్టిమోల్డింగ్** లోహం పనిలో విగ్రహాల తయారీలో వాడే మట్టితో చేసిన బొమ్మ (కో 8)

**మట్టు** లక్కబొమ్మ అడుగు భాగం (కో 12)

**మట్టుకట్టు(ట్లు)** గవ్వ బొమ్మ చూ చిత్రం-34 (తె 14, రా 5)

**మట్టె :** ఫిలిగ్రీ పనిలో చేసే వస్తువు (వివాహ సమయంలో పెండ్లికూతురు కాలివేలికి తగిలించే ఆభరణం). (తె 8)

**మట్టెం కొట్టు** పర్యా సెప్టీకొట్టు, ఎలుపుకొట్టు ఫిలిగ్రీ పనిలో వాడే తీగను వెడల్పుగ కొట్టడం. (తె 8)

**మట్టెలకడ్డీ .** ఫిలిగ్రీ పనిలో ఉంగరాలు చేసే కడ్డీ. (తె 8)

**మడత ·** 1. నిర్మల్ బొమ్మలకు బట్ట అతికించి పైన పూసే సుద్ద మట్టి తయారీలో మట్టి వడపోయటానికి బట్టకు పెట్టే మడత (తె 4)

2 పేపరు మట్టి బొమ్మల తయారీలో పేపరు మట్టిని అట్టలా చేసి మడవటం (కో 41)

**మడతమన్ను** జాడీ తయారీకి వాడే మన్ను (తె 12)

**మడిపి ·** మనిషి (మడిపి బొమ్మలు చేయటం). (కో 15)

**మడ్డి పెయింట్ ·** కొయ్యబొమ్మలకు పూసే చాక్‌పొడరు, చింతగింజల బందం కలిపిన రంగుపూత (కో 39)

**మణాలి** తోలుబొమ్మల మీద గుండ్రని కన్నం కొట్టడానికి వాడే సాధనం. (రా 2)

**మణికిరీటం ·** తోలుబొమ్మలకు చేసే ఒక రకమైన కిరీటం. (రా 2)

**మణిహారం ·** తోలుబొమ్మలకి చెక్కే ఆభరణం (మణులతో చేసిన హారం) (రా.2)

**మణువు :** పదిశేర్లు (తె.12)

**మండిగ .** తోలుబొమ్మలకు వేసే నలుపు రంగు తయారీలో గుంట కలవరాకు పసరుపూసి పొగ పట్టించడానికి వాడే వెడల్పు పళ్ళెం (కో 15)

**మద్దెలగాడు :** తోలుబొమ్మలాటలో ఒక పాత్ర చూ చిత్రం-9.7 (రా 5)

**మధ్యమావృతి .** తోలుబొమ్మలాటలో వాడే రాగం (రా 2)

**మద్రాసు గాజులు** ఫిలిగ్రీ పనిలో చేసే ఆభరణాలు చూ చిత్రం-62 (తె 8)

**మద్రాసు గొలుసు .** ఫిలిగ్రీ పనిలో చేసే ఆభరణం చూ చిత్రం-90 (తె 8)

**మనకొయ్య :** తరిణ దొడ్డిలో ఉండే ఇనుముతో చేసిన కొయ్య (కడ్డీ) (కో 7)

**మనులి :** 1. ఒక రకమైన ఉలి దీనిలో కొయ్య దిమ్మను కోస్తారు (కో 11)

2 లక్కబొమ్మల తయారీలో ఉపయోగిస్తారు కొయ్యను కోయడానికి, తరమడానికి దీన్ని ఉపయోగిస్తారు (కో 12)

**మన్ను** 1 ఎక్కువ కాలం ఉండు (కో 19)

2. కొలిమిలో సరం చేయడానికి వాడే మట్టి (కో 6)

3 లోహం పనిలో నమూనా బొమ్మ తయారీకి వాడే మట్టి. (కో.4)

**మన్నువత్తు :** దరియా పెట్టెలో మన్ను కూరటం (తె 12)

**మయూవ :** మధ్యలో కొయ్యపనిలో చెక్కను మధ్యకు కోయటం. (తె 13)

**మర :** లోహం పనిలో చేతి బర్మాను తిప్పే పిడి (తె.12)

**మరచీల ·** కొయ్యపనిలో బొమ్మలని పలకు బిగించడానికి వాడే సీల (రా 5)

**మర్దన :** తోలుబొమ్మలకు వాడే నలుపు రంగు తయారీలో మసి, వేప బంక కలిపి నూరటం (కో.37)

**మలచు :** ఫిలిగ్రీ పనిలో, లోహం పనిలో, కొయ్యపనిలో రావలసిన బొమ్మల ఆకారాలని చేయు (కో 1,14, 17,26,28, తె 8,10,12)

**మలచికొట్టు** ఫిలిగ్రీ పనిలో సుడుగుల్ని మలిచి కొట్టడం (తె 8)

**మల్లీశ్వరి గొలుసు ·** రూ మల్లేశ్వరి గొలుసు రోల్డ్‌గోల్డు వస్తువుల తయారీలో చేసే ఆభరణం చూ.చిత్రం-88(అ) (కో 33)

**మల్లెమొగ్గల నెక్లేసు** ఫిలిగ్రీ పనిలో చేసే ఆభరణం చూ చిత్రం-98 (తె 8)

**మలుచుట్ట** ఫిలిగ్రీ పనిలో చెవుల రింగు తయారీలో రింగు లోపల బోలుగ రావటానికి బంగారం, వెండి రేకుని సన్నని ఇత్తడి సువ్వకి చుడతారు. దీనినే మలుచుట్ట అంటారు (తె 15)

**మలుపుతీగె** కొయ్య పనిలో చెక్కపై చేసే డిజైను (రా 4)

**మల్పు** చూ మలచు (తె.8, రా 4)

**మళ్ళు** మణువులు (తె 12)

**మసిపొడి ·** నిర్మల్ బొమ్మలకి వేసే నలుపురంగు. (తె 4)

**మసాల .** నిర్మల్ బొమ్మలకు వేసే జాలిమా రంగు తయారీలో ఉడికించే ద్రవ్యం (హీరాకస్) (తె.4)

**మసాలమన్ను .** లోహం పనిలో పోతపోయడానికి వాడే దరియా పెట్టెలోని మట్టి (తె 1,10,12)

**మసి** నలుపు రంగు తయారీకి పట్టే దీపం పొగ (కో.15, తె 4)

**మస్తు** చాలా (తె 7, రా 2)

**మహదేవ పెట్టె .** నకాషీ పనిలో బొమ్మల పెట్టె (తె.7)

**మహాద్రావకం** లోహం పనిలో వస్తువులు మెరుగు రావటానికి వాడే ద్రవం (కో 31,33)

**మాగబెట్టు** తోలు బొమ్మకు వేసే రంగులు కొబ్బరి చిప్పలో పోసి గాలి తగలకుండా పెట్టు (రా 2)

**మాట్టుకణ్ణు** (తమిళం) గవ్వ బొమ్మ (ఆవు కన్ను) (రా 5)

**మాడిపోవు :** లోహం పనిలో వాడే లక్కని ఎక్కువగా వేడి చేస్తే నల్లబడు. (కో 28)

**మాడ్చు .** దంతం పనిలో డిజైన్‌లోని గాడీలలో రంగు కలిపిన లక్కని వేడిచేసి నింపు (కో.9)

**మాండుగర్భ :** తోలుబొమ్మలాటలో వాడే రాగం పేరు (రా.2)

**మాండుజిల్లా :** తోలుబొమ్మలాటలో వాడే రాగం పేరు (రా.2)

**మాదిగ .** ఒక కులం పేరు (తె 9)

**మాధవమలపని .** కొయ్య శిల్పం పని (రా 4)

**మాధవమలబొమ్మ .** దారుశిల్పం, కొయ్య శిల్పం (రా.4)

**మాపులేళ :** తోలు బొమ్మలాట ఆడే సమయం (రాత్రివేళ) (కో.15)

**మామిడి :** కొయ్య బొమ్మలకు వాడే కొయ్య (కొయ్య శిల్పంలో దేవతా విగ్రహాలకు పనికిరాని కొయ్య) (కో.7,16, తె 2,3,5, రా 4,6)

**మాయిడి :** చూ మామిడి (రా 5)

**మారవి :** తోలు బొమ్మలాటలో వాడే రాగం పేరు (రా 2)

**మార్తాల :** తోలు బొమ్మలాటలో ఒక పాత్ర. అంగుష్ఠ మాత్రుడైన ఆంజనేయుడు. (సులోచన సాగరంలో) ఒక తోలు బొమ్మ (రా 2)

**మార్కు** కొయ్యపనిలో పెట్టుకునే గుర్తు. చూ కాటు (కో.6,35, రా 5)

**మాల :** ఒక కులం పేరు (తె.9)

**మాలకోస్ :** తోలు బొమ్మలాటలో వాడే రాగం పేరు. (రా.2)

**మాల్డింగు గుల్ల .** లోహం పనిలో విగ్రహాల తయారీకి వాడే సాధనం. (కో 8)

**మావిడి :** చూ. మామిడి. (కో.12, తె 5)

**మాంసం :** తోలుబొమ్మల తయారీకి వాడే మేకచర్మం లోపలివైపు అంటుకొని ఉండే పదార్థం. (రా.10)

**మిక్స్ :** పేపరు మట్టి బొమ్మల తయారీలో పేపరు మట్టిని బాగా కలపటం చూ కల దొక్కు (కో 4)

**మిక్చరు :** రూపా మిచ్చరు లోహం పనిలో ముందు చేసే మట్టి మోల్డింగ్ పైన పూయటానికి మైనం, గుగ్గిలం, ఆముదం కలిపిన ద్రవ్యం (కో 8)

**మింగు :** మక్కు బొమ్మలకి పైన బట్ట చుట్టకుండా రంగులు వేస్తే అవి రంగును పీల్చు (రా 13)

**మితంగ :** పేపరు మట్టి బొమ్మల తయారీలో ముగ్గురాళ్ళ పొడిని, పేపరు పొడిని సరిగ్గ కలపటం. (కో.41)

**మిర్రర్‌ఫ్రేము .** అద్దం చట్టా కొయ్యపనిలో చేసే అద్దం బిగించే చట్రం (తె 13)

**మిర్రర్ స్టాండు** కొయ్యపనిలో చేసే అద్దం పెట్టుకోవటానికి ఉపయోగించే సాధనం (తె 13)

**మిల్లు .** కొయ్యబొమ్మలకు పూసే మక్కు తయారీకి చింత గింజల్ని పొడిగ ఆడించటానికి ఉపయోగించే యంత్రం (కో 19)

**మిశ్రమం :** కాగితం, మట్టి, సుద్ద మూడింటిని కలిపిన ద్రవ్యం (బొమ్మల తయారీలో వాడతారు) (కో 17)

**మిషన్** రూపా. మిషిన్

1. లోహం పనిలో బొమ్మలు పాలిష్ చెయ్యటానికి వాడే యంత్రం (రా.11)

2 ఫిలిగ్రీ పనిలో వెండిని దొడ్డు తీగగా తీయటానికి వాడే యంత్రం. (తె 8)

3 కొయ్యపనిలో దుంగల్ని కోయటానికి వాడే యంత్రం (కో 16,34, తె 7, రా 4)

4. పేపరు మట్టి బొమ్మల తయారీలో పేపర్ని, ముగ్గురాళ్ళని (సిరమిక్ స్టోన్) పొడిగ ఆడించటానికి వాడే యంత్రం కటింగ్ మిషన్ (కో.4)

**మీడియం ఆకురాయి :** లోహం పనిలో వాడే ఒక మాదిరి గరుకుదనం గల ఆకురాయి. (తె.1)

**మీడియం పాలిష్** · లోహం పనిలో వస్తువుల్ని కుంకుడు రసంతో తోమడం (తె 10)

**మీడియంసుత్తె** లోహం పనిలో తీగలని మలచటానికి వాడె మధ్యరకం సుత్తి (తె 1,10)

**ముక్క** . 1 తోలు బొమ్మలకు పెట్టే కీలు (కో 7)

2 కొయ్యపనిలో చెక్కమీద డిజైన్ చెక్కేప్పుడు సుత్తితో గట్టిగ కొడితే ఎగిరిపోయే చెక్కపేడు (కో 34)

3. లోహం పనిలో విగ్రహం పోత పోసేప్పుడు విగ్రహానికి ఎక్కువగ పడే లోహం భాగం (తె 1)

4. కొయ్యపనిలో కొయ్యను కోయించిన భాగం (కో 41, తె 4)

**ముక్కాలపీట** · మూడు కాళ్ళున్న పీట రోల్డ్‌గోల్డు, ఫిలిగ్రీ పనిలో కరిగించిన లక్కను పెట్టడానికి వాడేది (తె 5)

**ముక్కాలించి ఆకురాయి** కొయ్యపనిలో వాడే ఆకురాయి (రా 4)

**ముక్కాలు** మూడు పావులు (3/4) (రా 2)

**ముక్కు నమూనా** తాటి బుర్ర బొమ్మలకు చేసే ముక్కు ఆకారం (కో 32)

**ముక్కెగిరిపోవు** కొయ్యపనిలో చేసిన బొమ్మల ముక్క ఊడిపోవు (తె 7)

**ముక్కెపోగారు** · ఫిలిగ్రీ పనిలో రేకుమీద చుట్టూ డిజైన్ తీయడానికి వాడే పరికరం (తె 15)

**ముక్కోణపు ఆకురాయి** 1 కొయ్యపనిలో వాడే సామానుకు పదును పెట్టడానికి వాడే సాధనం (కో 16,23)

2 ఫిలిగ్రీ పనిలో వస్తువులకు మెరుగు పెట్టడానికి వాడే పరికరం (తె 8)

**ముక్కోణం** ఫిలిగ్రీ పనిలో చేసే డిజైన్. (తె 8)

**ముక్కోణం చీర్ణం** తోలు బొమ్మలకు ఆభరణాలు చేయుటానికి వాడే సాధనం చూ చిత్రం-122. (కో 37)

**ముక్కోణంవెట్నమొల** . లోహం పనిలో విగ్రహం సాపు చేయటానికి వాడే సాధనం (తె 12)

**ముఖం** తోలుబొమ్మలో ఒక భాగం (రా 2)

**ముగ్గురాళ్ళు** పర్యా సిరమిక్‌స్టోన్స్ పేపరు మట్టి బొమ్మలు చేయటానికి వాడే రాయి (కో 41)

**ముంచు** 1 మట్టి బొమ్మలకు మొదట కోటింగు వేయటానికి సుద్ద, తుమ్మ జిగురు కలిపిన నీటిలో బొమ్మని తడుపు (కో 41 తె 4)

2 నిర్మల్ బొమ్మలకు రంగులు వేయటానికి వాడే కుంచెల తయారీలో వెంట్రుకల చివర పాయింట్ లాగా రావటానికి నీటిలో ఉంచు (తె 4)

**ముంచితీయు** తోలుబొమ్మల తయారీలో వాడే చర్మాన్ని నీటిలో ముంచి పైకి తీయు (కో 30)

**ముంచుడు సుత్తె** లోహం పనిలో వాడే సుత్తి (తె 10)

**ముంజకాయడబ్బీ** ఫిలిగ్రీ పనిలో ముంజకాయ ఆకారంలో వెండి నగిషీ చేసిన వస్తువు (తె 8)

**ముంజేయి** తోలు బొమ్మలో భాగం చూ చిత్రం-10 III (కో 37)

**ముట్టె** లోహం పనిలో బాక్స్ మౌల్డింగ్‌లో మట్టిని కొట్టే కర్ర సుత్తి (తె 12)

**ముడి** 1 కొయ్యకు అక్కడక్కడ ఉండే సుడి (కో 32)

2 తోలుబొమ్మల తయారీలో భాగాల్ని కలిపి కట్టడం (రా 2)

**ముడి సరుకు** ఫిలిగ్రీ పనిలో వాడే వెండి కడ్డీ, లేక వెండి ముద్ద (తె 8)

**ముడుచుకుపోవు** తోలు బొమ్మలకు బదులు చేసే మైకా బొమ్మలు వేడి తగిలినప్పుడు ఉండ చుట్టుకొని పోవు (కో 15)

**ముండ్ల ఆకురాయి** కొయ్యపనిలో బొమ్మలు నునుపు రావటానికి వాడే సాధనం (తె 1,44, రా 4)

**ముండ్లు** : తోలుబొమ్మలాటలో బొమ్మలు తెరకు

తగిలించడానికి వాడే తుమ్మ ముండ్లు. (కో.37)

**ముతక :** 1 కొయ్య పనిలో బొమ్మలు నునుపు చేయటానికి వాడే గరుకు కాగితం గరుగ్గా, మందంగా ఉండటం (కో 16)

2 కొమ్మ బొమ్మల తయారీలో బొమ్మలు నునుపు రావటానికి వాడే కరాచీ ఆకు దళసరిగ ఉండటం (కో 1)

**ముత్తరాసి :** ఒక కులం పేరు (తె 9)

**ముత్యాల కమ్మలు :** ఫిలిగ్రీ పనిలో చేసే ఆభరణాలు చూ.చిత్రం-54. (తె.8)

**ముత్యాల లాకెట్టు :** ఫిలిగ్రీ పనిలో ఒక రకం లాకెట్టు. చూ చిత్రం-84(ఎ) (కో 27)

**ముత్యాలు :** ఫిలిగ్రీ పనిలో చేసే గొలుసులకు బిగించటానికి వాడే వస్తువులు (కో 27)

**ముత్తు :** కొయ్యపనిలో గుండ్లు గుండ్లుగ ఉబ్బుకొట్టడం (రా.4)

**ముత్తు కట్టే పీర్నం :** కొయ్యపనిలో బొమ్మలకు హారాలు మొదలైనవి చెక్కటానికి వాడే గాడి పోగరు (రా 4)

**ముదిరిన కాయ** బీరకాయ పీచు బొమ్మల తయారీకి వాడే బీరకాయ బాగా ముదరడం (కో 32)

**ముదుకు పేపరు** కొయ్యపనిలో చెక్కని నునుపు చేయటానికి వాడే (36 నెం.) గరుకు కాగితం (కో.34)

**ముదురుపాకం :** తోలుబొమ్మల తయారీకి వాడే మేక చర్మం ద్రావకం నీటిలో కొంతసేపు నాన నివ్వటం (కో.30)

**ముదురు రంగు :** తోలు బొమ్మలకు వేసే నలుపు రంగు దట్టంగ కనపడడానికి వేప బంగారం కలిపింది (కో.15)

**ముద్ద** 1. పేపరు, మట్టి, ముగ్గురాళ్ళ పొడి, నీళ్ళు కలిపిన కాగితం గుజ్జు బొమ్మల తయారీకి వాడే పదార్థం (కో.41)

2 లోహం పనిలో వాడే తేనె తుట్టె. (తె 12)

3. మట్టి బొమ్మల తయారీలో ప్లాస్టర్ ఆఫ్ ప్యారిస్‌ను నీటితో కలిపిన పదార్థం (రా 9)

**ముద్ద ఎండి :** ఫిలిగ్రీ పనిలో వాడే ముడి సరుకు (వెండి). (తె 8)

**ముద్దగ కలుపు** కొయ్య బొమ్మలకి పూసే మక్కు కొద్దిగ గట్టిగ కలపటం (కో 16)

**ముద్ద నానబెట్టు .** ప్లాస్టర్ ఆఫ్ ప్యారిస్, సుద్ద బొమ్మల తయారీలో రెంటిని నీటిలో తడిపి కొంతసేపు ఉంచటం (కో.25)

**ముందు భాగం** కాగితం, సుద్ద, మట్టి బొమ్మల తయారీలో బొమ్మకు ముందువైపు కనపడే భాగం (కో 27)

**ముందురేకు .** లోహం రేకుతో వాహనాలు చేసేప్పుడు ముందర చేసే భాగం చూ చిత్రం-20 4 (కో 31)

**ముప్పాతిక** లోహం బొమ్మల తయారీలో ముందు చేసే మైనం బొమ్మపై వండ్రు మట్టి పూసే మందం. (కో 18)

**మురుగులు** మట్టి బొమ్మల చేతుల మణికట్టు దగ్గర చేసే ఆభరణాలు (కో 27)

**ముల్లు :** కొయ్యపనిలో చిల్లులు చేయడానికి వాడే ఆగరుకు చివర సూదిగ ఉండే భాగం (కో 39)

**ముళ్ళు ·** తోలుబొమ్మలాటలో తెరకు బొమ్మలని గుచ్చటానికి వాడే ముండ్లు. (కో 7)

**మువ్వ** 1 ఫిలిగ్రీ పనిలో చేసే గజ్జె (తె 8)

2 చూ. గజ్జె తోలు బొమ్మలాటలో కాళ్ళకి కట్టుకునే గజ్జెలు. (కో 7)

**మువ్వసవ్వడి .** తోలు బొమ్మలాటలో కాళ్ళకు కట్టుకున్న గజ్జెలు కదిలినప్పుడు వచ్చే శబ్దం (కో 30)

**ముసలి తలకాయ** చేతికర్రలకు చేసే మొసలి తల రూపం గల పిడి. (కో 23)

**మూకుడు :** 1 లోహం పనిలో వాడే అట్టెం తయారీకి వాడే పాత్ర. (తె 12)

2 పూర్వం తోలు బొమ్మలాటకు దీపాలుగ వాడే పాత్ర (దీంట్లో ఆముదం పోసి వత్తిపెట్టి వెలిగిస్తారు). (కో 30)

**మూడు కట్టె సుత్తులు** లోహం పనిలో వాడే పెద్ద, నడిమి, చిన్న కొయ్య సుత్తెలు (తె 10)

**మూడుకీళ్ళు** · తోలు బొమ్మల తయారీలో కాళ్ళకు, చేతులకు పెట్టే కీళ్ళ సంఖ్య (కీలు = ముక్క) (కో 7)

**మూడు పలకల ఆకురాయి :** దంతం పనిలో ఉపయోగించే రంపాన్ని తయారు చేయడానికి ఉపకరించే సాధనం దీనిలో రంపం పళ్ళు దిగ్గొడతారు. (కో 9)

**మూడు పారలు** కొయ్య బొమ్మల తయారీకి ముందుగ (మోడల్) నమూనా బొమ్మల తయారీకి వాడే చెక్క (కో 16)

**మూత :** 1 దంతం పనిలో చేసే కంబతొట్టెపై భాగం. (కో 9)

2. తోలు బొమ్మలకు వాడే నలుపు రంగు తయారీలో పొగని పట్టడానికి వాడే కప్పు (కో 37)

**మూతచెక్కలు .** దంతం పనిలో చేసే కంబ తొట్టికి పైనా, కిందా వేసే దేవదారు చెక్కలు (కో 9)

**మూతరేకు** లోహం పనిలో వాడే కొలిమిలో నిప్పు ఎగరకుండా ఉండటానికి చుట్టూర పెట్టే రేకు (కో 8)

**మూతి :** 1 కొయ్యపనిలో చేసే చంచాకు చివర ఉండే గుంత భాగం (కో 35)

2 ఫిలిగ్రీ పనిలో వాడే కారులో భాగం (కో 8)

**మూర** · మోచేయి వరకు ప్రమాణం

1 పూర్వం లోహం పనిలో విగ్రహం తయారీలో వాడే కొలత (తె 12)

2 కొయ్య బొమ్మ పొడవు (కో 17)

**మూరెడు :** తోలు బొమ్మలాటలో తెరకు, లైట్లకు మధ్య ఉండవలసిన దూరం (కో 37)

**మూలం .** తోలు బొమ్మలాటకు ప్రారంభం (సురభి గ్రామం) (రా 2)

**మూలమట్టం** · కొయ్యపనిలోను, చిత్రలేఖనంలోను కొలతలు చూసుకోడానికి వాడే సాధనం చూ చిత్రం-160. (కో 9,15,16,19,28,35, రా 4,5,6,8)

**మూస :** ఫిలిగ్రీ పనిలోను, లోహం పనిలోను లోహాన్ని కరిగించడానికి వాడే పాత్ర చూ చిత్రం-19 (కో 1,28,31,33,39, తె 1,8,10,12,15, రా 5)

**మూసపోవకిదారి** లోహం పనిలో మూసలో కరిగించిన లోహం పోయడానికి వుండే గాడి. (కో.8)

**మూసపోయు .** లోహం పనిలో బొమ్మల అచ్చు మీద కరిగించిన లోహాన్ని పోయు చూ పోత (కో.25, తె 8)

**మూస లేపట్టు :** లోహం పనిలో కొలిమి నుంచి మూసను లేవదీయడం. (తె 12)

**మూసలో కరిగించు .** లోహం పనిలో మూసలో లోహాన్ని ద్రవంగా మార్చు (తె 12)

**మెటల్** పర్యా లోహం, సరుకు, సొమ్ము బొమ్మలు చేయడానికి వాడే ద్రవ్యం (కో 19,39, తె 8,12)

**మెటల్‌పాలిష్** లోహం పనిలో వస్తువులు మెరుగు రావటానికి వాడే ద్రవ్యం (కో 4,31)

**మెటల్‌సబ్బు** · లోహం పనిలో వస్తువులు మెరుగు రావటానికి వాడే సబ్బు (కో 13)

**మెట్న** 1 కొయ్యపనిలో, రాతి పనిలో కొలతలు చూడడానికి వాడే మూలమట్టం (ఒళంబి) చూ చిత్రం-111. (తె 3,6, రా 5)

2 చేతికర్రల పిడి నమూనా (మూలమట్టం మాదిరి) (తె 5)

**మెట్నమొల** · లోహం పనిలో రేకుని సాపుచేయడానికి వాడే సాధనం. (తె 10,12)

**మెడ .** 1 కొయ్యపనిలో, లోహం పనిలో చేసే బొమ్మలలో భాగం. చూ.చిత్రం-20.2, 23.2 (రా.4; కో 31)

**మెడల్సు** . ఫిలిగ్రీ పనిలో చేసే వస్తువులు బహుమతులుగా ఇచ్చే పతకాలు (తె 12)

**మెండు(చేయు, తీయు)** . కొయ్యపనిలో కొయ్యకు బొమ్మ ఆకారం రఫ్‌గ చేయటం (తె.7, రా 4)

**మెండెం** : కొయ్యపనిలో వాడే చెక్కకుండే హెచ్చు తగ్గులు (కో 15, రా.5)

**మెత్తన** : 1 పూర్వం నిర్మల్ బొమ్మలకు వాడే తెల్లరంగు తయారీలో నత్తగుల్లల్ని బాగా నూరటం (తె 4)

2 లోహం రేకుమీద బొమ్మలు చెక్కేప్పుడు ముందు రేకుని వేడిచేస్తే మృదువుగ అవటం (రా.11)

3 మక్కు బొమ్మలకి వాడే పోలిక చెక్క మృదువుగ ఉండటం (రా 13)

4 లోహం పనిలో మైనాన్ని వేడిచేస్తే కరగటం (తె.12)

5 కొయ్యపనిలో బొమ్మలు చేయడానికి వాడే కొయ్య మృదువుగ ఉండటం (కో 35)

6 లోహం పనిలో ముందుమట్టి బొమ్మ చేయడానికి చౌడుమట్టి, గుడ్డగుండు, రేగడిమట్టి మూడిటిని మెత్తగ చేయటం. (కో 1)

**మెత్తపిండి** . కొయ్యబొమ్మలకు పూసే లప్పం (తె 7)

**మెత్తబడు** : ఫిలిగ్రీ పనిలో వెండి తీగని వేడిచేస్తే వంచటానికి వీలుగ అవటం (కో 27)

**మెత్తుడుపని** : కొయ్య బొమ్మలకి పైన మక్కుపూసే పని (తె.6)

**మెరి** : పర్యా తోపుడు ఆపు కొయ్యపనిలో వాడే తోపుడులో అలుగుకు ముందుపెట్టే ఇనప/చెక్క ముక్క (కో 41, రా.4,5,6)

**మెరిగించు** : 1 అడ్డ, కర్ర పనిలో లక్కరంగు వేసిన బొమ్మలను అడ్డమీద మొగలి ఆకుతో రుద్ది మెరుగు పెట్టు (కో.11,12)

2 లోహం పనిలో వస్తువులకు మెరుపు తెచ్చు (తె 12)

**మెరిగించే సాన** ఫిలిగ్రీ పనిలో వాడే సానరాయి, సానపక్క, సానముక్క (తె 8)

**మెరుక్కడ్డీ** ఫిలిగ్రీ పనిలో మెరుగు చేయడానికి వాడే బడ్డీ (తె 8,12)

**మెరుగు(చేయు)** 1 లోహం పనిలో వస్తువులకు నునుపు చేయటం (కో 4,28,39, తె 12)

2. ఫిలిగ్రీ పనిలో వస్తువులకు నునుపు చేయటం (తె 8)

3 పర్యా మెరుపు కొమ్ము బొమ్మలకు మెరుగు పెట్టడం (కో 32)

**మెరుగు చిత్రిక** కొయ్యపనిలో బొమ్మలకు తుదిమెరుగులు పెట్టే చిత్రిక. (కో.16)

**మెరుగుదండ** లోహం పనిలో పళ్ళేలు చేసేప్పుడు వాడే సాధనం (కో 4)

**మెరుగుపూస** ఫిలిగ్రీ పనిలో పూర్వం మెరిగించడానికి ఇప్పటి బ్రష్‌కి బదులుగ వాడే పరికరం (మెరుగు పూసల గుత్తి) (తె 8)

**మెరుగుయిసుక** ఫిలిగ్రీ పనిలో వస్తువు మెరుగు రావటానికి వాడే యిసుక (తె 15)

**మెరుగులేగ** ఇత్తడి బిందెలు చేసేప్పుడు వాడే సాధనం (కో 4)

**మెరుపు** : లోహం పనిలో వస్తువులకు పెట్టే మెరుగు. (తె 1)

**మెరూన్** : ఇటుకపొడి రంగు (కో 16, తె 1)

**మెల్లవచ్చు** . తోలు బొమ్మల తయారీలో బొమ్మలు ఎదురుగ వేస్తే చూపులో తేడా రావటం (అందుకనే బొమ్మల్ని పక్క పక్కగ వేస్తారు) (కో 30)

**మెలి** లోహం పనిలో చేసే డిజైన్ (కో 31)

**మెలిక** కొయ్య పనిలోను లోహం పనిలోను చేసే డిజైన్ (కో 33, తె.12,13)

**మెలిపోగర** లోహం వాహనాల తయారీలో వాడే సాధనం (కో 31)

**మెలి శీర్లం** · కొయ్యపనిలో వాడే పరికరం (రా 5)

**మెలెట్టు** పర్యా కర్రసుత్తి, టెక్క కొయ్య పనిలో ఉలిని చెక్క మీద పెట్టి ఆ ఉలి మీద కొట్టటానికి వాడే సాధనం చూ కర్ర సుత్తె (కో 16)

**మేకచర్మం** పర్యా మేకతోలు రూపా మేక చరమం తోలు బొమ్మల తయారీకి వాడతారు (కో 5,7, 13,30,37, తె 1,2,3, రా 2,10)

**మేకతిత్తి** . లోహం పనిలో వాడే కొలిమిలో పంకా స్థానంలో వాడే తిత్తి (తె 12)

**మేకతోక** రంపం పొట్టు బొమ్మలు తయారీలో వాడే కుంచెలు చేయడానికి దీని వెంట్రుకలు వాడతారు (తె 9)

**మేకతోలు** మేక చర్మం (కో.28, తె 2)

**మేకపెంటి** ఆడమేక దీని చర్మం తోలు బొమ్మలకు వాడ్తారు (రా 10)

**మేకపోతు** మగమేక. దీని చర్మం తోలు బొమ్మలకు వాడ్తారు (రా 10)

**మేక వెంట్రుకలు** · కొయ్య బొమ్మలకి రంగులు వేసే కుంచెకి చివర ఉండే రోమాలు (కో 19, తె.1,4, రా 9)

**మేకు** . చీల

1 లోహం పనిలో చేసే విగ్రహం అచ్చుమీద చిల్లులు చేయటానికి వాడే సాధనం (తె 12)

2 లోహం పనిలో విగ్రహాలను పిడకల దాలిలో పెట్టి మైనం పోసేప్పుడు విగ్రహం కదలకుండ ఉండటానికి వాడే పరికరం (కో 33)

3 కొయ్యపనిలో చేసే బొమ్మలకి భాగాలు కలిపేప్పుడు వాడే మేకు (కో 16)

4. తోలు బొమ్మల తయారీలో వాడే చర్మాన్ని శుభ్రం చేసేప్పుడు కదలకుండ ఉండటానికి చర్మానికి కొట్టడానికి వాడే ఇనపమేకు (కో 7)

**మేజు** కొయ్యపనిలో చేసే టేబుల్ (తె 13)

**మేనమావ** . తల్లి తమ్ముడు (తె 7)

**మేలి** పర్యా మేలిరకం మంచిరకం (కో 19,40)

**మేలు తగరం** లోహం పనిలో విగ్రహాల తయారీలో వాడే మంచి తగరం (కో 8)

**మేస్త్రి** . కొయ్యపనిలో మంచి పనివాడు (తె 13)

**మైకా** తోలు బొమ్మలకి బదులుగ చేసే మైనం బొమ్మలు తయారీలో వాడే పాలితిన్ (కో 13)

**మైదం చెక్క** పర్యా మైనం షీట్ ఫిలిగ్రీ పనిలో మైనం కరిగించి పోసిన చెక్క (తె 8)

**మైదం బొమ్మ** లోహం పనిలో తేనెతుట్టె మైనంతో చేసిన నమూనా బొమ్మ దీన్ని మోల్డింగ్‌లో వాడ్తారు (తె.12)

**మైదా** . 1 కాగితం గుజ్జు బొమ్మల తయారీలో కలిపే పిండి (కో 17,41)

2 ఫిలిగ్రీ పనిలో వస్తువులకి రాళ్ళు బిగించేప్పుడు ముందు వస్తువుని డొలపటానికి వాడే ద్రవ్యం (కో 27)

**మైనపు విగ్రహం** · చూ మైదం బొమ్మ (కో 34)

**మైనం** . 1 లోహం పనిలో నమూనా బొమ్మ చేయటానికి వాడే ద్రవ్యం (కో 1,2,3, తె 1,8)

2 కొయ్య బొమ్మలకు పూసే లప్పంతో కలిపే ద్రవ్యం. (రా 4, కో 34)

3 కొయ్య పనిలో చేసే చెక్క వస్తువులకి ఉండే చిల్లులు పూడ్చటానికి వాడే బంక (కో 35)

4. పర్యా తేనెమైనం కొయ్య బొమ్మలకి ఫినిషింగ్ చేయటానికి ముందు పూసే జిగురు (కో 41)

**మైనం కర్ర** పర్యా సరుగోలు కమ్మె లోహం పనిలో మైనం కరిగించేప్పుడు కలపడానికి వాడే కర్ర (తె 12)

**మైనం పూత** : లోహం పనిలో ముందు మట్టితో బొమ్మవేసి పైన మైనం పూయటం (కో 8)

**మైనం బొమ్మ** : చూ. మైదం బొమ్మ (తె 1)

**మైనం ముద్ద** లోహం పనిలో నమూనా బొమ్మ తయారీకి వాడే ముద్ద (తె 12)

**మైనం పొంచ** : లోహం పనిలో చేసే మైనం నమూనా (తె 12)

**మైల** · 1. ఫిలిగ్రీ పనిలో మూసలో లోహం కరిగిస్తే వచ్చే మురికి ఈ; మురికి పోవటానికి నవాసారం కలుపుతారు (తె 8)

2. లోహం పనిలో వస్తువుని అతికేప్పుడు అక్కడ ఉన్న మురికి (తె 12)

**మైలపడు** . ఫిలిగ్రీ పనిలో లోహాన్ని మూసలో కరిగిస్తే మురికి వచ్చు. (తె 8)

**మైలుతుత్తం** : వెండి వస్తువుకు పెట్టే వన్నె మిశ్రమంలో వాడే ద్రవ్యం (తె.15)

**మొగిలాకు** : పర్యా మొగిలిపువ్వు ఆకు, మొగిలిరేకు మొగిలి చెట్టు ఆకు దీనితో లక్క రంగు వేసిన బొమ్మలను రుద్దితే రంగు మెరుపు వస్తుంది (కో 15)

**మొగిలిపువ్వు ఆకు** : చూ. మొగిలాకు. (కో 10)

**మొగిలిరేకు** కొమ్ము బొమ్మలను నునుపు చేయటానికి వాడే ఆకు. చూ మొగిలాకు చూ చిత్రం-6 XII (కో.32)

**మొగురం** · పూర్వం ఫిలిగ్రీ పనిలో వస్తువులు నునుపు చేయటానికి వాడే స్తంభం. (తె 8)

**మొదటి పూత** · 1. కొయ్య బొమ్మలకు ముందు వేసే రంగు. (కో 16)

2 మట్టి బొమ్మలకు రంగు వేసే ముందు పూసే తుమ్మ జిగురు, సుద్ద కలిపిన ద్రవ్యం. (కో 27)

**మొద్దుకలం** : రంపం పొట్టు బొమ్మలకు రంగులు వేయటానికి వాడే పెద్ద కుంచె చూ దొడ్డు బులుసు (కో 40)

**మొదాలు** : మొదట, ముందర (తె 7)

**మొద్దు** : 1 కొయ్య బొమ్మల తయారీకి వాడే చెక్కదుంగ (కో 26,31,35, తె 4,13, రా 4,4)

2 లోహం పనిలో రేకులను సుత్తెతో కొట్టడానికి అడుగున పెట్టుకునే దుంగ (తె 12)

3 లోహం వాహనాల తయారీలో వాడే కొరమొలలో భాగం దళసరి కర్ర (కో 31)

**మొద్దు కోసిన తుమాలు** రంపం పొట్టు దీనితో బొమ్మలు చేస్తారు (కో 7)

**మొల** 1 లోహం పనిలో శకనం పని చెయ్యడానికి వాడే మేకు (తె 1,12)

2 రంపం పొట్టు బొమ్మల తయారీలో వాడే కంరానలో భాగం. (తె 9)

3 ఫిలిగ్రీ పనిలో వాడే బర్మాలో భాగం చూ చిత్రం-113 3. (తె 8)

**మొలకట్టు** కొయ్యపనిలో కొలతలు తీసుకోడానికి వాడే సాధనం (కో 35)

**మొలాకురాయి** . కొయ్యపనిలో సైన్ చేయడానికి వాడే రాయి. (రా 4)

**మొసల నమూనా** చేతికర్రలకు చేసే మొసలి మూతి పిడి నమూనా (తె 5)

**మొహం** ముఖం (రంపం పొట్టు బొమ్మలకు ఉండే ముఖం) (తె.9)

**మోల్ట్** 1 పేపరు మట్టి బొమ్మల తయారీలో వాడే అచ్చు (కో 41)

2 లోహం పనిలో విగ్రహం పోత పోయడానికి వాడే అచ్చు (కో.1)

**మోల్డింగ్** · లోహం పనిలో చేసే నమూనా రూపం (తె 1; కో.17,28)

**మోల్డింగ్ గుల్ల :** లోహం పనిలో విగ్రహాలు చేయడానికి వాడే సాధనం (కో 8)

**మోస్తరు** నమూనా కొయ్యపనిలో వస్తువులు చేసేప్పుడు ముందు రఫ్‌గ చేసే ఆకారం (కో 35)

**మోహన** తోలు బొమ్మలాటలో వాడే రాగం పేరు (రా 2)

**మోచు** లోహం పనిలో చేసే డిజైన్ (తె.10,12)

**మోటఅలుగు :** మట్టి బొమ్మలో పెద్ద పెద్ద ఆకారాలను మలచటానికి వాడే పనిముట్టు (కో 17)

**మోట రంపం :** దంతం పనిలో ఉపయోగించే ఒక రంపం కంబ చెక్కను గాని, దేవదారు చెక్కను గాని కోయడానికి ఉపయోగిస్తారు. (కో 9)

**మోటలక్క :** అద్దకద్ర పనిలో వాడే తొందరగా కరగని లక్క నల్ల లక్క (కో.12)

**మోటారు :** ఇత్తడి బిందెలకు నగిషీ పట్టడానికి వాడే యంత్రం. (కో 4)

**మోటారు బ్యాటరీ .** వెండి వస్తువులకు మెరుగు రావటానికి వాడే నైట్రిక్ యాసిడ్ నీళ్ళు పోయడానికి వాడే వస్తువు (మోటార్లకు వాడే బ్యాటరీ ఖాళీ పెట్టె) (తె.1)

**మోడరన్ ఆర్ట్ :** కొయ్యపనిలో చేసే కొత్త తరహా బొమ్మలు. (రా 44)

**మోడల్ :** నమూనా, ఆకారం (కో 4,36, తె 1,9, రా 7)

**మోడు :** వరస లోహం పనిలో ఒకసారి పోతపొయ్యడానికి సరిపోయే మట్టి ప్రమాణం (తె 12)

**మోతాదు :** తోలుబొమ్మల తయారీకి వాడే చర్మాన్ని సరిగ్గ తగిన వేడిలో కాచటం. (రా 10)

**మోదుగుపూలు ·** తోలు బొమ్మల తయారీలో వాడే ఎరుపు రంగు చేయడానికి వాడే పూలు (రా 12)

**మోపు :** 1. ఫిలిగ్రీ పనిలో వెండి రేకుమీద డిజైన్ చెక్కేప్పుడు కింద ఆధారంగా పెట్టే లక్క (కో 33)

2. పాత విగ్రహాలకు కింద ఆధారంగా వేసే పీఠం. (కో 33)

**మోపుచూడు** కొయ్యపనిలో చెక్కలైను, మూలలు సమానంగ ఉండేట్లు సరిచూచు (కో 16)

**మౌల్డ్(చేయు) ·** చూ మోల్డ్ (తె 10,12)

**మౌల్డింగ్ బాక్స్** చూ దరియా పెట్టె లోహం పనిలో పోతపోయడానికి ఉపయోగించే పెట్టె (తె.1)

## య

**యమున ·** తోలుబొమ్మలాటలో పాడే రాగం పేరు (రా 2)

**యాష్ట్రే** దంతం పనివారు చేసే వస్తువు సిగరెట్ కాల్చేప్పుడు బూడిద రాల్చడానికి వాడేది (కో.9)

**యాసలు ·** కొయ్యపనిలో వచ్చే ఎక్కువ, తక్కువ భాగాలు. (రా 5)

**యెద** కొయ్యబొమ్మలో ఉండే మధ్య భాగం (రా 4)

## ర

**రకం ·** 1 చేతికర్రల తయారీలో పిడులు చెక్కే తీరు (20 రకాలు చెక్కుతారు) (తె 5)

2 నిర్మల్ బొమ్మలకు వేసే ఎరుపు రంగులో భేదం (జాజురంగు, సింగ్‌రూప్, చందూరం). (తె.4)

**రక్కసి పీరులు ·** తోలు బొమ్మలాటలో పాత్రలు తోలు బొమ్మలు (రా 2)

**రక్తదానం** 1. తోలుబొమ్మలాట ప్రారంభించేప్పుడు ఇచ్చే బలి (రా.2)

2 కొయ్యపనిలో బొమ్మ పూర్తయిన తర్వాత దిష్టి తగలకుండ ఇచ్చే బలి (రా 4)

**రంగరించు :** 1 కొండపల్లి బొమ్మలకు వేసే నలుపు రంగు తయారీలో మసిని, తుమ్మ జిగురుని కలిపి చేతివేలితో బాగా కలుపు (కో 26)

2 తోలు బొమ్మలకు వాడే నలుపు రంగు తయారీలో వేలితో రుద్దు (కో 15)

**రంగు కొమ్ములు :** చేతికర్రల తయారీలో పిడికి వాడే గేదె కొమ్ములలో రకం (కో.23)

**రంగుజారిపోవు :** తోలు బొమ్మలకు రంగు నిలవకుండా పోవు (కో 15)

**రంగుపొడి :** చూ రంగు, కలరు కొండపల్లి బొమ్మలకు వాడే రంగు పౌడరు (కో 26,29,42)

**రడీమేడ్ ·** తయారుచేసి సిద్ధంగా ఉన్న బొమ్మలు (రా 4)

**రత్నాలరాసి :** కొయ్య బొమ్మలకు చేసే కిరీటం డిజైన్ (తె 7)

**రథకేతనం ·** తోలు బొమ్మలాటలో వాడే జెండా (ం 2)

**రద్దు** అడ్డకర్ర పనిలో వచ్చే పనికిరాని కొయ్యముక్కలు (కో 12)

**రన్నింగు :** లోహం పనిలో విగ్రహాలు నునుపు చేయటానికి వాడే యంత్రం పని చెయ్యటం (కో 8)

**రందపత్తి .** దూగోడలో భాగం (తె 3)

**రంధా ·** జస్త రాగి బొమ్మల తయారీలో బొమ్మల భాగాలు అతకటానికి వాడే పరికరం (తె 1)

**రంధ్రం ·** చిల్లు (కో 1,7,24,35,41, తె 1,6,8,12; రా 5,13)

**రఫ్ .** లోహం పనిలో పోతపోసిన విగ్రహం సరిగ ఉండక పోవటం (తె 1)

**రఫ్ఆకురాయి** లోహం పనిలో బొమ్మలు నునుపు చేయటానికి వాడే పరికరం (తె 1)

**రఫ్ఫైలింగ్ :** నిర్మల్ బొమ్మల తయారీలో 50 నెం॥ ఉప్పు కాగితంతో నునుపు చేయటం (తె 4)

**రఫ్వర్క్ :** కొయ్యబొమ్మ చెయ్యటానికి ముందు చెక్కపై బొమ్మ ఆకారం చిత్తుగ చెయ్యటం (కో 41)

**రబ్చేయు :** నిర్మల్ బొమ్మల తయారీలో ట్రేస్‌పేపర్ మీద వాషింగ్ పౌడరు వేసి రుద్దటం (తె 4)

**రంపపు పొడి .** చెక్కని రంపంతో కోసినప్పుడు వచ్చే పొట్టు కొయ్య బొమ్మలకు పూసే ముక్కు తయారీకి వాడ్తారు. (కో 19, రా 13)

**రంపం .** కొయ్యపని, కొమ్ముపని, దంతం పని, లోహం పనిలో కోయటానికి వాడే సాధనం చూ ఆరా. చూ చిత్రం-108 (కో 1,6,7,9,10,12,13,16, 23,28,31,41, తె 1,2,3, 4,7, రా 4,5,6,8)

**రంపం పల్లు ·** రంపానికి చివర (కోసే భాగం) (కో.9: తె 4,13)

**రంపం పొట్టు ·** 1 ఫిలిగ్రీ పనిలో వస్తువులకి పాలిష్ పెట్టి చెమ్మ లాగేందుకు బోర్లించటానికి వాడే పొడి (కో 27)

2 రంపం పొట్టు బొమ్మల తయారీలో వాడే ద్రవ్యం. (తె 9)

3 చూ. రంపపు పొడి చూ కట్టిగోశినపొట్టు. (కో 26,39, తె 4,13)

**రంపం పొట్టుబొమ్మ ·** రంపం పొట్టు అతికించిన పొణికె కర్ర బొమ్మ చూ పొట్టు బొమ్మ (తె.9)

**రంపం కోత** చెక్కని రంపంతో కోయటం (కో 40)

**రంపం రేకు** కొయ్య పనిలో కోయటానికి వాడే రంపంలోని రేకు భాగం (రా.5)

**రంపి** పర్యా రాపి చూ ఆరె తోలు బొమ్మల తయారీలో వాడే చర్మాన్ని కోయటానికి వాడే చిన్న రంపం (కో 5,7,13, రా 10)

**రంపె** రంపం (తె 4,5)

**రవ్వ** వెండి బొమ్మలని ఆకురాయితో నునుపు చేసేప్పుడు వచ్చే వెండి పొడి (తె 8)

**రవుండు(ముక్క) :** కొయ్యపనిలో బ్లాకులు చేయటానికి వాడే గుండ్రని కొయ్యముక్క (కో 41)

**రవుండు పోగరు .** కంచు బొమ్మల తయారీలో వాడే సాధనం (కో 39)

**రవుండు వులి** · కొయ్య పనిలో చేసే చంచాకి గుంత చేయటానికి వాడే ఉలి (కో 35)

**రవుండ్‌షేప్** . కొయ్యపనిలో చేసే బొమ్మకు అక్కడక్కడ చేసే గుండ్రని ఆకారం (కో 19)

**రవుండుసీవం** కొయ్యమీద డిజైనులు చెక్కటానికి వాడే సాధనం (కో 34)

**రవ్వల నెక్లేసు** · ఫిలిగ్రీ పనిలో చేసే ఆభరణం చూ చిత్రం-99 (తె 8)

**రసకర్పూరం** . అద్దపనిలో వాడే లక్కకి తెలుపు రంగు కోసం పూర్వం వాడే ద్రవ్యం. (కో 12)

**రసం** తోలుబొమ్మకు వేసే ఎరుపు రంగు తయారీలో పూర్వం వాడే పాపచ్చికాయులో ఉండే ద్రవ పదార్థం (రా.10)

**రాకింగ్** కొయ్యగుర్రం బొమ్మ మీద ఎక్కి ఊగటం (కో 16)

**రాకు** · లోహం పనిలో బొమ్మల్ని ఆకురాయితో గీకు (తె 12)

**రాగం(తీయు)** తోలు బొమ్మలాటలో పద్యాలు పాడేప్పుడు తీసే ఆలాపన (తె 1, రా 2)

**రాగి** : ఒక లోహం (కో 1,7,8,29,31,33, తె 1,3,8,12, రా 5,11)

**రాగిపిండి** : మక్కు బొమ్మల తయారీలో వాడే మక్కుని చేసేప్పుడు చింతగింజల పొడి, రంపం పొట్టులతో కలిపే రాగుల పిండి (రా 13)

**రాగిబుర్ర** . తోలు బొమ్మలాటలో వాడే ముఖవీణకి ఉండే రాగికట్టు. (రా 10)

**రాజకుమారి నెక్లేసు** ఫిలిగ్రీ పనిలో చేసే ఒక ఆభరణం చూ.చిత్రం-100 (తె 8)

**రాజమండ్రి మట్టిమూస** లోహం పనిలో లోహాన్ని కరిగించడానికి వాడే పాత్ర (కో 8, తె 12, రా 5)

**రాజస్థాన్ పిస్టం బట్టీ** గాజుల తయారీలో రాజస్థాన్‌లో చేసే పద్ధతిలో ఉండే పొయ్యి (తె 1)

**రాట్నం** ఫిలిగ్రీ పనిలో వెండితీగ వడితిప్పటానికి వాడే సాధనం (తె 1,8)

**రాతకలం** రంపం పొట్టు బొమ్మలకి రంగులు వేయటానికి వాడే చిన్న కుంచె (కో 40)

**రాతెండి** అల్యూమినియం (తె 12)

**రాధాకృష్ణుడు** . కొయ్యశిల్పం. (రా 4)

**రాపణం** . కొయ్యపనిలోను, లోహం పనిలోను ఆకురాయితో రాయటం. (తె 4,12)

**రామచిలుకమూతి** . చేతికర్రల తయారీలో పిడికి చేసే బొమ్మ (తె 5)

**రామరంగు** . చూ నీలం తోలు బొమ్మలకు వాడే రాముని దేహం రంగు (నీలం). (కో 13)

**రామలక్ష్మణసీతా పట్టాభిషేకం** కొయ్యపనిలో చేసే కొయ్య శిల్పం (రా 4)

**రామలాకు** : రూపా రాములాకు లోహం పనిలో మైనం బొమ్మ చేయటానికి వాడే మైనం తయారీలో నల్లగా రావటానికి వేసే ద్రవ్యం (రా.5)

**రాములవారిపెట్టు** కొయ్యపనిలో చేసే బొమ్మ (రాముడు, సీత, లక్ష్మణుడు, హనుమంతుడు) (కో 41)

**రాయి** · ఫిలిగ్రీ పనిలో చేసే ఉంగరంలో వాడే రాయి చూ గోట (తె 8)

**రాయిపూస** కొయ్యపనిలో బొమ్మలకు కళ్ళకు వాడే పూస చూ నల్లపూస (రా.4)

**రాయు** 1 లోహం పనిలో బొమ్మల్ని ఆకురాయితో రుద్దు, చింతపండుతో తోము. (కో.18, తె 12)

2 చర్మం నిలవ ఉండటానికి పైన ఉప్పు పూయు చూ పూయు. (రా.12)

**రాలిపోవు** తోలుబొమ్మల తయారీలో చర్మానికి సున్నం

పెడితే వెంట్రుకలు ఊడిపోవు. (రా 2)

**రావడి** · రంపం పొట్టు, కొయ్యబొమ్మలకు పూసే మక్కు తయారీలో వాడే ద్రవ్యం (తె 44)

**రాళ్ళబుట్ట** . ఫిలిగ్రీ పనిలో చేసే చెవులకు పెట్టుకునే ఆభరణం (కో 27)

**రాళ్ళ పాపిడి గొలుసు** : ఫిలిగ్రీ పనిలో చేసే ఒక ఆభరణం చూ చిత్రం-70 (కో.27)

**రాళ్ళమాటీలు** · ఫిలిగ్రీ పనిలో చేసే ఒక ఆభరణం చూ చిత్రం-72 (కో 27)

**రాళ్ళముక్కువత్తులు** : ఫిలిగ్రీ పనిలో చేసే ఒక ఆభరణం చూ.చిత్రం-56; 57 (కో 27)

**రాళ్ళరాగిడి** : ఫిలిగ్రీ పనిలో చేసే ఒక ఆభరణం చూ.చిత్రం-68 (కో 27)

**రాళ్ళలాకెట్టు** : ఫిలిగ్రీ పనిలో చేసే ఒక ఆభరణం చూ.చిత్రం-78 (తె 8)

**రాళ్ళలోలాకులు** : ఫిలిగ్రీ పనిలో చేసే ఒక ఆభరణం. (కో 27)

**రింగు** · ఫిలిగ్రీ పనిలో చేసే తాళం గుత్తిలో భాగం (తె 8)

**రిపేరు** . కొయ్యబొమ్మల్ని పాడైతే బాగుచేయించటం. (కో 20; తె.3,7)

**రిబ్బను** · పత్తి, బట్ట బొమ్మల తయారీలో డిజైన్స్‌కి వాడే పీలిక (రా 7)

**రివిట్** : లోహం రేకుతో వాహనాల తయారీలో ముందు భాగాలు విడివిడిగ చేసి తరువాత భాగాలన్ని కలిపి గట్టిగ కదలకుండ చేయటం (కో 31)

**రీపరు** : మంచం తయారీలో పెట్టే చివరి భాగం (కో 38)

**రుద్దు** : కొయ్యబొమ్మల్ని, కాగితం గుజ్జు బొమ్మల్ని, కొమ్ము బొమ్మల్ని నునుపు చేయటానికి గరుకు పేపరుతో, ఆకురాయితో తోము చూ నునుపు (కో 1,15,16, 27,31,41, రా 3,5)

**రుద్రవేణి** కొయ్యబొమ్మలు చేయటానికి ఉపయోగించే కొయ్య. (రా 13)

**రుద్రాక్ష** · తోలుబొమ్మలకు చెక్కే డిజైను (రా.4)

**రుద్రాక్షకాయ** : కొయ్యపనిలో బొమ్మలకు చెక్కే డిజైను. (రా 4)

**రుద్రాక్షపూస** . కాగితం గుజ్జు, మట్టి బొమ్మల తయారీలో శివుడు, కాళికాదేవి బొమ్మల మెడలో చేసే పెద్ద పూస(లు) (కో 10)

**రుద్రాక్ష మండపం** పలకలుగా ఉండే గుండ్రటి మండపం (కో 33)

**రుద్రాక్షమాల** తోలుబొమ్మలకి మెడలో చెక్కే ఆభరణం. (రా 2)

**రుబ్బు** : కొయ్యబొమ్మలకు, రంపం పొట్టు బొమ్మలకు పూసే మక్కు తయారీలో చింతగింజల్ని మెత్తగ చేయు (తె.7,9,40, రా 13)

**రూపకతాళం** : తోలుబొమ్మలాటలో వాడే మృదంగం మీద వాయించే ఒక తాళం (రా 2)

**రూపం** . లోహం పనిలోను, కాగితం గుజ్జుతోను చేసే బొమ్మ ఆకారం చూ ఆకారం (కో.17,33)

**రూపాయి** · పదహారు వంతులు (అణాలెక్క). పూర్వం ఫిలిగ్రీ పనిలో వాడే కొలత. (తె 8)

**రూపాయి మందం** బొమ్మలు చెక్కటానికి వాడే లోహం రేకు దళసరి (1/10 అంగుళాలు) (కో.1)

**రెక్క** . కొమ్ము బొమ్మల తయారీలో పక్షికి చేసేది (కో 1)

**రెట్టలు** తోలు బొమ్మలకి చేసే భుజాలు చూ చిత్రం-10 II (కో 37)

**రెడ్** : పత్తి, బట్ట బొమ్మలకు వాడే ఎరుపు రంగు దారం. (రా.7)

**రెడ్‌పాత్తిరం** : గవ్వ బొమ్మల తయారీలో చేసే ఎరుపు పాత్ర. (రా 5)

**రెడ్‌షెంకు** · గవ్వ బొమ్మ (రా.5)

**రెడీమిక్చర్‌పెయింట్** కొయ్య బొమ్మలకి మొదట ఇచ్చే కోటింగ్ (కో.16)

**రెప్పాలకొయ్య :** కొయ్య బొమ్మలు చేయటానికి పూర్వీకులు ముఖ్యంగ వాడే కొయ్య (కో 41)

**రెమ్మ** కొయ్య పనిలో చేసే పిట్టల బొమ్మలో భాగం (రా 4)

**రేక :** కొయ్య పనిలో డిజైన్ల తయారీలో కొట్టే గీత (రా.4,5,6)

**రేకకొట్టే గూటం** · పర్యా. చిన్నగూటం, రేకల సీర్నం. కొయ్యపనిలో డిజైన్లు చెక్కటానికి వాడేది చూ గొడిసీర్నం (రా 4,5,6)

**రేకు :** 1 కొయ్యపనిలో బొమ్మలు చేసే ముందు నమూనా బొమ్మ చేయటానికి వాడే ద్రవ్యం (రా 4)

2 లోహం పనిలో వాడే కొలిమిలో నిప్పు ఎగరకుండా అడ్డు పెట్టడానికి వాడే వస్తువు (కో 8)

3 నిర్మల్ బొమ్మల తయారీలో చెవుల తయారీకి వాడే వస్తువు (తె 8)

4 ఫిలిగ్రీ పనిలో బొమ్మల తయారీకి వాడే లోహం రేకు (కో 33)

5. శకనం పనిలో భాగం. చూ చిత్రం-14 3. (తె 8)

**రేకుగుర్రం** · లోహం బొమ్మ చూ చిత్రం-20 (తె.12)

**రేకుగొట్టం :** కొయ్య బొమ్మలకు రంగులు వేయటానికి వాడే కుంచెకి చివర ఉండే భాగం (తె 1)

**రేకుమిషను :** పర్యా షీట్ రోలింగ్ మిషన్, షీట్ డ్రాయింగ్ మిషన్. ఫిలిగ్రీ పనిలో వెండి లోహపు ముద్దని రేకు ఆకారంలో తీసే యంత్రం (తె 15)

**రేఖల చీర్లం :** కొయ్య బొమ్మలకి జీవరేఖలు చెక్కటానికి వాడే పరికరం. (కో 41)

**రేగడిమట్టి :** లోహం పనిలో విగ్రహం పోత పోసే ముందు చేసే అండ తయారీకి వాడే బంకమన్ను (కో.1)

**రేడ్‌గాడి :** ఫిలిగ్రీ పనిలో వెండి కడ్డీలాగ రావటానికి వెండిని కరిగించి పోసే గాడి (తె 8)

**రేపర్** కొయ్యపనిలో కొయ్యని బద్దగ కోసిన ముక్క (రా 4)

**రేపరుబద్ద** చూ రీపరు (రా 5)

**రేపాలకొయ్య** పర్యా వైట్‌వుడ్ బొమ్మల తయారీకి వాడే కొయ్య చూ తెల్లకర్ర (రా 4)

**రేమిచెట్లపట్లు :** అడ్డకర్ర పనిలో పూర్వం లక్కకి బదులుగ వాడే బంక (కో 11)

**రేస్** నిర్మల్ బొమ్మల తయారీలో వాడే పొణికెకర్ర మెత్తగ ఉండటం (తె 4)

**రైలుపట్టా** లోహం పనిలో సాపు చేసేప్పుడు అడుగున పెట్టే వస్తువు (తె 12)

**రైలుబొగ్గు** లోహం పనిలో కొలిమిలో వాడే బొగ్గు. (తె 1,10,12)

**రొమ్ము** · బొమ్మలో గుండె భాగం (కొయ్యబొమ్మ, రంపం పొట్టు బొమ్మ) చూ చెస్ట్ (కో 7, తె 7,9)

**రోకలిబండ** 1 కొండపల్లి బొమ్మల తయారీలో తాటి చెట్టు చేసేప్పుడు కొయ్యని రోకలి బండ మాదిరిగ కోసిన రూపం (కో 26)

2 లక్క వస్తువుల తయారీలో లక్కని పొడవు కడ్డీలాగా చేయటం (తె 1)

**రోగం :** గ్రామంలో పీడలు, జాడలు, జాడ్యం మొదలైనవి ఉంటే పోవటానికి తోలు బొమ్మలాట వేయిస్తారు. (రా.2)

**రోజ్‌గడ్డ .** తోలుబొమ్మలకు పాలిష్ పెట్టేముందు గుడ్డకు పూసే ద్రవ్యం (రా 11)

**రోజన్ .** వార్నిష్ తయారీలో వాడే ద్రవ్యం (తె 1,9)

**రోజన్‌మట్టి** లోహం పనిలో బొమ్మలు వేసేముందు నమూనా బొమ్మ చేయటానికి వాడే మన్ను (తె.1,12)

**రోజా** తోలు బొమ్మలకు వేసే గులాబి రంగు. చూ గులాబి (కో 37)

**రోజాపువ్వుతీగ** : కొయ్యపనిలో చేసే డిజైన్ (రా 4)

**రోజాపుడ్డు** · 1. కొయ్యపనిలో బొమ్మల తయారీకి వాడే కొయ్య (కో 15,34; తె 13; రా.4,5,8)

2 మట్టి బొమ్మల తయారీలో వాడే పరికరాల తయారీకి వాడే కొయ్య చూ. ఇరుడికఱ్ఱ (కో.38)

**రోలు** : తోలుబొమ్మలకు వేసే ఎరుపు రంగు తయారీలో పూర్వం మోదుగు పూలు రుబ్బటా ›కి వాడే సాధనం (రా 12)

**రోప్** . పత్తి, బట్ట బొమ్మల తయారీలో వాడే దారం రంగు (రా.7)

**రౌండు అడ్డగన్ను** : లోహం పనిలో వాడే పరికరం చూ చిత్రం-147. (తె.12)

**రౌండుదాగలి** : లోహం పనిలో వాడే పరికరం చూ చిత్రం-124 (తె 11)

**రౌండ్(గ ఉండు)** : లోహం పనిలో సున్నాలు, సున్నాలుగా చేసే డిజైన్. (తె 12)

**రౌండ్ కొరాం** · లోహం పనిలో రేకు గుండ్రటి ఆకారం తీయటానికి పట్టాలోపెట్టి కొట్టటానికి వాడే సాధనం. (తె 12)

**రౌండ్‌చిమ్టా** : లోహం పనిలో వస్తువుల్ని పట్టుకొందుకు వాడే పరికరం (తె 1)

**రౌండ్‌డోకలి** : లోహం పనిలో రేకుని రౌండ్‌గ కొట్టటానికి వాడే సాధనం. (తె 12)

**రౌండ్‌షేప్** : లోహం పనిలో రేకు గుండ్రదనం. (కో 7)

**రౌండ్‌పేర్నం** : కొయ్యపనిలో వాడే సాధనం. (కో 4)

## ల

**లక్క** : 1. చేతికఱ్ఱలు, కొయ్య బొమ్మలు, కొమ్ము బొమ్మలు తయారీలో అతికించటానికి వాడే పదార్థం. (కో 1,23; తె.5)

2 దీంతో గాజులు, బొమ్మలు చేస్తారు (తె 1)

3 లోహం పనిలో విగ్రహం మోల్డ్ తయారీకి వాడే ద్రవ్యం (తె 11)

4 లోహం పనిలో రేకుమీద డిజైన్ చెక్కేప్పుడు రేకుని దీన్తో అంటిస్తారు (తె 12)

**లక్క కణికలు** అడ్డలో ఉండే భాగాలు చూ చిత్రం-6 XI (కో 8)

**లక్కకోల** : అడ్డ, కఱ్ఱపనిలో వాడే రంగు కలిపిన లక్క ముక్కలు లక్కలో రంగు కలిపే కొయ్య సాధనాలు. (కో 12)

**లక్కపిడత** . కొయ్యపనిలో చేసే లక్కరంగు పూసిన కొయ్య వస్తువు (కో 12)

**లక్కపెట్టె** : అడ్డ, కఱ్ఱ పనిలో లక్కకు సంబంధించిన పరికరాలు దాచుకునే పెట్టె చూ డొక్కు (కో 12)

**లక్కబడ్డు** అడ్డకఱ్ఱ పనిలో వాడే లక్క ముందు శుభ్రంగా ఉండనిది (శుద్ధి చేయని లక్క) (కో 8)

**లక్కబల్ల** · లోహం పనిలో వాడే లక్కముక్క. (కో.8)

**లక్కబిళ్ళ** : అడ్డ, కఱ్ఱ పనిలో రంగు కలవని లక్కముక్క. (కో 12)

**లక్కరంగు** . 1 లక్క వస్తువులకు వేసే రంగు (తె 1)

2 దంతం పనిలో రంగు కలిపిన లక్క (కో 9)

**లక్కలో బిగించు** ఫిలిగ్రీ పనిలో వస్తువుల్ని లక్క వేడిచేసి అందులో నిలుపు (కో.27)

**లక్కోల** · దంతం పనిలో దంతం మీద డిజైన్‌కు రంగు కలిపిన లక్క వేయటానికి వాడే సాధనం దీన్ని వేడిచేసి లక్కలో అద్ది, డిజైన్ మీద వేస్తారు (కో.9)

**లక్ష్మి** . కొయ్యపనిలో దూరిపలక మీద చెక్కే శిల్పం (రా 4)

**లక్ష్మిలాకెట్** . ఫిలిగ్రీ పనిలో చేసే ఒక ఆభరణం. చూ. చిత్రం-81. (తె.8)

**ల్గగ్గం(పెట్టు)** : పర్యా లగ్నం కొయ్యపనిలో శిల్పం చెక్కటానికి పెట్టే ముహూర్తం (రా 4)

**లడ్డు** · ఫిలిగ్రీ పనిలో చిల్లులు చేయటానికి బర్మాకు బదులు పూర్వం వాడే సాధనంలో భాగం (తె 8)

**లత(గీయు)** · దంతం పనిలో చెక్కే డిజైను చూ చిత్రం-15 (కో 9)

**లప్పం** 1 కొయ్యపనిలో బొమ్మలకు, రంపం పొట్టు బొమ్మలకు పూయటానికి చింతగింజల అంబలి + రంపం పొట్టు, లేదా చింతగింజల పొడి + రంపం పొట్టు + గోతం పీచు కలిపిన మిశ్రమం దీన్నే 'మక్కు' అని అంటారు (కో 39; తె 4,7, రా 4)

2 కొయ్యపనిలో చెక్కకుండే చిల్లులు పూడ్చడానికి వాడే ద్రవ్యం చూ. మక్కు. (కో 35)

**లయప్రమాణం** . తోలుబొమ్మలాటలో కాలం లెక్క (రా.2)

**లాకెట్** · రోల్డ్‌గోల్డ్ వస్తువుల తయారీలో మధ్యలో అమర్చే అనేక డిజైన్లలో చేసిన గొలుసు (కో 33)

**లాకెట్‌కమ్మల ఉంగరం** ఫిలిగ్రీ పనిలో చేసే ఆభరణం (తె 8)

**లాగు** . 1 కొయ్యమీద డిజైనులు చెక్కేప్పుడు చెక్క మీద ట్రేసు తీయు (కో 34)

2 కొయ్యపనిలో తోపుడిని ఉపయోగించు (రా 4)

3 పేపరు మట్టి బొమ్మల తయారీలో మోల్డ్‌కి పేపరు మట్టి వేసి ఎండిన తర్వాత మోల్డ్‌నించి తీయు (కో 41)

**లాగికమ్మి** · పర్యా లాగి, కీతరేగల, వంకలాగ, లేగల విగ్రహం నున్నగ చేయటానికి వాడే పరికరం (కో 18)

**లాగె** · లోహం పనిలో వస్తువులు మెరుగుపెట్టడానికి వాడే సాధనం (తె 1,12)

**లాంప్‌షేడ్స్** . లోహం పనిలో చేసే దీపం సిమ్మెలు (తె.12)

**లావు** . 1. తోలు బొమ్మలాటలో వాడే దీపం ప్రమిదలో వేసే వత్తి మందంగ ఉండటం (రా 2)

2 రంపం పొట్టు బొమ్మల తయారీలో బొమ్మలోని కొన్ని భాగాలు మందంగ ఉండటం (తె 9)

**లావుఅట్ట** : కొయ్యపనిలో చెక్కమీద చెక్కే డిజైన్లని ముందు నమూనా గీసుకొందుకు వాడే అట్ట. (తె 13)

**లింగం** కొయ్యపనిలో చేసిన బొమ్మ చూ చిత్రం-24, 24 1. (తె 13)

**లెగ్గొట్టు** కాగితం గుజ్జు బొమ్మల తయారీలో అచ్చు నుంచి బొమ్మను పైకి తీయు (కో 17)

**లెగ్స్** · గుడ్డ బొమ్మలో భాగం (కాళ్ళు) (రా 7)

**లెదర్ ప్రొడక్ట్స్** . చర్మ ఉత్పత్తులు (తె 2)

**లెవెల్** · రూపా లెవులు, లెవలు, లెవల్

లోహం పనిలో విగ్రహం ఎగుడు దిగుడు లేకుండా సమానంగా ఉండటం (తె 12)

**లేగల** లోహం పనిలో మెరుగు పెట్టటానికి వాడే సాధనం (కో.4,8)

**లేడితల** · కొయ్యబొమ్మల తయారీలో చేసే లేడి అనే జంతువు తల (కో 19)

**లేడీస్‌బొమ్మ** . కొయ్యబొమ్మల తయారీలో చేసే ఆడవాళ్ళ బొమ్మ (రా 4)

**లేత** . కాగితం, మట్టి బొమ్మలకు వేసే రంగులు పల్చగ (light) ఉండటం. (కో 27)

**లేతపాకం** : తోలు బొమ్మల చర్మాన్ని ద్రావకం నీటిలో ఎక్కువసేపు ఉంచక వెంటనే తీయటం (కో.30)

**లేతి** · విద్యుచ్ఛక్తితో నడిచే అడ్డ దీనికి లేతగాడి అవసరం ఉండదు. చూ అడ్డ (కో 11)

**లేతుదుక్క** : చూ అడ్డదుక్క. (కో 11)

**లేపు** · తోలు బొమ్మల తయారీలో డిజైన్ కోసం చర్మాన్ని చిల్లుగ తీయు (కో.30)

**లేయర్** · చింత పిక్కల మీద బ్లేడుతో డిజైన్ చెక్కటం (కో 25)

**లైట్** . 1 తోలు బొమ్మలాటలో వెలుగు కోసం వాడే దీపం (కో 30,37)

2 కొయ్య బొమ్మల తయారీలో పని తేలికగా చేయటం (కో 41)

**లైట్‌గా వేడిచేయు** లోహం బొమ్మలకి వెండి కోటింగ్ వేయటానికి, నైట్రిక్ యాసిడ్‌ను కొద్దిగ వేడి చేయు (తె 1)

**లైట్‌నీలం** : నిర్మల్ బొమ్మలకు వేసే నీలం రంగు (తె 4)

**లైనింగ్** · కొయ్యపనిలో కొలతల గుర్తుకి కొట్టే గీత (తె 13)

**లోటుపాటు** కొయ్యపనిలో వాడే కొయ్యని మధ్యకు పగల కొట్టినప్పుడు (ఉంటే) తెలిసే లోపాలు (కో 41)

**లోడు** : కాగితం గుజ్జు బొమ్మలకు వాడే మోల్డ్ తయారీలో ముందు మట్టితో బొమ్మ చేసి పైన ప్లాస్టర్ ఆఫ్ ప్యారిస్ వేసి ఆరిన తర్వాత లోపలి మట్టిని తీసేయు. చూ కోరు (కో 41)

**లోతందుకొను** : కొయ్యపనిలో బొమ్మలు చేసేప్పుడు బొమ్మకి ఒకో భాగంలో లోతుగా చేయవలసి వస్తే పనివాడికి లోతు చేయమని చెప్పు (తె 13)

**లోతు** కొయ్యపనిలో బొమ్మలకి గుంతచేయు. (కో 7, తె 5,12,13, రా.1)

**లోతుకొట్టు** · లోహం పనిలో రేకు మీద బొమ్మలు చేసేప్పుడు గుంతగ చేయు (తె 12)

**లోతుగీత(కొట్టు)** · కొయ్యపనిలో డిజైన్లు చేసేప్పుడు లోతుగ కొట్టిన గీత (రా 4)

**లోతుచేయు** కొయ్యపనిలో బొమ్మలకి గుంత చేయు (తె 13)

**లోపల** : తోలుబొమ్మల తయారీలో వాడే చర్మానికి లోపలి భాగం (కో.37)

**లోపలగుల్ల** : కాగితం గుజ్జు బొమ్మల లోపలి భాగానికున్న ఖాళీలు (కో 27)

**లోపలి సన్నపని** . ఫిలిగ్రీ పనిలో వెండిరేకు మీద మధ్యలో చేసే సున్నితమైన పని (తె 15)

**లోపులి** అడ్డ, కర్ర పనిలో వాడే పులి దీనితో కొయ్య దిమ్మలో డొల్ల చేస్తారు (కో.11)

**లోహం** బొమ్మలు, విగ్రహాలు చేయటానికి వాడే ద్రవ్యం. చూ మెటల్. (తె.12)

**లోహం బొమ్మ** లోహంతో చేసిన బొమ్మ (తె 12)

**లోహంరేకు** . లోహం పనిలో బొమ్మలు చేయటానికి వాడే రేకు (తె 12)

# వ

**వంకర** ఫిలిగ్రీ పనిలో వాడే పోతకారు మూతి ఉండే పద్ధతి. (తె.8)

**వంకర అలుగు** క్రాస్ అలుగు కొయ్యపనిలో **వాడే** వారతోపుడులోని అలుగు (రా 4)

**వంకర తోపుడు** పర్యా వారతోపుడు కొయ్యపనిలో చెక్కను నునుపు చేయటానికి వాడే సాధనం (రా.4)

**వంకరమొగ్గ** . రాతిపనిలో విగ్రహానికి చెక్కే ఒక డిజైను. (కో 31)

**వంకరపేర్పం** ఫిలిగ్రీ పనిలో చేసే డిజైన్ (తె 8)

**వంకలాగె** · ఫిలిగ్రీ పనిలో పోతపోసిన విగ్రహం మీద మెరుగు తేవటానికి వాడే సాధనం చూ లాగికమ్మి. (తె 12)

**వంకాయ** · 1 నిర్మల్ బొమ్మలు తయారీలో చేసే ఒక కాయ (తె 4)

2 వంకాయ ఆకారంలోని పిడి కలిగిన చేతికర్ర నమూనా (తె 5)

**వంకిణి** . తోలుబొమ్మలో ఒక భాగం (రా 2)

**వంకీ ఉంగరం**. ఫిలిగ్రీ పనిలో చేసే ఆభరణం చూ చిత్రం-58; 59. (తె 8)

**వంకీ కమ్మలు** ఫిలిగ్రీ పనిలో చేసే ఆభరణం చూ చిత్రం-50. (తె.8)

**వంగి ఉండు** . నిర్మల్ బొమ్మల తయారీలో నునుపు చేయటానికి వాడే ఆకురాయి అంచులు వంపుగ ఉండటం (తె 4)

**వజ్రకిరీటం** : తోలుబొమ్మలోని కిరీటాలలో ఒక రకం (రా.2)

**వజ్రాలపట్టీ** : తోలు బొమ్మలకి చేసే ఆభరణం (రా 2)

**వంచు** : చేతికర్రల తయారీలో కొమ్ముని వేడిచేసి వంపు చేయు (తె 5)

**వట్టపుగుల్ల** : కొయ్యపనిలో బొమ్మని లేక వస్తువులోని వంపు భాగాలను చిత్రిక పట్టడానికి వాడే సాధనం. (కో 16)

**వట్రగన్నుసుత్తె** : లోహం పనిలో రేకుల మీద నగిషీ పని చేసేప్పుడు గుంటలా కొట్టాలంటే రేకుని వట్రుండ మీద పెట్టి కొట్టటానికి వాడే సుత్తి (తె.12)

**వట్రించు** : రూపా వట్రిచ్చు ఫిలిగ్రీ పనిలో గుండ్రని కడ్డీ కొట్టడం. (తె.8)

**వట్రుండం** · లోహం పనిలో రేకుమీద నగిషీపని చేసేప్పుడు గుంటలా రావాలంటే రేకుని సుత్తెతో కొట్టేప్పుడు అడుగున పెట్టే వస్తువు. (తె 12)

**వట్రువగన్ను** · లోహం పనిలో ఉపయోగించే పరికరం చూ చిత్రం-146. (కో 18)

**వడకట్టు** : పర్యా వడపోయు రూపా అడపోయు.

1. లోహం పనిలో విగ్రహం పోతపోయడానికి ముందు మట్టి బొమ్మ చేసి దానికి పైన పూసే మైనాన్ని కరిగించి గుడ్డలో వేసి వడపోయు (కో.1, తె.12)

2. కొయ్య బొమ్మలకు వాడే మక్కు తయారీలో మక్కుని గుడ్డలో వడపోయు. (కో 26, తె.4)

3 మట్టిబొమ్మల తయారీలో బొమ్మలకి పూసే మక్కు తయారీలో తుమ్మ జిగురుని నానపెట్టి వడపోయు. (కో 27)

4 అడ్డకర్రలో వాడే లక్కని కరిగించి వడపోయు (కో 11,12)

**వడ్యాతు** లోహం పనిలో రేకులు సాగదీయటానికి పూర్వం ఉపయోగించే పెద్దరాళ్ళు. (కో 18)

**వడి** : 1 అడ్డకర్రపనిలో అడ్డ తిరిగే వేగం (కో 12)

2 కొయ్యపనిలో ఆకు తీగల డిజైన్ చేసేప్పుడు ఆకుని వాడిగ ఉన్నట్లు చెక్కటం (తె 13)

**వడి తిప్పు** పర్యా వడివేయు, వడితిప్పు ఫిలిగ్రీ పనిలో వెండి తీగని రాట్నం మీద పురిపెట్టు. (తె 8)

**వడితీగె** ఫిలిగ్రీ పనిలో చేసే ఒక డిజైన్. వంకర తీగ (తె 8)

**వడివేయు** · చూ వడి తిప్పు (తె.8)

**వడ్రంగి పని** చూ కొయ్యపని (రా 4)

**వడ్రంగి** . కొయ్య పని చేసేవాడు (తె.13, రా 4)

**వడ్డాణం** . ఫిలిగ్రీ పనిలో చేసే వస్తువు స్త్రీలు నడుము చుట్టూ ధరించే ఆభరణం చూ డాబులు (కో 33)

**వడ్లపని** చూ వడ్రంగం పని చూ కొయ్యపని (తె.5)

**వడ్లోల్లు** చూ వడ్రంగి (తె 3,7)

**వంట(చేయు)** : కొయ్య, రంపం పొట్టు బొమ్మలకు పూసే మక్కు తయారీలో చింతగింజల్ని ఉడకపెట్టటం చూ. ఉడకబెట్టు. (కో.1,40, తె 7)

**వంద్రుమట్టి** · లోహం పనిలో ముందు నమూనా బొమ్మని చేయటానికి వాడే బంకమట్టి (కో.18)

**వత్తి** : 1. ఫిలిగ్రీ పనిలో వెండి తీగెను కాల్చే దీపంలో భాగం. (తె 8)

2. కొండపల్లి బొమ్మలకు వేసే నలుపు రంగు తయారీలో వాడే దీపంలో భాగం. (కో.26)

**వత్తు** : బీరకాయ పీచుతో సంచులు చేసేప్పుడు పీచుని దగ్గరికి సమంగా చేయు. (కో 32)

**వనదంతం** : అడ్డకర్రపనిలో వాడే కొయ్య. చూ అంకుడు కర్ర "అంకుడు చెట్టు కొయ్య తెల్లగ ఉంటుంది కాబట్టి వనదంతం అంటారు" (కో 12)

**వంపు** : 1. కర్రబొమ్మలకు, లోహం బొమ్మలకు ఉండే ఎత్తుపల్లాలు (కో.12,13; తె 1,7,12,13)

2 కొమ్ము పనిలో వాడే కొమ్ము వంకరగ ఉండటం. (కో.32)

3. బిందె తయారీలో నిప్పులు వేసి బంగారం రంగు రాగానే వంపేయటం. (కో.4)

4 వెదురు చేతికర్రలో ఉండే వంపు భాగం చూ.చిత్రం-3 1 (కో 23)

**వంపుకారు** . పర్యా. పోతకారు

ఫిలిగ్రీ పనిలో వెండిని కరిగించి రేక్‌గాడిలో పోసి కలపటానికి వాడే సాధనం (తె 8)

**వంపుకైవారం** : లోహం పనిలో డిజైన్లు గీయటానికి వాడే సాధనం చూ చిత్రం-141 (తె 12)

**వంపుకోరాం** : లోహం పనిలో పాత్రల మీద నగిషీ పనిచేసేప్పుడు వాటిని బోర్లించటానికి వాడే సాధనం చూ.చిత్రం-144 (తె 12)

**వంపులిప్పు** : లోహం పనిలో వంపువచ్చే విధంగా గన్ను మీద రేకుని పెట్టి మలచు (తె 12)

**వంపు సక్కటి వాల్మోల** : లోహం పనిలో చివర గీతలు కొట్టడానికి వాడే సాధనం. (తె.10)

**వంపుసుత్తి** . లోహం వాహనాల తయారీలో వాడే సుత్తి (కో.31)

**వయిటుషెల్లు** : గవ్వ బొమ్మ (రా 5)

**వయొలిట్ సబ్బు** : తోలు బొమ్మల తయారీలో తోలుని కడగటానికి వాడే సబ్బు. (రా.2)

**వరప** 1 లోహం పనిలో మట్టి బొమ్మ తయారీకి వాడే మట్టిని కొలిచే ప్రమాణం ఒకసారి మౌల్డింగుకు సుమారుగ సరిపోయే మట్టి (కో 12)

2 తోలు బొమ్మలాటలో తెరవెనుక దీపాల బారు (కో.7)

**వలప్పు** : గవ్వ బొమ్మ చూ చిత్రం-44 (రా 5)

**వలుపు చీర్లం** : కొయ్య బొమ్మల తయారీలో ముందు రఫ్‌వర్క్ చేయటానికి ఉపయోగించే సాధనం. (కో.41)

**వళ్ళు(తీయు)** . 1 లోహం పనిలో ఖైరీమొలలతో చెక్కేతాడు, జంధ్యం మొదలైనవాటి వడులు చుట్టలు (కో 33)

2 తాడుమీద కనిపించే వళ్ళు చెక్కటం (తె 12)

**వళ్ళు వళ్ళు(గాతిప్పు)** . కొయ్య బొమ్మల తయారీలో స్ప్రింగ్ యాక్షన్ బొమ్మల తయారీలో వాడే స్ప్రింగ్ చేసేప్పుడు ఇనుప తీగని స్ప్రింగ్‌గా చేయటం. (రా 4)

**వస్త్రకాయిదం** రూపా వస్త్ర కాగితం, వస్త్ర కాళితం, వస్త్ర కాగడం. పొడి, పిండి పదార్థాలని బట్ట మీద వడకట్టడం. (కో 40,, తె 1,12, రా 5,11)

**వస్తువు** : 1 ఫిలిగ్రీ పనిలో నగిషీ చేసిన వెండి ఉరువు (తె 8)

2. లోహం పనిలో చేసే ఉరువు (కో 8, తె 12)

**వాగు** : నీరు ప్రవహించే కాలువ, లేక నీటి గుంటలు, చెరువులు. కొయ్య బొమ్మలకి వాడే తెలుపు రంగు తయారీలో ఉపయోగించే నత్తగుల్లలు దొరికే ప్రదేశం. (తె 1,4,7)

**వాక్స్‌పాలిష్** కొయ్య బొమ్మలకి వేసే మైనం పాలిష్. (తె.13)

**వాటర్‌కలర్** : కొయ్య బొమ్మలకు, మట్టి, సుద్ద బొమ్మలకు వేసే నీటి రంగులు గవ్వ బొమ్మలకి మాత్రం వాడరు. చూ నీటిరంగు (కో.20,26,27, తె 4,7, రా.5,7)

**వాటర్‌పెయింట్స్** : వాటర్ కలర్స్ వేసిన మట్టి, సుద్ద బొమ్మలు. (కో.17)

ాడు . పేపరు, మట్టి బొమ్మలకి రంగులని ఉపయోగించటం (రా 13)

ాది : తోలుబొమ్మలని ఆడించేవాడు (కో 37)

ాన · వర్షం వాన రావటం కోసం విరాటపర్వం తోలు బొమ్మలాట వేయిస్తారు (రా.2)

ాయి : లోహం పనిలో చేసే పూలతొట్టిపై భాగం (తె 12)

ాయిశానం ఫిలిగ్రీ పనిలో వెండిపై డిజైన్ గీసి తెంపటానికి వాడే పదునుగల శానం (కో 33)

ార · కొయ్యపనిలో డిజైన్స్ చేసేప్పుడు మట్ట సీర్నాన్ని వంకరగ పెట్టటం (రా 4)

ారతోపుడు కొయ్యపనిలో తలుపులు, సింహద్వారాలు మూలల్లో నునుపు చేయటానికి వాడే సాధనం (రా 4)

ారు . అడ్డలోని అడ్డకోయలలో ఉండే భాగం. చూ చిత్రం-6 VII 2 (కో 12)

ార్నిష్ : 1. కొయ్య బొమ్మలకి, రంపం పొట్టు బొమ్మలకి వేసే గుగ్గిలం, రోజిన్, మంచినూనె లేదా అవుసెనూనె కలిపి చేసిన మిశ్రమం (తె 1,3,4,5,7, రా 6)

2 కుర్చీలకు, చేతికర్రలకు, సిమెంటు బొమ్మలకి వేసే పూత (కో.3,35)

వాలుపోగర · లోహం పనిలో బొమ్మల తయారీకి వాడే సాధనం (కో 1,8,33,39)

వాలులేగ : బిందెల తయారీలో వాడే ఒక విధమైన పరికరం (కో 4)

వాల్మీకి : ఒక కులం (తోలుబొమ్మల తయారీ) (రా 10)

వాల్మోల . లోహం పనిలో డిజైన్స్ చేసే సైడు గీతలు కొట్టడానికి వాడే మొల (కో 10,12)

వాషింగ్‌పౌడర్ : నిర్మల్ బొమ్మల తయారీలో ట్రేస్ తీసేప్పుడు కాగితం మీద దీన్ని వేసి రుద్దితే అడుగున బొమ్మ పడుతుంది. (తె.4)

వాసం తోలుబొమ్మలాట స్టేజికి వాడే కర్ర. (రా 2)

వాహనం కొయ్య పనిలోను, ఫిలిగ్రీ పనిలోను చేసే దేవుని ఎక్కు (కో 33, రా 4)

విగ్రహం కొయ్యతోగాని, లోహంతో గాని చేసే బొమ్మ (కో 1,31,33, తె 1,6,12, రా 4,8,13)

విఘ్నేశ్వరస్తవం తోలుబొమ్మలాట ప్రారంభంలో చేసే స్తోత్రం (రా 2)

వింగ్ గుడ్డ బొమ్మలో ఒక భాగం, రెక్క (రా 7)

వింగ్‌నట్టు . మక్కు బొమ్మల తయారీలో ఉపయోగించే బరమలో భాగం చూ చిత్రం-169 3 (కో 41)

విడదీయు · 1 లోహం బొమ్మల పోతపనిలో మోల్డ్ నుంచి విగ్రహాన్ని వేరు చేయు (తె 12)

2 మట్టి, సుద్ద బొమ్మల తయారీలో మోల్డ్ నుంచి బొమ్మల్ని వేరు చేయు. చూ ఇడగొట్టు (కో.17,27)

విడిపోవు . ఫిలిగ్రీ పనిలో మైనం మీద వెండి రేకుని అంటించి పని పూర్తయిన తర్వాత వేడిచేస్తే మైనం నుంచి వెండి రేకు ఊడిపోవు. (తె 8)

విడివిడి · మట్టి బొమ్మలు తయారీలో విగ్రహం ముందు భాగం, వెనుక భాగం వేరు వేరుగ చెయ్యటం (రా.9)

వినాయకసెట్టు కొయ్యపనిలో చేసే బొమ్మ (రా.4)

విరగ్గొట్టు · 1. కొయ్యపనిలో వాడే శీర్షం తయారీలో ఇనుప ముక్కని కావలసిన సైజుకి తెగ్గొట్టు (రా.3)

2 లోహం పనిలో విగ్రహం మోల్డ్ చేసేప్పుడు మట్టిని తీయు (రా.5)

విరుగు కొయ్యబొమ్మలు పగిలిపోవు. (కో.41, తె.13)

విశ్వబ్రాహ్మలు . లోహం పని చేసేవారు (కంసాలివారు) (తె.6)

విసురుముక్కలు . అడ్డలో భాగం. చూ చిత్రం-6 VIII 2, 6 VIII (కో.12)

వులి · కొమ్ము బొమ్మను దీనితో చెక్కుతారు. (కో 10)

**వెచ్చ(పెట్టు)** : లోహం పనిలో లోహాన్ని వేడిచేయటం (కో 1,4)

**వెడల్పు** . 1 తోలు బొమ్మలాట ఆడించటానికి ఏర్పాటు చేసే స్టేజీ అడ్డుకొలత (రా 10)

2 కొయ్యపనిలో కత్తి కాసుని ఉపయోగించే విధానం (రా 4)

3 శకనం పనిలో వాడే రేకు వెడల్పు (తె 12)

4 నిర్మల్ బొమ్మల్లో దుష్టి బొమ్మ చేయటానికి కోసే కొయ్య అడ్డుకొలత (తె 4)

5 కాగితం గుజ్జు బొమ్మల తయారీలో సాగదీసిన కాగితం ముద్ద పరిమితి. (కో 41)

**వెంట్రుక** 1 తోలుబొమ్మల తయారీలో వాడే చర్మానికి ఉండే జుట్టు (కో 7,15,37, తె.3, రా 2,5,11)

2 లోహం పనిలో విగ్రహానికి చెక్కే జుట్టు చూ ఎంటిక (తె 12)

**వెండి** : ఒక లోహం బొమ్మల తయారీకి వాడ్తారు. (కో 27, తె 8,12; రా 5,11)

**వెండిగూళ్ళు(బ)** : రాతి విగ్రహాలకు అమర్చటానికి ఫిలిగ్రీ పనిలో చేసే వెండి తొడుగులు (కో 27)

**వెండి టంకం** · విగ్రహాన్ని (లోహం) అతికించటానికి ఉపయోగించే ద్రవ్యం (కో 1)

**వెండితీగె** : ఫిలిగ్రీ పనిలో వస్తువులు చేయటానికి వెండితో సన్నగ చేసిన తంతి (తె 8)

**వెండితొడుగు** · చూ వెండి గూళ్ళు (కో 33)

**వెండిపూత** : లోహం పనిలో కొన్ని బొమ్మలకు పైన వెండిని పల్చగ పూయటం. (తె 12)

**వెండిముద్ద** : ఫిలిగ్రీ పనిలో వాడే వెండి ముద్దగ వుండటం (కో.27,33)

**వెండిమేకు** : దంతం జాలుని పెట్టెపై భాగంలో అతికించడానికి వాడే మేకు వెండిమేకు వాడడం సంప్రదాయం. (కో 9)

**వెండి రవ్వ** . లోహం బొమ్మలని అతికించటానికి వాడే ద్రవ్యం (తె 1)

**వెండిరేకు** బొమ్మలు చేయటానికి వాడే పలక (తె 1)

**వెండివస్తువు** ఫిలిగ్రీ పనిలో వెండితో తయారయ్యే వస్తువు (తె 15)

**వెండిషీటు** · చూ వెండిరేకు (కో 27)

**వెదరచేయి** ముందు చేయి అడ్డ, కర్ర పనిలో చేసే నాలుగు చేతులున్న బొమ్మలలో ముందు రెండు చేతులు (కో 12)

**వెదురుగడ** · తోలు బొమ్మలాటకి వేసే స్టేజికి నాలుగు వైపుల పాతటానికి వాడే స్తంభం చూ చిత్రం-9 1 (కో 37)

**వెదురుచేతికర్ర** చేతికర్రల తయారీలో వెదురుతో చేసిన కర్ర చూ చిత్రం-3 (కో 23)

**వెదురుపుల్ల** పర్యా వెదటి పుల్ల, వొత్తులు, బద్ద, వెదురు బద్ద

1 నిర్మల్ బొమ్మల తయారీలో రంగులు వేయటానికి వాడే కుంచె తయారీకి వాడే వస్తువు (తె 4)

2 తోలుబొమ్మలని ఆడించటానికి వాడే కర్ర (రా.2)

3 తోలుబొమ్మలకి రంగులు వేయటానికి వాడే కర్ర. (రా 2)

4 రంపం పొట్టు బొమ్మలకు రంగులు వేయటానికి వాడే కుంచె తయారీకి వాడే వస్తువు (తె 9)

**వెదురుబద్ద** · కొయ్య బొమ్మల తయారీలో బొమ్మలో నునుపు చేయటానికి వాడే గరుకు కాగితానికి మోపుగ వాడే బద్ద చూ. ఎదురుబద్ద (కో 17)

**వెదురుముక్క** పిచ్చుక బొమ్మల తయారీలో వాడే పుల్ల. (తె 4)

**వెనకభాగం** : కాగితం, సుద్ద, మట్టితో చేసే బొమ్మలకు

వెనకవైపు భాగం పర్యా ఎనకభాగం, కింది భాగం (కో 27)

**వెనకరేకు** లోహంతో వాహనాలు చేసేప్పుడు భాగాలు విడివిడిగ చేస్తారు వాటిలో వెనుక భాగంలో చేసిన రేకుని వెనుకరేకు అంటారు చూ చిత్రం-20 5 (కో 31)

**వెల్కం** : పేపరు మట్టి బొమ్మల తయారీలో వాడే స్వాగతం మోల్డ్ (కో 41)

**వెలిగారం** . లోహం వస్తువులు అతికించటానికి వాడే ద్రవ్యం (తెల్లగ గడ్డ రూపంలో ఉంటుంది) చూ ఎలిగారం (కో 41, తె 1, రా 11)

**వెల్లబొమ్మ** లక్క, రంగు వేయని కొయ్య బొమ్మ (కో 11,12)

**వెల్ల(పట్టు)** అద్దమీద తెల్ల బొమ్మని తయారు చేయడం (కో 12)

**వెల్వెట్ ముఖమల్ బట్ట** · దంతం పనిలో చేసే దంతం పెట్టె లోపల వేసే బట్ట (కో 9)

**వెల్వెల** . వేల (72 వెల్వెల కపి సైన్యం = 72 వేల కపి సైన్యం) (రా 2)

**వేంగ** పర్యా వేగింస కొయ్య బొమ్మల తయారీలో వాడే వేంగి చెట్టు కొయ్య (కో 41, రా 4,5,6)

**వేడి** : 1 తొలు బొమ్మల తయారీలో వాడే తోలును శుభ్రం చేయటానికి నీరుని కాయటం (కో 37)

2 లోహం బొమ్మని అతికించేప్పుడు వెలిగారం, టంకం వేసి వేడి చేయటం (రా 11)

3 లోహం పనిలో ముందు చేసే నమూనా బొమ్మ లోపలి మైనం కరిగించటానికి వెచ్చ చేయటం (తె 12)

**వేడిచూపు** : పర్యా. వేడిచేయు ఫిలిగ్రీ పనిలోను, లోహం పనిలోను వస్తువుల్ని వేడి చేయటం చూ అగ్గి చూపు (కో 4, తె.8,12)

**వేప** : కొయ్య పనిలో బొమ్మలకి, గాజుల పనిలో గాజులకి పూసలు అతకటానికి వేడి చేయటానికి వాడే బొగ్గుల తయారీకి వాడే కొయ్య (కో 7,26, తె 1,3, రా 5,6)

**వేపబంక** పర్యా వేప బంగారం.

తోలు బొమ్మలకు వాడే నలుపు రంగు తయారీలో కలపటానికి వాడే ద్రవ్యం (కో.15,37, రా 10)

**వేలుబొక్క** కొయ్య బొమ్మల తయారీలో కొయ్యను కోయటానికి వాడే రంపానికి పిడి దగ్గర ఉండే చిల్లి (రా 5)

**వేస్ట్** పేపరు మట్టి బొమ్మల తయారీలో కొన్ని బొమ్మలు సరిగా రాకుండా పోవటం (కో 41)

**వేస్ట్‌పేపర్** పేపరు మట్టి బొమ్మలకు వాడే పనికి రాని కాగితం (కో 41)

**వైట్** 1 బిందెను పాలిష్ పట్టినప్పుడు వచ్చే తెలుపు రంగు (కో 4)

2 రంపం పొట్టు బొమ్మలకు, తోలు బొమ్మలకు, కొయ్య బొమ్మలకు వేసే తెలుపు రంగు (కో.3,7, తె 2,4,9, రా 7)

**వైట్‌కోట్** కొయ్య బొమ్మలకు మక్కు పూసి పైన సైను బట్ట అతికించి పైన పూసే తెలుపు రంగు పూత (తె 7)

**వైట్‌పాలిష్** కొయ్య బొమ్మలకు పూసే పాలిష్ (కో 34, రా 4)

**వైట్‌వుడ్ టాయ్స్** . తెల్లకొయ్య బొమ్మలు (రా 4)

**వైటు శంకు** · గవ్వ బొమ్మ (రా 5)

**వైర్(తీయు)** 1 ఫిలిగ్రీ పనిలో మిషన్ మీద తీసిన తీగ (కో 33, తె 8)

2 కొయ్యపనిలో కుర్చీకి అల్లే ప్లాస్టిక్ తీగ (కో 35)

3 లోహం పనిలో వాడే పాడైపోయిన రాగి తీగ చూ తంతి (కో.12)

**వైర్‌మిషన్** · ఫిలిగ్రీ పనిలో వెండిని తీగలా తీయటానికి వాడే యంత్రం (కో.27,33, తె 8)

**వైస్** : కొమ్ము బొమ్మల తయారీలో కొమ్ముని పల్చగ చేయటానికి వాడే యంత్రం (కో 1)

**వొగ్గుబల్ల** . అడ్డపనిలో కొయ్యదిమ్మని వులితో చెక్కేప్పుడు వులిని ఆనించి చెక్కటానికి వాడే బల్ల (కో 11,12)

**వొంగు** : చేతికర్రల తయారీలో పిడికి వాడే కొమ్ముకున్న వంపు (తె.5)

**వొత్తి** : తోలుబొమ్మలాటలో ఉపయోగించే దీపంలో భాగం (రా.2)

**వొత్తులుబద్ద** : అడ్డ కర్ర పనిలో దీన్ని మొగలి ఆకు పైన మడిచి మెరిగింపు చేస్తారు. (వెదురు బద్ద) (కో 12)

**వొదుగు** : లోహం పనిలో మైనం బొమ్మని చేసేప్పుడు చేతితో వొత్తు. (తె 12)

**వొరవ** : అడ్డకర్ర పనిలో వాడే కొయ్య మెత్తదనం (కో 12)

**వొలుపు శీర్లం** · కొయ్యపనిలో కొయ్య పేడులు తీయటానికి వాడే సాధనం (రా.3,5,6)

**వోవర్‌సైజు** : (oversize) పెద్ద సైజు (రా.5)

**వ్యాసం** : (Diameter) కొలత అడ్డు. (కో 5,6,7)

## శ

**శంకరాభరణం నెక్లెసు** : ఫిలిగ్రీ పనిలో చేసే శంకరాభరణం పేరిటి ఒక డిజైన్ గొలుసు (కో 33)

**శంఖం** : రూపా శంఖువు, శంకువు తోలుబొమ్మలాటలో ఉపయోగించే సంగీత వాద్యం (కో.37; రా 22)

**శకవం పనిచేసేది** : కొయ్యపనిలో చేసే వస్తువు చూ.చిత్రం-14 (కో.12)

**శరగోపం** : పర్యా శరగోపురం, శరారీ

దేవాలయాలలో అర్చకులు భక్తుల శిరస్సు మీద ఉంచి తీసే పాత్ర. ఫిలిగ్రీ పనిలో తయారు చేస్తారు చూ.చిత్రం-22. (కో 33, తె.13)

**శబ్దం** : తోలుబొమ్మలాటలో బొమ్మలని ఆడించేవాడు కాళ్ళ కింద చెక్కల్తో చేసే చప్పుడు (రా 10)

**శనగపార** . వెడల్పు యినప పళ్ళెం మాదిరిది తోలు బొమ్మలాటలో ఈ పళ్ళెంలో పేడవేసి ప్రమిద పెడతారు. (కో 50)

**శానం** : రూపా శాణం

1 ఫిలిగ్రీ పనిలో వస్తువులకి రాళ్ళు అమర్చేప్పుడు వాడే సాధనం (కో 27,33)

2 తోలు బొమ్మల తయారీలో బొమ్మలకి చిల్లులు చేయడానికి వాడే పరికరం (కో 7)

3 చూ చీర్నం, చానం, గోరుగల్. చింతపిక్కలపై బొమ్మలు చెక్కటానికి వాడే సాధనం. (కో.25)

**శాస్త్రోక్తం** . శాస్త్రంలో చెప్పినట్లుగ (కొయ్య పనిలో తలుపులు, సింహద్వారాలు తయారీలో శాస్త్రప్రకారం చేస్తే తలకి తగులుతాయి) (రా 4)

**శిరస్సు** తోలుబొమ్మలకి చేసే తల భాగం (రా 12)

**శిల్పం** కొయ్యపనిలో చేసే విగ్రహం (తె 6; రా.4)

**శివలింగం ఏనుగు** . కొయ్యపనిలో చేసే బొమ్మ. (రా.4)

**శివరంజని** : తోలు బొమ్మలాటలో వాడే రాగం పేరు. (రా 2)

**శివేంద్ర మధ్యం** . తోలు బొమ్మలాటలో ఉపయోగించే ఒక రాగం. (రా 2)

**శిఖరం** . లోహం పనిలో చేసే వస్తువు గుడికి పై భాగంలో ఉండేది చూ. పసినికుండ (కో 18)

**శిఖమూరకట్టు** తోలుబొమ్మలాటలో కాళ్ళకు కట్టుకునే గజ్జెల తయారీలో తాడుకి గజ్జెని కట్టే విధం (ఎద్దులకి తలమీద కట్టేలాగ). (కో.7)

**శిఖామణి** . కిరీటంలో భాగం. చూ చిత్రం-16.1 (తె 13)

**శీర్ణంకాడ** . కొయ్యపనిలో బొమ్మలు చెక్కటానికి వాడే శీర్ణంలో భాగం. (రా 5)

**శీర్నం** : కొయ్యపనిలో బొమ్మలు చేయడానికి వాడే సాధనం (రా 4,5,6,13)

**శుచి :** కొయ్యపనిలో శిల్పం చేసేప్పుడు స్నానం, పూజ మొదలైనవి చేసి మొదలు పెట్టడం (రా 4)

**శుద్ధం .** కొయ్యబొమ్మల తయారీలో బొమ్మని పూర్తి చేయటం చూ ఫినిషింగ్ (కో 4)

**శుద్ధి(చేయు) ·** తోలు బొమ్మల తయారీలో తోలుని శుభ్రం చేయు. (రా 2)

**శెకవం(కొట్టు) :** లోహం పనిలో చెక్కడం పని చేయటం. చూ. చెకనం (తె 12)

**శెకవం పని :** పర్యా చెకనం పని లోహం పనిలో, కొయ్య పనిలో బొమ్మలు, డిజైన్లు, నగిషీలు చెక్కడం (తె 1,12,13)

**శెనాయించి :** నిర్మల్ బొమ్మలకు పూర్వం వాడే తెల్లరంగు తయారీలో నత్తగుల్లల్ని వేయించు (తె.4)

**శేగ :** చేతికర్రల తయారీలో వాడే చెట్టు లోపల ఉండే నల్లటి కర్ర. (తె 5)

**శేవం :** పర్యా శీర్ణం. కొయ్య పనిలో చెక్కడానికి వాడే సాధనం (తె.13, రా 4)

**శేరు :** కొలత పాత్ర. (తె 12)

**శేర్నం పని :** శీర్నంతో చేసే పని. (రా 4)

**శేషతల్పం :** ఫిలిగ్రీ పనిలో చేసే వస్తువు (కో 33)

**శేషపాము :** కొయ్యపనిలో దూరిపలక మీద చెక్కే శిల్పం (రా.4)

**శౌకంవెట్నమొల :** లోహం పనిలో బొమ్మల్ని సాపు చేయటానికి వాడే సాధనం. (తె 12)

**శ్రావణం :** ఫిలిగ్రీ పనిలో వెండి తీగల్ని పట్టుకొనేందుకు వాడే పరికరం (కో.27)

**శ్రీచందనం :** కొయ్యపనిలో బొమ్మలు చేయటానికి వాడే కొయ్య (కో 41, రా.5)

**శ్రీరాగం :** తోలుబొమ్మలాటలో వాడే రాగం. (రా 2)

**శ్రుతిగాడు :** తోలుబొమ్మలాటలో వాద్యవాడు చూ.చిత్రం-98. (కో 15)

## ష

**షీట్** లోహం పనిలో బొమ్మలు చేయటానికి వాడే రేకు. (తె 10)

**షీట్‌డ్రాయింగ్ మిషను .** చూ. రేకు మిషను. ఫిలిగ్రీ పనిలోను, రోల్డ్‌గోల్డ్ పనిలోను లోహం రేకుగా రావటానికి వాడే యంత్రం (కో.27,33)

**షీట్ రోలింగ్ మిషను** లోహం రేకుని పల్చన చేయటానికి వాడే యంత్రం చూ రేకు మిషను (రా 11)

**షీట్‌మెటల్ .** లోహం పనిలో నగిషీ పనిచేయటానికి వాడే లోహం రేకు. (తె.10,12)

**షీల్డు .** బహుమతులుగా ఇచ్చే రేకు అతికించిన కొయ్య ప్లేట్. (తె 12)

**షేర్‌రంగు** తోలు బొమ్మలకి నిర్మల్ బొమ్మలకి వేసే శరీరం రంగు (తె 4, రా 2)

**షైనింగ్** 1 లోహం బొమ్మలకి పెట్టే మెరుపు. (తె 1, రా.5)
2 కొయ్య బొమ్మలకి, తబలా కుండకి పెట్టే మెరుపు. (కో 19, తె 2)

## స

**సక్కటి కైవారం** లోహం పనిలో గీతలు కొట్టడానికి వాడే సాధనం చూ చిత్రం-140 (తె 12)

**సక్కటి వాల్మోల :** లోహం పనిలో సైడుగీతలు కొట్టడానికి వాడే సాధనం (తె 10)

**సంకురాత్రి** సంక్రాంతి పండుగ. ఈ పండుగప్పుడు తోలు బొమ్మలాట ఆడ్తారు (కో.30)

**సంగడి :** కొమ్ము, కొయ్య వస్తువులకు ఆకారాలు తీసే, కాలితో తొక్కుతూ తిప్పే మిషను. చూ. తరిణం మిషను. చూ చిత్రం-6 (కో.32)

**సంగడిపట్టు :** సంగడి మిషనుకు కర్ర బిగించి చెక్కడం (తె.13)

**సంగడిముణి :** సంగడి మిషన్‌లో ఉపయోగించే ముణి (తె 13)

**పచ్చెదనక :** జీవితాంతం పూర్వం నిర్మల్ బొమ్మలకి వేసే తెలుపు రంగు చాలాకాలం ఉండటం (తె 4)

**సంచి :** తోలు బొమ్మల తయారీకి వాడే మేక చర్మం కోయడానికి ముందు ఉండే ఆకారం (సంచి లాగ) (కో 7,37)

**పట్టం :** (Frame) కొయ్యపనిలో చేసే తలుపుపలక (కో 3)

**పట్టారంపం .** కొయ్యపనిలో మొద్దుల్ని కోసే రంపం (తె.13)

**పత్తు** 1 జింకు (తె 12)

2 టంకం చేయటానికి పనికి వచ్చే ద్రవ్యం (కో 4)

**పత్తురేకు ·** లోహం పనిలో వాడే జింకు రేకు (తె 12)

**పత్యేకం .** పర్యా. సొకం ఫిలిగ్రీ పనిలో చెక్కే డిజైన్ (తె 6,8)

**పత్యేకం ఆకురాయి ·** ఫిలిగ్రీ పనిలో వాడే ఆకురాయి (తె 8)

**పందిన్ :** లోహం పనిలో రేకును కావాల్సిన ఆకారంలో మలుచుకోటానికి వాడే సాధనం (తె 1)

**సందు** కొయ్యపనిలో తలుపులకి డిజైన్లు చెక్కి అతికించేప్పుడు ఉండే ఖాళీ (కో 34)

**పంధివచనం** తోలు బొమ్మలాట ఆడేప్పుడు, ఏ కథ చెప్ప బోతారో దాన్ని ముందుగ సంగ్రహంగ చెపుతారు దీన్ని సంధి వచనం అంటారు (రా 10)

**పన్నం(తిప్పు)** ఫిలిగ్రీ పనిలో వెండి, సన్న తీగ తీయడం (తె 8)

**పన్నం అడుగు :** కాగితం గుజ్జు, మట్టి సుద్ద బొమ్మల తయారీలో సూక్ష్మమైన భాగాలు చేయటానికి వాడే సాధనం (కో.17)

**సన్నం ఆకురాయి** రూపా సన్న ఆకురాయి, సన్నాకురాయి. కొయ్యపనిలో నునుపు చేయటానికి వాడేది (కో 35; తె 1,2,3)

**సన్నఉలి .** చింతపిక్కలపై బొమ్మలు చెక్కేప్పుడు, కొయ్యమీద డిజైన్లు చెక్కేప్పుడు వాడే సన్నని శీర్షం చూ చిన్న సలగ (కో 26,34)

**సన్నకడ్డీ** ఫిలిగ్రీ పనిలో వాడే వెండి ఊస (తె 8)

**సన్నగీత** కొయ్యపనిలో డిజైన్లకి చేసే సన్నని గీత (రా 5)

**సన్నచీల** కొయ్యపనిలో వాడే చిన్న మేకు (రా 4)

**సన్నటిపొడి ·** నిర్మల్ బొమ్మలకు పూసే చింత అంబలి తయారీలో చింత గింజల్ని మెత్తగ చేసిన పొడి. (తె 4)

**సన్నతీగె** 1 ఫిలిగ్రీ పనిలో వెండితో తీసిన సన్న తీగ (తె 8)

2 కొయ్య పనిలో చెక్కే డిజైను (రా 4)

**సన్నపని** పర్యా నడిమి పని ఫిలిగ్రీ పనిలో చేసే సున్నితమయిన పని (కో 33)

**సన్నపొట్టు** సన్న రంపం పొట్టు (బొమ్మల తయారీకి వాడ్తారు) (తె 7)

**సన్నపోగారు ·** పర్యా కమ్మిసీర్లం

1 తోలు బొమ్మల తయారీలో సన్నరంధ్రాలు చేయటానికి వాడే పరికరం (రా 2)

2 కొయ్య పనిలోను, ఫిలిగ్రీ పనిలోను సున్నితమైన పని చేయటానికి వాడే సాధనం (తె 15, రా 4)

**సన్నబ్రష్ .** పర్యా సన్న బులుసు

1 కొండపల్లి బొమ్మలకు, రంపం పొట్టు బొమ్మలకు రంగు సన్నగ వేయాల్సిన చోట వాడే కుంచె (కో.26; తె 9)

2 మేకప్‌లో వాడే కుంచె (కో 7, రా 5)

**సన్నబొంద :** కొయ్యపనిలో చేసే చిన్న రంధ్రం (రా 4)

**సన్నమక్కు ·** సన్నని రంపం పొట్టుతో చేసిన లప్పం (తె.4)

**సన్నముక్కె గోరుగోలు** తోలు బొమ్మల తయారీలో వాడే సన్నని కొనగల పరికరం (కో 30)

**సన్నరంపం** · కొయ్యపనిలో చిన్న చిన్న చెక్కల్ని కోయటానికి వాడే చిన్న రంపం (కో 16,28, రా 4)

**సన్నశీర్షం** · 1. కొయ్యపనిలో బొమ్మలకు సన్నని భాగాల్లో చెక్కటానికి వాడే సాధనం (తె 6, రా 3,4,5)

2 కొయ్య బొమ్మలు చేయటానికి ముందు రఫ్ వర్క్ చేయటానికి వాడే పరికరం (కో 41)

**సన్నసీనం** : కొయ్యమీద డిజైనులు చెక్కటానికి వాడే సాధనం. (కో 31,34)

**సన్ని** : పర్యా సన్నిగడ్డ ఉలులు పదును రావటానికి నూరేప్పుడు ఉపయోగించే రాయి (కో 5,7)

**సన్నికల్లు** చూ సన్ని (కో 7)

**సప్టా** : తోపడాలో బ్లేడు ముందర పెట్టే కొయ్య భాగం (కో 35)

**సపోర్టు** · కొయ్యపనిలో చేసే బక్షీ బద్దలు, బ్రాకెట్లు. (తె 13)

**సఫేదా** : నిర్మల్ బొమ్మలకు వాడే తెలుపు రంగు (తె.1,4)

**సబ్బు** : తోలుబొమ్మకు వాడే చర్మం శుభ్రం చేయడానికి వాడే ద్రవ్యం (కో 37, రా 2)

**సమపాళ్ళు** . 1 లోహం పనిలో పంచ లోహం బొమ్మలు చేసేప్పుడు లోహాన్ని సమభాగంగా కలపటం (కో 33, తె.12)

2 కొయ్య బొమ్మలకు వేసే రంగు పొడి, తుమ్మ జిగురు సమాన పరిమాణంలో కలపటం (కో 26)

3. కాగితం గుజ్జు బొమ్మల తయారీలో కాగితం గుజ్జు, తుమ్మ జిగురు, ప్లాస్టర్ ఆఫ్ ప్యారిస్, సుద్దపొడి సమాన పరిమాణంలో కలపటం (కో 27)

**సమర** : చమురు, నూనె (తె 8)

**సమ్మెట** : 1. సుత్తి (కో 4, రా 1,5)

2. లోహం పనిలో నమూనాను సరిచేయటానికి దీనిపై ఉంచి సరిచేస్తారు (తె 1,12)

3 ఫిలిగ్రీ పనిలో ఉంగరం గుండ్రంగ, నలుచదరంగ, చేయటానికి వాడే సాధనం (తె 1)

**సమ్మేళనం** తోలుబొమ్మలకు వాడే నలుపు రంగు తయారీలో మసిని తుమ్మ జిగురు లేదా వేప బంగారం కలిపి బాగా రంగరించటం చూ కలుపు. (కో 15)

**సంబరాలు** వేడుకలు, ఉత్సవాలు ఈ సమయంలో కొయ్య బొమ్మలు ఎక్కువగా చేస్తారు చూ. ఉత్సవం (కో 17)

**సంభావనలు** పూర్వం మహారాజులు తోలుబొమ్మలాట ఆడేవారికి ఇచ్చే దక్షిణలు (కో 15)

**సరల్స్** కొయ్య వస్తువులు అతికించటానికి వాడే జిగురు. (తె 7,13)

**సరస్వతి** తోలుబొమ్మలాట వారు ఆట సమయంలో కొలిచే దేవత చదువుల తల్లి (రా 10)

**సరస్వతి ప్రార్థన** తోలుబొమ్మలాటకు ముందు పాడే సరస్వతీ దేవి భక్తి గీతం (కో 37)

**సర్వలు** లోహం పనిలో చేసే లోహం పాత్రలు (తె.12)

**సరాబు** · విశ్వబ్రాహ్మణ శాఖకు చెందిన వీరిని వ్యావహారికంగా "వడ్రంగులు" అని కూడా అంటారు (కో.5,7)

**సర్పాలు** కొయ్యపనిలో చేసే పాము బొమ్మలు (కో.13)

**సరిచేయు** పర్యా సవరించు తోలుబొమ్మలకు వాడే చర్మాన్ని సాపు చేయుటం (కో 3,7)

**సరిగోల** · లోహం కరిగించినప్పుడు కలపటానికి వాడే పుల్ల చూ మైనం కర్ర (కో 31)

**సర్కిన్** . బిందెల తయారీలో వాడే 16 అంగుళాల ఇత్తడి బిళ్ళ (కో 4)

**సర్పీసు** కొయ్యపనిలో, కొమ్ము పనిలో, చేతికర్రలకు కొమ్ము పిడులు అతికించటానికి వాడే ద్రవ్యం. (కో 1,9,10,13,16,23,27)

**పరుకు** : లోహం పనిలో విగ్రహం మోల్డ్ చేయటానికి కరిగించిన లోహం. చూ మెటల్ (కో.18, తె 12)

**పల్** : గాజును వంకర లేకుండా సరిచేయటానికి గాజుని తొడిగే వలయం. (తె.1)

**పల్ఫర్** : పర్యా సల్ఫర్ ద్రావకం, సల్ఫర్ యాసిడ్ లోహం పనిలో, ఫిలిగ్రీ పనిలో వస్తువులు మెరుగు రావటానికి వాడే ద్రావకం. (కో 27,31, తె 1,10)

**పలాకి** : లోహం పనిలో వాడే కొలిమిలో బొగ్గులు కలపటానికి వాడే పరికరం. (తె 1,12)

**పవనం** : ఫిలిగ్రీ పనిలో చిన్న వస్తువుల్ని పట్టుకొందుకు సన్న వెండి తీగను మలిచేప్పుడు వాడే పరికరం చూ శ్రావణం. (తె 1,8)

**పవ్వడిలు (కలుపు)** : తోలు బొమ్మలాటలో గాత్రంతో పాటు కలిపే సంగీత వాద్యాల ధ్వనులు (కో 30)

**పవ్వపీర్నం** : కొయ్యపనిలో పలకగా చెక్కడానికి వాడే సీర్నం (తె.13)

**(సాగ)దీయు** : తోలుబొమ్మల తయారీకి వాడే చర్మాన్ని సాపు చేయు. (కో.5,7)

**సాగగొట్టు** : లోహం పనిలో రేకుని వెడల్పు చేయు (కో.13; తె.12)

**సాగు** : లోహం రేకుని రోలింగ్ మిషన్‌లో పెట్టినప్పుడు పొడవుగ అవటం (రా 11)

**సాగువానిచెక్క** : కొయ్యపనిలో వాడే టేకు చెక్క అడివి టేకు. (తె.13)

**సాగేయు** : చూ సాగగొట్టు (తె 8)

**సాంచ** : లోహం పనిలో కొయ్య పనిలో చేసే నమూనా బొమ్మ. (తె.12,13)

**సాంచమట్టి** : లోహం పనిలో విగ్రహం మోల్డ్ చేయటానికి వాడే మట్టి బొమ్మ తయారీకి వాడే మన్ను (తె 12)

**సాంచాబొగ్గు** : లోహం పనిలో వాడే కొలిమిలో ఉపయోగించే మామూలు కట్టె బొగ్గు. (తె 10)

**సాడస్ట్** . రంపం పొట్టు, కర్ర పొట్టు, రావడి చూ కట్టెగోశిన పొట్టు (తె 4)

**సాండ్‌పేపరు** : 1.కొయ్య బొమ్మలు నునుపు చేయటానికి గరుకు కాగితం (కో 16)

2 లోహం పనిలో వాడే మొలలు పదును చేయటానికి వాడే గాజు కాగితం (తె 1)

**సాత్‌పిడి** : కొయ్యపనిలో సీర్నాలను చెక్క మీద కొట్టడానికి ఉపయోగించే కర్ర పరికరం (తె 13)

**సాదాలక్కరంగు** · కొమ్ము బొమ్మలకి వేసే ఏరంగు లేని మామూలు లక్క రంగు (కో 32)

**సాధనం** · తోలు బొమ్మలకు డిజైన్ చేయటానికి వాడే దబ్బనం (రా 10)

**సానబెట్టు** . రూపా సానపట్టు లోహం పనిలో, కొయ్య పనిలో వాడే పనిముట్లకు పదును పెట్టు (కో 3,11, 28,33)

**సానదుక్క** · పదును పెట్టడానికి వాడే దుంగ. (కో.8)

**సానముక్క** : ఫిలిగ్రీ పనిలో వస్తువులు మెరుగు రావటానికి వాడే సానరాయి, సానవక్క (తె 8)

**సానరాయి** · 1. చూ సానముక్క (తె 8)

2 పర్యా. కార్బోరాండం రాయి కొయ్య బొమ్మల తయారీలో వాడే ఉలులు పదును రావటానికి వాడే రాయి. చూ అకురాయి. (కో 16, తె.3, రా 5)

**సాపు(చేయు)** : కొమ్ము బొమ్మలు, తోలు బొమ్మలు తయారీలో వస్తువుల్ని నునుపు చేయటం లేదా శుభ్రం చేయటం చూ నునుపు. (కో 1,5,6,7,9,16, 21,24,26,27,28,33,37, తె.1,3,4,5,6,11,12,13; రా 5)

**సాపుకర్ర** · 1. కొయ్య బొమ్మలకి వాడే ఎగుడు, దిగుడు లేని కొయ్య (తె 13)

**సాపురావణం** · నిర్మల్ బొమ్మల తయారీలో మనుపు కోసం ఆకురాయితో రాయడం (తె 4)

**సాఫ్టటాయ్స్** పత్తి, బట్ట బొమ్మలు (రా 7)

**సామాను** · ఫిలిగ్రీ పనిలో ఉపయోగించే పరికరాలు (తె 8, రా 9)

**సామిల్** : కొయ్యల్ని కోసే మిల్లు (తె 4,13)

**సాంబ్రాణి** · లోహం పనిలో నమూనాను బిగించటానికి వాడే లక్కలో కలిపే ద్రవ్యం (తె 1)

**సాయి** . తోలు బొమ్మలకు రంగులు వేసేప్పుడు వాడే మిక్స్‌డ్ కలర్స్ (రా 2)

**సారె సామాను** కూతుర్ని అత్తగారింటికి పంపేప్పుడు ఆమెతో పంపే కొయ్య సామాను (కో.13)

**సావేరి** : తోలు బొమ్మలాటలో వాడే రాగం పేరు. (రా 2)

**సాహిత్యాక్షరం** స,రి,గ,మ,ప,ద,ని - లలో ఒకటి (కో 7)

**సికింజ** : కొయ్య బొమ్మల్ని అతికించేప్పుడు కర్ర భాగాల్ని దగ్గరగ అదిమిపట్టడానికి వాడే సాధనం (తె 1,13)

**సిగార్‌డబ్బీ** ఫిలిగ్రీ పనిలో చేసే వస్తువు (తె.8)

**సింగ్‌రూప్** నిర్మల్ బొమ్మలకు, కొయ్య బొమ్మలకు వాడే ఎరుపు రంగు చూ ఇంగ్లీకం (తె 1,2,4,7)

**సింగిడీ** : లక్క గాజుల తయారీలో లక్క మిశ్రమాన్ని ఉడికించటానికి వాడే బొగ్గులు (తె.1)

**సిటింగ్‌ఫ్రేం** కొయ్యపనిలో చేసే కుర్చీకి కూర్చొనేందుకు పనికి వచ్చే చట్రం (కో 35)

**సిత్పాలకాయ** నిర్మల్ బొమ్మలలో చేసే సీతాఫలం నమూనా (తె 4)

**సివరంపం** · కొయ్య పనిలో చెక్కను కోయడానికి వాడే చిన్న రంపం (రా 3)

**సిమెంట్‌ఫ్లోర్** . సిమెంటుతో నున్నగ చేసిన నేల దీని మీద కాగితం గుజ్జు, బొమ్మల తయారీకి పేపరు మట్టిని అట్టలా చేసేప్పుడు పెట్టి అప్పడాల కర్రతో తోముతారు (కో 41)

**సిమెంట్ ప్లేమరు** చూ సిమెంటు ప్రైమర్. (కో 17)

**సిరల్స్** చూ సరల్స్ (తె 3,4)

**సిరిదేవి** : ఒక జానపద దేవత రంపం పొట్టు బొమ్మ (తె 9)

**సివాసెట్టు** · కొయ్యపనిలో చేసే దారు శిల్పం (కో 3)

**సివిలిపెట్టు** ఫిలిగ్రీ పనిలో వస్తువులకి మెరుగుపెట్టు (తె 1)

**సింహతలాటం** · రథారూఢుడై ఉన్న తోలు బొమ్మలో ఒక భాగం (రా 2)

**సింహద్వారం** : కొయ్యపనిలో చేసే వస్తువు (రా.4)

**సింహద్వారాలు శెకనం** కొయ్యపనిలో దేవాలయాల సింహద్వారాలపై చెక్కడం (తె.13)

**సింహపాదం** మండపాలకు చెక్కే స్తంభాలలో ఒక రకం (రా 5)

**సింహం** కొయ్యపనిలో చేసే బొమ్మ (రా 4)

**సింహం తల** · లోహం పనిలో చేసే మకరతోరణం మధ్యన ఉండే భాగం చూ చిత్రం-13 2. (తె 12)

**సింహం తలకర్ర** చేతికర్రల తయారీలో సింహం తలాకారంలోని కర్ర మొదలు. చూ చిత్రం-5 (కో 12)

**సింహం బ్రాండ్ ఉంగరం** ఫిలిగ్రీ పనిలో చేసే చేతివేలికి పెట్టుకునే ఆభరణం. చూ చిత్రం-60. (కో.27)

**సింహాద్రి రాజు** · జానపద కథానాయకుడు రంపం పొట్టు బొమ్మ. (తె 9)

**సింహేంద్ర మధ్యం** · తోలు బొమ్మలాటలో వాడే రాగం పేరు (రా 2)

**సీజన్ చేయు** కొయ్యని బొమ్మ తయారీకి వీలుగ చేయు (తె 1)

**సీతమ్మ** . ఒక జానపద దేవత రంపం పొట్టు బొమ్మ (తె 9)

**సీతాకోక చిలుక** . ఫిలిగ్రీ పనిలో చేసే సీతాకోక చిలుక

బొమ్మ ఉన్నపైట పిన్ను. త్రీత్రీ నమూనా. (తె 8)

**పీనం :** కొయ్యమీద డిజైనులు చెక్కటానికి వాడే సాధనం (కో.34)

**పీనికరోర :** లోహం పనిలో మైనం కరిగించేప్పుడు కలవటానికి వాడే పుల్లలు వేసుకునే పాత్ర (తె 12)

**పీనిమూస :** ఫిలిగ్రీ పనిలో ఎక్కువ వెండిని కరిగించడానికి వాడే పెద్ద మూస (తె.8)

**పీర్నం :** తోలు బొమ్మల తయారీలో వాడే పరికరం (తె 6, రా.2,5)

**పీర్నాలపని :** కొయ్యమీద సీర్నాలతో శిల్పం చెక్కే పని (రా 4)

**పీరేశీర్లం :** కొయ్యపనిలో కొయ్యని సీరడానికి వాడే సాధనం (రా.5)

**పీల :** మేకు

1. లోహం పనిలో వాడే ఊసల కారులో భాగం (కో.8)

2. కొయ్య పనిలో బొమ్మలకు ఉపయోగించే వస్తువు (రా.4)

3 తోలు బొమ్మల తయారీకి వాడే తోలుని ఆరబెట్టినప్పుడు నేలకు కొట్టడానికి వాడే సాధనం (కో.37)

**పీవంకర్ర :** చేతికర్రలకు, నిర్మల్ బొమ్మల తయారీకి వాడే జిట్టేగి కొయ్య (రోస్‌వుడ్) (తె 4,5)

**పీవంచెట్టు :** జిట్టేగి చెట్టు దీని కొయ్యను బొమ్మల తయారీకి వాడ్తారు (తె.4)

**పీవంపుల్ల :** జిట్టేగి కర్ర పుల్ల (తె.3)

**సుక్కమొల :** లోహం పనిలో చుక్కల డిజైన్ కొట్టడానికి వాడే సాధనం. చుక్కమొల. (తె.12)

**సుక్కాం :** పర్యా పేపరు పొడి కాగితం గుజ్జు బొమ్మల తయారీలో చేసే కాగితం పొడి (కో 17)

**సుట్ట** ఫిలిగ్రీ పనిలో ఒక డిజైన్‌లో మలచిన వెండి తీగ. (తె 8)

**సుడుగులు(మలచు) ·** ఫిలిగ్రీ పనిలో సన్నతీగను "లి" ఆకారంలో మలచి డిజైన్స్‌లో నింపుతారు వీటిని సుడుగులంటారు (తె 8)

**సుత్తి :** లోహం పనిలోను, కొయ్య పనిలోను, ఫిలిగ్రీ పనిలోను, కొమ్ము పనిలోను వాడే పరికరం (కో 1,3,4, 6,7,8,23,25,29,31,33,37, తె 1,3,6,8,10,12; రా 3,5,6,8,13)

**సుత్తుల పోగర .** కొయ్యపనిలో బొమ్మలు చేసేప్పుడు వాడే పరికరం (రా 3,5,6)

**సుదర్శన్ తలపిన్ను** ఫిలిగ్రీ పనిలో చేసే ఆడవాళ్ళు తలలో పెట్టుకునే ఆభరణం చూ చిత్రం-67 (తె 8)

**సుద్ద ·** 1 కొయ్య బొమ్మలకు ముక్కుపైన పూసే సున్నం. (తె 4,7)

2 సుద్ద బొమ్మల తయారీకి వాడే ద్రవ్యం (కో 27)

3 లోహం పనిలో నమూనా బొమ్మ చేయటానికి వాడే మట్టిలో కలిపే పదార్థం (కో 28)

4 చూ నాము తోలు బొమ్మలకు వేసే రంగు ముద్దగ ఉండటం. (కో 30, రా 2)

**సుద్దం :** కొయ్యపనిలో వస్తువులని నయం చేయటం. (కో 35)

**సుద్దమట్టి** కొయ్య బొమ్మలకు, నిర్మల్ బొమ్మలకు వేసే తెలుపు రంగు తయారీలో పూర్వం వాగులో గుంటల్లోని మెత్తటి మట్టిని వడబోసి దీన్ని తయారు చేసేవారు (తె 1,4)

**సునుగు ·** లోహం పనిలో చేసే ఒక డిజైన్ పేరు. (తె 12)

**సునుగుమొల .** లోహం పనిలో ఉపయోగించే పరికరం. చూ.చిత్రం-139 (కో 35)

**సున్నపోగర ·** లోహం పనిలో విగ్రహం చెక్కటానికి వాడే పరికరం (కో 8)

**సున్నం(పెట్టు) :** 1 తోలు బొమ్మల తయారీలో చర్మాన్ని శుద్ధి చేయటానికి వాడే ద్రవ్యం (కో 7, తె 2,3, రా 2)

2. కొయ్య బొమ్మలకు పైన పూసే ద్రవ్యం (కో 26)

**సున్నాలు(కొట్టు) :** లోహం పనిలో ఆభరణాల్లో కనిపించే సున్నాల వంటి భాగాల్ని చెక్కటం (తె 12)

**సుమంగళి సూత్రాలు** ఫిలిగ్రీ పనిలో చేసే ఆభరణం చూ చిత్రం-77 (తె 8)

**సుమారు .** ఇంచుమించు, ఉజ్జాయింపు (లోహం బొమ్మల తయారీలో నమూనా బొమ్మను చేయటానికి వాడే మట్టిలో గుడ్డ గుండు, నల్లమట్టి సుమారుగ కలపటం) (కో 1)

**సురభి :** తోలుబొమ్మలాటవారి స్వగ్రామం (రా 2)

**సులోచన సాగరం** ఒక తోలు బొమ్మలాట (రా 2)

**సుళువు :** తేలిక కొయ్య బొమ్మల్ని చెక్కేప్పుడు తేలికగ కొట్టాలి (కో 13)

**సువ్వ :** ఫిలిగ్రీ పనిలో వాడే సన్నని వెండి కడ్డీ (కో 27)

**సూత్రధారులు** తోలుబొమ్మలాటలో కథ చెప్పేవారు (రా.12)

**సూత్రాలు :** రోల్డ్‌గోల్డ్, ఫిలిగ్రీ పనిలో చేసే మంగళ సూత్రాలు (కో.33)

**సూది :** కొయ్యపనిలో వాడే జాలిమిషన్‌లో ఉండే భాగం. (తె.13)

**సూరిపలక :** రూపా సూర్యపలక కొయ్యపనిలో చేసే సింహ ద్వారంలో భాగం. (రా 4)

**సూపర్‌నయంపేపరు** కొయ్య డిజైన్లను నునుపు చేయటానికి వాడే గరుకు కాగితంలో రకం (కో 34)

**సూపుమొల :** లోహం పనిలో డిజైన్లు చెక్కటానికి వాడే సుక్కమొల చుక్కమొల (తె 12)

**సూరకత్తి .** తోలు బొమ్మలకు వాడే చర్మం మీద జాట్టు తీసే పరికరం (కో 15)

**సూర్యమార్కు :** తోలు బొమ్మలకు వాడే రంగు పొడరులో ఒక రకం. (కో 37)

**సూరుకత్తి .** చాకు. చూ సూరకత్తి (కో 37)

**సూత్రంబొమ్మ** తోలుబొమ్మలలో ఒక రకం. దీన్నే కీలు బొమ్మ అంటారు (రా 12)

**సృతిప్రమాణం ·** తోలు బొమ్మలాటకు ముందు సంగీత వాద్యాలు సరిచూసుకునే స్వర ప్రమాణం (కో 37)

**సెక్కుసెదరకుండ** తోలు బొమ్మలకు వేసే రంగులు ఏ విధంగాను పొడవకుండా (కో 6)

**సెగ(చూపు)** 1 చేతికర్రల పిడులకు వాడే కొమ్ములని వంచటానికి వేడి చేయు (తె 5)

2. గాజుల తయారీలో లక్కని కరిగించటానికి వేడి చేయు (తె 1)

3 ఫిలిగ్రీ పనిలో వస్తువుల్ని నిప్పు దగ్గరగ పెట్టి వేడి చేయు (తె 6)

**సెట్ ·** కొండపల్లి బొమ్మల తయారీలో చేసే దశావతారాల మొత్తం (కో 20)

**సెంటర్(ముక్క) :** తోలు బొమ్మలకు వాడే మేక చర్మాన్ని కోసేప్పుడు ప్రారంభించే ప్రాంతం (కో 7)

**సెంటీమీటరు :** కొయ్యపనిలో చిల్లులు చేయటానికి వాడే హేండ్ డ్రిల్లింగ్ మిషన్‌లో ఉండే బ్లేడు కొలత. (రా.4)

**సెప్టీకొట్టు ·** పర్యా. ఎలుపుకొట్టు, వట్టెంకొట్టు ఫిలిగ్రీపనిలో తీగను వెడల్పుగ చేస్తూ కొట్టు (తె 8)

**సెలుసు** ఇత్తడి బిందె తయారీలో బిందె పై భాగంలో ఉండే ఇత్తడి రేకుని 5 సార్లు కొట్టిన తర్వాత వచ్చే ఆకాశం. (కో 4)

**సెల్‌సుకి ·** లోహం పనిలో ఉపయోగించే పరికరం. చూ చిత్రం-127 (కో 35)

**పేగు .** చింతకట్టె మధ్యలో నల్లగ ఉండే భాగం (కొయ్య బొమ్మల తయారీలో సుత్తికి బదులు వాడే కొడితి తయారీకి వాడేది) (రా.13)

**పేనం :** లోహం పనిలో విగ్రహం చెక్కటానికి వాడే పరికరం (కో.1,31)

**పేర్షం :** వర్మా పొగారు. కొయ్యబొమ్మలు చెక్కటానికి వాడే సాధనం చూ. చానం (రా 4)

**పేవ** చేతికర్రల తయారీలో కర్రకుండే సహజమైన రంగు (కో.23)

**పేండ్‌పేపర్ :** దంతం పనిలో వాడే గరుకు కాగితం, నునుపు కోసం వాడ్తారు. (కో 4)

**సైకిల్ గొలుసు :** ఫిలిగ్రీ పనిలో సైకిల్ గొలుసు ఆకారంలో చేసే ఆభరణం. చూ చిత్రం-91 (తె 8)

**సైకిల్‌చక్రం :** లోహం పనిలో పంకాకు వాడే చక్రం (తె 12)

**సైజు** పరిమాణం (కో 2,5,7,16,21,24,26,28,31,41, తె.12, రా 1,3,4,5,8,11)

**సైట్‌సువి :** లోహం పనిలో చిన్న చిన్న చుక్కలు కొట్టడానికి ఉపయోగించే పరికరం (తె 1)

**సైడుగీతలు(కొట్టు) ·** లోహం పనిలో రేకుమీద డిజైన్లు చేసేప్పుడు రేకు చుట్టూ కొట్టిన గీతలు (తె 10)

**సైన్ :** తోలు బొమ్మలకు వాడే చర్మం సైన్ చేయటం (కో.37)

**సైన్‌పేపరు ·** కొయ్యపనిలో నునుపు చేయటానికి వాడే గరుకు కాగితం (కో.31,35)

**సైమగుడ్డ :** రంపం పొట్టు బొమ్మలపైన చుట్టటానికి వాడే గుడ్డ. (తె.9)

**సైమబట్ట :** కొయ్య బొమ్మలకు మక్కుపూసి పైన చుట్టటానికి వాడే బట్ట (తె 7)

**సైవింగు :** లోహం పనిలో వస్తువులు, కొయ్య పనిలో బొమ్మలకు చేసే మెరుగు (కో 5,6)

**సొక్కం** ఫిలిగ్రీ పనిలో వాడే వెండి స్వచ్ఛంగ ఉండటం (తె 8)

**సొప్పకలం** రంపం పొట్టు బొమ్మలకు రంగులు వేయటానికి వాడే పెద్ద కుంచె (కో 40)

**సొమ్ము(మరుగు/పోయు) ·** 1. లోహం పనిలో లోహం బాగా కాగడం కరిగిన లోహం మోల్డ్‌లో పోయడం. (తె 1,10,12)

2 తోలు బొమ్మలకు చేసే ఆభరణాలు చూ మెటల్ (రా 2)

**సొమ్ముల డిజైన్** లోహం పనిలో బొమ్మలకు చేసే ఆభరణాల డిజైన్ (తె 12)

**సొరకాన .** సొరుగు (తె 8)

**సోమబద్ద .** లోహం పనిలో, దరియా పెట్టెలో ఒత్తిన మట్టిని ఒకే లెవెల్‌కి తేవడానికి ఉపయోగించే సాధనం (ఇనపది) (తె 12)

**సోనం** చిట్కా. గాజులకు అతికే పూసలు, అద్దాలు, రాళ్ళు పట్టుకుందుకు వాడేది, పట్కారు (తె.1)

**సౌకం(కొట్టు) .** 1 ఫిలిగ్రీ పనిలో కడ్డీని నాలుగు మూలలు కొట్టడం (తె 8)

2. చతురస్రం - చౌకీట్ చూ సత్యేకం (తె.3)

**సౌకం అడ్డగన్ను సుత్తె .** లోహం పనిలో వాడే అడుగు చదరంగా ఉండే అడ్డగన్ను సుత్తె (తె 12)

**సౌకం కొరాం .** లోహం పనిలో వాడే పరికరం (తె 12)

**సౌకం డబ్బీ :** ఫిలిగ్రీ పనిలో చేసే చతురస్రం, దీర్ఘ చతురస్రం ఆకారంలోని పెట్టెలు (తె 8)

**సౌకం డాకలి :** చదరపు దాగలి లోహం పనిలో రేకుమీద పని చేసేప్పుడు దీనిమీద పెట్టి చేస్తారు (తె 12)

**సౌగ్రాం :** వంద గ్రాములు లోహం పనిలో దరియా పెట్టెలో వేసే మట్టిలో రోజన్‌మట్టి బరువు. (తె 12)

**స్కవయరుపీటు ·** 'Square feet' కొయ్య పనిలో కొయ్యని

కోసేప్పుడు వాడే కొలత చదరపు అడుగు (కో 35)

**స్టఫ్ :** పత్తి బొమ్మల తయారీలో దూదిని కూరటం (రా 7)

**స్వరూపం :** లోహం పనిలో చేసే బొమ్మ ఆకారం (తె.1)

**స్కాలరు** పండితుడు (రా 8)

**స్టాకు ఉంచు .** కొండపల్లి బొమ్మలు తయారు చేసి నిలవ ఉంచు (కో.26)

**స్టాండ్ :** 1 ఫిలిగ్రీ పనిలో వెండి తీగ తీసే రాట్నంలో భాగం. (తె 8)

2 గవ్వల్లో రకం అడుగుపెల్లు (రా 5)

**స్మాల్‌రాబిట్ .** ఒక గుడ్డ బొమ్మ (చిన్న కుందేలు) (రా 7)

**స్వాగావ్ :** ఇత్తడి బొమ్మ భాగాలు అతకటానికి వాడే ద్రవ్యం (తె 1)

**స్టిక్ .** పత్తి బొమ్మల తయారీలో దూదిని బొమ్మలో కూరే పుల్ల (రా 7)

**స్పిరిట్ .** కొయ్య బొమ్మలకి పూసే పాలిష్ (కో 24, తె 3,13, రా 5)

**స్ప్రింగ్ :** కొయ్యలో చేసిన పిట్ట బొమ్మలు ఊగటానికి వాడే సాధనం (కో 3)

**స్ప్రింగ్‌మోడల్ :** ఫిలిగ్రీ పనిలో సవనంతో చేసే పని (తె.8)

**స్ప్రింగ్‌యాక్షన్** కొయ్య బొమ్మలకు స్ప్రింగ్ అమర్చటం వలన ఊగటం (రా 4)

**స్ప్రింగ్‌రామచిలుకలు :** కొయ్యపనిలో స్ప్రింగ్ అమర్చిన రామచిలుకలు (కో 3)

**స్క్రీన్ :** తోలు బొమ్మలాటలో కట్టే తెర . (రా 12)

**స్క్రూ :** దంతం పనిలో చేసే పెట్టెకి బందీలు బిగించటానికి వాడే మర (కో 9)

**స్క్రూడ్రైవర్ ·** స్క్రూ బిగించటానికి వాడే సాధనం (కో 7,28; తె.2,3, రా 5)

**స్మూత్ .** కొయ్య బొమ్మల్ని నునుపు చేయటం (కో 31,34, తె 13)

**స్మూత్ ఆకురాయి .** లోహం పనిలో నునుపు రావటానికి వాడే ఆకురాయి (తె.1)

**స్మూత్‌ఫైల్ ·** కొయ్య బొమ్మల్ని చిన్నముండ్ల ఆకురాయితో రాయడం (తె 1,4)

**స్మూతింగ్‌ప్లెయిన్ ·** కొయ్య పనిలో పల్లపు భాగాలని నునుపు చేయటానికి వాడే సాధనం (కో 16)

**స్కెచ్** కొయ్య బొమ్మల తయారీలోను ముందు బొమ్మ ఆకారాలు తేలికగా వేయటం (కో 2,5,41, రా 5,13)

**స్కేల్ ·** లోహం పనిలోను, కొయ్యపనిలోను కొలతలు చూడటానికి వాడే కొలతబద్ద (కో.3, తె 1)

**స్ప్రెడ్‌కాటన్‌రీల్ .** బట్టతో బొమ్మలు చేసేప్పుడు కుట్టటానికి వాడే నూలు చుట్ట (రా 7)

**స్టేజి :** తోలు బొమ్మలాటల రంగస్థలం (కో 3,7,37, తె 1, రా 10)

**స్ప్రేచేయ(డం) ·** నిర్మల్ బొమ్మలకు కొన్నింటికి రంగు వేసే విధానం (తె.4)

**స్ప్రేమిషన్ ·** బొమ్మలకు రంగు వేయడానికి వాడే యంత్రం (తె 4)

**స్పేర్‌పార్ట్స్ :** ఫిలిగ్రీ పనిలో వెండితీగను తీసే వైర్ మిషన్‌లో భాగాలు. (తె.8)

## హ

**హక్కు** బిచ్చగాండ్లు అడుక్కునేందుకు కొన్ని ఊర్లమీద ఉండే అధికారం. (తె 9)

**హండా ·** గవ్వ బొమ్మల తయారీలో గవ్వని ఉడికించటానికి వాడే పాత్ర (రా 5)

**హమమాండ్ల చంద్రం :** కొయ్యబొమ్మలకి వేసే రంగు (తె 7)

**హనుమాన్ లాకెట్ :** ఫిలిగ్రీ పనిలో చేసే ఆభరణం చూ చిత్రం-80. (తె 8)

**హస్తకంకణం .** తోలుబొమ్మలో ఒక భాగం పేరు (రా.2)

**హంప .** కొయ్యపనిలో చేసే డిజైన్ లేక బొమ్మ (కో 16, రా 4)

**హంసడిజైన్ కిస్తీ ·** పర్యా హంస నమూనా ఫిలిగ్రీ పనిలో హంస ఆకారంలో డిజైన్ చేసిన ట్రే. (తె 8)

**హంసనమూనా :** ఫిలిగ్రీ పనిలో చేసే డిజైన్ చూ హంస డిజైన్ కిస్తీ (తె 8)

**హంస పాదుకాయిదం :** దంతం పనిలో పాలిష్‌చేయడానికి వాడే కాగితం (కో 9)

**హామీ .** రోల్డ్‌గోల్డ్ (కో.27)

**హార్డ్‌స్టీలు :** లోహం బొమ్మల నమూనా తయారీకి వాడే లోహం. (తె 1)

**హారం ·** కొయ్య పనిలో బొమ్మలకు మెడలో చెక్కే కంఠాభరణం (తె 7, రా.4)

**హారాల డిజైన్ :** రంపం పట్టు బొమ్మలకి చేసే ఆభరణాల డిజైన్. (తె.9)

**హాస్యగాడు** (తోలు బొమ్మలాటలో) నవ్వు పుట్టించేవాడు చూ. బుడ్డ కేతిగాడు. (రా 5)

**హుక్కు .** ఫిలిగ్రీ పనిలో చేసే గొలుసులకి తగిలించుకొందుకు పెట్టే కొండి. (కో.33)

**హెక్‌సా ·** మక్కు బొమ్మల తయారీలో ఉపయోగించే పరికరం చూ.చిత్రం-170. (రా.13)

**హెచ్చుతగ్గులు ·** కొయ్య పనిలో వాడే కొయ్యకు కాగితం గుజ్జు బొమ్మలకు వీణ తయారీలో వాడే కొయ్యకు ఉండే ఎత్తుపల్లాలు చూ ఎగుడు దిగుడు. (రా.4,5,11)

**హెడ్‌బ్యాక్ ·** గుడ్డ బొమ్మలో ఒక భాగం. (రా 7)

**హేండిల్ :** 1 ఫిలిగ్రీ పనిలో వెండి దారంలా సన్నగా రావటానికి వాడే రాట్నం తిప్పటానికి ఉపయోగించే పిడి (తె.8)

2 కొయ్య పనిలో వాడే దూగోడని పని చేసేప్పుడు పట్టుకొందుకు ఉపయోగించే భాగం. (తె 13)

3 కొయ్యపనిలో చేసే కుర్చీకి చేతులు పెట్టుకొందుకు పెట్టే భాగం (కో 35)

4 లోహం పనిలో వాడే బర్మాను పట్టుకోడానికి, కొలిమి తిప్పడానికి ఉపయోగించే పిడి (తె 12)

**హేరు** (Air) హార్మోణిలో గాలి తిత్తిని వాయించేప్పుడు వచ్చే గాలి (కో 7)

**హోల్ప్ ఉలి .** రాతి పనిలో ఉపయోగించే పరికరం చూ చిత్రం-165 (రా 5)

**హ్యాండ్‌లేత్** అడ్డ (రా 7)

**హ్యాండ్స్** గుడ్డ బొమ్మలో భాగం (చేతులు) (రా 7)

# III. అన్నిరకాల బొమ్మలు, లోహం బొమ్మలు, వస్తువులు

## 1. తాటిచెట్లు కల్లు గీయటం



## 2. కత్తికర్ర




## 3. వెదురు చేతికర్ర




## 4. పక్కముఖం కర్ర



## 5. సింహం తల కర్ర



# 6. అడ్డ / సంగడి / తరణి

## అడ్డ ఊస




## అడ్డమాను




## అడ్డపీట



## దన్నుకఱ్ఱ



## ఉగ్గుబల్ల



కుంపటి



అడ్డకాయలు







విసురు ముక్కలు



దిగ్గొట్టే రాయి



లక్క కణికలు



మొగలిరేకు



## 7. కొవ్వొత్తి స్టాండు



8. బండి ఇరుసు

8.1 బండి ఇరుసు దుంగ





# 9. తోలుబొమ్మలాట


1 వెదురుగడ
2 తెరగుడ్డ
3 తోలుబొమ్మ
4 బొమ్మని ఆడించే పుల్ల
5 బొమ్మని ఆడించేవారు
6 ఆముదం దీపాలు (ప్రమిదలు)
7 మద్దెలగాడు
8 శృతిగాడు
9 బల్లచెక్కలు
10 బొమ్మలపెట్టె

## తల నుండి నడుము భాగం




## రెట్టలు / భుజాలు



## ముంజేతులు



## తొడలు



## పిక్కలు



## 13. మకర తోరణం




## 14. శకనం పనిచేసేది




## 15. చేలు / తీగ / లత



## 16. కిరీటం




## 17. జందెం మీద వళ్ళు



## 18. దరియాపెట్టె/పోతపెట్టె




## 19. మూస



## 20. రేకుగుర్రం (వాహనం)

1 తల
2 మెడ
3 పొట్టరేకు
4 ముందురేకు
5 వెనక రేకు
6 తోక
7 తొడరేకు
8 కాలిరేకు
9 పోతగిట్ట

## 21. గద్దె



## 22. శరగోపం



## 23. బిందె



# 24. లింగం



25. గవ్వబొమ్మ



26. గవ్వబొమ్మ



27. ఎఱ్ఱశంకు



30. కాలాకోడి
(బొంబాయి తీరంలోనిది) పట్లాని



31. గవ్వ



28. తెల్లశంకు



32. పచ్చైకిళి



33. పాంబుకన్ను (ణ్ణు)



29. ఐదువేళ్ల శంకు



34. మట్టుకట్టు (ణ్ణు)



35. ఊత్తి



36. కోవంజి





37. నెక్స్



38. చాక్కొలి



39. ఈక



40. పగడం



41. తెల్లగుల్ల



42. పసుపుషెల్లు (గవ్వ)



43. బొత్తంగుల్ల



44. వలప్పు



45. పోరమట్టు





46. బర్మాషెల్ (బరమాషెల్లు)



47. కాకామూకు



48. చెవి కమ్మలు



49. జాలర్ కమ్మలు



50. వంకీ కమ్మలు



51. జక్కమ్మ కమ్మలు



52, 53. పూల కమ్మలు





54. ముత్యాల కమ్మలు



55. జూకా/జుంకా



56. రాళ్ల ముక్కునత్తులు



57. రాళ్ల ముక్కునత్తులు



58. వంకీ ఉంగరం



59. వంకీ ఉంగరం



60. సింహం బ్రాండ్ ఉంగరం



61. ఒంటిరాయి ఉంగరం



62. మద్రాసు గాజులు



63. టైగర్ గాజులు



64. వేరు వేరు డిజైన్ల గాజులు



మిరియం గాజులు



బరోడా గాజులు

రాళ్ల గాజులు

65. నాగుపడగ



రాగిడి జడబిళ్ల



66. నెలవంక తలపిన్ను



67. సుదర్శన్ తలపిన్ను



68. రాళ్ల రాగిడి



69. నెమలి రాళ్ల రాగిడి



70. రాళ్ల పాపిడి గొలుసు



71. అరవంకి



72. రాళ్ల మాటీలు



# 74. నగిషీ పిల్ల కుప్పెలు



## 75. చొక్కా గుండీలు / బొత్తాములు






## 76. తాళిబొట్ల జత



## 77. సుమంగళి సూత్రాలు




## 78. రాళ్ల లాకెట్లు











79. బాలాజీ లాకెట్ 80. హనుమాన్ లాకెట్ 81. లక్ష్మి లాకెట్





82. ఒంటిరాయి లాకెట్లు







83. పులిగోరు లాకెట్ 84. ఎ) ముత్యాల లాకెట్ బి) బాతు లాకెట్







85. బొత్తాల గొలుసు 86. అల్లిక గొలుసు





కమలం లాకెట్టు





పులిగోరు లాకెట్టు





హంసల లాకెట్టు



సరస్వతి లాకెట్టు



## 87. కాఫీ గింజల గొలుసు





88. అ) మగవాళ్ల గొలుసు



ఆ) మల్లేశ్వరి గొలుసు



89. గోవర్ధన గొలుసు



90. మద్రాసు గొలుసు



91. సైకిల్ గొలుసు





## 92. చంద్రహారం

## 93. కాశీకాయల మాల





## 94. కళావర్ నెక్లెసు



## 95. అనార్కలీ నెక్లెసు



## 96. అపోలో రాళ్ళ నెక్లెసు



## 97. ప్రభాత నెక్లెసు



## 98. మల్లెమొగ్గల నెక్లెసు



## 99. రవ్వల నెక్లెసు



## 100. రాజకుమారి నెక్లెసు



## 101. పెండ్లి నెక్లెసు



## 102. ఒంటిపేట 'వి' నెక్లెసు



## 103. పైన పిన్ను



# కొమ్ముబొమ్మల తయారీ

104. నునుపు చేయడానికి బాడితె




105. ఉలి

బొమ్మను చెక్కేది




106. ఆకురాయి




కొమ్ము



107 కీతరేకు




కోసిన కొమ్ము





108 రంపం



109. పటాసి



110. గద్దూలి



## 2. కొండపల్లి బొమ్మల తయారీ

111. మెట్నా



112. చావుదారు



# 3. చేతికర్రల తయారీ

## 113. బర్మా



## 114. త్రికోణ బల్బ



# 4. తోలుబొమ్మల తయారీ

115. టెంకి



116. చెక్కి



117. పేనా / కాకి వెదురు



118. గోరుగల్



119. దోసగింజ చీర్ణం



120. గుండు చీర్ణం



121. నక్షత్రం జీర్ణమొల



122. ముక్కోణం చీర్ణం



123. తెల్యామం



124. రౌండు దాగలి



125. చరాపుమొల



126. గీతమొల



127. సెల్‌సుకి



128. గూటిక మొల



129. తబలావాల్మోల



130. కాల్య మొల



131. పద్మ మొల



132. ఖైరీ మొల



133. బలు మొల



134. కన్ను మొల



135. డాకలి



136. గుట్టల మొల



137. బాదాం మొల



లోహం పనిలో కొన్ని డిజైన్లు



138. చిన్నగుట్టల మొల





139. సునుగు మొల







## 140. సక్కటి కైవారం



## 141. వంపు కైవారం



## 142. చిన్నవంపు కైవారం





143. కోరాం పట్ట







144. వంపు కోరాం



145. గల్త కోరాం



148. చౌకం కోరాం



149. గన్ను కోరాం



150. కత్ర సుత్తె



151. అడ్డగన్ను సుత్తె



146. వట్రువ గన్ను



147. రౌండు అడ్డగన్ను



152. బుగ్గ కారు/బుక్కారు



153. కారు



154. నోసు ప్లేయరు



155. బొగ్గుల కారు



156, 157. కాడ





# శిల్పం (రాతి) పని

158. గ్రేసరు



159. తాపీ



160. మూలమట్టం



161. పాలిష్ రాయి



162. ఆపెలు



163. అరపాశం



164. పళ్లమొన



165. హోల్సు ఉలి



166. దబ్బశీర్ణం



167. చిన్న శీర్ణం



168. సన్న శీర్ణం



# మక్కు బొమ్మల తయారి

## 169. బరమ




## 170. హెక్సా




## 171. ప్లేను - దూగోడ



## 172. కొడిపి / చింతచేవ



## కొయ్యపని

173. అగరు



174. ఇంటి కఱ్ఱ



175. తొరపణం బరమ




176. గీత పలక




177. చెక్క బేంగ



178. ఉక్కు వంకీ





# మాండలిక వృత్తి పదకోశం

## (కళలు)


సంపాదకులు

డా॥ బూదరాజు రాధాకృష్ణ





పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వ విద్యాలయం

హైదరాబాదు - 500 004

# మాండలిక వృత్తి పదకోశం

## సంపుటం : 15 (కళలు)



సంపాదకులు

**డా॥ బూదరాజు రాధాకృష్ణ**

చిత్రకారులు

**రాంభట్ల కృష్ణమూర్తి**

**సి.హెచ్. సత్యప్రకాశం**





ప్రచురణ

**పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం**

హైదరాబాదు - 500 004

**1997**

**MANDALIKA VRITHI PADAKOSHAM**
Volume 15,
A Dialect Dictionary of Handicrafts
Editor Dr BUDARAJU RADHAKRISHNA

---



ప్రచురణ సంఖ్య : 194

ప్రథమ ముద్రణ : 1997

ప్రతులు : 1000

వెల : రూ. **110/-**

ప్రతులకు :
డైరక్టర్, ప్రచురణల విభాగం
పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం
లలిత కళాక్షేత్రం, పబ్లిక్ గార్డెన్స్, నాంపల్లి,
హైదరాబాదు - 500 004.

ముద్రణ :
చరితా గ్రాఫిక్స్, చిక్కడపల్లి, హైదరాబాద్.

N : 81-86073-30-2

ఆచార్య నాయని కృష్ణకుమారి
ఉపాధ్యక్షులు
పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం

లలిత కళాక్షేత్రం, పబ్లిక్ గార్డెన్స్,
హైదరాబాదు - 500 004

# ముందుమాట

బోధన, పరిశోధన, ప్రచురణలు అనే మూడు విషయాలు లక్ష్యంగా, తెలుగు సాహిత్యం, భాష, చరిత్ర, కళలు, సంస్కృతి వంటి రంగాలలో కృషి సల్పడానికి 1985వ సంవత్సరంలో పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం ఆవిర్భవించింది. పూర్వం ఉన్న ఆంధ్రప్రదేశ్ సాహిత్య, సంగీత, నాటక, నృత్య, లలితకళా అకాడమీలు ఇందులో విలీనం కావడం వల్లన పైన పేర్కొన్న లక్ష్యాలతో పాటు మరెన్నో బాధ్యతలు దీనికి సంక్రమించాయి. అన్ని విశ్వవిద్యాలయాల వలే కేవలం పఠన పాఠనాలతో సరిపెట్టుకునే అల్ప పరిధి కాదు దీనిది. మన సంస్కృతిని ప్రపంచం నలుమూలలకు వ్యాప్తి చేయడానికి ఉద్దేశింపబడిన "సాంస్కృతిక విశ్వవిద్యాలయ"మిది. ప్రచార సాధనకు పరికరమే ప్రచురణ.

ప్రచురణ కార్యక్రమానికి అనుగుణంగా, ఈ విశ్వవిద్యాలయంలో యిప్పటికెన్నో ప్రముఖ గ్రంథాలను ప్రచురించింది. వ్యాఖ్యా ప్రవంతి శీర్షికను సుప్రసిద్ధ, పండితులచే ప్రాచీన కావ్య ప్రబంధాలకు వ్యాఖ్యానాలు వ్రాయించి ప్రచురించింది. ఇప్పటివరకు ఈ ప్రణాళికలో కుమార సంభవం, కాశీ ఖండం, శివరాత్రి మహత్మ్యం గ్రంథాలను వ్యాఖ్యా సహితంగా ముద్రించింది.

తెలుగులో పేరు పొందిన ప్రాచీన ఆధునిక గ్రంథాలను ఇంగ్లీషు, హిందీ భాషలలోనికి అనువాదం చేయించి ప్రచురించింది.

తెలుగులో విజ్ఞాన సర్వస్వ సంపుటాలను తయారు చేయించే కార్యక్రమంలో విశ్వసాహితిని "హిస్టరీ అండ్ కల్చర్ ఆఫ్ ది ఆంధ్రాస్' పేరుతో ఆంగ్లంలో ఒక సంపుటాన్ని ప్రచురించింది.

భాషాభివృద్ధి కృషిలో భాగంగా 'తెలుగు భాషా చరిత్ర', 'ద్రావిడ భాషలు' అనే గ్రంథాలను పునర్ముద్రించింది. ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం సాంఘిక సంక్షేమ శాఖవారి సహకారంతో డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ రచనలు - ప్రసంగాలను పది సంపుటాలుగా ప్రచురించింది.

లోగడ ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి చేపట్టిన గ్రంథ ప్రచురణ కార్యక్రమాల్లో భాగమైన మాండలిక వృత్తి పదకోశ నిర్మాణం ఎంతో ప్రత్యేకతను సంతరించుకొంది. అప్పట్లో అకాడమీ ఆధ్వర్యంలో నాలుగు వృత్తి పదకోశాలు ప్రచురితమయ్యాయి. విశ్వవిద్యాలయం వృత్తి పదకోశ పరంపరలో మత్స్య పరిశ్రమ, మేదర పరిశ్రమ, లోహకారవృత్తి, వడ్రంగం కోశాలను ప్రచురించింది. 'కల్లు బెల్లం సారా' అన్న పేరుతో గీతకారుల వృత్తి, 'జంతువులు, పక్షులు వేట' అనే పేరుతో ఆటవికుల వృత్తికి సంబంధించిన పదకోశాలు తయారీలో ఉన్నాయి. త్వరలో ఆ ప్రచురణలు చేతి కందుతాయి.

తెలుగు సీమలో అనేక కళలు విలసిల్లుతున్నాయి. కళలను వృత్తిగా చేసుకుని జీవిస్తున్న వారు చాలాసంది ఉన్నారు. కళలు, కళావస్తువుల తయారీలో సుసంపన్నమైన పదజాలం ఈనాటికీ వాడుకలో ఉంది. కాని ఈ పదాలు చాలావరకు నిఘంటువుల కెక్కలేదు. అమూల్యమైన ఈ పదజాలాన్ని సేకరించి, అర్థ వివరణలతో ఇతర విశేషాలతో, పాఠక లోకానికి అందించే యత్నమే ఈ వృత్తి పదకోశ నిర్మాణానికి ముఖ్య లక్ష్యం. ఈ పదకోశ నిర్మాణ ప్రణాళిక బాధ్యతను వహించి మాండలిక వృత్తి పదకోశ సంపాదక మండలి అధ్యక్షులుగా తమ సేవలను అందిస్తున్న ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తి గారికి మా కృతజ్ఞతలు.

ప్రస్తుత గ్రంథం మాండలిక వృత్తి పదకోశం సంపుటం - 15 (కళలు) కోసం 202 గ్రామాలు పర్యటించి క్షేత్ర పర్యాటకులు విషయ సేకరణ గావించారు. ఆయా పర్యటనల వివరాలు ఇందులో శాస్త్రీయంగా పొందుపరచడం జరిగింది. వ్యవహర్తల పేర్లు, కులం, వయస్సు, ప్రధాన వృత్తి, ఉపవృత్తి, చదువు ఇత్యాది వివరాలు కూడా ఇవ్వడం వల్ల కోశానికి పరిపూర్ణత ఏర్పడింది. ఈ కోశం మూడు భాగాలుగా విభజించబడింది. ఆ భాగాలను నిర్దేశిస్తూ వాటికి సంబంధించిన బొమ్మలు, వాటిని తయారుచేసే పరికరాల చిత్రాలు ఇత్యాది వివరాలు కూడా ఇందులో పొందుపరచబడ్డాయి.

కళలకి సంబంధించిన మాండలిక వృత్తి పదకోశం చక్కగా తయారుచేసిన సంపాదకులు డా॥ బూదరాజు రాధాకృష్ణ గారికి విశ్వ విద్యాలయం ధన్యవాదాలు తెలుపుతున్నది. యథాపూర్వకంగా ఈ ప్రచురణ కూడా పరిశోధాత్మకులైన పాఠకుల ఆదరాభిమానాలు చూరగొంటుందనడంలో సందేహం లేదు.

హైదరాబాదు
తేది 29-7-1997

ఆచార్య నాయని కృష్ణకుమారి

# కృతజ్ఞతలు

అలనాటి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి నిర్ణయం మేరకు మాండలిక వృత్తి పదకోశ పరంపరలో పదిహేనవ సంపుటిగా కళలకు సంబంధించిన ఈ సంపుటాన్ని సిద్ధం చేసే బాధ్యతను నాకు అప్పగించారు. మొదట చేతి పనులకు మాత్రమే పరిమితమైన ఈ సంపుటిలో సంగీతం, చిత్రలేఖనం, నాటకం, శిల్పం వంటి లలిత కళలక్కూడా సంబంధించిన పదజాలాన్ని చేర్చాలని సంకల్పించారు. విషయసేకరణ కార్యక్రమం 3.1.1982 నాడు ఆరంభమై 14.10.1984తో ముగిసింది. దరిమిలా సమాచారాన్ని పట్టికాబద్ధం చేయటం, అవసరమైన బొమ్మలు గీయించటం వంటి పనులు మధ్య మధ్య విరామాలతో 1986 నవంబరు 11వ తేదీ దాకా కొనసాగాయి. ఇంతలో ఈ కార్యక్రమం తెలుగు విశ్వవిద్యాలయానికి దత్తమయింది.

విషయ సేకరణకు పర్యటించినవారు సర్వశ్రీ కె. శ్రీనివాసాచార్యులు, ఎస్.ఎన్.సి. నరసింహాచార్యులు, టి. మురళీకృష్ణ, కుమారి సి. శారదామాయి. కోశ నిర్మాణంలో సర్వశ్రీ ఎస్. జయప్రకాశ్, కె. థామసయ్యలు సాయపడ్డారు. దీర్ఘకాలం ఈ పనిలో తోడ్పడిన సహాయకురాలు కుమారి సి. శారదామాయి. కేంద్రాలను సందర్శించి కావలసిన బొమ్మలు గీసి పెట్టిన చిత్రకారులు సర్వశ్రీ రాంభట్ల కృష్ణమూర్తి, సి.హెచ్. సత్యప్రకాశం గారలు. వీరందరికీ నా కృతజ్ఞతలు.

ఈ కోశంలో మూడు భాగాలున్నాయి : శిల్పం, చిత్రలేఖనం, సంగీతం, నాటకం అనేవాటికి సంబంధించిన పదాలు మొదటి భాగంలో, అల్లికలు, కుట్టుపనులు అనే వాటికి సంబంధించినవి రెండో భాగంలో, అన్ని రకాల బొమ్మలకూ, వస్తువులకూ సంబంధించినవి మూడో భాగంలో ఉన్నాయి. ఏ భాగానికి చెందిన బొమ్మలు ఆ భాగం చివర ఉన్నాయి.

ఇంతకాలం తరవాత ఈ కోశం రాతప్రతిని బయటికి తీసిన ఆచార్య జయధీర్ తిరుమలరావును, ప్రచురణకు అనుమతించిన తెలుగు విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు ఆచార్య నాయని కృష్ణకుమారిగారికి నా కృతజ్ఞతలు. ఈ కోశాన్ని నీటుగా ముద్రించిన చరితా గ్రాఫిక్స్ అధిపతి సుబ్బయ్యగారికీ ఆయన సిబ్బందికీ ధన్యవాదాలు.

హైదరాబాద్ — **బూదరాజు రాధాకృష్ణ**

3.5.1997. — సంపాదకుడు.

# పర్యటన కేంద్రాలు

| సంఖ్య | ప్రధాన కేంద్రం | జిల్లా |
|---|---|---|
| కో.1 | చిడివూడి | శ్రీకాకుళం |
| కో.2 | అరసవిల్లి | " |
| కో.3 | శ్రీకాకుళం | " |
| కో.4 | బుడితి | విజయనగరం |
| కో.5 | బొబ్బిలి | " |
| కో.6 | గొల్లపల్లి | " |
| కో.7 | విజయనగరం | " |
| కో.8 | లక్కవరపుకోట | విశాఖపట్టణం |
| కో.9 | విశాఖపట్టణం | " |
| కో.10 | పెందుర్తి | " |
| కో.11 | ఎలమంచిలి | " |
| కో.12 | ఏటికొప్పాక | " |
| కో.13 | పిఠాపురం | తూర్పు గోదావరి |
| కో.14 | సామర్లకోట | " |
| కో.15 | మాధవపట్నం | " |
| కో.16 | కాకినాడ | " |
| కో.17 | గాడిలంక | " |
| కో.18 | ధవళేశ్వరం | " |
| కో.19 | రాజమండ్రి | " |
| కో.20 | నరసాపురం | పశ్చిమ గోదావరి |
| కో.21 | సీతారామపురం | " |
| కో.22 | ఏలూరు | " |
| కో.23 | కోడూరుపాడు | " |
| కో.24 | నూజివీడు | కృష్ణ |
| కో.25 | మోగులూరు | " |
| కో.26 | కొండపల్లి | " |
| కో.27 | బందరు | " |
| కో.28 | విజయవాడ | " |

| సంఖ్య | ప్రధాన కేంద్రం | జిల్లా |
|---|---|---|
| కో.29 | గుంటూరు | గుంటూరు |
| కో.30 | కట్టుబడివారిపాలెం | " |
| కో.31 | దుర్గి | " |
| కో.32 | తాళ్ళపాలెం | " |
| కో.33 | తెనాలి | " |
| కో.34 | గిద్దలూరు | ప్రకాశం |
| కో.35 | ఉదయగిరి | నెల్లూరు |
| కో.36 | అయ్యవారిపల్లి | " |
| కో.37 | డి.సి. పల్లి | " |
| కో.38 | పెద్దఖేదుగుపాడు | " |
| కో.39 | నెల్లూరు | " |
| కో.40 | వరిగొండ | " |
| కో.41 | గూడూరు | " |
| కో.42 | నెలబల్లికాలనీ | " |
| | | |
| తె.1 | హైదరాబాద్ | హైదరాబాద్ |
| తె.2 | నార్సింగి | మెదక్ |
| తె.3 | అదిలాబాద్ | అదిలాబాద్ |
| తె.4 | నిర్మల్ | " |
| తె.5 | చెన్నూరు | " |
| తె.6 | రామడుగు | కరీంనగర్ |
| తె.7 | అనుపురం | " |
| తె.8 | కరీంనగర్ | " |
| తె.9 | చెర్యాల | " |
| తె.10 | వరంగల్ | వరంగల్ |
| తె.11 | కంచన్‌పల్లి | " |
| తె.12 | పెంబర్తి | " |
| తె.13 | భువనగిరి | నల్గొండ |
| తె.14 | నల్గొండ | " |
| తె.15 | సూర్యాపేట | " |

| సంఖ్య | ప్రధాన కేంద్రం | జిల్లా |
|---|---|---|
| రా.1 | ఆళ్లగడ్డ | ప్రకాశం/కర్నూలు |
| రా.2 | రాచిన్నయపల్లి | కడప |
| రా.3 | మాధవమల | చిత్తూరు |
| రా.4 | శ్రీకాళహస్తి | " |
| రా.5 | తిరుపతి | " |
| రా.6 | పాపానాయుడుపేట | " |
| రా.7 | మదనపల్లి | " |
| రా.8 | హిందూపూర్ | అనంతపురం |
| రా.9 | పెనుకొండ | " |
| రా.10 | చాకర్లపల్లి | " |
| రా.11 | ధర్మవరం | " |
| రా.12 | నిమ్మలకుంట | " |
| రా.13 | చెన్నే కొత్తపల్లి | " |



| పర్యటన వివరాలు | | | వ్యవహర్త వివరాలు | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| క్రమ సంఖ్య | పర్యటించిన ఊరు | జిల్లా | వ్యవహర్త పేరు | కులం | వయస్సు | ప్రధాన వృత్తి | ఉపవృత్తి | చదువు |
| 1. | విశాఖపట్నం | విశాఖపట్నం | చుంచినాడ ప్రసాదరావు | విశ్వబ్రాహ్మణ | 25 సం॥ | దంతం పని | — | — |
| 2. | ॥ | ॥ | వైజర్పు వీరభద్రరావు | ॥ | 43 సం॥ | ॥ | — | S.S.L.C. |
| 3. | పెందుర్తి | ॥ | కొవ్వాడ బ్రహ్మాజీ | సరాపుల(కంసాలి) | 20 సం॥ | మట్టి, సిమెంటు బొమ్మలు | — | 3వ తరగతి |
| 4. | ఎలమంచిలి | ॥ | దొడ్డిపట్ల వరహాలు | దేవాంగులు | 55 సం॥ | కొయ్యబొమ్మలు | — | 5వ తరగతి |
| 5. | ఏటికొప్పాక | ॥ | జామి సత్యనారాయణ | కంసాలి | 65 సం॥ | లక్క/కొయ్య బొమ్మలు | — | 5వ తరగతి |
| 6. | ॥ | ॥ | విజ్జెం సూర్యనారాయణ | దేవాంగులు | 36 సం॥ | లక్క/కొయ్య బొమ్మలు | — | 5వ తరగతి |
| 7. | లక్కవరపుకోట | ॥ | రామోజి గురుమూర్తి | విశ్వబ్రాహ్మణ | 33 సం॥ | కంచు బొమ్మలు | — | 5వ తరగతి |
| 8. | ॥ | ॥ | మత్తుర్తి అప్పారావు | ॥ | 38 సం॥ | కంచు బొమ్మలు | — | 3వ తరగతి |
| 9. | ॥ | ॥ | రామోజు చిదంబరరావు | ॥ | 43 సం॥ | ॥ | — | 5వ తరగతి |
| 10. | తిరుపతి | చిత్తూరు | శ్రీరామ్మూర్తి | విశ్వబ్రాహ్మణ | 48 సం॥ | రాతిశిల్పం | — | 8వ తరగతి |
| 11. | ॥ | ॥ | శ్రీరాంకాళీ ప్రసాద్ | ॥ | 44 సం॥ | ॥ | ఉపాధ్యాయత్వం | 9వ తరగతి |
| 12. | ॥ | ॥ | చెరువుల రావులు | మాల | 49 సం॥ | సంగీత పరికరాల రిపేర్ | — | — |
| 13. | ॥ | ॥ | ఆనాల ఆనందం | క్రైస్తవ | 59 సం॥ | మేకప్ | — | S.S.L.C. |
| 14. | ॥ | ॥ | గార్లపాటి చెంగల్రాయుడు | హరిజన | 45 సం॥ | తబలా తయారీ | — | — |
| 15. | ॥ | ॥ | కూరేటి హనుమంతరావు | కాపు | 65 సం॥ | మేకప్ | — | 8వ తరగతి |
| 16. | ॥ | ॥ | మైనంపాటి కాళహస్తి వీరయ్య రామమూర్తి | బలిజ | 46 సం॥ | సంగీత పరికరాల రిపేర్ | వైణిక | S.S.L.C. |
| 17. | ॥ | ॥ | వేదవ్యాస ఆనంద భట్టర్ | బ్రాహ్మణ | 26 సం॥ | ॥ | వ్యవసాయం | సాహిత్య శిరోమణి |

| సర్యటన వివరాలు | | | వ్యవహర్త వివరాలు | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| క్రమ సంఖ్య | పర్యటించిన ఊరు | జిల్లా | వ్యవహర్త పేరు | కులం | వయస్సు | ప్రధాన వృత్తి | ఉపవృత్తి | చదువు |
| 18. | " | చిత్తూరు | గుంటి నాగేశ్వరరావు | నాయుడు | 28 సం॥ | " | — | ఇంటర్ |
| 19. | " | " | జానకీరాం | బ్రాహ్మణ | 49 సం॥ | " | — | — |
| 20. | " | " | పశుపతి | బ్రాహ్మణ | 49 సం॥ | " | — | B.M. |
| 21. | " | " | మైలాపూరు శిల్పి తిరుమలాచారి | విశ్వబ్రాహ్మణ | 53 సం॥ | లోహంబొమ్మలు | — | 8వ తరగతి |
| 22. | మాధవమల | " | వాటంచేడు చిన్నాచారి | ఆచారి | 42 సం॥ | కొయ్యబొమ్మలు | వడ్రంగం | — |
| 23. | పాపానాయుడుపేట | " | కాముల గోవిందాచారి | " | 46 సం॥ | " | — | 4వ తరగతి |
| 24. | తిరుచానూరు | " | కాశీ దొరసామాచారి | " | 48 సం॥ | " | వడ్రంగం | 3వ తరగతి |
| 25. | " | " | సాతంబాకం ఆనందాచారి | " | 36 సం॥ | " | — | 5వ తరగతి |
| 26. | " | " | నవనీత విజయరాఘవన్ | బ్రాహ్మణ | 30 సం॥ | గవ్వబొమ్మలు | పెయింటింగ్ | బి.ఏ. |
| 27. | శ్రీకాళహస్తి | " | కీళ్లపాకం ఆర్ముగమాచారి | విశ్వబ్రాహ్మణ | 35 సం॥ | కొయ్యబొమ్మలు | వడ్రంగం | 5వ తరగతి |
| 28. | " | " | పెద్దపాళ్యం వేలాయుధమాచారి | " | 55 సం॥ | " | — | 5వ తరగతి |
| 29. | " | " | పెద్దపాళ్యం మోహన్ | " | 26 సం॥ | " | — | బి.ఏ. |
| 30. | " | " | పెద్దపాళ్యం చంద్ర | " | 25 సం॥ | కొయ్యశిల్పం | వడ్రంగం | S.S.C. |
| 31. | మదనపల్లి | " | రాజాకమలమ్మ దయానందం(F) | క్రైస్తవ | 50 సం॥ | గుడ్డ బొమ్మలు | — | P.U.C. |
| 32. | పెరుమాళ్లపల్లి | " | ఆటప్పాకం శిల్పిదేశాచ్చారి | విశ్వబ్రాహ్మణ | 46 సం॥ | లోహం బొమ్మలు | — | — |
| 33. | ఏలూరు | ప.గో. | వీరవల్లి తాయారు లక్ష్మీనరసమ్మ | రజక | 30 సం॥ | లేసుల అల్లిక | — | 8వ తరగతి |
| 34. | కోడూరుపాడు | ప.గో. | తాళ్లూరి నారాయణరావు | సాతాదిశ్రీవైష్ణవ | 30 సం॥ | చేతికర్రల తయారీ | — | 6వ తరగతి |
| 35. | " | " | తాళ్లూరి రామమోహనరావు | " | 29 సం॥ | " | — | 6వ తరగతి |
| 36. | కొండపల్లి | కృష్ణా | ధరణికోట దుర్గాప్రసాద్‌రావు | ఆర్య క్షత్రియ(ముచ్చి) | 60 సం॥ | బొమ్మలు | — | 8వ తరగతి |
| 37. | " | " | ఉదయగిరి సూర్యప్రకాశరావు | (నకాష్) " | 23 సం॥ | " | — | — |
| 38. | " | " | కామరుషి సత్యనారాయణ | " | 35 సం॥ | " | — | — |
| 39. | " | " | చండూరి వీరబ్రహ్మాచారి | విశ్వబ్రాహ్మణ | 38 సం॥ | " | — | 5వ తరగతి |
| 40. | బందరు (వలందపాలెం) | " | మొవ్వ సుబ్రహ్మణ్యం | కుమ్మరి | 62 సం॥ | కాగితం గుజ్జు, మట్టి బొమ్మలు | — | 4వ తరగతి |

| పర్యటన వివరాలు | | | వ్యవహర్త వివరాలు | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| క్రమ సంఖ్య | పర్యటించిన ఊరు | జిల్లా | వ్యవహర్త పేరు | కులం | వయస్సు | ప్రధాన వృత్తి | ఉపవృత్తి | చదువు |
| 41. | బందరు (చిలకలపూడి) | ॥ | చలమలసెట్టి కోటేశ్వరరావు | కాపు | 38 సం॥ | వెండి ఆభరణాల తయారీ | — | S.S.L.C. |
| 42. | ॥ బందరు | ॥ | సి.హెచ్. రామక్రిష్ణారావు | ॥ | 35 సం॥ | ॥ | — | Inter |
| 43. | రాజమండ్రి | తూ.గో. | ఏకేవి వెంకటేశ్వరరావు | ముచ్చి | 45 సం॥ | చిత్రకళ | — | 8వ తరగతి |
| 44. | ॥ | ॥ | నామేపల్లి సూర్యనారాయణ | ॥ | 52 సం॥ | ॥ | — | 7వ తరగతి |
| 45. | ॥ | ॥ | మాదేటి రాజాజీ | జంగం | 45 సం॥ | ॥ | — | S.S.C. |
| 46. | ॥ | ॥ | పిల్లేడ నరసింహాచార్యులు | విశ్వకర్మ | 55 సం॥ | శిల్పం | — | 8వ తరగతి |
| 47. | ధవళేశ్వరం | ॥ | పెదపాటి బాలసుబ్రహ్మణ్యం | విశ్వబ్రాహ్మణ | 28 సం॥ | ॥ | — | 7వ తరగతి |
| 48. | కాకినాడ | ॥ | యలమర్తి రామ్మోహనరావు | వైశ్య | 69 సం॥ | కొయ్యబొమ్మలు | — | S.S.L.C. |
| 49. | సామర్లకోట | ॥ | లంక సత్తెమ్మ | మాల | 40 సం॥ | వట్టివేరు చాపల అల్లకం | వ్యవసాయం | 4వ తరగతి |
| 50. | గాడిలంక | ॥ | పెద్దిరెడ్డి మురహరిరావు | కాపు/తెలగ | 55 సం॥ | మట్టి, కాగితం, గుజ్జు సుద్దబొమ్మలు | వ్యవసాయం | 5వ తరగతి |
| 51. | ॥ | ॥ | కొమ్మిరెడ్డి సూర్యనారాయణ | కాపు | 50 సం॥ | ॥ | — | — |
| 52. | మాధవపట్నం | ॥ | తోట తిరుపతిరావు | ఆర్యబొందిలి | 55 సం॥ | తోలుబొమ్మలు | — | 2వ తరగతి |
| 53. | ॥ | ॥ | తోట రామ్మూర్తి | ॥ | 45 సం॥ | ॥ | — | 8వ తరగతి |
| 54. | పిఠాపురం | ॥ | గుమ్మర్తి మాధవరావు | చెట్టి బల్జీలు | 43 సం॥ | సంగీత పరికరాలు | — | 6వ తరగతి |
| 55. | ॥ | ॥ | గుత్తుర్తి వెంకటరమణ | ॥ | 45 సం॥ | ॥ | — | 8వ తరగతి |
| 56. | ॥ | ॥ | నంవిగ్రామం వీరన్న | ఆర్య క్షత్రియ | 50 సం॥ | వీరభద్రుని సామాన్ల తయారీ | — | 8వ తరగతి |
| 57. | నూజివీడు | కృష్ణా | ఎడవల్లి వెంకటస్వామి | కాపు | 57 సం॥ | సంగీత పరికరాలు | — | 4వ తరగతి |
| 58. | ॥ | ॥ | ఎడవల్లి దుర్గాప్రసాద్ | కాపు | 27 సం॥ | ॥ | — | 10వ తరగతి |
| 59. | చిడిపూడి | శ్రీకాకుళం | కింతాడ మల్లేశ్వరరావు | విశ్వబ్రాహ్మణ | 45 సం॥ | శిల్పం | — | 5వ తరగతి |
| 60. | ॥ | ॥ | చల్లపల్లి జగన్నాధం | ॥ | 40 సం॥ | బంగారం పని | కొయ్యబొమ్మలు | 6వ తరగతి |

| ...ాలు | | | వ్యవహర్త వివరాలు | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| క్రమ సంఖ్య | పర్యటించిన ఊరు | జిల్లా | వ్యవహర్త పేరు | కులం | వయస్సు | ప్రధాన వృత్తి | ఉపవృత్తి | చదువు |
| 61. | అరసవిల్లి | " | ఇప్పిలిజోగి సన్యాసిరావు | బ్రాహ్మణ | 36 సం॥ | చిత్రలేఖనం | అర్చకత్వం | S.S.C. |
| 62. | బుడితి | " | అద్దాల వెంకటరావు | విశ్వబ్రాహ్మణ | 42 సం॥ | లోహం పని | — | 3వ తరగతి |
| 63. | శ్రీకాకుళం | " | పుల్లేటికుర్తి వీరభద్రరావు | " | 73 సం॥ | శిల్పి | — | B.A., B.Ed. |
| 64. | " | " | వంగా చిట్టెమ్మ | శ్రీశయన | 50 సం॥ | చిత్రలేఖనం | — | బి.ఏ. |
| 65. | గొల్లపల్లి | విజయనగరం | సర్వశిద్ధి లక్ష్మణస్వామి | విశ్వబ్రాహ్మణ | 77సం॥ | వీణతయారీ | — | — |
| 66. | బొబ్బిలి | " | సర్వశిద్ధి స్వామి | " | 60సం॥ | తోలుతయారీ | — | — |
| 67. | విజయనగరం | " | నిమ్మల వీరభద్రుడు | జంగం | 62సం॥ | చర్మకారీ | హార్మోనియం చేయడం | 3వ తరగతి |
| 68. | " | " | కొట్టియాడ అప్పలసత్యం | విశ్వబ్రాహ్మణ | 35సం॥ | తోలు పరికరాల తయారీ | — | 5వ తరగతి |
| 69. | " | " | సలిపాక సూర్యనారాయణ | " | 39సం॥ | " | — | 3వ తరగతి |
| 70. | " | " | నిమ్మల సోమలింగం | " | 53సం॥ | మృదంగం కొయ్య తయారీ | భామాకలాపం | — |
| 71. | " | " | నిమ్మల రాజలింగం | " | 25సం॥ | తోలు పరికరాల తయారీ | — | — |
| 72. | " | " | ద్వారం దుర్గా ప్రసాద్‌రావు | తెలగ | 40సం॥ | సంగీతం | — | Dip. Music |
| 73. | " | " | కదంబ ఆదినారాయణ | విశ్వబ్రాహ్మణ | 30సం॥ | వడ్రంగం | — | 2వ తరగతి |
| 74. | " | " | లంక సన్యాసిరావు | తెలగ | 22సం॥ | నాగస్వరం | — | — |
| 75. | " | " | గొంది సత్య శ్రీనివాసులు | విశ్వబ్రాహ్మణ | 42సం॥ | వీణ తయారీ | — | వీణాశాస్త్రం |
| 76. | " | " | ఉలిపి శివలింగం | " | 35సం॥ | హార్మోనియం చేయడం | హరికథ | 5వ తరగతి |
| 77. | " | " | కొట్యాడ పండుబాబు | " | 60సం॥ | తోలుతయారీ | — | — |
| 78. | " | " | పోతుల పైడితల్లి | " | 42సం॥ | " | — | — |
| 79. | " | " | చిట్టూరి సీతాలక్ష్మి | బ్రాహ్మణ | 20సం॥ | నాట్యం | నాటకం | 10వ తరగతి |
| 80. | " | " | కడవంటి సత్యనారాయణ | తెలుకలి | 39సం॥ | Teacher | Dramatist | S.S.L .C. |
| 81. | " | " | సుదర్శనం క్రిష్ణజియ్యర్ | బ్రాహ్మణ | 25సం॥ | మేకప్ | — | 8వ తరగతి |
| 82. | " | " | శఠగోపం నరసింహమూర్తి | " | 60సం॥ | కిరీటం మోల్డింగ్ | — | — |
| 83. | " | " | ఘంటసాల వరప్రసాదురావు | వైశ్య | 39సం॥ | మేకప్ | — | 8వ తరగతి |

| పర్యటన వివరాలు | | | వ్యవహర్త వివరాలు | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| క్రమ సంఖ్య | పర్యటించిన ఊరు | జిల్లా | వ్యవహర్త పేరు | కులం | వయస్సు | ప్రధాన వృత్తి | ఉపవృత్తి | చదువు |
| 84. | గొల్లపల్లి | విజయనగరం | సర్వశిద్ధి వీరన్న | విశ్వబ్రాహ్మణ | 72సం॥ | వీణ తయారీ | — | ప్రాథమిక విద్య |
| 85. | ॥ | ॥ | సర్వశిద్ధి సూర్యనారాయణ | ॥ | 60సం॥ | ॥ | — | — |
| 86. | ॥ | ॥ | సర్వశిద్ధి చంద్రశేఖరం | ॥ | 26సం॥ | ॥ | — | మెట్రిక్ |
| 87. | ॥ | ॥ | సర్వశిద్ధి గంగాధరాచారి | ॥ | 19సం॥ | ॥ | — | 9వ తరగతి |
| 88. | ॥ | ॥ | సర్వశిద్ధి వీరన్న లక్ష్మణస్వామి | ॥ | 20సం॥ | ॥ | — | ఇంటర్ (1) |
| 89. | చిన్నయపల్లె | కడప | రేకన్‌దార్ సుబ్బారావు | బొందిలి | 60సం॥ | తోలుబొమ్మలాట | వ్యవసాయం | — |
| 90. | ॥ | ॥ | కాళే వెంకట్రాయుడు | ॥ | 25సం॥ | ॥ | — | — |
| 91. | ॥ | ॥ | రేకన్‌దార్ రాజాంబ | ॥ | 50సం॥ | ॥ | — | — |
| 92. | చిన్నూరు | చిన్నూరు | అనికేపల్లి రామూర్తి (పెద్ద) | వడ్ల | 58సం॥ | వడ్రంగం | చేతికర్రల తయారీ | 1వ తరగతి |
| 93. | ॥ | ॥ | అనికేపల్లి రామూర్తి | ॥ | 52సం॥ | ॥ | ॥ | — |
| 94. | నిర్మల్ | నిర్మల్ | దమ్నూరి చిన్నపోచెట్టి | నకాష్ | 40సం॥ | బొమ్మలతయారీ | — | 5వ తరగతి |
| 95. | ॥ | ॥ | బ్రహ్మరౌతు భాస్కరవర్మ | ॥ | 26సం॥ | ॥ | — | బి.కాం. |
| 96. | ॥ | ॥ | గాజిర్ల లక్ష్మీనర్సయ్య | ॥ | 40సం॥ | ॥ | — | 5వ తరగతి |
| 97. | ॥ | ॥ | ముదల్కర్ పోతన్నభావసర్ | రంగ్రేజీ | 45సం॥ | రంగ్రేజీ | — | 5వ తరగతి |
| 98. | ॥ | ॥ | రాచర్ల లింబయ్య | నకాష్ | 60సం॥ | బొమ్మలతయారీ | — | 5వ తరగతి |
| 99. | ఆదిలాబాద్ | ఆదిలాబాద్ | కోటమల్లయ్య | పద్మశాలి | 31సం॥ | సంగీతపరికరాల రిపేరు | — | 8వ తరగతి |
| 100. | భువనగిరి | భువనగిరి | నామోజు రమణాచారి | వడ్ల | 35సం॥ | కర్ర నగిషీ | — | 10వ తరగతి |
| 101. | ॥ | ॥ | నామోజు నరసింహాచారి | ॥ | 30సం॥ | ॥ | — | 10వ తరగతి |
| 102. | ॥ | ॥ | నామోజు వెంకట సత్యాచారి | ॥ | 70సం॥ | ॥ | — | 6వ తరగతి |
| 103. | చేర్యాల | చేర్యాల | దనాలకోట చంద్రయ్య | నకాష్ | 40సం॥ | పటాలపని, రంపం పొట్టు పని | — | 4వ తరగతి |
| 104. | పెంబర్తి | జనగాం | ఐలా దక్షిణామూర్తి | కంచరి | 52సం॥ | లోహంబొమ్మలు | — | 5వ తరగతి |
| 105. | ॥ | ॥ | ఐలా సోమబ్రహ్మాచారి | ॥ | 22సం॥ | ॥ | — | 7వ తరగతి |

| పర్యటన వివరాలు | | | వ్యవహర్త వివరాలు | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| క్రమ సంఖ్య | పర్యటించిన ఊరు | జిల్లా | వ్యవహర్త పేరు | కులం | వయస్సు | ప్రధాన వృత్తి | ఉపవృత్తి | చదువు |
| 106. | పెంబర్తి | జనగాం | ఐలా చంద్రశేఖరయ్య | కంచరి | 60సం॥ | లోహం బొమ్మలు | - | 4వతరగతి |
| 107. | ॥ | ॥ | ఐలా అనంతాచారి | ॥ | 26సం॥ | ॥ | - | 10వతరగతి |
| 108. | చెన్నేక్రొత్తపల్లి | అనంతపురం | కంసల శేషాచార్యులు | కంసాలి | 46సం॥ | టీచరు | చిత్రలేఖనం | 8వతరగతి |
| 109. | పెనుకొండ | ॥ | పెనుకొండ రామకృష్ణ | నాయుడు | 41సం॥ | ॥ | సిమెంటు బొమ్మలు పెయింటింగ్ | బి.ఏ. |
| 110. | చాకర్లపల్లి | ॥ | బి.చెన్నరాయప్ప | వాల్మీకి | 43సం॥ | తోలుబొమ్మలాట | - | 5వతరగతి |
| 111. | నిమ్మలకుంట | ॥ | ధళవాయి చలపతిరావు | ఆర్మమరాఠీ | 40సం॥ | ॥ | - | 6వతరగతి |
| 112. | ధర్మవరం | ॥ | చాగల్లు శేషప్ప | కంసాలి | 72సం॥ | - | కంసాలిపని | 10వతరగతి |
| 113. | బొబ్బిలి | విజయనగరం | అలజంగి బ్రహ్మం | విశ్వబ్రహ్మణ | 55సం॥ | సంగీతపరికరాలు | - | - |
| 114. | ॥ | ॥ | అలజంగి సీతారామస్వామి | ॥ | 40 | ॥ | - | - |
| 115. | మోగులూరు | గుంటూరు | దాలినేని సాంబశివరావు | కమ్మ | 34 | ఆర్టటీచర్ | - | పి.యు.సి |
| 116. | హైదరాబాద్ | హైదరాబాద్ | భయాంక | నాయకర్ | 25 | కొమ్ముబొమ్మల తయారీ | - | - |
| 117. | ॥ | ॥ | బి.రాములు | నకాష్ | 54 | బొమ్మలు(నిర్మల్) | - | 4వతరగతి |
| 118. | ॥ | ॥ | అబ్దుల్ లతీఫ్ | ముస్లిం | 53 | వడ్రంగం | - | - |
| 119 | ॥ | ॥ | ఏశాల లక్ష్మయ్య | సాలె | 65 | ॥ | - | 4వతరగతి |
| 120. | ॥ | ॥ | పోశెట్టి | క్షత్రియ | 55 | ॥ | - | 2వతరగతి |
| 121. | ॥ | ॥ | నార్లకంటి మల్లేష్ | కుర్మగొల్ల | 30 | డ్యూకోపెయింటింగ్ | - | 7 ॥ |
| 122. | ॥ | ॥ | కన్నయ్యరాం కరుప్పయ్యాచారి | విశ్వబ్రాహ్మణ | 65 | శిల్పం | వ్యవసాయం | - |
| 123. | ॥ | ॥ | జి.వై. రాజవర్మ | నకాష్ | 38 | చిత్రలేఖనం | - | డిప్లొమా |
| 124. | ॥ | ॥ | పెండెం లక్ష్మీనారాయణ | పద్మశాలి | 45 | గాజులపని | - | - |
| 125. | ॥ | ॥ | నందికంటి కృష్ణ | మేదర | 23 | లోహంవస్తువులు | - | - |
| 126. | ॥ | ॥ | శ్రీరామోజు హరిరాజం | విశ్వబ్రాహ్మణ | 51 | ॥ | - | 5వ ॥ |
| 127. | ॥ | ॥ | శ్రీరామోజు సుదర్శనాచారి | విశ్వబ్రాహ్మణ | 40 | ॥ | - | 9వ ॥ |

| పర్యటన వివరాలు | | | వ్యవహర్త వివరాలు | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| క్రమ సంఖ్య | పర్యటించిన ఊరు | జిల్లా | వ్యవహర్త పేరు | కులం | వయస్సు | ప్రధాన వృత్తి | ఉపవృత్తి | చదువు |
| 128. | హైదరాబాద్ | హైదరాబాద్ | యామల లక్ష్మీప్రసన్నం | నాయుడు | 39 | లక్కవస్తువులు | - | 10వ ॥ |
| 129. | ॥ | ॥ | అజ్జరపు సత్యనారాయణమూర్తి | బ్రాహ్మణులు | 35 | బుర్రకథ, డ్రామా | - | బి.ఏ. |
| 130. | ॥ | ॥ | మడిపడగ బలరామాచారి | విశ్వబ్రాహ్మణ | 57 | చిత్రలేఖనం | - | 10వ తరగతి |
| 131. | ॥ | ॥ | పేరి సుబ్బారావు | బ్రాహ్మణ | 52 | ॥ | - | 10వ ॥ |
| 132. | ॥ | ॥ | సానికె బాలప్ప | కురుమ | 38 | వాగ్గుకథకుడు | - | - |
| 133. | ॥ | ॥ | అయిలా నరసింహాచారి | కంచరి | 40 | లోహంబొమ్మలు | - | - |
| 134. | ॥ | ॥ | బ్రహ్మరౌతు వెంకన్న | నకాష్ | 44 | చిత్రలేఖనం | - | 5 ॥ |
| 135. | ॥ | ॥ | కైసర్‌జాన్ బేగం | ముస్లిం | 40 | నిర్మల్‌కర్ర బొమ్మలు | - | 7 ॥ |
| 136. | ॥ | ॥ | సయ్యద్ ఉస్మాన్‌గుచ ఉస్మాన్ | ॥ | 36 | చిత్రలేఖనం | - | 5 ॥ |
| 137. | ॥ | ॥ | దిలీకర్ గజానంద | మరాఠీ | 26 | లోహంబొమ్మలు | - | 10 ॥ |
| 138. | ॥ | ॥ | దుర్గ | లంబాడీ | 25 | అల్లిక | - | - |
| 139. | ॥ | ॥ | వి.రామకిషన్‌రావు | మరాఠి | - | హార్మోనియం | - | - |
| 140. | ॥ | ॥ | పెదపాటి నాగేశ్వరరావు | విశ్వబ్రాహ్మణ | 41 | శిల్పం | - | ఎం.ఏ. |
| 141. | హిందూపూర్ | అనంతపురం | కోలార్ భాస్కరశంకరనారాయణ | బ్రాహ్మణ | 29 | ॥ | - | బి.కాం. |
| 142. | ॥ | ॥ | ఎం. ఖాద్రెప్ప | ఈడిగ | 65 | సంగీతం | - | 5 ॥ |
| 143. | ॥ | ॥ | కొరమ యల్. తిప్పయ్య | ఎరుకల | 64 | మేకప్ | - | 5 ॥ |
| 144. | గూడూరు | నెల్లూరు | గోదావరి ఆదినారాయణ | బలిజ | 45 | పెయింటింగ్ | - | 9 ॥ |
| 145. | ॥ | ॥ | పెద్దపాళ్ళెం శంకరాచారి | విశ్వబ్రాహ్మణ | 28 | కొయ్యబొమ్మలు | - | 8 ॥ |
| 146. | డి.సి.పల్లి | ॥ | ఇంటి కుమార రాజారావు | ఆర్యకాపు | 62 | తోలుబొమ్మలు | - | 9 ॥ |
| 147. | ఉదయగిరి | ॥ | పఠాన్ మత్తేఖాన్ | ముస్లిం | 45 | కొయ్యబొమ్మలు | - | 5 ॥ |
| 148. | ॥ | ॥ | మహమ్మద్ పాషా | ॥ | 35 | కొయ్యపని | - | 3 ॥ |
| 149. | ॥ | ॥ | షేక్ జానీ బాషా | ॥ | 25 | ఉడెన్‌కట్లర్ | - | ఇంటర్ |
| 150. | నెల్లూరు | ॥ | కాళహస్తి రవికుమార్ | ఆర్యక్షత్రియ | 25 | శిల్పం, కొయ్యవాహనాలు | - | 8వ ॥ |

| పర్యటన వివరాలు | | | వ్యవహర్త వివరాలు | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| క్రమ సంఖ్య | పర్యటించిన ఊరు | జిల్లా | వ్యవహర్త పేరు | కులం | వయస్సు | ప్రధాన వృత్తి | ఉపవృత్తి | చదువు |
| 151. | నెల్లూరు | నెల్లూరు | నందిగం కృష్ణయ్య | ఆర్య క్షత్రియ | 30 | హార్మోనియం | - | 4వ తరగతి |
| 152. | పెద్దపడుగుపాడు | " | ఉదయపూర్ వెంకటశాంతిశర్మాజీ | బ్రాహ్మణ | 49 | శిల్పం | - | యస్.యస్.ఎల్.సి. |
| 153. | వరిగొండ | " | నల్లగొండ పద్మావతి | ఆర్యక్షత్రియ | 42 | రంపంపొట్టు బొమ్మలు | - | 1వ తరగతి |
| 154. | " | " | దామ సత్యనారాయణమ్మ | " | 25 | " | - | 7 " |
| 155. | తాళ్లపాలెం | గుంటూరు | తీండ్ర కోటయ్య | హరిజనుడు | 63 | కొమ్ము, కొబ్బరికాయ బొమ్మలు | - | 5 " |
| 156. | గుంటూరు | " | గుల్లపల్లి ఆదిశేషయ్య | బ్రాహ్మలు | 66 | డ్రామాడ్రెస్సుల తయారీ | - | 8 " |
| 157. | తెనాలి | " | తుపాకుల వెంకటేశ్వర్లు | కృష్ణబలిజ | 45 | లోహపుపని | - | 8 " |
| 158. | " | " | కోనూరి వెంకటకోటయ్య | విశ్వబ్రాహ్మలు | 29 | మెటల్‌వర్క్ | - | 3 " |
| 159. | " | " | అక్కల మంగయ్య | పద్మశాలి | 45 | రాతి, పంచలోహ విగ్రహాలు | వెండిపని | యస్.యస్.ఎల్.సి. |
| 160. | " | " | అక్కల రామకృష్ణారావు | " | 35 | " | - | యస్.యస్.ఎల్.సి. |
| 161. | " | " | అక్కల శ్రీరాములు | " | 18 | " | - | 10వ తరగతి |
| 162. | సీతారామపురం | ప.గోదావరి | కత్తుల చంద్రావతి | తెలగ | 40 | లేసులఅల్లిక | - | - |
| 163. | " | " | పులపర్తి శేషారత్నం | కాపు | 60 | " | - | - |
| 164. | నర్సాపురం | " | పితాని అనసూయ | సెట్టిబల్జీలు | 35 | " | - | 5 " |
| 165. | " | " | కంకిపాటి హేమలత | క్రిష్టియన్స్ | 45 | " | - | 9 " |
| 166. | " | " | కూనవరపు సుజాత | " | 30 | " | - | బి.ఏ. |
| 167. | " | " | నవబత్తుల కనకదుర్గ | కాపులు | 22 | " | - | - |
| 168. | " | " | కొల్లాటి రామలక్ష్మి | " | 32 | " | - | 8వ తరగతి |
| 169. | " | " | పురుషోత్తమ్మ | రజక | 52 | " | - | - |
| 170. | " | " | కొప్పాడి ఇందిరమ్మ | కాపులు | 48 | " | - | - |
| 171. | " | " | ఎ. సత్యవతి | గొడలు | 50 | " | - | - |

| పర్యటన వివరాలు | | | వ్యవహర్త వివరాలు | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| క్రమ సంఖ్య | పర్యటించిన ఊరు | జిల్లా | వ్యవహర్త పేరు | కులం | వయస్సు | ప్రధాన వృత్తి | ఉపవృత్తి | చదువు |
| 172. | నర్సాపురం | నర్సాపురం | చంద్రవంక సుభద్రమ్మ | కాపులు | 40 | " | - | 3వ తరగతి |
| 173. | అనుపురం | కరీంనగర్ | దనాలకోట నారాయణ | సోమక్షత్రియ | 55 | నకాషీపని | - | 5 " |
| 174. | నార్సింగి | మెదక్ | పుట్ట పాండరి | పద్మశాలి | 20 | బొమ్మలు వేయడం | - | 5 " |
| 175. | " | " | తంబళ్ళ వెంకయ్య | తంబళ్ళు | 50 | సంగీతపరికరాలతయారీ | - | 3 " |
| 176. | రామడుగు | కరీంనగర్ | వడ్లూరి హరయ్య | విశ్వకర్మ | 40 | శిల్పం | - | - |
| 177. | " | " | వడ్లూరి వెంకటేశ్వర్లు | " | 35 | " | - | 7 " |
| 178. | " | " | వడ్లూరి వెంకటరమణయ్య | " | 72 | " | - | - |
| 179. | " | " | వడ్లూరి కిష్టయ్య | " | 76 | " | - | - |
| 180. | కరీంనగర్ | " | శ్రీనాంపెల్లి ఆంజనేయులు | అవుసలి | 30 | తీగపని | - | 8 " |
| 181. | " | " | బెజ్జంగి రాజమణి | " | 48 | " | - | 5 " |
| 182. | " | " | కాట్నిపల్లి సుదర్శనం | కంసాలి | 45 | " | - | 4 " |
| 183. | " | " | కట్టా ప్రవీణ్‌కుమార్ | " | 25 | ఫిలిగ్రీ | - | 10 " |
| 184. | " | " | శ్రీరామోజు రమణాచారి | " | 25 | " | - | 5 " |
| 185. | రంగశాయిపేట | వరంగల్ | శ్రీరుద్రోజు నరసింహాచారి | కంచరి | 21 | ఇత్తడిపని | - | ఇంటర్ |
| 186. | " | " | బెజ్జంగి వీరనారాయణాచార్యులు | " | 35 | " | - | 9వ తరగతి |
| 187. | ఆళ్ళగడ్డ | కర్నూలు | శ్రీదురుగడ్డ బాలవీరాచారి | విశ్వబ్రాహ్మణ | 56 | శిల్పం | - | 5 " |
| 188. | అయ్యవారిపల్లి | నెల్లూరు | శ్రీకురిచేటి రామాచారి | కంసాల | 40 | సన్నాయితయారీ | - | 5 " |
| 189. | నెలబల్లికాలనీ | " | శ్రీమహమ్మద్ జమాల్‌సాహెబ్ | దూదేకుల | 56 | తాటాకుల నగిషీ | - | 5 " |
| 190. | గిద్దలూరు | ప్రకాశం | శ్రీపఠాన్ మదార్‌వల్లి | ముస్లిం | 25 | వడ్రంగి | - | ఇంటర్ |
| 191. | నెలబల్లికాలనీ | నెల్లూరు | శ్రీసయ్యద్ మహమ్మద్ ఫకీర్ | సాహెబ్ | 25 | తాటాకుబుట్టలపని | - | 3వ తరగతి |
| 192. | నల్లగొండ | నల్లగొండ | యస్.వి. కరుణారెడ్డి | క్రిష్టియన్స్ | 42 | అద్దాలు, పూసలు | - | మెట్రిక్యులేషన్ |
| 193. | సూర్యాపేట | " | నాగార్జున కోటయ్య | విశ్వబ్రాహ్మలు | 75 | బంగారం, వెండినగీషీపని | - | 5వ తరగతి |
| 194. | కట్టుబడివారిపాలెం | గుంటూరు | రేక్‌నార్ సుబ్బారావు | బొందిలీలు | 50 | తోలుబొమ్మలతయారీ | - | 4 " |

| పర్యటన వివరాలు | | | వ్యవహర్త వివరాలు | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| క్రమ సంఖ్య | పర్యటించిన ఊరు | జిల్లా | వ్యవహర్త పేరు | కులం | వయస్సు | ప్రధాన వృత్తి | ఉపవృత్తి | చదువు |
| 195. | కట్టుబడివారిపాలెం | గుంటూరు | వనపర్తి బాలాజి | బొందిలీలు | 38 | తోలుబొమ్మల తయారీ | - | 5వ తరగతి |
| 196. | కంచనపల్లి | వరంగల్ | కొండబత్తిని కుమారస్వామి | పద్మశాలి | 27 | టేపిస్ట్రీ | - | 10 " |
| 197. | దుర్గి | గుంటూరు | ధారం ఈశ్వరభీష్మాచార్యులు | విశ్వబ్రాహ్మలు | 43 | శిల్పం | - | " |
| 198 | " | " | యర్రోజు వీరనరసింహాచార్యులు | " | 28 | " | - | 8 " |
| | | | దార్ల వెంకటేశ్వర్లు | " | 24 | " | - | 6 " |
| 199. | విజయవాడ | కృష్ణా | బండారి వీరన్న | శాలీలు | 36 | ప్లాస్టర్ఆఫ్‌ప్యారిస్ బొమ్మలు | - | మెట్రిక్ |
| 200. | " | " | మైలాపూరు వెంకటజగన్నాధాచార్యులు | విశ్వబ్రాహ్మలు | 34 | శిల్పం, లోహం | - | - |
| 201. | " | " | నాగిడి సూర్యనారాయణ | చెట్టిబలిజ | 45 | సంగీత వాద్యాల తయారీ | - | - |
| 202. | " | " | నూకాడ లక్ష్మణరావు | అగ్నికులక్షత్రియ | 64 | సంగీతపరికరాల తయారీ | - | 9వ తరగతి |

# అ

**అకార సాధన :** రాగాలాపన. సంగీతం నేర్చేటప్పుడు రాగప్రస్తారం కోసం 'అ' కార ధ్వనిని సాగదీయడం. (తె.1)

**అక్రమాకారం :** రాతి బొమ్మలు చెక్కడంలో సరిగా రాని రూపం. (రా.8)

**అక్షంతలు (బ) :** ఒగ్గు కథ చేప్పేముందు గంగతెప్ప కట్టుకొన్న మల్లికార్జున స్వామి విగ్రహాలు వేసినపుడు పటం మీద శుభసూచనగా వేసే పసుపు కలిపిన బియ్యం గింజలు. (తె.1)

**అక్షరం (చెక్కు) :** పర్యా. లెటర్. రాతి పలకల మీద సేనంతో సుత్తితో లిపిని చెక్కు. (కో.3)

**అఖండ సాధకం :** రాగాలాపన ఎక్కువ కాలం చేయడం (ముఖ్యంగా నాగస్వరం)లో నేర్పు. (రా.5)

**అగవ :** రూ. అగావు. పర్యా యధ్యమ పరిధి, వ్యాసం, చుట్టుకొలత. (కో.4)

**అగావు :** చూ. అగవ. వీణ కుండ చుట్టుకొలత తీసుకోవటానికి ఉపకరించే పరికరం. (డయామీటర్). (కో.6)

**అగ్గి :** పర్యా. ఇంగులం. నిప్పు. (కో.7; తె.5; రా.5)

**అగ్గిదబ్బవాన :** రంగులు అద్దేపని (రంగ్రేజ్ పని)లో వాడే ఒక రకం అచ్చు (=వాన). (తె.4)

**అగ్గిపుల్ల :** నిప్పుపుల్ల. (రా.13)

**అగ్నిపాత్ర :** నాట్యం చేస్తున్న నటరాజు విగ్రహం చేతిలో ఉన్న పాత్ర. (కో.31)

**అగ్నిహోత్రుడు :** రాతి గట్టిదనం పరీక్ష చేసేటప్పుడు రాతి మీద దెబ్బవేయగానే రేగే నిప్పురవ్వ. (తె.6)

**అంకం :** పర్యా. మొదటి తెర. నాటకంలో ఒక భాగం. రంగ స్థలంలో ముందుండే తెర/పరదా. (తె.2; రా.13)

**అంగభంగిమ :** విగ్రహం అవయవాలను చెక్కిన తీరు. (రా.8)

**అంగుళం :** రూ. అంగళం. పర్యా. ఇరచి, 'దేవాంగుళం'. అడుగులో 12వ వంతు. (కో.7,16,39)

**అంగాంగాలు :** (బ) రాతి విగ్రహం భాగాలు, వాటి విభాగాలు. (కో.3)

**అజవాయి :** వీణలో ఏడవమెట్టు అమర్చిన చోటు. (కో.7)

**అంచవా (పెట్టు) :** గుర్తుపెట్టు, విభజించు. (కో.7)

**అంచిపెట్టు :** గట్టిగా అదిమిపెట్టు, అణచి ఉంచు (రా.5)

**అంచుధోతి :** అంచు ఉన్న ధోవతి (తె.1)

**అఠాణ :** ఒక రాగం. (కో.7)

**అడ్డబొట్టు :** పర్యా. విభూతి రేఖలు. రాతిపనిలో శివలింగానికి పెట్టే బొట్టు. (తె.6)

**అడ్డమీటు :** వీణ వాయించేటప్పుడు - చూపుడు వేలితో మీటినప్పుడు ఏర్పడే స్వరాన్ని నడిమి వేలుతో తాకి ధ్వనిని అడ్డగించి, అలా మందగించిన నాదం తిరిగి వెంటనే పలికే విధంగా నడిమి వేలుతో మీటటం. (కో.7)

**అడ్డిగ :** రాతి విగ్రహానికి మెడలో వేసే ఒక ఆభరణం. (రా.5)

**అడుగు :** (1) కింది భాగం. (2) 12 అంగుళాలు. (కో.2,3,5,7,9,37,42; తె.1; రా.6)

**అడుగు చేరు :** కిందికి చేరు. (కో.7)

**అడుగుబద్ద :** పర్యా. రూళ్లబద్ద. స్కేలు. (కో.7,16; రా.4)

**అడ్డు :** అడ్డం. (కో. 6,33)

**అంటించు :** 1. అతికించు. (కో.19,34; తె.7,8,12,15; రా.5,6) 2. వెలిగించు (రా.10)

**అంటుపెట్టు :** అతుకుపెట్టు, అతికించు. (తె.3,4,7)

**అండర్ కోట్ :** చిత్రలేఖనంలో బొమ్మలు చిత్రించడానికి ముందు హార్డ్‌బోర్డ్ లేక ప్లైవుడ్ (canvas) మీద వేసే రంగు. (కో.2)

**అతుకు :** పర్యా. కరిపించు. అంటించు. (కో.4,13; తె.8; రా.5,8)

**అద్దకం పని :** బట్టమీద రంగుల డిజైన్లను అద్దేపని. (తె.4,11)

**అద్దం :** (1) మేకప్‌లో కనుబొమలు దిద్దడానికి వాడే కాటుక చేసేప్పుడు ఆముదం దీపం పొగపట్టడానికి వాడే గాజు పలక. (కో.7)

(2) చిత్రలేఖనంలో కాగితం మీద బొమ్మవేసి మెరుగు రావడానికి గవ్వతో రుద్దేటప్పుడు కాగితం అడుగున పెట్టే గాజు. (కో.19)

(3) చిత్రలేఖనంలో బొమ్మలు వేయడానికి వాడే గాజుపలక. (రా.11)

**అద్దం చట్టా :** పర్యా. మిర్రర్ ఫ్రేమ్. గాజుతో చేసిన ఫోటో చిత్రం. (తె. 13)

**అదుము :** పర్యా. అద్దు, నొక్కు, ప్రెస్‌చేయు. వీణమీటు. (కో.7)

**అడ్డెక(లు) :** మేకప్ చేసేటప్పుడు పౌరాణిక వేషం వేసే వాళ్లకు మెడలో వేసే పూసల హారం. (రా.8)

**అధమ దశ తాళం :** ఇంద్రుడు, అగ్ని మొదలైన శిలావిగ్రహాలు చేసేటప్పుడు వాడే శిల్ప శాస్త్రానికి సంబంధించిన కొలత. ఇందులో 116 భాగాలుంటాయి. (రా.5)

**అధమం :** రాతిపనిలో విగ్రహానికి ముఖమంతా విస్తరించిన కిరీటం. కిరీటాలలోని మూడు రకాలలో అధమం అనేది ఒకటి. (కో.7)

**అన్నపుపరి :** మృదంగం కరిణ తయారీలో చిలిమిరాళ్ల పొడి కలపడానికి అనువుగా అన్నంతో మెత్తగ చేసిన జిగురు. (కో.37; రా.10)

**[illegible]బేధి :** ఒక రకం మూలిక. రాతిపనిలో విగ్రహం నల్లగ రావడానికి కరక్కాయతో కలిపి ఉడికించి పూసే మూలిక. విగ్రహానికి జీవరేఖలు దిద్దడానికి ముందు ఈ ఉడికించిన మిశ్రమం పూసి ఆరనిస్తారు. (కో.19)

**అన్నం :** మృదంగం కరిణపిండి తయారీలో చిటిమ రాళ్ల పొడిలో కలిపే అన్నం జిగురు. (కో.5,7; తె.1,2; రా.5)

**అనాచ్ఛాదితం :** కంజీరా, వంటి వాద్యాలలో ఒకవైపు ఖాళీగా ఉండే భాగం. (కో.7)

**అనాహతం :** వీణలో పందొమ్మిదవ మెట్టు అమర్చిన చోటు. (కో.7)

**అనుకరించు :** సంగీత కచేరీలో గాయకుడు పాడినట్లే పక్క వాయిద్యాలు వాయించడం. (కో.7)

**అనుపల్లవి :** చరణం. (రా.2)

**అనుమందరం :** రూపా. అనుమంద్రం. వీణకు ఉండే శ్రుతి తీగపేరు. ఈ శ్రుతి తీగలు దండికి పైగా బిగించి ఉంటాయి. (రా.5)

**అంతరాళం :** గుడిలో విగ్రహం ఉండే చోటు. (తె.6)

**అందం :** చూడటానికి బాగా కనబడేది. కంటికి నదరుగా ఉండేది. (కో.3)

**అందె :** (1) ఒగ్గు కథ చెప్పేటప్పుడు కాలికి కట్టుకొనే గజ్జె. (తె.1)

(2) బుర్ర కధలో కథ చెప్పేవారు కుడిచేతితో పట్టుకొని వాయించే మువ్వ. (తె.1) చూ. చిత్రం 14.

(3) రాతి విగ్రహానికి కాళ్లకు చెక్కే మువ్వ.

**అపరస్థలాలు :** మట్టితో కిరీటం చేసేటప్పుడు కిరీటానికి అక్కడక్కడ ఉండే ఎత్తు పల్లాలు. (కో.7)

**అప్పగించు :** పర్యా. ఇచ్చేయు. రాతి విగ్రహం చెక్కిన తరువాత టెంకాయ కొట్టి పూజ /చేసి చేయించిన వాళ్లకు విగ్రహం ఇవ్వడం. (తె.6)

**అప్రూవు :** మొట్టమొదట వైట్‌క్లేతో కావలసిన మోడల్ బొమ్మ చేసి తరువాత బాగా వచ్చిందనుకుంటే అసలు బొమ్మ చెయ్యటం. (కో.38)

**అబద్దపు మీటు :** వీణతో సంగీత రచన వాయిస్తున్నపుడు సాహిత్యాక్షరం లేనిచోట వేసే మీటు. (కో. 7)

**అభ్రకం :** మేకప్ చేసేటప్పుడు వేషధారి ముఖం మెరవటానికి పూసే పూత. (కో.29; రా.8)

**అభయహస్తం :** రాతి పనిలో విగ్రహం కుడి చేయి పైకి పెట్టి దీవిస్తున్నట్లు చెక్కడం. (కో.19,31)

**అమృతశిల :** పర్యా. తెల్లరాయి. రాతిపనిలో శిల్పానికి వాడే తెల్లరాయి. దీన్ని పరీక్ష చేసేటప్పుడు రాయిపెట్టి గీస్తే దీని మీద గీతరాదు. (తె.6; రా.1)

**అంబరు :** పర్యా. ఐబ్రో, కనుబొమ, కన్నుబ్బు. <ఆం. eye brow. (కో.7)

**అంబరు పెన్సిలు :** eye brow pencil. కనుబొమలను దిద్దే పెన్సిలు. (కో.7)

**అంబాదేవి :** కాళికాదేవి. రంగ్రేజ్ పనిలో అద్దకంలో వేసే బొమ్మ. (తె.4)

**అంబులపొది :** బాణాలు పెట్టుకోవడానికి ఉపకరించే బోలుగా ఉన్న ఒక రకం పరికరం. యుద్ధ సమయాల్లోను వేటకెళ్లే ముందు దీన్ని కట్టుకుంటారు. (రా.8)

**అయిబ్రోకు :** మేకప్‌లో కనుబొమలకు దిద్దే నల్లరంగు. (రా.5)

**అరదళం :** పూర్వం మేకప్‌లో బుగ్గలకు పూసుకునే పసుపురంగు. (కో.29)

**అరపాశం :** రూపా. అర పాశం. రాతి పనిలో విగ్రహాన్ని మొదట రాయి మీద చెక్కడానికి వాడే పనిముట్టు. (రా.5)

**అరించిబ్రష్ :** అద్దకం పనిలో పరదాలపై వాడే ఒక రకం కుంచె. (తె.2)

**అరుగు :** బ్రష్ కొద్దికాలం వాడిన తరువాత మొద్దుగ అవడం. (కో.41)

**అర్ధచంద్రాకార ఉలి :** పర్యా. రౌండు ఉలి. వీణ తయారీలో వీణకుండ భాగాన్ని చేయడానికి వాడే ఒక రకం ఉలి. (రా.5)

**అర్ధచంద్రాకారం :** (1) లోహం పనిలో విగ్రహాల కనుబొమలు చెక్కే ఆకారం. (తె.12)

(2) వీణ కుంచెపై ఉన్న బ్రిడ్జి ఆకారం. (కో.7; రా.5)

**అర్ధభాగం :** ఛాత్ వరకు చేయబడిన సిమెంటు బొమ్మలు. (bust size). (కో.3)

**అర్దలం :** రూపా. అర్దలం, అర్ధలం. పర్యా. పేవడా, పసుపు, తేవుడి. బొమ్మలకి పూర్వం పసుపు రంగుకి బదులుగ వాడేది. (కో.12; తె.4,9)

**అలెగ్జాండరు టోపి :** నాటకాలలో అలెగ్జాండర్ వేషధారి పెట్టుకునే టోపి. (కో.7)

**అల్లిక :** తబలాకు మూతల చివర అంచులకు వారుతో నేసిన అల్లిక (తె.3)

**అల్లు :** చిత్రలేఖనంలో బోర్డర్లకి బొమ్మల ఆభరణాలకు వేసేది. తగరం, సరబ్బి కలిపి దంచి దీన్ని చేస్తారు (తె.1)

**అల్జేరి :** పటిక. రంగ్రేజ్ పనిలో జాతిమా రంగు దీనితో చేస్తారు. (తె.4)

**అవనద్ధ కుతపం :** చర్మ సంబంధమైన సంగీత వాద్యాల సమ్మేళనం. మృదంగం, కంజీర, డోలకు మొదలైనవి. (కో.7)

**అవయవం :** శరీర భాగంలో అవయవాలను చెక్కడం. (కో.1,31,33,39)

**అవరోహణ :** శ్రుతి తగ్గటం/తగ్గింపు. (కో.7)

**అవిసెమానె :** రూపా. అవుసె నూనె, అవిశనూనె. పర్యా. లిన్సెడ్ ఆయిల్. అవిశ గింజల నుండి తీసిన నూనె. దీనికి వైట్ జింక్ కలిపి చిత్రం వేసే ముందు గోడకు పూస్తారు. (తె.1,4; రా.11)

**అవుట్‌లయను :** (అవుట్ లయను కొట్టు) చిత్రలేఖనంలో వేయబోయే బొమ్మని ముందు పెన్సిలుతో లైట్‌గా వేయడం. (రా.11)

**అంశం :** అంశమంటే ముఖం. ప్రతి శిల్పంలోనూ పాదం నుండి కేశం వరకు 65 అంశాలుంటాయి. (కో.19)

**అష్టతాళం :** రాతిపనిలో విగ్రహాలను నిర్మించడానికి వాడే

ప్రమాణం. పంచతాళం, సప్తతాళం, అష్టతాళం - ఈ విధంగా శిల్పశాస్త్ర ప్రకారం షోడశ (16) తాళాలున్నాయి. ఒక్కొక్క మూర్తికి ఒక్కొక్క ప్రమాణం. (తాళం=ముఖం) (కో.19; తె.6; రా.1)

**అష్టఫలీ :** రంగ్రేజ్ పనిలో వాడే ఒక రకం అచ్చు. (తె.4)

**అష్టశిల(లు) :** రాతిపనిలో విగ్రహాలకు వాడే ఎనిమిది రకాల శిలలు. 1. కృష్ణశిల (నల్లరాయి) 2. తెల్లరాయి 3. ఎర్రశిల 4. రక్తశిల 5.శ్వేత శిల 6. పాలశిల 7. పచ్చశిల 8. స్ఫటిక శిల. (కో.19)

**అసిటోను :** మేకప్‌లో గడ్డాలకు, మీసాలకు పూసిన జిగురు కడగడానికి వాడే ఒక రకం ద్రవం. దీనిని ఒక పళ్లెంలో పోసిన తర్వాత కొద్దిగా దూది తీసుకుని మీసం వెనుక పూసి తర్వాత ఒక బట్టతో నెమ్మదిగా తుడిచేయాలి. (రా.5)

**అస్త్రం :** మృదంగం తయారీలో వేసే చర్మం లోపలి పొరభాగం. (కో.7)

**అస్త్రం ముక్క :** చర్మం లోపలి పొరభాగం ముక్క (కో.5,7)

**అస్థిపంజరం :** సిమెంటు బొమ్మలు చేసేప్పుడు మొదట ఇనప ఊచలతో చేసిన మనిషి ఆకారం. (కో.3)

## ఆ

**ఆకారం :** పర్యా. రూపం. నమూనా. (కో.1,6,8,13,16,27, 31,32,33,41; తె.1,7,14; రా.4,8,11)

**ఆకు :** 1. ముఖవీణ పలకడానికి పెట్టే ఒక ఆకు. తాటాకు గాని, నాగ సర్పాకు గని పెడతారు.

2. నాగస్వరం పలకడానికి పెట్టే పీక. దీన్ని రెల్లుతో చేస్తారు. (కో.7)

3. తబలా మూతలో ఉండే మేక చర్మం భాగం. (తె.2)

4. వీణ చేసేటప్పుడు కుండకు చివర వేసే లతల డిజైన్. (కో.6)

**ఆకుపచ్చ ఆకారం :** నాటకాల్లో ఆంజనేయుని రూపం. (కో.7)

**ఆకుపచ్చ మట్టి :** పూర్వం చిత్రలేఖనంలో బొమ్మలకి వేసే రంగు. ఈ మట్టి లేపాక్షిలో దొరుకుతుంది. చిన్న చిన్న రాళ్లలా ఉన్న దీన్ని మెత్తగా పొడిచేసి మైదాపిండి ఉడికించిగాని, కట్టె వజ్రాన్ని ఉడకపెట్టి గాని, లేక ఏదైనా జిగురుతో గాని కలిపి రంగుగా వాడేవారు. (రా.11)

**ఆకుపచ్చ లక్క :** వీణ అందంగా కనబడడానికి కుండకి చుట్టూ ఒక డిజైన్ చెక్కి ఆ గాడిలో పోయడానికి వాడే లక్క. (కో.6)

**ఆకురాయి :** పర్యా. కురువిందంరాయి, పాలిష్ స్టోన్, సానరాయి, సానరౌతు. రాతి బొమ్మల్ని సాపు చేయడానికి వాడే పనిముట్టు. (కో.1,4,7.8,10,12,27; తె.1,2,3,4,5,6,7,8,9,12,13; రా.4,8)

**ఆకృతి :** రూపం. (కో.33)

**ఆక్సైడ్ జింక్ :** మేకప్‌లో ముఖానికి పూసుకునేది. (రా.13)

**ఆగమశాస్త్రం :** శిల్పాలకి సంబంధించిన శాస్త్రం. చెక్కిన శిల్పాలని పద్ధతి ప్రకారం ప్రతిష్ఠ చేయడాన్ని తెలిపే శాస్త్రం. (కో.19)

**ఆగర్ర :** డోలకు చేసేటప్పుడు కొయ్యకి చిల్లులు పెట్టడానికి వాడే ఒక పనిముట్టు. చూ.చిత్రం.37. (కో.13)

**ఆచారం :** సంప్రదాయం. (కో.19; రా.4)

**ఆట :** తోలుబొమ్మలాట, నాటకం. (కో.37; తె.7)

**ఆడవేషం :** నాటకంలోని స్త్రీ పాత్ర. (కో.29)

**ఆడేసం :** ఆడవేషం. వొగ్గు కథలో (కథకుని) వేషం. (తె.1)

**ఆది :** కొలత. (కో.7)

**ఆదితాళం :** మృదంగం మీద వాయించేది. (రా.2)

**ఆదిపురాణం :** మాలవారిలో మన్నెపోళ్లు, గుర్రపోళ్లు చెప్పే కథ. సృష్టి పుట్టుక గురించి చెప్పే పురాణం. (తె.9)

**ఆది ప్రకారం** : చేయవలసిన కొలత ప్రకారం. (ఆది=కొలత) (కో.39)

**ఆధారం** : సపోర్టు. సిమెంటు పనిలో విగ్రహం చేయి చాస్తున్నట్లు ఉంటే లోపల చేయి కొలత ప్రకారం ఇనప ఊస పెట్టడం. (తె.6; రా.5)

**ఆనంద** : ముదురు నీలం (నేవిబ్లూ = navy blue) (రా.13)

**ఆనపకాయ** : పర్యా. ఆనప తుంబ, సొరకాయ. వీణని కాలు మీద పెట్టుకోడానికి వీలుగా దండికి కింద అమర్చిన సొరకాయ. చూ. చిత్రం.? (కో.13)

**ఆనపచెట్టు** : సొరకాయ పాదు. (కో.6)

**ఆనపతుంబ** : వీణకి 'మేరువ' దగ్గర అమర్చిన సొరకాయ. చూ. ఆనపకాయ. చూ. చిత్రం. ? (కో.6)

**ఆపెలు** : రాతిపనిలో శిలను తొలచడానికి ఉపయోగించే పనిముట్టు. (రా.1)

**ఆఫ్‌క్రౌన్** : నాటకంలో పెట్టుకొనే కిరీటం. ఇది తలకి ముందు మాత్రమే ఉంటుంది. (కో.7)

**ఆమడ** : నాలుగు కోసులు. అమృత శిలను రెండామడల దూరం వెళ్లి తెస్తారు. (తె.6; రా.2)

**ఆమీన** : ఆ తరువాత. (కో.5)

**ఆముదం** : రూపా. అయిదం. పూర్వం తోలుబొమ్మలాట ప్రదర్శనకి వాడే దీపంలో పోసే నూనె. (రా.2,10); ఢోల్కి దూంపుడికి వేసే రంగన్ చేయడానికి గుగ్గిలం మట్టితో కలిపే నూనె. (తె.3); కాటుక చేయడానికి వెలిగించే దీపంలో పోసే చమురు. (కో.29)

**ఆముదం పలుకులు** : తంబడి డోలుకు పెట్టడానికి మైదాలో కలిపేది. (తె.2)

**ఆయిల్ పెయింటింగ్** : చిత్రలేఖనంలో తైలవర్ణంతో వేసిన బొమ్మ. (కో.2,16; తె.1,15; రా.5,11)

**ఆయుధం** : యుద్ధంలో చేతిలో ఉండే సాధనం. (కో.29)

**ఆరతి** : హారతి. (తె.1)

**ఆరనిచ్చు** : వేడిగా ఉన్నదాన్ని చల్లారబెట్టు. మేకప్‌లో విగ్గుని నీటిలో ఉడికించి ఆరబెట్టు. (కో.29)

**ఆర్గన్** : హార్మోనియంలో లావు శ్రుతి చేయడానికి ఉపయోగించేది. (రా.10)

**ఆరంజ్** : నారింజపండు రంగు. (రా.13)

**ఆరు** : 1. సంఖ్య. 2. ఎండు. పర్యా. ఇగురు. (కో.7,19; రా.5,13)

**ఆరోహం** : శ్రుతి పెరగటం/పెంపు. (కో.7)

**ఆర్ట్** : కళ. శిల్పం చెక్కడం, నగిషీ చెక్కడం. (తె.10)

**ఆర్టిస్టు** : పర్యా. చిత్రకారుడు. బొమ్మలు వేసేవాడు. (కో.7,9)

**ఆర్చు** : ఆరబెట్టు. (రా.5)

**ఆర్మోనియం** : పర్యా. శ్రుతిపెట్టె. రూపా. హార్మోనియం. సంగీత వాయిద్యం. (కో.7)

**ఆల్కహాల్** : మత్తు పానీయం. (కో.33)

**ఆవుతోలు** : నగారా తయారీలో వాడే చర్మం. (తె.2)

**ఆవుదూడ చర్మం** : మృదంగం 'కుడిముఖం'లో ఉపయోగించే తోలు. (రా.5)

## ఇ

**ఇగురు** : ఆరు, ఎండిపోవు. చూ. ఆరు. (కో.1,2)

**ఇంకు** : సిరా; ఆరటం. (కో.19; రా.2,13)

**ఇంగ్లీకం** : రూపా. ఇంగిలీకం. పర్యా. ఎరుపు, ఎర్రరంగు, సింగ్ రూఫ్, మణిశిల. (తె.2,4,9)

**ఇంగ్లీషు ఆర్ట్** : చిత్ర లేఖనంలో బొమ్మకి వెలుతురు, నీడ ఉండేట్లు చెయ్యడం (light & shades). చిత్రలేఖనంలో ఇదొక పద్ధతి. (కో.3)

**ఇంగ్లీషు డ్రామా** : ఆంగ్ల నాటకం. (కో. 7)

**ఇంచి** : (<Eng. inch) అంగుళం. (కో.1,3,39; తె.4,7,12, రా. 5)

**ఇంచిబ్రష్** : అంగుళం కుంచె. (తె.2)

**ఇంటి కర్ర** : తొరపణాన్ని తిప్పడానికి ఉపయోగించే కట్టె. చూ.చిత్రం.? (కో.6,9)

**ఇండియన్** : భారతదేశానికి సంబంధించిన. (రా.13)

**ఇండియన్ ఆర్ట్** : భారతదేశానికి సంబంధించిన కళ. (కో.7)

**ఇండియన్ ఇంక్** : చిత్రలేఖనంలో ఉపయోగించే నల్ల సిరా. (కో.19)

**ఇండియన్ హాండ్‌మేడ్ డ్రాయింగు పేపర్** : చిత్రలేఖనంలో బొమ్మలు వేయడానికి వాడే కాగితం. (కో.2)

**ఇండ్లు(బ)** : వీణదండిపై ఉండేమెట్లు, కంచు లేదా ఉక్కుతో ప్రత్యేకంగా తయారుచేసిన 24 కడ్డీలను మెట్లుగా ఏర్పడేటట్లు వరుసగా వీణదండిపైమైనంతో బిగిస్తారు. (కో.7)

**ఇత్తడి కడియం** : వీణ తయారీలో కుండమీద తీగలు అమర్చడానికి 7కన్నాలు కలిగిన ఇత్తడితో చేసిన ఒక భాగం. చూ.చిత్రం.1-8. (కో.6)

**ఇత్తడి కప్పు** : వీణలో సొరకాయ బుర్రమీద పూవు ఆకారంలో ఉన్న కప్పు. చూ.చిత్రం.? (రా.5)

**ఇత్తడి తాళాలు** : కంజీరలో ఉండే బిళ్ళలు. చూ.చిత్రం.9.2 (కో.3,7; తె.1,3; రా.8)

**ఇత్తడి పీట** : పర్యా. తాళంపీట. వీణలో కుండ పైభాగం మీద ఉంటే ఇత్తడి భాగం. ఇది రెండు భాగాలు. వీటిని పైపీట, పక్క పీట అంటారు. లగానికి బిగించిన తీగలు ఈ పక్కపీట గాని పైపీట మీదగాని వస్తాయి. (కో.39)

**ఇత్తడి బేసు** : వీణని కింద పెట్టటానికి వీలుగా ఇత్తడితో చేసిన ఒక భాగం. చూ.చిత్రం-1.19. (కో.6)

**ఇత్తడి వైరు** : హార్మోనియం రీడ్‌లపైన ఉండే తీగ. (కో.39)

**ఇనప ఊస** : డోలకు శ్రుతి సవరించడానికి వాడే రింగులను చేయడానికి ఉపయోగించే ఇనప తీగ. (కో.13)

**ఇనప కడెం** : రూ. ఇనప కడియం. తంబడి డోలుకు ఒకవైపున బిగించే ఇనప కడియం. చూ.చిత్రం-7.3. (తె.2)

ఢోల్కీ పుడి చుట్టు ఉండే ఇనప కడియం. (తె.3)

**ఇనపకత్తెర** : ఇనప కట్టర్. లోహపు వస్తువుల్ని కత్తిరించే సాధనం. (తె.3)

**ఇనపకుంచె** : కోసుగా, రంపం పళ్ల ఆకారంలో, ఇనుముతో చేసిన ఒకరకం కడ్డీ. దీనితో వీణకు సన్నని బెజ్జాలు వేస్తారు. (కో.24)

**ఇనపకుండ** : డగ్గ కుండ. చూ.చిత్రం.? (తె.2)

బ్యాండ్‌లో ఉండే ఇనప భాగం. (తె.2)

**ఇనపగరిటె** : విగ్గులను నీటిలో ఉదికించేటప్పుడు కలపటానికి వాడే సాధనం. (కో.29)

**ఇనపగొట్టం** : కుంచెలు చేసేప్పుడు చివరగా వెంట్రుకలు పెట్టడానికి వాడే చాకు (చిన్న కత్తి)ను పట్టుకొనే భాగం. (తె.3)

**ఇనపముక్క** : సంగీత పరికరాలు చేయడానికి ఉపయోగించే పెద్దఆరె, జాతులులలో ఒక భాగం. చూ.చిత్రం-33.37; 39.3. (కో.5,7)

**ఇనుపమేకు** : పర్యా. మొల, మేకు. తబలా తయారీలో మూతకి వాడే తోలుని ముందు చెట్టు నీడలో సాగదీసేప్పుడు తోలు అంచుల్ని నేలకు బిగించి ఉంచడానికి వాడే ఒక రకం మేకు. (కో.7)

**ఇనపసుత్తె** : సంగీత పరికరాలు చేయడానికి ఉపయోగించే కట్లసుత్తెలో ఒక భాగం. చూ.చిత్రం.-61.2. (కో.16,29)

**ఇనపస్ప్రింగు** : వంచడానికి అనువుగా ఉన్న ఇనప తీగ. (కో.13)

**ఇనుపపొడి** : మృదంగం కరిణ తయారీలో దీనిని ఉపయోగిస్తారు. మృదంగం కుడి ముఖం 3 రకాల పొరలతో ఉంటుంది. మధ్య భాగంలో ఒక నల్లటి మందు స్థిరంగా, గట్టిగా అంటించి ఉంటుంది. ఈ

మందు తయారీలో ఉడికించిన అన్నంలో సన్నని ఇనుపపొడి కలుపుతారు. (రా.5)

**ఇనపరేకు** : రంపం చేయడానికి వాడేది. (కో.12,29)

**ఇనుపవైరు** : ఇనప తీగ. (కో.39)

**ఇందు (ట)** : శుభ్రం చేయడం. మేకప్‌లో మీసాలు తయారు చేయడానికి గొర్రె వెంట్రుకలు తెచ్చి శుభ్రం చేయడం. (రా.8)

**ఇరవైసూత్రాలకథ** : ఒగ్గు కథకులు చెప్పే ఒక కథ. (తె.1)

**ఇరికించు** : డోలక్ చేసేప్పుడు ఎలత బద్దను పూడిలో దోపడం. (తె.2)

**ఇల్లునింపుకొనటం** : కురుమ కులం వాళ్లు పాడుకొంటూ పోతే ఊళ్ళో ఆ కులం వాళ్లు గురువులొస్తున్నారని ఎదురుపోయి 'ఆహ్వానించడం'. (తె.1)

**ఇసుక దిమ్మె** : ఇసుకతో కట్టిన అరుగు. (కో.33)

## ఈ

**ఈక** : పక్షులకి తోకచివర ఉండేది. బుర్రకథ చెప్పేవాళ్లు తలపాగాలో పెట్టుకొంటారు. (తె.1)

**ఈజల్** : రూపా. ఈజిల్. చిత్రలేఖనంలో బొమ్మలు వేసేప్పుడు ఉపయోగించే స్టాండు. (కో.2,3)

**ఈజీ** : సులభం (< easy). (కో.3)

**ఈటె** : నాటకంలో రాజభటుల చేతుల్లో ఉంచే బల్లెం. (కో.29)

**ఈడిగ** : ఒక కులం. ఈ కులం వాళ్లు కల్లు తీస్తారు. (రా.8)

**ఈన** : పర్యా. పరులు, బీట, బీడ. పగిలిపోవడం. (రా.4) రూపా. ఈనె. సన్నని పుల్ల. (కో.5,7,26)

**ఈరిగ రంపం** : ఒక రకం రంపం. చూ.చిత్రం-59. (కో.5)

## ఉ

**ఉక్కు (తీగ)** : (1) వీణమెట్లు చేయడానికి, శ్రుతితీగలుగా వీణకు అమర్చడానికి, మోగించడానికి కూడ దీనిని ఉపయోగిస్తారు. (కో.6,7)

(2) ఫిడేలుకు శ్రుతి చేయడానికి ఉపయోగపడే తీగ. (రా.5)

(3) ఈ లోహంతో ఆకురాయి కూడా చేస్తారు. (రా.5)

**ఉగాది** : తెలుగు సంవత్సరం మెదటి రోజు. విశ్వకర్మ కులస్థుల పండగ. (తె.1,4)

**ఉడత తోక** : ఉడత తోక చివరి భాగం. చిత్రలేఖనంలో సిల్కుబట్ట పైన రంగులు వేసే కుంచెకు చివర ఉన్న 'కుచ్చు' చేయడానికి వాడేది. (తె.1,4)

**ఉడతెంటిక(లు)** : ఉడుత వెంట్రుకలు, చూ. ఉడత తోక. (తె.9; రా.9,11)

**ఉడుకులాము** : మేకప్‌లో ఉపయోగించే రంగులు చేయడానికి గ్లిజరిన్, క్రీము, రోజానీళ్లలో కలిపే ఒకద్రవం. (Eau de Cologne). (కో.7)

**ఉడుత** : ఒక జంతువు పేరు. దీని తోక వెంట్రుకలతో కుంచెలు చేస్తారు. (కో.26; రా.13)

**ఉడుతతోక జుట్టు** : చూ. ఉడుత తోక. (తె.1)

**ఉడుము చర్మం** : దీనితో కంజీరమూతలు చేస్తారు. (కో.7)

**ఉడెన్ టూల్స్** : క్లే (clay). బొమ్మలు చేసేప్పుడు చిన్నచిన్న భాగాలు మలచడానికి వాడే కొయ్య పరికరాలు. చందనం కర్రలతో గాని రోజువుడ్‌తో గాని వీటిని చేస్తారు. (కో.38)

**ఉండ** : డమరులో ఒక భాగం. చూ.చిత్రం-10.4. మృదంగం కరిణెకు పూయడానికి వాడే కరిణె పిండి ముద్ద. (కో.7)

మేకప్‌లో పొడవు జుట్టు కావాలంటే దాన్ని చేయడానికి తీసుకొన్న నారకట్ట. (కో.7)

**ఉపకరణం** : పర్యా. పనిముట్టు, పరికరం,కదురు. సిమెంటు బొమ్మల తయారీలోనూ, రాతి పనిలోనూ వాడే పరికరం. (రా.8)

**ఉంబం :** నాటకంలో ఉపయోగించే తెరలు చేసేటప్పుడు గుడ్డమీద బొమ్మలు వేయడానికి వాడే ఒకరకం కుంచె. ఈతగుత్తిని నానబెట్టి చివర కుంచెగా చేస్తారు. (రా.13)

**ఉత్తమప్రమాణం :** రాతిపనిలో గణపతి విగ్రహం చెక్కడానికి తీసుకొనే కొలత. దీనినే పంచతాళం అంటారు. ఈ విగ్రహం 65 అంశాలు కలిగి ఉంటుంది. (రా.5)

**ఉత్తమదశతాళం :** రాతి పనిలో బ్రహ్మ, విష్ణు, మహేశ్వర, బుద్ధ మొదలైన విగ్రహాలు చేసేప్పుడు వాడే ప్రమాణం. ఈ విగ్రహ ప్రమాణం 124 భాగాలు కలిగి ఉంటుంది. (రా.5)

**ఉత్తము :** రాతి పనిలో విగ్రహాలకి చేసే కిరీటం. (కో.31)

**ఉత్తరీయం :** పర్యా. కండువా. పంచకట్టుకున్నప్పుడు భుజం మీద వేసుకునే బట్ట, పైపంచ. (కో.39; తె.6)

**ఉత్సవిగ్రహం :** ఉత్సవ విగ్రహం. ఉత్సవాలలో ఊరేగింపులకు వాడే విగ్రహం. (కో.19,33)

**ఉదరబంధం :** రాతి పనిలో విగ్రహానికి పొట్ట దగ్గర చెక్కే ఆభరణం: (కో.31; రా.5)

**ఉద్భవించు :** వీణ మీటినప్పుడు ధ్వని పుట్టు. వీణ తీగమీటటాన్ని బట్టి వెలువడే నాదం. (కో.28).

**ఉదాసీనత :** నాటకంలో వేషధారి కనబర్చే నిర్లిప్తత. (కో.29)

**ఉరువు :** రూపా. ఊరువు, ఊరు. ఒక భాగం ప్రదేశం (రాతిపనిలో). (తె.4,6)

**ఉల్టా :** రంగ్రేజ్ పనిలో కాగితం మీద డిజైన్ చెక్కి దాన్ని చెక్క మీద తల కిందులుగా అతికించిన భాగం. (తె.4)

**ఉలి :** (పర్యా. చిన్నస్టాణం) శిల్పం చెక్కడానికి వాడే పని ముట్టు. (చూ.చిత్రం.39) (కో.7,11,13,16,25,28,30, 31,32,33,35; తె.1,4,6,13; రా.1,3,4,5,8)

**ఉలికొత్తు :** రాతి పనిలో విగ్రహాన్ని చెక్కడానికి వాడే పని ముట్టు. దీనితో రాతిని చెక్కలుగా చేసి సాఫీ చేస్తారు. (రా.5)

**ఉలిపిరి కాగితం :** రూపా. ఉల్లిపొర కాగితం. పర్యా. ట్రేసింగ్ పేపర్, బట్టర్ పేపర్. చిత్రలేఖనంలో బొమ్మలు ట్రేస్ తీయడానికి వాడే కాగితం. (కో.7,19)

## ఊ

**ఊగు :** సిమెంట్ బొమ్మల తయారీలో మొదట ఇనప ఊసలతో చేసిన బొమ్మలోని ఊసకదులు. (రా.13).

**ఊడదీయు (/గొట్టు) :** విడదీయు. (కో.5,7)

**ఊడిపోవు :** విడిపోవు. (కో.1; రా.13)

**ఊదారంగు :** పర్యా. నేరేడుపండు రంగు. బచ్చలి పండు రంగు. (కో.7,30)

**ఊదు :** నోటితో గాలిని వదలు. (కో.3,29; తె.8; రా.11)

**ఊదు రంధ్రం :** ఫ్లూటు వాయించేప్పుడు నోటితో గాలిపోసే చిల్లు. చూ.చిత్రం-19.2. (కో.7)

**ఊరు :** రూపా. ఊరువు. శిల్పంలో తొడభాగం పేరు. (రా.8)

**ఊరుదామం :** రాతిపనిలో విగ్రహం కటి స్థానంలో చెక్కే ఆభరణం. (కో.31)

**ఊరేగింపు :** పర్యా. మెరవణి. పండగల్లో దేవుని విగ్రహాలను వేడుకతో ఊర్లో తిప్పడం. (కో.19)

**ఊలుగుచ్చులు :** సంగీత వాయిద్యమైన మురళితో వేలాడుతుండే కుచ్చులు. చూ.చిత్రం-19.4. (రా.5)

**ఊసివచ్చు :** రూపా. ఊసొచ్చు. ఊడివచ్చు. (తె.2,8)

**ఊహా చిత్రం :** చిత్రలేఖనంలో ఊహించివేసిన చిత్రం. (రా.13)

## ఎ

**ఎకస్త్రా :** రూపా. ఎగస్త్రా. పర్యా. కచ్చు. మృదంగం చేసేప్పుడు మూతకి వాడే తోలును కొలత ప్రకారం కోయగా మిగిలిన ముక్క. (రద్దు). కావలసిన దాని కంటే ఎక్కువగా ఉండేది. (కో.7,రా.5)

**ఎక్కించు :** (1) మృదంగం, తబలా, నౌబత్ మొదలైన

వాయిద్యాలు చేసేప్పుడు మూతల దగ్గర ఉండే చిల్లుల్లోకి వారు దోపు. (తె.2)
(2) తోటల్లో, ఇండ్లల్లో లతలని అందంగా మలచు. (రా.13)

**ఎగవది** : మృదంగం మూతలోని పొరలలో పైనుండే తోలు. (కో.7)

**ఎగిసి కర్ర** : ఎగిసి చెట్టు కర్ర. డోలకు తయారీలో ఈ కర్రను ఉపయోగిస్తారు. (కో.13)

**ఎంగిలి** : నాటకంలో పాత్రకు నోట్లోంచి రక్తం రావాలంటే స్పాంజీలో ఎర్ర రంగుపోసి నోట్లో పెట్టుకుంటే ఊరే నీరు. (కో.7)

**ఎడ** : సన్నాయి బొక్కలు పెట్టడానికి వాడే పనిముట్టు. (కో.36)

**ఎడంకన్ను** : డోలకు ఎడమ వైపున ఉండే మూత. (కో.5)

**ఎడమతొరుపు** : మృదంగం ఎడమవైపున ఉండేమూత. దీనిని మేక చర్మంతో చేస్తారు. (కో.7)

**ఎడందిమ్మె** : మృదంగం తబలా కుండలు చేయడానికి వాడే అడ్డలో ఎడమవైపున ఉన్న కొయ్య. (కో.7)

**ఎడమముఖం** : పర్యా. ఎడమ తొరుపు. మృదంగం ఎడమ వైపున ఉండే మూత. (కో.5)

**ఎడంమూత** : పర్యా. ఎడం కన్ను. డోలకు ఎడమ వైపున ఉండే మూత. (కో.5)

**ఎడ్జస్టర్** : ఫిడేలు తీగలు బిగించడానికి చివర ఉన్న బిరడా. ఇవి మొత్తం నాలుగుంటాయి. (కో.7)

**ఎడ్వర్టైజ్‌మెంట్** : ప్రకటన. చిత్రలేఖనంలో కమర్షియల్ ఆర్ట్ వేసే చిత్రకారులు ప్రకటన బోర్డులను(sign boards) వేస్తారు. (కో.9)

**ఎడ్జెస్ట్‌మెంట్ స్క్రూ** : హార్మణి తయారీలో క్లేంపును కావలసిన కొలతలకి సరిచేయడానికి వాడే సాధనం. (కో.39)

**ఎంటిక** : పర్యా. వెంట్రుక. మేకతోలులో ఉన్న వెంట్రుక. తబలా తయారీలో మొదట మేకతోలుకి సున్నం పెడితే ఊడిపోయే వెంట్రుక. (తె.2)

**ఎండగట్టు** : పర్యా. ఎండబెట్టు, ఆరబెట్టు. తబలా తయారీలో మొదట తోలుని శుభ్రం చేసి ఆరబెట్టు. (కో.13; తె.3)

**ఎండినతోలు** : బాగా ఆరిన తోలు. డోలకును ఈ రకం తోలుతో చేస్తారు. (కో.5)

**ఎండుపిన్ను** : ఫిడేలు పైభాగంలో ఉండే తంతులు తరలించడానికి ఉపయోగపడే సాధనం. (రా.5)

**ఎత్తుపల్లాలు** : పర్యా. ఎత్తులు వంపులు. పోతపోసిన విగ్రహాలు ఎత్తుపల్లాలుగా ఉండడం. (కో.5)

**ఎదురు బద్ద** : పర్యా. వెదురు బద్ద. డోలకు తయారీలో డోలకు మూతకు పెట్టే గుండ్రని వెదురుపుల్ల. (తె.2)

**ఎద్దుచరమం** : ఎద్దుచర్మం. మృదంగం మూతల తయారీలో ఉపయోగించే తోలు. (కో.7)

**ఎద్దుతోలు ఎంటిక(లు)** : (బ). ఎద్దుతోక చివరనున్న వెంట్రుకలు. బ్రష్/కుంచెలు దీనితో చేస్తారు. (తె.2)

**ఎద్దుతోకచివళ్ళు** : ఎద్దుతోక చివరనున్న వెంట్రుకలు. ఈ వెంట్రుకల్ని ఒకపుల్లకి దారంవేసి కుచ్చుగా కట్టి బ్రష్/కుంచెలు చేస్తారు. (కో.13)

**ఎనామిల్ పెయింట్** : రూపా. ఎనామలు పెయింట్. పౌరాణిక నాటకంలో గద తయారీలో వాడే రంగు. (కో.29)

**ఎనిమిది** : ఫ్లూటులో ఉండే వేలి రంధ్రాల సంఖ్య. (కో.7)

**ఎనిమిద్దినాలకత** : వొగ్గు కథలు చెప్పేవారు 'బీరప్ప పండుగ' సందర్భంలో చెప్పే బీరప్ప కథ. ఈ ఉత్సవం ఎనిమిది రోజులు జరుగుతుంది. ఈ ఎనిమిది రోజులూ బీరప్ప కథ చెబుతారు. దీన్నే 'ఎనిమిద్దినాల కథ' అంటారు. (తె.11)

**ఎనుమువారు** : మృదంగం, డోలకు మూతలకి వాడే ఎద్దుతోలు. ఈ తోలుని సన్నగా కత్తిరించి మృదంగం బిగిస్తారు. (రా.5)

**ఎనుబోతువార :** పర్యా. వాడి, వారు, తోలువైరు. మృదంగం బిగించడానికి వాడే ఎద్దు తోలు. (రా.10)

**ఎమ్ను :** వెన్నుపూస. మృదంగం, డోలకు తయారీలో మూతలకు వేసే తోలు ఎండబెట్టి కోసిన మధ్యభాగం. (కో.5,7)

**ఎవ్.సి.లేకర్‌స్ప్రే :** చిత్రలేఖనంలో సిల్కుబట్టల మీద బొమ్మలకి రంగులు పూసి తడి తగిలితే రంగులు పోకుండా ఉండటానికి స్ప్రే చేసే ఒక యంత్రం. (తె.1)

**ఎఫ్.యస్.హోల్స్ :** ఫిడేలు బ్రిడ్జికి ఇరువైపులా ⌐¬ ఆకారంలో ఉన్న భాగాలు. చూ.చిత్రం-3.7. (రా.5)

**ఎఫెక్ట్ :** 1. చిత్రలేఖనంలో బొమ్మ అనుకొన్న విధంగా రావడం. (కో.1)

2. మేకప్‌లో ఆంజనేయుని పాత్ర మూతికి డిప్పలు సరిగ్గా పెట్టడం. (కో.7)

**ఎబొని :** రూపా. ఎబాని. ఫిడేలు బిరడాలు చేయడానికి వాడే సాధనం. (రా.5)

**ఎబోనిట్ దళసరి ముక్క :** వీణ మీద డిజైన్ వేయడానికి వాడే దళసరి కాగితం ముక్క. (కో.13)

**ఎంపిక :** రాతిపనిలో శిల్పానికి పనికొచ్చే రాయిని ఎన్నిక చేయడం. (రా.8)

**ఎరుకల వాంచారి కథ :** ఒగ్గు కథకులు చెప్పే ఒక కథ. (తె.1)

**ఎర్రమట్టి ఇటుక :** కరక్కాయ సిరా తయారీలో 'పొయ్యి' నిర్మించడానికి వాడే ఇటుక. (కో.28)

**ఎర్ర రంగు :** ఎరుపు రంగు. చూ. ఇంగ్లీకం. (కో.7; తె.2; రా.5,8)

**ఎర్రరాయి :** పర్యా. ఎర్రశిల. రాతి విగ్రహాల తయారీలో ఈ శిలను ఉపయోగిస్తారు. (కో.19; తె.6)

**ఎర్రలక్క :** వీణ డిజైన్లకు పూయడానికి వాడే లక్క. (కో.6)

**ఎరుపు :** పర్యా. సింగ్‌రూప్, ఇంగ్లీకం, రెడ్. ఎర్ర రంగు. రస కర్పూరం, అర్దలం, రెండూ కలిపితే ఎరుపు వస్తుంది. పూర్వం లక్కలో కలపడానికి దీన్ని వాడేవారు. (కో.7,12,16; తె.4,9)

**ఎలకలపడు :** రాతిపనిలో శిల్పం చెక్కేప్పుడు రాయిని వెల్లకిల పెట్టు. (తె.6)

**ఎలతబద్ద :** వెదురు బద్ద, ఎదురు బద్ద. డోలకు తయారీలో డోలకు మూతకు పెట్టే గుండ్రని వెదురు పుల్ల. (తె.2,7)

**ఎలాస్టిక్ ముక్క :** నాటకంలో పెట్టుకునే విగ్గు జారిపోకుండా తలని గట్టిగా పట్టుకొని ఉండేందుకు పెట్టిన సాగే రబ్బరు ముక్క. (కో.7)

**ఎలుపు(చేయు) :** రూపా. ఎలుము, వెడల్పు, వెడల్పుచేయు. (తె.2,6,8)

**ఎలుబూడిద :** పర్యా. కచ్చిక. పిడకలు కాల్చిన తరువాత మిగిలిన తెల్లబూడిద. కాగితం గుజ్జు, మట్టి, సుద్ద బొమ్మల తయారీలో దీనిని ఉపయోగిస్తారు. తోలుకి వెంట్రుకలు పోవడానికి ముందు దీన్ని పూసి రంపితో తీసేస్తారు. (కో.13,17)

**ఎల్లకం :** రూపా. అల్లిక. తబలా, డోలకు తయారీలో వారుని అల్లడం. (రా.5)

**ఎల్లమ్మ కథ :** ఒక వొగ్గు కథ. (తె.1)

**ఎల్లుకుని :** డోలకు నారుని అల్లుకోవడం. (రా.5)

**ఎల్లో :** పసుపు రంగు. (కో.3; రా.7)

**ఎల్లోఓచర్ :** (yellow ochre). ఎల్లో. (రా.9)

## ఏ

**ఏక్‌పానుసుత్తి :** పర్యా. ఒక పాను సుత్తి. రాతిపనిలో ఉపయోగించే సుత్తి. (తె.6)

**ఏకవర్ణం :** రాతిపనిలో వాడే శిల అంతా ఒకే రంగులో ఉండటం. (తె.6)

**ఏగి** : పర్యా. జిట్టేగి, (తబల) రోస్‌వుడ్. డోలక్, తబలా చేయడానికి వాడే ఏగి చెట్టు కొయ్య. (తె.2)

**ఏటకోయు** : వొగ్గు కథ చెప్పేవారు సంక్రాంతి పండగప్పుడు దేవునికి గొర్రెను బలిచ్చు. (తె.1)

**ఏటకసరు** : సరుగులో ఒక భాగం. బలిమాంస సంబంధమైనది. (తె.1)

**ఏడుమల్లెపూలకత** : ఒక వొగ్గు కథ. (తె.1)

**ఏనుగు** : దంతాలు గల జంతువు. ఈ దంతంతో ఫ్లూటు చేస్తారు. (రా.5)

**ఏమాటోండ్లు** : కథలు చెప్పి అడుక్కునే ఒకతెగ గొల్లవారు. (తె.9)

**ఏపకొమ్మ** : 1) వేపచెట్టు కొమ్మ. ఎల్లమ్మ, పొశమ్మ కథలు చెప్పేటప్పుడు వొగ్గుకథకులు ధరించే వేపమండ.
2) సరుగు మిశ్రమంలో ఒక భాగం. (తె.1)

**ఏరక** : పర్యా. ఏరు.
(1) తెల్లరంగు తయారీకి వాగుకు పోయి గవ్వలని (నత్తగుల్లలు) ఏరుకు రావడం. (తె.4)
2) మృదంగం కరిణ తయారీకి 'చిటిమరాళ్ళు' ఏరుకు రావడం. (రా.10)

**ఏరులాకు** : (Air lock). హార్మణీలో గాలిని అదుపు చేసే భాగం. (కో.7)

**ఏపంకట్టు** : వేషం వేయడం. చెప్పే వొగ్గు కథని బట్టి వేషం వేసుకొను. (తె.1)

## ఐ

**ఐదుగురు** : ఒగ్గు కథ చెప్పేవారి సంఖ్య. ముందువరుసలో నిల్చున్న ఇద్దరిలో ఒకరు కథ చెబుతుంటే మరొకరు సుతి (రాగం)అందిస్తారు.వెనుక వరుసలో కూర్చున్న ముగ్గురిలో ఒకరు తాళం, ఒకరు డక్కి, ఒకరు డోలు వాయిస్తారు. చూ.చిత్రం-25. (తె.1)

**ఐదుమల్లెపూల కథ** : ఒక వొగ్గు కథ. (తె.1)

**ఐబ్రో** : (eye brow). పర్యా. అంబరు. కనుబొమ్మ, కన్నుబ్బు. (కో.7)

**ఐరన్ టూల్స్** : సిమెంటు బొమ్మల తయారీలో వాడే ఇనుప పరికరాలు. (కో.38)

**ఐవరిబ్లాక్** : (Ivory block). చిత్రలేఖనంలో బొమ్మలకి వేసే లేత నలుపురంగు. (రా.9)

## ఒ

**ఒకపౌన్‌సుత్తి** : పర్యా. ఏక్‌పౌను సుత్తి. వీణ తయారీలో వాడే కంపాసు చివర్లు సూదిగా రావడానికి ఉపయోగించే సుత్తి. (కో.6)

**ఒకటోనంబరు** : రాతి పనిలో విగ్రహం పూర్తిగా చెక్కిన తరువాత నునుపు రావడానికి వాడే ఆకురాయి నెంబరు. (రా.5)

**ఒగ్గు** : సంగీత వాద్యాలలో ఒక ఘన వాద్యం. చూ.చిత్రం.20 (కో.6)

**ఒగ్గేయు** : వీణ తయారీలో కుండపై పీటను ఉంచు. (కో.6)

**ఒంకపుల్ల** : డోలకు తయారులో చర్మాన్ని వెదురు బద్దకి దూర్చడానికి వాడే పుల్ల. (కో.5)

**ఒట్టికట్టె** : మృదంగం నేర్చేటప్పుడు జతులను వల్లించి సాధకం చేయడానికి కట్టెతో చేసిన మృదంగం ఆకారం. (కో.5)

**ఒడాపు** : రాతిపనిలో శిల్పం తయారీకి వాడే ఇనుప పరికరం. (రా.8)

**ఒడ్డు** : హార్మణీ పై భాగం. (కో.7)

**ఒడ్డుపొడవు** : రాతి పనిలో మొదట రాయికి చూసే వెడల్పు పొడుగు. (కో.7)

**ఒత్తి** : మృదంగం బిగించడానికి వాడే వారును రంపితో కోయడం. (కో.7)

**ఒత్తిడి** : చిత్రలేఖనంలో కాగితాన్ని ముందు నీటితో తడపి

బోర్డుకి అంటించి మడతలు రాకుండ పైన ఒక గుడ్డవేసి పెట్టే బరువు. (కో.19)

ఫిడేలు తీగలను గట్టిగా నొక్కి వాయించడం. (రా.5)

**ఒత్తిరెప్ప** : తబలాకి వాడే తోలు ముక్క. (కో.7)

**ఒత్తు** : నాగస్వరానికి పక్కన శ్రుతి కోసం వాయించే సాధనం. (కో.7; రా.5)

నూనె దీపంలో కాంతి నివ్వడానికి వెలిగించేది. (రా.5)

**ఒప్పచెప్పు** : రాతిపనిలో శిల్పం చేసి చేయించుకున్నవారికి ఇచ్చేయడం. (కో.19)

**ఒంపుఉలి** : రూపా. వంపులి. మృదంగం తయారీలోవాడే పనిముట్టు. చూ.చిత్రం-43. (కో.7)

**ఒంపుకొను** : మేకప్‌లో వాడే రంగులు పాత్రలో పోసుకోవడం. (కో.5)

**ఒరిజన** : వీణ తయారీలో ముందు కొయ్యపై గుర్తుగ పెన్సిల్‌తో గీయడం. (కో.6)

**ఒరిజినల్** : చిత్రలేఖనంలో వేసిన (కొన్ని) బొమ్మలకు అసలు రూపం (మాతృక). (తె.1)

**ఒరిజినల్‌కలర్** : బొమ్మలకు వేసే సహజమైన రంగు. (తె.4; రా.4)

**ఒరియంబొట్టు** : నాటకాలలో ఒక రకం వేషానికి పెట్టుకునే బొట్టు. చూ.చిత్రం-27.5. (కో.7)

**ఒరుగుకొను** : పర్యా. ఒరిజన. వీణ తయారీలో ముందు కొయ్యపై గుర్తుగ పెన్సిల్‌తో గీయు. (కో.7)

**ఒలుపు** : మృదంగం కరిణ పిండి తయారీలో సిత్రమరాయి పొడి నీటిలో వేసి, పొడి అడుగుకు చేరిన తరువాత పైనీరు ఒంపేయడం. (కో.7)

**ఒళంబి** : రాతిపనిలో వాడే మూల మట్టం. (తె.6)

**ఓంకారపుఅల** : హార్మణిలో వాయించే ఓంకారనాదపు తరంగం. (కో.28)

**ఓణి** : స్త్రీలు వేసుకొనే పమిట. (తె.1)

**ఓపను** : (Open). (కో.7)

**ఓరియంటియల్ ఆర్ట్** : బెంగాల్, ఒరిస్సా, ఉత్తరప్రదేశ్‌లకు సంబంధించిన చిత్రకళ. (కో.3)

**ఓల్సు** : (holes). రంధ్రాలు. (రా.5)

**ఓం శబ్దం** : రాతి పనిలో శిలని పరీక్షించేటప్పుడు సుత్తితో రాయిని కొట్టినపుడు వచ్చే శబ్దం. (రా.5)

## ఔ

**ఔట్‌లైను** : చిత్రలేఖనంలో బొమ్మ వేసే ముందు తేలికగా గీసేగీతలు. (తె.1)

**ఔషధ ప్రక్రియ** : రాతి పనిలో విగ్రహం పూర్తయిన తరువాత కస్తూరి, గోరోచన, సుర్మ, పెట్లుప్పు మొదలైన వాటితో చేసిన తైలం విగ్రహానికి పూయడం. (రా.5)

## క

**కక్కెర** : రూపా. కక్కర. మృదంగం, తబల కింది భాగంలో వేసే తాత్కాలిక మూత. తాళ్లు బిగించడానికి ముందు వేసే చర్మం మూత. (కో.7)

**కక్కెర ముద్దు** : పర్యా. కక్కెర. మృదంగం, తబల కింది భాగంలో వేసే తాత్కాలిక మూత. (కో.4)

**కంకణం** : చేతులకి తగిలించుకునే ఆభరణం. నాటకాలలో కొన్ని పాత్రలకు మగవారు చేతికి తొడుగుకొనే ఆభరణం. సిమెంటు బొమ్మల తయారీలో ముంజేతి భాగాన్ని సిమెంటుతో చెక్కుతారు. (కో.29,31,33)

**కచ్చారాయి** : పర్యా. కరిణ రాయి. మృదంగం కరిణ చేసేటప్పుడు మూతమీద కరిణ పిండి వేసి తోమడానికి ఉపయోగించే కరిణె రాయి. (కో.7)

**కచ్చుచేయు** : రాతి పనిలో విగ్రహాలకు సన్నపని చేయడం. ఇది దొడ్డపనిలో అయిన చెనకం పని (ఆభరణాలు) చేయడానికి ముందు చేసే పని. (తె.6)

**కచ్చుమొల** : రాతి పనిలో సన్నపని చేయడానికి వాడే చిన్న గుట్టల మొల. (తె.12)

**కచేరి** : రూపా. కచ్చేరి. సంగీత కార్యక్రమం. (కో.24; రా.5)

**కచేరి తంబుర** : కచేరీలలో మాత్రమే ఉపయోగించే తంబురా. (కో.24)

**కంచి** : తమిళనాడులో ఒక పట్టణం. తిరుపతిలో రాతి పని చేసేవారు నల్లరాయి (కృష్ణశిల) తెచ్చే చోటు. (రా.5)

**కంచుబిళ్ళ** : వీణకు కుండపై భాగంలో తీగలను ఎత్తి పెట్టే లోహపు ముక్క. (కో.5)

**కంచుమొల** : సంగీతపరికరాల తయారీలో వాడే కంచు సుత్తి అడుగు భాగం. చూ.చిత్రం-60.3. (తె.10,12)

**కంచుసుత్తి** : సంగీతపరికరాల తయారీలో వాడే పనిముట్టు చూ.చిత్రం-60. (తె.10,12)

**కంజర** : రూపా. కంజీర, కంజీరి. ఒక సంగీత వాయిద్యం. చూ.చిత్రం-9. (కో.3,7; తె 1,3; రా.8)

**కట్‌చేయు** : పర్యా. కత్తిరించు. కోయు. (కో.7,31,34,41; తె.1,3,4,12,13; రా.4,5,7,8,13)

**కట్‌థబ్‌బోల్** : తబలా. (తె.3)

**కటార్ల మహంకాళి** : బీరప్ప పండుగ నాడు ఒగ్గులు వేసే వేషం. (తె.1)

**కట్టింగ్‌ప్లేర్** : రూపా. కట్టింగ్ ప్లేయర్. హార్మణీ తయారీలో అవసరంలేని మేకులు పైకి లాగడానికి వాడే పనిముట్టు (కో.28)

మృదంగం తయారీలో వారు బిగించేటప్పుడు లాగడానికి వాడే సాధనం. (రా.5)

**కట్** : పర్యా. కత్తిరించు, కట్‌చేయు. (కో.7,31,34,41; తె.1,3,4,12,13; రా.4,5,7,8,13)

**కటివలయం** : పర్యా. కటి సూత్రం. రాతి పనిలో విగ్రహానికి కటిస్థానంలో చెక్కే ఆభరణం. (కో.31)

**కటిహస్తం** : శిలావిగ్రహం తయారీలో తొడమీద పెట్టినట్లున్న చేయి. (కో.19)

**కట్టు** : చిత్రలేఖనంలో వాడే బ్రష్షుల తయారీలో ముందు మేక లేదా ఉడత వెంట్రుకల్ని దారంతో కుచ్చుగ కట్టు. (రా.9)

మేకప్‌లో మీసాల తయారీలో ముందు వెంట్రుకల్ని చేత్తో నలిపి మధ్యన దారంతో కట్టు. (కో.7)

**కట్టె** : పర్యా. కొయ్య. చెక్క. కర్ర. (తె.1,2,3,5,8,9; రా.5,8)

**కట్రు** : తబలా తయారీలో వైర్లు కోయడానికి వాడే పనిముట్టు. (కో.7)

**కట్లసుత్తె** : సంగీత పరికరాల తయారీలో ఉపయోగించే పనిముట్టు. చూ.చిత్రం-61. (కో.7)

**కడపరాయి** : రాతిపనిలో వాడే ఒక రకం శిల. కడపలో లభిస్తుంది కాబట్టి కడపరాయి అంటారు. (కో.3)

**కడవ** : పర్యా. కుండ, కుండలి, బుంగ. వీణలో కుండ ఆకారంలో గుండ్రంగ ఉండే భాగం. (కో.13)

**కడియం** : పర్యా. ముద్ది. వీణ కుండపై తీగలు అమర్చడానికి పెట్టిన లోహపు వలయం. చూ.చిత్రం-1.8. (కో.6)

చర్మవాద్యాల తయారీలో మూతలకి చుట్టూవున్న తొడుగు. చూ.చిత్రం-5-4; 6-4; 7-3; 8-4; 10-2; 11-1. (కో.7)

రాతిపనిలో విగ్రహాల కాళ్లకు చెక్కే ఆభరణం. (తె.6)

చేతులకు తొడుక్కునే ఒక ఆభరణం. (రా.2,8)

**కడుగు** : పర్యా. క్లీన్. మేకప్‌కు ముందు ముఖాన్ని నీటితో కడుక్కొను. (రా.8)

చిత్రలేఖనంలో బొమ్మ వేసే కాగితాన్ని నీటిలో కడుగు. (కో.2)

చిత్రలేఖనంలో ఆయిల్ కలర్ వేసింతరువాత బ్రష్‌కున్న రంగు వదలడానికి కిరసనాయిలుతో శుభ్రం చేయు. (కో.2)

**కడుపు** : పర్యా. పొట్ట. వీణ మధ్య భాగం. (కో.6)

మేకచర్మం కోయడంలో మొదలు పెట్టిన చోటు. (కో.7)

**కడ్డీ** : వీణ తయారీలో కరిగించిన లక్క వీణకు చెక్కిన డిజైన్‌లో సరిగ్గా పడడానికి వాడే ఇనుప ఊచ. (కో.6)

వీణకు మెట్లు చేయడానికి వాడే లోహపు కడ్డీ. (కో.7)

**కణవాదం :** తంబురా శ్రుతి ఆగకుండా రావడం. ఊలుముక్క బాగా మెలిపెట్టి నాలుగు తీగల కింద పెడితే ఏ అడ్డంకి లేకుండా శ్రుతి రావడమే కణవాదం. దీనినే తంబురా శ్రుతికి జీవం పెట్టడమంటారు. (కో.13)

**కంటిదృష్టి:** కనుచూపు. ప్రకృతిలోని నీడలనూ, దృశ్యాలనూ మనసులో పెట్టుకొని చిత్రలేఖనంలో రూపుదిద్దాలి. (కో.2)

**కంటిరెప్ప :** పర్యా. పురిమి. మేకప్‌లో నలుపు రంగు దిద్దే కంటి రెప్ప. (రా.13)

**కంటిసోగ :** పర్యా. సోగపురిమ. మేకప్‌లో నలుపు రంగు దిద్దే కంటిపురిమి. (రా.13)

**కంట్రోలు :** ఫిడేలు వాయించేటప్పుడు యస్వోల్స్ శబ్దం సమానంగా చేయడం. (కో.7)

**కంఠం :** వీణలో దండి చివరి భాగం. (కో.7)

నాగస్వరంతో పీకలు కట్టివున్న భాగం. (కో.7)

**కంఠమాల :** పర్యా. కంఠాభరణం, మెడగుండులు, కంఠ సూత్రం, గొలుసు, నక్లీసు. బుర్రకథ చెప్పేవారు మెడలో వేసుకొనే హారం. (తె.1)

రాతిపనిలో విగ్రహానికి మెడలో చెక్కిన ఆభరణం. (కో.31)

**కంఠసూత్రం :** పర్యా. కంఠమాల. రాతిపనిలో విగ్రహానికి మెడలో చెక్కిన ఆభరణం. (రా.8)

**కంఠాభరణం :** నాటకంలో కొన్ని పాత్రలకు మెడకు వేసే ఆభరణం. చూ. కంఠమాల. (రా.29)

**కండవా :** రూపా. కండువా, పర్యా, ఉత్తరీయం, పైపంచ. పంచకట్టు కున్నప్పుడు బుజంపై వేసుకొనే బట్ట. (కో.27)

**కండి :** ముఖవీణ ఊదడానికి ఉపయోగించే భాగం. ముందు భాగం కలపటానికి రాతితో చేసినకట్టు. (రా.10)

**కండించు :** డోలకు తయారీలో కర్రను డొల్లకొట్టి పేడు తీయు. (కో.5,7)

**కండ్లు :** మృదంగం తయారీలో వారు బిగించడానికి మూతల దగ్గర చేసిన రంధ్రాలు. (తె.2; రా.5)

**కత్తిరించు :** పర్యా. కట్‌చేయు. కత్తెరతో కోయు. (కో. 6,7, 16,28,30; తె.2,3,8,10,12,13,14; రా.2,5,11)

**కత్తిరిమీటు :** చూపుడు, నడిమివేళ్లతో వీణను వడిగా మీటడం. (కో.7)

**కత్రియహస్తం :** రాతిపనిలో శిలావిగ్రహానికి, రెండుమూడు వేళ్ళు పైకిపెట్టి ఒకటి, నాలుగు, అయిదు వేళ్ళు కిందకు మడిచిపెట్టి. చెక్కిన కుడిచేయి. (కో.19)

**కథలపటాలు :** అడుక్కునే వారు చెప్పే కథలకు సంబంధించిన పటాలు. (తె.9)

**కదిలిపోవు :** సిమెంట్ బొమ్మల తయారీలో పెట్టిన ఇనుప ఊసలు మోల్డింగులో ఊగిపోవు. (రా.13)

**కనకతార :** ఒకవొగ్గు కత. (తె.1)

**కనకాంబరం :** ఒక రకం పువ్వు. (రా.13)

**కనబడు :** చిత్రలేఖనంలో బొమ్మ బాగా కనబడడం.(రా.9)

**కనీకనిపించని :** చిత్రలేఖనంలో మొదట వేయదలచుకొన్న చిత్రాన్ని లైట్‌గా గీయడం. (రా.9)

**కనుబొమ :** కంటి పురిమ. అంబరు. (రా.5)

**కనుబొమలపైన చుక్కల తీర్పు :** నాటకాలలో ఒకరకమైన వేషానికి చేసే మేకప్‌లో భాగం. చూ.చిత్రం-27.8. (కో.4)

**కనుపు :** జింక ఆకారాన్ని పోలిన ఒక జంతువు. కణుజు. వీణ తయారీలో తాళం తీగల పిరికీలు ఈ జంతువు కొమ్ముతో చేస్తారు. (కో.13)

**కన్ను :** పర్యా. తొల్లు. రూపా. కన్నె. తబలాకు, డోలకుకు ఉండే మూతి. (కో.5,7)

ఉలి తయారీలోను, రాతిపనిలోను వాడేసుత్తి అడుగు భాగం. (తె.12; రా.5)

తబలాకు మూత చివర వాడిని (వారు) గజరాకు బిగించే రంధ్రం. (తె.3)

**కన్నుబ్బులు(బ)** : పర్యా. అంబరు. రాతిపనిలో విగ్రహానికి చెక్కే కనుబొమ్మలు. (రా.8)

**కనెక్షన్** : నాటకంలో స్టేజికి కింది భాగంలో ఎరుపులైటు పెడితే సరిగ్గా అదే భాగంలో పైనకూడ ఎరుపు లైటు పెట్టడం. (రా.13)

**కన్నె** : రూపా. కన్ను. తబలా, డోలకు మూతకి చుట్టు ఉండే చిల్లు. (కో.4)

**కందిబేడలు(బ)** : మృదంగం కరిణ పిండి తయారీలో చిటమ రాళ్లపొడిలో కలపడానికి వాడే కందిపప్పు బద్దలు. (రా.10)

**కందెవ** : పూర్వం మేకప్‌లో కనుబొమలకు వాడే నలుపురంగు. బండి ఇరుసుకు ఆముదం పూస్తే తిరగ్గా తిరగ్గా ఆముదం నల్లబడుతుంది. దీన్నే కందెన అంటారు. నలుపురంగుకు దీన్నివాడుతారు. (కో.29)

**కప్ప** : రాతిపనిలో విగ్రహాలకు శిలని పరీక్షించేటప్పుడు శిల మధ్యలో నీటితో బాటు బయటికి వచ్చే ఒక చిన్న జంతువు. (తె.6)

**కపాలహస్తం** : రాతిపనిలో విగ్రహానికి రెండు చేతులూ పైకిపెట్టినట్లు చెక్కడం. (కో.19)

**కప్పు** : పర్యా. మూత. పైభాగం. (కో.4,5,7,9,12; తె.1,12)

**కబంధం** : రాతిపనిలో ఏకతాళంలో చెక్కేది. (రా.5)

**కమర్షియల్ ఆర్ట్** : చిత్రలేఖనంలో పేర్లు, లేబిల్స్, డిజైన్స్ వేయడం. (కో.19)

**కమాన్** : రూపా. కమాను. పర్యా. బో, బౌ, విల్లు. ఫిడేలు వాయించడానికి విల్లు ఆకారంలో ఉన్న ఒక సాధనం. చూ.చిత్రం-3.8. (కో.7; రా.8)

**కమానీలు** : హార్మణీ పైభాగంలో ఉండే ఇనుప ఊచలు. (తె.3)

**కమీజు** : నాటకంలో రాజు వేషానికి పంచె మీద వేసే గుడ్డ. (కో.7)

**కంపాసు** : రూపా. కుంపాస. పర్యా. వృత్తలేఖిని. చిత్రలేఖనంలోను రాతి పనిలోను గుండ్రంగా గీయడానికి వాడే సాధనం. చూ.చిత్రం-32. (కో.13,19; తె.1; రా.8)

**కంప్లీటు**: పూర్తిగా. (Complete). (కో.3,7)

**కంపోజ్** : చిత్రలేఖనంలో కమర్షియల్ ఆర్ట్‌కు రాయటానికిచ్చిన అచ్చు కాగితం. (కో.19)

**కంబాక్సు** : డోలకు తయారీలో మూతకు చర్మం అంటి పెట్టి ఉండటానికి వాడే సాధనం. (రా.5)

**కరక్కాయ**: విగ్గుల తయారీలో జుట్టును నీటిలో నానబెట్టేటప్పుడు నీటిలో వేసే ఒక రకం కాయ. (కో.7)
రాతి పనిలో విగ్రహం నల్లగా కనబడటానికి కరక్కాయ, నల్లకాసు పూస్తారు. (కో.19,28)
మృదంగం కరిణ తయారీలో వాడే ఒక రకం కాయ. (కో.31)

**కరక్కాయ సిరా** : కరక్కాయతోతయారైన నల్లరంగు ద్రవం. (కో.28)

**కరెక్టు** : రూపా. కరక్టు. కరెకుటు. Correct. సరిగ్గా. (కో.7; రా.5)

**కరగవేయు** : వీణ తయారీలో దండి పై భాగంలో అమర్చే మైనం చేసుకునేటప్పుడు తేనెమైనం, మసిగూడ, మంచి గుగ్గిలం, మెత్తగానూరి - ఈ మూడు మైనంలో కలిపి వేడి చేయు. (కో.6)

**కరచు** : కరిపించు. అంటుకోవడం, అతికించడం (కో.6, 32,42; రా.8,13)

**కరండ మకుటం**: రాతి పనిలో స్త్రీ విగ్రహానికి చెక్కే కిరీటం. (కో.3; రా.5)

**కరాజు కాగితం** : రూపా. కరాజు కాయితం; పర్యా. ఉప్పు కాయితం. సంగీత పరికరాల తయారీలో కొయ్యను నునుపు చెయ్యడానికి వాడే గరుకు కాగితం. (కో.5,7)

**కరిణ** : రూపా. కరిణి, కరణి, కరిణె, కర్ని. పర్యా. శాయి. ఘన వాయిద్యాలకు రెప్పపై ఉంటే నల్లటి భాగం. చూ.చిత్రం-5-3; 6-3; 8-3. (కో.5,7,37; రా.5,10)

**కరిణ పిండి** : పర్యా. శాయిపౌడర్, (తబల) శోరు. మృదంగం కుడి భాగాన ఉన్న కరిణకి పూయడానికి వాడే పిండి. (కో.5,7; రా.5)

**కరిణ రాయి** : కచ్చారాయి. మృదంగం కరిణమీద కరిణపిండి వేసి పైన రుద్దడానికి వాడే రాయి. (కో,7; రా.5)

**కరుణ** : నాటకంలో పాత్ర శోకనమయంలో కనబర్చే నటన. (రా.13)

**కర్ణాటక సంగీతం** : కర్ణాట దేశానికి సంబంధించిన సంగీతం. (కొ.39)

**కర్ణాటక మృదంగం** : మృదంగాలలో ఇదొక రకం. దీనికి చాట్ కింద 16 ఎలత బద్దలు (పుల్లల్ని) వేస్తారు. బోనంపుడికి గొడ్డుపోతు వారు వేస్తారు. ఈ పుల్లలు వేయడంతో ధ్వని మ్యావ్, మ్యావ్ అని వస్తుంది. (తె.2)

**కర్ని** : పర్యా. శాయి; చూ. కరిణ. (తి.2,3)

**కర్ని ఏసేరాయి** : పర్యా. గోట. కరిణరాయి. (త.2)

**కర్పూరతైలం** : రాతిపనితో శిల్పానికి పూసే ఒక రకంతైలం. (రా.1)

**కర్రముక్క** : మృదంగం తయారీలో మూతకి చుట్టు వారుకింద బిగించడానికి పెట్టే కొయ్యముక్క. (రా.5)

**కలం** : పర్యా. కుంచె, బ్రష్, బులుసు, పెన్ను, పేనా. చిత్రలేఖనంలో రంగులు వేయడానికి ఉపయోగించే కుంచె. (కో.40; తె.4,9; రా.13)

**కలర్(ఏయు)** : పర్యా. వర్ణం, వన్నె, రంగుధాతువు. రంగువేయు. (కో. 7,19; తె.1,4,5,7,9,11,12; రా.13)

**కలర్‌డిష్** : మేకప్‌లో రంగులు కలుపుకొనే పాత్ర. (రా.5)

**కలర్ మిక్సింగ్‌ప్లేట్** : చిత్రలేఖనంలో రంగులు కలిపే గుంటల ప్లేటు. (కో.25)

**కలర్‌స్కీము** : చిత్రలేఖనంలో ఇచ్చిన నమూనాలో ఉండే రంగుల కలయిక. (కో.19)

**కలశం** : మేకప్‌లో కృష్ణుడి పాత్రకు పెట్టే కిరీటానికి పైమన్న భాగం. (రా.8)

**కలిసిపోవడం** : తబలాకుపూసే స్పిరిట్‌చేసేటప్పుడు స్పిరిట్‌లో లక్కవేస్తే కరిగిపోవడం. (తె.3)

**కలుపు** : చూ. కలదొక్కు. రెండు మూడు పదార్థాలను ఒకటిగ చేయడం. (కో.6,9,41,42; తె.12; రా.9)

**కల్యాణం బొట్టు** : మేకప్‌లో పెట్టే బొట్టు. చూ. చిత్రం-27.3. (కో.7)

**కళ్ళు(బ)** : తబలా, మృదంగం, డోలకు తయారీలో మూతలకి చివర వారు బిగించడానికి చేసే చిల్లులు. (కో.5,7; రా.5)

**కవ** : పర్యా. శ్రుతి. మృదంగం ధ్వని సమంగా ఉండడం. (కో.7)

**కవచం** : సిమెంటు బొమ్మల తయారీలో బొమ్మలకి చెక్కే భుజకిరీటం. (కో. 28)

**కవరు (చేయు)** : (Cover). పౌరాణిక నాటకాల్లో పురుష పాత్రలు వెనుక పొడవుగ కట్టుకొనే బట్ట భుజాల నుంచి పాదాలవరకు కప్పి ఉండడం. (కో.7)

**కవాలీ** : ముస్లిం సాంప్రదాయక సంగీత రూపం. (తె.3)

**కవురు** : రాతిపనిలో విగ్రహం కిరీటానికి పైనుండే భాగం. (కో.31)

**కస్తూరి** : మేకప్‌లో బొట్టుకి వాడే సువాసన ద్రవ్యం. (రా.5) రాతి పనిలో విగ్రహం పూర్తయిన తరువాత పూసే తైలంలో కస్తూరి కలుపుతారు. (రా.8)

**కాగితం** : పర్యా. పేపరు. రూపా. కాయితం. (కో.7; తె,11; రా.8)

**కాటిక** : రూపా. కాటుక. కళ్ళకు పెట్టుకొనే నల్లగా మున్న మైనం. (కో.7,28; రా.5,8)

**కాటు(కొట్టు)** : పర్యా. గాటు, గుర్తు, మార్కు. సిమెంటు బొమ్మల పనిలో గుర్తుకి పెట్టుకునే గీత. (తె.10,12; రా.3,5)

**కాన్వాస్ బట్ట** : చిత్రాలు వేయడానికి ఉపయోగించే బట్ట. చూ.చిత్రం-29.2. (కో.3)

**కాపు** : అగ్గిసెగ. డప్పుకి తోలు వదులైతే బిగించడానికి వేడి చేయడం. (తె.2)

**కామరాతి** : వొగ్గు కథకులు చెప్పే బీరప్ప కథలో బీరప్ప భార్య. (తె.1)

**కామెడీ వేషం** : నాటకంలో హాస్యనటుడు వేసే వేషం. (కో.7)

**కాయ** : నాగస్వరంలో ఉబ్బెత్తుగా వృత్తాకారంలో నున్నభాగం. చూ.చిత్రం-18.3. (కో.4,5)

**కాయితం** : రూపా. కాయిదం, కాగితం, పేపరు. గరుకు కాగితం. (కో.29; తె.4,6,12; రా.4,7)

**కాయిల విగ్గు**: నాటకంలో రాజు పాత్రకు తల భాగంలో పెట్టే జుట్టు. (కో.7)

**కార్క్** : ఫ్లూట్ వాయించేటప్పుడు ఊదిన గాలి బయటకు రాకుండా చివర అడ్డుగా పెట్టేమూత. (కో.39)

**కార్డ్ బోర్డ్** : చిత్రలేఖనంలో వాడే దళసరి కాగితం. (కో.19) హార్మణీ తయారీలో గాలి తిత్తికి వాడే దళసరి కాగితం. (కో.39; రా.8)

**కార్బన్ పేపర్** : చిత్రలేఖనంలో బొమ్మల్ని అలాగే నకలు (ట్రేస్) తీయడానికి వాడే కాగితం. (కో.3)

**కారు** : సిమెంటు బొమ్మల తయారీలో బొమ్మ పొట్లి పోయినట్లవడం. (కో.38)

**కారెక్టర్** : నాటకంలో పాత్ర. (రా.5)

**కార్లెట్** : చిత్రలేఖనంలో వాడే కాషాయరంగు. (కో.3)

**కార్మైన్** : (Carmine). చిత్రలేఖనంలో టమాటో పండు రంగును పోలిన రంగు. (రా.9)

**కాలం** : పర్యా. లయ. (కో.7)

**కాలవ** : రూపా. కాలువ. వీణ దండికి పొడవునా గుంటగా ఉన్న భాగం. (రా.5)

**కాలినఇటిక** : సిమెంటు బొమ్మల తయారీలో ఇనప కడ్డీకి సిమెంటును అద్ది అంటించే ముక్క. (రా.13)

**కాలిన ముఖం** : ముఖం కాలినట్లు నాటకాల్లో ముఖానికి వేసే మేకప్. (కో.7)

**కాలుపౌండ్** : 1/4 పౌను సుత్తి. వీణ తయారీలో చిన్న చిన్న పనులకు దీన్ని ఉపయోగిస్తారు. (రా. 5)

**కాళ్ళకడెం** : పర్యా. కాళ్లవంకె. రాతిపనిలో విగ్రహం కాలికి చెక్కే ఆభరణం. (తె.6)

**కాళ్ళగజ్జె** : వొగ్గు కథ చెప్పేటప్పుడు శివం ఊగేటప్పటి వేషంలో కాళ్ళకు కట్టుకునే గజ్జె. (తె.1)
తోలుబొమ్మలాడించేటప్పుడు కాళ్ళకు కట్టుకునే గజ్జె. (రా.5)

**కావల్సిన మందం** : రాతి పనిలో శిల్పం కావల్సిన పరిమితిలో లావు చేయడం. (కో.33)

**కావి(రాయి)** : పర్యా. మణిశిలరాయి. ఎర్రగ ఉండే ఒక రాయి. రాతిపనిలో మొదట రాతి మీద బొమ్మ గీయడానికి వాడే ఎర్రరాయి. (కో.19)
గోడకు జేగురు రంగు వేయడానికి ఉపయోగించే రాయి. (కో.29)

**కాశపుల్ల** : మేకప్‌లో ముఖానికి నక్షత్రం, చంద్రుడు మొదలైన గుర్తులు వేయడానికి వాడే పుల్ల. (రా.13)

**కాశీకొబ్బరికాయ** : నాటకంలో కబీరు పాత్రధారి పట్టుకొనే చిప్ప. (కో.29)

**కాశీబోసి** : చీర కట్టులో ఒక రకం. (కో.29)

**కాశ్యప శిల్పం** : శిల్పశాస్త్రం. (కో.31)

**కాషాయరంగు** : పర్యా. గంగచందూరం. మేకప్‌లో వాడే రంగు. (కో.29)

**కాస్ట్లీ** : ఖరీదైన (costly). (కో.19,42; తె.3)

**కాస్త** : కొంచెం. (రా.13)

**కాస్ట్యూం** : మేకప్ దుస్తు. (కో.7)

**కింద** : అడుగు భాగం. శిల్పంలో కింది భాగం. (రా.5)

**కిందబల్ల** : ఫిడేలు అడుగు భాగం. (రా.5)

**కిందికిటస** తబలా గట్టాలను కిందికి కొట్టు. (తె.3)

**కిపాస్** : ఒక సంగీత పరికరం. దీన్ని టెంకాయతో చేస్తారు. చేత్తో పట్టుకొని ఊపితే చప్పుడు వస్తుంది. (రా.8)

**కిరసనాయిలు** : దీపాల్ని వెలిగించడానికి వాడే నూనె. (కో.19,27; రా.10)

చిత్రలేఖనంలో రంగులు వేసిన తరువాత కుంచెల్ని కడగడానికి వాడే చమురు. (కో.2)

**కిరీటధారణ** : నాటకంలో రాజు పాత్రధారి కిరీటం పెట్టుకోవడం. (కో.7)

**కిరీటం** : నాటకంలో రాజు వేషధారి తలపై పెట్టుకొనే ఆభరణ విశేషం. (కో.7,20,23,36,29,31; తె,6,12; రా,2,58)

**కిరీటమకుటం** : పర్యా. మకుట కిరీటం. రాతిపనిలో విష్ణు విగ్రహానికి చెక్కే కిరీటం. (కో.31)

**కిప్తీ** : హార్మనీలో ఒక భాగం. (తె.3)

**కీతబద్ద** : పర్యా. కీతపుల్ల, స్క్రేపర్. సిమెంటు బొమ్మల తయారీలో తుదిమెరుగులు దిద్దడానికి, కళ్లు, చెవులు మొదలైన చిన్నచిన్న భాగాలు చెక్కడానికి వాడే పనిముట్టు. (కో.1,3)

**కీర్తిముకుడిబుర్ర** : పర్యా. వీణబుర్ర. వీణ దండికున్న వంపు. (కో.13)

**కుంకుమ** : ముఖానికి బొట్టుగాపెట్టుకొనే రంగు పొడి. (తె.1)

**కుంకుమపూజ** : రాతిపని చేసేవారు ఉగాది రోజున పని చేయకుండా చేసిన విగ్రహాలకి స్నానం, అనుష్ఠానం చేసి, గాయత్రిపూజ చేసిన తరువాత చేసే కుంకుమతో చేసేపూజ. ఇది వారికి ముఖ్యమైన పండగ. (రా.5)

**కుచ్చు** : కుంచెకి చివరగ ఉండె గుబురుభాగం. (కో.19; రా.11)

**కుచ్చు** : (క్రి) పర్యా. గుచ్చు. చిత్రలేఖనంలో కాగితాన్ని బోర్డుకి సూదితో గుచ్చు. (తె.8)

**కుంచె** : చిత్రలేఖనంలో రంగులు వేయడానికి వాడే సాధనం. పుల్లలాగ ఉండే దీని చివర వెంట్రుకల కుచ్చు ఉంటుంది. చూ.కలం. చూ.చిత్రం-30. (రా.11,13; తె.1,9,11; కో.19,31,32,37)

**కుటుంబనియంత్రణ** : వొగ్గు కథకులు చెప్పే ఒక కథ.(తె.1)

**కుట్టు(కొను)** : ముడివిగ్గు తయారీలో విగ్గుకి ముడిని కుట్టడం. (కో.7)

మృదంగం తయారీలో మూతకి కడియం కుట్టడం. (కో.7)

**కుట్టుకుంట** : రూపా. కుట్టుకంట. మృదంగం, తబల మూతలకి కడియాలు కుట్టడానికి వాడే పనిముట్టు. చూ.చిత్రం.38. (కో.7)

**కుడతలు** : మృదంగం కరిణ చేసేటప్పుడు కరిణలో వచ్చే ముడతలు. (కో.7)

**కుడి** : తబలా, మృదంగం వాయిద్యాలలో కుడివైపున్న భాగం. (కో.7,37; రా.10)

**కుడికమ్ము** : డోలకు కుడిమూత. (కో.5)

**కుడిదిమ్మ** : తబలా తయారీలో వాడే తరిణ దొడ్డికి కుడి వైపున్న చెక్క. (కో.7)

**కుడిపాదం** : ఫిడేలు బ్రిడ్జిపై ఉండే భాగం. (రా.5)

**కుడిమూత** : పర్యా. కుడిముఖం. మృదంగం, డోలకులకు కుడివైపున్న భాగం. (కో.5,7)

**కుడిముఖం** : పర్యా. కుడిమూత. మృదంగం, డోలకులకు కుడివైపున్న భాగం. (రా.5)

**కుండ** : పర్యా. కడవ. తబలలోని కొయ్య భాగం. డగ్గలోని లోహభాగం. చూ.చిత్రం.1-13; తంబుర ఎడమ

వైపు గుండ్రంగా ఉన్న భాగం. చూ.చిత్రం-2.1; 23.1. (కో.6,13,24,37; తె.2,3; రా.5,13)

**కుండనలికం** : వీణతయారీలో కుండ కింద దండిని కలిపే చోటు. (కో.6)

**కుండమపరిచేయు** : తబలా తయారీలో కుండను చేయు. (తె.3)

**కుండలం** : నాటకాల్లో చెవులకి పెట్టుకొనే ఆభరణం. (కో.7,27,33; తె.6)

**కుండలి** : ధ్వని అధికంగా రావడానికి వీణలో పెట్టెలాగ ఉండే భాగం. దక్షిణదేశంలో తయారయ్యే వీణలో ఈ భాగం ఉంటుంది. చూ.కడవ. (కో.7)

**కుదర** : మాదిగ డప్పు (నగారా) తయారీలో చెక్కతో చేయబడిన చట్రం. (రా.10)

**కుంతలం** : రాతి పనిలో విగ్రహానికి చెక్కే వెంట్రుకలు. (రా.5)

**కుంది** : వీణకుండకు ఎదురుగా, ఎడమ కాలి మీద పెట్టుకోవడానికి వీలుగా అమర్చిన సొరకాయ పై భాగం కుంది. చూ.చిత్రం-1.2. (కో.24)

**కుందు ఉలి** : సంగీత పరికరాల తయారీలో వాడే పనిముట్టు చూ.చిత్రం-49. (కో.24)

**కుప్పిలి** : కుంచెకు చివర వెంట్రుకలు మార్చడానికి ఉపయోగించే గొట్టం. (తె.1)

**కుంపాస** : రూపా. కంపాస్. వీణ తయారీలో ముందు గీతలు గీసుకోవడానికి వాడే సాధనం. (కో.6)

**కురప** : పొట్టిగ ఉండటం. (కో.7,28)

**కురుంతసాన** : రాతి పనిలో విగ్రహానికి పెట్టే ఒకరకమైన సాన. (తె.6)

**కురుమ** : పర్యా. కావూసు. ఒక కులం. ఈ కులం వాళ్ళు వొగ్గు కథలు చెబుతారు. (తె.7)

**కురుమ దేవుని కథ**: గొల్లలు అడుక్కునేటప్పుడు చెప్పే కథ. (తె.7)

**కురుమోళ్ళు** : కురుమ కులం వాళ్ళు. చూ.కురుమ. (తె.1)

**కురువిందం** : రాతి పనిలో విగ్రహం సాపుగా రావడానికి వాడే రాయి. చూ.ఆకురాయి. (కో.19,28; రా.1)

**కురుసబొమ్మ** : రాతి పనిలో చేసే చిన్న విగ్రహం. (తె.6)

**కులదైవం** : రాతిపనిలో చెక్కిన ఒక కులానికి సంబంధించిన (దేవుడు) దైవ విగ్రహం. (కో.19)

**కూటుమీటు** : రంజనానికై వీణమీది నాలుగు తంతుల్ని చూపుడు, నడిమి, ఉంగరం వేళ్లతో ఒకేసారి మీటడం. (కో.7)

**కూనేపులి వాండ్లు** : పద్మశాలి వారిలో అడుక్కొని తింటూ వీరు మార్కండేయ పురాణం కథ చెబుతారు. (తె.9)

**కూపాస్** : చిత్ర లేఖనంలో ఇంకుతో వృత్తాలు గీయడానికి వాడే పనిముట్టు. (కో.19)

**కూర్చు** : డోలకు తయారీలో మూతను బిగించేటప్పుడు తాడుకు అరంగుళం ఇనుప రింగులు దోపు. (కో.5)

**కూర్చోపెట్టు** : రాతి పనిలో విగ్రహాన్ని సింహాసనంలో కూర్చో బెట్టు/నిలుపు. (తె.6)

**కూసం** : రాతి పనిలో పానవట్టంలో బిగించే శివలింగం అడుగు భాగం. (తె.6)

**కృష్ణశిల** : పర్యా. నల్లరాయి. రాతి పనిలో విగ్రహానికి వాడే నలుపురాయి. (రా.1)

**కెమేరా** : బొమ్మలను తీసే యంత్రం. (కో.12)

**కేదార** : యజ్ఞస్తంభానికి ఉపయోగించే కర్ర. (కో.7)

**కేన్వాస్** : చిత్ర లేఖనంలో ఆయిల్ పేయింటింగ్ చేయడానికి తీసుకొనే 'కార్డ్‌బోర్డ్'. (కో.2)

**కేమిల్ ఆయిల్ కలర్సు** : 'కేమిల్' అనే కంపెనీ తయారు చేసే తైలవర్ణాలు. (కో.2)

**కేయూరం** : రాతి పనిలో విగ్రహానికి చెక్కే దండ. (కో.31)

**కేల్‌కో** : హార్మణి తయారీలో వాడే గుడ్డ. (కో.39)

**కేశబంధం** : రాతి పనిలో బ్రహ్మ విగ్రహానికి చెక్కే కిరీటం. (కో.31)

**కేశం** : పర్యా. కుంతలం. (కో.19)

**కేశాంతరం** : శిలావిగ్రహం తలభాగం. (తె.6)

**కొక్కుచర్మం** : పందికొక్కు తోలు. చిత్ర లేఖనంలో బొమ్మలు వేయడానికి వాడుతారు. దీని చర్మం మీద కూడా బొమ్మలు గీస్తారు. (రా.11)

**కొంకి** : రూపా. కొంకె, కొక్కి. తబల, డోలకు వారు వదులుగా ఉంటే బిగించడానికి వాడే పనిముట్టు. (రా.5)

**కొంగఈక** : ఒక పక్షి ఈక. మేకప్‌లో కిరీటానికి పెట్టే తురాయికి వాడే తెల్లటి ఈక. (కో.7,29)

**కొంగమూతి పట్కారు** : హార్మణి తయారీలో చెక్కమీద గుండ్రంగా గీయడానికి వాడే సాధనం. (కో.28)

**కొట్టం** : పర్యా. పర్ణశాల. నాటకంలో కనబర్చే పర్ణశాల. (రా.13)

**కొట్టు**: గీతలు గీయు, చెక్కు, గరుకు కాయితంతో నైసు చేయు, మట్టిని దంచు, నీరు చల్లు. (కో.3,4,5,6,7,19,31,34,37,42; రా.3)

**కొట్టుకొచ్చు కొమ** : రాతి పని చేసే వారు రాళ్ళను కొట్టుకొని తెచ్చుకోవడం. (తె.6)

**కొడుపు** : మాదిగ డప్పు (నగారా) వాయించడానికి ఉపయోగించే లావుపుల్ల. (రా.10)

**కొప్పు** : రాతి పనిలో శివ విగ్రహానికి చెక్కేజుట్టుముడి. (తె.6)

**కొబ్బరి చిప్ప** : బరిణె ఆకారంలో ఉన్న ఎండిన కొబ్బరి టెంక. దీంట్లో రంగులు కలుపుతారు. కరిణపిండి చేయడానికి దీన్ని ఉపయోగిస్తారు. (కో.7; తె.4)

**కొబ్బరి నూనె** : పర్యా. టెంకాయ నూనె. కొబ్బరికాయ నుంచి తీసిననూనె. కాటుక తయారీలో దీనిని వాడుతారు. (కో.7; రా.5,8)

**కొబ్బరిపీచు** : కొబ్బరికాయనార. రాతిపనిలో విగ్రహం శుభ్రం చేయడానికి దీనిని వాడుతారు. (కో.19,18,35; రా.1)

**కొమ్ముకుచ్చు** : రాతిపనిలో నంది విగ్రహం కొమ్ముకి వేసే కుచ్చు. (తె.6)

**కొయ్య** : సంగీత పరికరాలు తయారుచేసే పనిముట్టు పెద్దకరవాయిలో ఒక భాగం. చూ.చిత్రం-66.1. (కో.31)

**కొయ్యకామ** : కంచు సుత్తి, కట్ల సుత్తెలలో చేతితో పట్టుకొన వీలుగా ఉండే భాగం. చూ.చిత్రం-60.1;61.1. (తె.10,12)

**కొయ్య చట్రం** : కంజీరలో ఇత్తడి తాళాలు బిగించి ఉన్న భాగం. చూ.చిత్రం-9.1. (కో.3,7; తె.1,3; రా.8)

**కొయ్యపిడి** : వీణ తయారీలో చిల్లులు వేయటానికి వాడే చరమాను పట్టుకొనే ఒక రకం పిడి. (రా.5)

**కొయ్య బిళ్ళ** : సంగీత పరికరమైన వీణలో శ్రుతిపూసల కిందుగా ఉన్న భాగం. చూ.చిత్రం-1.10. (కో.6,7,13,24 ; రా.8)

**కొయ్యసుత్తి** : చెక్కతో చేసిన సుత్తి. చూ.చిత్రం-60-2. (కో.33)

**కొరడా** : వొగ్గు కథ చెప్పేవారు వేషం వేసుకొన్నప్పుడు చేతిలో పట్టుకొనే ఈరగోల. (తె.1)

**కొరడు** : పర్యా. సారకొరడు. రాతిపనిలో వాడే ఉలి తయారీలో కాల్చిన ఇనుప ఊసను పట్టుకునే పనిముట్టు. (రా.5)

**కొల(తీయు/పెట్టు)** : మృదంగం తయారీలో కొలత తీయు. (కో.7)

**కొలిపి** : రూపా. కొప్పిలి. కుంచెలో ఒక భాగం. చూ.చిత్రం-30.2. (రా.13)

**కొలుచు** : రాతిపనిలో శిల కొలతలు చూచు. (తె.6)

**కొవ్వు** : ఒక రకం మైనం. వీణ తయారీలో వీణ మెట్లు అతకడానికి వాడే మైనం. (తె.12; రా.5)

**కొస** : పర్యా. తల. చివరి భాగం. (కో.7; తె.6; రా.3,5)

**కొసకారు** : మృదంగం తయారీలో వారు బిగించడానికి వాడే

పనిముట్టు. చూ. కట్టింగ్ ప్లేర్. (కో.7)

**కోటింగ్ బ్రష్** : బొమ్మలకు రంగులు వేయడానికి వాడే కుంచె. (కో.27)

**కోటు** : నాటకంలో కొన్ని పాత్రలకు వేసే పొడుగు చేతుల చొక్కా. (కో.7,29)

**కోబాల్ట్ బ్లూ** : పర్యా. వస్పానంద. చిత్రలేఖనంలో వాడే లేత నీలి రంగు. (కో.3; రా.9)

**కోమ** : హార్మోణియంలో ఒక భాగం. (తె.3)

**కోరు** : పర్యా. తొలుచు, దొలుచు, లోడు. వీణ తయారీలో కుండని కాళీగ (గుల్లగ) చేయడం. (రా.5)

**కోల్డుక్రీం** : మేకప్‌లో రంగుల తయారీలోకి వాడే మైనం. (కో.7)

**క్యాన్‌వాస్ బట్ట** : చిత్రలేఖనంలో బొమ్మలు వేయడానికి వాడే బట్ట. (తె.1)

**క్రాప్** : నగారాకు వారు వంకరగా బిగించడం. (తె.2)

**క్లారివెట్** : సన్నాయిని పోలిన సంగీత వాయిద్యం. (కో.3)

**క్లిప్పు** : మేకప్ చేసేటప్పుడు వెంట్రుకలు ముఖం మీద పడకుండ జుట్టుకి తగిలించే పిన్ను. (రా.5)

**క్రేపేరు** : (Creep hair). రూపా. క్రేపైర్. నాటకంలో గడ్డం, మీసం, విగ్గుల తయారీకి వాడే వెంట్రుకలు. (కో.7; రా.5,8)

**క్రీము** : మేకప్‌లో రంగుల తయారీలో వాడే మీగడ లాంటి పదార్థం.. (కో.7)

**క్షీణచంద్రుడు** : (అమావాస్య రావటంతో) వీణలు తయారు చెయ్యని కాలం. (రా.5)

## ఖ

**ఖంజర్** : ఒక రకం సంగీత వాయిద్యం. (తె.2)

**ఖడక్(చేయు)** : బిగువు చేయు. (తె.2,3,7,9)

**ఖడ్గం** : ఒగ్గు కథ చెప్పేవారు గంగవీట కోసేటప్పుడు చదివే దండకం. (తె.1)

**ఖల్‌కష్** : సంగీత పరికరం. (తె.3)

**ఖతం** : రాతిపనిలో విగ్రహం పని పూర్తవడం. (తె.6)

**ఖాదీబట్ట** : ఖద్దరు బట్ట. చిత్రలేఖనంలో బొమ్మలు వేయడానికి వాడే బట్ట. (కో.29, తె.2)

## గ

**గంగ** : ఒగ్గు కథ చెప్పేవారు కథ ప్రారంభంలో ప్రార్థనచేసే ఒక దేవత. (తె.1)

రాతిపనిలో శివుని విగ్రహం చెక్కేటప్పుడు శివుని తలమీద చెక్కే భాగం. (తె.6)

**గంగసింధూరం** : రూపా. గంగ చందూరం. పర్యా. కాషాయ రంగు. మేకప్‌లో ఆంజనేయస్వామి వేషధారికి పూసే రంగు. (కో.29)

**గంగ జాతర** : గ్రామాల్లో జరిగే ఒక జాతర. (రా.27)

**గంగతెప్ప** : ఒగ్గు కథ చెప్పేవారు మల్లన్న పండగ రోజున సొప్పబెండ్లు కట్టుకొని దేవుని తీసుకొని నదిదగ్గరికి వెళ్లి తెప్పమీద జ్యోతి వెలిగిస్తారు. (తె.1)

**గచ్చకాయ** : ఒక చెట్టుకాయ. మృదంగానికి కరిణి పిండిరాసి పైన గచ్చకాయతో తోముతారు. (కో.4)

**గజర** : తబలా మూత చివర ఉండే అల్లిక. (తె.2,3)

**గజం** : పొడవును సూచించే కొలత. మూడు అడుగులు.(కో.4; తె.6,13; రా.10)

**గజ్జె** : పర్యా. మువ్వ. హరి కథ, బుర్ర కథ చెప్పేవారు కాళ్లకు కట్టుకునే మువ్వ. దీన్ని కంచుతో చేస్తారు. (కో. 3,7,15,37; తె.1,8,16; రా.2,10)

**గజ్జెల్లాగు** : ఒగ్గుకథలో సివం ఊగేప్పుడు వేసుకునే గజ్జలున్న నిక్కరు. (తె.1)

**గంజి** : అన్నంవార్చగా వచ్చిన నీరు. చిత్రలేఖనంలో గుడ్డ కాగితంలాగ దళసరిగా ఉండటానికి బట్టను గంజిలో

ముంచి ఆరవేస్తారు. పిదప ఈ గుడ్డమీద బొమ్మ చిత్రిస్తారు. (తె.9)

**గట్ట(ఎక్కించు)** : దిమ్మె, చిట్టె, దిమ్మ. ఏక్వాడ్ (మరాఠీ భజన వాయిద్యం) శ్రుతి అమర్చుకోవడానికి వాదిలో పెట్టె కొయ్యముక్క. కొయ్యముక్కలు పెట్టడం. (తె.33)

**గట్టం కొట్టు** : డోలకు శ్రుతి చేయడానికి సుత్తితో గట్టని కొట్టు. (రా.5)

**గట్టి** : తబలపూడిలో ఒక భాగం. చూ.చిత్రం-6.6. (తె.3)

**గట్టితార్** : తబల అడుగు చుట్టలో ఉండే గట్టి తీగ. (తె.3)

**గడిచీర** : మేకప్‌లో స్త్రీ పాత్రకు కట్టే గళ్లగళ్ల చీర. (కో.29)

**గడ్డంమీద పచ్చబొట్టు** : నాటకాలలో పెట్టే ఒక రకం బొట్టు. చూ.చిత్రం-27.7. (కో.29)

**గడ్డిరంగు** : చిత్రలేఖనంలో పసుపు నీలి రంగులు కలిపితే వచ్చేరంగు. (కో.29)

**గడ్డుఉలి** : సంగీత పరికరాల తయారీలో వాడే పనిముట్టు. చూ.చిత్రం-48. (కో.5)

**గణపతి పూజ** : రాతిపనిలో శిల్పం చెక్కడానికి ముందు చేసే విఘ్నేశ్వరుని పూజ. (రా.5)

**గణపు** : రూపా. గెణిపు. నాగస్వరానికి వాడే కర్రకి ఉండే కణుపు. (కో.6)

**గంట** : పర్యా. కుంది. వీణకుండకు ఎదురుగా ఎడమకాలి మీద పెట్టుకోడానికి వీలుగా అమర్చిన సొరకాయ. దీనిపై భాగం గంట లేదా కుండి. చూ.చిత్రం-1-2. (కో.4)

నాగస్వరంలో పీక కిందుగా ఉండే భాగం. చూ.చిత్రం-18.2; రాతిపనిలో నంది విగ్రహం మెడ కింద చెక్కిన మువ్వ. (తె.6)

**గంటమార్కు** : చిత్రలేఖనంలో రంగులు తయారుచేసే ఒక కంపెనీ పేరు. (కో.3)

**గంటశబ్దం** : రాతిపనిలో శిలని పరిశీలించేటప్పుడు వచ్చే శబ్దం. ఈ గంట శబ్దంగాని, 'ఓం' శబ్దంగాని వచ్చిన శిల విగ్రహానికి పనికి వస్తుంది. (కో.19)

**గద** : నాటకంలో పౌరాణిక పాత్రలు యుద్ధ సమయంలో చేతిలో పట్టుకొనే ఒకరకం ఆయుధం. (కో.7,29; రా.8)

**గదకట్టు కర్ర** : గదని పట్టుకొనే పిడి భాగం. (కో.29)

**గద్దరంగు** : చిత్రలేఖనంలో నలుపు, ఎరుపు, పసుపు, పచ్చ, మెరూన్ రంగుల కలయికతో తయారయ్యే రంగు. (తె.1)

**గద్దె** : తబలా కుండ అడుగు భాగం. (తె.27)

**గంధం** : పర్యా. చందనం. మేకప్‌లో రాజు మొదలైన పాత్రలకి పెట్టే బొట్టు. (రా.5)

**గనిరాయి** : తబల, మృదంగం, కరిణ పిండి తయారీలో వాడే ఒకరాయి. (కో.7)

**గన్** : రూపా. గన్ను. రాతిపనిలో శిలను పగల గొట్టడానికి, ఉలి తయారీలో ఇనుప కంబీని ముక్కలు చేయడానికి వాడే పనిముట్టు. (రా.5)

**గం** : పర్యా. జిగురు, గోందు, బంక. (కో.7,34 ; తె.13; రా.5)

**గమకం** : వీణను లాగి వాయించడం. (రా.5)

**గమ్మున** : త్వరగా. (కో.15)

**గాయత్రిపూజ** : రాతిపనిలో శిల్పం చెక్కడం ప్రారంభించే టప్పుడు చేసే పూజ. (తె.6)

**గర్భగుడి** : పర్యా. గర్భగృహం. దేవాలయంలో మూల విగ్రహాన్ని ఉంచే ప్రదేశం. (కో.33; తె.6,12; రా.1)

**గర్భపచ్చి** : పర్యా. గర్భనెంబు. వీణ తయారీలో వాడే దుంగ లోపలి భాగంలో ఉండే తడి. (కో.13)

**గరుకుకాయితం** : పర్యా. మెరుక్కాయితం, ఉప్పుకాయితం, సాండ్ పేపర్, సైన్ కాయితం. (కో.9,16,27)

**గలీజు** : మేకప్‌లో వాడే అభ్రకం పొడిచేసి నీటిలో వేసి కడిగినప్పుడు వచ్చే దుమ్ము. చూ.దుమ్ము. (రా.8)

**గలుగాకు** : సన్నాయి పీకల తయారీకి వాడే ఒక ఆకు. (కో.36)

**గళం** : రాతి పనిలో విగ్రహం కంఠభాగం. (రా.5)

**గవ్వలదరిశన** : వొగ్గు కథ చెప్పేవారు దేవునిపెయి మీదకు తెప్పించినప్పటి వేషంలో మెడలో వేసుకొనే ఒక రకం దండ. (తె.1)

**గవ్వసంచి** : గవ్వలతో చేసిన సంచి. చూ.చిత్రం-20. (రా.3)

**గాజుప్పు** : జింకతోలుని శుభ్రం చేయడానికి వాడే పదార్థం. (రా.11)

**గాజురాళ్ళు** : నాటకాల్లో వేసే కోటుకి పెట్టిన చమ్కీరాళ్లు. (కో.29)

**గాజురూపం** : చిత్రలేఖనంలో గుండ్రంగా గీయడం. (తె.1)

**గాడి** : హార్మోనియంలో ఒక భాగం. చూ.చిత్రం-4.5. (కో.6)

**గాడికల** : వీణతయారీలో వాడే కొలిమిలో భాగం. (కో.6)

**గాండిపహస్తం** : రాతిపనిలో విగ్రహానికి కేశాలతో సమానంగా చేతులు పెట్టినట్లు చెక్కడం. (క్షే సమాప్రోక్తం) (కో.19)

**గాత్రం** : నోటితో పాడడం. (కో. 39)

**గాంధీ టోపి** : మేకప్‌లో పెట్టే ఖద్దరు టోపీ. (కో.29)

**గాయకుడు** : గాత్రంతో పాడే వాడు. (కో.7)

**గాయత్రి** : రూపా. గావిత్రి. శిలా విగ్రహాలకి చెక్కే జంధ్యం. (కో.19; రా.2)

**గాలరీ** : నాటకంలో వేసే స్టేజికి పైభాగంలో తెల్లగుడ్డ కట్టిన భాగం. (రా.13)

**గాలి(తగలడం)** : హార్మోణియంలో తిత్తిని నొక్కినపుడు వచ్చిన గాలి. (కో.39)

**గాలితిత్తి** : పర్యా. బెల్లూస్, ఫ్యాను. హార్మోణియంలో శబ్దం రావడానికి గాలినిచ్చే తిత్తి. చూ.చిత్రం-4.3. (కో.7,39; రా.8)

**గాలిపోత** : నాగస్వరం నోటిలో పెట్టుకొని ఊదడం. (కో.7)

**గాలిబుడగ** : చిత్రలేఖనంలో కాగితాన్ని నీటితో తడిపినప్పుడు వచ్చే బుడగ. (కో.19)

**గాలిబెజ్జాలు** : హార్మోణియంలో గాలి పోవటానికి ఉన్న బెజ్జాలు. చూ.చిత్రం-4.10. (కో.7)

**గాలివాయిద్యం** : గాలిపోత వల్ల పలికే వాయిద్యం. నాగస్వరం, సన్నాయి మొదలైనవి. (కో.7; రా.5)

**గాలిస్టాక్** : హార్మోణియంలో గాలిని నిలవ ఉంచడం. (కో.28)

**గింజ** : మృదంగం కరిణిని రుద్దడానికి వాడే గచ్చకాయ. (కో.37)

**గిన్నె** : సన్నాయి, శ్రుతి వాయిద్యాల చివరగ ఉన్న గుండ్రటి భాగం. చూ.చిత్రం-17.2; 16.5. (కో.36)

**గిరజాలు** : మేకప్‌లో వేసుకొనే విగ్గుకి వెనకాల జుట్టు రింగులు రింగులు చుట్టి ఉండటం. (కో.29; రా.5)

**గిరాకీ** : అమ్మకం ఎక్కువగా ఉండడం. (కో.13,14; తె.1)

**గిరి** : రాతిపనివారు శిలను తెచ్చుకొనే కొండప్రాంతం. (కో.19)

**గిరిజనబొట్టు** : నాటకాలలో పెట్టే ఒక రకం బొట్టు. చూ.చిత్రం-27.6. (కో.14)

**గిరిమీదగిరి** : రక్త శిల దొరికే ప్రదేశం. (కో.19)

**గీకు** : మేకప్‌లో ముఖానికి పూసిన రంగును గోకు. (రా.5)

**గీతం** : పాట. (తె.1)

**గీతలు** : వీణ, తంబురలలో ఉండే గీరలు. చూ.చిత్రం-1.14; 2.7. (కో.5)

**గీయు** : చిత్రలేఖనంలో బొమ్మల్ని వేయు. (కో.6,19,41)

**గుంగురు** : శిలా నందిమెడలోని పెద్దగజ్జె. మెడమువ్వ. (తె.6)

**గుంచి** : వొగ్గుకథలో వాడే ఒక పరికరం. చూ.చిత్రం-15. (తె.1)

**గుచ్చు** : చిత్రలేఖనంలో కాగితాన్ని బోర్డుకి సూదితో తగిలించు. (కో.19; రా.10)

**గుజారణ(అయిపోవు)** : రాతిపనిలో చెక్కనం పని పూర్తికావడం. (తె.6)

**గుజ్జు** : రూపా. గుజురు. వీణ తయారీలో వాడే సొరకాయ లోపల ఉండే మెత్తటి పదార్థం. (రా.5)

**గుంజు(కొట్టు)** : తబలా తయారీలో వాడే తోలుని సాగదీయు. (తె.3)

**గుటుక** : కంజీర తయారీలో చింతగింజల గుజ్జును ఉడక బెట్టడానికి వాడే చిన్నకుండ. (కో.7)

**గుడ్డ** : పర్యా. బట్ట, వస్త్రం. చూ. క్లాతు. (కో.3,4,6,7,41; తె,3,9)

**గుడ్డముక్క** : రాతిపనిలో విగ్రహానికి కరక్కాయ ? ా పూయడానికి వాడేబట్ట. (కో.28)

**గుడ్డసావ** : మెటల్ బఫ్ చేసేసాన. వీణతయారీలో వీణకుండే సొరకాయ పైభాగం - గంటకు మెరుగు పెట్టే సాధనం. (కో.13)

**గుడ్లుగుడ్లు** : మేకప్‌లో వాడే కాటుక తయారీలో దీపంపొగని అద్దంమీదకు పట్టే పద్ధతి. (కో.7)

**గుండు** : రాతిపనిలో చెక్కడానికి ముందు గుండ్రంగా ఉన్న రాయి. (తె.6; రా.5)

**గుండు ఆకురాయి** : రాతిపనిలో విగ్రహం గుండ్రని భాగాలు నునుపు చేయడానికి వాడే రౌండు ఆకురాయి. చూ.చిత్రం-53. (తె.6)

**గుండుదాగలి** : సంగీత వాయిద్యాల తయారీలో గుండ్రంగా చేసిన ఎదురు బద్ద. (కో.5)

**గుండుపూజ** : రాతిపనిలో విగ్రహం కిరీటానికి చెక్కే గుండుసున్నా డిజైన్. (తె.6)

**గుంత** : పర్యా. గుంట. రాతిపనిలో కళ్లు మొదలైనవి చేసేటప్పుడు చెక్కిన గుంట. (కో.31)

**గువ్వగచ్చు** : ముసాంబరం, అవిశనూనె, గుగ్గిలం మూటినీ ఉడికించగా తయారైన పదార్థం. దీనిని చిత్రలేఖనంలో బంగారు రంగుకి వాడుతారు. (తె.1)

**గుబురు** : మేకప్‌లో కిరీటానికి దట్టంగా కట్టిన ఈకలు. (రా.8)

**గుమ్మటేకు** : పర్యా. గుమ్మడి కఱ్ఱ. సంగీత పరికరాలకి వాడే కొయ్య. (కో.7,16; తె.3)

**గుమ్మడిమీసం** : మేకప్‌లో పుట్టే ఒక రకం మీసం. చూ.చిత్రం-26.7. (కో.7)

**గుంపెన** : తబలా కుండకు వాడే కొయ్య. (తె.2)

**గుర్రం** : పర్యా. బ్రిడ్జి. ఫిడేలుకి ఉండే బ్రిడ్జి. చూ.చిత్రం-3.4. (రా.5)

**గుర్రపుజూలు** : చిత్రలేఖనంలో కుంచెల తయారీకి వాడే గుర్రపు వెంట్రుకలు. (కో.17)

**గుర్రపువెంట్రుక** : ఫిడొలు కమాను చేయడానికి వాడే గుర్రపు వెంట్రుక. (కో.19)

**గురిగింజ** : పర్యా. గురివింద గింజ. మృదంగం కరిణ తయారీలో చిటిమిరాళ్ల పొడికి ఈ గింజలు రుబ్బి రెంటినీ మిశ్రమం చేస్తారు. (రా.10)

**గురుకులం** : పూర్వం విద్య నేర్పే స్థలం. (రా.8)

**గురువు** : కురుమ కులంవారికి వొగ్గు కథకులు గురువులు. (తె.1)

**గుర్తు** : చిత్రలేఖనంలో ముందు ఆనవాలు గీసుకోవడం. (కో.6; తె.2; రా.5,13)

**గుల్ల** : పర్యా. డొల్ల. మృదంగం, డోలకు తయారీలో మొదట చేసుకొనే కొయ్య చట్రం. (కో.5,7)

**గుల్లకొట్టు** : వీణతయారీలో కుండలోపల డొల్ల చేయు. (కో.13)

**గుల్లబలం** : మృదంగం చట్రం గట్టిగా ఉండడం. (కో.7)

**గుల్లముక్క** : మృదంగం చట్రం. (కో.7)

**గులాబి** : పర్యా. రోజా, చిలక గులాబి. ఒక రంగు. (కో.26,32; తె.1,4)

**గువ్వ :** పర్యా. కచ్చి. పూర్వం తెల్లరంగు తయారీకి వాడే నత్తగుల్ల. (తె.1,4)

**గువ్వలపొడి :** నత్తగుల్లల పొడి. (తె.4)

**గెణిపు :** రూపా. గణుపు, కణుపు. ఫ్లూటు తయారీలో వాడే వెదురు గడకు అక్కడక్కడ ఉన్న ముడులు. (కో.39)

**గేదె చరమం :** మృదంగం, డోలకు మూతల తయారీకి వాడే గేదె తోలు. ఈ తోలుతో అడ్డవారు కూడా చేస్తారు. (కో.12)

**గేరుమీసం :** మేకప్‌లో రాజుకు పెట్టే మీసం. (రా.5)

**గొంగడి :** గొర్రెబొచ్చుతో నేసిన వస్త్రం. ఒగ్గు కథ చెప్పేవారు గొంగడిలో బియ్యం, కొబ్బరికాయ, పువ్వులు, జోతులు వేసి అందులో శూలంపెడ్తారు. దీన్నే సివసానం అంటారు. (తె.1)

**గొంగళిపీచు :** మేకప్‌లో మీసాలకి వాడే చిరిగిన గొంగళి భాగం. (రా.5)

**గొట్టం :** సన్నాయి, శ్రుతి మొదలైన వాయిద్యాల్లో సన్నగా పొడవుగా ఉన్న బోలు భాగం. (కో.36)

**గొడ్డు చర్మం :** మృదంగం వారు తయారీకి వాడే గేదె తోలు. (తె.2)

**గొర్రెబొచ్చు :** పర్యా. గొర్రె వెంట్రుకలు. మేకప్‌లో మీసాలు, గడ్డాలు తయారీకి వాడే గొర్రె వెంట్రుకలు. (కో.7)

**గొర్రెనరం :** ఫిడేలు తయారీలో తంతులకు వాడే గొర్రె నరం. (కో.5)

**గొల :** ? మృదంగం. (కో.7)

**గొల్లేసం :** ఒగ్గు కథ చెప్పేవారు వేసే గొల్లవేషం. (తె.1)

**గోట :** పర్యా. నున్నటి రాయి, రాయి. తబలా తయారీలో శాయిపెట్టే నున్నటి రాయి. (తె.2,3)

**గోటు :** ఒక సంగీత వాయిద్యం. (కో.7)

**గోటుమీటు :** వీణమీద విడివిడిగా పడే మీటు. (కో.7)

**గోటువాయిద్యం :** ఒక సంగీత వాయిద్యం. చూ. గోటు. (రా.5)

**గోడ :** ఇటుకలతో ఎత్తుగా కట్టిన భాగం. డ్రామా పరదాల తయారీలో బట్టను గోడకు బిగువుగ సీలల్తో కొడతారు. (తె.2). వీణ దండికి ఉండే పక్క అంచు. (రా.5) చిత్రలేఖనంలో బొమ్మలు వేయడానికి అనువుగా ఉన్న గోడ. (రా.11)

**గోడబాజు :** మృదంగం కన్నుల దగ్గరి భాగం. (కో.7)

**గోందు :** జిగురు. (తె.1,2,9)

**గోధుమరంగు :** (brown colour) బెల్లం రంగు. బొమ్మలకు వేసే రంగు. (కో.25,30)

**గోరుఉలి :** రూపా. గోరులి. పర్యా. చిన్న ఉలి. సన్నాయి కొయ్యని తరిమెనపట్టడానికి వాడే పనిముట్టు. (కో.36)

తబల, మృదంగం, డోలకు, వీణ తయారీలో కుండను డొల్లగ చేయడానికి వాడే పనిముట్టు.

చూ.చిత్రం-47;50. (కో.5,7,24,28)

**గోరుమోటాఉలి :** వీణ తయారీలో కుండను డొల్లగ చేయడానికి వాడే పరికరం. (కో.6)

**గోర్టుపైపు :** ఒక రకం (వాయులీనం). సంగీత వాయిద్యం. (కో.7)

**గోరోచన :** రాతిపనిలో శిల్పంపైన పూసే తైలమిశ్రమం. ఇది పూయడం వలన ఆకారం బాగా నదరుగ కనబడుతుంది. (రా.8)

**గోల్డ్‌కలర్ :** పర్యా. బంగారం రంగు, మాంబళం. బొమ్మలకు వేసే బంగారు రంగు. (కో.34,41; తె.1)

**గోల్‌ఆకురాయి :** తబలా, డోలక్, ఏక్వాడ్ మొదలైన సంగీత వాయిద్యాల తయారీలో గుండ్రని భాగాలను సాపు చేయడానికి వాడే పనిముట్టు. (తె.3)

**గోళీచేయు :** వీణ తయారీలో కొయ్యను కోసేటప్పుడు దిమ్మను పక్కకు తిప్పు. (కో.6)

గౌను : బుర్రకథ చెప్పేవారు మోకాళ్ళ దిగే వరకు వేసుకొనే వస్త్రం. (తె.1)

గ్రాఫ్ (పేపరు) : బొమ్మలు గీయడానికి వాడే కాగితం. (తె.4,11)

గ్రాఫైట్ : చిత్రలేఖనంలో వాడే పొడిగా ఉండే తెలుపురంగు. (కో.3)

గ్రాప్పింగ్ పవర్ : చిత్రలేఖనంలో వాడే సిల్కుగుడ్డకు గల రంగుపీల్చుకొనే ఆకర్షణ శక్తి. (తె.1)

గ్రీజు : మేకప్‌లో ముఖానికి పూసుకునే ఒకరకం క్రీము. (రా.5,11; కో.3,7)

గ్రీన్‌పెయింట్ : చిత్రలేఖనంలో వేసే పచ్చరంగు. (కమర్షియల్ ఆర్ట్‌లో (house decoration) గదికి ఈ పెయింట్‌ని ప్లాస్టర్ ఆఫ్ పారిస్‌తో కలిపి వేస్తారు.) (కో.3)

గ్రేకలర్ : మేకప్‌లో ముసలిపాత్ర వేషధారుల మీసాలకు పూసే రంగు. (కో.7)

గ్రేవర్ : రాతిపనిలో శిల్పం కళ్ళు, ముక్కు, చెవులు మొదలైనవి చెక్కడానికి వాడే పరికరం. (కో.3)

గ్రేవిగ్గు : మేకప్‌లో ముసలి వేషానికి తలకు పెట్టే కృత్రిమ వెంట్రుకలు. (కో.7)

గ్రైండింగ్‌స్టోన్ : రాతిపనిలో శిల్పం నునుపు చేయడానికి వాడే సాధనం. (రా.8)

గ్రౌండ్‌ప్రిపేర్ : చిత్రలేఖనంలో బొమ్మ వేయడానికి వాడే బట్టను సరిగ తయారు చేసుకోవడం. పోర్‌ట్రైట్ పెయింటింగ్ పద్ధతిలో తెల్లబట్టని స్ట్రిక్చర్ ఫ్రేంకి బిగించి బట్ట బాగా తెల్లగ బిరుసుగా రావడానికి ప్లేవైట్ పౌడర్, లిన్సీడ్ ఆయిల్ కలిపి మరిగించిన మిశ్రమాన్ని కొద్దిగ వేడిగా ఉన్నపుడు బ్రష్‌తో బట్టకు పూసి ఎండబెట్టాలి. దీనినే గ్రౌండ్‌ప్రిపేర్ అంటారు. (కో.3)

గ్లిజరిన్ : మేకప్‌లో రంగుల్లో కలపడానికి వాడే ద్రవం. (కో.7)

గ్లూ : పర్యా. జిగురు. పాలిష్‌లో లక్క, రూమమస్తకి వేస్తే కరగగా వచ్చినదే జిగురు. హార్మోణియం తయారీలో మెట్లపై సెలవైట్ ఈ జిగురుతోనే అంటిస్తారు. (రా.8)

## ఘ

ఘంట(వాదం) : రాతిపనిలో శిలను పరీక్ష చేసేటప్పుడు పురుష శిలయందు వచ్చే శబ్దం. (రా.8)

ఘువాదులు : పర్యా. శివసత్తులు. సివం ఊగేవాళ్ళు. (తె.1)

## చ

చక్కీలు : కంజీరాలో ధ్వని రావడానికి పెట్టిన భాగాలు. (కో.7)

చక్రపిడి : వీణ తయారీలో చిల్లులు వేయడానికి వాడే చరమంలో ఉండే ఒక భాగం. (రా.5)

చక్రం : వీణ తయారీలో కొలిమిలో గాలిరావడానికి తిప్పే ఆకారం. (కో.6)

చడావు : పర్యా. పాదరక్షలు. నాటకంలో చెప్పులుగా వాడేది. (కో.7)

చతురస్రం : పర్యా. చతురం. రాతిపనిలో శిల్పానికి చెక్కే డిజైన్. (తె.6)

చదరం : వీణకు బ్రిడ్జిపైన అతికించిన కంచు ముక్క. (కో.7). తబలా తయారీలో వాడే నలుపలకల తోలుముక్క. చూ. చతురస్రం. (రా.5)

చదరంబ్రష్ : చిత్రలేఖనంలో రంగులు వేయడానికి వాడే చదరంగా ఉన్న కుంచె. (రా.11)

చదును : ఫిడేలు కుండే చెక్క నునుపు దనం. (కో.7)

చదును చేయు : హార్మోణియం తయారీలో చెక్కను నునుపు చేయు. (కో.39)

చన్నవీర : పర్యా. సన్నవీర. రాతిపనిలో శిల్పానికి చెక్కే యజ్ఞోపవీతం. (రా.8)

**చందవ కుంకుమ :** నాటకాలలో పెట్టే ఒక రకం బొట్టు. చూ.చిత్రం-27.16. (కో.7)

**చందనం :** పర్యా. గంధం. కొయ్యశిల్పాలకి, సంగీత పరికరాలకి వాడే కొయ్య. (కో.7,37,38; రా.4,5). మేకప్‌లో బొట్టుగా వాడే గంధం. (కో.7)

**చందూరం :** బొమ్మలకి వేసే సింధూరం రంగు. (తె.1; రా.5)

**చంద్రవంకబొట్టు :** మేకప్‌లో కొందరికి పెట్టే బొట్టు. (కో.7)

**చంద్రస్ :** స్పిరిట్ పాలిష్‌లో ఉపయోగించే ఒక పదార్థం. (తె.3)

**చప్పకొయ్య :** తబల, మృదంగాల చట్రం తయారీకి వాడే అద్దకు మూరల్లో బింకానికి పెట్టే కర్రముక్క. (కో.7)

**చమత్కృతి :** బుర్రకథలో చెప్పే హాస్యం పుట్టించే మాటలు. (తె.1)

**చమరీమృగం :** రూపా. చమ్రీమృగం. మేకప్‌లో విగ్గుల తయారీకి ఈ జంతువు వెంట్రుకలు ఉపయోగిస్తారు. (కో.7)

**చమికీగుండ :** మేకప్‌లో ముఖానికి మెరుపుకోసం పూసే చమికీ పొడి. (కో.3)

**చమ్కీకోటు :** మేకప్‌లో రాజుపాత్రలకి వేసే కోటు. మెరుపు కోసం చమికీ బిళ్లలతో చేస్తారు. (కో.7)

**చమ్కీగుడ్డ :** చమ్కీబిళ్లలు కుట్టిన గుడ్డ. పౌరాణిక నాటకాల్లో పాత్రధారులు వెనుకభాగాన కట్టుకొనే వస్త్రం. (కో.7)

**చర్మపుతాడు :** మృదంగం బిగించడానికి వాడే వారు. (రా.5)

**చర్మశుద్ధి :** సంగీత వాయిద్యాల తయారీలో తోలుని శుభ్రం చేయడం. (తె.2)

**చర్మసాధవి :** ఒక లయ వాయిద్యం. (కో.7)

**చర్తీదరువు :** వొగ్గుకథ చెప్పేటపుడు కోపభావ ప్రకటనలో వాయించే దరువు. (తె.1)

**చర్తీచిందు :** వొగ్గు కథ చెప్పేవారు చర్తీదరువు వాయించే టప్పుడు వేసే చిందు. (తె.1)

**చల్లారు :** వేడిగ ఉన్నది చల్లగ కావడం. (కో.1,6; రా.11)

**చాక్‌పొడి :** పర్యా. చాక్‌పౌడరు, సుద్దపొడి, సీమసున్నం పొడి. చిత్రలేఖనంలో కార్డుబోర్డు మీద గుర్తు గీసుకోవడానికి వాడే తెల్లటి సుద్దముక్క. (తె.1)

**చాట్ :** తబలామూతలోని బర్రె చర్మం భాగం. (తె.2,3)

**చాట :** ముత్తరాసి కులంవాళ్లు అడుక్కునేటప్పుడు బొమ్మల్ని పెట్టుకునేందుకు వెదురుతో అల్లిన ఒక రకం తట్ట. (తె.7)

**చాటింపు :** కావలి సిద్దులు కథ చెప్పేముందు కథ చెప్పబోతున్నట్లు ఊర్లోవారందరికి తెలియజెప్పడం. (తె.7)

**చావం :** రూపా. శానాం, శానం, సేర్నం, సేనం, చీర్నం. రాతిపనిలో శిల్పం తుదిమెరుగులు దిద్దడానికి వాడే పనిముట్టు. (రా.1)

**చాపు :** మృదంగం కుడిమూతలోని పైపొర. (రా.5)

**చాబీలు :** హార్మోణియం మెట్లపై నుండే సన్నని తీగలు. (తె.3)

**చార్‌పౌన్‌సుత్తి :** శిల్పం, సిమెంటు పనిలో వాడే నాలుగు పౌనుల బరువు గల సుత్తి. (తె.6)

**చాళుక్య :** రాతి విగ్రహాల తయారీలో ఒక రకం శిల్పం. (రా.8)

**చిటికలు :** పర్యా. చిరతలు. నారదుని చేతిలో ఉండే ఒక సంగీత పరికరం. (రా.8)

**చిటికి :** మాదిగడప్పు వాయించడానికి వాడే పుల్లల్లో సన్నపుల్ల. (రా.10)

**చిటికెనవేలు :** వీణవాయించేటప్పుడు తాళం తీగలను మీటే చేతిచివర నున్న చిన్నవేలు. (రా.5)